## క్షేత్రప్రశంస.

తే-గీ॥ శివుఁడుదొల్లి తానందికిఁ జెప్పె నంది । వ్యాసునకు వ్యాసుఁడొగి నాకు బ్రాహ్మణులార।
మీకు నే నెఱిఁగించెద మీఁకొనుండు । శ్రీకరంబగు నుత్తమక్షేత్రమహిమ॥ ౨౬౩॥

సీ॥ క్షేత్రంబనఁగ మేను క్షేత్రజ్ఞుఁ డాత్మ యాఁ దెలియ క్షేత్రములును మూఁడెఱఁగులగును।
స్థూలంబు సూక్ష్మంబు నోలిఁ గారణమునా స్థూలంబు బ్రహ్మాండశోభితంబు।
సూక్ష్మంబగును జూడ సారిదిఁ బిండాండంబు కారణంబగు నాత్మకమిది మూఁడు।
క్షేత్రంబులను స్థూలమాత్రంబు సామాన్యజనవేద్యమగు సూక్ష్మమనఁగ విజ్ఞ।
వేద్యమును యోగివేద్యంబు కారణ । మిట్టులగుట యోగు లెఱిఁగి తత్త్వ।
మెఱుకపఱచి రాదిహితకృత్యములమఱి । క్షేత్రశైలతీర్థయాత్రలనిల॥ ౨౬౪॥

చ॥ వరతమమైన సాధనము ప్రాథమికంబగు జ్ఞానయోగమా।
వరతరమైన సాధనము పట్టి ద్వితీయము కర్మయోగమా।
వరము తృతీయసాధనము బాహ్యము క్షేత్రము భక్తియోగమాఁ।
బొరిఁబరికింపఁగోరినను బొందుగ నాత్మనిధిం జనాళికిన్॥ ౨౬౫॥

కం॥ గుహ్యార్థసూచకములౌ । బాహ్యక్షేత్రములు దేహభావజ్ఞతకున్।
మహ్యంచితములు తత్త్వ । గ్రాహ్యాహ్వయ స్థానములును మహదాత్మంబుల్॥ ౨౬౬॥

కం॥ ప్రకటము ద్వాదశరాశ్యా । త్మకములు నా క్షేత్రములుగ మయియుం బలికిరా।
శికి నగుటబుభుక్షుపావన । పకముట్ల త్రిశతపరిమితమవ్యక్తన్॥ ౨౬౭॥

కం॥ ఆనూటమొనిమిదిటికిన । మానములుగఁ గ్పెరములు మహాక్షేత్రంబుల్।
జ్ఞానమున నుగనుఁగొనననః । దేని కెది మొదమొన గనుండుఁ దెలియవలసినన్॥ ౨౬౮॥

శా॥ బాహ్యాభ్యంతరభేదముల్ ద్వివిధముల్ భాసిల్లెనన్ క్షేత్రముల్।
బాహ్యంబుల్ గిరికాననాశ్రమసరిత్పుణ్యస్థలీవాసముల్।
గుహ్యంబుల్ గననస్థిచర్మమలమాంసప్రాంతరోమాస్థిముల్।
గ్రాహ్యంబుల్ బహిరంతరాత్మచరితార్థంబుల్ గదా క్షేత్రముల్॥ ౨౬౯॥

కం॥ మలతెమ్ములు నరములు వాఁ । కలు వెండ్రుకలొ... కాఱు నవి ఫుటములు।
గలశక్తి మెశక్తియును మఁ । దెలిపెదం... పుచుఁ జెప్పుదు ననుచున్॥ ౨౭౦॥

కం॥ దేహాలయంబు దేహమె । జీవుండే దేవుఁడనుచుఁ జెప్పెను గాదే।
యూవిధి స్కాందోపనిష । త్ప్రవిసమున నభేదభావమెనయు మహాత్మనరుల్॥ ౨౭౧॥

కం॥ యోగానభిజ్ఞులకుఁ । హ్యోగార్థము బోఁధయోగులాగిఁ జెప్పిరి క్షే।
త్రాగమముల బాహ్యంబుల । బాగుగసంధం ప్రభక్తిఁ బడకుఁడు సర్వన్॥ ౨౭౨॥

కం॥ జ్ఞానార్థులచటికిని జని । పూనియరయఁ గోరఁ బోఁచుఁ బుణ్యముకతనన్।
స్థానస్థితి దత్తత్త్వము । మానుగ మఱి చేర్ప చేతమహితాచరణన్॥ ౨౭౩॥

ఆ-వె॥ క్షేత్రయాత్ర చేసి చెందుఫలంబును । వినినఁ బడయరాదె యనివలఁదుఁటు।
పోయి చూడకుండఁ బోలదన్నంబన్నఁ । గడుపు నిండు నెట్లు కడుపు చేక॥ ౨౭౪॥

ఉ॥ సత్తమముల్ స్వయంభువులు సత్తరముల్ సురకల్పితంబులో।
సత్తులు తాపసార్చిత సద్విభవంబులు క్షేత్రముల్ గనన్।
ముత్తెఱఁగుల్ బహిర్లసితముల్ ధరణీధర కాననాపగల్।
నుత్తమముల్ దదన్యములు సెప్పెడుఁ గృత్రిమ రత్నవైఖరిన్॥ ౨౭౫॥

తే-గీ॥ కొండమాఱుగ గోపురముండు గవికిఁ। బ్రతిగ గుడియడవికి సాటిపాటి తోఁపా।
ప్రాసె యేటికిఁ గోనేఱు మార్పు ప్రకృతి। లింగ ప్రతికృతి సువికృతి లింగమరయ॥ ౨౭౬॥

కం॥ మునులకు నెనగా క్షేత్రము। లనుదగ్గోత్రజులు పూజలను జేయుచునుం।
ద్రనుదినము నుదగ్గృహములె। వినుతాశ్రమములనియిష్టవిదితంబులవున్॥ ౨౭౭॥

తే-గీ॥ భువినిఁ బొలుచు స్వయంవ్యక్తములగు క్షేత్ర।ములవి నూటయెనిమిదందు ముఖ్యములుగఁ।
బదునెనిమిదెన్నఁబడెన హంభావకలన। జయసమాఖ్యాంచితంబులు స్థలవరములు॥

తే-గీ॥ వానిలోనాఱు ముఖ్యములై నెగడెను। జక్రషట్కంబున షడక్షర క్రమమున।
వానిలోన ప్రధానంబులౌను మూడు। మూటిలోనొక్కఁడోంకృతి ముఖ్యమాత్మ॥

## బిల్వారణ్యప్రశంస.

కం॥ బిల్వారణ్యం బోంకృతి। బిల్వపురియనం బరంగె బిల్వకమనఁగన్।
బిల్వము శ్రీఫలమగుటం। బల్వురు తిరువలమని యఱవమునన నెదరో॥ ౨౮౦॥

చ॥ మును లెపుడున్ భజించుటను ముందుగ బిల్వవనంబనంబడె।
న్మనుజులు వేలుపుల్గొలువనల్వగ బిల్వపురంబనంబడెన్।
ఘనులొగి సంగ్రహంబుగను గాంతముగం బలుకంగ బిల్వకం।
బనఁబడెఁ గాన బిల్వదళమట్లదిలాజిలుఁ బూజ్యపూజ్యమై॥ ౨౮౧॥

చ॥ మనుజులలోఁ బరోపకృతి మాన్యుఁడు మాన్యులలో వదాన్యుఁడిం।
పెనయు వదాన్యులందును వివేకి వివేకుల సూరిసూరులం।
దొనరుఁ గవీశ్వరుండు మహిమోజ్జ్వలుఁడల్లకవీంద్రులందు బి।
ల్వనగరియెల్ల క్షేత్రముల భాసిలు నాక్రియ నగ్రగణ్యమై॥ ౨౮౨॥

ఉ॥ క్షేత్రములందుఁ గాశిగడు శ్రేష్ఠము గాయట మోక్షమన్న సో।
గాత్రము వీడినన్ గలుగుఁ గాశిపురిం జొరనబ్బుఁ బేర్కొనన్।
ధాత్రభివంద్యముక్తి నిడుఁ దానరుణాచలమాత్మ నెన్నసీ।
ధాత్రిని నెందు నేసెసఁగు దానిని బిల్వవనంబు మేలెదో॥ ౨౮౩॥

శా॥ యజ్ఞంబొఁగద ధర్మమా క్రియకహో యర్పించు యూపంబులన్।
బ్రాజ్ఞుల్ దన్ భజియింప శ్రీఫలములన్ భావింపనర్థప్రదం।
బజ్ఞుల్ విజ్ఞులు నేన్ సకాములయినన్ హర్షంబిడున్మందులం।
బ్రజ్ఞానార్థులకిచ్చు బిల్వవని కైవల్యంబు దన్మెల్చినన్॥ ౨౮౪॥

కం॥ యజ్ఞారికి నెలవయ్యున్। యజ్ఞాస్తంబవుచు వెలయు యజ్ఞారి నెత।
ద్యజ్ఞహితుఁగా నెనర్చున్। విజ్ఞతబిల్వవని దెన్న విధికిన్వశమే॥ ౨౮౫॥

సీ॥ ఏకడఁదోర్గాఢభ్రాకటంబుగఁబు ట్టెజ్ఞానలక్ష్మిప్రదమైనబిల్వ।
మెక్కడముక్కంటిమిక్కిలివెలుఁగొందుబిల్వేశుఁడనఁదనచెల్వఁగూడి।
యేడనాదబ్రహ్మమెసఁగెనక్షరరూపమగుచుశబ్దబ్రహ్మమనఁగఁదొలుత।
నెటఁగంజగిరినాదమెసగొల్పునెపుడునుబలుకుబండలచేతవఱలికరిగ।
నెందలక్ష్మల్గాలంగెడుఁబొందులక్ష్మ। లనుచుశ్రీపర్ణనీవప్రొయానదిశాలి।
యేనెనైలూపనాథుండనిదెమదీయ। నటనసభయనునదిశ్రీవనంబుదనరు॥ ౨౮౬॥

సీ॥ క్షీరనీరాపగాశ్లేషభూషితమాటనపరప్రయాగనానభినుతమగు।
గౌరీసరోముఖకమలభాసితమాటగౌరీముఖముకాశినారుచిఁగను।
శాలిధాన్యార్పణసముచితశ్రీపాదమాటచేగయనామహర్షమగును।
హితతబిల్వేశవల్లీశకంజాద్రీశముఖ్యమాటనుబిల్వకాఖ్యఁదనరు।
రాజహంసవిహారవిరాజితంబు। యోగనరసింహసేవ్యంబుభోగమోక్ష।
దంబుప్రాసాదదివ్యమంత్రప్రదంబు। ప్రణవశాండిల్యపదముబిల్వవనమలరు॥ ౨౮౭॥

సీ॥ ఏప్రోలితొలిపెసనినజనాఁబ్రవహించుఁబావనపరిణారుధావసేవ।
యేవీటికెక్కాలమెసఁగపక్కణమునఁజాలుమిన్నెలునాఁబాలయేఱు।
ఏపురిపడమరఁగాపురంబుంపెడమిలజనాళికిఁపల్లియేకపల్లి।
యేపట్టణమునకుధృతశక్తినడకడఁగొలలెడుగృహాభూతగుహుఁడుగుహుఁడు।
భువనవంద్యవిద్యపాలుపొంపఁగాఁజాఁడె। పంటమిగులనైగపఁబంటపంట।
మిక్కుటముగసుఖమునెకొన్నవిలసిల్లు। శ్రీఫలాహ్వాయంబుశ్రీపురంబు॥ ౨౮౮॥

కం॥ వరపరిఖాయితసీవా। సరిపంక్తిహిరణ్యగర్భసాలాఖ్యముగో।
పురభూతకంజశిఖరి। స్ఫురితాభ్రముచెరుపలముప్రెమూర్తిరుచిఁగనుక్॥ ౨౮౯॥

తే-గీ॥ తత్ప్రభావంబువర్ణింపఁదరమెవాని। పూర్వదిశఁగాంచియువించిపురిపడమర।
దక్షిణంబుననరుణాద్రిపగుపనకడ శేషగిరిద్వారపాలవ్యభూషితములు॥ ౨౯౦॥

చ॥ తొలికడనీవగావలిగఁదోఁచునుపక్కణమంపఁబాలమే।
ర్పడమరనేకపల్లివడవైపునపల్లిమగందుగన్కనిక్।
గలిసొరకుండఁజూచుచునుగాచునుగంజనగంబుదారకో।
జ్వలనిధిబిల్వనాథపురిపంచముఖానసపంచకంబనక్॥ ౨౯౧॥

శా॥ గౌరీవిష్ణువిరించిముక్తిజనకస్థానాక్షించిరస్థైర్యపుట।
న్వారిస్రంజిలఁజేయఁబిల్వపురితన్మాహాత్మ్యంబులంబానెము।
న్నారాయారయఁగన్యగ్రక్రమముగక్ హర్షప్రపంబయ్యెని।
ష్టారత్నాయనహానిరత్నపురినాబోధించుఁబ్రాసాదముక్॥ ౨౯౨॥

## బిల్వవనము బిల్వపురి యగుట.

కం॥ అనవారలుబిల్వవనం। బనకెటుపేరొదవెబిల్వపురియనియెఱుఁగం।
గనుగోరెదమనసూతుఁడు। గనుఁగొనియాశౌనకముఖఘనులకిటులనక్॥ ౨౯౩॥

కం॥ కాలజ్ఞులెఱుఁగఁజాలని । కాలంబునఁబుడమిపడఁతుకకుఁదోడవగుచుం।
గ్రాలెనుబిల్వారణ్యము । శ్రీలీలామందిరమనశ్రీఫలమయమై॥ ౨౯౪॥

కం॥ అందున్నవనదేవతశివు । డెందంబుననిలిపితపముడెప్పరముగఁజే।
సెందిరముగఁదెరలకవడి । గుందకశీతోష్ణములనుగుధరసుతయనన్॥ ౨౯౫॥

సీ॥ తలజాలుమొలఁదోలువెలయమున్మొనవాలుకేలువాఁడెల్లరనేలువాఁడు।
నిగముడినెలవంకఁదగఁగయిఁబెడజింకఁదాల్చువాఁడోగులఁగూల్చువాఁడు।
విసముగుత్తుకఁగ్రాలబసుమముమయిఁజాలఁగలుగువాఁడెల్లెడఁజెలఁగువాఁడు।
కొలుచువారలపనుల్వేలుఁగువేలుపుఁగనుల్మించువాఁడందఱమించువాఁడు।
మెచ్చిపెనువెండికొండతోవచ్చెననఁగఁ । గొమ్ముగుజ్జంబుపైనెక్కియిమ్మమీఱ।
గట్టురాపట్టిఁగౌఁగిటఁబట్టియట్టె । యెట్టయెదుటనుగనుపట్టెగట్టువేల్పు॥ ౨౯౬॥

కం॥ అప్పడువనదేవతగడు । నొప్పగభయభక్తిసంభ్రమోల్లాసంబుల్।
ముప్పిరిగొనఁదమ్మిమొగుడ । చొప్పునఁగేల్మోడ్పుదనరఁజూచియిటులనెన్॥ ౨౯౭॥

చంద్రవదనావృత్తము.

ఇందుధరనీకే । వందనమొనర్తున్ । బొందుగనునీదా । సుందరికిఁగూడన్॥ ౨౯౮॥

మత్తేభవిక్రీడిత కంద గర్భసీసము.

సీ॥ ప్రణతులంజేయనుబాణుండువలఁతియేనాప్రమొక్కుఁగైకొమ్మనన్గ్రహింపు।
ప్రణుతులంజేయనుబాపఁడఁగునెనానుత్యుక్తిఁగైకొనినున్భజింతుఁ।
బ్రణతకల్పద్రుమపార్వతీపతిశివానాకోర్కినీడేర్పనన్గనుఁగొను।
ప్రకృతివంద్యాగుణరాజిరాజితత్రిలోకేశానసుంప్రోవుమీశమహిత।
కరిముఖవిశాఖజనకత్రిపురహరహర । శ్రుతివినీతభూరథవిధిసూతరుచిర।
సౌరధరధనుర్ధరహరిశరహరిహరి । శశధరనయనయుతదేవచంద్రమౌళి॥ ౨౯౯॥

గర్భమత్తేభవిక్రీడితము.

నతులంజేయనుబాణుఁడున్వలఁతియేనాప్రమొక్కుఁగైకొమ్మనన్।
నుతులంజేయనుబాపఁడఁగునెనానుత్యుక్తిఁగైకొనినున్।
నతకల్పద్రుమపార్వతీపతిశివానాకోర్కినీడేర్పనన్।
కృతివంద్యాగుణరాజిరాజితత్రిలోకేశానసుంప్రోవుమీ॥ ౩౦౦॥

గర్భకందము.

కరిముఖవిశాఖజనకత్రి । పురహరహరశ్రుతివినీతభూరథవిధిసూ।
తరుచిరసౌరధరధను । ర్ధరహరిశరహరిహరిశశధరనయనయుతా॥ ౩౦౧॥

చంద్రమౌళివృత్తము.

దేవచంద్రమౌళీ । దేవిచంద్రమౌళీ । కావుఁడీరునన్నున్ । గావమిరెకారే॥ ౩౦౨॥

ప్రభాతవృత్తము.

అనివినుతించిన-హర్షమొందిశంభుం । డనెవనదేవత-యద్దుమెద్దిదైనన్।
జనవుననిచ్చెద-శంకవల్దనంగన్ । దనయపితన్వలె-ధైర్యమూదిపల్కెన్॥ ౩౦౩॥

చంద్రమౌళివృత్తము.

దేవబిల్వనాథా। ఖ్యాపహుండవైయీ। చోపనింపునీదా। దేవితోఁ గూడన్॥ ౩౦౪॥

కం॥ ఈబిల్వవనంబిం కన్। శ్రీబిల్వపురంబనంగఁ జెల్వొందవలెన్।
భూబృందారకపురియన। శ్రీబిల్వేశులనమీరు చెలఁగుటనిచటన్॥ ౩౦౫॥

ఆ-వె॥ ఎవ్వరెవ్వి గోరియెల్లనిమిమ్ము బి। ల్వపురిఁ గొల్తురవ్వి వారికి వెస।
నెసకమెసఁగనొసఁగుఁడసదుగాఁదలఁపక। కోరకున్నమీరె కోరిక్రేల॥ ౩౦౬॥

కం॥ అననోమనిశివులందుం। జనవున నెలకొనిరినందిసంసేవింపం।
గనుజెలువుగానుగకడన్। మొనసెడుచీమలనజనులుముసరుకొనిరొగిన్॥ ౩౦౭॥

సరసిజవృత్తము॥ బిల్వవనియుదానన్। బిల్వపురియనంగన్।
జెల్వయియలరెన్ శ్రీ। చెల్వయనఁగనింకన్॥ ౩౦౮॥

అక్షరబిల్వతత్త్వము.

శా॥ కైలాసంబునవాణివీణవినుతంగావింపనాయింపఁగాఁ।
దాళంబుస్మేరయింపఁగానలువచిత్తంబొప్పఁబ్రేమాయింపఁగా।
మేలౌనాహరిమద్దెలన్ రమయుఁబేర్మింబాడఁగానాడఁగా।
శైలాత్మోద్భవకాళికాకృతినిశశ్వత్ప్రీతిసయ్యజ్జునన్॥ ౩౦౯॥

సీ॥ శిథిలితార్ద్రకపర్దసింధుకబంధశీకరముపుష్పాంజలిక్రమమునెఱప।
వరహస్తవిన్యస్తగురుభమడ్డాన్నదభక్కున్మృదంగంబుశక్కిఁదెలుప।
నజ్జోద్భవకపాలహారావళీసంఘుసంఘట్టనముతాళసరణిఁజెలుప।
హంసకభూత్కారశంసితచారణఘూర్ణంబునాట్యవిఖ్యాతిఁబెనుపఁ।
దెలియఁబడముఖవర్ణాళిదేటగీతి। గాఁగనాలుగుమూడుగరెండుగుటెక్కఁగ।
తారకమిదేయటంచునుపనివిఁగాంచఁ। దాండవంబాడెనుమహానటుండువేడ్క॥

కవిరాజవిరాజితవృత్తము.

జయజయగౌర్యురసాంఘ్యపగంచిత - చంద్రసుధాకరమౌళియుతా।
జయజయసామజవక్త్రషడానన - సత్సుతముత్సహితామహితా।
జయజయలోకకుటుంబకదంబిత - సద్గుణసన్నుపరుంబహితా।
జయజయదాసవశంకరశంకర - సర్వదసర్వసుపర్వనుతా॥ ౩౧౧॥

కం॥ అనుచుఁజతుర్దశభువనము। లనువుగఁజనుఁబొగడవానినలరింపననం।
గనుశివుఁడుభక్కవాయిం। చెనుదొమ్మిదిమైదుమార్లుశివతత్త్వముగాన్॥ ౩౧౨॥

కం॥ సనకాదులుకనలేకా। ఘనశివతత్త్వంబెఱుంగఁగడువేఁడశివుం।
డనియెనుబిల్వవనంబునఁ। గనియెదరనితెలుపబిల్వకాననమహిమన్॥ ౩౧౩॥

కం॥ కనుఁగొనిరంతన్వారలు। పనివడిశివఘనముబిల్వవనమున్ ఘనమున్।
ఘనమనుజాతకములనం। గనటంబిల్వేశ్వరుంబొగడిరిటుపటురతిన్॥ ౩౧౪॥

ఉ॥ నిట్ప్రిభుశేఖరానతులునీకు జగన్నుతనీలకంఠస్వ।
ర్ద్వితీప్రికరాంతకావినతదివ్యతరూత్రిపురారిభూరథా।
త్ర్యిట్ప్రిభుచంద్రచక్రధరదేవధనుర్ధరచక్రిమార్గణా।
షట్ప్రిబలారివారహరస్రష్టృసుచోదితవేదసైంధవా॥ ౩౧౫॥

శా॥ నిఃశేషీకృతదాసపాశహరణానీకున్నతుల్సద్దయా।
దుఃఖధ్వాంతనిరాసకాత్రిణయనాదుర్వారశౌర్యోదయా।
వాఃఖాగ్నిక్షితివాయుసూర్యశశివిప్రప్రాయకాయాజయా।
స్వఃఖేలాస్మరకాలకాలహరనిత్యాసత్యసక్తాశయా॥ ౩౧౬॥

కం॥ అవలోకించితిమోంకృతి । నవయోగోపాత్తనైజనామమహేశా।
శివవామదేవయజ్వా । త్మవినుతనీయాఖ్యలకునమస్కారంబుల్॥ ౩౧౭॥

పఙ్క్తివృత్తము.

బిల్వవనేశా । బిల్వపురేశా । నల్వగమాలో । నిల్వుముశ్రీశా॥ ౩౧౮॥

శశివదనావృత్తము.

అనిసనకాదు । ల్వినుతియొనర్పన్ । ఘనశివతత్త్వం । బొనరఁగనెందున్॥ ౩౧౯॥

ఉ॥ మౌళిజటల్నటింపనటమానవుగంగచలింపభోగిభూ।
షాళులుభీవహింపజగదంబహసింపనిలింపులింపుగం।
బూలనునింపసన్మునులుపొందుగఁదత్త్వమొగింగ్రహింపలో।
కాళులుసన్నుతింపశివుఁడాడెనుదాండవముప్పడోప్పగన్॥ ౩౨౦॥

కం॥ పదునాలుగుమాఱులుశివుఁ । డుపగన్ మ్రోయించెనెక్కుడుందయఢక్కన్।
బదునాలుగుఢక్కాధ్వనుల్ । పదునాలుగుసూత్రములుగఁబరఁగెనరయఁగన్॥ ౩౨౧॥

సీ॥ అఇఉణ్ ఋలిక్కని యంత ఏఓఙ్ఞని ఐఔచ్చు హయవరట్టనియు లణ్ణు।
ఞమఙణనమ్మనియుమఱి ఝభఞ్ఞని ఘఢధషనియు జబగడదశనియు।
ఖఫఛఠథచటతవు కపయు శషసరని హల్లని పదునాలుగయ్యెనవ్వి।
సూత్రములక్షరసూత్రముల్గణియింపసూత్రపదార్థముల్సాపెడుఁబదు।
నాల్గిటినిఁగాననవిపదునాలుగౌట । ఢక్కయుందానిమ్రోయించుశవరబిల్వ।
పతియునుంబదునాల్గౌటఁబట్టిచూడ । జన్యజనకసంబంధముసమతనుదగె॥ ౩౨౨॥

కం॥ పదుమూడవదోకారము । పదపడిబిందువొకఁడెనయఁబదునాలుగగున్।
బదునాల్గొఁగదయోంకృతి । పదపడినాల్గాండెనయశివాయయనియవున్॥ ౩౨౩॥

కం॥ కనుఁగొనశివాయయనునీ । వినుతార్ణాంకములుమూడువేడుకఁగూడం।
గనుబదియగునేకాదిగ । మొనసినఁబదిసంఖ్యలోంనమోయనియనగున్॥ ౩౨౪॥

తే-గీ॥ అల్లలణ్సూత్రవర్ణసంఖ్యార్థకంబు । గాదుహల్లనబిందువొఁగనుకవేఱు।
వర్ణముగనెన్నఁదగుసూత్రవారమందు । నలువదియుమూడుగదవర్ణములునెలంగు॥

కం॥ శివమనవర్ణమువర్ణము । లవినలువదిమూడుగాననాబిల్వంబుల్।
శివసూత్రమువర్ణావళి । యవుఁగదయదిబిల్వహారమంకిలికలదే॥ ౩౨౬॥

తే-గీ॥ బిల్వమనముప్పదియునాల్గువెల్లయుహల్లు । లంతఁబతియనఁబదియునాఅచ్చులగును।
బిల్వపతియక్షరావళివిభుఁడగుఁగద । యోగమునఁదెల్పుఁబ్రాసాదమొగిమొగదల॥

ఆ-వె॥ పదియునాల్గుగాఁగఁబరఁగుటసూత్రముల్ । ప్రణవమోంనమశ్శివాయయనియె।
యనెడుఁబోశివోఽహమనుటయందుండెడు । వెన్నయందునేయియున్నయట్లు॥

కం॥ వర్ణములుబుగ్రహితములు । నిర్ణయముగనలువదైదునెమ్మిఁదెలిపెదన్।
వర్ణింపశివోఽహమ్మని । వర్ణసమామ్నాయముఖముప్రాసాదమెయా॥ ౩౨౯॥

శా॥ ఇత్సంయోగముచేనమఃశివమునూహింపంగనానంచుమున్।
దత్వాత్రాంచితసంఖ్యనోమనుచొగిందత్సంఖ్యలంగూడినన్।
హృత్సంతోషముగాశివాయయనుచోర్మింబూడనష్టుల్మఖా।
ప్రోత్సాహోక్తిశివోఽహమంచునుశివోద్యోగుసుల్మనుల్గాంచిరా॥ ౩౩౦॥

తే-గీ॥ ఇట్లుశివసూత్రతత్వార్థమెఱుకపడఁగ । నమరేశ్వరుబిల్వేశునక్షరాత్మ।
బిల్వములబిల్వములఁబూజవెలయఁజేసి । రాసదీఱమహానందమందిరంత॥ ౩౩౧॥

కం॥ అందఱువమవలెజ్ఞానా । నందమునొందంగఁగోరినన్ననకాదుర్।
పొందదురుమీవలెనెయు । న్నందగనిందననిబిల్వనాథుండాడెన్॥ ౩౩౨॥

తే-గీ॥ మఱియువారలుగోరఁగానెఱుకపఱుప । లోకులపనెల్లఁపత్యాలమూకడఁడగ।
బ్రతిభనుర్మాసమందునార్ద్రియనుతార । యందుబిల్వేశుఁడాడుశివోఽహమనుచు॥

కం॥ ధనువవుటఁదొమ్మిదవదిటఁ । బ్రణవమునవసంఖ్యలెనయఁబరఁగుశివోఽహ।
మ్మనుటాఱవదార్ద్రియువు । మునుకొనిప్రాసాదమంత్రమునుబోధించున్॥ ౩౩౪॥

ఆ-వె॥ కానసెప్పఁడేనిగనుఁగొనిబిల్వేశు । నభింజనులువాంఛితార్థములను।
గాంచుచుంటవింటఁగడఁకనెల్లరునన । టకెనిజేరిత్రికరుపుపద్వైజలన॥ ౩౩౫॥

శా॥ అంతంగొంతిలోకకాలమేగనలవృత్తాంతంబులోకంబులం।
దెంతేఁబర్వఁగసర్వలోకములవారిష్టార్థసంసిద్ధికా।
కాంతారంబునఁజేరిరంమవలసంగల్గెంబుకీరల్నమొం।
దంతంబిల్వవనంబుబిల్వపురినాఖ్యాతిన్వహించెంగదున్॥ ౩౩౬॥

ఉ॥ ఓమనబిల్వమూటనెవఁడోంకృతినాథుఁడుబిల్వనాథుఁడా।
గామితసత్ఫలంబులిడుఖ్యాతిగబిల్వపురిన్నతాఁకిన్।
బ్రేమనుభక్తవర్ణములవెల్లడిసేసెనుమున్నబిల్వసం।
ఖ్యామహిమాప్తివానిబ్రణవాత్మకుఁడత్పతిక్రీసనెన్నెడన్॥ ౩౩౭॥

కం॥ సనకయనసత్యమగునది । కనికూడశివోఽహమనుటఁకనుదారకమా।
సనకాదులనశివోఽహ । మ్మనిభావననేయువారలనియెఱుఁగఁదగున్॥ ౩౩౮॥

ఆ-వె॥ సూతుఁడోంకృతియవుఁజుండినై మిశవిపి । నమునమశ్శివాయ నానిజముగ।
శౌనకుండుమునినిచయముఖ్యుఁడక్షరా । ద్యాహ్వాయుండుమును లెయక్షరములు॥

౬

కం॥ యత్నమునఁజదువవినఁగవి । రత్నకృతముబిల్వపురవరచరిత్రంబీ।
నూత్నకృతిరత్నమాశ్రిత । రత్నములకపేక్షితార్థరత్నములిడెడున్॥ ౩౮౦॥

కుసుమవిచిత్రవృత్తము.

అనుచును సూతుం - డనువుగఁదెల్ప । న్దనివిసనన్ శౌ-నకముఖమానుల్।
చనవునబిల్వే - శ్వరునినిబిల్వా । ఖ్యనగరినెన్నెం - గడఁగిరిచాలన్॥ ౩౮౧॥

కం॥ బిల్వేశ్వరీయకృతిమణి । బిల్వపురీబింబమిద్ధి వెలయా మొదటిదై।
బిల్వేశబింబమనఁగను । బిల్వేశసమాంకపద్యవితతిన్ శ్రీశా॥ ౩౮౨॥

కవికంఠభూషణవృత్తము.

అమృతాకృతీయసద - హంకృతిభంజనభక్తరంజనా।
యమృతాబ్ధిజాధిపను - ఖాత్మకజ్ఞానదసత్యసన్నిధీ।
కమనీయసద్గుణని - కాయదయాంబుధికామితార్థదా।
విమలాంతరంగవర - విశ్వపతీజగతీశశాశ్వతా॥ ౩౮౩॥

లక్ష్మీవృత్తము.

ఉరుదరచక్రాంచితహస్తాజగ - దుదయశరణలయశస్తా।
స్వరుసమశార్ఙ్గాయితరాజన్నఖ - సముదయవిదితసమస్తా।
సురకరిరక్షాఘనదీక్షాసుర - గణరిపుగజకులశిక్షా।
శరనిధిజాతాదయితాశంకర - సముచితనుతనతపక్షా॥ ౩౮౪॥

శతపత్రవృత్తము.

మాధవసమేధితస - మస్తసురమోదసుర - మర్దనవిమర్దనఘనా।
బోధితసుయోగశ్రుతి - బోధఘనవంద్యపద - బోధితరుపూజితపరా।
సాధితజగత్త్రితయ - శాంతరసప్రణయ - సాత్వికహృదంతరశయా।
సాధుజనరక్షణవి - చక్షణజగత్క్షణయ - సాధుజనశిక్షణచణా॥ ౩౮౫॥

గద్యము.

ఇది, శ్రీతనుమధ్యాంబాకరంబిత శ్రీబిల్వనాథమహాదేవశిష్య శిష్యోపజ్ఞాక్షర సాంఖ్యాచార్య
పర్యవితకవిత్వ తత్త్వవిత్ప్రకాండ శ్రీమత్కొక్కొండ వేంకటరత్నశర్మ
వినిర్మితంబై,
కవిమణినామంబునం బరఁగు శ్రీబిల్వేశ్వరీయంబను
పద్యకావ్యరత్నంబునం బ్రథమబింబము బిల్వపురీబింబము బిల్వేశబింబము.

శ్రీ బిల్వేశ్వరాయ నమః.

# బిల్వేశ్వరీయము.

## ద్వితీయబింబము.

### గౌరీపురీబింబము, గౌరీశబింబము.

కం॥ కలశసముద్రసుతానం । దలసితచిద్విలసితసదుదంచితఘటికా।
చలనిత్యోదవసితసుజ । నలసత్పురవృక్షయోగనరహార్యాఖ్యా॥ ౧॥

౨

చ॥ నగభవయల్లబిల్వవిపినంబునబిల్వకుజంబనైనిజం।
బగుదళరాజిఁబూజఁదనకాష్ఠనెనర్పఁగనందుఁద్రెంచఁబోం।
దగఁబ్రభవించియత్తరువుఁదోడనెగౌరినిఁజేసియాసతి।
న్దగ్రహియించిగౌరిపురినల్వగుబిల్వపతిన్నుతించెనర్॥ ౨॥

కం॥ నాఋషులడిగిరియాబి । ల్వారణ్యంబునకునేటికబ్బెనుమునుపా।
గౌరీపురియనుపేరిం । పారందెలుపుమనవతఁడుపలికెనిటులాగిన్॥ ౩॥

కం॥ ఉత్తమముధర్మవృషభం । బెత్తఱినలుగాళ్లనడచుచింపుగఁబ్రాసా।
దోత్తమమనుసూచకమగు । సత్తఱిగౌరీపురీకథామృతమొదవెన్॥ ౪॥

మ॥ ఎదిమున్వెన్నుఁడువెల్లగించికొనసయ్యెన్వానికింబుట్టెచెం।
డెదిమున్నీటమునింగికూర్మమునకయ్యెన్వీఁపుపైఁడీటవో।
నెదికవ్వంబయిచిల్వకట్లఁబడనయ్యెందైత్యులాదిత్యులుం।
బదిలంబంచునుజిల్కనమ్మలశివావాసమ్మయయ్యెంగదా॥ ౫॥

కం॥ అందుందనరిరిశివులా । నందమునందుచునునందనమనువనమునం।
దందమగుమానసమునం । బొందుగవిహరించునంచపులుఁగులనంగన్॥ ౬॥

కం॥ శివుఁడనియెశివనుగనుఁగొని । శివయోగముశివమనంగఁజెలఁగుంగాదే।
వివరింపుమువనకేళికిఁ । దవనర్థమభీష్టమదియతాఘటియించున్॥ ౭॥

చ॥ చిలుకలకొల్కినీపలుకుచేతనుకోర్కిగనెన్మనోజ్ఞతన్।
గలికిరొనీదుచూపునసెకంఠిశయుండుభజించెమీనతన్।
జెలువరొనీదుమేల్నడకఁజెందుటనంచవిరించిగాంచెనీ।
చెలువుఁడఁద్వత్కుచగ్రహణసిద్ధిఁబ్రసిద్ధుఁడనీలకంఠుఁడన్॥ ౮॥

కం॥ అనవినిశివశివయెందే । నినుమించినవారుగలరెనిపుణతనారా।
మనుతిమనకగుఁగదాయన । ననుమోదమునొందియాతఁడలిపకెటులనెన్॥ ౯॥

కం॥ పార్వతివిగానసీకుం । బర్వేడుఁగౌతూహలంబువనకేళిని నేఁ।
బర్వతనిలయుఁడఁగాన౯ । బర్వేందుముఖీమదీయవాంఛితమునిదా॥ ౧౦॥

రుచిర॥ వనంబిదేకనుఁగొన-వాంఛఁగొల్పెడు౯ । మనోజ్ఞమైమనమున-మానినీమణీ।
ఘనంబులౌకుటములఁ-గ్రాలుతీవెల౯ । సునందనంబిదిగద-చూడనొప్పెడు౯ ॥౧౧॥

వసంతతిలక॥ కాంతావసంతతిల - కంబిదికంటెవింతే।
స్వాంతంబొయెంతయును - సంతసమందునిందే।
కాంతుల్పరస్పరము - గాంచఁగఁగాంతునేయం।
గాంతాయితంబుగదె - క్రమవనంబుగాన౯॥ ౧౨॥

భూతిలక॥ చంపకవర్ణతమాలవేణిర - సాలపల్లవపాణిమే।
లింపులతాంగిజపాధరోష్ఠిస - మిద్ధకోకిలవాణిశ్రీఁ।
జెంపవుశ్రీకుచమంజరీస్మిత - వీక్షణాళివసంతుతో।
సొంపవునీవనదేవతోత్తమ - చూడభూతిలకంబవు౯॥ ౧౩॥

మత్తకోకిల॥ తన్నుమున్ననవారలారయ - దారిఁగానకలాఁతియిం।
టన్నెటిన్నెలకొల్పవర్థిలి - నాదమబ్బఁగనుబ్బున౯।
బన్నగాఁదనుఁబెంచువారినిఁ - బానెమ్రోనెడుఁగృష్ణత।
న్మన్నదౌటను కాంచుమియ్యది - మత్తకోకిలవృత్తమా॥ ౧౪॥

మత్తకీర॥ అలరఁగనుదనకెన్నిపెట్టిన - నక్కఱంగడుమెక్కియు౯।
బలుకులనుదనకొప్పనేర్పఁగఁ - బ్రౌఢిఁగాంచియునెంచకే।
వెలలునిలువదుపంజరంబున - వేడ్కఁజెందువనాప్తిరా।
మలలనయొకనురామచిల్కను - మత్తకీరసువృత్తము౯॥ ౧౫॥

కుసుమితలతావేల్లితావృత్తము.

రామారత్నంబాకనుఁగొనవెయ - బ్రంబుబిల్వద్రుమంబా।
రామంబందిందున్వివిధసుమముల్ - రాజిలంబూచురోచుల్।
వేమాఱెంచంగసుమితలతా - వేల్లితంబైతగుంగా।
శ్రీమత్కావ్యాలంకృతులువిబుధ - శ్రీసుతుల్గారెదాతల్॥ ౧౬॥

వనమంజరీవృత్తము.

అమరమరందసరిత్తునమున్గియు - నందిపుష్పాడిబూదిమై।
భ్రమరకరాజులనందగుమేల్రుదు - రాకపేరులఁదాల్చితా।
క్షమఁగనిమౌనముతోడఁదపంబును - జల్పుచున్నటులున్నదీ।
క్షమనెదికోరెనొయారయుసుస్తని - కాంచుమీవనమంజరి౯॥ ౧౭॥

భ్రమరవిలసిత॥ మానాఁగాయీభ్ర-మరవిలసితం । బౌనోలిన్వర్ణ-మఱఁగనుసితం।
బౌనాజ్యోత్స్నాప్రి-యమిటనగుమా । జౌనానెయ్యంబె-సఁగఁగఁగనుమా॥

చ॥ తనునెవరున్వరింపమఱిదార్కొన నేరకయుండఁగందపం।
బునుబొనరించియవ్వరముఁబొందినయట్టియరుంధతీక్రియన్।
వనమున నిందుఁబొల్చుమధుపంబులు నేరకయుండఁదవ్వనం।
జనఁగసుగంధబంధురతఁజానగుఁజంపకమాలసూచితే॥ ౧౯॥

మత్తకోకిల॥ ఇత్తఱిన్మరునల్లెతుమ్మెద - లిందుఝుంకృతిఁజేయుస్వా।
యత్తకామశరౌఘమంగజ - హర్షదంబిదియౌఁగదా।
చిత్తసంభవవాహనంబులు - చేరిచిల్కలువల్కెడున్।
మత్తకోకిలయుక్తముంగను - మారసాలరసాలమున్॥ ౨౦॥

కుసుమవిచిత్ర॥ గొనబగుదీనిం-గుసుమవిచిత్రం। బునుగనుఁగొంటే-పొగడఁగనంగన్।
ఘనముగదృష్టిం-గనమికిఁదేంట్లిం। దొనరుచునటంచే-నొగిమదినెంతున్॥

ఫలసదన॥ అలరులనళులకును-నవనిజమునీడన్।బాలయుమెగములకును-బానరెడునుమేలై।
ఫలములనిగుళులను-బరగములకింపౌఁ।బలుచెఱఁగులనునిది-ఫలసదనమయ్యెన్॥

కం॥ నిమ్మలుగజనిమ్మలుదా। నిమ్మలునారింజిపట్టనెఱమాదేదుల్।
కొమ్మకుఁగోటిగఁబండెను। గొమ్మాయివివేనిరెనయగుంగనవలయున్॥ ౨౩॥

మ॥ మగువాపద్మినిపద్మిపద్మినినిసమ్మంగ్రమ్మికుంభద్వయీ।
న్నగవిద్విడ్ఘనబాహుదండనిభశుండ్రంజూచుఁగాచూచితే।
మగదన్నాగముబాగుమీఱెదుఁగదామత్తేభవిక్రీడితం।
బగుమేల్నేనటుగానెయంచుశివుఁడార్యంజాలలాలించినన్॥ ౨౪॥

తరళ॥ వెరవునంబచరింతుపల్కల - వేవిరంబులవింతగాఁ।
గరినిఁద్రుంచితివించువిల్దారఁ - గార్చికూల్చితివయ్యయో।
తరళమయ్యెడుమన్మనమ్మని - రానుశంకరిపల్కినన్।
గరిముఖాప్తుఁడనిన్నుఁగూడిరిఁ - గాంచవేయనుశంభుఁడున్॥ ౨౫॥

భూనుతవృత్తము.

వెన్నఁడుంచినవిపెక్కలు-ప్రేంకలవద్యాల్పన్నగానివృదుచాల్చిన-శాంగినెసంగన్।
గ్రొన్ననల్చిగుళులాకులు-గూడఁగినిమ్మా।పొన్నప్రానుగనుమిదియది-భూనుతమయ్యెన్॥

లలితపద॥ లలితపదంబులివి-లాసినిపాడన్। లలితపదంబిది-లాసగియాడన్।
గులసతిమెచ్చఁగఁ-గోయిలగూయన్। నెంచుకనాడఁగ-నెమ్మియొయాడున్॥

మదనవిలసిత॥ శివుఁడనుమొదటన్। శివయనుఁదిపదన్। శివకరముగనెం। పవురగడనుడుల్॥

రగడ.

కంటివేయెలమావిగున్నను - మంటవారెనదియలరెసంజెనఁ।
గంటిదుమ్మెదలుటుముపొగవలె - మింటినంపెదమంబనంపెనఁ।
గాంచితేయలగండుఁగోయిల - పంచమస్వరమెంచునీవరెఁ।
గాంచితిప్రతినిన్నువేఁడెడు - సంచుసూచించుటగఁగావలె।

చూచితేచిలుకల్ఫలంబుల - నేచెనీవలెభాషితంబులఁ।
జూచితిన్సకపుల్ఫలంబుల - నేచుటబ్రమెకృతిముఖంబుల।
చూడుశైలూషాళివెనుకొన - నాడుఁబత్రకరాభినయమున।
వేడుకగనిదిరంభయాఁగద - వేఁడుఁగూడఁగనిన్నునయమునఁ।
గన్గొనుమియిదివిటపసంగతిఁ - గనకవల్లియెసంగెఁబెల్లుగ।
నెనయదేయదిస్థాణువందిన - మొనసినుస్థితినొందియిల్లుగఁ।
గాంచుమియ్యదిసాధ్వినీవలె - మించునేకామ్రేశసంగతిఁ।
గాంచుఁగాకమనాగవల్లినిఁ - గాంచిక్రముకమునీవలెంగతి।
అల్లపున్నాగమునుమల్లిక - యల్లిబిల్లిగనల్లుకొనెఁగను।
మల్లికార్జునమహిమదోఁపఁగఁ - జెల్లుఁబువులనుగొల్లగాఁగను।
తరణిగ్రిందగుమీఁదగున్ శశి - యిరులుగ్రమ్మెడునేమిచూతము।
అరుణవృంతమునీతదళంబళి - సురుచిరంబిదెపారిజాతము।
పారిజాతంబాకుఁబూవుల - నారళక్షిత్రయముఁదెల్పెడు।
నారయఁగశివయోగమున్నవ - వారమునవేయూహఁగొల్పెడు।
ఎద్దియీవనదేవతకునగు - నద్దమదిగదచూడవలయును।
ఇద్దికేళాకూళిగదమన - మిద్దజిద్దరినుండవలయును।
మొగిడెఁదమ్ములువిరినెఁగల్వలు - నెగడెఁబులుఁగులకలకలంబులు।
పగలణంగెనెసంగెరేమొగ - మగడుమానెనుహంసకంబులు।
నడకబడలికదోఁచెనీయెడ - నుడిగెదమెనేటికిటఁద్రిమ్మర।
నడఁగునదినెలరాతితిన్నియ - నడుగిడంగనిఁకేలత్రిమ్మర॥ ౨౯॥

కం॥ అనసోముఁడలమికొనియుమఁ । జనిచనియమృతాశయమనుసరసుదరినిఁబ్ర।
న్ననిరేరాతిన్నెపయిం । దనరఁగఁగూర్చుండెఁగడలిదరిసోముఁడనన్॥ ౩౦॥

అలసగతి॥ అనువుగనువారటువి - హారమునుజేయన్।
వనమదియుదానఁగన - వర్ణననుదానున్।
ఘనయశముఁగాంచననఁ - గానమృతభానుం।
డౌనరెనపుడీశుఁడిటు - లొప్పగను జెప్పెన్॥ ౩౧॥

ఉ॥ శంకరినీమొగంబునెలజానుగఁగొల్చినడిందుఁగందటం।
చంకిలియేదివచ్చెశశియాదరమొప్పఁగఁజూడుమీనిమీ।
నాంకునిమామమామకశిఖాంచితుఁబ్రాంచితునుత్పలాప్తునిన్।
బాంకమగుంగదావినతపోషణముత్పలమాలికేక్షణా॥ ౩౨॥

చంద్రశ్రీ॥ అగుంజంద్రశ్రీపేఁడపునుఖస - రోజంబుగాఁడే।
నగున్నామంబియ్యత్రిజునికెటు - లబ్జుండనంగన్।
దగుంగాతేంల్లెంతేఁదమిగుమిగఁ - దార్కొన్నపూగు।
త్రిగంగాఁడేనల్పున్వాలివెలుఁగు - ద్రెక్కొఁడదేలా॥ ౩౩॥

శా॥ కైలాసంబనఁగాహిమాలయమనంగానెక్కుఁడౌకొండయా।
నేలాశైలములెల్లనట్లొనరుచేయింపానటంచెంచియో।
కైలాసాద్రులనుండుపారగిరులంగావించుచున్నాఁడురు।
జ్గాలంబుంబరఁగించియన్నిమలలంజంద్రుండునిస్తంద్రుఁడై॥ ౩౪॥

ఉ॥ వెన్నెలకవ్వపున్మలనువెల్లఁగఁజల్లఁగఁజేసిభాసిలన్।
మున్నిదిపాలసంద్రమునమున్గినదంచెఱిఁగించుఁగాంచితే।
పన్నగవేణిరూఢిగనుబ్రాథవుగాయిదిజ్యోత్స్నదేనిఁబో।
లున్నెలమెట్టులుండెడువెలుంగఁగవర్ణననేయుమీయనన్॥ ౩౫॥

సుముఖీ॥ అనెనిటులంబ-యగాత్మజయిం। బుననమృతంబుఁ-బొసంగనెసం।
గనిదియదోయ-గుమోహినియం। చునుశివుఁడెంచ-సుమాళముగాన్॥ ౩౬॥

ఉ॥ వెన్నెలయానుబాల్కడలివెన్నెలకేఁడగుఁబాపకేఁడుకం।
దెన్నఁగవెన్నుఁడానుడువులీడ్యులువేలుపులున్మనుల్ముదా।
సన్నచకోరరావములుసద్ద్విజవేదరవంబుతోఁదమం।
బన్ననిశాచరౌఘముపదారవముల్గదకోకశోకముల్॥ ౩౭॥

కం॥ రేయెండపాలగుస్రే। రాయండగుమీఁగడగనుగ్రాలుంగానన్।
రేయొడయఁడుజాబిల్లిగ। నాయెంగాపన్నఁబిల్లియంకమెటులటన్॥ ౩౮॥

శా॥ దేవానీవనలేక్షణుండవవుటన్దీండ్రించుహాలాహలం।
బీవేత్రావుటఁగాంచిపాల్కడలినీకిచ్చెన్సుధాధామునిన్।
నీవోగంగనునిల్పవైనఁగరఁగున్నేరున్సుధాంశుండొగి।
దైవారన్క్షయవృద్ధులన్గడలివెన్నంగాఁచలంతున్నెలన్॥ ౩౯॥

కం॥ సోముఁడుగరళంబానెన్। శ్రీమించన్లోకులెల్లశ్రీకంఠుఁడనన్।
సోముఁడఁగానేయనినెల। గామిడిచీఁకటినిమ్రింగెఁగంపదియయగున్॥ ౪౦॥

మ॥ తెలుపుంజంద్రుఁడనుజ్ఝితాంకుఁడయినాఁటిన్నాఖుఁడెట్లైనియున్।
విడువన్రాదెదఁదాల్పనౌననియటన్వాల్గాంచుచిహ్నంబున।
ట్లలరుంగాహరిఱొమ్మునన్సిరినినెయ్యంజేర్చుకొంచెవ్వఁడు।
జ్జెలువుండెవ్వఁడుచెల్వఁగూడకెడలున్దీపించునిందుంగనన్॥ ౪౧॥

చంద్రికా॥ అననయిననుబోద-మాగృహం। బునకనెఁబతెయైనఁ-బోవముఁ।
చనెసతియిటఁజంద్రి-కాస్త్రియం। పనరతినుతచంద్రి-కాస్త్రినా॥ ౪౨॥

కం॥ మునునేనేననిపతుకము। ననుశివులాత్మాలయంబునకుఁజనిరదియో।
వినుతింపనెవరికలవియ। పునువారికెశక్యమననపుంజిహ్మ్యయనై॥ ౪౩॥

మహాస్రగ్ధర॥ కవిరత్నస్తంభమున్న-త్కనకమయమహా-గ్రావపద్యంబునేలా।
శ్మవిరాజత్సత్కవాటో-జ్జ్వలలలితగవా-క్షంబునక్షుద్రముక్తా।
సువితానంబాస్తరార్క-స్ఫుటమణినుతముక్-సూర్యచంద్రాగ్ని తేజః।
ప్రవరానేకాశ్మదీప-ప్రకరమదిగదా-పార్వతీశాలయంబౌ॥ ౪౪॥

ఉ॥ ఆసముదాత్తసౌధముననంచితమంచముపైమరాళతూ।
లానితశయ్యనయ్యిరువురయ్యెడనెయ్యనఁజేరిరారయ।
ద్భాసితనీలవజ్రరుచిభాసురులాశివులాసలూరఁగా।
వాసిగనల్పుదెల్పులుగబాగగుయామునగాంగరోచులన్॥ ౪౫॥

కం॥ అండజుబ్రహ్మానందం। బందురుమేలనుచువిష్ణునానందముమే।
లందురటుమీఁదటశివా। నందముమేలనుచదెయటనరవాచ్యంబే॥ ౪౬॥

క్షితివృత్తము॥ శివుఁడను॥ ౪౭॥

ఉ॥ వీడినపూలదండలనువెండియుఁగూరిచికొప్పవెట్టితిన్।
గూడినముంగురుల్నిమిరికూర్చితిబాగుగబొట్టుదిద్దితిన్।
నాడెములైననీసరులనల్వగఁజిక్కుడలించికాంచికన్।
వేడుకమైనమర్చితినివేఁడెదఁగాళ్లకుఁబాయలత్తుకన్॥ ౪౮॥

శశివదనా॥ అనిశివుఁడన్నన్। వినిశివగంగం। గనఁబఱుపంగం। గనెయనెనింగన్॥ ౪౯॥

క్షితివృత్తము॥ శివయను॥ ౫౦॥

శా॥ గంగన్విష్ణుపదింధరించెదుతృణాగ్రప్రాయనీయాదలన్।
రంగారంగనుభూభృదీశతనయారత్నంబునన్నేలయా।
భంగిందాల్పవుక్రిందుచేసెదవుతద్భావంబునీకబ్బనే।
యంగశ్రీవిభవంబుతోఁగరళకంఠాయన్ననయ్యార్యతోన్॥ ౫౧॥

మ॥ పలికెంజల్లఁగఁజంద్రమౌళియుమనీవాంఛన్ఫలావాప్తిగం।
జలుపంగోరెదవేనిబిల్వతరువైజన్మింపుమాయట్టులేన్।
దళముల్నీయవిదాల్తునాశిరమునందద్గంగయుంగ్రిందుగాఁ।
జెలువొందంగలవీవుసర్వసుమనశ్శ్రీమింతుశ్రీపర్ణవై॥ ౫౨॥

చ॥ అనఁగనుశ్రీఫలోత్తమతనాత్మనెఱుంగకమెచ్చకిచ్చగిం।
పనుమనసొగ్గకుండుటనపర్ణయనంగఁబరంగెఁబార్వతీ।
వనితతమాలనీలయయివాసవరత్నరుచింభజించియం।
జనగిరిఁబోలిచీఁకటియెసంగినభంగినెసంగెనంగజన్॥ ౫౩॥

ఉ॥ శ్రీమహిమంబుఁదానెఱిఁగిచెప్పుటనొప్పెఁగ్రమక్రమంబుగన్।
శ్రీమహితుండుశంకరుఁడుచెందెనుజందనచంద్రచంద్రికా।
ధామముశీతధామహిమధామధరాధరరాజతాచల।
శ్రీమహనీయకీర్తిగుణిచెందుటయబ్రమెశ్రీఫలాత్తుఁడై॥ ౫౪॥

లలితవృత్తము॥ శివుఁడను। శివకవు। డవుటను। నవరుచి॥ ౫౫॥

సీ॥ రేపవల్నల్పుదెల్పాపావురంబులు గూడినట్లుందుము చేడె మనము।
నీరంబుక్షీరంబు నీలంబుహీరంబు చేరినట్టుందుము చెలువ మనము।

కలికల్వదెలికల్వ కస్తూరిగంధంబుఁ గలసినట్లుందుము కాంత మనము।
క్రొవ్విదవూదండ గొనబుఁగాటికకన్నుఁ బొందినట్లుందుము పొలఁతి మనము।
కెంపుగనులుగనుందుమింపొప్పమనము । తారకాత్తులవలెనుందుమారమనము।
ముంగురులుమోమునననుందుముగదమనము । యమునగంగయుననుందుమమరమనము॥

కం॥ నేమల్లికార్జునుండను । శ్యామలభ్రమరాంబవీవుసరిగదయింకన్।
నీమహిమమెన్నఁదరమే । కామినిసరసతనుగాళికవుగారుచినిన్॥ ౫౭॥

మ॥ బెగడున్నీజడనీదుమోమువలనన్ బింకంపుఁజన్దోయియున్।
సొగసౌకానునఁబల్కులన్బెదవియున్ జూపుల్గనుంబొమ్మలన్।
దగుకైకాళులునిబ్బరంపునడకన్నలైవ్వననీవన్నెచే।
మగువానామదినిన్నునెన్నఁదరమేమత్తద్విరేఫప్రభా॥ ౫౮॥

కం॥ నడకగజగతినిఁబోలుట । బెడఁగగుగుబ్బలిభకుంభవిధమునుగనుటన్।
దొడిఁబడియయ్యేనుఁగువలె । నడరఁగఁజత్కాలవర్ణమందితెకాళీ॥ ౫౯॥

మ॥ సుమనస్సేవనొనర్చినిచ్చలునునీసొంపైనవేణీరుచిం।
గొమరారంగనుఁగాకపల్లిగుమనిక్కుంగాకయేట్రింతలా।
క్కామొగింగ్రీడలఁగొల్లఁబెట్టినిధులన్ త్వ్మయందునానంతెనీ।
కమనీయచ్ఛవిఁజెందనక్విపలఁతుల్గానేర్చునేకాళికా॥ ౬౦॥

కం॥ మేనికినంతకుముఖ్యము । గానెన్నంబడుటమస్తకంబుత్తమమా।
పైనుండుటఁగేశంబులు । వానిజగింగాంచికంటెవాసింగాళీ॥ ౬౧॥

ఉ॥ చెప్పఁగశక్యమాఘునరుచిందగునీయదిగొప్పకొప్పనా।
ఊప్పెదునల్లత్రాఁచయినపొద్దలమారశరాసములూపమల్।
గప్పగువానికోలలయిక్రాలెడుఁజూడ్కులునల్లగల్వలో।
యొప్పులకుప్పయొప్పెడుటలాప్పఁడమాలవినీలకాళికా॥ ౬౨॥

కం॥ నీముంగురులెటుబొమలెట । మోమెటనెుడలెటననేషమునుబ్రకృతిమయం।
బౌమాడ్కిఁవోఁడఁజేసెను । శ్రీమతిభువమవసుటనెలగుఁజెలఁగుముకాళీ॥ ౬౩॥

తే॥ కృష్ణవేణివిగావునఁగృష్ణవయితొ - కృష్ణకృష్ణ।
కృష్ణమృగనేత్రవగుటచేఁగృష్ణవైతొ - కృష్ణకృష్ణ।
కృష్ణసోదరివీవౌటఁగృష్ణవయితొ - కృష్ణకృష్ణ।
కృష్ణవైతేలకాళికతృష్ణనొక్కొ - కృష్ణకృష్ణ॥ ౬౪॥

---

తే॥ సూర్యుఁడాదినెయుండెదుసురవరులనఁ - జొప్పడఁగా।
నిద్దఱటుపిమ్మటన్రవులిద్దఱుందు - రద్దిరయ్యా।
తేటగీతియెయజ్ఞాప్తిఁదేటియగును - వాటముగాఁ।
జెరినీసముఁజేయుబంగారముగను - సారముగా॥

కం॥ నీనలువునకుం గారణ । మేనూహించెదఁ దొడవుల కెల్లను దొడవీ।
వైనందున సొమ్ములకున్ । శ్రీనెగడింపంగ నల్పుఁ జెందితివంచున్॥ ౬౫॥

కం॥ నామేన నీవు మెఱసెదు । చామరొ నెలయందుఁ గందు చందమున సుమ।
ల్లీమచ్ఛందనతరువున । శ్రీమించెదు కృష్ణసర్పరీతిం గాళీ॥ ౬౬॥

తే-గీ॥ కీర్తిఁ దెలుపవు మఱియపకీర్తి నలుపు । నవుననుచు నుండుఁ గవిసమయంబు జగతిఁ।
దెల్పనల్పశుభాశుభస్థితులఁ దెల్పు । నేనితుఁడ నీవ సితవు వేయేల కాళి॥ ౬౭।

కం॥ అని నెలదాల్పు వినోదము । గను బలికిన పలుకులు ముకుఁ గాండములయ్యెన్।
జనవున నే నిజమాడం । గను గొఱఁతం గలుగు వారు గందు దురుగదా॥ ౬౮॥

ఆ-వె॥ కందికుందిలోని ఘనతాపమోపక । క్రక్కునాఁగఁ బలికె నిక్కరణిని।
గట్టుపట్టి బిట్టు గట్టివాయి యనంగఁ । జంద్రధరుని మనసు సంచలింప॥ ౬౯॥

శా॥ చాలుం జాలును నీదువాక్సుఖము నీ చాతుర్యమున్నిల్పుమి।
ల్లాలం గోలను నన్ను మిన్నకదురాలాపంబులన్నొంచెదే।
ఫాలున్నీకిటులాడ నోపశుపతీ పొల్పొందు మీచంద్రము।
శ్శ్రీలన్నీ వెశరధ్వనంబువలె నేసిద్ధంబు గాఁ గాళికన్॥ ౭౦॥

ఆ-వె॥ విఙ్ఞవీఁగె దేను విమలుండనంచును । గావె కాలగళుఁడ వీవ దేవ।
యరయ నీచరిత్ర గురిగింజసామెత । నీలలోహితుండ నెగడుచుండు॥ ౭౧॥

ఆ-వె॥ విషమ నేను గాను విషముఁడవీవెయా । దలరు విషము గంఠమందు నీకు।
నధరమందు నాకు సుధయుండు నోమహా । కాళకాళినైనఁ గానె మేలు॥ ౭౨॥

ఆ-వె॥ ఔరదూఱదేల యారక నన్నిట్లు । మెత్తనైనదాని నెత్తబుద్ధి।
యయ్యె నన్న యుక్తి యనువొందె నీయెడఁ । బలుకు ములుకులిఁక నుబఱపకయ్య॥ ౭౩॥

కం॥ దోషాకరుఁడవతంసము ! భూషలు విషధరములస్థి పుంజముల భవా।
భాషాపతి పుఱియయెకర । భూషణమా నీకుఁ దగిన పొలఁతుకఁ గానే॥ ౭౪॥

స్వాగత॥ దారుకావనని-దాపసరామా । నారముం జెఱుప-వారలచే నే।
గోరమొందనర-ఘోరప్రహారో । దారతం గనను-దాదు నెనీకున్॥ ౭౫॥

సీ॥ శంభుండవఁట నీవు శంభునితలఁదున్మి కంటికపాలినాఘనతవినుతి।
శంకరుండఁట నీవు శంకరుమరుఁద్రుంచి చిచ్చుకంటియనంగఁ జెందితి నుతి।
మృడుఁడవు నీవంట మింటిపురంబులఁ గాల్చి పురారి నాఁ గాంచితి స్తుతి।
భూతేశుఁడీవంట భూతజాతము రూపుమాపి హరుండన మనితి విధృతి।
నహహ ప్రణతార్తిహరుఁడను నాహ్వయంబు । నిజముగా నీకునున్న నో నీలకంఠ।
నన్నుమున్నున్న సతిని గానెన్నుమట్లు । గాకయున్న నననుగంగగనుదలఁపుము॥

రుక్మవతీ॥ ఆరయకేమో-యప్పుడు నిన్నున్ । గోరితి నీవుం-గోరవె నన్నున్।
ఘోరితితన్వీం-గ్రొచ్చెదుతన్వీం । క్రూరతరోక్తిం-ద్రోహముగాదే॥ ౭౬॥

చ॥ మఱినను దెప్పి పొడ్వఁగను మన్ననవన్నియఁ గాంచి మించు జ
క్కఱి మొఱయించె దేసవతి కావర మొప్పఁగఁ దీర్ప నేర్పుమై
నుఱక నమస్కరించు క్రియ నుల్లముఁ దల్లడమందఁ జేసె దే
నెఱ తన మింత చాలు నిఁక నీ చెలి నీచగ యేయగున్భవా॥ ౮౮॥

చ॥ పలుకులు వేయు నేలయిఁకఁ బంతముఁ బల్కెదనిప్పుడిట్టిట
న్నిలువఁ దపంబు నేయఁగను నేనెట కేని యుఁబోదుఁ బోయియిం
పలరఁ దపఃప్రభావమున నయ్యెద గౌరిని గాంతునంతనిన్
దొలకరి మించు మించనఁగఁ దోఁచెదఁ గాంచన పుత్రికాకృతిన్॥ ౮౯॥

చ॥ అని చని కన్గొనెన్గిరిజ యంబరచుంబిశిరస్సరస్సర
ద్ఘనతరనిర్ఝరప్రకరగాఢరయోత్ప్లుతవృక్షలక్షిత
ప్రణుతకపర్దనిర్గళితవైబుధసింధుకబంధబిల్వప
త్రనికరశైవగాత్రము జితక్షితివృత్రముఁ గంజగోత్రమున్॥ ౯౦॥

మ॥ మనుపంచాక్షరలక్ష్యశేఖరము సన్మాన్యస్వయంవ్యక్తలిం
గను తాశ్మప్రకరంబు వృక్షకృతయోగవ్యగ్రమున్యుత్కరం
బనిమేషీకృతతిర్యగాదరము భూత్యాద్యాకరంబున్సతీ
ర్థనతశ్రీకరమద్రిరాజమునుమున్ బ్రహ్మోహమన్కంజమున్॥ ౯౧॥

శా॥ తత్కంజాద్రిశిరస్స్థలంబున జగత్ఖ్యాతంబు దీర్ఘంబు స
ర్వోత్కృష్టంబు విశిష్టశిష్టవినుతంబుద్యోతితద్యోధునీ
హృత్కృత్యంబు సుధాకరోజ్జ్వలమహోహంసాంచితంబాశ్రితా
ఘ్యత్కంఠంబును జిత్ప్రకాశమును నిత్యోదంబు సత్కంజమున్॥ ౯౨॥

ఉ॥ తత్తటసంప్రరూఢమమృతప్రభవంబు సుపత్రసత్ఫలో
దాత్తవిశాఖికావిటపదర్శితనీలవలాహకంబు శ్రీ
కృత్తమరేఖికాఘటనకీర్తితకంటకలేఖనీకమా
యత్తశివంబు మున్యభిధమాశ్రితపక్షము బిల్వవృక్షమున్॥ ౯౩॥

ఉ॥ తద్ధరణీధరేశముఖతావిభవంబు మునీశవాససం
పద్ధితముద్ధతాసురవిపత్సముపాగతసారవారర
క్షేద్ధమహీనమస్తకమణీడితదీపనిపీతదుస్తమం
బుద్ధపదంబు దంచితగుహోత్కరమాదృతసిద్ధిసోత్కమున్॥ ౯౪॥

ఉ॥ కంజుఁడు బ్రహ్మయందు బహుకాలమొనర్చెఁ దపంబు గావునన్
గంజము సౌఖ్యదంబు నత కాండము పాలిటి కౌట నెప్పుడున్
గంజము మస్తకంబగుటన్మ్మాధరరాజమదట్టులొప్పుటన్
గంజనగంబనంబరఁగెఁ గాయదియన్ని జగంబు లెన్నఁగన్॥ ౯౫॥

కం॥ పేరనహంబ్రహ్మ యనుచు । సారార్థముఁ దోఁపఁ జేయుశైలము కంజం
బారాధ్యముగా దేరికిఁ । గోరికలీడేర్చు నతులకుం గంజమయై॥ ౯౬॥

ప్రణుతచరితవమ్మా - వల్లభుంగూడఁబొమ్మా।
కనుఁగొనుకృపనమ్మా - కామితార్థంబులిమ్మా॥ ౧౦౯॥

కం॥ అనినలువపలుకనయ్యుమ । తనువువలననుండినల్పుతామసిస్త్రీరూ।
పున వెలువడియెసుధాకరు । నినివిడిచినరాహువనఁగనిర్జరులలరన్॥ ౧౧౦॥

చ॥ కరములనాగపాశమునుఘంటయుఁగత్తికపాలమున్భయం।
కరముగరుండమాలయునుగ్రాలఁగఁగోఱలుగెంజడల్ప్రిదో।
షరుచిభజింపనత్తులునుషర్బుధరోచిఁగనంగనొప్పెన।
త్తరుణిదమాలనీలఘనతామసగాత్రమెసంగనిల్వఁగన్॥ ౧౧౧॥

శా॥ అక్కాళింగనినల్వపల్కెజగదంబానీవుబిల్వాటవిం।
జక్కంగానిలుమేకవల్లియనఁగాజానానునీనామమిం।
దెక్కంగానిదెనింగముంగొనుమునీకింపొందనాఁబూజమున్।
న్యక్కారంబొనరించువారలాగినీకాహారమావారిలన్॥ ౧౧౨॥

తే-గీ॥ వల్లియనబిల్వమగుమఱివఱలునేక । మనఁగముఖ్యమునొకటియనగుటనరయ।
బిల్వవనమునముఖ్యయబిల్వికాఖ్య । యనయియోయేకవల్లినీవెనయుముదము॥

కం॥ అంబమహాకాళీనీ । కుంబొడమిరివాణిశివుఁడుక్షోణిఁగలపదా।
ర్థంబులననగుటభక్తుల । కుంబహ్వర్థంబులొసఁగుకుగుణులణంగన్॥ ౧౧౪॥

సీ॥ ఏకవీరయనంగనెసఁగెదవోయమ్మప్రతిపక్షభయమునుబాపవమ్మ।
కాళరాత్రియనంగఁగ్రాలెదవీవమ్మమాకోర్కులీడేర్చిమనుపవమ్మ।
ఘనదురత్యయయనఁదనరెదవుగదమ్మనెమ్మదిమనుగడనెఱపవమ్మ।
క్షుధతృషనిద్రలన్కొఱలువెల్లఁగలమ్మక్షుధతృషనిద్రలఁజొనుపకమ్మ।
నిశనిమిషనీవెగదవమ్మవశవుగమ్మ । మఱిమహామాయయనమహామారియనన।
బరఁగెదవుగామహాకాళిభద్రకాళి । నీకునతులివెయోతల్లియేకవల్లి॥ ౧౧౫॥

కం॥ నినుమునుపూజింపకగౌ । రినిఁగానిమహేశుఁగానిప్రీతిననేనిన్।
మునుకొనిపూజించినఁద । ద్ఘనఫలమెవ్వరునుబడయఁగాంచరుకాళీ॥ ౧౧౬॥

కం॥ అమయజ్ఞానముదారి । ద్ర్యమునగునవినిన్నుఁగొలువఁదలఁగునరులకీ।
వమయనఁబడియెదునీతిథి।యమయనఁబడియెడిని జ్యేష్ఠయరుగుమసరగన్॥ ౧౧౭॥

కం॥ ఈబిల్వారణ్యంబుం । బ్రాబల్యముతోడఁగావవలయునునీవే।
శ్రీబిల్వంబుగదాయిది । లేబరములఁబరులుదీనిలేపకయుండన్॥ ౧౧౮॥

కం॥ ఓకౌశికియీయాయతుఁడు । నీకుఁదగినవీరభటుఁడునిపుణుండుగడున్।
జేకొనుమీపంచాలునిఁ । బ్రాకటలక్షోపలక్షబలసంపన్నున్॥ ౧౧౯॥

కం॥ రానీఁడెవ్వరినిచటికి । రానిచ్చినభక్తిగుదురరంజిలనీఁడిం।
దూనికఁగొననీఁడుంచిన । జ్ఞానముఁదోఁపంగనీఁడుసౌఖ్యమిడకయున్॥ ౧౨౦॥

తే-గీ॥ ఉండుమీదండననియొండుకొండఁజూపెఁ। గాశికకుబ్రహ్మయదియిచ్చుకాశికిద్ధ।
మలయనంబడుఁగంజాద్రికెలననుత్త। రమునమేఖలకొననుండునమరనద్ది॥ ౧౨౧॥

కం॥ అనుఁబంచిమఱివిరించనుఁ। డనఁగాంచితదాశయంబునెగివచియించెన్।
క్షమవలగొననెక్కఁగనీ। క్షమాధరమునుఖదమగుటఁగనుఁగంజాఖ్యన్॥ ౧౨౨॥

ఉ॥ శైలజచిత్ప్రకాశమనుశంకరతీర్థమునందునిందునిం।
కేలలనల్మనుంగుదరొయెమ్మెలఁగాంతురువారునీవలెన్।
శ్రీలెసఁగంజెలంగెదరుచేసిననించుకయేనిదానముం।
బోలఁబ్రదక్షిణింపగిరిఁబుత్రులఁగాంచెదరంచువీడ్కొనెన్॥ ౧౨౩॥

చ॥ చనియెనునాథుసన్నిధికిఁజయ్యననయ్యుమగుంకుమచ్ఛవిం।
గనకసమప్రభాఢ్యయయిగౌరియనంగనెసంగియాయమన్।
గనుఁగొనికామవైరియిటుగ్రద్దఱికంబునఁబల్కెనుల్కఁగన్।
జనుచనుమింతివేషములసత్పురుషుల్మదిమెచ్చువారలే॥ ౧౨౪॥

కం॥ మగనినుఱకవిచ్చలవిడిఁ। దెగడిచనెడిచెడిపెకేలతిట్టఁబడినయ।
మ్మగఁడదిదలఁచిననెందఱు। మగలాదవరుచాలుఁబోవెమహిళాయెందేన్॥ ౧౨౫॥

సీ॥ నీతల్లినెఱుఁగమేనిర్జరవనితగాతవిలివిశ్వామిత్రుతపముఁజెఱిచె।
నీతండ్రినెఱుఁగమేభూతధాత్రికిదూడగదనిన్నునిచ్చినగ్గట్టుపఱిచె।
నీతోడునెఱుఁగమేభీతిమైమున్నీటదాఁగికులౌన్నత్యమేగఁబొలిచె।
నీవారినెఱుఁగమేదేవిమహాశక్తులెవఁడువారందఱింద్రుప్తిపఱిచె।
నీవుబ్రహ్మచ్యుతముఖేడ్యదేవబృంద। వంద్యుఁబరమాత్మననునరప్రాయుజీవుఁ।
గాఁగఁజేసితికూడికఁగావెప్రకృతి। వరుగుమరుగుమునీపొందుపరఁగదిందు॥ ౧౨౬॥

కం॥ పోపొమ్మనుటయుమహిభృ। చ్చాపునిఁగనిహైమవతివిచారముతోనే।
నాపట్టునఁగనకెట్టో। చూపట్టఁగనంటిముగ్ధసుదతినిగానే॥ ౧౨౭॥

తేఁటిబోటి॥ ఆఁడువారలారయఁగనేరకెట్లెట్లొ - యాడువారు।
మగలుదెలివిగలిగిమనువారుమగువల - మనుచువారు।
భార్యలాఁడువారుభర్తలుమగవారు - పాయుదురే।
పాయలోకనిందపాలుగాకుందురె - వారురామ॥ ౧౨౮॥

ఆ-వె॥ నన్నువీడనీకునాయమేనీదాన। నిన్నుమానియుండనేరనెపుడుఁ।
గన్నుదగిలెననుచుఁగరమునుఛేదించు। కొంద్రెయెవ్వరేనిఁగొదఁగొనిమది॥ ౧౨౯॥

---

తేఁటిబోటి॥ ఆటవెలఁదిబేసియడుగులయట్లేని - యైననాల్గు।
పాదములుమఱిసరిపాదములట్లేని - పైయతితో।
నబ్జయుక్తిషడ్గణాంఘ్రియగుటనుష - డంఘ్రితాప్తిన్।
దేఁటిబోటినాఁగఁదేజరిల్లెడునిది - తేఁటివలెన్॥

తే-గీ॥ పశువులము మేము నీవన్నఁ బశుపతివిక । హేశయీ వెడలంగమా కేయదిగతి।
యేము లేకున్నఁ బేరునీకెట్లుగునది । కానవిడువకమము నేలుకనికరమున॥ ౧౩౦॥

ఆ-వె॥ ఎన్నితప్పులున్న మన్నించెదవు భక్త । తతినిఁ బ్రోవవె మును దశవదనునిఁ।
గాననన్ను నట్లు కరుణతోఁ బ్రోవవే । క్షమిదయాళువుగద సత్పురుషుఁడు॥ ౧౩౧॥

మ॥ అనుచాస్యంబున దైన్యముప్పతిలసౌహార్ద్రాబ్ధియుప్పొంగఁద।
ధ్వనితారత్నము మ్రొక్కెశంకరునకొప్పంగంకణక్వాణమున్।
ఘనకాంచీనినదంబు హంసకఝుణత్కారంబువాఁదోడనం।
గనుగంగంగరుణారసాత్మికను నేఁగా నేశివాయన్క్రియన్॥ ౧౩౨॥

కం॥ ధీరత దోఁపఁగ ధూర్జటి । యీరీతింబలికెఁ బ్రకృతియీవాక్కుతెవే।
వేరూపులఁ జెందెదునను । నీరూపు సరూపుఁ జేయనీరూపెయవున్॥ ౧౩౩॥

శా॥ నీవేషంబులు నేనెఱుంగ నెతమానిష్ఠాత్మనై కాశినాఁ।
గావాసింగనెదీవు శ్రీయనఁగఁ బ్రఖ్యాతిన్రజోజుష్టవై।
భావింపంగను సత్త్వసంపదసరస్వత్యాఖ్యనుం గాంతునా।
రీబిల్వాకృతినై తివేనిననుఁ బేర్మింగూడనానీకనన్॥ ౧౩౪॥

చ॥ పలుకదిపర్వశాపముగఁ బార్వతి ధైర్యము నేదియేదియుం।
బలుకఁగలేక భావికజభావమనంగను బ్రాన్పడంబడం।
బలువిడిలేవనెత్తివెతఁ బాయఁగఁ జేయుచుఁ జూవెబుద్ధిగాఁ।
గలపనికానుగుణ్యముగఁ గల్గుటసిద్ధము మానశక్యమే॥ ౧౩౫॥

శా॥ కానంజింతిలవల్దుబిల్వవనిలోత్మ్మజంబుగంబుట్టుము।
చ్చోనేనుంబ్రభవింతునంతమనకున్నొంపొందఁ బొందౌననం।
గానత్తన్విమహాప్రసాదమని మ్రొక్కన్నీవుకొల్వన్దగన్।
శ్రీనాథుండను నేనునాదుఁదొలుతన్ శ్రీవీవుగమ్మంచనన్॥ ౧౩౬॥

౩౭॥

కం॥ గౌరిగనికాశినింబి । ల్వారణ్యంబునఁ బ్రధానమానెలవెఱుఁగం।
గౌరనదికంజగిరికిన్ । సారమనంబున్యజనదిశం జూపెనటన్॥

మ॥ వెలలెంగౌర్యవలోకమున్వవలియుద్వృత్తిన్సుకుంభాప్తిఁ బే।
ర్చిలసద్దంతబలాప్తినాసయనఁ బేర్మిందొండమొప్పంగఁ గ్రొ
ట్లోలయందానప్రసక్తిఘంకృతులెకానుత్తుల్చరద్గా టన్॥ మై।
చెలఁగన్నేనుమదేభమొక్కఁడహహాచేయంబ్రియుంగుంభినిన్॥ ౧౩౮॥

కం॥ ఆగౌరిమదముదెరలఁగ । బాగుగనొకమనుజకన్యపగిదిందనరెన్।
నాగరులామెరుచింగని । శ్రీగురుతన్గౌరియయని చెప్పిరియొప్పన్॥ ౧౩౯॥

సీ॥ నిలిచిననేలపైఁ జెలువుగజీరాడునెఱినెఱుల్నెఅపఁగనీలవృష్టి।
నెలమిఁ జల్లదనంబునీనునెమ్ముద్దుమొగమ్ము చూపఁగఁ జంద్రకాంతవృష్టి।

సంజకెంజాయనుసమకొల్పుకెమ్మోవి వఱలింపఁగాను బ్రవాళవృష్టి।
బలుపొందికనుబొందిచెలువొందుపల్వరుసలుదెల్పఁగనుశుక్తిజాతవృష్టి।
గాలునేతులుపద్మరాగములవృష్టి । గోళ్లువజ్రాలవృష్టినిగుణములఖిల।
రత్నవృష్టినిఁదెలుపనారాజవదన । రత్నమయిరత్ననిధియనరాజిలులలి॥ ౧౪౦॥

కం॥ నిలిచినరతనపుబొమ్మగఁ । దెలియఁగనగుఁజూచెనేనిదివ్యాంగనగాఁ।
బలికినఁదేనెలెయొలుకున్ । జెలువనడవజంగమలతచెలువునుగనెడున్॥ ౧౪౧॥

కం॥ తిన్ననినడకయుమఱియుం । దిన్ననిచూడ్కియునుబలుకుతిన్నదనంబున్।
బ్రన్ననినడవడిశివరతి । బ్రన్ననిరూపాపెనుశివపత్నిగఁదెల్పెన్॥ ౧౪౨॥

తే-గీ॥ చూచువారెల్ల నాచానసుగుణగణము । నీమెయాసర్వమంగళయీమహీనని।
రామెవినియైననాకునాయకుఁడుశివుఁడె । యంచునెంచెఁదపంబునేయందలంచె॥

కం॥ నేనిటుమునుగనుఁగొనినన్ । దానెయిదఁడునసుశివుండుదనవర్ణమునే।
నూనమిచేఁగాఁబోలును । బూనెదనిఁకనిందురుచినిఁబొందఁడెనన్నున్॥ ౧౪౪॥

కం॥ అనితలఁచిగౌరిమునుకం । జనగంబునఁగాళియైనసమయంబునఁబూ।
జనొనర్చినతుష్టినిసె । మ్మనమునస్మరియించెరాఁగమఱిపూజించెన్॥ ౧౪౫॥

తే-గీ॥ అమ్మహాకాళిఁబూజించెనధికభక్తిఁ । దల్లియోమాయేకవల్లిరాజిల్లునీదు।
బిల్వకక్షేత్రముననిందువెలయవలయుఁ । దపమునాకదిఫలియింపఁగృపఁగనుమనె॥

చ॥ అనుచలగౌరిమానసమునందుస్మరించిననప్డెమానసం।
బననొకతీర్థరాజమటనయ్యెనుసర్వసుపర్వదృక్ప్రియం।
బనఁగనుబర్వెఁదామరలహాకలిగెన్మఱియాకెచూడ్కులో।
యనఁగలువల్శివాకృతులుహంసలునయ్యమృతంబెనౌరిగాన్॥ ౧౪౭॥

కం॥ గౌరీకల్పితమగుటం । గౌరీతీర్థమననద్దిఖ్యాతివహించెన్।
గౌరీసరస్సనంగం । గౌరియెసరసగునిటననిగ్రహియింపనవున్॥ ౧౪౮॥

తేఁటిబోటి దాసుందరి నేనిస్నానమునునెయ్యంబట్టుపుట్టంబుఁజె।
మాంగల్యవిభూతిఁగుంకుమమురుద్రాక్షస్రజంబుల్ధరిం।
చెం ఁభార్యలాఁన్నతిం జెమఱిపూజించెన్సుబిల్వాళిగో।
విందుండత్రిష్టల్లోకనిఁదగపడన్బ్రేమంబొరింబొందుచున్॥ ౧౪౯॥

కం॥ వాణవమానామంబే । గీదానీపక్షియనిచెప్పియగపఱిచెనునా।
కేనేలవేల్పుగలలో । నానారాయణుభజింతునతిశయభక్తిన్॥ ౧౫౦॥

కం॥ మేనెల్లవివిధవృక్షము । లైనెగడఁగవింతపక్షియైనాకలలోఁ।
గానఁబడినయద్భుతవి । జ్ఞాననిధినిశ్రుతిమయునలగరుడుఁదలంతున్॥ ౧౫౧॥

కం॥ ఆవాణవమానామం । బావైష్ణవమంత్రమవుటనమ్మనువునసే।
శ్రీవిష్ణునాశ్రయించెద । నీవడిననియామెపూనియెంతయుభక్తిన్॥ ౧౫౨॥

బ్రహ్మవృత్తము.

ఓన్నమోవిష్ణవే । యన్నమంత్రంబుతో । నిన్నుఁగొల్తున్ హరీ । నన్ను నేలంగదే॥

క్రౌంచపదవృత్తము.

శ్రీరమణానన్నారయమీనా - కృతికమఠముకిటి - నృహరివటూరా।
మా[illegible]ఘురామామాబలరామా - స్మరజయయసికర - మహితసునామా।
వారణరక్షావాసవపక్షా - వరదయవరదయ - వనఘునదీక్షా।
నారదగేయానీరదకాయా - నతసురనరతతి - నతిసువిధేయా॥ ౧౫౪॥

పద్మనాభవృత్తము.

శ్రీసేవ్యభవ్యాభవబ్రహ్మసంభావ్య - శేషాహిశాయీవిహంగేంద్రయాయీ।
దాసావనాపావనావాసుదేవాస - దామోదదామోదరాదేవదేవా।
వాసింగనంగోరియాసింత్రుగానీకృ - పాసింధువుందాపనేంద్రుల్సురేంద్రుల్।
నీసేవసర్వార్థసిద్ధిప్రదంబంచు - నిన్గొల్తువిష్ణూశుభాపద్మనాభా॥ ౧౫౫॥

నారాయణవృత్తము.

ఓన్నమోనారాయణాయ । యన్ననీమంత్రంబుఁబూని।
వెన్నుఁడాసేవించుచున్న । నన్నుఁగావన్ రావెదేవ॥ ౧౫౬॥

మాకందము॥ అనుచుపవాసవ్రతమునఁ । దనుఁబూజించుచునుబిల్వ-దళములచేన్।
ఘనభక్తిశ్రీఫలములన్ । దనకిడనారామరామ-నామాప్తిన్॥ ౧౫౭॥

చ॥ మునుశబరీఫలార్పణముముచ్చటయచ్చటనెచ్చమెచ్చివ।
చ్చెనుహరిరత్నసానుగిరిశృంగనుసంగతుఁడైనరాజనన్।
వినతకుమారుమూఁపుపయివేడుకనెక్కుచునక్కనందుశ్రీ।
దనరఁగశంఖచక్రములుదద్వనమాలయుఁజాలఁగ్రాలఁగన్॥ ౧౫౮॥

ఆ-వె॥ వచ్చిచెల్లెలవరమిచ్చెదవేఁడవే । యనఁగగౌరియనియెనగ్రజన్మ।
శివునివలెనునేనునీతరుచిఁగూరఁగఁ । గోరుదానననినశ్రీరమణుఁడు॥ ౧౫౯॥

ఉ॥ గౌరిరొగౌరివేయగుముగారవమారఁగనీవునావలెన్।
గౌరియనంగఁదెల్లనిదిగావుటదెల్లముగాదెమున్మహో।
దారమహాసరస్వతికిఁదద్దయుముద్దుగబిడ్డలైతిమా।
దారినినారయంగదవెతార్కొనుఁగోర్కెయనంగనంతటన్॥ ౧౬౦॥

కం॥ ఆగౌరితనువులనన్ । బాగుగశ్రీనాఁగనొకతెబయలువెడలెస్త్రీ।
భోగినికుప్పసమనఁగను । దాఁగిత్రినినెత్తఁబడినతపనీయమనన్॥ ౧౬౧॥

---

మాకందము॥ మాకందముగుఁగనఁబ । ఖ్యాకందమెజగణమునిట-నాఱవదా।
నీకడఁగననయ్యెడువిభు । లాకందముచందమైన-లలితముగన్॥

బంగారము.

కాలు నేతులు పద్మ ఘన తనువహించిన మొగము హాపద్మముగను దనర-ముఖ్యముగా।
గొంతు శంఖంబు గాఁగొఱలంగఁబలుజొడకుందంబు గాఁగడు నంద మొందఁ-బొందికగాఁ।
గొప్పఁజూడ్కియు నీలగురుతను దెలుపంగఁ గ్రుస్సిన కొను ముకుంద పదము-గొనబగుగా।
మీఁగాళ్లు కచ్ఛప రాగంబుఁ జూపంగఁ బిక్కలు మకర సువిభ్రమమును-వెలయనుగా।
రూపు గొనములు వరరుచిని గాంచంగను - రూఢిగనే।
నవనిధులును నొక్కనవరూపము నైనా - నల్వగనే।
రత్నవస్త్ర భూషరత్న రత్నమనంగ - రంగుగనే।
విద్యుదాభయద్ది వెలఁదుక వెలుఁగొందెఁ - చేరొకనే॥ ౧౬౨॥

చ॥ కరముల జీవ దేవులనఁ గానిరు కమ్మల నెమ్మిఁ బూనుచున్।
వరదమభీతిదంబులుగఁ బాణులముద్రలఁ జూపుచున్నరా।
సురనర విష్టపత్రయిగఁ జూపఁగ నొప్పమ హోత్పలంబునన్।
సిరియల రారె నారమణి సెందెర మైక్యము శౌరి పేరెదన్॥ ౧౬౩॥

లక్ష్మీవృత్తము॥ కనుఁగొనుమమ్మా మముఁగొమ్మా నతిఁ - గరివరవరదుని కొమ్మా।
కనుఁగొన నీకుంగలదమ్మా సిరి - కరమరుదుగ సిరివమ్మా।
ఘనదయవమ్మా ఘన మెమ్మా డిక్కని - గడునిడునటు సిరులిమ్మా।
ఘనదయవమ్మా వరలక్ష్మీకృత - కమలజముఖ సురలక్ష్మీ॥ ౧౬౪॥

ఉ॥ గౌరియనంత నెంతయును గ్రాలెమ నోహర ఫుల్ల మల్లికా।
శారదనీరదాబ్జశర సారస పారద హారహీరనీ।
హారహరాచలేశవిభుఘాశనభాసుర చంద్రచంద్రికా।
క్షీరమహార్ణవ ప్రభను బెందెను బెద్దటీకంబుఁ బద్ధయున్॥ ౧౬౫॥

మ॥ అటులా గౌరికృతార్థ మైతినను కొంచాల్మేశ్వరుం గాం బియో।
నిటలాషౌఢవశాంగనీకి వెనతుల్నే విప్పవ దెనిన్ననున్।
స్ఫటికాభంగయి కొంచు వేయనఁగ చెప్పన్ హంసయుం గొంగయున్।
స్ఫుటముల్వర్ణముచే సమానము లెలన కానువా ప్రిమల్॥ ౧౬౬॥

తే॥ అనుచును మానమూన శివుఁడయ్యెడ నయ్యుమయయ్యయో మొఱన్।
వినఁడితఁ డింకిటుం జదువఁ బెట్టిననున్న దికో యెబుద్ధి నాఁ।
గనుజను సామెతంగనిత్రిఁ గాటను గానిన వన్నెలయ్యెనా।
మనుగడ విద్యయంచు మఱిమాధవునిన్గనుఁగొన్న నాతఁడున్॥ ౧౬౭॥

శా॥ నాతీయా తెలిరూపు నీకు అదునీ నాథుండు నిర్జల్లరా।
రీతింగాంచు గ్రహించు నేవిదువు గౌరీయా శరీరంబనన్।
బ్రీతి న్మేకొని చేనె ధ్యానమును దద్బింబాధ రాస్యార్థ్వనే।
యే తెంచెం బొరిమించుచంచ యొకఁడయ్యెన్ శ్వాసమూర్పొనన్॥ ౧౬౮॥

మ॥ తనమైమల్లియపూవుప్రోవనఁదగన్ దాసానపూఁజాయమైఁ।
దనరన్ముక్కునుగాల్లుపల్కునడకల్ దైవారఁగానల్వచె।
ల్వనుడిన్మేల్నడఁదెల్ప నేర్పననుపాలన్నీటినిన్వేఱుగా।
నొనరింపంగను నేలవాలు నెలనానొప్పారెనప్పల్గటన్॥ ౧౬౯॥

తే-గీ॥ అంతఁదద్రూపమును మానెనద్రికన్య। యదియుదయగిరిఁబానిమిన్నందు పూర్ణ।
శారదేందునిచందానఁబానుమిఱె। భువిదివికిఁజిమ్మపూఁజెందుపొల్కుఁబోలిచె॥

సీ॥ వీణనాదబ్రహ్మవిలసనంబును దెల్ప బహువిధస్వరవైభవమునమించి।
యక్షిస్రజమునూపనక్షరావళినిశబ్దబ్రహ్మవిభవంబుఁ బ్రౌఢిఁగాంచి।
పుస్తకంబఖిలశాస్త్రసమస్తవిషయములబోధింపసవగ్రహించి।
కలశంబుసూచింపనొలనిజీవనమమృతంబునుఘటపాటవంబునెంచి।
తెలుపువన్నియసత్వంబుఁదెలుపఁగనువి। వేకహంసమునెక్కుసద్విద్యయగుట।
జ్ఞానరూపసరస్వతిసత్యరక్తిఁ। జతురుఁడానలచతురాస్యుసంగతిఁగనె॥ ౧౭౧॥

వాణీవృత్తము॥ వాణిన్వీణాజపసరపుస్తక - వరకీరాంచితపాణిన్।
వీణాహంసప్రవజశుకసత్స్వర - భృతవాణిన్విధిరాణిన్।
శ్రేణీసూతస్ఫురదళివేణిని - భృతసుశ్రోణినినాగీ।
ర్వాణింగొల్తున్మదినిసుభక్తిని - వలదీక్షణరుచిరైణిన్॥ ౧౭౨॥

కం॥ పారాణిరంగులారయ। నారుంగాపసుపుదెలుపునరుణిమమటులా।
గౌరివసంతముగాఁదగు। నారహరిద్రాసుధాభలవెశ్రీవాణుల్॥ ౧౭౩।

ఉ॥ పిమ్మటనమ్మృగేక్షణయుఁబెంపెసలారెనునల్పుదెల్పుఁజెం।
దమ్ములవన్నెలన్ మృగముధర్మముచేననఁగాళిపోఁకగాఁ।
దమ్మలపాకుగానిరిముదమ్మునసున్నముగాఁగవాటిదాఁ।
దమ్ములమానసంగనొగిఁదమ్మగగౌరియొసంగెమున్వరెన్॥ ౧౭౪॥

సీ॥ కామమెపాశమైకరవశంబగుచుండఁగ్రోధమంకుశమయికొఱలఁబాణ।
మానసేక్షుశరాసమూనఁజంచలమదిక్రిందయ్యెననిచూపువందమునను।
వామశయంబొప్పవరదముద్రన్మించఁబంచతన్మాత్రనుమాంచితాంబ।
కంబులల్లనటన్నకరణినిబుద్ధియూర్ధ్వమననభయముద్రదక్షిణశయ।
మెదమకుడియఱచేతులనడరుచుండు। చిటికెనబొటనవ్రేళులుచెప్పనాత్మ।
గుప్తనామంబుసాంఖ్యవర్ణాప్తిఁబొల్చె। గౌరితనుమధ్యయురుదీపకళికవోలె॥ ౧౭౫॥

గౌరీవృత్తము॥ కనుమిదెనలినీ - కటాక్షంబులం। దనువలరెదర - య్యబ్జాక్షేక్షణాం।
గనలుగనుకమా - కడన్వారినె। త్తుననునిలుపవెయిం - పుగంగౌరిరో॥ ౧౭౬॥

కం॥ గౌరియొఱుపుపసుపుదెలుపు। నైరాజిల్లుటఁద్రిశక్తులైక్యముఁగనుటన్।
జేరికనెఱుపెయవుటశివ। గౌరిసపల్లవసుబిల్వగౌరవముఁగనెన్॥ ౧౭౭॥

కం॥ శ్రీదయితుఁడనియెనుమతోఁ। గాఁదగుదువుబిల్వమంతఁగాంతునిఁగాంత।
మ్మాదరిశివయోగముస। మ్మోదమ్ముగఁగాంచిమేముప్రొక్కెదమమ్మా॥ ౧౭౮॥

మ॥ అన నారాయణిగౌరిబిల్వము పుడున్ హర్షంబునన్నాకునీ।
వానరందోడయియుండఁగావలయు విష్ణూ సత్యనారాయణుం।
డను పేరన్దనుమధ్యసత్యనుగ ణాఖ్యాద్యాంత్యవర్ణాళినా।
వనజాక్షుండనె వల్లెయంచుని పుడు న్భాసిల్లు నచ్చోటనే॥ ౧౪౯॥

వెండి॥ ప్రప్రథమంబునం బల్లవశ్రీలను బల్లవశ్రీలను బరఁగనునిచి-పతిహితగా।
సౌకుమార్యముఁ బత్రసౌకుమార్యంబున జాణతనంబున జతనుపఱిచి-సాధ్వియగా।
చిటులుగందపుఁబోడి చెల్వొందు పూవులవలపున వలపును వలను పఱిచి-భవనుతగా।
సంసారఫలలక్ష్మి సవరించుకుచరుచి సంసారఫలలక్ష్మి జానుపఱిచి-శంకరిగా।
నంకుశంబును ముండులనండఁగొలిపి । పాశమును గొమ్మలందును బాఁదుకొలిపి।
చంద్రమౌళియి దేయనఁ జంద్రమౌళి । శ్రీకుజంబయ్యె శివప్రియ శివప్రియముగ॥ ౧౫౦॥

శా॥ నేమంబొప్పఁగ మున్ను వెన్నుఁడొకకంటిం బెట్టి పూజించుటన్।
శ్రీమంతుండయి చక్రియై వెలసె నా శ్రీకంఠునర్చింతునం।
చామారేడుని జేతుణక్షణము పత్రౌఘంబు గల్పింపఁగాఁ।
దామయ్యాకుల నేలరాల్చు భువియందన్మాత్రియంచెంచుచున్॥ ౧౫౧॥

మ॥ అటులేగం బహుకాలమచ్చట శివుండావిర్భవించెన్మహా।
పటుభక్తిం బ్రియ నేయు పూజకు స్వయంవ్యక్తోరులింగాకృతిన్।
బటిమం బెంతనవచ్చు బిల్వమునకున్ వ్యాధుండు వ్యాఘ్రూర్భటిన్।
జటులుండై మును వైవ బిల్వదళముల్ సాక్షాత్కృతిం జెందఁడే॥ ౧౫౨॥

బంగారము.

సత్ప్రకాండసవేద్యసత్ప్రకాండస్థితివిగ్రహాకృతిగ నావిర్భవింపఁ-బ్రీతిఁ గాంతు।
స్కంధశాఖాంచిత సౌభాగ్య మొగి బాహుసౌందర్యమగుచు సాక్షాత్కరింప-సన్నుతింతు।
విలసితకిసలయవిభ్రమం బంగప్రభాభాసురంబు గం బరిణమింపఁ-బ్రస్తుతింతు।
స్వర్ణవర్ణోదీర్ణ సత్ఫలరుచికుచశ్రీగ బాగుగను మూర్తిభవింప-శ్రీగనెంతుఁ।
త్రిదళము త్రిలోచనంబుగఁ దేజరిల్ల-ధీస్మరింతుఁ।
గంటకాళియె ఘనసృణిగను ఘటిల్లఁ-గడుఁదలంతుఁ।
బ్రసవలుబ్ధాళిపాళి పాశసమ చెల్లఁ-బసగణింతు।
బిల్వమే శివగానయ్యె విస్తరిల్ల-విశ్వసింతు॥ ౧౫౩॥

విద్యున్మాలావృత్తము॥ ఆరామారత్నంబంతన్ శ్రీ । హీరాలోకంబందెన్విద్యు।
న్మాలారోచింగాంచెంగానన్ । గౌరీనామంబొందెంబొందెన్ ॥ ౧౫౪॥

---

వెండిలక్షణము. ఆటబోటి॥ వరుసఁగూడ నాల్గు బంగారు పాదముల్-పైనెసంగ।
నలరఁదేటగీతియాట వెలఁది-యదగు వెండి।
సీస పాదములును జెలఁగ నాల్గాపయిఁ-జేరినన।
య్యాటబోటి దేఁటిదేఁటిబోటి-యగును వెండి॥

చ॥ కనుఁగొనెన్మ్రోలనాలలనగారవమారఁగనిర్గుణాంగమున్।
ఘనసుగుణానుషంగమునుగామితసత్ఫలదానచంగమున్।
జనవినుతప్రసంగమును శైవషడక్షరమంత్రలింగమున్।
వనజజవిష్ణుసంగమును భర్గవరాంగముబిల్వలింగమున్॥ ౧౭౫॥

సీ॥ ఆనాభియధరాంగమఁ దరించుటను సృష్టిబ్రహ్మ పీఠంబుగం బరిణమింప।
నా[illegible]శమధ్యాంగము లరించుటను స్థితిఁ బానవట్టము విష్ణువై నెలకొన।
నాచూడముగ నుత్తమాంగంబు జ్ఞానాప్తిలయత శివలింగమయి యెసంగఁ।
ప్రకృతియెపన్నగభావంబు వహియించి బహుముఖంబులతోడ బలసి కొలువ।
యోగులిట్లుందురని తెల్ప యోగమూని । బిల్వవనమునఁ గూర్చున్న బిల్వనాథుఁ।
డా సదాశివుఁడే యనన మరునల్ల । బిల్వనాథాఖ్యలింగంబుఁ బ్రీతిఁ గొలుతు॥ ౧౭౬॥

చ॥ కనుఁగొనిఁ గౌరి బిల్వముగ క్ష్మాస్థలిఁ దాఁ బొడముం గ శంకరుం।
డనువుగ లింగరూపుఁడయి యంచితుఁ డాటను స్వీయపత్రపూ।
జనమున బిల్వనాథుఁడని చక్కఁగఁ బేరిడెఁ బేరిడెం గనం।
గనదియె బిల్వమాలికగఁ గ్రాలెను ద్ర్యక్షరయుక్ప దేడ్యమై॥ ౧౭౭॥

చ॥ శరణు శరణ్య శంకర ప్రశాంత గిరీశ మహేశ్రీశ్వరా।
శరణు హరాఖ్య సర్వద సుశర్వ పినాకి కపర్ది శ్రీకరా।
శరణు వృషాశ్వయీశ్వర వృషస్థ వృషేశ వృషేడ్య శ్రీధరా।
శరణు వృషాంక శాశ్వత ప్రశస్త శివేశ శివేశ శ్రీవరా॥ ౧౭౮॥

లలితపదవృత్తము.

అనుచిటు గౌరిమ-హాముదమారన్ । బనివడి మారెడు-పత్రములౌనా।
మనుపులు మాటిని-మానుగఁ బూనెన్ । వినుతియొనర్చెను-బిల్వవనేశున్॥ ౧౭౯॥

బ్రహ్మవృత్తము.

ఓన్నమశ్శంభవే। యన్నమంత్రంబుతో। నిన్నుఁగొల్తున్ శివా। నన్నుఁ బ్రోవంగదే॥ ౧౮౦॥

నారాయణవృత్తము.

ఓన్నమో బిల్వేశ్వరాయ । యన్నమంత్రంబూని పూని।
నిన్ను నిత్యం బెన్నుచున్న । నన్నుఁ బ్రోవన్ రావె శ్రీశ॥ ౧౮౧॥

శివవృత్తము.

ఓన్నమశ్శివాయ।యన్నమంత్రమూని।నిన్ను నెన్నుచున్న।నన్నుఁ బ్రోవు శ్రీశ॥ ౧౮౨॥

అమృతవాహినీవృత్తము॥ ఓన్నమో బిల్వనాథాయ । యన్నమంత్రంబునన్నినున్।
సన్నుతించుచున్నాను । నన్నుఁ బ్రోవవె శ్రీశ్వర॥ ౧౮౩॥

---

అమృతవాహినీవృత్తము॥ పంచమంబు లఘుత్వంబుం । గాంచుం గురుత షష్ఠమున్।
గాంచ నన్నింట యుగ్మాంఘ్రిన్ । మించు లాఘవమేడిటన్॥
,, ప్రాస మొక్కండె యిందుండున్ । భానురామృతవాహినిన్।
వాసిగా బిల్వనాథుండే । యీను పద్యంబుఁ జూపెడున్॥

## సింహావలోకన చతుర్దళ పద్మబంధము.

కం॥ శ్రీరామా జితమారా । శ్రీరామా కాలకాల శ్రీలకమాలా।
శ్రీలా శ్రీలా శ్రీకర । మారా శ్రీకర జితకలమాలా శ్రీశ్రీ॥ ౧౯౪॥

మాకందము॥ ఓంకృతిబిల్వవనేశా । యోంకృతిబిల్వార్చితనతు-లానరింతున్।
ఓంకారాకారేశా । యోంకారార్థైకగమ్య-యోశ్రీశా॥ ౧౯౫॥

రమాకందము॥ మునుగంగభంగినేనున్ । ఘనతంగనఁగోరఁగమ్మనవే।
ననుబిల్వముగనుచన్మహి । మనివుడు నేఁగంటిబిల్వమహిజమనై॥ ౧౯౬॥

మహాకందము॥ అనుభవమెఱుఁగమినవుడీ । వనిననుదినిఁగొనకయుఱకయశ్లైలతిన్।
కనుఁగొంటిఁదత్ఫలమునీ । మానినిననునింకనైనమైకొనవే॥ ౧౯౭॥

కం॥ ఐతింగాళిగగౌరిగ । నైతిరమగవాణిగమఱియైతినిబిల్వన్।
బ్రీతిన్నిప్రకృతిన్నను । నీతోఁగూర్చుకొనుసరగనిరుపమపురుషా॥ ౧౯౮॥

సీ॥ నినుమానినిమిషమేనియునిల్వలేననఁబ్రబ్బునుబ్బఱననుభవవిరోధ।
మిఁకనిన్నుఁబాయనేనెుకనిమేషంబనన్సామర్థ్యగర్వంబుసంఘటిల్లు।
నాప్రియుండవునీవెనాగణికోక్తియానిత్యగృహస్థవినింద్యముగద।
నన్నుఁబాయుటనీకున్యాయంబుగాదనఁగానుధార్మికతాభిమానమాను।
గైకొనన్వలెనాఁగనాజ్ఞయగునన్నుఁ । జేకొనుమనంగనుపసర్పణాకరము వు।
నెలమిఁగనుమనఁబరిహాసకలనఁదోచు । నేలుమనవిందెయెఱుఁగనింకెదియుఁబలుక॥

మ॥ అనుచర్పించిదృగంబుజస్రజముప్రోయన్స్వెమ్మలై వాద్యముల్ ।
ఘనబిల్వేశ్వరలింగముంగడిమిఁజిక్కంగాఁగిటన్నెక్కిచా।
క్కనుగౌరీలలనాలలామకమటంగీర్తింపనచ్ఛాత్తిన।
ట్లనువారెంబులకల్మదశ్రువులునైక్యానందముందెల్పఁగన్॥ ౨౦౦॥

కం॥ ఆలింగమునాలాగున । నాలింగనమాచరింపనాలింగనిప్ర।
త్యాలింగనమొనరింపనె । యాలింగమునుండివెడలెనహాహారుఁడున్॥ ౨౦౧॥

సీ॥ వెలిమబ్బుజిగిడబ్బువెలిద్రొబ్బుచునుగెబ్బుమినమినలాడెడుమేనితోడ।
నెఱసంజపసయంజమఱికెంజనగుకెంజడలఁగ్రాలుపగడాలడాలుతోడఁ।
గఱితుమ్మెదలదిమ్మునెఱపిమ్ముగనుగ్రమ్ముకొనుచాయమెఱనెడుగొంతుతోడ।
బలుదెల్పులలినల్పుఁబసపొల్పులనుదెల్పుమువ్వన్నెమెగముతోల్వానితోడ।
మూడుసత్తులురంగులముత్తెఱఁగుల । నలరముమ్మూర్తులునుదనవలనఁగలిగి।
చెలఁగితనయందుఁగలయుటఁదెలుపుననఁగ । బిల్వనాడుండుముక్కంటివేడ్కఁబొలిచె॥

---

రమాకందము॥

ఈ మనురమాకందమున సమస్తకవులరసి-సరియనఁగన్॥
మహాకందము॥ పాదాదిగురువులఘువని । భేదములేకరసిచెప్ప-వినుతముగున్।
శ్రీదయితమహాకందము । గుదురుటనార్యవలెసకల-గుణములచేన్॥

కం॥ ఈరీతిఁబొడమిమ్మృడుఁడా । గౌరింగౌఁగిటను జేర్చెఁగదియఁగనైక్యం।
బైరంజిలననఁదద్వ్యో । గారంభమినగ్రహణమునట్లగపడియెన్॥ ౨౦౩॥

శా॥ కానందచ్ఛివయోగమర్కవిధుయోగంబంచుఁదారెంచియే।
సానందుల్వనరింత్రుసల్క్రియలమర్త్యామర్త్యులున్మానుల।
త్యానందాంబుధిఁదచ్ఛివుల్మునిఁగిరాష్ట్రాలాపమంత్రావళిన్।
జానందంజపియించిరిచ్ఛిరియభీష్టంబుల్మిథస్స్పృష్టిగాన్॥ ౨౦౪॥

మ॥ అని మేషత్వమువ్యర్థమయ్యెఁగదయయ్యానందబాష్పంబులన్।
ఘనహర్షాంచితపారవశ్యమునఁజొక్కంగన్విని ద్రత్వమున్।
గనన స్వేదతరోమహర్షణమునన్గాఢాంకపాళీకృలే।
హనహాయాత్మచతుర్భుజత్వమెటువారామోదముంజెందిరో॥ ౨౦౫॥

కం॥ అయ్యైనపర్ణసపర్ణగ । నయ్యెడఁదాబిల్వమగుటనాస్థాణువాతా।
నయ్యుగుళులఁబూజితుఁడై । యొయ్యనబిల్వనగమనఁగనెనరెముదమునన్॥ ౨౦౬॥

రుచిర॥ శివుండనైన్శివయిట-శ్రీగనైతివీ । వవున్ననుంబొనరిచి-లౌరశ్రీశ్వరున్।
దవుంగదాసరివర-ధర్మమైనఁవ । ద్ధవుండుసన్నుతుఁడవు-ధార్మికుండనన్॥ ౨౦౭॥

ఉ॥ గౌయనవాణిశ్రీదగుప్రకాండరుచింగనిశ్రీపదేవ్యయా।
రీయనలక్ష్మిశ్రీఫలపరిష్కరుచింగనిశ్రీపబాధ్యయా।
నీయెడనీవుశ్రీకిసలయేడ్యరుచింగనిశ్రీవెయాటగా।
రీయవుదీవెశ్రీయనఁగశ్రీదళశ్రీఫలశ్రీప్రకాండనై॥ ౨౦౮॥

ఉ॥ గౌరియనంగఁదెల్లనిదిగావునగౌరియనంగవాణియా।
గౌరియనంగఁబచ్చనిదిగావునగౌరియనంగలక్ష్మియా।
గౌరియనంగనెఱ్ఱనిదిగావునగౌరియనంగనార్యయా।
గౌరియనంగఁద్ర్యర్థమగుఁగావునగౌరిరొబిల్వమైరివా॥ ౨౦౯॥

ఆ-వె॥ పసుపునున్నమెనయఁబారాణియగునట్లు । సిరియునల్వచెల్వచేరనిట్లు।
కుంకుమాభయగుచుఁగొఱలెదవనినిన్నుఁ । గాంయనుద్యదరుణకాంతిగౌరి॥ ౨౧౦॥

గౌరీ॥ ఒనరెదుకనక-ద్యుతింగౌరినీ । వనలరుచినిమిం-చనన్మించెదా।
దినకరనవకాం-తినాత్మప్రభం । బ్రణుతవయిలిపీ-వడింగూడవే॥ ౨౧౧॥

## కందపద్య తనుమధ్యావృత్త గర్భ ప్రియకాంతావృత్తము.

తపమునుజాలంజలిపిగి-తన్వీతనువయ్యెన్ । విపులనుబిల్వాటవినిట-వెన్వెంటనునడ్మన్।
విపులముగానీకిపుడవు-విన్వృత్తముపేరే।నపరిమితశ్రీకృపఁగను-మన్వాఁప్రియకాంతా॥

### గర్భకందము.

తపమునుజాలంజలిపిలి । విపులనుబిల్వాటవినిటవిపులముగానీ।
కిపుడవునపరిమితశ్రీ । కృపఁగనుశ్రీకృపఁగనునపరిమితశ్రీశ్రీ॥ ౨౧౩॥

### గర్భతనుమధ్యావృత్తము.

తన్వీతనువయ్యెన్ । వెన్వెంటనునడ్మన్ । విన్వృత్తము పేరే । మన్వాఁప్రియకాంతా॥

### తనుమధ్యావృత్తము.

శ్రీవాక్తనుమధ్యల్ । నీవల్లనుగల్గెన్ । శ్రీవాద్యవుగావే । దేవీతనుమధ్యా॥ ౨౧౫॥

కం॥ తనుమధ్యయనుటకర్థము । లనువవుఁబదునైదువందలాఱుఁటునిటవా।
కొనఁదడవాశంకరయతి । గనయిపలుకువాఁడబుధులుగనికడుఁబొగడన్॥ ౨౧౬॥

కం॥ మున్నాటజువదియర్థము । లన్నీనూపురమణియిదెరత్నాయనుఁడ।
న్నన్నతిఁగనిసాంఖ్యాప్తిం । బన్నగఁదెలిపెడుఁద్వదీయభక్తియెసంగన్॥ ౨౧౭॥

కం॥ అంకములుపదియెయవుటశి । వంకరియిటనర్థములనుబదిఁటిఁదెలిపెదన్।
శంకరియైదుపదిగనీ । కింకరులెంచికొనవినవెకృతిఁదనుమధ్యా॥ ౨౧౮॥

### తనుమధ్యా శబ్ద నిర్వచన కంద దశకము.

౧॥ తనుమధ్యయనఁగసహజము । గనుస్త్రీయగునక్షరంబులైవడినీవా।
దినిగలిగినస్త్రీవగుటం । జనునీకిపేరుపిదపసతులకునెల్లన్॥ ౨౧౯॥

౨॥ తనువననెడలామధ్యము । ననుండుజీవుండతండనందనుమధ్యం।
డనఁబడుఁదద్రూపవవుటఁ । దనుమధ్యయనంగనీవుదనరెదుగౌరీ॥ ౨౨౦॥

౩॥ తనువుననుండెడుదేవుని । ఘనశక్తిత్రయమునీవెకావునబిల్వా।
తనుమధ్యయనెడినామము । లనువవుజ్ఞానక్రియేచ్ఛలవుదువుగాదే॥ ౨౨౧॥

౪॥ తనుమధ్యాస్థానీస్థితి । దనరుటనీకయ్యెనభిధతనుమధ్యయనన్।
గనియెదరుమహాయోగులు । గనియెదరానందముగడుఁగడలుకొనంగన్॥ ౨౨౨॥

౫॥ తనువవునుద్రిత్వబోధక । మనువందఁగనర్థయుక్తినగుఁగదస్థూలం।
బునుసూక్ష్మంబునుగారణ । మనఁదనువులుమూడుబిల్వమవుతనుమధ్యా॥ ౨౨౩॥

౬॥ తనువనఁదత్త్వత్రయమగుఁ । గనుఁగొనఁజిదచిన్మహేశకలనమదిగదా।
యనువొందెదునీమధ్యం । బునఁదనుమధ్యాఖ్యదానఁబొసఁగెడునీకున్॥ ౨౨౪॥

౭॥ తనువనఁబ్రత్యాహారం । బుననాజునుసున్నయనగుఁబొందుగమధ్యా।
యననటులొక్కటియైదోఁ । దనుమధ్యయనంగసంఖ్యతద్రూపవుగా॥ ౨౨౫॥

౮॥ తనుమధ్యయనఁగనగుఁగద । ఘనముగగాయత్రివర్ణకలనమునఁబరా।
ఖ్యనుబ్రత్యాహారంబునఁ । గనఁదచ్ఛందస్థవృత్తకలితాభిఖ్యన్॥ ౨౨౬॥

౯॥ ప్రణవముశక్తియుఁగూడుట । మునుకొనినీపేరనుప్పముఖ్యార్థంబా।
దినివర్ణక్రమమునుమ । ధ్యనుమాయయటంచుఁదెలియనవుఁదనుమధ్యా॥ ౨౨౭॥

౧౦॥ తనువనమూడగుమధ్యం । బననొకఁడగునంకగతినహాపమమూడౌఁ।
గనుకబ్రణవంబవుందా । నిందెలుపుఁద్వదాఖ్యయాదినినెతనుమధ్యా॥ ౨౨౮॥

కం॥ దశనప్రాసములివియా । దశనప్రాసములుదత్త్వదర్శిన్నృహరికీ।
దశకమునసొంనమోయని । దశాంగుళమునేయనిష్టదముతనుమధ్యా॥ ౨౨౯॥

## తనుమధ్యా తత్త్వ కంద దశకము.

౧॥ కనసర్వముసంఖ్యాత్మక । మనఁజనునీపేరెసంఖ్యయఖిలంబునగుట్।
గనుకనుసర్వేశ్వరివీ । వెనయుటసర్వేశ్వరుండనేఁదనుమధ్యా॥ ౨౩౦॥

౨॥ తనువనుచోనున్ననుమా । ననుబరప్రాసాదముస్ఫురణమగున్మధ్యా।
యనఁగంబంచదశాక్షరి । యనుసామాన్యమెత్వదాఖ్యయనుదనుమధ్యా॥ ౨౩౧॥

౩॥ తనువనఁబ్రాసాదముగద । కనుఁగొనమధ్యాపదమునఁగనుపట్టెడునెం।
డునునేఁబదియక్షరములు । గనుకనుగురుమూర్తివీవెకదతనుమధ్యా॥ ౨౩౨॥

౪॥ తనువనబాలసరస్వతి । గనుమధ్యయనంగలక్ష్మిగానగుయోగం।
బునఁదనుమధ్యయనన్నీ । వౌనరెండుబిల్వాంబయనఁగనౌతనుమధ్యా॥ ౨౩౩॥

౫॥ తనువనవాచ్యముమధ్యం । బనవాచకమవునువానికవుసంబంధం।
బనువవుఁదనుమధ్యయనం । గనునీవఖిలంబునగుదుగదతనుమధ్యా॥ ౨౩౪॥

౬॥ ఎఱుఁగనొకటినగువిప్రుఁడు । మఱిరెంటినియోగిమాటమనుజుఁడునల్వట్।
గఱివేల్పన్గఆకంఠుని । నెఱిఁగెడునాల్గిటనునిన్నెహితతనుమధ్యా॥ ౨౩౫॥

౭॥ శ్రుతివాక్యమువినరేకో । రితగంజత్వారివాక్పరిమితాయనఁగట్।
మతినిన్నునెఱిఁగినవెవి । ప్రతవిబుధతగలుగుగుహాఁబరఁగుతనుమధ్యా॥ ౨౩౬॥

౮॥ మదిఁదెలియరౌరతపసా । నుదంతుమాయాయనిశ్రుతినుడువుచునుద్విజుల్।
వదములయాద్యక్షరములు । గదియన్మధ్యాప్తినీవెకదతనుమధ్యా॥ ౨౩౭॥

౯॥ తపమొనరించునుతించుము । నుపరుఁడవగుముమఱిసమననుఁడవునుధ్యానిం।
చుచుమర్థంబులాదవునని । కృపనీనామంబెతెలుచుఁగృతితనుమధ్యా॥ ౨౩౮॥

౧౦॥ తనుమధ్యాతనుమధ్యం । బునఁదనరెడునినుఁగొలువకమొగినితరులనే।
రినెకొల్చెడువారలుచే । తనున్నవెన్నఁగనకనెయితడవెడువారల్॥ ౨౩౯॥

కం॥ ఇదియవుఁదనుమధ్యాత । త్త్వదశకముద్దానిఁజదువఁదాత్త్వికులైనిట్।
వదలకకొలుతురునరులల । రెదరిష్టార్థములుపొరిఁబొరిన్సిద్ధింపన్॥ ౨౪౦॥

సీ॥తనుమధ్యయనిపిల్వఁదనచెల్వఁజెల్వుగానను చుకాఁడేఁడేనిగనుముదమును।
దనుమధ్యయనిచెల్వుఁడనువొందఁబిల్వంగఱాఁగయేనత్యను రాగముఁగనుఁ।
దనుమధ్యయనెడివృత్తముఁగనఛందముగాయత్రియనిపిల్లకాయయెఱుఁగుఁ।
దనుమధ్యయనసెకదైవతమనియెన్నగోలయేనగుఁగవికోటిమేటి।
కుజనుఁడేనియుఁదనుమధ్యకొల్వనిన్నుఁ । గన్నమందతడిందంగఁగవియొగురుఁడొ।
బుధుఁడొమంగళపదుఁడొయీభువనమునను।రాజొగ్రహరాజొసురరాజొకాఁజెలంగు॥

సీ॥ నీవల్ల నేక దా నెగడుబలారాతిత్రిభువనేశ్వరుఁడయిత్రిదివపతిగ।
నీవల్ల నేక దా తా వెలయనుబమ్మశ్రీశుఁడైసత్యలోకేశ్వరుఁడుగ।
నీవల్ల నేకదాయా వెన్నుఁడలరారునాలకాపరిశ్రీశుఁడయినృహరిగ।
నీవల్ల నేకదా నేనుగపాలిని శ్రీశుఁడనైతినిచ్చోశివుఁడుగ।

వేయు నేటికి నీవల్ల విశ్వమెల్లఁ । గలుగు వెలయును బొలియును గాన నీవె।
విశ్వనాయిక వేను విశ్వేశ్వరుండ । బిల్వమే విశ్వమగుఁగాదె బిల్వమాత॥ ౨౪౨

## బిల్వపత్రికా కంద ద్వాదశకము.

౧॥ బిల్వము విశ్వంబగుటనె । బిల్వ మొకటి నిడుట నాకు విశ్వమిడుటయా।
బిల్వదళములిడితె న్నొ । బిల్వద్రుమమగుచు నిన్నుఁ బేర్కొనఁదరమే॥ ౨౪౩॥

౨॥ బిల్వము నీతనువవుటం । బిల్వాంబయనంబరఁగెదు బిల్వదళములన్।
నల్వగ ననుఁబూజించుట । బిల్వదళాంబయను పేర వెలనెదవిందున్॥ ౨౪౪॥

౩॥ గౌరియుఁదను మధ్యయునను । పేరులు త్ర్యర్థకములగుచు బిల్వదళములో।
నారు చిరములగుటను బి । ల్వారాజిలు బిల్వపత్రికాఖ్యయు నీకున్॥ ౨౪౫॥

౪॥ కనవే విల్వేశ్వరినీ । వినుతాంగములగుట నేను బ్రియమున నెపుడున్।
ఘనబిల్వదళంబుల నే । మునుకొని పహాయింతుఁగుసుమములు నాకేలా॥ ౨౪౬॥

౫॥ కాంచవె బిల్వము మహిమను । గాంచుఁగ పర్ద్వోపరిస్థ ఘన గౌరవమొ।
క్కించుక యనకు ముత్వన్మ। ద్రాంచిత గిస బిల్వమైన యదిగను గంగన్॥ ౨౪౭॥

౬॥ తనువె చ్ఛాపైఁదలయె । చ్ఛనవచ్ఛుం గంగ యెచ్ఛయాపై నుంటన్।
ఘన బిల్వదళమె హెచ్చది । కనుంగొనం బిల్వపత్రికానీ వెకదా॥ ౨౪౮॥

౭॥ నే నేస్థాణువమారెడు । మ్రానను నీవాక పొదుమా బిల్వదళా।
పూనెదపర్ణాభిఖ్యను । స్థాణువ వీవై తె బిల్వదళ సత్పూజన్॥ ౨౪౯॥

౮॥ శ్రీమతి శ్రీసూక్తస్థం । బౌమంత్రమునన్నె బిల్వమని తెలుపుఁగదా।
శ్రీమతె శ్రీఫల శ్రీశయుఁ । గామహితము కౌర్మముగడకదుఁ బొగడునినున్॥ ౨౫౦॥

౯॥ కృపఁగను మ బిల్వకేబి । ల్వపత్రికాయని పురాణవర్గ మునుడువున్।
విపులను బిల్వకమే నే । వపువను బ్రాహ్మము బిల్వపత్రిక వీవే॥ ౨౫౧॥

౧౦॥ నీవొదు వాచకము వి । ల్వావస్తువ నేను గానఁబరఁగె వస్థాణు।
త్వావాప్తి బిల్వనాభిగ । నేవిధమున నైన నేమియిట శ్రీవీవే॥ ౨౫౨॥

౧౧॥ జ్ఞానప్రదమును లక్ష్మీ । దానేద్యంబగుట బిల్వతరువవు శ్రీనా।
శ్రీనీవై లిటనన్నున్ । శ్రీనాపనిఁ జేసితీ వె శ్రీతనుమధ్యా॥ ౨౫౩॥

౧౨॥ ఉమ బిల్వపత్రికాయై । నమయని యోమని యువర్ణ నవమణిమయమై।
యమరిన యీమణిహారము। షమఁదాల్చిన జనుఁడు గాంచు సర్వశుభములన్॥ ౨౫౪॥

కం॥ ఈకంద ద్వాదశకము । జోకఁబఠించిన నువిన్నఁ బొప్పదు శుభముల్।
లోకులకు బిల్వపత్రిక । నీకారుణ్యమున నేను నీవాఁడను గా॥ ౨౫౫॥

---

కం॥ ఈక్షేత్రంబున కెపుడును । రక్షకురాలగుటఁ జేసి ప్రాజ్ఞులు మొదటన్।
వీక్షింత్రు గాక కాళిం । ద్రీక్షణ నయ్యేకవల్లి నెంతయు భక్తిన్॥ ౨౫౬॥

కం॥ తనుమధ్యానీ పేరుం । దనయందిమిడించుకొని రతన పుబరణినాఁ।
దన రెడు నీతుష్టిగణే । శునిఁ గొలువన్విఘ్నములడఁగు శుభములు వెలయున్॥ ౨౫౭॥

కం॥ నారాయణరక్షితమై । గౌరవమొందునదిగానఁగడుబత్తిమెయిన్।
గౌరీయాతీర్థంబున । నారముభజియించుసత్యనారాయణునిన్॥ ౨౫౮॥

కం॥ గౌరీమువ్వన్నెలచే । గారవమందితివిగానఁగ్రాలెదునీకా।
సారమునసదానీరం । బారితిన్మనుఁగువారికటువలె శ్రీలున్॥ ౨౫౯॥

కం॥ గౌరీతీర్థమునీయది । సారతరముగంగకంటెసత్యమెయాఁబైఁ।
జేటుగంగాధరుఁడను । సారెకుఁదలఁదాల్తునీదుసరసురసముమా॥ ౨౬౦॥

కం॥ గౌరీతీర్థమవపుటం । గౌరీతీర్థమననిద్ధిఖ్యాతివహించున్।
గౌరిమిమాయయనియిం । దారఁగస్నానంబుసేయనగుశ్రీలెల్లన్॥ ౨౬౧॥

కం॥ నీవిచటనుశ్రీబిల్వం । బైవెలయుటఁద్రిదళిత్రిజయనిమనకెపుడేన్।
శ్రీబిల్వదళార్చనమును । గావించినవారుశ్రీలఁగందురుగౌరీ॥ ౨౬౨॥

కం॥ మీనమునమిత్రుఁడుండం । గానుత్తరఫల్గునినుడుకాంతుండుండం।
గానేఁడుమనముగూడితి । మీనెఱియెపరాపరమనియెంతురుసాంఖ్యుల్। ౨౬౩॥

కం॥ నీవుపరవునేఁబరుఁడను । జూవెమనలసంగతియిటఁజొప్పడెనిష్టే।
కావునఁబరాపరంబిది । యీవాసరమువుతశివమభీష్టమవనికిన్॥ ౨౬౪॥

కం॥ ద్వైతాద్వైతవిశిష్టా । ద్వైతంబులనేదియింపుదయితానీకున్।
ద్వైతాద్వైతవిశిష్టా । ద్వైతంబులనేదియింపుదయితానీకున్॥ ౨౬౫॥

ప్రియకాంతావృత్తము.

శివుఁడనునీవోశివవును-శీలాయహమన్నందవుదుశివోఽహమ్మనుటయె-తానాశివయోగం।
బవుమనకిట్లైపుసుగడు-హర్షంబుఁదలంతేన్దవుదువుకోరన్వరముల-ధన్యాప్రియకాంతా॥

లలితపదవృత్తము.

అనిశివుఁడాడఁగ-నంబికపల్కెన్ । నినుఁగననప్పుడు-నేఁగనినానా।
సనునినుఁగాంచుట-శాంతినిఁగంటిన్ । ననునిఁకఁబాయకు-నాకిదెచాలున్॥ ౨౬౭॥

లలితవృత్తము॥ అనశివుఁ । డనెనిటు । లనువుగఁ । జనవున॥ ౨౬౮॥

కం॥ తిలతండులయోగంబా । యొలయునుమఱిక్షీరనీరయోగంబాస।
ల్లలితహరిద్రాచ్ఛసుధా । కలనంబాయేదియెనయఁగామినికింపా॥ ౨౬౯॥

పంక్తివృత్తము॥ హైమవతీకాం । తామణిపల్కెం । గామికినింపేఁ । గామినికింపా॥ ౨౭౦॥

తే-గీ॥ అనఁగవనదేవతయెఱింగియరుగుదెంచి । కాంచెశివయోగమునువింతగానునూత్న।
బిల్వదళమనఁజెల్వొందుబిల్వనాథ । మిథునమునుబ్రణవంబుగమించుచుండ॥ ౨౭౧॥

ఉ॥ కాంచిప్రదక్షిణించితగగాఢసుభక్తినమస్కరించిపూ।
జించెనుబిల్వపత్రములశ్రీతనుమధ్యనుబిల్వనాథునిన్ ।
బ్రాంచితుఁడైనయాశివువరంబులఁగోరఁదలంచునంతలోఁ।
గొంచకకోరునానదియుఁగోరికలీరికలెత్తనత్తఱిన్॥ ౨౭౨॥

చ॥ వరదమహేశనావలనివత్సలతంబ్రియపత్నినిందుశ్రీ।
తరువునెనర్చితీవువసుధంబ్రభవించితిలింగమూర్తిగన్।
బరఁగుముబిల్వనాథుఁడనఁబార్వతిశ్రీతనుమధ్యబిల్వనాఁ।
బరఁగుతమీరలెప్డునిటవానియెసంగఁగనాకునుండుఁడీ॥ ౨౭౩।

కం॥ ఇదినాపొందినవరమే । కదయిప్పుడువేఱొకండుకాంక్షించెదనిం।
పొదవఁగమీరిటఁజేరుటఁ । బొదలుటనేఁచేఁటఁబెండ్లిపొనరఁగమీకున్॥ ౨౭౪॥

అమృతవాహినీ॥ మీపెండ్లిఁజూతురెవ్వార । లీపట్టుననువారికిన్।
వేపెండ్లికావలెన్దేవ । శ్రీపతీవరమీయవే॥ ౨౭౫॥

,, చేరకుండినవెట్లనిన్ । బూరుషుల్స్త్రీలువెచ్చెరన్।
జేరుకోవలయున్నీదా । చేరికంగాంచమీవలెన్॥ ౨౭౬॥

కం॥ శ్రీపతివైతీయెడనీ । ప్రాపొందినవారలిలసభార్యులెకారే।
యీపట్టునందభార్యులు । చూపట్టరుగాకనేఁటినుతమీపూజన్॥ ౨౭౭॥

చ॥ అనశివుఁడట్లెయౌననియెనప్పడెబ్రహ్మగబ్రహ్మయయ్యెనె।
య్యనువుననాత్రివిక్రముఁడునయ్యెనుదానుద్రివిక్రముండుగాఁ।
బనివడివాసవుండుగనువాసవుఁడేమిటజాగుదేవత।
ల్మనులనుగూడివేడుకగఁబూనిరిచేయఁగఁబెండ్లగొండ్లిగన్॥ ౨౭౮॥

తే-గీ॥ అప్పడప్పట్టునంజనుల్హర్షమునను । గట్టిరొకపట్టణంబునుగడుఁగడఁకను।
విశ్వకర్మయెయాచార్యవిశ్రుతుఁడట । నయ్యెగౌరీపురియనంగనదిఘనంబు॥ ౨౭౯॥

సీ॥ సత్యలోకముమానిచతురాననుండిందునలువలంకులఁగనియలరుచుండు।
వైకుంఠభువనంబువదలివిష్ణుండిటసర్వగుండయికాంచిసంతసించుఁ।
గైలాసమునుబాసికనిదినిఁబంచాస్యుఁడిచటలింగమయయ్యెనెలమిబలిమి।
నమరావతినిసహస్రాక్షుండువిడిచియీకడఁగనుఁగన్నులకలివుదీఱ।
గౌరితీర్థమయ్యెగౌరియేశ్రీమహే । రుహమునయ్యెనిందురుచిజనింప।
మఱియుగౌరిపురిగవఱలెడునోయని । పాటఁబాడుచాడెనాటవెలఁది॥ ౨౮౦॥

## గౌరీతనుమధ్యోద్వాహము.

కం॥ ఆరాజధానిలోనన్ । రారాజద్వైజయంతరమ్యగృహమునన్।
గౌరీశంకరకల్యా । ణారంభంబయ్యెనప్పడందుఁబురంధ్రుల్॥ ౨౮౧॥

ద్విపద॥ అనువుగాగౌరికల్యాణవైభవమె । యనిపాడిరినుమూఱులడరంగద్విపద॥ ౨౮౨॥

### ౧. కల్యాణగీతము.

గౌరికల్యాణవైభవమే । గౌరికల్యాణవైభవమె ॥ పల్లవి ॥

౧. హిమవంతుకూఁతురై - యింపుసొంపొందె । హిమకరమౌళిని - హితమొందఁబొందె॥
౨. వలఁనిపగవాని - వానికిఁజెలిగ । నలరించెఁబెండ్లిపై - యయ్యెనెచ్చెలిగ॥
౩. కాళికాత్వముపీడఁ - గాగౌరియయ్యె । మౌళిగానిరిపల్కు - మగువలకయ్యె॥

౪. శ్రీరుచికుచయూటు – చేననమించె । మారేడుబ్రూనుగా – మహినిజన్మించె॥
౫. తనక్రిందలింగమై – తనరారుమగనిఁ । దనయాకుపూజలఁ – దనియించెనెగిని॥
౬. బిల్వదళాంబనాఁ – బేరొందెఁదాను । బిల్వనాథునిఁజేసె – విభుబాగుగాను॥
౭. తానుశ్రీతరువయి – తనపతిన్ శ్రీశుఁ । గానెనరించెను – గడఁగిభూతేశు॥
౮. మెఱుపుఁదీఁగయనంగ – మెఱయుచైగౌరి । కఱకంతుసాంధ్యేందుఁ – గంజేసెమూరి॥
౯. తన్నుమధ్యయగుటను – దనుమధ్యయనఁగ । వినుతమైప్రోచును – వినతులమనఁగ॥
౧౦. మ్రొక్కెదమందఱ – మక్కుఅనిందుఁ । జక్కఁగాశివులకు – సత్ఫలమందు॥
౧౧. ఈగౌరికల్యాణ – మీపాటహెచ్చు । శ్రీగౌరియనువాణి – శివుఁడునుఁమెచ్చు॥
౧౨. కవిరత్నకృతమిది – గావుననెల్ల । కవులుగందురుపొందు – కరముల్లనిల్ల॥ ౨౮ ౩॥

కం॥ శ్రీరామాబిల్వాంబా । శ్రీరామాయనుచుమఱియుశ్రీబిల్వేశా।
శ్రీరామారామమునను । జేరితిరనినలుగుపాట స్త్రీల్పాడిరటన్॥ ౨౮ ౪॥

## ౨. నలుగుపాట.

శ్రీరామాబిల్వాంబా । శ్రీరామాబిల్వేశా । శ్రీరామారామమునఁ । జేరితిరేరే శ్రీ ॥ పల్లవి ॥
౧. ఓసిసరస్వతిమాతా । యోసరసీరుహభూతా । మీసొమ్ము విద్యలను । వానిగమాకీరే॥
౨. ఓసిరికాంచనశోభా । యోసరసీరుహనాభా । మీసిరులన్ బారినెమ్మిన్ । భాసిలమాకీరే॥
౩. ఓబిల్వాంబికగౌరీ । యోబిల్వేశ్వరసూరీ । మీబల్యోగముఁగూర్మిన్ । మాబడిఁగానీరే॥
౪. శ్రీగుర్వినీకునతుల్ । శ్రీగురుఁడానీకునతుల్ । యోగక్షేమములనుమేల్ । బాగుగమాకీరే॥
౫. శ్రీవమ్మాతనుమధ్యా । శ్రీవరుఁడాబిల్వపతీ । యీవరగీతమణికిమీ । సేవసదాయీరే॥

తే-గీ॥ ఆయెనానందమానందమాయెననుచుఁ । బాడిరపరిమితానందపారవశ్య।
మొందిసురనరమునివరసుందరులట । మొగినెగడినసుమాళింపుమొలకలనఁగ॥ ౨౮ ౬॥

## ౩. ఆనందగీతము.

ఆనందమానందమాయెను । మన । సీనమ్మ పెండ్లికూఁతురాయెను । మన । సీనయ్య
పెండ్లికొడుకాయెను ॥ సీనమ్మబిల్వాంబ । సీనయ్యబిల్వేశుఁడు ॥ ఆనంద ॥

౧. సీనమ్మశ్రీనివాసయౌఁగదా । మన । సీనయ్యశ్రీనివాసుఁడౌఁగదా।
శ్రీనాఁగమారేడు । శ్రీనివాసులుశివులు ॥ ఆనంద ॥

౨. బిల్వాంబతనుమధ్యయయ్యెను । మన । బిల్వేశుఁడీశుఁడెయయ్యెను।
బిల్వాంబశ్రీయయ్యె । బిల్వేట్టుశ్రీట్టయ్యె ॥ ఆనంద ॥

౩. తనుమధ్యగౌరియెయౌనుగా । మన । తనుమధ్యపతిశివుఁడౌనుగా।
తనుమధ్యమధ్యము । తనుమధ్యమేశుఁడు ॥ ఆనంద ॥

౪. గౌరమ్మజీవుఁడెయౌనన । మన । గౌరీశుఁడేదేవుఁడౌనన।
ఈరత్నమునఁదోఁచి । రౌరౌరయైక్యముగ ॥ ఆనంద ॥

౫. రసికాళికిదిమంచిగీతము । మన । రసికాళికిదిమంచిచూతము।
రసమున్న నెంతౌను । రసికతచూతము ॥ ఆనంద ॥ ౨౮ ౭॥

కం॥ పాడిరి శోభన మేయని । చేడెలు మనువీణియలనఁ జెల్వొంద శ్రుతుల్ ।
పోఁడిగ శోభనగీతము । పాడియిదని మెచ్చరసికవరులస మెచ్చన్॥ ౨౮౮॥

### ౪. శోభనగీతము.

శ్రీతనుమధ్యాంబకును । శ్రీతనుమధ్యేశునకు ।
ఈతఱినే నేతఱినే । నాతనుశోభనమే ॥ శోభనమే ॥ పల్లవి ॥

౧ శివుఁడవు గారవియనఁగన్ । శివయవుఁగా ప్రభయనఁగన్ ।
ప్రవణులు చక్రాకృతిగన్ । దవఁగడుఁబొగడంగన్ ॥ శోభ ॥

౨. చంద్రునివలె శంకరుఁడౌఁ । జంద్రికవలె శంకరియౌ ।
చంద్రమువలె శాంకరమౌఁ । జంద్రకాంతంబౌ ॥ శోభ ॥

౩. బిల్వేశుఁడు శిఖియె యవున్ । బిల్వాంబిక శిఖయె యవున్ ।
బిల్వాటవి కుండమవున్ । బిల్వము శ్రీఫలంబౌ ॥ శోభ ॥

౪. బిల్వాంబిక గౌరియగున్ । బిల్వేశుఁడు శంభుఁడగున్ ।
బిల్వారణ్యము నిధియౌ । బిల్వము రత్నంబౌ ॥ శోభ ॥

౫. ప్రాసాదాక్షరతతి నా । నీసద్గీతము వెలయున్ ।
భూసురమణి కృతియగుటన్ । వాసింగనుఁగాతన్ ॥ శోభ ॥ ౨౮౯॥

---

కం॥ శోభనమే శోభనమే । శ్రీబిల్వేశులకఁటంచుఁ జెలువలొగి మహా ।
శోభనగీతముఁ బాడిరి । శోభనుగని రసికులు పొరిఁ జొక్కన్నిక్కన్॥ ౨౯౦॥

### ౫. మహాశోభనగీతము.

శోభనమే శోభనమే । శ్రీబిల్వేశులకు శోభనమే ॥ పల్లవి ॥

౧. ఈ పెండ్లికూఁతునకు-నీ పెండ్లికొడుకునకుఁ। జూపుఁజూపులనంగ-శోభనమే॥ శోభనమే॥
౨. ఈయాలుమగలకు - నెన్నెన్నొవితముల । సోయగములనేర్పు - శోభనమే ॥
౩. ఈదంపతులను - మోదంబు సంధిల్ల । సూదిదారముఁ జేయు - శోభనమే ॥
౪. ఈభార్యాభర్తల - వైభవమెసఁగంగ । శోభిల్లఁగాఁజేయు - శోభనమే॥
౫. ఈరత్నకృతికిని - ఈరత్నకృతిపతికి । సూరులౌనన మహా - శోభనమే ॥ ౨౯౧॥

---

ద్విపద॥ లాలియందుంచియా - లలనలు శివుల । లాలిపాటనుమించి - లలిఁబాడిరిట్లు॥ ౨౯౨॥

### ౬. లాలిపాట. తొట్లపాట.

లాలి శ్రీతనుమధ్య-లాలి మాయమ్మ । లాలి శ్రీబిల్వేశ-లాలి మాయయ్య ॥ లాలి ॥ పల్లవి॥

౧. బంగారుగొలుసుల-నంగైనదిద్ది । రంగారురత్నాల-రాజిల్లనిద్ది।
పొంగారు పూఁబాన్పు-పొలుపొందనిద్ది । సింగారముల ప్రోవ-సంగ్రాలునిద్ది॥లాలి॥

౨. మరచుట్టుగలదౌట-మానకతానె । వెరవారఁగాముందు-వెన్కాలుంగానె।
పరువడినూగెడు-స్వాంతంబుగానె । స్ఫురియించునీలాలి-శోభనంబానె॥లాలి॥

౩. తనుమధ్యపనుపుము-ద్దనఁదోఁచుమున్న।వినువాఁకదాల్పె యాఁ-గననున్నమన్నఁ।
గనుకనే గౌరమ్మ-కాశ్మీరమన్న । యనువుగానెఱుపయ్యె-నవునెట్లొయన్న॥లాలి॥

౪. బిల్వాంబ తనుమధ్య-బిల్వాంబనంగ । బిల్వేశ్వరుఁడుకీర-విభుఁడౌననంగ।
జెల్వొందుచున్నారు-శివులిందనంగ । శ్రీల్వొందెదరిదెంత-చెన్నొందనంగ॥లాలి॥

౫. అవుగౌరితమ్మితూఁ-డౌనాఁగనుండు । భవుఁడు రాయంచనాఁ-బరఁగుంగనుండు।
శివగంగభంగిని-శ్రీఁగాంచుచుండు । శివుఁడు పాల్కడలినా-నెరిమించుచుండు॥లాలి॥

౬. శివగౌరియమృతమై-చెన్నొందుచుండు । శివుఁడు పూర్ణేందుఁడై-శ్రీమించుచుండు।
కవిరత్నమునన్నిట్టు-కన్పట్టనుండుఁ । గవిరత్నగీతమూఁ-గాదేవినుండు॥లాలి॥ ౨౯ ౩॥

---

తేఁటి॥ పూలబంతులాడెదరు స్త్రీపూరుషులని - పోలునుగా।
శివులఁజూచుచునిటు పాడిరువిదలలరఁ - దవునుగదా।
తేఁటులిట్లుండునని తెల్పు తెలిఁగుదోఁప - దివ్యముగా।
రసికులల్లైరనఁగగీతరసముఁగ్రోలఁ - గ్రాలుగఁదా॥ ౨౯ ౪॥

౭. పూలబంతులాటపాట.

పూలబంతు - లాడెదరీ స్త్రీ - పూరుషులిటఁబోరిఁ - బోలుపలరన్ ॥ పల్లవి ॥

౧. శ్రీలెసఁగన్ - ధృతిపొసఁగన్ । జాలమేలు - లీలఁజేయఁగఁ ॥ బూలబంతు ॥
౨. చూడఁదగున్ - జూపులగున్ । చేడెలార - యాడు తేంట్లనఁ ॥ బూల ॥
౩. కంకణముల్ - పొంకముగాఁ । గింకిణులులియఁగఁ - బింకము వెలయఁగఁ ॥ బూల ॥
౪. ననలిలరా - లనెగిసరా । లనుగలవియఁజే - లలుజీరాడఁగఁ ॥ బూల ॥
౫. అంచలాగిన్ - మించిమెగిన్ । పంచనెగిరి - వ్రాలులీలఁ ॥ బూల ॥
౬. చెలువలరం - జెలువలరం । జిలఁజేయుచులలిఁ - జెలిమినిఁదెలుపుచుఁ ॥ బూల ॥
౭. బిల్వసతీ - బిల్వపతీ । చెల్వుగఁగూడెద - నల్వుగనిటులనఁ ॥ బూల ॥
౮. శివుఁడవుఁగా - కవిమణిగా । శివయవునినమణి - చెలువునఁదగుఁగద ॥ పూల ॥
౯. పదిటనుగా - పదిలముగాఁ । గదిరెడుఁబాడఁగఁ - గవిమణికృతియిది ॥ పూల ॥

---

కం॥ ఆయెడసుధాకరాస్యలు । మాయనికూరిమినిఁగూరిమంగళమవుశ్రీ।
శాయనిమంగళగీతము । నోయనఁబాడిరిరసికులకుత్సవమెసఁగన్॥ ౨౯ ౬॥

౮. మంగళగీతము.

మంగళమవుశ్రీశా । నీకువిజయమంగళమవుశ్రీశా ॥ పల్లవి ॥
మంగళమాశ్రీకిసర్వ । మంగళకునునీకునుశుభ ॥ మంగళమవుశ్రీశా ॥

౧. అంగజమదభంగహృతము - తంగజగజపుంగవదయ।
పుంగవహయభృంగసరుచి - సంగతగళతుంగవిజయ ॥ మంగళమవు ॥

౨. ధృతకురంగధృతకురంగ - యుతవరాంగనుగుణచంగ।
క్షితిశతాంగశ్రుతితురంగ - హితభుజంగమాంగదజయ ॥ మంగళమవు ॥

౩. శృంగారితవామాంగశి - వాంగమహితగంగాధర।
భృంగిడితలింగాకృతి - భంగురభవభంగకశుభ ॥ మంగళమవుశ్రీశా ॥

౪. అంగీకృతబిల్వపురా - భ్యంగణగతబిల్వేశ్వర।
సంగీతప్రియతాండవ - రంగసాధుసంగనిత్య ॥ మంగళమవుశ్రీశా ॥

౫. మంగళభవమంగళగృహ - మంగళధవమంగళనుత।
మంగళకరమంగళమణి - మంగళకృతిమంగళహిత ॥ మంగళమవు ॥ ౨౯౭॥

తోటకవృత్తము.

అనిపాటలుపాడఁగ - నాలలనల్ । మునులుంగడుఁజొక్కఁగ - మ్రొక్కిసురల్।
జనులెల్లనుబెల్లుగ - సంతసమున్ । గనిమెచ్చఁగనిచ్చఁగఁ - గాంచనిరుల్॥ ౨౯౮॥

మహాస్రగ్ధరావృత్తము.

పరఁగెన్బిల్వేశహస్తా - ర్పవ్యహుతవహాముఖ - ప్రాహుతిప్రీతసర్వా।
మరసంఘంబన్నపానాం - బరకనకమణీ - మాల్యగంధాప్తధాత్రీ।
సురవారంబీద్యనాట్య - స్ఫురదురుగణికా - సూత్రముద్వేలతూర్య।
స్ఫురితంబానందకందం - బుగఁబరిణయమిం - పుంబొరిన్సొంపునింపన్॥ ౨౯౯॥

కం॥ పాడిరితుంబురునారదు । లాడిరిరంభోర్వసులుమహానందమునన్।
గోడిగమూడెన్భృంగియుఁ । గూడిరిసురలిచ్చమెచ్చికూడిరిశివులున్॥ ౩౦౦॥

తే-గీ॥ అందుమణిమందిరమునందునలరుపరమ । హంసతూలికాతల్పమునందుశివులు।
జీవదేవైక్యభావంబునెలఁగఁగూడి । రొలసిబిల్వయుబిల్వేశుఁడోంకృతిగను॥ ౩౦౧॥

కం॥ ఈశోభనకథనెఱుఁగఁగ । నాశోభనమెల్లవారికనెనమ్మిథున।
మ్మాశలుసఫలములవుజీ । వేశైక్యముసంఘటిల్లునిదిశివమయమా॥ ౩౦౨॥

సీ॥ బంగారముందిన్నపాదరసముభంగి వెలిసీసమునుదిన్న వెండివలెను।
మంచుగడ్డనుముంచుమంచినీరనఁగనుగ్రముగలసినగండమనఁగఁ।
జక్కెరన్మెక్కినచక్కనిపాలనఁబటికబెల్లముఁగొన్నపానకమనఁ।
గాళిందిలోఁగొన్నగంగతెఱంగుననాపగంగ్రోలినయబ్ధిపగిది।
సంద్రముంద్రావినయగస్త్యుచందమునను । హస్తిసమితినిమ్రింగినహరియనంగ।
గౌరిబిల్వాంబఁదనుమధ్యఁగలపికొనుచు । బిల్వనాథుండుపూర్ణేందుచెల్వుఁగాంచె॥

సీ॥ ఒకయందెపసవెట్టనొకయందెబుసకొట్టజీరయుఁబులితోలుజీరువార।
గలగలల్బ్రసబుసల్గాజులుమురుగులై కనుపట్టసందిటికడెములట్ట।
హైకయేనుఁగుతోలురాకొట్టఁజనుమిట్టఁగమ్మయుఁబాపపోగిమ్మిడఁగడుఁ।
గొప్పనుజడముడియొప్పఁజీఁకటిమ్రాఁకుచిగురువెట్టినయట్లుచెలువుమివులఁ।
బూసరియుమినువాఁకయుసూసకమును । గ్రొన్నెలయుఁబేరుఁబున్కపేరున్నగడఁగఁ।
దల్లియునుదండ్రియునొకండెతాననగు । నర్ధనారీశుబిల్వేశునభినుతింతు॥ ౩౦౪॥

కం॥ ఆరూపంబునశ్రీశ్వరుఁ । డాలింగంబుననెయయ్యెనంతర్ధానం।
బీరలురలలకభేదం । బారయుఁడీగౌరిలింగముగుటిటఁదెలియున్॥ ౩౦౫॥

కం॥ జీవత్వముస్త్రీత్వముగా । దేవత్వముపురుషతగనుదేటపడియెడిన్।
గావునజీవుఁడుశివయని । దేవుండుశివుండటంచుఁదెలియంగఁదగున్॥ ౩౦౬॥

కం॥ తామసుఁడు కాళియగుసా । రీమహిళయొ రాజసుండు శ్రీబిల్వాంబా।
నామముగలతనుమధ్యయె । యామహిసాత్వికుఁడు జీవుఁడగుణతశివుఁడా॥ ౩౦౯॥

తే-గీ॥ గుణముగుంబాశముగుటచే గుణులుపశువు । లెల్లజీవులు నిర్గుణుఁడీశుఁడొకఁడె।
పశుపతియు దేవుఁడనఁగను బ్రథితుఁడయ్యె । నిట్టులుండెడు తత్త్వము నెఱుఁగవలదె॥

తే-గీ॥ పాశయుక్తుండు జీవుండు పాశముక్తుఁ । డైనశివుఁడని యామ్నాయము నెడుఁగాదె।
సాంఖ్యయుక్తినిఁజూడుఁడీ సరిపడియెడిఁ । ద్ర్యర్థకంబగుగుణమె పాశార్థమిచట॥

కం॥ మందరపదార్థసంఖ్యా । సందోహంబుననుమాయజాడయగపడున్।
సందేహమేల బిల్వము । నందారకమాను గాననమృతమిటనగున్॥ ౩౧౦॥

కం॥ కాననెయమయీమూరెడు । కాననె కాళీత్వమెడలి గౌరిగనామెన్।
దానె బిల్వంబై మఱి । శ్రీనాథునియందునైక్యసిద్ధిం గాంచెన్॥ ౩౧౧॥

ఇంద్రవజ్ర॥ ఆదిత్యవర్ణేయను-నర్షమంత్రం । బీదివ్యదేశంబున-నిద్ధభక్తిన్।
శ్రీదేవి సేవాంగము-నేయలేముల్ । వేదీఱుఁగల్మల్గడు-వేడ్కఁగల్గున్॥ ౩౧౨॥

ఉపేంద్రవజ్ర॥ అపేక్షయేస్మోక్షము-నందునందుం । గృపాళువుం బిల్వవ-నేశుఁగొల్వన్।
దపోఽధిక శ్రీదళ-ధర్మపూజన్ । జపంబునస్మోక్షము-సంఘటిల్లున్॥ ౩౧౩॥

ఉ॥ పుట్టినయిల్ హిమాచలముఁబోకడవెట్టినురౌప్యమైనయా।
మెట్టినయిల్ ధరాధరముమేకొనకవ్వలఁగవ్వపున్మలన్।
దొట్టియుఁగాళివై యిచటఁదోఁచితిగౌరివిగాఁగ బిల్వమై।
పుట్టుగ శ్రీశుఁగొంటితనుమధ్యరొ జీవగతుల్ స్ఫురింపఁగన్॥ ౩౧౪॥

సీ॥ అఖిలలోకాంబనీయంఘ్రిపద్మంబులఁ జెందిన దేయవుశిరముశిరము।
ఈశ్వరినినుఁగాంచు నెక్కుడుభాగ్యంబుఁగాంచిన వేయగుఁగనులుగనులు।
ఉమనీకు బిల్వపత్రములఁబూజలొనర్చు శ్రీగలదెదియదిచేయిచేయి।
ఏకవల్లీయుతానీకుఁ బ్రదక్షిణకలన నెప్పెడునవికాళ్లుకాళ్లు।
ఓశివా సర్వమంగళయోసిగౌరి । నుడువునేనీదు పేళ్లదినోరునోరు।
మహితముగనెన్ను నేనిన్ను మనముమనము । తరుణితనుమధ్యత్వద్భక్తినరుఁడునరుఁడు॥

మ॥ అహహా గేహినిబిల్వభూరుహముగానావిర్భవింపంగఁజే।
సిహతాత్కారమునందదీయదళముల్ శ్రీమించఁగాఁగాంచియ।
త్తుహినాద్రిప్రభవం గ్రహించితివితోద్దో బిల్వమాహాత్మ్యమున్।
మహికిందెల్పనుగాదెమ్రొక్కెదము శ్రీమద్బిల్వనాథేశ్వరా॥ ౩౧౬॥

సీ॥ బిల్వనాథా నిన్నుఁబ్రియముమైవినకున్నఁ జెవులుగావవికొండగవులుగాని।
బిల్వేశ్వరా నిన్ను వీక్షింపకున్న నుగనులుగావవిబొగ్గుగనులుగాని।
బిల్వపతీనిన్నుఁ బేర్కొనకున్న నువాయిగాదది పెద్దగోయిగాని।
బిల్వనాయకనిన్నుఁ బ్రీతి నెన్నకయున్న నెడదగాదది చెడ్డబెడదగాని।
శ్రీకరుండనీకుఁ జేమోడ్పకున్నను । గేలుగాదు మొద్దువాలుగాని।
శ్రీమహేశనీకుఁ జేయకున్నను సేవ । మేనుగాదుదుమ్ముప్రాసుగాని॥ ౩౧౭॥

అమృతవాహిని॥ నుతింతుందనుమధ్యాంబ । న్నుతింతుంబిల్వనాథునిన్।
మతింగౌరీపురీచిత్ర । హితచారిత్రమెంచెదన్ ॥ ౩౧౮॥

సీ॥ ఆమహాకాళియెంధై యేకవల్లినాఁదొలఁచునలత్మ్మలబలువిడివడి।
నుమమహావాణిధ్యానమరిగౌరీతీర్థమనజ్ఞానలత్మ్మలననువుపఱుచు।
మామహాలత్మ్మిలత్మ్మిమహీరుహమయితనుమధ్యనాశివాప్తినిడుముక్తి।
నొంకృతిబిల్వమైయొప్పెడుననిచెప్పనిటననశివుఁడుబిల్వేశుఁడగుచు।
వెలుఁగుఁగువలయభాంధవవిలసితుఁడయి । యేదితత్త్వత్రమైక్యసుబోధమొసఁగు।
నేదిశైలూషశాండిల్యమోదమిడెడు । దానిగౌరీపురీనుతింతుశ్రీనిధిగను॥ ౩౧౯॥

౫

కం॥ వాగర్థయోగమనఁగా । బాగుశివయోగముగలవరకృతిమణియా।
శ్రీగౌరీపురిచరితము । దాఁగూర్చున్ శోభనములఁదనభక్తులకున్॥ ౩౨౦॥

ఫలసదనవృత్తము.

అనియిటుశివచరిత-మనువుగనుతూతుం।డనెఫలసదనమిది-యవునెనయుఁడంచున్
వినిమునులుముదమున-వివిధముగగౌరిన్।మనుపుతదధిపుఁబురిఁ-బొగడిరతిభక్తిన్॥

తే-గీ॥ అమరుబిల్వేశ్వరీయకావ్యమణినిద్ది । యాను గౌరీపురీబింబమనద్వితీయ।
మైనగౌరీశసమపద్యమానితంబు । గానగౌరీశబింబమూఁగాంచుశ్రీశ॥ ౩౨౨॥

అభినవతామరసవృత్తము.

అభినవతామర-సాభసునేత్రా । శుభకరభక్తను-శోభనగాత్రా।
ఋభుమునివందిత-శ్రీసుకళత్రా । ప్రభువరరక్షక-పక్షిపపత్రా॥ ౩౨౩॥

ఉత్పలమాలావృత్తము.

ఉగ్రముఖాత్మనామనవకోదితమోదితపద్మసంభవా।
యుగ్రముఖాయనుగ్రముఖయుద్ధతదైత్యహరాహరాంచితా।
యుగ్రముఖాహృదాయితవిధూయదరాంగకృతారవిందజా।
యుగ్రముఖాదిమంత్రప్రణవోత్తమసాధవిహారమాధవా॥ ౩౨౪॥

మంగళమహాశ్రీవృత్తము.

మంగళగిరీశజయ - మంగళకరేశశివ - మంగళశివాగ్రజశివాంగా।
యంగజగురూమణిమ - యాంగదపరాంగదన - రాంగకలితాహరివరాంగా।
సంగతసుదర్శనన్ప - శంసజనకర్శనప్ర - శంసనవిమర్శకృదపాంగా।
యంగజితరాజతధ - రాధరధరాదరక - రాదరహరావహరసంగా॥ ౩౨౫॥

గద్యము.

ఇది,శ్రీతనుమధ్యాంబాకరంబిత శ్రీబిల్వనాథమహాదేవశిష్యతిష్యోపజ్ఞాఽఽక్షర సాంఖ్యాచార్య
పర్యవితకవిత్వ తత్త్వవిత్ప్రికాండ శ్రీమత్కొండ వేంకటరత్నశర్మ
వినిర్మితంబై,
కవిమణినామంబునంబరఁగు శ్రీబిల్వేశ్వరీయంబను
పద్యకావ్యరత్నంబునం ద్వితీయము, గౌరీపురీబింబము, గౌరీశబింబము.

శ్రీబిల్వేశ్వరాయనమః.

# బిల్వేశ్వరీయము.

## తృతీయబింబము.

### విష్ణుపురీబింబము, శ్రీశేశబింబము.

కం॥ మంగళలక్ష్మీసంగత । సంగతసుగుణాగుణార్ణసంపద్వర్ణో।
త్సంగాసంగాయితసుజ । భాంగాయంగాయితనరహరిహర్యక్షా॥ ౧॥
౩

మ॥ మహిమాధిక్యముఁగాంచెవిష్ణుఁడెవనిన్మాలూరపత్రార్చన।
న్బహుసంతుష్టునిఁజేసిచక్రియగుచున్సర్వామరశ్రేష్ఠుఁడై।
మహికిన్ శ్రీకినుఁడైశివైక్యమునసన్మాన్యుండునైమంగళా।
వహుఁడైయాశివువిష్ణుపుర్యధిపుబిల్వక్షేత్రగుంగొల్చెదన్॥ ౨॥

కం॥ నావారువిష్ణుపురియం । చాబిల్వవనమునకాహ్వయముగల్గుటకున్।
భావింపఁదగినహేతువు । నీవీవడిఁజెప్పుమనిననిట్లతఁడనియెన్॥ ౩॥

శా॥ ప్రాసాదాఖ్యమనుత్రిఖండతననంబైల్వచ్ఛదద్యోతకం।
బైసొంపొందుఁద్రయీవిరాజితముద్రేతాలంకృతంబాటనా।
వాసింగాంచుఁద్రితాప్తరామచరితన్భాస్వత్త్రిపాద్ధర్మమా।
శ్రీసంపన్నమునన్యగంబునసుమించెన్విష్ణుపుర్యాఖ్యయున్॥ ౪॥

సీ॥ ఎవఁడనసూయయన్నవిమలారణియందుజాతవేదుండనజననమొందె।
నాత్రిమూర్తులకునుధాత్రీసురుండెక్కువనితెల్పననయ్యెనత్రిపుత్రుఁ।
డయ్యెమాహేశ్వరుండయ్యుమహేశ్వరుండొనరించెశంభుస్తుతినిమహిమను।
బ్రాసాదసంకలితాసాదితార్యాకృతింజేసెశ్రీచక్రముంజెలువుగ।
నింద్రుమదమునణంచెనుగృష్ణజిష్ణుఁ । జేసెస్యాలకసౌహార్దభాసితుఁడనఁ।
బాండువంశంబునెగడించెభద్రమూర్తి । యతఁడుమునిమాత్రుఁడేజగద్వ్యాప్తకీర్తి॥

కం॥ ఉగ్రుఁడుసదసదనుగ్రహ । నిగ్రహసముపాత్తనియమనిరుపమమునిరా।
డ్వ్యగ్రహుఁడునిర్జితేంద్రియ । విగ్రహుఁడుసమగ్రరౌద్రవిగ్రహుఁడుగనన్॥ ౬॥

కం॥ గర్వితనరసురసురరిపు । దర్వీకరగరుడుఁడధికతమఘోరతపో।
దుర్వారుఁడుదుర్వాసుఁడు । దూర్వాసుఁడుదమితభువనదూర్వాసుఁడటన్॥ ౭॥

చ॥ ఒనరఁగఁజేయుచుండితపమొక్కదినంబునవేడ్కనేగ్రగ।
క్కనవనమాలిప్రోలికినికొండితఁడేయఁగఁబుండరీకమం।

చనిఘనభీతిమైనెదిగియక్కఱమ్రొక్కఁగనందునందఱుం।
గనఁబడెనెంటిపాఱుఁడనికంజదళాక్షుఁడుగాంచినిల్వఁగన్॥ ౮॥

మహాస్రగ్ధర॥ కనియెందుర్వాసుఁడందుం గనకవసనునిం గౌస్తుభశ్రీసమేతున్।
వనజాక్షున్వైజయంతీ పరికలితురవి స్పర్థికోటీరభూష్ణున్।
వనజాప్తప్రాయచక్రు స్వనజరిపులస త్పాంచజన్యంజగద్రం।
జననిన్సాంధ్యారుణాభున్ శకునపతిహయున్ జారురోచిష్ణువిష్ణున్॥ ౯॥

మహాస్రగ్ధర॥ కనియిచ్చెన్ శ్రీదశస్ర గ్వరమొకటని శ్రీ కాంతబిల్వాటవిన్ శ్రీ।
తనుమధ్యాబిల్వనాథు ల్దయనిడినదిదాఁ దాల్పుమీవంచుఁబేర్మిన్।
వనజాక్షుండప్డుదానిం బ్రభుతనుగొనియా పక్షిరాజోత్తమాంగం।
బుననుంచెంజంద్రునంకం బువలెనదిదగెం బుద్ధిగర్మానుగంబా॥ ౧౦॥

చ॥ మఱియలబిల్వమాలికతమంబడెజాఱితమానుగంబుగం।
ఝుఱచుఱఁజూచియత్రిజుఁడుశోకమురోషముసందడింపఁగం।
గఱకుతనంబునంబలికెఁగానవెగర్వముచేతనోహరీ।
యెఱిఁగెదుగాకయంచుఁగడునేపునదీపితకోపుఁడైవడిన్॥ ౧౧॥

కం॥ ఆసకునేవారగుదురో । దాసులులోకులకునెల్లదాసులువారల్।
దాసియగునాసయేరికి । దాసులుగాలోకులెల్లఁదగవారలకున్॥ ౧౨॥

సీ॥ సంపదయాధనసక్తులకింపునసక్తులకద్దియొసంగుఁగంపుఁ।
గలిమియయాతనుగాంచనశైలముగాంచఁగనద్దియుఁగాదెతృణము।
శ్రీవంద్యమపుతమర్థికిశ్రీవిషమపురక్తిఁగనమిద్దృఢమతికింగనుఁగొన।
నగునుసంపత్తిగేయంబునర్థరతునకౌనుహేయంబుత్యక్తాశునకును।
తెలియకయకల్మిపీకఁజీఁకులగువార । లెల్లవారలఁగనియెదరేకరీతిఁ।
గాంత్రుధృతరాష్ట్రవిఖ్యాతిఁగనరొకొసడిఁ । దనరఁదనహానిలోకనిందయనెడినుడి ॥

శా॥ సంపద్గర్వవిశిష్టదుష్టునిదురాశాపాశబద్ధుల్నరుల్।
సొంపొందంగనుగొల్చుచుందురుపిశాచుల్ గాని బేతాళునా।
నొంపంద్రుంపవలంతులైనవిబుధుల్నావ్వొందఁగానోర్తురే।
చెంపంగొట్టినయట్టుతిట్టెదరుగాశ్రీగర్వముంబాయఁగన్॥ ౧౪॥

ఉ॥ కన్నులఁజూపుగల్గిననుగాంచఁగనీదెదురైనవీనులన్।
బన్నుగవిన్కిగల్గినఁదవన్విననీదిఁకనోరుపల్కఁగా।
నున్ననుబల్కనీదుమఱియున్ననుజేతులుమ్రొక్కనీదుసం।
పన్నిగర్వమత్తెవులుఁబాపెడిలేవడియేన్విరక్తుఁడే॥ ౧౫॥

కం॥ కలిమినిఁగలిగెడుగరువము । బలుదయ్యముదానిఁదోలవలఁతివిరాగుం।
డలుకనిడుశాపమవుమను । వలగామెడలెడునుమేలయవుఁగాదెకనన్॥ ౧౬॥

కం॥ శ్రీమంతుఁడననుకొనకుము । శ్రీమద్బిల్వస్రజంబుక్షితిపాలగుటన్।
దామోదరనీశ్రీనిసుఁ । దామోదంబఱఁగవదలుతమనిశపించెన్॥ ౧౭॥

కం॥ అంతను పేంద్రుం డెంతయు । వంతను గని గరుడిడిగ్గి బహుభంగుల శా।
పాంతముఁ బ్రార్థించె సుశ్రీ । కాంతమునికి నెరఁగి కరుణ గలుగ నిటుల నెన్॥ ౧౮॥

కం॥ అపరాధియగుట నాపతి । శపియించితివీవు దవుసు శాపాయుధ నే।
నపరాధ మేమి నేసితిఁ । గృప లేకెడఁ బాపెదు పతిహితమె మునీశా॥ ౧౯॥

కం॥ తష్ఫ్ఫాకఁడొనర్ప వేఱూరు । నొప్పించుట గోడె గుమ్మ నోవున నావున్।
దెప్పన నడచుట గాదే । త్రిప్పవునీ శాపమున నిశ్రీ వేఁడఁగ డున్॥ ౨౦॥

ఉ॥ కాదు మదుక్తి వ్యర్థముగఁ గాఁగల దేదది గాక మానదీ।
వాదు కృతార్థ వీస్ర జమునం దెద వెందటు బిల్వ నాథునిన్।
మోదమె సంగఁ గంగొలువు మూరెదు నీపతిఁ గాంచియంచునా।
శ్రీదయితుంగ నుంగొని హరిగతి నీకిదె యంచు వేసనెన్॥ ౨౧॥

మ॥ మునిశాపంబునఁ జేసి శ్రీకి హరికి న్మోహంబు సంధిల్లెనం।
తననంతుండున గెంగతం బెఱుఁగమిం దానిందిరాదేవియెం।
దున నీ వివ్వడి నవ్వి నాఁడవని నందోఁ చుంగనం దెల్వియం।
చనె నేఁ దెల్వని లేని దాననుకొనా నా సందియం బేమనెన్॥ ౨౨॥

చ॥ అనిమఱి వెన్నుఁ డిట్లనియె నారయ నేరవు కారణంబుఁ దె।
ల్వినిఁ గల దాన వే తెలివి లేమి నెపూనెదు దుర్విదగ్ధతన్।
వనిత పతీంగితం బెఱుఁగఁ బ్రౌఢిమ లేనిదియే నినాయికా।
మణియగునె క్కపుత్రిక గమానితయా మఱివీణ చిల్కనాన్॥ ౨౩॥

మత్తకోకిల॥ నావుడుం గడుఁ గిన్కయెచ్చఁగ – నాథునిం గని లక్ష్మి నీ।
వీవితంబున ముల్కిపోల్కని – నెట్టు లెట్టులూ పల్కెదా।
రావిభుండననింతి నెంతయు – రంజిలంగను జేయువాఁ।
డావెలందుక గందికుందఁగ – నాడువాఁడు ప్రియుండొకో॥ ౨౪॥

కం॥ పానువున నున్న మగఁడగుఁ । బానుపెడలె నేని యముఁడు భార్యకుఁ బురుషుం।
డాననెడినానుడిని నో । శ్రీనాథా వింటిఁ గంటిఁ జిత్తంబలరన్॥ ౨౫॥

చ॥ అనవుడు నిన్ను నాయెద నెయక్కఱ నెక్కఁగఁ జేసి నెక్కొనం।
గనుముద మందుచుందు నెడఁ గాంచను నీయది తెల్వితక్కువం।
జనవునఁ దెల్పనిల్పకొనఁ జాలక ప్రేలెదు స్త్రీస్వభావమున్।
ఘనముగఁ జూపితౌ నుశునకంబున కౌనె ఘృతాశనంబనన్॥ ౨౬॥

చ॥ అనువుగ నాలి నుంచుకొని యాదట రంజిలఁ జేయఁ జాలఁడే।
న్మనుబురుషుండు పెండ్లికిని మొగ్గకయుండు పెలగ్గ చేసికొ।
న్న నెవిడ నాడు పెగ్గ దియ నాకు ఘటిల్లెన భాగ్యమేమనం।
జనునిసు నాడ నీకు ననుజొయఁగనిచ్చిన తండ్రి దూఱెదన్॥ ౨౭॥

మ॥ అనుడున్వ్యాసుఁడు వల్కెఁ గేశవుఁడు నీకాఁగా మగండిందిరా।
తనయుల్వాక్పతిదర్పకుల్గదకపర్దస్ఫీతనీకూఁతురిం।
కనుద్వాశోప్సదరులన్ హృదిన్నెలకొనంగాఁ జేసికొన్నాఁడని।
న్ననసాఆమ్ము సుదింపనబ్ధిశయనుం డైతింగొ అంతేమిటన్॥ ౨౮॥

కం॥ శ్రీనీకు నన్ని గుణములు। జానవు రెండే గుణములు సమకొనవయ్యెన్।
మానుగ నెఱుఁగమి మొదటిది। పూని యొరులు చెప్ప వినమి వో రెండవదా॥ ౨౯॥

సీ॥ అవివేకులనె కాక సువివేకులను నీదు కడకంటి చూడ్కి నిక్కముగఁ గనదు।
అజ్ఞానులనె కాక సుజ్ఞానులను నీదు కడకంటి చూడ్కి నిక్కముగఁ గనదు।
లోభులనే కాక లోభదాతల నీదు కడకంటి చూడ్కి నిక్కముగఁ గనదు।
దుర్వృత్తులనె కాక దురితదూరుల నీదు కడకంటి చూడ్కి నిక్కముగఁ గనదు।
నీవెవరిఁ బొందెదవొ వారు నిక్కముగను। దెలివి లేకయె మత్తులై తెగడఁబడుచుఁ।
దెగుదురనని న్నెఱుఁగఁ దెలివి లేని। దానవని వ్యర్థముగ నేల పూని పలుక॥ ౩౦॥

కం॥ మామానిని మతిచలమనఁ। గామారుఁడు మారుతుఁడును గదగురుసాక్షుల్।
మామానిని మతినీయది। యామతిచంచలము పంచమాంచితపుగదా॥ ౩౧॥

కం॥ సిద్ధము చాంచల్యంబు ప్ర। సిద్ధము కామం బెకొడుకు సిరి నీకగుఁగా।
బద్ధుఁడులు బుద్ధుఁడు చిలుకగ। బుద్ధిన్ని న్నెన్ను నేము ముముక్షువు లక్ష్మీ॥ ౩౨॥

తే-గీ॥ శ్రీగళుఁడు నీలకంఠతఁ జెందె ఘనత। శ్రీవరుఁడుగ నెఁగృష్ణత శ్రీధరత్వ।
మందు రేమందు నార్యోక్తి వ్యర్థమగునె। యరయ శ్రీయన విషము శ్రీవాదు గాదె॥ ౩౩॥

కం॥ నిన్నన నేటికి స్త్రీజా। తి న్నెక్కొనియుండు నఘతతియె పుట్టనె్న।
క్కొన్న విసదారి తీరున। నన్ను చెలువయే చిలువయయ దెవి సమరయన్॥ ౩౪॥

కం॥ మగువయ యపునగ్గిమంటన। మగఁడగుఁగా వెన్నముద్ద మాడ్కి నగుటనే।
మగువ గరఁగించు మగనిని। మగఁడగు సగమాశివుల నుమన మెఱుఁగ మొకో॥ ౩౫॥

కం॥ తలఁచిన దాపంబొదవును। దిలకించినఁ బిచ్చిపట్టు తెఱఁగు ఘటిల్లున్।
జెలువని యంటిన స్మృతియుఁ। గలసినఁ గరఁగించు మిత్రిగద సతి ప్రియయే॥ ౩౬॥

తే-గీ॥ మిత్తిగదుఁ గ్రూరచిత్తంబు హత్తఁదనకు। నయ్యె స్త్రీరూప గాఁజల్లనమ్మఁ బోయి।
ముంత దాపఁగ నేటికి నింతియె యగు। మృత్యువని యెంతు రార్యులు సత్యముగను॥ ౩౭॥

తే-గీ॥ కాననేము ముముక్షువులు యోగకలనఁ బూను। వారలు ప్రతిపదర్శిని న్వామవామ।
లోచనం బ్రమదనుగామినీ చరిత్ర। నరకపురమార్గమంచని పారిఁద్యజింత్రు॥ ౩౮॥

కం॥ చెలువయె సప్తవ్యసనం। బులలోన న్మొదటిదగుటఁ బురుషోత్తములా।
చెలువల పొందొందరు మఱి। తిలకింపరు విన్నఁ గన్నఁ దెగడుదురు గడున్॥ ౩౯॥

కం॥ సంతానార్థమె కూడెద। రింతుల సంతాన మొదవ నెడలెదరు ఘనుల్।
సంతసమునఁ గొనికొలుచున। నంతరమున వరికసవును ద్యజియించు క్రియన్॥ ౪౦॥

తే.గీ॥ కలుగననుకూలదాంపత్యములరఁగొంత । మేలుతత్కాలసుఖదమైపోలుకతనఁ।
గలుగఁబ్రతికూలదాంపత్యమలరుఁజాల । మేలుసన్న్యాసమునకదిమూలమగుట॥ ౪౧॥

మ॥ అననాశ్రీధరుఁగాంచిశ్రీయనియెఁదానత్యంతరోషాంధతం।
గననేనీదినృసింహరూపమునువేడ్కంబ్రహ్మచార్యాకృతిన్।
జననీమారణఘోరచర్యమతిభూజాత్యాగగార్హస్థ్యముం।
గనెదన్సన్న్యసనోరుచారుచరితంగావింపుమిష్టార్థమున్॥ ౪౨॥

భుజంగప్రయాతవృత్తము.

అనంగానతండెంతొ-హర్షంబుఁబొందెన్ । గనంగంటిసన్న్యాస-కాంక్షౌఘలంబున్।
దనంతన్లభించెంబ-దార్థంబుమేలౌ । వనంబద్ధిబైల్వంబు-వాటంబటంచున్॥ ౪౩॥

కం॥ అనితలఁచిసిరినివీడ్కొని । చనుదెంచెనధోక్షజుండుశాండిల్యవనం।
బునకటఁదపమునుజలుపన్ । వనితకులోఁబడునెమోక్షపరుఁడువిడివడున్॥ ౪౪॥

పంచచామరవృత్తము.

కనుంగొనెంభుజంగశాయి - క్రమపల్లవోల్లస।
న్మనోజ్ఞసత్కపర్దమున్స - మద్యుతిద్యునిమ్నగా।
ఘనంబుసత్ఫలోద్యదిందు - కాంతమున్శివాంగమా।
ననంగదుంజెలంగుబిల్వ - కాటవిన్దమోరవిన్॥ ౪౫॥

శా॥ గౌరీదేవిశివైక్యమొందఁగనియక్కంజాక్షుఁడక్కైవడిన్।
గోరెన్దానునుగాఁగయోగకలనస్థూరెంగరంబక్కటన్।
గౌరీతీర్థమునందుఁగ్రుంకితపముంగావించెఘోరంబుగా।
మారేడుల్దనునీడఁబండులనుసమ్మానింపనార్యాప్తినాన్॥ ౪౬॥

శా॥ ఆగౌరీపురిబిల్వనాథనిలయంబందెందఱోదందడి।
న్రాఁగానేవయొనర్పఁదీర్థమునస్నానంబుంబొనర్పంబొరిన్।
దాఁగూర్చుండితపంబొనర్చుటకటందైవారమింజేసిపోఁ।
గాఁగోరెన్హరివేఱుచోటికిఁదపఃకార్యంబునానేపురిన్॥ ౪౭॥

చ॥ కనెవనజాక్షుఁడందుఁగ్రతుకార్యసుదీక్షితుశైవదీక్షితున్।
వినుతచరిత్రుసూత్రకరువిశ్రుతనాశ్రితరక్షశిక్షకున్।
జననుతయోగిచంద్రుగుణసాంద్రుమహామహనీయగేయునిన్।
ఘనమునిముఖ్యుసత్తమునిఖ్యాతునిశ్రీతునిఁబ్రీతుగౌతమున్॥ ౪౮॥

ఉ॥ గౌతముఁడచ్యుతుంగరముగారవమారఁగఁగాంచిస్వాగతం।
బీతజనీకునాకునరమేశదశాకృతివైషదక్షరిన్।
ఖ్యాతముఁజేసినాఁడవిఁకనారయఁజేయుముతారకంబువి।
ఖ్యాతముగానమస్కృతినిఁగాంచుమ సత్కృతమోజగద్గురూ॥ ౪౯॥

క౦॥ అష్టాక్షరమంత్రేద్యుఁడ । వష్టాంగను యోగనిష్ఠకథినాథుఁడవో।
యష్టాపదాంశుకానా । సాష్టాంగనమస్కృతిస్మహాదయఁగనుమా॥ ౫౦॥

క్షితివృత్తము॥ అ । ను । చు । ను ॥ ౫౧॥

శా॥ ఆతిథ్యమ్మొనరించియమ్మునిమహాహర్షంబునంబల్కెనో।
శ్రీతావెన్నఁడమున్నమోహినిగనై యాశుందగంబొందిసం।
ప్రీతిందత్తనువర్ధమొందితివిగౌరీరూపయుక్తిన్మహా।
ఖ్యాతింగాంచెదుగాకశంకరశరీరార్ధంబునీరూపునన్॥ ౫౨॥

జనవృత్తము॥ అని । యని । వను । వను ॥ ౫౩॥

మ॥ శివవామాంగముదానయాటకటనాశ్రీనాథుఁడీశానది।
గ్భువిఁగంజాచలపాదమందునిలువంబోయెన్ శివాఖ్యంబునన్।
శివనారాయణుఁడన్ప్రథంగనియెనాచెంతంగరుత్మత్ప్రథా।
నవిధానంబుననొక్కతీర్థమొనరెన్నారాయణాభిఖ్యమై॥ ౫౪॥

మ॥ తపమందుంబొనరించెవెండియునుదాత్తశ్రద్ధనత్యంతభ।
క్తిపరుండైహరినెమ్మనమ్మునమహాదేవైక్యవేదోక్తిశై।
వపథంబుల్సరిగాఁగయోగనిధియైవాలారెరోమాంచయు।
గ్వ్యపదేశంబునబిల్వతంగనుచొగింప్రార్థించుబిల్వేశ్వరున్॥ ౫౫॥

చ॥ అగపడెవేఁడిదొల్దొలుతనచ్యుతునాదలభుగ్నభగ్గనం।
బొగలెగనెన్ శిఖల్నెగసెఁబ్రోదిగభగ్గనిభగ్గనంగస్వ।
ర్గగతులుదల్లడిల్లఁగనికౌశికుఁడయ్యెనుగౌశికుండురం।
భఁగనినురాంగనామణినుపర్వులఁగావవెవేవనీవనా॥ ౫౬॥

ఉ॥ దేవరదేవరుంగెలిచితెచ్చెదమెచ్చెదుగాకయాకడన్।
శ్రీవరుఁడైననేమఁటన్నృసింహుఁడునైననునాపులోఁకువా।
భావమునందుఁగుందకుముభద్రమునీకగుఁగాకనాకొయా।
భావజుఁడేసహాయుఁడుగభాసిలునన్నెడఁబాయకెన్నఁడున్॥ ౫౭॥

క౦॥ అనిరంభపలుకజేజే । దణిమెచ్చెనువేల్పులెల్లఁదగుఁదగుననిమె।
చ్చనుమటియచ్చరలిచ్చను । జనుఁజనుననిమెచ్చరంభసంరంభమునన్॥ ౫౮॥

తే-గీ॥ ఉన్ననన్ననన్నెడఁబాయకెన్నఁడనితి । కర్తమదనుండొమఘవుండొగౌరవమ్ముఁ।
గాంచుమమ్మనీప్రాపునఁగాంతుమేము । ననుచుఁదిన్నఁగమేనకయన్నగుచు॥ ౫౯॥

క౦॥ ఐనన్నారమ్మనుచు । న్మేనకఁదోడ్కొనుచునింద్రునిన్వీడ్కొనుచున్।
సూనాస్త్రుఁడునువసంతుఁడుఁ । దోనరుదేరంగరంభదొడిఁబడివచ్చెన్॥ ౬౦॥

ఉ॥ అంతననంతకాంతలతికాంతలతాంతనితాంతవాసనా।
క్రాంతమిళిందబృందమవిరామనురామఫలాశనాగతా।
శ్రాంతశుకోత్కరంబునుకిసాలరసాలచరత్కుహూరటం।
బెంతయునొప్పెనామునియకృత్రిమచిత్రచరిత్రపాత్రమై॥ ౬౧॥

చ॥ చిలుకహుమాయినెక్కి కడుఁజెల్వుగఁజక్కెరవిల్లుపూవుటు।
ల్కులగమిఁబూనిపూనికనుగ్రోల్కసలింగలడాలుడాలుచూ।
ఢుల్కలమిఱుమిట్లుగొల్పమునుగోయిలలిమ్ముగఁగొమ్ములూదఁగా।
నెలగొడుగై వెలుంగరతినెయ్యుఁడు వెల్వడెస్వారిమీఱఁగన్॥ ౬౨॥

శిఖరిణి॥ సయోగుల్నిత్యంబున్సకలసుఖము - ల్సాలనెనయన్।
వియోగుల్దుఃఖంబుల్వివిధములను - ర్వింగనఁగడున్।
బ్రియంబారన్మారుండడరెఁబుడమి - న్వేడ్కనుదపః।
క్షయంబాపాదింపన్క్షముఁడననియా - చాములలరన్॥ ౬౩॥

ఉ॥ ఆలలనల్గనుంగొనిరిహర్ష మెసంగఁబ్రకర్ష హేమలిం।
గాలయమాననన్ఫలసమంచితమైగిరిజాంగరోచులం।
గ్రాలెడులేఁజిగుళ్లఁబగిరాజితరాజితశైలలీలఁగాం।
డాలిఁబొసంగుమ్రాఁకులముదావహమానలబిల్వకాటవిన్॥ ౬౪॥

మ॥ అనెనామేనకతోడరంభగడునాహ్లాదంబుతోడంజెలీ।
కనవేసచ్ఛకునంబుగంగనఁబడుంగాంచన్రమామానినీ।
మణివక్షోజఫలాఢ్యయైయధరసంభావ్యచ్ఛదోపేతయై।
వినుతాచ్ఛాంబరసత్ప్రకాండయుతయైబిల్వాటవీరూపయా॥ ౬౫॥

కం॥ నావుడుమేనకయనియెన్ । శ్రీవనియనెదీవుమనకుఁజేరఁగనగునే।
శ్రీవిభునిటనీతాకాం । తావల్లభుఁడితఁడగుటనుదనికెడువెఱపే॥ ౬౬॥

కం॥ అనరంభనవ్వి వెఱపే । నని జంకకుసోదరిగదయబ్జమునకుఁగా।
వునమఱియీతఁడుకృష్ణుం । డనియెఱుఁగవెకుబ్జబాజుఁగుననవుడువేడ్కన్॥ ౬౭॥

కం॥ కనిరయ్యచ్చరలచ్చట । ఘనకీలాఫీలకీలికైవడిదీప్య।
ద్దినకరుకరణిని వెలిఁగెడు । ననఘుఁదపోనిధినియోగనారాయణునిన్॥ ౬౮॥

సీ॥ యమముపాదాశ్రయమైయొప్పనియమంబుసత్ప్రచారముఁగూరిశ్లాఘ్యతఁగనఁ।
గటిచక్రమాసనక్రమసేవితముగన్రాణంబుప్రాణాయామచుంబితముగ।
మఱియుఁబ్రత్యాహారమహితంబుగామఱిధ్యానంబుమానసమూనినిల్వ।
ధారణంబదిబుద్ధిధామస్థిరింగాంచఁగాసమాధిశివైక్యఘనతమించ।
యోగమష్టాంగమాత్మమంత్రోదితాక్షు । రాష్టకమునాశ్రయింపంగనభినుతుఁడయి।
యోగమూర్తియోగీశుఁడునాఁగనుదగు।యోగనారాయణునినెంతునుల్లమునను॥

కం॥ అనిరంభపలుకమేనక । యనెనమ్మకచెల్లయీమహామునినారా।
యణునిన్యోగైశ్వర్యా । వనునిసరిత్పరిగనెంతుస్వాంతమునందున్॥ ౭౦॥

సీ॥ అణిమమధ్యాప్తిచేనభినుతంబగుచుండుమహిమవక్షశ్శ్రీసుమహితమగుచు।
గరిమబాహుసమాశ్రయరుచిస్ఫురించునులఘిమగతిస్ఫూర్తిలలిఁజెలఁగెడుఁ।
బ్రాప్తిముఖేందుశోభావాప్తిఁజెలువొందుఁబ్రాకామ్యముదృగబ్జభానురమగు।
నీశత్వమునుతంబుగేశవాభిఖ్యావశిత్వముజిష్ణుసంసేవనమున।

నహాహాయీతఁడష్టార్ణమంత్రాంచితుఁడుగ । నగుటనోయష్టభూతులనలరుచున్న।
వాఁడునవమవిభూతినాభానిలునవ । రూపునవమునీనరసింహమూర్తుతుభజింతు॥ ౬౧॥

తోటక॥ అనిమ్రొక్కుచునక్కమ - లాక్షునిమ్రో । లనునిల్చుచునచ్చర - లాతనినె।
ఱ్ఱనమల్లలనాడఁగ - మన్మథమా । ర్గణతుల్యలునైరమ - రంగఁగడున్॥ ౬౨॥

ఉ॥ చూపులుపూవుఁదూఁపులుగఁజూచిరియేచిరిమించునించులై।
తీపులుగాఁగనేపుననుధిన్నఁగఁబల్కిరిచిల్కలోయనన్।
బ్రాపుగఁబాడిరాడిరటవాటముగావలఱేఁడుదోడుగా।
నాపఁగరానిమేల్వలపునందఁగనందినపొల్పుఁదెల్పుచున్॥ ౬౩॥

కం॥ ఎన్నియొనరించిననువా । రన్నగధరుఁడించుకైననందకచలనం।
బున్నఁగనియచలమీతం । డన్నందగునన్నఁగరంభయనెమేనకయున్॥ ౬౪॥

కం॥ కన్నులెతెఱవమిశిశువన । నున్నాఁడుకనంగనంగజోన్నతుఁడైయి।
ట్లున్నాఁడువినమివృద్ధుగ । నున్నాఁడీవెన్నునెట్టులొప్పంజెప్పన్॥ ౬౫॥

చ॥ అనవుడురంభయిట్లనియెనక్కరొయిక్కతపుండవుంజుమీ।
కనుఁగొనఁగానపుంసకుఁడుగాననెహొగ్గడికాఁడుశ్రీసతిన్।
దనయెదనుంచుకొంచునెఱఁదద్దయుఁబెద్దఱికంబుఁగాంచుఁగా।
కెనసిననామెకేలనుతులీవఱకుంబ్రభవింపరైరనన్॥ ౬౬॥

తే-గీ॥ ఉమయెవిష్ణుండటంచౌకయుపనిషత్తు । పలికెడునదేలవెన్నుండెపణఁతియగుచు।
నమృతముంబంచియిడఁడెయాయమరులకును। బురుషుఁడౌశివుఁగూడిముల్ బుత్త్రుఁగనఁడె॥

ఆ-వె॥ ఇట్టిమాటలెన్నియేనియుఁబలికినఁ । గార్యమేమిచెవుడుగలుగువాని।
కడనుగానమొప్పఁగావించినట్టులౌ । యోగనిష్ఠుఁడగువిరాగుఁడితఁడు॥ ౬౮॥

కం॥ పుడమిపొడిపొడిగనైనను । గడలియెయింకిననుమిన్నుఖండములైనన్।
జడతగ్రహచలనముడిగిన । నెడలునెయోగిదిసమాధియితఁడుహరిగదా॥ ౬౯॥

తోదక॥ అనుచునుమేనక - యాఁడఁగరంభా । వనితయునెట్టొకొ - వశ్యునిఁజేయం।
జనుననిచింతిలి - శాంతునిదాంతు । న్మునిపతిశ్రీపతి - మ్రొక్కుచుభక్తిన్॥ ౭౦॥

ఉ॥ ఈమునిఁజూచితేమపునినేచినయుగ్రుఁడుపోలెఁగ్రాలునా।
స్సోమునినేనెఱుంగనెమనోభవుఁడీతనిగెల్వఁజాలమిం।
గామదమేదినందనుఁడుగానగునీతనికమ్మచెల్లనీ।
వేమనియెంతుపైకొనెదవేయనిమేనకపల్కరంభయున్॥ ౭౧॥

ఉ॥ అంకిలిమానియామరునియయ్యనుసొయ్యనఁజేరికూరిమిం।
గొంకకగబ్బిగుబ్బలెదఁగ్రుమ్మఁగఁగ్రమ్ముచుఁగౌఁగిలించిని।
న్నింకిటవీడుదాననెహరీయనుచుంబలుకప్పఁదెప్పనం।
బొంకముగాఁగనొక్కికడుఁబొల్పుగముద్దులిడంగఁదద్దయున్॥ ౭౨॥

కం॥ శృంగారరసవరసమా । లింగితముగుశాంతరసములీలఁ లతికా।
లింగితమువుతరువరముతె । అంగునరంభాస్థితిహరివలె నెసెనరంగన్॥ ౭౩॥

కం॥ గిరిశుంగొలుచుటచేతనె । గిరిధరుఁడేతానగుటనెగిరిధర్మంబున్।
బరువడిఁబూనెనెయననా । హరియచలుండై యెసంగెనభిరుచిలేమిన్॥ ౭౪॥

కం॥ కాముని జయుఁగొల్చుటచే । నామహితుండైనయోగనారాయణుఁడుం।
గామవిజయుఁడగుటయెకా । కేమహిఁగ్రోధవిజయుఁడననెసఁగెన్శాంతిన్॥ ౭౫॥

ఆ-వె॥ కామజేతశివుఁడుగానెన్నఁబడియెడిఁ । గ్రోధజేతవిష్ణుఁడాధరిత్రి।
నహహయుభయజేతయవుశివవిష్ణైక్య । విగ్రహమునిరంభ పెలుకఅనన॥ ౭౬॥

కం॥ వినిపరమహర్షముననా । యనవిష్ణుశివైక్యవిగ్రహాలాపముచే।
తనురంభను మెచ్చెనురా । వణునగజాశ్లేషమునసుభవుఁడెంచుక్రియన్ ౭౭॥

చ॥ కనులరాగివాసరాదినువికస్వరభాస్వదుదంశుపుంజసం।
జనితవికాసభాసురనుసారసపత్రవిచిత్రరోచుల।
న్గనఁగనుమందహాసముగనద్రజనీముఖకుందబృందశో।
భననెవిధుండురంభసురభామినిమెచ్చితినీకునిచ్చెదన్॥ ౭౮॥

కం॥ అనసురభామినిమెచ్చితి । ననినీకునునిచ్చెదననెనదియొకసురభా।
మినిగాఁబోలునటంచును । జనవునమేనకయనంగఁజనరంభయనెన్॥ ౭౯॥

కం॥ తలఁదూర్చిఅోటిలోరోఁ । కలిపోటుకువెఱవనేమికార్యముమఱికాఁ।
గలదేమోకాకుండునె । చెలియీగంగాజనకునిచెర్దియెటోయనన్॥ ౮౦॥

కం॥ నారాయణుండునిజవా । మోరువుమూన్నాలుగైదునెదవెడుగోళ్లన్।
జీరికొనెమూడిటనరం । భోరువాకతెయందకలిగెనుర్వశియనఁగన్॥ ౮౧॥

మ॥ మునుదానూనినయాఁడురూపునఁగడున్మోహింపఁగాఁజేసియా।
దనుజవ్రాతముఁగామవైరిఁజెలువొందందేజిబృందారకా।
శినినామీఁదటనప్సరస్తతినినోలిన్మోహవారాశిముం।
పనెదీనిన్సృజియించెస్రష్టృపితనాభాసిల్లెనాభామయున్॥ ౮౨॥

ఆ-వె॥ అడుగునందుఁబొడమినదినదియమృతాంశు । మాశిమాశినెక్కమఱియుదితొడఁ।
బుట్టినట్టిదహహభువనమోహినియప్స । రోంగనోత్తమాంగరంగగాదె॥ ౮౩॥

లయగ్రాహి.

మించుగమిమించుమయి-మించఁగఁజలించుకను - లించువిలుబంటుపరఁ-గించుపువుటమ్ముల్।
గాంచఁగనుబొమ్మలల - పంచశరధర్మముల - వంచిమఱిద్రుంచినలి - గించుచుయశంబుం।
బంచియిడఁదద్రసము - నంచితముగాఁబలుకు - లించుకయెకాకసుధ - నించునెలగామో।
మంచలనుగెల్వనడ - కాంచనపుఁగుంభముల - సంచుఁదెలుపన్గుచము - లెంచనదిమించున్॥

ఆ-వె॥ దానిచన్నులన్నఁదానున్నగుడుసువౌ । దానిపిఱుఁదులగును దాపిఱుఁదులె।
మహిళమధ్యమునఁగమహిళమధ్యంబయా । నటనముగుటనటనమాటవెలఁది॥ ౮౪॥

సీ॥ మోమునుగనుఁగొన్న సోముఁడాదలనున్న సోమునిఁ జిమ్మఁ డేవ్యోమమందు।
కన్నులుగనుబొమల్గన్న నమ్ములువిల్లుమున్నన్న పూను నేయన్నెలచెలి।
యధరశోణిమమునుమధురవాణి నెఱుంగవిధిమానమూనఁ డేవధుపుఁగనునె।
గబ్బిగుబ్బలనడనిబ్బరంబునుగనగుబ్బలిపగతుఁడుబ్బనేకరిఁ।
బాటవినవేల్పులా కాలకూటమునకుఁ। దోడఁబుట్టువునమృతంబునాడ రెపారి।
నటనమభినయమరసిననటమటమున। నచ్చరలమెచ్చెదరెవారలెచ్చనిచ్చ॥ ౯౬॥

సుగంధివృత్తము.

పొందెపొందెనేనిదీని-పొందుమానునెవ్వఁడీ। సుందరింగ్రహించియన్య-సుందరిందలంచునేఁ।
డిందిరేశపుత్రియిద్ది-యెద్దిదీనికుద్దికా। ళిందియైనదీనిఁగూడ-లీనగాదెచూడఁగన్॥ ౯౭॥

పంచచామరవృత్తము॥ సరేమ కేమిదీనిఁగాంచ - శక్రుఁడేని శేషుఁడేన్।
బరీక్షణాప్తిఁదృప్తిలేక - వందుసుందరాంగులీ।
వరాంగిమోముదామరన్ భ్రమ - వంబుగాసుభృంగులై।
పరంగుచుంగరంగుచున్న - వారిఁ కేలయచ్చరల్॥ ౯౮॥

కం॥ అనివారెంచుచునుండం। జనవునసూర్వశివలగొనిచక్రికిమ్రొక్కెన్।
మొనసినయచ్చరలకుఁబస। దనముగఁదనుహారమనఁగఁదద్ద్యుతి నెరయన్ ౯౯॥

కం॥ రంభముఖమువాడెఁగదా। రంభముఖమువాడినట్లురసమఱఁగగదా।
రంభముఖమువలెభిషగా। రంభముఖమురసకలననుగ్రాలన్ మ్రోలన్॥ ౧౦౦॥

కం॥ ముఖమునిశాంతనిశాకర। ముఖముసుఖమునిరుపసర్గముగరంభకుస।
మ్ముఖమునసయ్యుర్వశిస। న్ముఖమునుగననెటుగనినసుముఖముగదయగున్॥ ౧౦౧॥

కం॥ మేనకరంభనుగనుఁగొని। మేనకయింకేలనాకుమేనకలుగునేన్।
దీనికినెనగావలెఁగా। దేనినిదీనికిఁజెలుపుఁడనేననియనియెన్॥ ౧౦౨॥

తోటకవృత్తము.

కొనుఁడిచ్చెదదీనిని-గొమ్మనుమీ। కెనయానెయటంచుర-మేశ్వరుఁడి।
చ్చెనుగ్రచ్చఱనూర్వశిఁ-జేకొనివా। రునమస్కృతిజేసిరి-ప్రోఁదిఁగనన్॥ ౧౦౩॥

తే-గీ॥ చెలియమనమిట్టిపారితోషికమునెందు। నేనిఁగొంటిమెయీప్రభుండిచ్చెమనకు।
నేనుఁగులకంకుశంబననిదినెలంగు। నచ్చరలకెల్లనని మేనహెచ్చరింప॥ ౧౦౪॥

మ॥ పలికెన్రంభవిధుంగనుంగొనిజగద్వంద్యాసపత్నీహతిం।
గలుగంజేసితెమాకునీకలికిమాకంటెంగడున్మేలునీ।
వలనంగల్గుటనప్సరస్తతికినీవాల్గంటియేమేటియా।
వెలయన్రంభకుదీనియూరుసమతన్వొన్నుండయీవేయనన్॥ ౧౦౫॥

తే-గీ॥ పలికెమేనకశ్రీశయుర్వశికిమాకు। నెడదెగనినెమ్మియిమ్మగానిమ్మవరము।
నాఁగనాఁగాకయనియెనుభోగిశయనుఁ। డడుగఘనులనుబ్రార్థనమ్మపునెవమ్మ॥

మ॥ గజరాజావనుఁడంతసంతసమె సంగంబల్కెనిక్కల్కియం।
గజరాజావనరాజ్యలక్ష్మియని ప్రఖ్యాతింగనుంగాకొగిన్।
ద్విజరాజాన్వయకారణంబగుసుబృథ్వీభృద్ధమోద్భూతిచే।
ద్విజరాజాన్వయవంద్యయాతమఱియుర్విన్నావనిష్ఠాంబయై॥ ౧౦౭॥

కం॥ అనిపలికియు పేంద్రుఁడురం। భనటవిసర్జించెనింద్రుపంపిదెయనరం।
భను మేనకనయ్యుర్వశి। యనుజ్ఞఁగొనితోడుకొనుచునరిగెనుదివికిన్॥ ౧౦౮॥

సీ॥ ముందతిలోత్తమమూర్తిఁద్రిప్పెనుమంజుఘోషయే మేమొకోగొణుగుకొనియె।
హరిణిబిత్తరమందియటునిటుఁజూచెఘృతాచినీరుగనయ్యెఁదాఁకఁగాఁక।
సంతాపమునుజెందెనంతేని హేమయాచంద్రరేఖనిశాంతసంస్థితిఁగనె।
ధాన్యమాలినియెండదాఁకినట్లయ్యెనుబుంజికస్థలదావకుంజమయ్యె।
నుర్వశినిఁగాంచిమఱిరంభనోలిమేన। కనుగనుంగొననప్సరస్కాంతలెల్ల।
మేనకారంభలను మేలుమేలనుచును। బొగడిరటుపిమ్మటంబొరింబొరిఁదెగడిరి॥

ఆ-వె॥ తన్నుఁగట్టఁద్రాళ్లదాఁదెచ్చుకొన్నట్టు। లయ్యెనంచురంభయాత్మ నెంచెఁ।
గొఱవితోడనెత్తిగోఁకుకొన్నట్లయ్యె। నంచు మేనకమదినెంచుకొనియె॥ ౧౧౦॥

కం॥ కనుఁగొనిరుర్వశిఁద్రిదశులు। గననిమిషతయునుసార్థకంబుగనంతం।
గనిరనిమిషతందన్నో। హనీరథినిమునిఁగితేలుచనయమనుగులై॥ ౧౧౧॥

ఉ॥ అచ్చరమచ్చెకంటులఁటయక్కటయక్కఱవేల్పుయోగము।
గ్రచ్చఱనిచ్చగంజెఱుపఁగంగడునక్కఱనుక్కివంబుతో।
నచ్చటికేగితెచ్చుకొనిరంటగడంటఁగనన్నుమిన్ననా।
మచ్చరమెచ్చిసక్రియలమానుపఁబూనినహానిగాదెటన్॥ ౧౧౨॥

ఉ॥ అక్కడలక్ష్మియాత్మపతినజ్ఞతచేతనుదూలనాడియా।
పక్కిహరుమాయిఁ కేఁడుదనుఁబాసిచనన్మగఁడెందుఁబోయెనో।
యెక్కడనుండునోయెఱుఁగనెట్లగునంచుమరంతచింతచేఁ।
జిక్కిక్షమన్క్షమందిరిగిచేరెనుబిల్వవనమ్మునిమ్మగన్॥ ౧౧౩॥

కం॥ కనెనటగౌతమునిమహా। మునిస్మృతికర్తనుమహాతమోహర్తనుమో।
హనిరాసున్శ్రుతిభాసున్। వినుతచరిత్రుంబవిత్రువిదితున్మదితున్॥ ౧౧౪॥

తే-గీ॥ అమ్మహర్షియునాలక్ష్మిస్వాగతంబు। నింబుగంగొనియాడిసత్కృతులఁజేసి।
తల్లితల్లిరొమాయెడదయగలిగెనె। వచ్చితీవమ్మయిందుండుమచ్చికలర॥ ౧౧౫॥

తే-గీ॥ తొల్లిభృగుయజ్ఞముననీవుదోఁచితివట। నిపుడునాజన్నముననిందుఁగృపనగపడి।
తమ్మమాయమ్మమరునమ్మతమ్మికంటి। కొమ్మయిందుండవమ్మమేల్సమ్మదమున॥

కం॥ శ్రీవనమిదివఱకిదియగు। శ్రీవిల్వముగాననిపుడుచితముగనయ్యెన్।
శ్రీవిపిటకరుదెంచుట। శ్రీవనమిందుండవమ్మసిరులువెలయఁగన్॥ ౧౧౭॥

సీ॥ నీకటాక్షంబుననీరజాసనుఁడైన బ్రహ్మ వాక్పతియయి పొగడఁబడెను।
నీయపాంగంబుననీరజనాభుండుహరి శ్రీపతియనంగనభినుతుఁడగు।
నీకొనకనుచూడ్కి నీలకంఠుఁడు సర్వమంగళాధిపుఁడనమహితుఁడగును।
నీ క్రేవచూపుననిర్జరేంద్రుఁడు కౌశికుఁడు త్రిదివేశుఁడై కొను శ్రుతినుతి।
నీవుమంగళదేవతవీవెనసిన । నందఱుసమంగళులెయాదురన్నియనుస।
మంగళములేయగుం గల్మిమగువవరద । యురుదయంగనుమమ్ము యింపందుమమ్మ॥

సీ॥ కుజనుండు సుజనుండు సుజనుండు కుజనుండు నకులుఁడు సుకులుఁడు సుకులుఁడకులుఁ।
డజ్ఞుండు ప్రాజ్ఞుండు ప్రాజ్ఞుఁ డజ్ఞుఁడగుణిగుణి సుగుణుండు కుగుణుఁడగు మఱి।
దుష్టుండు శిష్టుండు శిష్టుండు దుష్టుండు గొనఁటి రూపరి రూపరి నగుఁ గొనఁటి।
వదరుఁబోతగు వాగ్మి వాగ్మియౌ వదరుఁబోతవు మొద్దు మానిమొద్దౌను మాని।
తల్లి నీవు శ్రీవిదయఁగన్న శ్రీమంతుఁ । డొందు సుఖముఁ గీర్తినెల్ల వేని।
శ్రీవిహీనుఁడగుచుఁ జెందెదు దుఃఖంబు । నిందఁబొందికందికుందుడిందు॥ ౧౧౯॥

కం॥ ధనముచరాచరమఖిలము । ధనరూపవునీవుగాన దజ్ఞులునజ్ఞుల్।
మునుకొనిసమాశ్రయింతురు । నినుమే మెంతుము మముఁ గరుణింపుము మాశ్రీ॥ ౧౨౦॥

సీ॥ ధాన్యలక్ష్మి మాకు ధాన్యసంపదలిమ్ము ధనలక్ష్మి మాకిడు ధనములు గడు।
ధైర్యలక్ష్మియీవె ధైర్యము నెలకొల్పు మశ్వలక్ష్మియీవె యశ్వములను।
గజలక్ష్మి మాకిమ్ము గజరాజిరాజులరాజ్యలక్ష్మి మాకు రాజ్యమొసఁగు।
జయలక్ష్మి మాకీవె జయవిజయంబులఁ గీర్తిలక్ష్మి మాకుఁ గీర్తినీవె।
యష్టలక్ష్మిస్వరూపయౌ యష్టభోగ । యోగసిద్ధిప్రదాయిని యోగిలోక।
మాతయాద్యప్రకృతిమారమా సమస్త । శస్తనిస్తులదయఁ జూడుజానుగమము॥ ౧౨౧॥

సీ॥ పంచవింశతితత్త్వపరిశీలనమునకు నీవె గురువగు నిరుపమరమ।
పంచకృత్యంబులు పరఁగు నీవల్లనం చెఱిఁగించు మా నీదుహితతమాఖ్య।
కలశసింధువునందుఁ గలిగితి శ్రీయన భూతిదయన సాంఖ్యభూతివిగద।
మంగళమోంకృతిమంగళదేవతా ప్రణవమునిగ్గదా ప్రస్తుతించు।
లక్ష్మి వరలక్ష్మి వాగ్వాచ్యలక్ష్మి సిద్ధ । లక్ష్మి శ్రీలక్ష్మియౌ మోక్షలక్ష్మి విజయ।
లక్ష్మి నీవష్టమూర్తివై లలితవగుట । నెలమి సాష్టాంగవందనమేసెనర్తు॥ ౧౨౨॥

ప్రభాతవృత్తము.

అనివినులించిన - హర్షమొందిమానీం । ద్రునికనెనిందిర - తుష్టియిష్టమానీ।
కుసుమజనీస్తుతిఁ - గూరిమింబరింపం । గనువినఁగన్గదుఁ - గల్గమేలటంచున్॥

తోటకవృత్తము.

అనిమెచ్చటనుండును - యచ్యుతుఁడం । చనిమెంచఁగనిందిర - యక్కడను।
క్కనగంబునఁజిల్కల - క్రొల్పలుకు । ల్వినవచ్చెనులచ్చికి - వింతలుగాన్॥ ౧౨౪॥

కం॥ శృంగారరసవరసమా । లింగితమగు శాంతరసములీలన్ లతికా।
లింగితముపుతరువరముతె । అంగునరంభాస్త్రీహరివలె నెనరంగన్॥ ౧౨౫॥

కం॥ గిరిశుంగొలుచుటచేతను । గిరిధరుఁడే తానగుటను గిరిధర్మంబున్।
బరువడిఁబూనెను యననా । హరియచలుండై యెసంగెనభిరుచి లేమిన్॥ ౧౨౬॥

కం॥ కనుకనుమగువకె గెలుపని । కనుకనుమగని కెగెలుపని కాఁగన్నంభా।
షణముశుకికిశుకమునకున్ । వినిసిరిపగ పుబ్బుఁగనియె బెండువడెఁగమున్॥ ౧౨౭॥

కం॥ శుకియనెసిరి గెలుచుననుచు । శుకమనెహరి గెలుచుననుచుఁజూడుమనుచునా।
శుకములువలుకఁగరమునా । యకుఁజూతుంగాకనుకొనియతఁడెందనఁగన్॥ ౧౨౮॥

లలితపదవృత్తము.

కనుఁగొనుమమ్మరో - కాంచనచేలున్ । బనివడియుండెత - పంబునుజల్పున్।
జనవునసిన్గన - జానుగఁగూడున్ । ఘనమునితోడ్కొని - గౌతముఁడేగన్॥

కం॥ అవిరళకిసలయసుమఫల । వివిధలతాభూరుహాళివిలసితమిబి।
ల్వవనముగావునవనమా । లివసించునిటందగున నెలిలమెయిన్ శ్రీ॥ ౧౩౦॥

సీ॥ పులులమైనాకుచుఁబొదుఁగుచేఁపఁగఁబాలఁగ్రోలించుబలిసినయాలగములు।
లేఁగలమైనాకు వేఁగులగుముల నేనుంగుతీఁటను బాపుసింగములను।
సింగమ్ములంగొమ్ములంగీఱుగొరులఁగప్పలగొడుగులౌ సప్పములను।
జిలువలతలలెక్కి చెలువొందుకప్పలఁ జెలిమినొప్పెడుపిల్లి చిట్టెలుకలఁ।
గాంచు చెంతయునద్భుతబంబుఁగడుముదంబు। నహహమన్నాథుఁడద్భుతావహాతపోఽన్వి।
తుండుగోపాలుఁడుహరివిష్ణుండెయగున । టంచు నెంచెహరిప్రియయనియెనట్లు॥

కం॥ ఎన్నఁడు నేనెఱుఁగనియది । యన్నిపరిమళములద్రిమింగియరుదెంచుచుఁదా।
నన్నెంతయువలపించును।బ్రన్ననివలపాకఁడెదియొకొవలయునుదెలియన్॥ ౧౩౨॥

కం॥ అనఁగాగౌతముఁడిట్లని । యెనుయోగీశ్వరుఁడువిష్ణుఁడిటఁబటుయోగం।
బునుబూననతని మేనన్ । దన రెనుసౌరభ్యమదిదెతల్లియెఱుఁగుమా॥ ౧౩౩॥

కం॥ అనఁగఁగుడినుండియెడమకుఁ । జనుచుంగరుడుండుసూచిచయ్యనవచ్చెన్।
వనజకరకెఱఁగెమఱియనె । జననీనీరాకరాకచక్రిందునికా॥ ౧౩౪॥

కం॥ అనసిరియనెవినతతనయ । వినతతనయక్షేమకారివిగదనినుఁగనన్।
జనులెల్లరకవునుశుభము । లనమాకొనరవెయిఁకనిటనవుతన్మాకున్॥ ౧౩౫॥

కం॥ అనిమార్గదర్శిగనుమును । వినతానందనుఁడరుగఁగ వెనుకనరుగుదే।
రనుగౌతముండునడుమన్ । దనరెనుసిరిదయితయయినదయితుఁడనంగన్॥ ౧౩౬॥

ఉ॥ కాంచెనుదుగ్ధవార్ధిసుతగట్టరుదందికొలంకొకండటన్।
సంచితనీరపూరితముసారససారససారసాన్వితం।
బంచితతీరభూరుహసమంచితమంజునికుంజపుంజమున్।
భ్రాంచితమందమారుతముదంచితచంచలచంచరీకమున్॥ ౧౩౭॥

కవిరాజవిరాజితవృత్తము.

కనియనెసింధుజకంధిమథించుట - గాస్ఫురియించును గాంచఁగదీ।
నినిగొలనిద్దియెసంద్రముగట్టున - నెక్కొను చెట్టులునుంబొదలున్।

మొనసిన వేలుపురక్కసులిమ్ముగ - ద్రోసెడుతుమ్మెదబారహారా।
జునుమఱిమందమరుత్తుగిరీంద్రము - చూవెయదే మొవిశేషమిటన్॥ ౧౩౮॥

కం॥ ఈసరసుఁగనుఁగొనఁగనా । కాసరసుసరోరుహాక్షునాలోకనముం।
జేసినయట్లానందము । వాసిగనగుఁగతమదే మొవలయున్ దెలియన్॥ ౧౩౯॥

కమలవిలసితవృత్తము.

కమలవిలసితము-గదయిది గానన్ । గమలనయనుఁడనఁ-గనఁబడు సోనాన్।
గమలజననివిను-కమలజమాతా । కమలదృగితమని-గరుడుఁడువల్కెన్॥ ౧౪౦॥

ఉ॥ మున్నుత్రివిక్రమాంఘ్రిభవబొందునుగానుతిముజ్జగంబులం।
బన్నగమిన్నవాఁకతనిబాహులఁగల్గుటఁదీర్థమిద్ధిభూ।
భృన్నుతమాఁదదీయముఖబింబితమాటద్విజేడ్యమూరుసం।
గోన్నతమాటవైశ్యహితమోలిఁబదాప్తిసదంఘ్రిజాప్తమా॥ ౧౪౧॥

కం॥ నారాయణనిర్మితమగు । నారాయణతీర్థమిద్దినారాయణున।
ప్లౌరుచిరముగావుననే । నారాయణినీకునట్టులగపడుఁదగుఁగా॥ ౧౪౨॥

ఉ॥ అంటివిగాదెయీసరసునందువిశేషమెదోయటంచదే।
వింటివితల్లి వేఱొకటివిన్నెదవిన్ము విశేషమిందునేఁ।
గంటినిదమ్మికంటిఁగనఁగానగునీసరసిన్మునింగియే।
యంటమిదీనిఁగానఁబడఁడచ్యుతుఁడంధులకబ్జుఁడాననన్॥ ౧౪౩॥

చ॥ అనియదియేమితెల్పుమనియబ్జయుఁగోరఁగవైనతేయుఁడి।
ట్లనెజగదంబయంబుజదళాక్షుఁడుయోగనుదీక్షితుండుమున్।
దనకుజువందునుర్వశినిఁదాసృజియించియొసంగిరంభనుం।
బనిచియొరుల్దనుంగనఁగవల్దనెఁగానఁగనైతినాతనిన్॥ ౧౪౪॥

ఉ॥ అంతటువంతనెంతయుమహాతపమొప్పనెనర్పనాయెడం।
గొంతదయారసంబొలయఁగుంజరరంజకుఁడంజకుండునీ।
పొంతమదీయతీర్థమునమున్గిననన్గనసౌనునీకనెన్।
సంతసమొందసుకృతజిశౌరియెతౌనశరీరవాక్కునన్॥ ౧౪౫॥

కం॥ నాఁటంగోలెనునేనీ । చోటనిలిచియుందునాడిచూచెదనతనిన్।
బాటింపుమునానడవడి । వాటమనఁగశ్రీయునటుప్రవర్తింతుననెన్॥ ౧౪౬॥

తే-గీ॥ అరయనారాయణాష్టాక్షరాత్మకమగు । నల్లనారాయణనుతీర్థమందుఁగ్రుంకెఁ।
బ్రణవమాత్రాక్రమాఖ్యుఁడైపరఁగుటనన । నాగరుత్మంతుఁడొప్పెబ్రహ్మాత్మకుఁడుగ॥

తే-గీ॥ కనఁగనారాయణుండెశంకరుఁడటంచు । గౌతముండటనభిషేకకలనఁగాంచె।
నలరెగంగాధరుండననాత్తభూతి । భూరిరుద్రాక్షమాలికాధారియగుచు॥ ౧౪౮॥

తే-గీ॥ యద్యదాచరతిశ్రేష్ఠయనుటనెంచి । కమలమనఁబ్రణవంబౌటఁగాంచికమల।
కమలనాభసరోవగాహమునమించె।సింధురేంద్రాభిషిక్తనాఁజెలువుఁగాంచె॥ ౧౪౯॥

కం॥ పిమ్మటఁ గౌతముఁడమ్మరొ । కొమ్మను గని యట్టులుంట గోఱలుఁగ దయనేన్।
సమ్మతమదె నాకనఁ శ్రీ । కమ్మని శైవమతధర్మములరఁగఁదెల్పెన్॥ ౧౫౦॥

సీ॥ పాలమున్నీటిలోపలఁ బుట్టినదటంచుఁ దెలుపునా వెలిపట్టువలువ యలర।
నమృతాంశుతోఁ బుట్టువగునంచు చెలఁగించునన ముద్దు మొగము భూత్యంచితముగ।
శివతనువున నెప్పశివ గౌరియనఁ గుంకుమంపు బొట్టులికంబు నింపునింపఁ।
బతినివక్షోజాప్తిఁ బరఁగించు శ్రీయనరుద్రాక్ష హారమురుచిరముగను।
దానరుదు రాకపేరుచేతను మధుప్ర । తాళిచేనబ్రముగనందమందుచున్న।
యలరుసంపంగి తీఁగనానలరెనుసిరి । హరితపక్షిలమననుదయార్కరుచిగ॥ ౧౫౧॥

ఆ-వె॥ అంతవిష్ణురఘుఁడు ధ్యానించె ధ్యానింప । నలరి యోగనాథుఁడగపడె హరి।
మ్రొక్కి విన్నవించెఁ బక్కిఱేఁడో శ్రీశ । యరుగుదెంచె గౌతమానుగనిరి॥ ౧౫౨॥

కం॥ ముదలయెతో ద్ధేరనన । న్నదయుండో మునియె యోగినారాయణుఁడ।
జ్ఞోదవఁగముద ముసుపర్ణుఁడు । పదిలముగా గౌతమునినిబద్మఁగొనిచనన్॥ ౧౫౩॥

ఉ॥ గౌతముఁడిందిరేశ్వరునిఁ గాంచినమస్కృతులొప్ప నెప్పగా।
నాతఁడు క్షేమయోగముల యజ్ఞసమాప్తిని నారయంగ సం।
ప్రీతుఁడవీవు గావునను బేర్మినిఁ బ్రోచుట నేఁగృతార్థవి।
ఖ్యాతి వహించినాఁడ సుఖిగా నయితింజగదీశయంచాగన్॥ ౧౫౪॥

కం॥ వినుతించె నురజనీముఖ । వనితమహానటజటోరుపటలపరిలుఠ।
ద్ఘనతరతరంగసంగగ । గనగంగాలహరిభంగి గావాగ్ఝరియున్॥ ౧౫౫॥

పద్మనాభవృత్తములు.

శ్రీనాథనీవేయకారంబుగానన్వి - రించిస్వరూపంబునన్వాగ్విభుండా।
దోనాథనీవేయుకారంబుగానంజ - సోల్లాసముంజేసిలక్ష్మీప్రభుండా।
దానాథనీవేమకారంబుగానన్హ - రాకారముంబొందికాశీశ్వరుండా।
దేనెంతునీవేమహోంకారమంచాట - నీవేపరబ్రహ్మమాదాదిదేవా॥ ౧౫౬॥

శ్రీకాంతనీపేరనేతారకంబొప్ప - సిద్ధంబుప్రాసాదముంగేశవాఖ్యన్।
నీకైనయప్పద్మనాభాహ్వయంబందు - నీవేశివుండాదువోవిష్ణువాజీ।
వాకారతన్దేవరూపంబునంబొల్తు - వైక్యోపదేశంబునుంజేయుదీవే।
కాకెవ్వఁడాఁదీర్ఘపాదుండులోకేశ - కావింతునీకున్నతుల్గొమ్ముతండ్రీ॥ ౧౫౭॥

శ్రీవల్లభాయల్లవైకుంఠమాఁగాదె - శ్రీభంగినోంకారమేయద్దియోదే।
వావిశ్వమాఁగానవైకుంఠనామంబు - వైకుంఠనామంబువాలారునీకున్।
నీవాదువిశ్వంబువిశ్వేశుఁడున్నీవ - నిన్నెన్నఁగానయ్యనంతుండుఁజాలం।
డేవాఁడనిన్నెంచనీశక్తినింగాంచ - నేలంగదేనన్నునోవాసుదేవా॥ ౧౫౮॥

శ్రీశుండనంబ్రహ్మయావాక్పతిప్రఖ్య - శ్రీశుండనన్శంకరుండాఁగదాబి।
ల్వేశుండుగానొటలక్ష్మీపతిత్వాప్తి - శ్రీశుండవాదీవభేదంబుగాదే।

శ్రీఖండనన్ రూఢిచెల్వొందునీయందె - యీఖండనన్ లక్ష్మియీయాటచేసి।
ప్రాశస్త్యమొక్కంతగంగార్ఘ్యమల్లెమొ - భావించితింబ్రోవుమాపద్మనాభా॥౧౫౯॥

మాలినీవృత్తము.

అనినుతిసొనరింపన్-హర్షముంగాంచియెంతే । ననెహరిమునిముఖ్యా-యడ్గుమేదైననిత్తున్।
వినుతమవుతయుష్మ-ద్విశ్రుతస్తోత్రమాప్తా । వననిధియనియెన్నన్-బల్కెమౌనీంద్రుఁడంతన్॥

ఇంద్రవజ్ర॥ ఈయన్ను లేనందున - నిన్నినాళ్లీ । వోయన్నయేసిద్ధిని - నొందవైతీ।
వీయింతినింజేకొను - మెల్లసిద్ధుల్ । శ్రేయంబులౌనీకిట - శ్రీనిఁగొమ్మా॥౧౬౧॥

ఉపేంద్రవజ్ర॥ జనించునీకొమ్మకుఁ - జక్కఁగాఁగే । లనొక్కశ్రీవృక్షము - లక్షబిల్వా।
ర్చనంబునుంజేయుము - శంకరాంగం । బునందునీవైక్యముఁ - బొందెదంతన్॥౧౬౨॥

కం॥ అనియమ్మాయనిపిలిచిన । వినయమ్ముభయమ్ముఁబ్రేమపెనఁగొనశ్రీనా।
థునిమ్రోలఁగేలుమోడ్చెను । వనజాక్షుఁడునవ్వెరెండవదియిదియనుచున్॥౧౬౩॥

కం॥ ఏమడిగిననేమగునో । యీమందస్మితముకతమునెఱిఁగెదమఱియు।
ష్డేమియనుడువకయడుగుమె । నేమంబనిసతియుఁబతికినేవయొనర్చెన్॥ ౧౬౪॥

కం॥ ఈరీతిందగలక్ష్మీ । నారాయణులనటఁగూర్చియాదంపతులన్।
గారవమునవీడ్కొనిచనె । నారాకాబ్జులనినుఁడననమ్మునియంతన్॥ ౧౬౫॥

చ॥ అణిమనుమధ్యమందునుమహామహిమంగటియందుగుబ్బలం।
దునుగరిమంబునాలఘిమదోఁపఁగమేననుబ్రాప్తినందమం।
దెననిప్రకామ్యమీశతనిజేశ్వరునందువశిత్వమాత్మవృ।
త్తినిఁగలదైభజించెరమదృష్టుఁడుగాహరియోగభూతినాన్॥ ౧౬౬॥

కం॥ చెప్పించుకొనకయేపను । లొప్పిదముగఁజేయుమగనియుల్లమెఱిఁగియా।
యొప్పులకుప్పజగంబునఁ । జెప్పఁబడదెయోగినియనిశ్రీయామెకదా॥ ౧౬౭॥

శా॥ ఆనారాయణుఁడిందిరాన్వితుఁడుగానాయేకవల్లింగనెన్।
స్నానంబుంబొనరించెభక్తిఁగమలాంచద్గౌరితీర్థంబునం।
దానాగాననుఁదుష్టినాముఁదనుమధ్యాబిల్వనాథేశులన్।
జ్ఞానావల్లిపతిన్భజించెనొగిఁగంజాక్షుధరంబుంగనెన్॥ ౧౬౮॥

ఉత్సాహము॥ అందుఁజిత్ప్రకాశతీర్థ - మందుఁజేసిస్నానముం।
బొందుమీఱఁగానువెదకఁ - బొందియత్రిజార్చితం।
బిందబిల్వమాలయంచు - నిందిరదనకీయనా।
యిందిరేశుఁడొందెనొక్క - యింద్రనీలలింగమున్॥ ౧౬౯॥

కం॥ శైలజముస్వయంవ్యక్తము । శ్రీలలితమురత్నమయమునిద్ధించెఁగదా।
యీలింగమునీదండన్ । బోలంబూజింపుమనఁగఁబురుషోత్తముఁడున్॥ ౧౭౦॥

వనమయూరవృత్తము.

ఔవనమయూరగళ-మట్టులిదిలింగం । బౌవెలయుబిల్వదళ-హారమహియట్లో।
శ్రీవనమయూరమనఁ-జెన్నుగనిదానా । శ్రీవనమయూరమనఁ-జెన్నగుననన్ శ్రీ।

మాలిని॥ మునిమహిమనెభూభృ - ద్భూతినోత్క్షేత్రమాహా।
త్మ్యనిరుపమతనోయీా - దండనూత్నంబుగానే।
తనరుసుమునునీకే - దత్తమయ్యెంగదానాఁ।
జనుననిహరిదాల్చెన్ - శాంకరానందమొందెన్॥ ౧౭౨॥

కం॥ వనమాలియుఁదల్లింగముఁ। గొనిచనితనయాశ్రమమునకున్భూషణమై।
యొనరఁబ్రతిష్ఠించెనుమే। లనువుగఁగైలాసనాథుఁడనిపేరిడియెన్॥ ౧౭౩॥

శా॥ ఆసింధూద్భవభర్త్రనుజ్ఞఁగొనిలింగారాధనంజేయఁగా।
నాసక్తిందపమూనెగ్రీష్మమునఁబంచాగ్నుల్వెలుంగందపో।
మాసంబందునుగంతదఘ్నజలముంభానిల్లఁగాసారమం।
దాసర్వోత్తమసత్తపోమహిమచేనాబిల్వనాథాప్తిచేన్॥ ౧౭౪॥

## శ్రీలింగాష్టకము.

సీ॥ బిల్వంబువిశ్వంబుబిల్వబీజంబొండెయుండెనద్వైతంబునోజనంత।
ద్వైతంబనస్మొల్క-ద్వైవారెఁదొల్దొల్తరెండాకులుగఁబైకినుండిచూడ।
నడరెనంతనువిశిష్టాద్వైతభంగినిద్రిదళమైషడ్దళమొదవశైవ।
ముగఁదోఁచెవైష్ణవముగనెప్పెద్వాదశదళముగామఱిపంచదశదళముగ।
శాక్తముగపడెనష్టాదశదళముగను। యోగమిరువదినాల్గాకులొనరబ్రాహ్మ।
మఖిలమూలమునవదళావాప్తిసాంఖ్య। మొక్క-బిల్వంబుశ్రీకేలనుప్పతిల్లె॥ ౧౭౫॥

ఆ-వె॥ పసిఁడిగుండ్లనంగఁబండ్లైన్నెశివలింగ। ములుగవెలయుటనిదెముఖ్యలింగ।
మనుచునల్లబిల్వమునకునుమునుకొని। పూజసేయుచుండెభువనజనని॥ ౧౭౬॥

ఇంద్రవజ్ర॥ ఆదిత్యవర్ణేతప - సోఽధిజాతో। నాదివ్యమీద్యంబిదె - నాఁగవేదం।
బాదిత్యవర్ణంబున - నప్పుడొప్పెన్। శ్రీదేవతల్మానులుఁ - జేరిమ్రొక్కన్॥

అమృతవాహిని॥ జ్ఞానప్రదంబుశ్రీదంబొ। చీనత్వపరిహారకం।
బౌనీబిల్వంబటంచెంచెన్। జానుగానుబురాణముల్॥ ౧౭౮॥

ఉపేంద్రవజ్ర॥ రమాకరోద్భూతత-రాజిలున్శ్రీ। ద్రుమంబనంబిల్వము-రుద్రలింగై।
క్యమొందుటంబొందుగ-జ్ఞానవృక్షం।బమర్త్యులుస్మర్త్యులు-నాశ్రితుల్గా॥ ౧౭౯॥

అమృతవాహిని॥ శ్రీలింగమునబిల్వంబొ। శ్రీలింగంబుగఁగొల్చుటన్।
శ్రీలీలశ్రీలనిడుటన్। శ్రీలసన్నామమూనుటన్॥ ౧౮౦॥

శా॥ శ్రీలింగంబగుశ్రీకుజంబుఁగొలువన్సిద్ధించుటబ్రంబొకో।
శ్రీలెల్లంగనఁబత్రముల్ఫలములున్శ్రీముఖ్యముల్శ్రీదముల్।
సాలంగ్రాలెడుశ్రీఫలాఖ్యనఖిలైశ్వర్యప్రదంబిద్దియా।
శ్రీలుర్శ్రీఫలసక్తులెంతురగుటన్శ్రీశ్రీయెయంచెంచెదన్॥ ౧౮౧॥

## బంగారము.

ఓంకారమయసహస్రోరుశిఖరములుచెలఁగితెల్పసహస్రశీర్షుఁడనుచు - సేవించెద।
నలువొందిత్రిదళముల్బలుపొందితెలుపంగనగునీతఁడేసహస్రాక్షుఁడనుచు - నభినుతింతు।

మహి నెల్లవ్యాపించి మలయు మూలంబులు ప్రకటింపఁగా సహస్రపదుఁడనుచుఁ - బ్రస్తుతింతు।
శివమంత్ర సూచకమవు నంజలిదశాంగుళమను నాఁగ దశాంగుళమనఁ దగుచు - గమనించెద।
వారిజారిమౌళియై రవిరుచిమించి - సౌరుఁ గాంచి।
యమృతకలన ఫలములమరఁ గాండములుగ - నభిలషింతు।
శివుఁడు శ్రీకుజమనఁ జెలఁగు శ్రీబిల్వేశు - శ్రీదు నెంతున్।
వలను మీఱ శ్రీలువర్ధిల భావింతు - భక్తిఁ గాంతున్॥ ౧౭౨॥

కం॥ శ్రీలింగము శ్రీలింగము। శ్రీలింగము శ్రీదనుగుట శ్రీలింగముగున్।
శ్రీలష్టప్రకృతులగుట। శ్రీలింగాష్టకమిదియిడు శ్రితులకు శ్రీలన్॥ ౧౭౩॥

కం॥ అదిమాత్రాత్రయనేతు। ప్రధానతత్త్వోపదేశవందితభాస్వ।
త్త్రిదళంబుగఁ బరఁగఁగహరి। ముదమొందెన్ శ్రీఫలమిదెము క్తిదమనుచున్॥ ౧౭౪॥

కం॥ శ్రీశుండా శ్రీదలముల। శ్రీశుం గైలాసనాథు హితుఁ జేసెను శ్రీ।
రాశిని నర్ఘ్యంబులన। బ్రాశిఁదను పునట్లు శ్రీకరము శ్రీనిధిగాన్॥ ౧౭౫॥

ఆ-వె॥ స్థానషట్కమునను జనులక్షసంఖ్యయా। టనుషడక్షరశివమనువునకెన।
గాంచి లక్షసంఖ్యఁ గావించె బిల్వార్చ। నంబుఁ బూర్ణమౌ ఫలంబుగలుగ॥ ౧౭౬॥

ఉ॥ పూజితుఁడాట బిల్వదళపుంజము చేహరిచేత నట్లటన్।
రాజతశైలనాథుఁడొగి రాజిలె శ్రీకరలింగమైన శ్రీ।
భూజమునం గ్రిశీకరభూతము వేఱొక బిల్వలింగమా।
నాఁ జెలువొందె వెండియుఁ గనన్ శివులేకద బిల్వసాలముల్॥ ౧౭౭॥

తే-గీ॥ అట్లు కైలాసనాథునికచ్యుతుఁడిడి। నవియు బిల్వదళములెల్ల నంది బిల్వ।
నాథుఁడొప్పెనతం డేననానరిదియె। విశ్వనాథుండుఁ దాఁగదా వినుతుఁడెందు॥

తే-గీ॥ ఎందునే నెవ్వరేనియు నెట్టులేని। బిల్వదళములనిడఁదానె పేర్మిఁగొంట।
బిల్వనాథుండగును ధనివిబుధుఁడుజన। పతియి నుండు ఘనుండును వననిధియన॥

సీ॥ బెబ్బులితోల్మొలఁ బేర్మి మువ్వన్నెలవల్వ నానెంతయుఁ జెల్వుమీఱ।
గబ్బుఁ జెక్కులఁ గలమొగంబుతోల్కండువా సంజచీఁకటితోడఁ జదురులాడ।
ముబ్బాదిరేకలఁబు ఱెరుదురాకమారెడు పేరులమయి పాల్కడలినెనయ।
జొబ్బిల్లు పూఁదేనె సోబఁగొందు మిన్నేటి తమ్మి నాఁదలనెలదళుకుఁ జూప।
గబ్బిగుబ్బలికూఁతురు ప్రబ్బికొనఁగ। నబ్బలుమగండు బిల్వేశుఁడబ్బనుబ్బ।
గుబ్బకొమ్ములుగల్గినగిబ్బనెక్కి। గొబ్బనవ్వచ్చె హరిఁ గాంచనబ్బురముగ॥ ౧౮౦॥

కం॥ సోముఁడఁటవృషభగతుఁడఁట। కామితఫలములిడుటరుదెకననతులకనం।
గావృడుఁడుమనీకూడిక। సోముఁడువృషగతుఁడుశుభదుఁడుఋటరుదెయనన్॥

ఉ॥ కాంచుము బిల్వనాథయిది గామన బిల్వవనంబిటంగనం।
గాంచన బిల్వవృక్షములుగన్పడు నాఁదను మధ్యమారమా।
కాంచనగాత్రి చేఁబొడమి క్రాలెడు శ్రీమయలింగ మొందుత।
త్ప్రాంచితకాంతి బిల్వవనమంతయు నట్లగు నన్న గౌరియున్॥ ౧౮౨॥

శా॥ ఆనారాయణతీర్థమొప్పె నిటఁ గంజాతోత్థులేకంజము
ల్గానారాయణిచూడ్కు లుత్పలములుంగా నప్సరోదృష్టులే
మీనంబుల్గను బుల్గులేఁడెకదుఁ బేర్మిం గామరాశంబున
త్పానీయంబమృతంబుగన్ శ్రితులె కాన్వాంద్యుల్మనుల్నిర్జరుల్॥ ౧౯౩॥

సీ॥ తమముబంధించుటదగునన నాదలనుజటాకిరీటంబు శోభిలంగ
సత్త్వంబు వెలికుబ్బె సంభ్రమంబుచందంబున ననవిభూతి మేనను జెలంగ
రజము పైఁగాల్గొడు గ్రాలుకన్గెలుకులనింపునింపున సంగఁ గెంపెసంగఁ
జంద్రసూర్యులనంగ శంఖచక్రంబులు పాణిపద్మంబులం బసఁ బొసంగ
నగ్నియన దక్షిణపుఁ బాణి యభయముద్రఁ । బరఁగ వ్రాలవామోరువుపాకు కరము
మడిచి కుడికాలెడమకాలు మహికిఁ జాచి । పొలుచు యోగనారాయణుఁ బొగడెదమది॥

మ॥ కుడికేల్పూరుషులారమీరలిచటం గొంకొందవల్దంచుఁ జూ
ప్పడఁగం దెల్పుననంగ నొప్ప నెడమన్ వాలారు కెంగేలు నా
త్తొడపైఁ జేరఁగనింక నెందఱి తివల్ దోతెంతురో యంచు ఫీ
నడరం జేయఁగ నప్సరస్తతికి నింపావాని నే నెంచెదన్॥ ౧౯౪॥

మ॥ అమరం దక్షిణపాణి నక్షరమయంబై బిల్వవృక్షంబు ప
ద్మము పద్మాకృతి వామభాగకరపద్మంబందుఁ బద్మాసనా
స్తిమ రాశాండజరాజహస్తిరథులు న్వేఁడంగటాక్షంబుఁ బా
ర్శ్వములం గొల్వయియుండు నీరమను బిల్వం బద్మఁ గీర్తించెదన్॥ ౧౯౫॥

చ॥ అమృతముమున్ను దెచ్చి తనయంబది దాస్యము మాన్చె మానెఁ దా
నమృతసరస్సునర్చి యిట నయ్యమృతోద్భవబిల్వవాటి స్వాం
గముగ నుబ్రోచు చూంబక జగత్పతి దల్పరికింపునింపులో
కమహితుఁ డెవ్వఁడవ్వినత గాదిలి పిన్నకుమారు నెన్నెదన్॥ ౧౯౬॥

మ॥ తనుశ్రీ శుండు ప్రతిష్ఠ నే నెనెన నెన్దారా స్తమా శ్రీనతే
నను నాఁగన్ హరిరత్న మైత్రుణము నొయ్యంగొంచు భక్తార్పితం
బును బిల్వంబొకఁ డొంది పెక్కుసుఖముల్వొందించుచున్నిం చమనీ
ఘనవర్ణుం ఘనుఁ గొల్తు బిల్వపతినిన్ గైలాసనాథాహ్వయున్॥ ౧౯౭॥

ఉ॥ శ్రీకరజంబుగా వున నుస్వీయులకిష్టదమాటచేతఁ దా
శ్రీకరమన్న పేర్వడసి శ్రీదళమున్మఱి శ్రీఫలంబునై
శ్రీకరపూజితంబునయి శ్రీరుచిఁ గాంచు మచ్ఛ్రీయెమైన యీ
శ్రీకరలింగముం గొలుతు శ్రీతరులింగమపీవె శ్రీశనాన్॥ ౧౯౮॥

ఉ॥ మండపమొండుగల్గెనవమణ్యభిశోభితశాతకుంభస
న్మండితమండజధ్వజమనఃపరికల్పితమద్భుతాద్భుతం
బండజరాజశాయి మదినర్పణ సేసెను దాని నేర్పుతో
నండజరాజమండసునకంబకవాసము సేయనాయెడన్॥ ౨౦౦॥

తే-గీ॥ మండప స్తంభ బద్ధరంభలు పలాశ । వీజనములను వీవంగ వైజయంతు।
లశరనచ్చరలపతాకహస్తములుగఁ । బూవుబెత్తులు గోలాటపుంజడలుగ॥ ౨౦౧॥

కం॥ అమ్మండపమ్మున శివుం । డిమ్ముగ వసియించె నవ్వడెంతో సంతో।
షమ్ము వెలయఁ దూర్యములా । స్యమ్ము డిమ్రో నెంజలదము హెూదధులనఁగన్॥ ౨౦౨॥

సీ॥ సంయములన్నా దాను సంధానమున జనుల్ దౌర్యత్రికంబునఁ దనివిసనఁగ।
బిందుసందర్శనానందంబుఁగన మునుల్ మనుజులు వేశ్యలమరిగికనఁగ।
సకలామృతాశనుల్ సకలామృతాశనుల్ విజ్ఞులజ్ఞులుదృప్తివిలసితులుగ।
సౌరిదిఁబ్రాణాయామశరణులుగా యోగులామోదయుతులుగా నవిదితహితు।
లలరసాంఖ్యులుగనిలక్ష్యములఁగనుకని । వైఖరీశరణులు వచోభంగిఁబొంగ।
నుత్సవము బిల్వనాథున కుత్కటముగ । నఖిలహృదయంగమంబుగ నవ్వడయ్యె॥ ౨౦౩॥

కం॥ అష్టాపదధరధర్మన । కష్టాక్షరమంత్రలక్ష్యుఁడష్టైశ్వర్యుం।
డష్టాంగయోగుఁడాహరి । సాష్టాంగనమస్కృతిత్రయంబునఁ జేసెన్॥ ౨౦౪॥

తే-గీ॥ వందన మొనర్చి లేచియింపొందనిందు । ధరునిఁగనఁ గేలుదామరల్సరగముడుచు।
కొనెనెయనసంజలిఘటిల్లఁ గోర్కులూరఁ । దమ్మికంటి ముదశ్రువుల్దనుకఁబలికె॥

దండకము.

సర్వంసహాత్మా మహాత్మా సుకేశీశ్వరా భాస్వరా భౌమతాతా సమస్తాత్మభూతా విభూ యోవిభూతీశ భూతేశ శంభూ స్వయంభూ లసద్భావ సద్భావ సద్వైభవా దేవ సద్యోభవా । శ్రీభవా జీవనాకార ధీరా యహంకారసాకార సోమా సహస్రా సచక్రాయుధా దేవ యోవామదేవాకృతీ । శ్రీపతీ పశ్వినా దేవ యోవహ్నిరూపా స్వపత్నీకృతస్వాహ పుత్రీకృతాంచత్షడాస్యా షడాస్యోరుమంత్రాత్మకా బుద్ధిరూపా యఘోరా మహాఘోర త్రిస్థాన । శ్రీశానదేవా జగత్ప్రాణమూర్తీ శివావల్లభా దుర్లభా యోమనోవేగ రాజద్గురూ మద్గురూ యోప్రకృత్యాత్మ తత్పూరుషా తత్పరా సత్పరా హస్తవిన్యస్తసద్రామ యోవిద్విషద్భీమ । శ్రీభీమదేవా మహేశాన యాకాశరూపా దిశాధీశ సర్గైకభాస్వత్పితా యోత్రివర్గాపవర్గైకదాతా శ్రితప్రీత యోభోక్త క్షేత్రజ్ఞ సర్వజ్ఞ సద్భద్ర । శ్రీరుద్రదేవా మహావీరభద్రాత్మ సూర్యాత్మకా విశ్వకర్మోద్భవాధీశ తేజోమయా చిన్మయా నందనీభూతమందా యమందా మహావ్యాహృతీరథ్యబృందా దయానందితాశేషబృందారకా భక్తసందోహమందార కామేశ । శ్రీమన్మహాదేవ చంద్రస్వరూపా సురూపా కృపాపారకూపార నారీమణీరోహిణీప్రాణకాంతా సుకాంతామృతాంచన్నిశాంతా సుశాంతా సుపుత్రద్బుధా సద్బుధానందసంధాయకా మానసాకార సన్మానసాకార గాయత్ర్యుపాస్యా వరాస్యా సదామోదితప్రాగ్ర్య । శ్రీయుగ్ర దీక్షాంగనాసంగతా ప్రాప్తసంతాన సంతానసంలక్షితా దీక్షితా యాత్మనిత్యా సుసత్యైకలక్ష్యా మహెూంకారవీక్ష్యా జగద్రక్షకా దేవదేవాఖ్య । శ్రీముఖ్యనామాష్టమూర్తీ మహాష్టాపదాద్రీశవర్తీ మరుచ్చక్రవర్తీ హృతార్తీ యభక్తోత్కరార్తీ శివా శంకరా నీకు సాష్టాంగముగ్గా నమస్కారము

ప్రత్నసంఖ్యాప్తిగాఁ జేయుచున్నాఁడఁ గన్గొన్నఁ గాఠిన్యముం ద్రవ్యముం జీర్ణతోష్ణత్వ ముల్ ప్రాణముఖ్యాదిసామర్థ్యము న్నాశరంధ్రావకాశంబు చక్షుస్సతేజంబు స్వాంతంబు నయ్యాత్మయు న్నివ యాదింతియే కాక తన్మాత్రలున్ జ్ఞానకర్మేంద్రియంబుల్ ద్వితీయం బులే యాను బంచాననా దేవపంచాననా పంచకృత్యేశ పంచాత్మకా పంచమా పంచ మాంచత్సుమంత్రాంచితా ప్రాంచితా వేళ యెంచెంచి నిన్నెన్న శక్యంబె సర్వంబు నీవాడు సర్వేశ బిల్వేశ మన్నాథ శ్రీనాథ శ్రీబిల్వనాథా యివే నీకు నా మన్నమస్కారముల్॥

## అష్టదళపద్మబంధస్రగ్ధరావృత్తము.

భామాద్రుశ్రీసబిల్వా - భవశివమృడస - ద్భాసరత్నాకరమాభా।
భామారత్నాకరసద్భా - స్వరహరవరచి - ద్భావిరుద్రాక్షమాభా।
భామాక్షద్రారువిద్భా - భవభయహరదా - ర్వాసమత్రానుమాభా।
భామానుత్రామసర్వా - వరమిడుసుఖబి - ల్వాబిసశ్రీద్రుమాభా॥ ౨౦౭॥

మ॥ అనుచుంబల్కుచుఁ జాఁగిలంబడఁగ నయ్యబ్జాక్షునిన్ లేవనె।
త్తెనుశంభుండువరాహరూపమునఁ బృథ్విన్విష్ణుఁడష్టాప్పనె।
త్తినభంగిన్మఱిగౌఁగిలించుకొనెనైంద్రీదిగ్గజంబంజనం।
బునుబోలెంబొడకట్టెనట్టనఁ బయఃపూరద్వయైక్యంబొగిన్॥ ౨౦౮॥

కం॥ సర్వామరోత్తమత్వము । సర్వజగత్పూజ్యతయును సర్వసుసిద్ధుల్।
సర్వస్వాతంత్ర్యంబును । సర్వేశ్వరతయు నెసంగె శర్వుఁడు హరికిన్॥ ౨౦౯॥

శా॥ నాసామేనుగ్రహించెనీచెలియలెన్నన్ శేషమైయున్నదీ।
నాసామీవుగ్రహింపుమీహరియనన్నారాయణుండావటన్।
నాసామీయనిశంకరార్ధతనుఁడై నామైక్యతన్నిత్యుఁడై।
భాసిల్లెన్ శివయోగసన్మహిమభాస్వత్స్వాపరాగంబుగన్॥ ౨౧౦॥

తే-గీ॥ అట్లుశంకరనారాయణైక్యమొప్ప । దక్షిణార్ధంబుశంకరతనువునుత్త।
రార్ధమరయంగనారాయణాంగమునయి । యుండెశంకరనారాయణుండనంగ॥

సీ॥ దక్షిణోత్తరములఁదలజడముడియునుబొమిడికమునుగరమమరుచుండ।
వలపలదాపలఁబవలురేయెండ్లుగన్నులరూపుఁగనిలలివెలుఁగుచుండ।
ఫణిఫణామణికౌస్తుభమణియురంబునంబుంస్త్రీవిభాగాప్తిఁబొలుచుచుండ।
ముమ్మొనవాల్వేయిమొనలవాలునుగుడియెడమచేతులయందునడరుచుండ।
దక్షవామోరువులయందుఁదనరఁగఁబులి । తోలుసుంజాళువావల్వద్రాలఁజాల।
నభయవరదహస్తంబులుశుభదములుగ । నుండెశంకరనారాయణుండతండు॥ ౨౧౨॥

మ॥ పలికెన్గౌరిమదీశుఁడీతఁడగుఁబుంభాగాప్తిఁబూర్వాకృతిం।
జెలఁగుంగావుననంచులక్ష్మియనియెన్సిద్ధంబుగానామగం।
డెలమిన్నన్నలరించువామకలనన్ హేమాంశుకుండీతఁడం।
చలగౌరిందిరలట్లువాదుసలుపన్ హర్షాతిరేకంబునన్॥ ౨౧౩॥

కం॥ అనెశంకరనారాయణుఁ । డెనయంగా నేలశంకనిట సాంఖ్యమునన్।
గన శంకరుఁడే నారా । యణుఁడా నేనొకఁడ నెద్ద్వివిధాకృతినయితిన్॥ ౨౧౪॥

కం॥ తెలియవలు దెలియుఁడు శివుఁడుగ । నెఱుఁగఁబడుదు విష్ణుఁడనఁగ నెనయఁగ భేదం।
బఱ శివుఁడె విష్ణుఁడని నే । నెఱుఁగఁబడుదు భేదబుద్ధి నెనయక యుండన్॥ ౨౧౫॥

తే-గీ॥ అంకపథమున శివుఁడ నేనక్షరపథ । మున నువిష్ణుండ నేయాదుఁగనుకనంక।
పథము శైవంబు నక్షరపథము వైష్ణ । వంబు నగుఁగాళులవినాకువంద్యుఁడే నే॥ ౨౧౬॥

ఆ-వె॥ శివుఁడు విష్ణుఁడనఁగఁ జెలఁగెడు నొకనామ । భేదమంతె వస్తుభేదమేది।
శివుఁడు విష్ణుఁడనఁగఁ జెలఁగెడు నొకరూప । భేదమంతె వస్తుభేదమేది॥ ౨౧౭॥

కం॥ కుడినుండి కనుఁగొనంగశి । వుఁడుగ నెడమనుండి విష్ణువుగఁగనఁబడుఁగా।
యడరెడు నస్మద్రూపమి । వుడు శివవిష్ణ్వైక్యమిట్లెపొనరు నెఱుంగన్॥ ౨౧౮॥

ఆ-వె॥ అనినవార లెఱిఁగి హర్షాతిశయమంది । రందుగట్టుపట్టి యంకపథము।
మేలనియెనులచ్చి మెచ్చె వర్ణపథంబు । రెండుగతులు ప్రాప్యమొండ నేఁబతి॥ ౨౧౯॥

ఆ-వె॥ వాసుదేవుఁడనఁగ వామదేవుఁడనఁగ । నగును శబ్దభేదమర్ణసరణిఁ।
గనన భేదవర్ణకలన సంఖ్యను మంబో । కండె వస్తుభేదముండు నెట్లు॥ ౨౨౦॥

కం॥ హరిహరుఁ డందరు వేఱుగ । హరులనఁగా భేదమున్నె హరిని హరుఁడనే।
హరిహరరూపుఁడ నొకఁడను । హరిహరభేదంబు సాంఖ్యమందొనరదుగా॥ ౨౨౧॥

తోటకవృత్తము.

అనియక్షరసాంఖ్యము - హాయిటులా । ప్పనె చెప్పిన విన్నను - బొల్చుముదం।
బెనయంగ జనాళికి - నేక్రియనీ । యనువబ్బెడు నుబ్బఁగ - నంచనశ్రీల్॥ ౨౨౨॥

కం॥ శంకరనారాయణుననుఁ । బొంకముగా విన్నఁ గన్నఁ బురుషులకపుఁడా।
నింకన్సాంఖ్యజ్ఞానము । శంకింపఁగ నేలవారె సంఖ్యావంతుల్॥ ౨౨౩॥

కం॥ ఈశంకరనారాయణ । కోశము వెలుఁగొందుఁగా కక్షోణీస్థలియం।
దాశం గొల్చినవారికి । నాసర్వాభీష్టములు మదైక్యంబు నొగిన్॥ ౨౨౪॥

కం॥ శ్రీశుఁడన విష్ణువౌఁగద । శ్రీశుఁడనఁగ శివుఁడునిందు నెసఁగెడుఁ జూడం।
గాశివవిష్ణ్వైక్యార్థం । బీశాండిల్యవనమందెయెన నెదరు జనుల్॥ ౨౨౫॥

కం॥ ఈరుచిర పాదము శివా । ఖ్యార్థంబగుట నిచట నద్భుత తపమిం।
పారఁగఁ జేయుటచే శివ । నారాయణుఁడనఁగఁ బేరు నాకగు నింకన్॥ ౨౨౬॥

కం॥ శివనారాయణబింబముఁ । దవఁగొలువఁగ లక్ష్మియొదవుఁ దనరును యోగ।
ప్రవణత సిద్ధులు మోక్షము । శివనారాయణుల గుదురు సిద్ధముగ శ్రితుల్॥ ౨౨౭॥

కం॥ ఈమూర్తిఁ గొలుచువారికిఁ । గామక్రోధజయమఖిలకల్యాణంబుల్।
గామింపక యేకలిగెడుఁ । గామించిన నేల చెప్పఁగలిగెడు నంచున్॥ ౨౨౮॥

కం॥ నేనిట నారాయణతన్ । బూనికఁ బూజించిన దిది పుణ్యాకారం।
బౌనింద్రనీలలింగం । బౌ నతులకు భుక్తిముక్తులడుగక యయిడన్॥ ౨౨౯॥

కం॥ కైలాసంబనఁ బ్రణవము । కైలాసము పాదముగను గంజిముతత్త్వా।
దాలక్షితమీక్షేత్రము । కైలాసేశ్వరుఁడభేదకలనమిడునిటన్॥ ౨౩౦॥

కం॥ కైలాసనాథనామం । బీలింగము గాంచు నతులకిష్టదమిడినం।
బోలనెకబిల్వదళమును । గైలాసమొసంగుటం జగజ్జనతతికిన్॥ ౨౩౧॥

కం॥ లక్ష్మీతపస్స్రభూతము । లక్ష్మీకరభవము సర్వలక్ష్మీకరమున్।
లక్ష్మీపూజితలింగము । లక్ష్మీవృక్షంబు వినతలక్ష్మీకరమా॥ ౨౩౨॥

కం॥ మారేడుపండ్లు లింగము । లారయ మారేడెకదమహాలింగంబా।
మారేడుచెట్టు నిటనిడు । వారు బహుశివప్రతిష్ఠఫలమును గనరే॥ ౨౩౩॥

కం॥ మారేడుకుడికయిన్మఱి । సారసముం దాపలికయి జానొందుటశ్రీ।
పేరొందెబిల్వపద్మయు । సారమదియే గౌరియనఁ జనదెవిజ్ఞులకున్॥ ౨౩౪॥

శా॥ ఈదేవిన్దనుమధ్య గౌరి నెపరేనిచ్చోట సేవించిరే।
నాదార్యాప్తి ద్వితీయపూర్ణిమను శ్రీనాదిత్యవర్ణేయటం।
చేదు న్వారివలక్ష్ములంత నెసిరుల్ హేరాళమై యబ్బువా।
రాదిత్యాభులునై వెలింగెదరు సర్వైశ్వర్యసంపన్నులై॥ ౨౩౫॥

శా॥ ఈ నారాయణతీర్థమందు నెవరే నైంతేనిభక్తిందగం।
గానీమాధవమాసపర్వమున రాకన్దోఁగఁగా నెవ్వడే।
నానారాయణశంకరైక్యగతియున్నారాయణాష్టాక్ష ।
బౌనాదింగథయిద్దియుం దెలియమర్త్యౌఘంబు ధన్యంబఁ గా॥ ౨౩౬॥

కం॥ అగుటన్నెల రెండవయది । యాగుటనుబడునేనవదినవంపున్నమము।
న్నగుటన పూర్ణాబ్దమును । న్నఁగఁజదువఁగఁదోఁచునార నారాయణుఁడున్॥ ౨౩౭॥

కం॥ పున్నమపదు నేనవతిథి । యెన్నఁగఁబదునైదుతుదగనే కాదిగఁగూ।
డన్నాటయిరువదగుఁబది । సున్నగలయనేఁబదైదు చొప్పడుఁగానన్॥ ౨౩౮॥

నారాయణవృత్తము॥ ఓన్నమో నారాయణాయ । యన్నమంత్రంబౌనుగానఁ।
బున్నమ న్నారాయణుండ । గన్నుతింపం జాలమేల॥ ౨౩౯॥

తే-గీ॥ వ్యాసుఁడారసి తెల్పినయవియకాన । నిటవిశాఖయు నాషాఢకృత్తికముఖ।
పౌనరునవిపూర్ణిమలు వ్యాసపూర్ణిమలనఁ । బృథివిఁ బ్రథితములయ్యెశివేడితములు॥

ఆ-వె॥ మకరమాసమందు మఱి పూర్ణిమాతిథి । నిందునన్నదానమెవరొనర్తు।
రాజనులగుదురిల రాజరాజులుగ నా । రాయణులుగముక్తిరమనుగనుచు॥ ౨౪౧॥

తే-గీ॥ ఇఁకను వైశాఖపూర్ణిమనిచట కేపుడు । బిల్వనాథుఁడ నేవత్తుఁ బ్రియము మీఱ।
నర్థిశంకరనారాయణైక్యమెఱుక । పఱుచు నామూర్తితీర్థంబు భద్రదంబు॥ ౨౪౨॥

కం॥ నారాయణతీర్థంబిది । సారముగుటనమృతతీర్థసదభిఖ్యఁగనున్।
శ్రీరుచిబిల్వేశ్వరునకు । నీరసమే నిత్యపూజకెసఁగెడునింకన్॥ ౨౪౩॥

కం॥ ఇదియమృతతీర్థమగుటం । బొదలునమృతపురియననొకప్రోలీ పొంతన్।
గదియుంబిల్వపురిన్ శ్రీ । గదురనదియువిష్ణుపురిగఖ్యాతిఁగనియెడున్॥ ౨౪౪॥

కం॥ ఈక్షేత్రముబిల్వవనికి । వక్షస్స్థానంబుపక్షిపరివృఢబలసం।
రక్షితములక్ష్మీకిరవున । ధోక్షజపదలక్షితముగయాంచితమునగున్॥ ౨౪౫॥

కం॥ దక్షిణగయయనఁగనుదగు । నీక్షేత్రంబిందుఁబిండమిడఁదిలకంబున్।
సుక్షేత్రబీజఫలగతి । నక్షయపుణ్యభువనాప్తియౌఁబితరులకున్॥ ౨౪౬॥

కం॥ అనిశంకరనారాయణుఁ । డెననెఁబ్రకృతిదినపతియననెప్పటియట్లే।
కనఁబడెనుబిల్వనాథుఁడు । చనెఁదననెలవునకుగవికిఁజనుసింగమునన్॥ ౨౪౭॥

కం॥ ధరశంకరనారాయణ । పురమదియైయమృతపురిగమొగిమిత్త్రారై।
పరఁగునిపుడుమిట్టూరనఁ । బౌరనెంబిల్వపురివిష్ణుపురియవుదానన్॥ ౨౪౮॥

సీ॥ ఒకవంకనెలవంకయొకవంకనకలంకపద్మరాగసుమౌళిపరిఢవిల్ల।
నొకక్రేవశూలంబునొకక్రేవఁజక్రంబుదిష్టస్వరూపాప్తిఁదేజరిల్ల।
నొకదెసనభయంబునొకదెసవరదంబుసదుభయహస్తముల్సంఘటిల్ల।
నొకప్రక్కఁబున్కపేరొకప్రక్కఁబూలపేర్వ్రేలఁడాలెంతయుఁబిక్కటిల్ల।
నొక్కవలననుదెలుపువేఱొక్కవలన । నలుపుగలుగుటనష్టమినెలవలెనొడ।
లమరగౌరియురమయుఁబార్శ్వములఁగొలువ । నున్నశంకరనారాయణున్నుతింతు॥

౪

కం॥ శివుఁగూర్చితపమొనర్చెన్ । శివనారాయణుఁడనహరిశ్రీపతియయ్యెన్।
దవరెంటవిష్ణుపురిచరి । తవినఁజదువనరుఁడటులవుఁదత్పరతమెయిన్॥ ౨౫౦॥

తోటక॥ అనిసూతుఁడుదెల్పిన-నందముగాఁ । గనుశౌనకముఖ్యులు-గాంక్షమెయిన్।
వినివిష్ణుపురీశ్వరు-విష్ణునిశ్రీన్ । వినుతించిరిసూతుని-బ్రీతిమెయిన్॥ ౨౫౧॥

కం॥ ఇదివిష్ణుపురీబింబము । గుదురుటశ్రీశేశసంఖ్యగురుపద్యములిం।
దిదిశ్రీశేశాభిఖ్యం । బొదలెడుబిల్వేశ్వరీయమునగుణిశ్రీశా॥ ౨౫౨॥

## మందాక్రాంతావృత్తము.

భర్మాన్నాఖ్యాన్వితదితిభవ - ప్రాణహింసారిరంసా।
కర్మారంభప్రముఖనఖరుక్ - క్షాళితాశేషదోషా।
ధర్మాకారాననఖరమహా - దంష్ట్రికాభల్లవేల్లా।
ధర్మజ్వాలాయితరసనస - ధర్మరక్షైకదీక్షా॥ ౨౫౩॥

## డమరుకవృత్తము.

విచలద్ద్రాఘిష్ఠసటా-విచలితారిజలదా । ప్రచరన్నేదిష్ఠనత-ప్రతతిసర్వశుభదా।
శుచిమద్బంహిష్ఠచతు-శ్శ్రుతిశిరోభివినుతా । శుచిమద్బృందిష్ఠరమా-సుభగలోకమహితా॥

## పంచచామరవృత్తము.

మహాభయంకరాకరాత్త - మాన్యశంఖచక్రస।
త్సహాయహాయనీకృతోరు - దావభానుబాడబా।
మహోదయామమోదయాన - మజ్జనావనప్రియా।
మహామహామహామహాస - మస్తలోకసంస్తుతా॥ ౨౫౫॥

## గద్యము.

ఇది, శ్రీతనుమధ్యాంబాకరంబిత శ్రీబిల్వనాథమహాదేవశిష్య శిష్యోపజ్ఞాఽక్షర సాంఖ్యాచార్య
పర్యవితకవిత్వ తత్త్వవిత్ప్రకాండ శ్రీమత్కొక్కొండ వేంకటరత్నశర్మ
వినిర్మితంబై,
కవిమణినామంబునం బరఁగు శ్రీబిల్వేశ్వరీయంబను
పద్యకావ్యరత్నంబునం దృతీయబింబము, విష్ణుపురీబింబము శ్రీశైలబింబము.

శ్రీ బిల్వేశ్వరాయ నమః.

# బిల్వేశ్వరీయము.

## చతుర్థ బింబము.

### బ్రహ్మపురీ బింబము, కంజేశ బింబము.

కం॥ మండపకృతనతహృదయా । మండనకృతకౌస్తుభారమాధవసదయా।
మాండూక్యగుహాసింహా । మండితఘటికాద్రిశిఖరమహితనృసింహా॥ ౧॥
౪

శా॥ శిక్షింపంబడియేనిచే నెఱుఁగె సృష్టిన్ స్రష్టదస్మాలమున్।
వీక్షింపంగనుబూనెసాంఖ్యమునెుగిన్వోదానసుండౌచులో।
కక్షేమంకరుఁడౌటఁగాంచెవిబుధాగ్ర్యఖ్యాతిశైవైక్యమా।
త్ర్యక్షుంబ్రహ్మపురీశుశ్రీశుఁదనుమధ్యాధీశుసేవించెదన్॥ ౨॥

కం॥ నావుడునుబ్రహ్మపురియం । చాబిల్వవనంబునకటనాఖ్యగలిగెము।
న్నేవిధముననవారల । భావంబలరంగనిట్లుపలికెనతండున్॥

కం॥ ద్వాపరమునసందేహం । బాపరమేష్ఠికదికల్గెనావైఖరినే।
యేవుఁగనిసాంఖ్యమెడలుట । ద్వాపరముననయ్యుగంబుదనరెందౌనన్॥ ౪॥

చ॥ విబుధులభీష్టముల్గాగిని వేఁడశ్రుతుల్మనుగూఢసన్మనుల్।
ప్రబలుచువాదులాడసురరాములువేడుకనాడనారదుం।
డుబుసుననొప్పఁబాడఁగొదలాక్కటనీడఁగనల్వకొల్వమే।
రుబలవిపక్షదిక్ఛిఖరరోచిఁగడున్నెగడించెనచ్చటన్॥ ౫॥

చ॥ కనుఁగొనివర్ణసౌష్ఠవముఁగన్గొనిసత్పదప్రౌఢిమంగనుం।
గొనిపరవాక్యవైభవముఁగోటివిధంబులనర్థభావముల్।
గనికనియాసరస్వతినిగాటముగావలఁజిక్కెనక్కటా।
వనజజుఁడేదసాంఖ్యమదివైఖరినేకనసత్యమబ్బనే॥ ౬॥

చ॥ మఱచెనుసృష్టిస్రష్టయలమంజులవాణికధీనుఁడౌటనిం।
పఱఁబచరించెనాపారయునత్తపయింగనులంగడింగరం।
బుఱుననుసామెతన్నథనునెుప్పఱనిర్థనుఁజేయుఁబ్రాజ్ఞునిన్।
మొఱకునెునర్చుస్త్రీజితుఁడుపొందునెజ్ఞానముఁజిత్తశుద్ధియున్॥ ౭॥

సీ॥ విధివాగ్వధుపుత్రయీవేణినుతించుమీమాంసోత్తమాంగంబుమహిమనెంచుఁ।
బరఁగనాయుర్వేదఫాలంబునుతియించునాగమభ్రూమధ్యమభినుతించుఁ।

గడపటిప్రాఁబల్కుఁగణఁతలస్తుతియించుఁ శ్రౌతమన్నెక్కుల సంస్తుతించు।
రమణనిరుక్తకర్ణద్వయినగ్గించు న్యాయచుబుకమునత్యాస్థఁగాంచు।
జ్యౌతిషాక్షిద్వయమును శిక్షయనునాస । స్మృతిరదంబులఁగావ్యజిహ్వకనువ్యాకృ।
తియనుపెదవులసంగీతదివ్యగళము । నయ్యలంకృతికుచములనాత్మ మెచ్చు॥ ౮।

తే-గీ॥ అలపాలఁతిసత్పురాణమధ్యమితిహాస । పక్షమునుగల్పకరములవరరతివిధి।
జఘనమునుబద్యశాస్త్రోరుచతురలాస్య । శాస్త్రపదములసారెసు సన్నుతించు॥ ౯॥

చ॥ వదనములున్ననాల్గానరివాగ్విభవంబునుగాంచ వేఁడ్కం।
డొదవెనహంక్రియాత్మమయి యూర్ధ్వముఖంబు విధాత కాతఁడున్।
బొదలఁగభాగ్యయుక్తిసిరిఁబొల్చెడునల్పునసల్పగర్వరే।
ఖదనరఁదోఁచినట్లుపలుకందొడఁగెన్మొగమద్దిగద్దనన్॥

కం॥ భాషాయోషాభూషా । భాషింపవె శ్రుతిసుధగ సుభాషణములనా।
శ్లేషానందామృతమున । శేషమ్ముగనిమ్మువుదునశేషాధికుఁడన్॥ ౧౦॥

తే-గీ॥ అనుచుఁదనవదనంబునంబొనరఁబుట్టి । నట్టిగణికాయితోరువిద్యనెగ్రహించి। ౧౧॥
యుల్లసిల్లుచుఁదానెసర్వోత్తముండ । ననుకొనుచునంచునుండంగనావిధిఁగని॥ ౧౨॥

సీ॥ ప్రాణమాదతుండుపనియిదిదగదనిగుండెతోఁదడదడఁగొట్టుకొనియెఁ।
గ్రతువపానంబయికాదిదిబాగనిదేవమార్గమునఁబోఁదివిరెఁగ్రింది।
కాపులస్త్యుండుదానాత్మకుఁడైకంఠసీమజేరెనయుక్తచింతనమని।
యవ్వసిష్ఠుఁడుసమానాకృతియయినాభిఁగొనియెనీగర్వంబుగొఱఁతఁదెచ్చు।
నంచుఁబులహుండుదానయివ్యానమూర్తి । చాలుఁజాలునటంచంగచలనమొందె।
నిట్లుగానైదుగురుబ్రహ్మలేవగింపఁ । దెలియఁడయ్యెనహంకృతినలువయపుర॥ ౧౩॥

తే-గీ॥ శిరసునూఁగించెఁగాంచియంగిరసుఁడత్రి । శ్రోత్రములమూసికొనియెనుజూపఁడయ్యె।
నమ్మరీచిభృగువుహృదయమ్మదిరెను । బ్రహ్మలిటుగాఁగనాబమ్మబమ్మరిల్లె॥ ౧౪॥

ఉ॥ తోఁచెడునేమొయేమొమదిఁదోఁచినదెల్లనుజెప్పనప్పడే।
యేచియొరుల్గనుంగొనియిదెంతయుఁగూడదనంగఁగూడునం।
చాచరణంబునేయుఁడనియందఱవేఁబురికొల్పుఁజల్పెడున్।
ఖేచరులాడనావిధియకీర్తిఁగనెన్విధిదాఁటశక్యమే॥ ౧౫॥

తే-గీ॥ తత్త్వజిజ్ఞాసువులవుచుఁదాపసేంద్రు । లడిగిరావాగ్వధూధవునవ్యయమువు।
తత్త్వమెదియనియావేధదటియటిమెన । టంచుఁబంచమముఖమునననెనిటువల॥

సీ॥ అజుఁడనుగదనేనెయాత్మనాదనుబుట్టమినిసర్వవర్ణాద్యవినుతిఁగనుట।
నాత్మభూప్రఖ్యాతియాఁగదానాకునేజగదాదినాకెందుసపతులేదు।
విశ్వసృడాహ్వయవినుతుండనాచేతఁబుట్టింపఁబడిరిశివుండుహరియు।
విధినేనెకండనేవేల్పుఁబెద్దయనంగవినుతిఁగన్వాఁడనువిధియిఁకనెది।
నేనెపరమేష్ఠినిఁకనెవ్వఁడానుమేటి । నేనెలోకేశ్వరుఁడహంసనెక్కువాఁడ।
నేహిరణ్యగర్భుండనునేనెబ్రహ్మ । నేనెపరతత్త్వమనునన్నెయెదఁగొలువుఁడు॥ ౧౬॥

కం॥ అనవుడుఁగడుఁగనలునహరి । యనియెనజాయొడలెఱుంగకాడెదునీకున్ ।
జనకుఁడఁగాననైనఁచితి । జననిది పుట్టినిల్లుమామసరసఁబొగడెదా॥ ౧౮॥

సీ॥ అగుదునకారవాచ్యంబేననాపుత్రకుఁడవీవుగాననజుఁడవయితివి ।
ఆత్మనేనేనాకునగుటనందనుఁడవునీవాత్మభువనంగనెగడితివిఁగ ।
విశ్వసృజుఁడవీవువిశ్వంభరుఁడనేనువిశ్వసంపూజ్యతవెలయునేచట ।
విధివినీవాదువువిధికర్తనేనాదుగౌరవాధిక్యంబుగనఁబడునెట ।
వేల్పుఁబెద్దవీవువేల్పులఁగాపాడు । వాఁడనేనుగైటభద్విషుఁడను ।
వల్లభుండవుదలవాకిటఁజెలఁగెడు । నింతికింద్వదంబకాంతుఁడఁగద॥ ౧౯॥

కం॥ రక్షింతునెల్లజగముల । శిక్షింతువిపక్షజనులసిద్ధముగానే ।
మోక్షప్రదుఁడనుశ్రీశుఁడఁ । బక్షీశరథుండనేనెపరతత్త్వమనన్॥ ౨౦॥

ఆ-వె॥ తమ్మిచూలియనియెఁదమ్మికంటినాడు । పిన్నతల్లికొడుకవన్ననేను ।
నీకునంతెకాకనాకొడుకవునీవు । కేరియాడఁదగునెమేరమీఱి॥ ౨౧॥

కం॥ నేనేపరతత్త్వంబని । యానాళీకోద్భవుండునగుదునునేనం ।
చానారాయణుఁడునుగడుఁ । బూనికవాదాడివేదములనడుగుటయున్॥ ౨౨॥

తే-గీ॥ శ్రుతులువారలకిట్లనెస్తుత్యులార । యీశమాయావిమోహితులీతఱినయి ।
తిరిటమీకుమేమేనియుఁదెలుపవలఁతు । లమెమదుక్తులాయర్థవాదములవుఁగద॥ ౨౩॥

ఉ॥ ఐతిమియీశ్వరాస్యములకర్భకధర్మ్మలమంత్రెకాకమే ।
మైతిమిగాతదశ్వములమైతిమిబిల్వదళాకృతిందదీ ।
యాతతభూషణంబులుగనైతిమిమేముశివైక్యమాఖ్యఁబ్ర ।
ఖ్యాతిగనేమిచెప్పఁగలదారయుఁడీరుమదాహ్వయార్థముల్॥ ౨౪॥

కం॥ వేదములునాల్గుగదయే । కాదిగఁజతురంతముగఁగ్రమాంకములిడిన ।
మ్మోదమ్మునఁగూడఁగఁబది । యాదశకంబునశివాయయనియగుఁగాదే॥ ౨౫॥

కం॥ ఏకాదిదశాంతాంకా । నీకమెనయనేఁబదైదునిక్కముగానా ।
లోకింపనోంనమోయని । శ్రీకరముగఁదోఁచుమంత్రసిద్ధిగలుగుఁగా॥ ౨౬॥

కం॥ ఋక్కేడుయజువాయెనఁబది । యొక్కండేఁబదియునేడయొగిసామంబిం ।
పెక్కుంగూడఁగనగుఁగా । చక్కఁగనుశివాయయనుచుఁజనుఁగనమీఁదన్॥ ౨౭॥

కం॥ కనఁగనథర్వణమోంనమ । యనితెలిపెడునేఁబదైదయగుటనొకటితో ।
నెనయఁగనలుపదితొమ్మిది । కనఁబడుఁగాయేఁబదియుణకారతనైదన్॥ ౨౮॥

తే-గీ॥ అనవుడునువేదమాతనీవనియెదేమొ । వింధుమనియడుగుడునుగోవిందుఁగాంచి ।
యనియెగాయత్రినామొత్తమునుగనంగఁ । దోఁపదెపదక్షరమనుపురూపమనుచు॥

తే-గీ॥ అగుదుఁబంద్రెండుఖండములల్లసంఖ్య । వర్గమొనరించియొకప్రణవంబుఁగూర్ప ।
పటిలునూర్నల్వదైదుశివాయయనుచు । నోంనమోయనిదశయుక్తినొసరుఁగనుఁడు॥

కం॥ నావుడువ్యాహృతులారా । యీవడిమీయాశయంబు నెఱిఁగింపుఁడనం।
గావలికెనస్మదాఖ్యల । చేవెల్లడిగాఁదెయద్ది చెప్పఁగనేలా॥ ౩౧॥

తే-గీ॥ సత్యతపములోంకృతిఁదెల్పు జనము నాను। మహము మాశిని సువమువా మఱియుభువము।
భువియకారమొకండాటఁబోలుచు నోంన । మశ్శివాయయనన్ శివమంత్రవరము॥

ఆ-వె॥ సత్యమునుదపంబు సంయుక్తిమువ్వది । మూడులింగముగును గూడమంత్ర।
వర్ణసంఖ్యఁదెలుపువర్గింపఁబ్రణవమూఁ । బ్రణవమెకదలింగపరిణతమన॥ ౩౩॥

కం॥ ఆయజుఁడోయోంకారమ । యీయెడనీతత్త్వమే మెయెఱిఁగింప వెనా।
నాయోంకృతియిట్లనెనే । నాయైదుగనాదుమఱియునైదవదానన్॥ ౩౪॥

కం॥ పంచాస్యుఁడనసదాశివుఁ । డంచితుఁడవునేను గానెయనకారయుమీ।
కాంచిననునీలకంఠతఁ । బ్రాంచితమేపిచ్చికయు శివస్తుత్యంబే॥ ౩౫॥

కం॥ పంచాత్మకమనుమాత్రా । పంచకముననైతిఁజూవెపంచాక్షరిగాఁ।
గొంచకనాతోఁగూడజ । పించిననగునీకు మేలువివరింతునజా॥ ౩౬॥

తే-గీ॥ అత్తునుత్తుమకారంబునగుఁబ్రణవము । సంఖ్యనేకత్రిపంచాంకసంకలనత।
బవలభేదములవుటమూడవును నాల్గు । మొగిశివాయయనియు నోంనమోయనియగు॥

కం॥ ఓకారమునుమకారము । ప్రాకటముగనయిదయిదుగఁబదిగదగూడన్।
లోకింపుశివాయయనన్ । జోకనవల నోంనమయని చూడుముభక్తిన్॥ ౩౭॥

ఉ-వ॥ జపింపుప్రాసాదము - సంస్మరింపన్ । గపర్దివాత్సల్యముఁ - గందునీదా।
నపారమోహంబఱు - నందెదంతన్ । స్వపాండితిన్ సృష్టిని - స్రష్టనాఁగన్॥ ౩౮॥

వనమయూరవృత్తము.

ఒప్పెహరియొప్పెసిరి - యొప్పెసిరికోడల్ । గుప్పలుగనున్న సుర - కుంజరులుమున్నే।
యొప్పిరిమునీశ్వరులు - నొప్పిరఖిలార్యుల్ । చెప్పిరొగిసాంఖ్యమిది - సిద్ధమనిసిద్ధుల్॥

మత్తకోకిలవృత్తము.

ఒప్పఁడయ్యెనుబమ్మదేవర - యోర్వకీశ్వరముఖ్యతం।
జెప్పఁజెప్పఁగనొప్పచుండెడు - సిద్ధపద్ధతిసాంఖ్యమున్।
గప్పరంబు సుగంధముంగనఁ - గానెఱుంగనిరొంపవాఁ।
డొప్పనట్టులెఱుంగనేమొఱ - కొప్పనేసుధిసెప్పినన్॥ ౪౦॥

ఆ-వె॥ అంతకంతకజునికహమహమికయెచ్చెఁ । గల్లుద్రావమత్తుగదురునట్టు।
లడిగినదియుఁజెప్పనలరకున్ననుశక్తి । నైతిసర్వవిదుఁడననుకొనెననె॥ ౪౨॥

కం॥ కననేరకించుకైనం । గనికొంచెమునైనసాంఖ్యగరిమనుసత్యం।
బనియెంచకమఱికాంచక । మునుకొనివిధిపరిహసించెమొగినిందించెన్॥ ౪౩॥

కం॥ ఎఱుఁగమిముగుదతనంబగు । నెఱిఁగింపఁగనెఱుఁగలేమియెచ్చదిమునుదా।
నెఱిఁగియెఱిఁగింపనొప్పమి । మొఱకుతనముదానఁగీడుమొనయకయున్నే॥ ౪౪॥

ఆ-వె॥ అతనిస్థానగౌరవాధిక్యమునుగని । మందలింపరైరియందఱుదుర।
నైనమానకనియెహరియజనీకిది । చేటుఁదెచ్చునిపుడెసిద్ధమనుచు॥ ౪౫॥

స్రగ్ధర॥ శశ్వత్సాంధ్యారుణోరు - చ్ఛవిజడలడరన్ - జ్వాలలంగ్రక్కుఁజూడ్కుల్।
విశ్వద్విట్కాలకూటా - న్వితగళముమహో - ద్వేలనిర్ధ్వాంతమిసన్।
బశ్వజ్జశ్రోత్రహృద్భి - త్స్వరుశతపతన - ధ్వానమొప్పంగథక్కన్।
శిశ్వెందూత్తంసమొప్పన్ - శివుఁడగపడెనా - చెంతనేభైరవుండై॥ ౪౬॥

శా॥ జ్వాలాభీలముగేలశూలమలరన్జాజ్వల్యమానంబునా।
కాలాగ్నింబురుడించుచుంబ్రళయమేఘవ్రాతగర్జార్భటిం।
దోలన్క్ష్వేళలుదాండవోద్ధతిజగద్ఘోరంబుగాభైరవుం।
డోలింబ్రహ్మకుమ్రోలనిల్చెనుగపాలోరుప్రజంబొప్పఁగన్॥ ౪౭॥

కం॥ కనిహరువెఱవకయజుఁడి । ట్లనెనేటికివచ్చితిచటికర్భకయోరీ।
తనయుఁడవుగదానాకున్ । బనివినుమేవిశ్వమునకుఁబ్రభుఁడననంగన్॥ ౪౮॥

కం॥ హరుఁడనెనజనీజనకుఁడ । హరియేగిరిజగనునాకుహర్షదుఁడైనన్।
భరియింపఁజాలఁద్వదహం । కరణంబునుశాస్తిసేయఁగాఁదగునీకున్॥ ౪౯॥

కం॥ రక్షింపవలయుఁబ్రేముడి । శిక్షింపన్వలయుదుష్టచేష్టలడంగన్।
దక్షులుగురులెవ్వుడేనిను । పేక్షింపఁగరాదుబాలుహితపథమిదెయౌ॥ ౫౦॥

కం॥ గారాబమునేయఁగడుం । గోరముగలిగెడునడంపగొనములమరుమే।
లీరీతినెఱిఁగిబాలుర । వారకదండించుటొప్పఁబ్రాజ్ఞగురులకున్॥ ౫౧॥

ఉ-వ॥ అహంకృతింగాంచితి - వాత్మనన్నుం । గ్రహింపవీశుండుగఁ - గావరంబే।
బహిర్విచారంబునఁ - బ్రబ్బవిద్య । ల్సహింపవీవాద్యము - సాంఖ్యరీతిన్॥ ౫౨॥

ఇ-వ॥ భాషంద్వదీయాత్మజఁ - బట్టితొట్టున్ । దోషంబునాకెన్నవు - స్తుత్యునన్నీ।
వీషత్ప్రభుత్వంబున - నెంతెవేధా । వేషంబెసాంఖ్యంబును - విస్తరింతున్॥ ౫౩॥

కం॥ అనివామకరాంగుష్ఠం । బునఖంబునహరుఁడువైశముగవిదళించెన్।
వనజజునైదవశిరమును । వనజంబున్హస్తిద్రుంచువడువడరంగన్॥ ౫౪॥

ఆ-వె॥ అదియహంకృతిశిరమయిదవదజునిది । రుద్రుకేలఁగ్రాలుముద్రగాఁగ।
బరఁగునర్థమిట్లుబ్రహ్మోఽహమన్నలు । కాశివోఽహమనఁగనారయంగ॥ ౫౫॥

ఆ-వె॥ బ్రహ్మశిరమువోయెబ్రహ్మహత్యలభించె । శివునికంచుజనులునెప్పచుందు।
రౌరయారయఁగనహంకారమదియయౌ । జీవభావముండుశివునిచేత॥ ౫౬॥

కం॥ జీవులుపశువులుజీవు । ల్గావనజభవాదులెల్లఁగారేపశువుల్।
భావింపశివుఁడుపశుపతి । దేవుఁడతఁడెజీవతనొగిఁద్రెంపఁగఁజాలున్॥ ౫౭॥

ఆ-వె॥ అంతమాయమానెనంతమాయెనుగాన । నలువనలువయయ్యెఁబోలియఁగఁదల।
గదలకుండెమదముపదలినకరివలె । శృంగభంగమైనశిఖరిభంగి॥ ౫౮॥

ఆ-వె॥ చింతమానియుండెఁజింతమానసఁగను । గొంతదడవునకునుగొంతదెలిసి।
రుద్రుఁబొగడెనుశతరుద్రీయమునవిధి । తోడ్పడంగహరియుదోసమణఁగ॥ ౫౯॥

తాండవ వృత్తములు.

౧. అక్షరాత్మకాంకరూప - హర్షదోంనమశ్శివాయ।
ఉక్షరాట్ఛతాంగదేశ - కోత్తమోంనమశ్శివాయ।
మక్షికాయితామృతాశ - మాక్షికోంనమశ్శివాయ।
దక్షవామపార్శ్వభూత - తత్పదోంనమశ్శివాయ॥ ౬౦॥

౨. లక్షసాంఖ్యలక్షణోప - లక్షితోంనమశ్శివాయ।
వీక్షితాఖిలాఖిలాశ్రి - తేష్టదోంనమశ్శివాయ।
భక్షితోగ్రకాలకూట - భద్రదోంనమశ్శివాయ।
శైక్షభూతసన్మునీంద్ర - సంచయోంనమశ్శివాయ॥ ౬౧॥

3. మోక్షదాయినేదయాస - ముద్రతేనమశ్శివాయ।
యక్షమిత్రసర్వసంప - దాఢ్యతేనమశ్శివాయ।
రూక్షరూక్షమృత్యుమృత్యు - రూపతేనమశ్శివాయ।
భైక్షభుగ్వపుగ్గకపాల - భైరవోంనమశ్శివాయ॥ ౬౨॥

౪. అక్షిజాగ్నిదగ్ధకాను - మాస్త్రితేనమశ్శివాయ।
కుక్షిగుప్తకృత్స్నలోక - గోపతేనమశ్శివాయ।
త్ర్యక్షవిశ్వసృష్టిరక్ష - ణాంతతేనమశ్శివాయ।
త్ర్యక్షరోరుమంత్రలభ్య - దైవతోంనమశ్శివాయ॥ ౬౩॥

౫. లక్షితానుకంపయైవ - లాలితోంనమశ్శివాయ।
పక్షివాహనద్వయాప్త - పార్శ్వతేనమశ్శివాయ।
పక్షభూతధాతృవిష్ణు - భావితోంనమశ్శివాయ।
దక్షయజ్ఞనాశకార్య - దక్షతేనమశ్శివాయ॥ ౬౪॥

౬. శిక్షితారివారవిశ్వ - సేవితోంనమశ్శివాయ।
రక్షితాప్తరాజమాళి - రాజితోంనమశ్శివాయ।
రక్షరక్షపార్వతీశ - రమ్యతేనమశ్శివాయ॥
దీక్షితాకృతేదయాని - ధేమృడోంనమశ్శివాయ॥ ౬౫॥

కం॥ అనివిధివిధులుసుధాంధులు । మునులునుభక్త్యతిశయమున మొగిఁగరతాళం।
బునఁదాండవవృత్తంబుల । వినుతించినసంతసించివిభుఁడిట్లనియెన్॥ ౬౬॥

మ॥ క్షమనీతాండవవృత్తషట్కమునుబ్రాసాదాంచితంబెవ్వరేన్।
సుమతిన్శంకరసన్నిధింజదివినన్క్షోణిన్మహాభోగముల్।
గ్రమమారంగనిపిమ్మటంగనియెదర్కైవల్యముందథ్యహా।
నమరుత్మేల్గినుఁడీరునన్గెలువుఁడేనాదుంబరబ్రహ్మమే॥ ౬౭।

కం॥ అననందజుఁ డైకొనియా । మినుసిగదేవరను బత్తిమిగులఁగొలిచిరం।
తనునలువయష్టభైరవు । లనీశు కాష్టకమునఁగనిలలినిటు పొగడెన్॥ ౬౯॥

సీ॥ అనితాంగభైరవయభివాదనము క్రోధభైరవయి దెనీకువందనంబు।
నతియిదె నీకునున్మత్తభైరవచండభైరవయి దెనమస్కారమయ్య।
భీషణభైరవ వెలయఁ బ్రణామంబు దండంబు రురుభైరవుండనీకు।
సంహారభైరవ సవరింతుజోతజోహారునీకుఁ గపాలభైరవుండ।
యష్టభైరవరూపుఁడవైననీకు । నిదియె సాష్టాంగమౌనమస్కృతి గ్రహింపు।
క్షేత్రపాలయి దేనీకుఁ గేలుమోడ్పు । మొక్కితిని మొక్కుచున్నాఁడ మొక్కఁగలను॥

తే-గీ॥ తప్పులోఁగొనుకనికరమొప్పఁజూడు । విసపుమేఁపరినెలదారి వేఁడువాఁడ।
నీహితోపదేశంబు శ్రీతేష్టఫలద । యనిననాభైరవుండిట్టులజునికనియె॥ ౭౦॥

తే-గీ॥ బమ్మసత్యమ్ముసాంఖ్యమ్ము సుమ్మునమ్ము । తెలియుబిల్వవనంబునంజలుపుతపము।
బిల్వనాథునినసనందుఁ బ్రీతుఁజేయు । మెఱిఁగెదంతటనెంతయునెడయుఁదమము॥

కం॥ అనిహరుఁడంతర్ధానం । బునుబొందెనుగలవలెనది పొడకట్టెనుదు।
ద్వనజజునకుఁదనతలపో । యెనుగానంగాడుకలనియెన్నికపుట్టెన్॥ ౭౨॥

కం॥ పొలియఁగసాంఖ్యజ్ఞానము । సలిలజసంభవునికెదియుసత్యముగాఁగన్।
స్ఫురియింపదయ్యెవైఖరిఁ । దెలియఁదరమెసత్యమిదనిధీమంతులకేన్॥ ౭౩॥

కం॥ అమరుఁబతివ్రతవలెసాం । ఖ్యమువైఖరివేశ్యవలెనెయదిసాంఖ్యమెస।
త్యముఁదెలుపుసాంఖ్యమేస । త్యముగాఁదేయరయనబ్బనదిబిల్వవనిన్॥ ౭౪॥

కం॥ అనికేశవుండువెండియుఁ । జనవునఁదెలుపుటనుస్నేహసద్భావమునన్।
మునుదలవోపుటఁగొడిచిది । మినదీపంబననజుండుమిగులవెలింగెన్॥ ౭౫॥

చ॥ విధిసనుదెంచికాంచెఫలవిద్యుతివిద్యుదుదంచితచ్ఛదా।
చ్ఛదనఘనచ్ఛవిచ్ఛురితశశ్వదదభ్రమహాభ్రవిభ్రమా।
స్పదముదశైకసూచితనుసాంఖ్యముసాంఖ్యజసత్యనిత్యహా।
ర్ష్యదమురుబిల్వభూరుహశరణ్యమరణ్యమగణ్యపుణ్యమున్॥ ౭౬॥

కం॥ కనియేకవల్లి నేవిం । చెనుదుష్టింబిల్వపతిని శ్రీతనుమధ్యన్।
జనకునిగుహునినిదనపే । రనుబరఁగెడుకొండమీఁదరహినెలకొనియెన్॥ ౭౭॥

మ॥ తనరంగానటఁజిత్ప్రకాశమనుతీర్థంబందజస్రంబుమ।
జ్జనముంజేయుచుఁజిద్గుహన్శివుని శ్రీశాండిల్యనాథున్భజిం।
చెనువేవేఁడులునల్వనిల్వఁబడితోఁ చెంజ్యోతియొక్కండుదా।
ల్తనుబిల్వేశ్వరుసాంధ్యదీపబలినంతందోఁచెఁ బ్రాసాదమున్॥ ౭౮॥

ఉ॥ ఎక్కటిమూఁడునైదిరువదేడునుబిమ్మటనూటయెన్మిదిం।
కొక్కటియున్శివాయయనియొప్పుగఁజెప్పెడుఁగూడఁజూడనిం।
పెక్కఁగనేనునున్నమఱియేనెంగినోంనమయంచుఁదెల్పెడుం।
జక్కఁగబిల్వనాథుగుడిసంతతసాంధ్యబలిప్రదీపముల్॥ ౭౯॥

కం॥ పంచోన్నతశిఖరంబులు । పంచాక్షరములుగఁ బరఁగఁ బ్రణవము దానై।
ప్రాంచితమతిఁ దత్త్వంబుం । గాంచెం గంజుఁడదియయ్యెఁ గంజాద్రియనన్॥ ౮౦॥

తే-గీ॥ ఇట్లు దోఁపఁ శతానందుఁ డెట్లొ యయ్యె । శతసహస్ర సువర్ణ సంచయము నపుడు।
శతసహస్రమహానందుఁ డతిశయంబె । యానుగా శతనిష్కాఢ నాఢ్యయనఁగ॥ ౮౧॥

శా॥ అంతం దన్మనురాజ సన్మహిమ నందా ధాతకు న్సర్వముల్।
స్వాంతంబందు స్ఫురించె సృష్టిసలుపన్ సామర్థ్యము న్బెంపొరిన్।
చింతారత్నము గాదె మంత్రమదియా క్షేత్రంబు భక్తాళికా।
పొంతంబోయినఁ జాలుఁ జాల శుభముల్పొందున్నిజాభీష్టముల్॥ ౮౨॥

శా॥ కంజోఽహమ్మని పైపయింగనుఁగొనంగా నయ్యె బ్రహ్మోఽహమం।
చుం జేయంగన వాంక సంకలితముల్ శ్రుత్యుక్తమే కాచనాఁ।
గం జెన్నా నవసంఖ్యలం గలప సాంఖ్యంబై శివోఽహమ్మనం।
గం జెల్లంగని తారకంబిదని యక్కంజుం డెఱింగొందగన్॥ ౮౩॥

కం॥ మొదలన కారము కారముఁ । బదముపడి మకారము నొగిఁ బ్రణవము సత్యా।
స్పదమా సత్యము దేనం । గదియు నెయా లింగముం దగం బ్రణుతింతున్॥ ౮౪॥

కం॥ అని బిల్వనాథలింగం । బును గనుఁగొని బ్రహ్మ యిట్లు పొగడెం దనకున్।
ఘన సాంఖ్యము దోఁచుటనటఁ । దనవాగీశత సఫలత దై వారంగన్॥ ౮౫॥

కం॥ అగు బిల్వము సంఖ్యగనం । దుఁగలుగు త్రివ్యంజనములతోఁ గఁబడియం కెల్।
మొగిన గుట సాంఖ్యనాథుఁడ । వగుదీవో బిల్వనాథ యఖిలసనాథా॥ ౮౬॥

కం॥ అగు బిల్వాంకంబులదా । తోఁగయే నాథయని సున్న దొడరఁగలాగూ।
డఁగ బిల్వనాథపదమిటు । లగుటవలన నాథుఁడన్యుఁడగునే యెందున్॥ ౮౭॥

కం॥ కూడిన బిల్వం బేడగు । నేడవదోంకారము గ మహేశ్వర ఫణితిన్।
జూడఁగ నాథపదము నటు । లేడేడుం గలయ భువనహిత తారకమా॥ ౮౮॥

కం॥ నినుమాని యన్యదైవత । మును భజియింపంగ ఫలము మొనయునె సర్వం।
బున కును మూలమవీవే । ప్రణవాత్మక బిల్వనాథ ప్రణుతింతు నినున్॥ ౮౯॥

కం॥ యోగమున బిల్వనాథా । యాఁ గూడిన నొకటి నాల్గునంతటనైదున్।
బాగుగ శివాయ యనిత । ద్యోగక్రమ యోగమెనయ నోం నమయననా॥ ౯౦॥

కం॥ త్రిదశము బిల్వము ప్రణవము । విధివిధు విధుధరులు గూడు విధమును దెలుపున్।
మొదల నడుమఁ దుద నొకఁడవె । వదలు నెగుణి నిన్ను విశ్వపతి బిల్వపతీ॥ ౯౧॥

ఉ॥ ముప్పదియాఱు తత్త్వములు ముఖ్యములివ్వియె యాట బిల్వముల్।
ముప్పదియాఱు మూళ్లగును ముఖ్యములైన విక్షేత్రముల్మహిన్।
జెప్పఁగ నేల క్షేత్రమిది శ్రేష్ఠమటంచును బేరె తెల్పఁగా।
యెప్పటికేని బిల్వవనమిద్దియె యోంకృతియాట నీద్యుహా॥ ౯౨॥

కం॥ ఏకాదశేంద్రియములో । యేకాదశరుద్రరూపయీవొందుటబి।
ల్వాకారాయవియనుబి । ల్వాకృతులౌబిల్వనాథయీలింగములన్॥ ౯౩॥

కం॥ తనువులుమూడగుటంగనఁ । దనువౌబిల్వంబుబిల్వదళమాత్మయనాఁ।
గొనుమాత్మబిల్వమనునే । ననవేఱాయాత్మరూపహరబిల్వేశా॥ ౯౪॥

సీ॥ శ్రోత్రద్వయముబుద్ధిసొబగొందెడుశ్రోత్రబిల్వంబునీదిదాబిల్వనాథ।
కేల్దోయిశిరమునఁగీలింపగానుద్వగ్బిల్వంబునీదిదాబిల్వనాథ।
చక్షుర్ద్వయముజ్ఞానచక్షువుచాక్షుషబిల్వంబునీదిదాబిల్వనాథ।
యోష్ఠద్వయముజిహ్వయొప్పెడురసనాత్మబిల్వంబునీదిదాబిల్వనాథ।
కడఁగిచేయుప్రాణాయామకలనఘ్రాణ । బిల్వమిదినీదియగాదేవబిల్వనాథ।
పంచబిల్వంబులివినీవిపంచవదన । వేఱుబిల్వార్చనంబెట్లుబిల్వనాథ॥ ౯౫॥

సీ॥ సత్త్వరజస్తమస్తత్త్వంబుసూచింపబిల్వాకృతింగంటెబిల్వనాథ।
బ్రహ్మవిష్ణుశివైక్యభావంబుఁబ్రకటింపబిల్వాకృతింగంటెబిల్వనాథ।
వాణీరమాఽగజావైభవంబెఱిఁగింపబిల్వాకృతింగంటెబిల్వనాథ।
సచ్చిదానందాత్మసంపదంబ్రచురింపబిల్వాకృతింగంటెబిల్వనాథ।
వాచ్యవాచకములనుసంబంధముఁద్రిత । వెలయబిల్వాకృతింగంటెబిల్వనాథ।
యంకములునక్షరములుఁద్రిత్వాప్తిఁబరఁగఁ । బేర్మిబిల్వాకృతింగంటెబిల్వనాథ॥ ౯౬॥

సీ॥ భువిఁబూజ్యపూజకపూజైక్యమెఱిఁగింతుబిల్వమవైనీవుబిల్వనాథ।
చిదచిదీశ్వరభావసిద్ధ్యైక్యమునుదెల్పబిల్వమవైతీవుబిల్వనాథ।
విశ్వవిశ్వస్థవిశ్వేశ్వరైక్యంబునుబిల్వమైతెలిపెదుబిల్వనాథ।
ప్రకృతిపురుషయోగభావైక్యముంజూపబిల్వమవైతయ్యబిల్వనాథ।
శక్తిశక్తిమదుభయాత్మయుక్తినెఱప । బిల్వశాఖిగనైతిశ్రీబిల్వనాథ।
యాలునీవునుముయ్యాకులందగించు । బిల్వభూజములైతిరిబిల్వనాథ॥ ౯౭॥

సీ॥ ఆకాశకేశతాలోకకృదభ్రంలిహాకారశిఖరసహస్రశీర్ష।
యఖిలలోకాలోకనార్థజాగ్రద్భాసితాకారపత్రసహస్రనేత్ర।
యాశాంతపరిశీలనాక్రాంతవిభ్రాజితాకారశాఖసహస్రబాహ।
యహినాయకభ్రమావహమహాద్భుతనీరదాకారమూలసహస్రపాద।
యాశ్రితాభీష్టఫలపురుషార్థదాత । శ్రీపురుషసూక్తలక్ష్యయోశ్రీద్రుమాత్మ।
శ్రీకరోద్భూతశ్రీరూపశ్రీపతీశ । వినతులివెనీకుశ్రీనాథబిల్వనాథ॥ ౯౮॥

సీ॥ శ్రీకరుండవునీవుశ్రీకరంబునఁబుట్టెశ్రీకరంబయ్యెనుశ్రీకరంబు।
శ్రీనిధివీవుగూర్మినిశ్రీఁగఁజేయుటఁబార్వతిగౌరిశ్రీఫలగనయ్యె।
శంకరనారాయణాంకుఁడవీవునారాయణుశంకరుఁజేయుకతనఁ।
దనుమధ్యమాధవుఁడనిప్రథయుండశ్రీతనుమధ్యమాధవుఁడనఁదగియెదు।
నీవెవాగీశుఁడవువాక్కుదేవియగుట । జీవదేవైక్యమెఱిఁగింతుదేవివలనఁ।
గావుననుదేవుఁడునుమహాదేవుఁడీవ । వినతియిదెసాంఖ్యనాథశ్రీబిల్వనాథ॥ ౯౯॥

సీ॥ ధ్యానమెట్లొ దేవమానసాతీతత వెలయుచుందువు నీవు బిల్వనాథ।
యభిషేక మెట్లు మహాదేవ నీకవు విబుధ సరిన్మౌళి బిల్వనాథ।
బిల్వార్చనం బెట్లు బిల్వవృక్షమవీవు బిల్వనీ చెల్వగా బిల్వనాథ।
నైవేద్యమెట్లగు నల్లనానీ గొంతు వెఱపుఁ గొల్పెదె చూడ బిల్వనాథ।
నీకు నీరాజనం బేలనిరుపమాభ। విధుదినేశాగ్ని లోచన బిల్వనాథ।
మంత్రపుష్పము పుష్పాస్త్రమథన తగునె। వినుతమా నీపదము లెంతు బిల్వనాథ॥ ౧౦౦॥

కం॥ అని ప్రాసాదస్మృతి దన। కొనరంగాఁ బద్యషట్క మొప్పఁగఁ జెప్పెన్।
వనజభవుఁడు పాఠకులకుఁ। దనరఁ ఫలము విను జనులకుఁ దనియక మఱియున్॥ ౧౦౧॥

ఉ॥ వారిధిమంథనోత్థవిషభక్షణదక్షమహోక్షవాహనా।
క్షీరసుధావళక్షపురశిక్షణపాలితపక్షివాహనా।
సారకటాక్షరక్షణవిచక్షణరక్షితభక్తిభావనా।
శ్రీరుచిరాక్షయక్షయనుశిక్షకశిక్షకభక్తభావనా॥ ౧౦౨॥

ఉ॥ రాజతశైలచాలనకరాళదశాననగర్వభంజనా।
రాజితరాజరాజమునిరాజతనూజనుకేశరంజనా।
రాజదభంగభంగనికరద్యుసరిద్ద్యుతిమన్నిరంజనా।
రాజతనూల్లసద్భువనరక్షణలక్షణకంఠఖంజనా॥ ౧౦౩॥

ఉ॥ ధ్యేయదయావిధేయజగతీముఖకాయగుణాప్రమేయస।
ద్గేయశివాభిధేయబుధకీర్తితశంకరనామధేయశ్వ।
శ్శ్రేయసభాగధేయశిఖరిప్రభవార్ధనుభాగధేయయా।
మ్నాయనుబాడబేయజననప్రముఖాఖిలదుఃఖసంక్షయా॥ ౧౦౪॥

ఉ॥ కామదకామదర్పహరకంధినిషంగకళావిభూషణా।
సామగసామగానరతసద్ద్విజతాద్రిపసాధుపోషణా।
ధీమదభీష్టధీమహితధీరశయాశుగధీరభాషణా।
సోమశరీరసోమసఖసోమసమాహ్వయసోమతోషణా॥ ౧౦౫॥

## ముక్తపదగ్రస్తసింహావలోకనము.

ఉ॥ వారణవక్త్రవంద్యపదవారిజవారిజనాభనిస్తులో।
దారసుభక్తిపూజితజితత్రిపురాసురశూరశూరప।
ద్మారిసపర్యపర్యవనహర్షితసర్వసుపర్వపర్వతే।
డ్జారుచిరాచిరానుసృతసంసృతిరూపమ్మణాళవారణా॥ ౧౦౬॥

ఉ॥ శ్రీకమలాక్షమాధరవరిష్ఠసుతాంచితశ్రీవనాశ్రయా।
శ్రీకమలాక్షమాధవపరిష్టుతశ్రీదసుమిత్రశ్రీధరా।
శ్రీకుజశ్రీకుజాత్మభవశ్రీకుజశిక్షకశ్రీలశ్రీగలా।
శ్రీకరశ్రీకరప్రభవశ్రీతనుమత్తనుమధ్యమాధవా॥ ౧౦౭॥

కం॥ అనిప్రాసాదానుస్మృతిగ । నెనరషదుత్పలసరములనొగిశివుఁబొగడెన్।
వనజజుఁడుసదువవినఁగను । దనివిగలుగజనులకెల్లఁదనరఁగఫలముల్॥ ౧౦౮॥

### కమలవిలసిత వృత్తము.

కమలవిలసితము - కరముగుఁగానీ । కమలరుచిరుచిర - మవునుధకంటెన్।
గమలరిపులసిత - ఘనజటనీకిం । గమలరిపువిజయ - యవుని వెజోతల్॥ ౧౦౯॥

### అనుష్టుబ్గర్భ పంచపాది గీతాంచిత షోడశదళ పద్మబంధ సీసపద్యము.

శ్రీపార్వతీప్రియశ్రీవృషప్రియతుష్టదక్షయాగోద్ధత్యశిక్ష వేద।
వాహశరీకృతపక్ష్యజ్కహరిదైవతగిరిధర్మాటంకృతిగుణనుతమ।
హాహిరథాంచన్మహామహీసూతరత్నబ్రహ్మదేవధ్యానప్రభూత।
తతవిలసద్బాణదగ్ధహేయపురాకరిశ్రీముఖాప్తనుశ్రీపురేశ।
పాశపాణిజయాబిల్వపతిసబిల్వ । యీశబిల్వేశశర్వబిల్వేశ్వరీశ।
శాశ్వతానందవిశ్వదజయధురీణ । భక్తసంరక్షణచణాయవార్యశౌర్య।
శివశివసుకృత్యకృతశివశ్రీలయేలు॥ ౧౧౦॥

### గర్భానుష్టుబ్వృత్తము.

శ్లో॥ శ్రీగౌరీతనుమధ్యాంబా । శ్రీశబిల్వేశ్వరశ్శివః।
పాతువేంకటరత్నంతం । యశ్శ్రీబిల్వేశ్వరీయకృత్॥ ౧౧౧॥

కం॥ అనిషోడశదళపద్మం । బనుబంధముభక్తిశివునికర్పించెనుజ।
య్యనఁబద్మభవుఁడుభవుఁడిది । గనలింగమునుండివెడలెఁగడుఁగుతుకమునన్॥

సీ॥ పట్టపవల్సెనినెట్టనమయిచాయమించియెంతయుమిఱుమిట్లుగొలుపఁ।
గుత్తుకడాల్గాలహత్తించికటికిచీఁకటినట్టనడురేయికలిమిఁదెలుప।
జడముడివిడిజడల్సంజకెంజిగినెందుఁగొఱలించిపుల్గులగూళ్లనిలుప।
మిన్నేటినురుగనఁజెన్నగుక్రొన్నెలవెన్నెలపిట్టలవిందుఁజలుపఁ।
బుక్కపేరులువెలిగల్వపూలసరుల । యట్లుచెల్వొందముక్కన్నులలరమూడు।
జోతులుగవింతతటీరూపుఁజూపుననఁగ । సత్తితోప్రమోలఁజూపట్టెగిత్తరాతు॥

ఉ॥ ఎత్తటినేనివీఁడొకఁడెయీశ్వరుఁడంచెటిఁగింపమూశిగ్లా।
పొత్తుగబిల్వనాథుఁడనిబోధనసేయఁగవాలుజాలుఁగ।
న్మొత్తముబిల్వమాలికయుమోములుదెల్పనమశ్శివాయనా।
సత్తమతన్శివోఽహమనిసాంఖ్యగురుండుశివుండువేడ్కతోన్॥ ౧౧౪॥

కం॥ వనజజవేఁడుమువరమన । ఘనభక్తినజుండువలికెఁగంటెనిసాంఖ్యం।
బునుదానఁదాత్త్వికుఁడనయి । కనుఁగొంటెనిసృష్టినీదుకరుణన్మరలన్॥ ౧౧౫॥

చ॥ నినునెవరేనిగొల్చిననునెమ్మినివారికిబాహ్యమాంతరం।
బనఁదగువిద్యలందనరనబ్బగఁజేయుమువారిసర్వస।

ద్విసుతులఁగా నెనర్పుము మదీయమహాశ్రమమైన కంజముం।
గను మెప్పుడుం బదాశ్రితులుగాఁగ మహాఘనులెల్లకాలమున్॥ ౧౧౬॥

కం॥ నీవుత్తరాయణంబున । నీవసుధాధరవరమునకే తేరవలెన్।
గావింపవలెఁ బ్రదక్షిణ । మావడిజనులెల్ల ధన్యులై యెసఁగవలెన్॥ ౧౧౭॥

మ॥ ఎపుడే రోహిణిభానువాసరమునందీకంజశైలంబుని।
కృప్పుబత్తిన్వలగొన్నఁ బై సరసునం గావించినన్ స్నానమున్।
విపులార్థంబులుగల్గుఁగాతఁ బ్రజకున్ విఖ్యాతమౌఁగాకనీ।
కృపనీకంజపురంబువర్ధిలుత నాకిష్టంబు నీయైక్యమే॥ ౧౧౮॥

చ॥ అననసె బిల్వనాథుఁడు తథాఽస్తని దేవతలెల్లఁ జెల్లఁద।
ధ్వనులొనరించి రేమరిది తద్ఘనశైలగుహల్సుభేరులై।
ఘనముగ మ్రోసె రాలుగద కాంచఁ బ్రతిశ్రుతులీనునిప్పుడున్।
మునులటఁ జేయుచుంద్రు తపమున్ వరనాదరసాదరంబునన్॥ ౧౧౯॥

సీ॥ కుడిప్రక్కఁ బొక్కిలికూనపవల్సేయుచును సవితగనయి సొబగెనయఁగ।
వడకడ నడరఁగఁ బచ్చవిల్తునితండ్రి రేయి నేయుచును దీండ్రిల విధుఁడుగ।
ముక్కంటిదానడి చక్కనెక్కొని సంజ నేయుచును దినాంతశిఖిగ వెలుఁగ।
మఱినింగి నాదాత్మమహితమాధారమై బిందుమండపముగఁ బొందుపడఁగ।
బ్రహ్మవిష్ణుశివాత్మకభ్రాజమానుఁ । డయ్యె బిల్వేశ్వరుండు నిజాఖ్య దనరఁ।
దత్త్రిమూర్త్యైక్యమది బిల్వదళమువోలెఁ । దారకమన శివోఽహమన్ తారకమున॥

కం॥ ఆముమ్మూర్తులయైక్యము । శ్రీమహితంబయ్యెనార త్రిదశైక్యముఖ।
శ్రీమహితదీపమనఁగా । ధీమంతులు సూడఁగనది త్రిదశైక్యమెకా॥ ౧౨౧॥

కం॥ విధుఁడు వసువగుచు నెసఁగఁగ । విధుమౌళియె రుద్రుఁడగుచు వెలుఁగఁగ వెలయన్।
విధియాదిత్యుఁడుగం బిత్రు । విధిఁ దత్త్రైక్యంబు దెలుప విభుఁడిట్లనియెన్॥ ౧౨౨॥

ఆ-వె॥ మాఘపౌర్ణమాసి మఱిమహాశివరాత్రి । నింకనమవసల నుహితముగ నిటఁ।
బైతృకార్చనంబుఁ బచరించువారుఁద । త్పితరులెల్ల నన్నుఁ బేర్మిఁ గంద్రు॥ ౧౨౩॥

మహాస్రగ్ధరావృత్తము.

ఇఁక నేరేననన్ను నిట్లే - యెలమిఁ గొలిచిరే - నిందు సచ్చిత్ప్రకాశ।
ప్రకటాఖ్యంబైన సత్తీ - ర్థమున మునుఁగ భూ - ధ్రంబుఁ గంజంబుఁ జుట్టిన్।
సుకృతంబుం బొంది చాల - న్సుతులఁ గనియెదర్ - సొంపుమీఱంగఁ గాంతుర్।
సకలాభీష్టంబు లోలి - న్సముచితగతి స - త్సాంఖ్యయోగాప్తిముక్తిన్॥ ౧౨౪॥

మంజుభాషిణీవృత్తము..

అని బిల్వనాథుఁడు మ - హాముదంబుతోఁ । గనియెం దిరోహితతఁ - గాంచ వేల్పులె।
ల్లను గప్రవుందివియ - లాగునందటె । త్తనన భ్రమందుఁగడు - నబ్రముందఁగన్॥ ౧౨౫॥

కవిరాజవిరాజితము.

యమునసరస్వతియాదటఁదన్గల - యంగఁజెలంగెడుగంగయనం।
గమజీత్రిమార్గగయాలుగఁగూడఁగఁ - గ్రాలెడుపాలసముద్రమనం।
గమలదళాక్షుఁడుగంజభవుండును - గాంచనిజైక్యముమించెనుబి।
ల్వమువలెబిల్వవనేశుఁడుధూర్జటి - వార్ధినిషంగుఁడునాననఁగన్॥ ౧౨౬॥

ఉత్సాహము॥ పోలఁజూడబ్రహ్మవిష్ణు - భూతనాథయోగముం।
గ్రాలెరేచకంబుపూర - కంబుగుంభకంబొగిన్।
గూడినట్టులైననందుఁ - గుంభకంబెనిల్కడం।
బోలునట్లుబిల్వపతియె - పొల్చెనిల్చెస్థాణుతన్॥ ౧౨౭॥

కం॥ అంతసరస్వతియెంతయు । వంతంబిల్వేశుఁగూర్చివదలకతపముం।
బంతంబునఁజేసెరతీ । కాంతయనఁగఁదత్క్రమంబుగడువింతగదా॥ ౧౨౮॥

సీ॥ చిత్ప్రకాశంబునం జేసిస్నానంబు రాయంచనాఁబొరిమించుచెంచఁగమజీ।
పెట్టుఁజెట్టునఁబుట్టిబిట్టుగ్రాలెడునారచీరపాల్మిఁగడతీరునఁదగ।
నిండుపున్నమనాఁటిపండువెన్నెలజాజిపూదండనామేనుబూదిఁదనర।
స్ఫటికరుద్రాక్షసుస్రజములహోరాత్రసరణినిఁదెలుపనిచ్చలాగినెచ్చ।
రవిరథసురథ్యఖరఖురప్రహతతార । కౌఘచూర్ణంబనంభస్మమలరనుదుర।
నిష్కళంకసుధాకరనిహితభీతి । మూలదాఁగెడునిరులనమూలవాల॥ ౧౨౯॥

తే-గీ॥ అన్నయనిపిల్తునాతండ్రియనిపిలుతున । మామయనిపిలుతునెబావమఱఁదిమగఁడ।
యనుచుఁబిలిచెదనేకొడుకాయనుచును । బిల్చెదనొగురుఁడనిపిల్తుబిల్వనాథ॥

కం॥ అనినిశ్చయించినెమ్మది । మునుకొనిసంగీతవిద్యఁబొరిఁబొగడఁగనెం।
చెనురావణవరదుండని । ఘనబిల్వేశ్వరునికరుణఁగాంచెదనంచున్॥ ౧౩౧॥

తే-గీ॥ అంబశారదపద్మాసనాప్తిశాంత । మూర్తియగుచునుదక్షిణామూర్తికెదుర।
శిష్యరాలనఁగూర్చుండిచెలువుమిగుల । వీణవాయింపఁదొడఁగెనుబేర్మినేర్మి॥ ౧౩౨॥

సీ॥ దంతమయంబయితనరారుకచ్ఛపిగానాంబుధికిఁగుంభకప్లవముగ।
స్వర్ణమయంబయిజానొందుసారబుఱ్ఱసంగీతపుంబాలఁజాలఁగ్రోల।
నొనరవీణాదండమునుప్రవాళయుతంబుఁజేయుచుఁగేల్దోయిశ్రీయెసంగ।
గీతరసము పొక్కచేతఁగనీనికల్పశినతల్పాశితనత్తమిల్ల।
రాగరాగాళిచంద్రకిరణములుగను । దానములునప్సరోనృత్యదానములుగ।
గీతములుదేనెలైతేటగీతులుగను । జంత్రగాత్రైక్యముగవాణిశంభుఁబొగడె॥ ౧౩౩॥

నలివృత్తము॥ దేవమహాదేవసుధా - దీధితివహతే - స్థిరతేనతిరవతే।
శ్రీవసుధాభూతపతే - శ్రీవనవసతే - శివతేనతిరవతే।
శ్రీపరబిల్వేశపురా - రేభువనపతే - మృడతేనతిరవతే।
భావజకాలాంతకస - ద్భక్తశుభకృతే - భవతేనతిరవతే॥ ౧౩౪॥

తుటివృత్తము॥ అ ని యు ను॥ ౧౩౫॥

### కమలాకర వృత్తము.

కమలాకరకమలాకర - కంధినిషంగా । విమలాశయవిమలాశయ - విష్ణువిహంగా।
యమరాచలసుశరాసన - యాసురశిక్షా । యమరింపుమయలరింపుము - యాశ్రితరక్షా॥

### శంకర వృత్తము.

శంకరశ్రితశంకరభవ - సంకటనాశా । పంకజభవపంకజదృగు - పాంసితశ్రీశా।
పంకజశరకంకశమన - పాలితసోమా । యింకనయినఁగింకరినను - నేలవెసోమా॥

### పరమేశ వృత్తము.

పరమేశజగదధీశ - పన్నగభూషా । గిరిజేశషీతిధరేశ - కీర్తితవేషా।
కరుణామయకమలేశ - కంజజతోషా । శరణాగతభరణేశ - సంశ్రితపోషా॥ ౧౩౮॥

### పథ్యా కందము.

సాపలుకుఁగాదెసాంబా । చూపుం దాండవము నెమలి - నుతిపొందన్।
నీపేరొందెను గ్రీవన్ । నీపదముంగనరె నతులు - నిఖిలేశా॥ ౧౩౯॥

### విపులా కందము.

ఋషభముఁబలుకుటనుమహా । వృషభంబయ్యెనుబసరము - వెలయనినున్।
విషమాంబకవహియించుఁగు । విషమాంబకహరతగుఁగద - విశ్వేశా॥ ౧౪౦॥

### చపలా కందము.

సరిగాగాఁబల్కుటకుఁద । గరయ్యెదత్తుండు - గనగుఁగా।
సిరిఁగనెనీదయచేసది । స్మరింపఁద్రిదివంబు - సమకొనదే॥ ౧౪౧॥

### ముఖచపలా కందము.

తనుమధ్యమాప్తినీప్రియ । మునీడ్యతనుమధ్య - పొరిఁదనరెన్।
గనుఁగొనమామధ్యమగద । వినరేమధ్యములునరులు - బిల్వేశా॥ ౧౪౨॥

### జఘనచపలా కందము.

ఒనరిచిపర్ణాశనమున్ । దనద్విజతకుఁదగఁబికమది - దానేర్చెన్।
ఘనపంచమస్వరంబున్ । గనుంగొనమిద్విజత - గలదెయిలన్॥ ౧౪౩॥

### సహజ కందము.

ధనులుధనుతెయిూధరలో । ధనులెటిఁగిన వారెధనులుధనిముఖరుల్ శ్రీ।
ఘనులుహయహాస్తిముఖులున్ । వినుతింతురునిన్నునేను వేరొకండుశివా॥ ౧౪౪॥

### అర్ధసమ వృత్తము.

సరిగమపధని - స్వరములివేడుం । బరఁగఁగఁదెలుపుం - బ్రణవముఁగూడన్।
హరియనిహరయం - చాదటఁజూడన్ । హరిహరులయభే - దాశయమాఁగా॥

కం॥ స్వరసప్తకషూబిల్వము । పరికింపశ్రుతిత్రిదశముప్రణవముగానన్।
స్వరసప్తకమునసేనిను । పరభక్తినుతింతుఁబ్రణవపతిబిల్వపతీ॥ ౧౪౬॥

### శ్రీకరవృత్తగర్భచంద్రశేఖరవృత్తము.

శివజగదీశమమ్ముఁబ్రోవుచంద్ర-శేఖరా। శివనగదయ్యకావవేనినల్వ-శ్రీకరా।
శివమగునీకుమిత్రభూతయక్ష-శేఖరా। శివమగుమాకుబిల్వనాథయాప్త-శ్రీకరా॥

### గర్భశ్రీకరవృత్తము.

జగదీశమమ్ముఁబ్రోవు - చంద్రశేఖరా। నగదయ్యకావవేని - నల్వశ్రీకరా।
అగునీకుమిత్రభూత - యక్షశేఖరా। యగుమాకుబిల్వనాథ - యాప్తశ్రీకరా॥

### భుజంగప్రయాతవృత్తగర్భస్రగ్విణీవృత్తము.

వామదేవాఘన-ధ్వానకంఠద్యుతీ। కామకాలాజయో-త్కంఠకాలాహితా।
సోమనేత్రద్ధినే-ట్సోమశక్రాకృతీ। సోమహాళీశ్రితే-ష్టోత్సవాయానతుల్॥ ౧౪౯॥

### గర్భభుజంగప్రయాతవృత్తము.

నతుల్వామదేవాఘ-నధ్వానకంఠ। ద్యుతీకామకాలాజ-యోత్కంఠకాలా।
హితాసోమనేత్రద్ధి-నేట్సోమశక్రా। కృతీసోమహాళీశ్రి-తేష్టోత్సవాయా॥ ౧౫౦॥

### ద్విప్రాసము.

కం॥ శ్రీరామశ్రీరామ। శ్రీరామాకారనీవెశ్రీరాముఁడవా।
శ్రీరామాయనువారికి। శ్రీరామానునెయవుదువుశ్రీశ్రీరామా॥ ౧౫౧॥

### త్రిప్రాసము.

కం॥ శ్రీవరదయాకరాయో। శ్రీవరదనసుంగనఁగదెశ్రీవనసదనా।
శ్రీవరదయితాశంకర। శ్రీవరదచ్ఛదకిసలయశ్రీఫలదాతా॥ ౧౫౨॥

### చతుష్ప్రాసము.

కం॥ శంకరశివాశ్రితౌఘస। శంకరశివదావదాన్యశర్వారిపునా।
శంకరశివాధవానత। శంకరశివవంద్యసాంఖ్యసన్నుతనామా॥ ౧౫౩।

### పంచప్రాసము.

కం॥ వరమనువానోమనఁగను। వరమనువానోంనమయనవఅలునుమఱిశ్రీ।
వరమనువానాశివయన। వరమనువానోంనమశ్శివాయయనంగ॥ ౧౫౪॥

### పంచాక్షరి.

కం॥ నమయనియోంనమయనియును। నమశ్శివాయయనినామనమునమొనయనో।
మమయోంనమశ్శివాయయ। నమనువుశివమవునుశివమనుమనుము మేశా॥ ౧౫౫॥

### చతురక్షరి.

కం॥ శ్రీవినుతాశ్రీవినుతా। శ్రీవినుతాశ్రీవిశ్రీనిశ్రీనీవీవే।
శ్రీవనవినుతాశ్రీతా। శ్రీవనతావననతాప్తశివశివతత్త్వా॥ ౧౫౬॥

కం॥ నేనమనుగానుగానుమ। మానునుగానైననుననుమానుగఁగానుమా।
నేనోమనినినుమానను। మానినినసుమానసానెమానానూనా॥ ౧౫౭॥

ద్వ్యక్షరి.

కం॥ నీవానావనవానను । నీవన వేననినను నవనినినీవనినే।
నీవే నేననినానన । నీవేనీ వేను నావనీనానానే॥ ౧౫౮॥

ఏకాక్షరి.

కం॥ నిను నేననననునేనన । నినుననినను ననుననినను నేనానేనా।
ననే నూనుననునినానే । నెననననననానునాన నేనూన నెనా॥ ౧౫౯॥

సీ॥ వేదరాశియనంగ వెలుఁగొందువృషభేంద్రుఁడోంహరయని యంకెలానరవేయ।
నంకభాగంబున నలంకరించు హరీశ్యహ్రీంకారిదనుఁదెల్ప నోంకృతియని।
యవతంసకుసుమంబుగవఱలునమృతాంశులేఖ యియాశైక్యంబు లీలఁజూప।
నవపదయోగాప్తి శిపశివుఁడు శివంబు మఱి శివోఽహమటంచు మహిమఁజాట।
శ్రీత్రివర్గదనాఁ జేసి శ్రీఁద్రిదళగ । నుమనుశ్రీమోక్షలక్ష్మియై యమరుటనుకొ।
శ్రీకరుండను నేనెనా శ్రీకరభవుఁ । డైనబిల్వేశ్వరుండు ప్రత్యక్షమయ్యె॥ ౧౬౦॥

తోటకము॥ శివుఁడిట్లనెఁ జెల్లెల-చెందుమఖీ । ష్టవరంబని వాణియు-సత్యతఁగో।
రెవశుత్వముఁ బాశముఁ-ద్రెళ్లఁగనా । భవుఁడంతటనిట్లని-పల్కెఁదగన్॥ ౧౬౧॥

తే-గీ॥ ఇమ్మహాకాళిమనతల్లి యేకవల్లి । బిల్వకేశ్వరియౌనిట బిల్వవనిని।
నేను బిల్వమనై తినినీవ నీవ । నానదిగఁగావలయు వినునాదు పలుకు॥ ౧౬౨॥

తే-గీ॥ హితముగను దక్షిణాస్యయా నేకవల్లి । దక్షిణామూర్తి నేనీవు దక్షిణాభి।
ముఖిగ నదివగుమమ్ము సమ్మోదమొదవుఁ । బెద్దలరిగిన దారిగా పిన్నలకగు॥ ౧౬౩॥

ఉ॥ పాశవిమోచనార్థముగఁ బ్రార్థన నేసితిగాదె నీవున।
న్నోనిసరస్వతీ కలిని నెువ్వగ నీవయి తేనినీవగా।
నీశరముల్ స్పృశించిన నసృప్రవరుల్గతసర్వపాశులై।
శ్రీశతఁగాంతురంచని శివేశ్వరుఁడయ్యెఁదిరోహితుండుగాన్॥ ౧౬౪॥

తే-గీ॥ అక్షరక్రమమున వాణియంకగతిన । గుటను శివయనితా నెఱుంగుటను శ్రీగ।
నయ్యెఁద్రివిధస్వరాంకాక్షరాప్తిఁ ద్రిముఖి। బ్రహ్మవిష్ణుశివైక్య బిల్వపతిఁ జేర॥ ౧౬౫॥

తే-గీ॥ బ్రహ్మ చతురాస్యుఁ డౌటను వాణిమున్న । దాఁ జతుర్ముఖియయ్యెనతండు బిల్వ।
నాథునందైక్యమొందఁ ద్ర్యాననగఁ బొల్చె । భర్తయనువృత్తిగ దపతివ్రతకుఁదగును॥

కం॥ ఏకముఖివై ఖరియనం । బ్రాకటముగనుండు నెందు భారతియిందున్।
శ్రీకాననమునఁ ద్రిముఖిగ । శ్రీకరియగుచుండునరయ శ్రీయునగుఁగదా॥ ౧౬౭॥

తే-గీ॥ పరయుఁ బశ్యంతిమధ్యమవక్త్రిములుగఁ । ద్రిముఖియై గూఢముగ గుహఁ దేజరిల్లు।
నల్లవాగ్దేవి దద్భజనాప్తి బ్రాహ్మ । ణత్వమును బండితత్వంబు నతులకబ్బు॥ ౧౬౮॥

ఆ-వె॥ పలుకుబండలందుఁ బ్రభవించునక్కడ । నాదరతులునతులు నాదమందు।
టురుదెయంచుయోగపరులుందురచ్చట । గుహనుగొలుచువారుగొంద్రుసిద్ధి॥ ౧౬౯॥

కం॥ కంజముశిరస్థ నాదము । కంజసరస్వతియచిత్ప్రకాశముసరసా।
కంజాద్రిభారతీగిరి । గంజెల్వొందెడునుగొల్వఙ్ఞానముొనరెడున్॥ ౧౭౦॥

కం॥ కంజమహమ్మనియగున । క్కంజముశిరముగుటబ్రహ్మకంజుండయ్యెన్।
గంజగిరిబ్రహ్మశిరముగుఁ । గంజాద్రింబిండమిడుటగడుఁబుణ్యముగున్॥ ౧౭౧॥

కం॥ కంజమహంకృతిదానిం । గంజుండాబ్రహ్మత్రొక్కికనెశివపదముం।
గంజాద్రినెక్కితారక । ముంజెందఁడెకాఁడెనరుఁడుమొగినిశివుండే॥ ౧౭౨॥

స్వాగతవృత్తము.

భోగమోక్షములఁ-బొందఁగఁగోర్కుల్ । బాగుగాఁగలుగు-వారలునేరన్।
యోగులచ్చటస-ముత్సుకులుండన్ । రాఁగఁగంజపురి-రంజిలెఁజాలన్॥ ౧౭౩॥

కం॥ కంజాద్రిమీఁదఁగలిగిన । కంజపురియెబ్రహ్మపురిగఖ్యాతివహించెన్।
రంజించెదుర్గసహితము । గంజెల్వగబిల్వపురినిఁగావునఁబిదపన్॥ ౧౭౪॥

ఆ-వె॥ బ్రహ్మపురియటంచుఁబ్రఖ్యాతిఁగాంచెను । బిల్వవనములోకవినుతమగుచుఁ।
గంజగిరిమొదలుగగౌరీసరోవరాం । తముగనడుమహరిపురమునమరఁగ॥ ౧౭౫॥

తే-గీ॥ వెలయజాగ్రద్దశనుబాహ్యవిద్యలెకని । పూనరానియహంకారమూనితానె।
బ్రహ్మమనుకొన్నయాత్మయేబ్రహ్మయగును। జాగ్రతిబ్రహ్మయనుసూక్తిజాడఁజూడ॥

కం॥ స్వప్నావస్థస్వాత్మత । నాప్నోతియనఁబరంగునాత్మయెహరియై।
స్వప్నావనైకదీక్షుఁడు । స్వప్నే విష్ణువనుసూక్తివఱలుంగాదే॥ ౧౭౭॥

కం॥ నిద్రావస్థంబ్రాజ్ఞను । ముద్రాన్వితుఁడగుచుబిందుముఖ్యుండగునా।
రుద్రుండాత్మసుషుప్తౌ । రుద్రోయనుసూక్తివినమెశ్రుతిశిఖరమునన్॥ ౧౭౮॥

తే-గీ॥ బ్రహ్మవిష్ణుశివస్థానభాసితమయి । త్రిదళమగుబిల్వమనఁగనుదేజరిల్లె।
నైననాబిల్వపురియప్పుడయ్యెబ్రహ్మ । పురియనఁగనాఁబరబ్రహ్మపురియనంగ॥

కం॥ మహితుఁడుగనయ్యెనుబితా । మహుండచటఁజేసితపముమాపతిబిల్వే।
శహితైక్యముఁగనెబ్రహ్మపు । రిహితచరిత్రముశ్రితులకుశ్రీకరమాతన్॥ ౧౮౦॥

ద్రుతవిలంబితవృత్తము.

అనుచుసూతుఁడు-హర్షముమీఱఁగా । వినికిఁజేయఁగ-విశ్రుతులమ్మునుల్।
వినుతుఁజేసిరి-ప్రీతునిసూతునిన్ । బ్రణుతినేసిరి-బ్రహ్మపురీశ్వరున్॥ ౧౮౧॥

కం॥ కంజేశపద్యావళి । రంజిల్లుటబ్రహ్మపురవరచరిత్రమిదాఁ।
గంజేశబింబమునఁగను । మంజులబిల్వేశ్వరీయమణికృతిశ్రీశా॥ ౧౮౨॥

## వసంతతిలక వృత్తము.

ఈశామహేశపర-మేశరమేశమేశా। యీశాజముఖ్యవిబు-ధేశత్రివిక్రమేశా।
కాశీశభోగశయ-కామదసత్ఫలేశా। కాశేశకాంతితను కా-ఘటికాచలేశా॥ ౧౮౩॥

## తుల్యా వృత్తము. సింహావలోకనము.

పరమేశాజగదీశాహృతభవ - పాశాదితిభవనాశాఘనసం।
గరభీమాజయభూమాప్రజనిత - కామాశ్రితసురసోమానుగుణా।
త్కరధామావరధామాసలిలజ - దామామునిజనరామాసమవ।
న్నరసింహాసురసింహాశుభకర - నారాయణనరసింహావరశ్రీ॥ ౧౮౪॥

## కల్యాణ వృత్తము.

లోకపావనానత - లోకజీవనా - శ్లుతాయితాండజేడ్గతియా - లోకనావనా।
యోకృపాకరావర - యోగమాకరా - యమాక్షమారమాంచితసం - యుక్తమాకరా।
నాకుభూశయాభువ - నస్తుతాశయా - నమజ్జనప్రియామృతస - న్నామసంశ్రయా।
స్వాకృతిక్షణావిబు - ధౌఘరక్షణా - యహోబలాలయేశ్వరక - ల్యాణవీక్షణా॥ ౧౮౫॥

## గద్యము.

ఇది శ్రీతనుమధ్యాంబాకరంబిత శ్రీబిల్వనాథమహాదేవశిష్య తిప్ప్యపజ్ఞాఽక్షర సాంఖ్యాచార్య
పర్యవితకవిత్వ తత్త్వవిత్ప్రికాండ శ్రీమత్కొండ వేంకటరత్నశర్మ
వినిర్మితంబై,
కవిమణినామంబునంబరఁగు శ్రీబిల్వేశ్వరీయంబను
పద్యకావ్యరత్నంబునం జతుర్థబింబము, బ్రహ్మపురీబింబము కంజేశబింబము.

శ్రీ బిల్వేశ్వరాయ నమః.

# బిల్వేశ్వరీయము.

## పంచమ బింబము.

### దుర్వాసఃపురీ బింబము, దూర్వాస బింబము.

### పూర్వభాగము. ప్రకృతిభాగము.

కం॥ కల్యాణప్రకృతిహితా । కల్యాణాంశుకశుకనుతకల్యాణేశా।
కల్యాణదేవతాంచిత । కల్యాణోంకృతినృసింహఘటికాద్రీశా॥ ౧॥
౫

ఉ॥ వానిగమా_క్తికాఖ్యమునివర్యుఁడురాక్షసుజానుమండలున్।
భానురశ_క్తిఁజంపిబుధవంద్యుఁడుగాఁగనువానికొప్పదు।
ర్వాసునిపుత్రిము_క్తియనురామనుగూర్చియము_క్తితండ్రియు।
ల్లాసముకైత్వమేహినదిలాఁగినబిల్వపతిన్నుతించెదన్ ౨॥

కం॥ అనము_క్తిజనకపురియని । ఘననామముగలుగనేమికారణమో శ్రీ।
వనమునకనియడుగుడుని । ట్లనెసూతుఁడుమునులతోడనధికప్రీతిన్॥ ౩॥

కం॥ దానపదమొందెపుడమిన్ । దానూనెడుధర్మవృషముదయ్యగమందున్।
శ్రీనిధిదుర్వాసగపురి । నానుతమాబిల్వవనమునరనుతులారా॥ ౪॥

మ॥ అనసూయాత్రిమహాతపఃఫలముమధ్యాహ్నార్క_తేజుండుచం।
డనగద్విడ్భిదురో_క్తిభీకరుఁడఖండజ్ఞానమాన్యుండుచం।
దననీహారసుధాసుధాంశుమనుఁడుద్యత్స_త్తపోమూ_ర్తిస।
న్మునిదుర్వాసుఁడనూనతన్వభవుఁడొప్పుంగాజగత్పూజ్యుఁడై॥ ౫॥

తే-గీ॥ గంధమాదనపర్వతగహ్వరమునఁ । దపముఁగావించుచుండెనత్తాపసహరి।
యగుచుయోగినివాతదీపాకృతిగను । శలభయోగంబననొకండుసమకొనెనట॥ ౬॥

కం॥ సుందోపసుందులనుమును । ప్రమందించినయ_త్తిలో_త్తమాసుంబరిచం।
ద్రుందనుపంబోవఁగబలి । నందనుఁజాసాహసికుఁడనంబడువాఁడే॥ ౭॥

కం॥ కావరమునసువిధుంతుదుఁ । డావిధుముఖిఁబట్టెనెయనసురుఁడుగడిమిన్।
రావణుఁడురంభఁబట్టిన । కైవడినయ్యచ్చరనటఁగడువడిఁబట్టెన్॥ ౮॥

కం॥ పిమ్మటనమ్మగువయుఁదన । నెమ్మనమునసమ్మతించినెమ్మినెనయని।
మ్మిమ్మహిధరగుహాయననం । దమ్మిథునముగూడెఁగ్రీడలనువొందంగన్॥ ౯॥

కం॥ వరశింజితమునుగురుమ । ర్మరమునుగణనీయబహుళమణితంబునుని।
ర్భరపరిమళమిళదళికుల । విరచితఝంకారముమునివినెవిచలితుఁడై॥ ౧౦॥

మ॥ కనియెన్ముందుమునీంద్రుఁడద్భుతముగాస్త్రీబింబముంగ్లానిఁజెం।
దనుగల్వల్వాగుడంగరిక్కలురలందార్కొంచురాఁదెమ్మెర।
ల్మానయంగానెగిఁబావురాలపలుకుల్మోడిన్విడంజీఁకటుల్।
బోనరన్సంపఁగితీఁగయుంగదలమింబాళ్వానుషక్తినటన్॥ ౧౧॥

కం॥ మునితనతపముఅన్నైఁపక । ఘనకోపముప్రజ్వరిల్లఁగాశపియించెన్।
వనితఁదిలోత్తమరాక్షస । తనుజగబలిపుత్రుగాడిదగఁబొడముభువిన్॥ ౧౨॥

తే-గీ॥ అత్తిలోత్తమబాణజయయ్యెనయ్యు । షయుఁడదనిరుద్ధజాయయైజానుమీఱె।
సాహసికుఁడంతఁగృష్ణుచేఁజచ్చెవాఁడు । రాసభాసురుఁడైమునిశాసనమున॥ ౧౩॥

చ॥ పరమజితేంద్రియుండలతపస్వియుఁదన్మిథునక్రియంగనన్।
స్మరసుఖసస్పృహుండయిమనంబుననెన్నెనజాముఖీరతిన్।
వరమునిగాధిజున్శశినిభ్రాతనుమాపతివిష్ణువల్లభున్।
హరహరయెంచెఁగాంచమిథునాప్తిసరాగులుగారెయోగులున్॥ ౧౪॥

చ॥ చెఱుచునుడబ్బునుబ్బఱఁగఁజేకుఱఁజేనెడువ్యాధిబాధలన్।
దఱుచుగసత్కులంబునిలఁదార్కొనసీయదుమందుమాఁకులన్।
వెఱఁగొలుపున్మదిందొలఁచువేశ్యయయోపురుషాంతరాశచే।
నఱగొఱనేయునెమ్మివెలయాలదిమాన్యనకొనెయెమ్మెయిన్॥ ౧౫॥

శా॥ ప్రీత్యౌత్సుక్యముగల్గియుంబ్రియునికింభీతింగడుంబెంచునా।
ద్ధత్యంబున్నెగడించుదుర్యశమునేతార్కొల్పుగూఢంబయే।
నత్యంతోగ్రముగాఁగశిక్షలిడునిందందన్యనాలక్కటా।
సత్యంబారయఁదేనెఁబూసినసియాసవ్వంద్యుఁడేజారుఁడే॥ ౧౬॥

మ॥ కనకున్నంగనఁబల్కకున్నఁబలుకంగైకోకయేయున్నఁగై।
కొనఁగొంకింటనుజేర్పకున్నఁగవియంగొంకొందినంబొందినన్।
ఘనసంరంభముతోడఁబైకొనిననెక్కాలంబునంభార్యయొ।
ప్పనునేరేనియుఁగన్నఁగాదుసడిసత్పుణ్యుండుజాయాఘ్నుఁడా॥ ౧౭॥

ఉ॥ ఆలనువారఁజేరఁగగృహార్హసుకృత్యములెల్లఁజెల్లెడుం।
బోలఁగనగ్నిపూజనముపొల్చుబుధాతిథిపూజసంతతి।
శ్రీలెసఁగున్సుబంధుధృతిచేకుఱుధర్మముగామమర్థమున్।
జాలఁగఁగ్రాలుగేహికనజాయత్రివర్గదకల్పవల్లియా॥ ౧౮॥

ఆ-వె॥ అంచునెంచిపెండ్లియాడనాతఁడువేఁడ । నద్భుతముగనప్పుడరుగుదెంచె।
నౌర్వుఁడనుమునీంద్రుఁడాత్మజఁదోడ్కొని । యగ్నిసీతఁదెచ్చునసువానరఁగ॥ ౧౯॥

కం॥ వచ్చినయార్యునిఁ గనుఁగొని । చెచ్చెర దూర్వాసుఁ డపుడు చేసెం బ్రణతిన్ ।
సచ్చరితుఁడ తఁడు ధన్యత । కిచ్చనలరి పెండ్లికొడుక వీవగుమనియెన్ ॥ ౨౦॥

మ॥ అన నాత్రేయుఁడు నప్రమభావమున నయ్యార్యాఖ్యమౌనీంద్రునిం
గని స్వామీ యెటనుండి రాక యెటకుం గాంక్షించినారే గనేఁ
గని నాఁడన్భవదాగమంబున ననుసత్ఖ్యాతిన్మదీయాశ్రమం
బొనరెం బావనమౌచుఁ గార్యమది యోయొప్పంగఁ జెప్పంగదే॥ ౨౧॥

చ॥ అనవుడు నాతఁ డిట్లనియె నత్రిసుపుత్రుఁడనే సరస్వతీ
ధునికడనుండెదం దపముతో నిది జాను జనాకుని న్నెతా
మునువరియించె నెల్లదొరు ముద్దియ దద్దయు నీకె కూర్పుమం
చనుగడుఁ గోఁజఁ దెచ్చితిని సుందరిఁ బొందుగఁ బొందు దీని నాన్ ॥ ౨౨॥

ఆ-వె॥ దానిచక్కఁదనము దనమదిలోఁ గొనఁ । బైఁబడంగ వేడ్కఁ బ్రబ్బుచున్న
దిటవుఁబూని మిగులఁ బటిమమైనిట్లనె । నత్రిపుత్రుఁ డారయల్లనిబిగి॥ ౨౩॥

శా॥ వాసిన్స్వీసరవోవఁ జేయఁగడిమిన్వమ్మోయటం జేసెడున్ ।
దోసమ్ముల్వెలయించు విద్యలను సమ్మాలించు విజ్ఞానమున్ ।
గాసింబెట్టి యడంచు సంస్కృతిభృతిన్గారించుఁ దూలించెడున్ ।
స్త్రీసంగంబు సుఖాస్పదంబె సుధికిన్సేవ్యంబొకో యోగికిన్ ॥ ౨౪॥

మ॥ కనఁగా నెందుమహాత్మ సేవయవు మోక్షద్వారమౌనంగనా
జనసాంగత్యము చూడఁ జూడ నరకాంచద్వారమంచున్మహా
మునులొప్పంగ భవాదృశుల్వలుకరే ముఖ్యుండ మీముందరే
మనువాఁడన్గనఁ జిల్కపల్కులు మదీయాలాపముల్నాపుడున్ ॥ ౨౫॥

చ॥ అతఁడనె నార పెక్కు ఋషులాడరె పెండ్లి రహస్యమే యరుం
ధతిపతిగా వసిష్ఠముని దత్తుఁడుగాఁడె సభార్యుఁ డార్యస
న్నుతుఁడగు కశ్యపుండురుగుణుండగునా జమదగ్ని యత్రినీ
పితయనసూయనీయమను బెండిలియాడఁడె యాడ కడ్డమున్ ॥ ౨౬॥

చ॥ అతులతపోధనాకదళియాత్మవరించెను వచ్చెనిన్నుఁగూ
ర్చితగవివాహమై వెలయు చెందుమభీష్టసుఖంబులంబొరిన్ ।
క్షితిధరరాజపుత్రి శివ నేరఁగ రాజిలు రాజమౌళినా
మతిఁగననీకు నాయనకు మాన్యయొకింతయు లేదు భేదమే॥ ౨౭॥

కం॥ నావుడు దుర్వాసుఁడు గడు । భావంబున నుబ్బియుబ్బుబయలుపడఁగనీ
కీవడువున నుడివెను జన । మీవచనము మీఱఁదగునె మేకొంటిననన్ ॥ ౨౮॥

ఆ-వె॥ అగ్నిసాక్షికముగ నప్పుడే యుద్వాహ । మొనరఁ జేసి యార్యుఁడని యెనల్లు
తోడవత్సయిద్ది చేడియకందళి । ముద్దుబిడ్డ నాకు ముద్దరాలు॥ ౨౯॥

కం॥ ఘనతరసురూపసంపద । ననిమిషవనితలజయించునవలీలనుసీ।
వనితయిఁకఁబొగడవలెనే । మునికయికంకణమునకునుముకురంబేలా॥ ౩౦॥

కం॥ ఐననొకకొఱఁతగలదీ । చానకువాక్పరుషతయదిక్షమియింపఁదగున్।
జ్ఞానైనపూర్ణచంద్రుని । మానకకందున్నఁగనరెమానవులెందున్॥ ౩౧॥

కం॥ తల్లియుఁదండ్రియునైయీ । పల్లవపాణినిఁబెనిచితిఁబనులిడనగుటన్।
బిల్లతనమునసుశిక్షకు । నెల్లమినిదియిట్టులయ్యెనోర్వంగఁదగున్॥ ౩౨॥

కం॥ అచ్చరలతోడికూడిక । వచ్చినయదిచదువాకింతపాటలునాటల్।
వచ్చినయవివినయంబే । లాచ్చిఁకనేమనఁగవచ్చులోలాత్మయిదా॥ ౩౩॥

కం॥ చూచియునెఱుంగదెదియుస । దాచారంబెఱుఁగుఁబోరిదురాచారంబుల్।
ప్రాచీనపథకమొల్లదు । నేచితిననితోఁచినట్లెనెఱపునవగతుల్॥ ౩౪॥

తే-గీ॥ తనకునేమియుఁదెలియమదగఁదెలిపిన । వినదుఱదుదుష్టచేష్టలఁబేర్చునొకటి।
యన్నవక్రోక్తిలోకోక్తివ్యాజనింద । లాడునోడకదుర్భాషలాడునడల॥ ౩౫॥

కం॥ ననునుఱదుచేయుమనినది । పనిచేయదువలదనినదిపనివడిచేయున్।
దనయంతఁదానెయెందేఁ । జనియెదునివసింపదాత్మసదనమునందున్॥ ౩౬॥

తే-గీ॥ చిన్నతనముననెట్లున్నఁజెల్లుఁగాక । పరువముననెట్లుదగుఁగులభామినికని।
కుందెదనిఁకేమియనుకొన్నఁగొఱలుఫలము । మొనసినదికర్మమనుభవమునఁగదతెగు॥

తే-గీ॥ ఐనదోషాకరుఁడుకుటిలాత్మకుఁడుగ । శంకితుఁడులోకబాంధవలయవిభాసి।
సోమునాదలఁదాల్చఁగాసోముఁడుబుధు । లాశ్రితులవిడువరుదోషమువువిడుపని॥

ఆ-వె॥ ఎన్నిదప్పులున్ననేలంగదేనైఁచి । యూలిఁగిదశసేదయామృతమున।
నైరణసుఫలంబుసమకొనియెడుఁగానఁ । గృషికవృత్తిఁగనుచునెనయుముదము॥

తే-గీ॥ అనుచుఁజెప్పియొప్పించియమ్మునినిజసుత । తోడనిట్లనెమాయమ్మతొయ్యలులకు।
ధర్మమేవినిచెదవిస్మృతగఁజరింప । వమ్మయుభయకులమ్ములవలయుఁబ్రోవ॥ ౪౦॥

## స్త్రీనీతి కంద నవరత్నహారము.

౧. పలిసేవదేవతార్చన । సతికగుగురుకులనివాససమమునికియటన్।
హితవుగనడచుటతపమత । నితోడఁదగఁబలుకుటెప్రసరినింజడువుటయున్॥ ౪౧॥

౨. పాకాదిలౌకికాగ్నియె । ప్రాకటముగవైదికాగ్నిపగిదినగునుభి।
తౌకరులకిడెడుకరుడులె । శ్రీకరములుస్వాహుతులుగఁజెలఁగెడునుగడున్॥ ౪౨॥

౩. అతిథిమహోత్సుండభ్యా । గతుఁడవిష్ణుండుబ్రహ్మగానాహూతుం।
డతులితుఁడుపతియెపరభై । వతమునురలుబందుగులుగవలయుందెలియన్॥ ౪౩॥

౪. మగనికెదురాడఁగూడదు । తగనతనినిదేశమునెహితంబుగఁబూనం।
దగవగుఁద్రికరణశుద్ధిగ । మగువకునేలాపురాణమునుజపతపముల్॥ ౪౪॥

౫. తీర్థాటనములు వ్రతములు । వ్యర్థంబులు సతికిఁ బతిదియాజ్ఞ యొదవమిన్।
సార్థకము సతీత్వమె యాఁ । బ్రార్థింపఁగ నేల యమృతపాణిబికిరమున్॥ ౪౫॥

౬. జారిణులతోడఁ గూడిక । గారాదు పరపురుషులను గనరాదు రా।
చారులను జేర్చుకొనరా । దారసి గృహకృత్యముల నెయ్యగుఁ జేయంగన్॥ ౪౬॥

౭. తిట్టిన మొట్టినఁ గొట్టిన । నెట్టినఁ బడఁగొట్టినఁ దను నెట్టినఁ జనకా।
కట్టడియగు మగని నచే । పట్టి విడువ దార సాధ్వి పరమప్రీతిన్॥ ౪౭॥

౮. ఐనను బతి దుర్వృత్తుం । డైనను మూఢుండునం గహైన్యుం డైనన్।
దీనుం డైనను షండుం । డైనగదియ మృతుఁడునైనన గలదు సతియేన్॥ ౪౮॥

౯. విడిముడికై వలువలకై । తొడవులకై మగనిఁ దెగడఁ దొడఁగదు దనకున్।
బుడుతలు లేరని యెపుడును । గడిమీఱదు గరితయదియ కదయగు జేజే॥ ౪౯॥

ఆ-వె॥ అనుచుఁ గందనవకమనఁ గందనవకంబుఁ । గదళి కొప్పఁ జెప్పెఁ గదళికివలెఁ।
బూనియార్వఁ డారస్త్రీనీతి నవరత్న । హారమిదియ కాక యన్యమగునె॥ ౫౦॥

తరళము॥ పానరనందఱు మెచ్చనీదగు - పుట్టినింటిని నత్తయిం।
టిని మెలంకువమై మెలంగుక - డిందియాను బతివ్రతా।
ఘనతసీత సుకన్య స్త్రీజన - గౌరవావహనత్తనీ।
మనములోనన నూయ నెన్నుము - మాన్యమీ తరళంబునా॥ ౫౧॥

ఆ-వె॥ అనుచు బుద్ధిఁ గఱపి యాత్మజ నెడఁబాయ । లేక యెట్టకేల కాకులించి।
యల్లుచేతఁ గూఁతు హస్తంబుఁ బ్రాణంబుఁ । బోలె నొప్పగించి పోయె నతఁడు॥ ౫౨॥

శా॥ అంతం గోరిన యట్లచేకుఱ నటంచాత్రేయుఁ డెంతేనియున్।
సంతోషంబునఁ బల్కె నక్కదళితో స్థానీయమో యునిక్కిం।
గాంతారంబొ త్వదిష్టమన్న నది వేడ్కం గాన నే నెల్లనాఁ।
బంతంబొప్పఁగఁ గొప్పప్రోలొకటి సర్వస్తుత్యముం గానటన్॥ ౫౩॥

చ॥ కలుగఁ దలంచినం గలిగెఁ గాంచనరత్నమయంబు వీడు సా।
ఖ్యలనితమేమి వింతయటఁ గాంచనరత్నమయంబు లౌవనుల్।
కలితసమస్తభోగములఁ గాంచనరుల్ సురలందుఁ బొందుగం।
గలిగిరి యోగసంపదకుఁ గాంచన సాధ్యము గల్గ నేర్చునే॥ ౫౪॥

ఉ॥ అందము మెఱోన్నతంబులగు హర్మ్యవరోపరిచంద్రశాలలం।
బొందగు తూఁగుటుయ్యెలలఁ బొల్పగు తల్పములందు గాలిచేఁ।
బొందికయైన మెత్తలను బూవుల పానుపులందు నంచయిూఁ।
కందుల కించు పర్వులను గాంచిరి వారు సుఖంబు సారెకున్॥ ౫౫॥

మ॥ అలరుం దోఁటల సల్లతాగృహములం దందందుఁ బూఁజప్పరం।
బులఁ గ్రీడాచలకందరంబులను సంఫుల్లోత్పలేందీవరో।

జ్వలకాసారతటంబులం బరువడి న్వారల్ముదంబందుచుం
జెలిమిన్మించి రియించువిట్టుఁడు గడున్సేవించుచున్మేలనన్॥ ౫౬॥

మ॥ తొలుత న్వారలు పావురాలవలెనై తోడ్తోడ నేహంసశ్రీ
లలరం గాంచి కురంగభంగిఁ దగి యొయ్యం గోవిధం బూని జ
క్కులమాడ్కి న్విహరించి చాలకడ వింగుంజంబులం గ్రీడలం
జెలువం జొంగిరి వృత్తయుక్తపదముం జానొందఁ గందాల్పనాన్॥ ౫౭॥

మ॥ నదులందు న్సెలయేళ్ల సైకతముల న్వాహ్రాదౌఘంబులన్
మిథునం బద్దిరమింపఁ దోఁచుఁ గడు నెమ్మిన్సింధుసంగంబనం
బొదలంగా నుబయళ్ల గొండచఱులం గూలంకషాద్రీశయు
త్తిదగంగట్టుల పైఁదటి జ్జలదస త్తిన్ శైవయోగంబయై॥ ౫౮॥

చ॥ అనయముగూడి వేడుకల నాటలుఁ బాటలుఁ బాటిలంగనుం
టను నళు కేదికందళియటన్మగనింగయి నేయు మేలముల్
పొనరుచుఁ బ్రీతి నాతఁ డెడఁ బొందగఁ బంతము మాని తానెయా
తనిమును గాఁగిలించుకొనుఁ దన్ప్రియుఁ దన్పదతన్వితన్విని న్॥ ౫౯॥

చ॥ అతివలు గొందఱారసి తదైక్యము వేఱుగఁ జేసి వెండియున్
వితతముగాఁగఁ జేయఁగను బ్రీతినిఁ గందళిఁ జేరి సుందరీ
పతిదనయంతఁ బైకొనక భామయపైకొనుటొప్పదప్పతిన్
సతినిజవశ్యుఁ జేసికొన జానగుఁ జానకు మానమానసన్॥ ౬౦॥

సీ॥ మగనికి నణఁగెడు మగువయు మగువయే మగని నణంగించు మగువ మగువ
మగఁడనఁబడి యొడి మగువయు మగువయే మగని నాడెడు ప్రౌఢమగువ మగువ
మగఁడడచినఁ బడు మగువయు మగువయే మగనిని నడచెడు మగువ మగువ
మగనివారికి జంకు మగువయు మగువయే మగనివారలఁ దోలు మగువ మగువ
యనుచు నొర్వని వారనయమున నయము । నంతకంతకుఁ గఱపంగ నడరి కల్లు
ద్రాఁగ మైకంబు దలకెక్కు లాగునఁ దగి । కదళి దుస్సంగతిం గడుఁ గడిమి నెగడె॥ ౬౧॥

సీ॥ క్రొల్లంటి గ్రేఁగంటఁ గనికనిగడిఁ దేటిసూటిగాఁ బెనిమిటిఁ జూడ నేర్చెఁ
బొమవిండ్లు గ్రిందుగఁ బొలుచు పూఁబోఁడి దా బొమముడి వెట్టంగఁ బొసఁగ నేర్చె
నూర్పుఁ బుచ్చక కడు నోర్పుతో నుండెడును విదయు స్సనఁగఁ దానొలి నేర్చెఁ
జిఱునవ్వుతో నెప్పు తెఱవ దాఁ బకపకయని నవ్వవింతగా నడరి నేర్చెఁ
బలికినను నోరిముత్తెములాలుకు ననఁగ । గొణుగు నదిగో యిలలకెల్ల గురుత నేర్చెఁ
గదలినను రవణమ్ములు పాదలు రవళి । ననుచుఁ గదలని కదళి దాఁ బెనఁగ నేర్చె॥ ౬౨॥

సీ॥ చెలికత్తె చేతను జెప్పించుటను మాని తానె చెప్పుటకును బూని తొడఁగెఁ
జాటు చాటున నుండి చల్లఁగ మాటాడుటను మాని యెదుర మాటలకుఁ గడఁగెఁ
బహువచనము మాని పరఁగంగ నేకవచనమున వాక్రువ్వఁ జాగవీఁగి
ప్రమితాక్షరంబుగం భాషించుటను మాని యమితభాషణములకడరెఁ గడఁకఁ

బలుకుతిన్నదనంబునుబాసిబైని । యాఱఁగానెంటఁగనుఁగొనియడలఁదిట్టి।
మొదలుఁబెట్టెనెరుల్వినఁబిదపమగనిఁ । గదళియదియయ్యెగయ్యాళిగచ్చపోదగ॥

సీ॥ ఉఱిమివీక్షించెనాయుగ్రాక్షులయ్యవియుగ్రఫాలాక్షినటుండుమనును।
హుమ్మనివీఁకచేసెగిఁపలయాఁచెనాకాండజజాండమటుండుమనును।
గదిమిగర్జించెనాఘనభైరవరవంబుఁజండభైరవునటుండుండుచునును।
మొగముముళ్లించెనామోమదికల్పాంతచండదీధితినటుంయుండుమనును।
బటుపటునుబండ్లుకొఱికెనాబమ్మ వుఱియ । గండుమెఱసికొఱుకుటనటుండుమనును।
గదళిచెలరేఁగినడచెనాత్మచలింప । గుండెలదరమృత్యువునునటుండుమనును॥ ౬౪॥

సీ॥ పిలిచినఁబలుకదుపలికెనాయేమనిగద్దించిపలికెదుఁగర్జమిద్ది।
యనిచెప్పనెప్పకయడ్డంకులేచెప్పఁజేయుమన్ననుదానిఁజేయననును।
జేసెఁబోచెడఁజేయఁజెప్పినపనినెల్లనిదియేమియనఁగనునిట్లెయనును।
బుద్ధిలేదననీకుబుద్ధిలేదనులేనివ్యాధిబాధలనాకులనురముసుఁగు।
నిగుడఁగఁబరుండులేవదునిత్యకృత్య । ములయథావిధిౙరుగనీదలరనీదు।
పూనినైమిత్తికములకుహానిఁజేయుఁ । గదళిగడళియెయదిముండ్లపొదయకాక॥ ౬౫॥

సీ॥ అతిథులభ్యాగతులాలయంబునకేగుదేరవారలబిట్టుదిట్టిపంపుఁ।
జుట్టలనిలువెళ్లఁగొట్టుశిష్యావళినిగఁబట్టుకొనికొట్టితెగడినెట్టుఁ।
బనివాండ్రఁదీండ్రించిపడఁగొట్టుఁదెగఁదిట్టుఁబనివడికుండలఁబగులఁగొట్టు।
బాలతృణంబుగంబతిఁగనుఁబెఱవారిఁగ్రిమికీటకములుగనుమతినెంచుఁ।
దండ్రిగౌరవంబెతలఁచులాఁతులనెల్ల । గొప్పకొద్దియెన్నకొప్పఱఁగను।
దెప్పనెప్పడునుమదిందానెఘననని । నిక్కఁగదళిమదముమిక్కుటముగ॥ ౬౬॥

కం॥ అక్కైవడినెక్కువగా । నక్కదళిదిదౌష్ట్యమంతకంతకునహియా।
నిక్కముప్రతీపదర్శిని । చక్కెరబొమ్మయెయటంచుసంయమియెంచెన్॥ ౬౭॥

కం॥ లాలించినఁదలనెక్కును । లాలింపకబిగువుఁజూపలలనవిముఖియా।
వాలకమూనుంబ్రేలుం । బోలుంజాగిలమనంగఁబోలఁతియలఁతియే॥ ౬౮॥

కం॥ అనితనమనముననెంచుచు । ఘనమైనప్రతిక్రియయెదిగావించెదనం।
చునుగామఘలమిదేయం । చునుస్త్రీమృత్యువనుచుశోకించుమదిన్॥ ౬౯॥

ఆ-వె॥ మిత్తియొక్కసారిమ్రింగెడుంగూళయా । మత్తకాశినియనమాటిమాటి।
కున్నవఱకునములునన్నకంబెనుమిత్తి । చాలమేలటంచుసంతపించు॥ ౭౦॥

కం॥ వెక్కండ్రశాపహతిచే । గ్రుక్కించుటఁజేసితనకుఁజొప్పడెదుస్త్రీ।
చక్కటిదిప్రాచీలంబని । యక్కమలజుమెచ్చునుస్సురనుమానియగున్॥ ౭౧॥

సీ॥ అప్పుడప్పుడుగిన్కయుప్పతిల్లినఁగ్రుక్కఁగాలకూటమునుశంకరుఁడెయనఁగ।
నప్పుడప్పుడొదవెడునలుకనులోఁగొనునెరగలిమ్రింగినకృష్ణుఁడనఁగ।

నష్టమ్ముచొప్పడునలవిమాలినకనలానుసంద్రముఁద్రావుమానియనఁగ।
నప్పుడునప్పుడునడరెడుకాతాళమనుకడలినిఁబీల్చునౌర్వమనఁగ।
నౌర్వమదినెంచిశాంతుఁడౌనతనికడను । నతివననుపఁదలంచుఁబాయంగడంగుఁ।
గుమ్మనిప్పననెప్పుడుంగుములుచుండుఁ । బొగులుచుండుఁబ్రతీకారబుద్ధివొడమ॥

కం॥ నైఁపకతద్దుర్వ్యాప్తినిఁ । జూపోపకమానమూనెసొరిదిఁదగదనెన్।
ర్వాపించెనీతిగొణిగెను । గోపించెనుగొట్టెఁబడకఁగొనకతఁడుండెన్॥ ౭౩॥

కం॥ అచ్చెరువునందనందఱు । నచ్చండికిఁజెందుఁడతఁడహాలోఁబడియెన్।
గ్రచ్చఱదివటికిదీవియ । లొచ్చననినరుచికిఁజిచ్చులోఁదువయనఁగన్॥ ౭౪॥

కం॥ గడగడలోకములెల్లన్ । వడఁకనెతనిఁదలఁపనతఁడుపరమునిదూర్వా।
నుఁడువడఁకెఁజాలనాలికి । బెడిదపుఁబులిఁగన్ననడఁగుపిల్లియపోలెన్॥ ౭౫॥

తే-గీ॥ కాలబలమెట్టిదనవచ్చుఁగాఁగలయది । గాకమానదుగదమఱికర్మఫలము।
కదళిగర్భంబుఁదాలిచెఁగ్రమముగాను । గదళిగెలవేయుక్రైవడిఁగానిపించె॥ ౭౬॥

కం॥ ఆదంపతులకుఁబుట్టెం । గాదిలికూఁతురదిముక్తికైతకపుఁబోదన్।
బూదనరినట్టుగానా । మోదముసంధిల్లనెల్లమునిజనులకిలన్॥ ౭౭॥

తే-గీ॥ ముక్తియేముక్తయనఁదగిమోదమొదవఁ । జేసెఁదలిదండ్రులకుస్వాఖ్యఁజేసెసార్థ।
కంబుముక్తాంబయనశీఘ్రకాలముననె । యెట్టులదియనఁగదళిబిట్టేచెఁగడిమి॥ ౭౮॥

ఆ-వె॥ కూఁతునెపముచేతనాతఁడెఁబెనిమిటిఁ । బ్రల్లదంబులాడవెల్లివిరిసె।
మల్లుగల్లుద్రావెమఱియప్డెతేల్గుట్టెఁ । గొట్టెదయ్యమన్నయట్టులంత॥ ౭౯॥

కం॥ కానఁగనత్యుత్కటముగ । నైనంబుణ్యంబుపాపమదిలోడనెయిం।
దౌనుగదఫలప్రదముగ । మ్రానసుగడుఁబండుపండుమహీరాలుఁగదా॥ ౮౦॥

ఆ-వె॥ ఒక్కనాఁడుభర్తపెలామాగ్నిఁదెమ్మనఁ । దేనుదేననిమెనుదెచ్చుకొనఁగఁ।
దివురనింగలంబుఁదివుటమైనార్చెను । నీళ్లపోసికదళినెమ్మియఱఁగ॥ ౮౧॥

తే-గీ॥ కదళిబాహ్యానలమునార్చెఁగానినీట । మానిమారారికాంతరమైనక్రోధ।
వహ్నివెలుఁగొందఁజేసెఁదీవ్రంబుగాఁగ । స్వకృతదుర్వర్తనేంధనార్పణముచేత॥

ఆ-వె॥ అగ్నిపూజనమునకవుదారసంగ్రహ । మగ్నినార్చెనేనినాలదేల।
యంచునెంచెమౌనియతిధర్మమూనంగ । నెక్కొదండధరతనెక్కొనమది॥ ౮౩॥

కం॥ శాపాయుధుఁడాక్రోధనుఁ । డేపొందిదృగాహ్యవిలయహితదహనుఁడనన్।
జూపట్టెలలాటేక్షణుఁ । డీపట్టునశిఖిముఖుఁడుగనేచునెయనఁగన్॥ ౮౪॥

స్రగ్ధర॥.అంతందుర్వాసుఁడెంతే - నదరిపడిమహా - గ్రాకృతింగాంచిహుమ్మం।
చింతిన్వేగన్ శపించెన్ - హితమెఱుఁగకదు - ర్వృత్తిబిట్టేచెదేయా।
వంతేనిన్ లేదెభీనీ - కగుమిపుడెయిటన్ - వ్యర్థమాబూదిప్రోపీ।
వింతన్నాపీడవీడున్ - హృతనయయనన - య్యింగదామెట్టులన్నన్॥ ౮౫॥

ఆ-వె॥ హాహతాస్మియనెడియార్తస్వనంబుతో । ఘటఘటధ్వనులను సంఘటిల్లె
నస్థిసంధులెడలెనంత్రముల్దెగియెను । జిటిలిపెటిలికాలె శీఘ్రముగను॥ ౭౬॥

చ॥ భుగభుగయంచునుంగదళిబొందిని లేచెను గ్రొంబొగల్పొరిన్।
భగభగయంచు మంటలు ఘనంబుగ మింటినినం బెనద్దియే।
నిగనిగయంచుఁ గ్రచ్చఱఁగ నిచ్చగ బూడిదకుప్పయయ్యెన।
మ్మగువ గమించు నయ్యజసమంచితస్వప్రకృతిన్భజించినన్॥ ౭౭॥

ఆ-వె॥ బూదిబ్రోవునుండిపోయి మిన్నందిన । కదళియాత్మమునిని గని యిటులనె।
నన్నుఁగూడి నీవు నలుగుడుపడితివి । వీడితివి సుఖంబు వెలయఁబొందు॥ ౭౮॥

కం॥ నాతప్పులెన్న కొప్పుగ । నీతనయన్ముక్తిఁ బ్రోవు నెమ్మి న్నాథా।
పోతరమునఁ గుమ్మిననా । వేతజెనిన్దాని దూడ నేలకయుంద్రే॥ ౭౯॥

కం॥ ఒప్పరికింపకుమీ సుత । నెప్పుడునని యొప్పఁ జెప్పియీవిఁగ నెగులుం।
జొప్పడ నీకు ముదినని । యప్పడె యయ్యాత్మ లీనమయ్యెను బ్రకృతిన్॥ ౮౦॥

శా॥ ఆప్రాజ్ఞుండల భస్మరాశిఁ గని హాహాకారమొప్పంగనే।
క్షిప్రక్రోధుఁడఁ బత్నిఁ జంపితిని ముక్తిం బుత్రిఁ బోషింపనే।
నప్రాజ్ఞుండను మామనైఁచు నెవినన్ వ్యర్థుండనంచేడ్చెనా।
విప్రాగ్పశ్చిమబుద్ధయోయనుట యుర్విం బర్వదే యెల్లెడన్॥ ౮౧॥

ఉ॥ పిమ్మట నమ్మునీశ్వరుఁడు ప్రేయసిఁ బాసి వియోగదుఃఖము।
న్నెమ్మనమందణంచుకొననేరక యారక స్వాపరాధముం।
గ్రమ్మఱ నెంచుకొంచడలు గ్రమ్మఁగ హాయను వెచ్చనూర్చెడు।
న్గెమ్మను రమ్మనున్సతిననుంగయి కొమ్మను నేలుకొమ్మనున్॥ ౮౨॥

శా॥ వాక్పారుష్యము దోషమే యమృతదవ్రాతంబు గర్జింపదే।
దృక్పర్వంబొనరింపవే వలసిన శైలంతేని నద్దూఱవే।
శుక్పాబల్యమణంపవే కరుణ నజ్జూడంగదే యంచునా।
వాక్పత్రీశుఁడు పత్రిమాడ్కి నడలెం బత్నీవియోగంబుచేన్॥ ౮౩॥

ఉ॥ అత్తఱి నాతపత్రముగ నంబరమందలరారు నంబరం।
బెత్తఱి మోలవ్రాలఁగని యెంతయు నాత్మ నెఱింగి యార్వఁడుం।
దత్తఱపాటుతో వడిగఁ దానరుదెంచెను గూఁతురాయటం।
చత్తెఱఁగుం గ్రహించి వెఱపందుచు నత్రిసుతుండు గ్రచ్చఱన్॥ ౮౪॥

ఆ-వె॥ వచ్చియడుగులందువాలెఁ దుమ్మెదదమ్ము । లందుఁబోలె దుఃఖమతిశయిల్ల।
నార్వుఁడల్లు నెత్తియనియెఁ జెల్లెనెనాడు । బుద్ధబిడ్డయనుచు మోహమునను॥ ౮౫॥

ఉ॥ హాయనుఁగూఁతురాయనును హాయనునీజనకుండ వచ్చినా।
నేయను రాకయుండఁజను నేయనునిన్నును నెత్తిపెంచినా

నేయనునన్నుఁ బోనఁదగు నేయను నోయన రావె నాదుబి।
డ్డాయనుఁ గందళీవడిగఁ డాయను రమ్మనుఁ బిల్వుఁ డాయనున్॥ ౯౬॥

ఉ॥ చెప్పితిఁ గాదె నీకుఁ దగ స్త్రీజననీతి నిరత్నమాలగా।
నొప్పితి గాదె యీ వుపతి యుల్లముఁ దల్లడమందఁ జేసితే।
యొప్పనె క్రోధినీ దుధవుఁ డొప్ప అనిన్నుశపించె నేయయో।
యప్పుడె బూదికుప్పవయి తాయవినీతుల పాయ మొందరే॥ ౯౭।

ఆ-వె॥ పలుకుపరుసదనము ప్రాణతుల్యులనైనఁ। బరమశత్రువులఁగ సరగఁ జేయు।
జెఱుచు సర్వసుఫలసిద్ధిననర్థాళిఁ। గూర్చుబానికన్న గోరమున్నె॥ ౯౮॥

కం॥ అనియంగలార్చియల్లునిఁ। గనియిట్లనె నాలి నేల కావించితిబా।
దినిమదికనిష్టమయినం। జనఁగఁ ద్యజింపంగ రాదె చంపననవలెనే॥ ౯౯॥

తే-గీ॥ ఈవు శాక్తేయుఁడనటంచు నింతినిచ్చి। నాను గానియ ఘోరము తానుయాయి।
వంచునే నెంచ వెలిమిడియబ్బదయ్య। యాలి వెళ్ళిడియే నీకు మేలవునొకొ॥ ౧౦౦॥

కం॥ క్రోధికిఁ గన్నియనిచ్చుట। గోదానము నేఁతగటికి కూళకుఁ బులికిన్।
లేదూడనప్పగించుట। గాదే నీకిచ్చికన్నెఁ గంటి నెన్నగులున్॥ ౧౦౧॥

కం॥ నిన్ననన్న నేమిగలదిఁక। నన్నే నేదూఱుకొందు నాఁతిం జంపం।
గన్నావిటఁ జంపింపం। గన్నానయ్యన్నుఁ జాలుఘనతమునకిలన్॥ ౧౦౨॥

తే-గీ॥ నీతపశ్శక్తియబలపై నాతతముగఁ। జూపితౌరపిచ్చికపయి నాఁప రాని।
దైన బ్రహ్మాస్త్రమేయునట్లకటశాప। శక్తినీయట్టి క్రోధికిఁ జను నెయొదవ॥ ౧౦౩॥

ఉ॥ తాతవిధాతలోకపతి తండ్రి మహాముని యైన యత్రియా।
మాతయ జొచ్చ్యుతేశ్వరులమానుగ బిడ్డలఁ జేసికొన్నదా।
భ్రాతలు యోగిచంద్రులు సురస్తుతులీవన శంకరాంశవి।
ఖ్యాతుఁడవయ్యుఁ గట్టిడిగఁ గాంతను ద్రుంగితివింత గాదొకో॥ ౧౦౪॥

చ॥ సరగను గాదువంటయని శాంతియొకింతయు లేక ప్రాయ్యపై।
నిరవగు కుండనుం బగుల నేసినవాఁడవు వేఁడియంచువి।
స్తరిఁగల వంటకంబు విరఁ జల్లినవాఁడవు కావె యీవు మే।
లరయక యాలిఁ గోల్పడిన వ్యర్థుఁడవే నననేల వేఱిఁకన్॥ ౧౦౫॥

కం॥ ఐనఁ దపోగర్వంబున। మానినిఁ జంపితివి గాన మ్మయము అనీకున్।
మానకగు మానభంగము। మానవపతి వలన ననుచు మామ శపించెన్॥ ౧౦౬॥

తే-గీ॥ అంతనల్లుండు మామతో ననియెఁ బ్రాణ। భంగమగు సాజమగుటను వరము మాన।
భంగమగునంతకంటెను బరమహాని। తప్పనకు మించు దండంబు దగునె చేయ॥ ౧౦౭॥

కం॥ అననార్యుం డత్రిజుతో। న నెనీ న్యాయమున నొకొ్కయక్కటచంపం।
గను జాలితివాలింజా। లును ధర్మము నీకు నేల లోకులకుఁ గదా॥ ౧౦౮॥

కం॥ వినవయ్యతనయుకంటెను । దనయయధికతరయగుఁగద దానముచేతన్।
వినమే పుత్రాచ్ఛతగుణ । మనిపుత్రింగానఁగోఁతునరయము ప్రీతిన్॥ ౧౦౯॥

మ॥ అనియోయత్రిజముక్తనీతనయయీయజ్ఞాఖిరక్షింపని।
న్ననవేఁడొందుగదీనిఁబ్రోవుముని మోహావాప్తిదౌహిత్రిము।
క్తినిముద్దాడికవుంగిలించుకొనియాస్త్రీనీతిరత్నావళిం।
దనరం జెప్పియు నొప్పగించిచనియొందస్వార్పితార్థుండనన్॥ ౧౧౦॥

చ॥ పరమవిరక్తులన్మనులఁబాయదు మోహము పామరౌఘమున్।
బరువడిముంచు పేమరిది బాంధవమిత్రధనాలయాంగనా।
నిరతముజ్ఞానశూన్యమునునిచ్చలు సంసృతినీరధింగటా।
యరిగడ మోహమీతమి వెలార్చిన వాఁడె మహామహుండవున్॥ ౧౧౧॥

చ॥ పదపడి క్రోధనుండు మునిభార్యవియోగమునైఁప నోపకే।
పడఁగి స్వపుత్రిఁబ్రోవఁగను భావమునందుఁదలంపకార్యునిన్।
మదినుఱకాత్మఁబాయఁగను మైకొని పూర్ణసమాధినప్పుడో।
ప్పిదముగనొక్కజ్యోతినెఱవెన్నెలనెన్నెలవైకనంబడన్॥ ౧౧౨॥

మ॥ కనియెన్నన్మహనీయగేయమహతీకాంతాకలాలాపసం।
జనితానందుని రాగతానకృతిసత్సంతానువాణీశనం।
దనుని న్స్వాగమ్యతప్రహర్షితజగత్సందోహు దాంతున్స్వశాం।
తుని జ్ఞానాంబుధిచంద్రుని న్సురమునీంద్రున్నారదున్నారదున్॥ ౧౧౩॥

కం॥ కనుఁగొని తగనభివాదన । మునుజేసియతండడుగఁగ మొగిఁదనవృత్తం।
బును జెప్పెనంత సురముని । యనియెను జింతాబ్ధికలశజా యితనీతిన్॥ ౧౧౪॥

ఉ॥ నెంజెలియే ద్వైతంబె జెఱుచునెమ్మిఁగరమ్ము గరమ్ము మాడ్కిమ।
న్కుంజెడఁ జేయుఁబూన్కిమఱి నెమ్మది వమ్ముగఁగూర్చుఁబెన్దెవుల్।
గంజనిక్రమింగనీదుగడుఁగాఱియ వెట్టెడుద్రిమ్మఁగుఁదెల్విఁదా।
ల్పంజను నేవివేకి కది బల్పగతుండుగనానుమానసా॥ ౧౧౫॥

చ॥ కడచిన దానికిస్వగపఁగల్గునెయద్దియె దేనిదద్దయుం।
జెడదయె కాకకావున నుబ్రేయని శోకముఁగుందుఁబొందకే।
ర్పడఁగన నాత్మకెద్దిమృతి వర్షము రూపఱు నీటిబుగ్గయా।
నొడలికి నేలవందురఁగనుల్లముదల్లడమందకుండుమీ॥ ౧౧౬॥

ఉ॥ తొమ్మిదిబొందలంగలిగి తోరమునైనది యోటికుండకా।
యమ్మిదియుండునాయువనునట్టిదిజీవనముంటవింతయా।
వమ్మయి శోకయబ్బురమె వర్షము పుట్టును గిట్టు దానివా।
రిమ్ములనుంద్రువోదురిటు లేటికి దానికినైయలందురన్॥ ౧౧౭॥

కం॥ ఎదిమగఁడుబిడ్డలుండఁగ । సదమలమతిబిడ్డనద్దిసతిధన్యయగున్।
త్రిదశస్థానమునందుం । బొదలుందానికయివగవఁబోలునెయెందున్॥ ౧౧౮॥

తే-గీ॥ భర్తసన్నిధిఁజన్నదిభార్యయార్య । సాగమానంబునేసినచానకన్న।
మిన్నయనియెన్నఁదగుఁజిన్నమగఁడుదన్నుఁ।జూచుసోమాడఁడోమన్నఁజూచునుగద॥

ఉ॥ నీసతియైనయక్కడశినిక్కువుఁగల్కియెయోగమాయయా।
భాసురశక్తినందుఁడనువల్లవువల్లభయాయశోదకున్।
వానిగఁబుట్టుఁగృష్ణునికివంద్యునికయ్యెడుఁజెల్లెలంచను।
ల్లాసమునీకుఁజేసెడునిలన్హరిమాయనుగెల్చినీవిటన్॥ ౧౨౦॥

కం॥ దీనికిసంతోషంబుం । బూనందగుఁగాకవగవుఁబొందందగునే।
మేనంజేరినతెగులుం । బోనడఁచుటపోకమేలపోవగయగునే॥ ౧౨౧॥

తే-గీ॥ తలపుగలదేనిసుఖములఁదనరఁజెంద । దుఃఖములకోర్వవలెనవెతొడరుమున్న।
కనితనమబిడ్డముద్దాడఁగడఁగుపడఁతి । సూతికాబాధఁగాంచకసుతుఁగనునెటు॥

తే-గీ॥ మరణమెనసినదుఃఖంబుపొరయకకౌడు । నంచునెంచకుపొందుజన్మాంతరమున।
మానుమామరణోపాయమానుమేలు । మనుమమనిననెసుఖములఁగననగునన॥

చ॥ అతఁడనెనావలెన్విధురుఁడక్కటయెక్కడనేనిదుఃఖియై।
బ్రదికెనెయన్ననారదుఁడువల్కెనుమున్వినవేమునీశ్వరా।
సతినిజయోగవహ్నిశిఖచందమునొందియడంగనీశ్వరుం।
డతులితమన్యువేగముననాదటఁదామసెఁగాదెయోర్మితోన్॥ ౧౨౪॥

కం॥ నాపుడునక్కథవిపులము । గావినిపింపుమనివేఁడఁగానారదుఁడున్।
నీవెఱుఁగవెయైననున । న్నీవడువుననడుగుకతననివుదునుడిగెదన్॥ ౧౨౫॥

కం॥ యోగాగ్నిదగ్ధదక్షుని । యాగంబునఁగాఁగసతిస్మరాంతకుఁడేడ్చెన్।
దాఁగనెరుద్రాఖ్యదనకె । బాగుగఫలియించెననుచుబహుశోకాప్తిన్॥ ౧౨౬॥

ఉ॥ ఆసతిచిచ్ఛరీరమునహాహరుఁడత్తఱినెత్తినెత్తిపై।
వానిగనుంచుకొంచుఁబోరివందురుమందిరిగెన్మరిభ్రమం।
జేసిరమేశుఁడాతనికిఁజేయఁగశాంతినిశార్ఙ్గముక్తనా।
నాశుగసంప్రయోగములనాయమకాయమువాయనేయుచున్॥ ౧౨౭॥

చ॥ వెనువెంటందిరుగంబహుస్థలములన్విచ్ఛిన్నరంగాంచిల।
త్పరిణతాంగాంశములందునందుఁబడియంతన్శక్తులయ్యెందగం।
గనుడన్నామములొందిపొందియటువేడ్కన్రుద్రుఁడుండందునుం।
డునుజేయుందపమున్మహర్షియనిచాటుంగాదెరుద్రన్శ్రుతుల్॥ ౧౨౮॥

తే-గీ॥ ఆమహాక్షేత్రఖండంబులయ్యెనూటు । యెనిమిదిగసవెక్షేత్రములెన్నుతములటఁ।
గలుగుశక్తులెశక్తులుజ్ఞానులెఱుఁగు । వారుతత్క్రియమేనిస్ఫురపలుకుదువిను॥ ౧౨౯॥

## దేవ్యష్టోత్తరశతక్షేత్ర సీసమాలిక.

౧. వారాణసియ కాదె గౌరీముఖంబందునుండువిశాలాక్షిమండితయయి।
౨. నైమిశంబుననుండుఁ బ్రేమంబుననులింగధారిణిలోకైకకారణమయి।
౩. యాప్రయాగపురంబునందుండులలితసల్లలితయుల్లసితవిలాసభాస।
౪. గంధమాదనమునఁ గాముకిపాలుపొందుఁగుసుమగుచ్ఛంబునభసలమనఁగ।
౫. మానసంబునఁగుముదానామజానానుహంసినాజగదేకశంసితయయి।
౬. విశ్వంబునందొప్పువిశ్వేశ్వరీదేవియోంకారమునమాయయొనరినట్లు।
౭. విశ్వకయందుండువిశ్వకామప్రపూరణిమాయనన్మయిఁబ్రాణమనఁగ।
౮. ఒనరునిచ్ఛనుమదనోత్కటయే కామ్రపురినిఁగామాక్షినాభూరికీర్తి।
౯. గోమంతముననుండుగోమతియాలమందనువేల్పుటావనందనరుచుఁబోరి।
౧౦. క్రాలుమందరమందుఁగామచారిణిమహామేఘంబునన్మించుమించనంగ।
౧౧. చైత్రరథంబునంజనుమదోత్కటచూతవృక్షంబునంజొక్కుపికమనంగ।
౧౨. హస్తినాపురమందుశస్తయానుజయంతిహస్తిమదంబానునళియనంగ।
౧౩. కాన్యకుబ్జంబునంగౌరియింపెసలారుఁగడునాటలాడెడుకన్యకయన।
౧౪. మలయంబునసురంభచెలువొందుమలయజంబందుఁగప్పురమనఁబొందికగను।
౧౫. హిమవచ్ఛిఖరముననేధితాప్తానందనందయాశరదిందుమందహాస।
౧౬. గోకర్ణమునయందగుసుభద్రకర్ణికగోకర్ణమునసుధగౌఱలుకరణి।
౧౭. స్థానేశ్వరమునందుజానెంచెడుభవానిజ్ఞానిజనేడ్యవిజ్ఞానదయయి।
౧౮. బిల్వకంబునఁబొల్చుబిల్వపత్రికసర్వమాశిసత్కృతతనుమధ్యయకద।
౧౯. శ్రీశైలముననుండుఁజెలఁగుచుమాధవిమల్లికార్జునసద్భ్రమరియగుచును।
౨౦. భద్రేశ్వరంబునంభద్రభద్రదయవుభక్తులకెల్లఁగల్పలతయగుచు।
౨౧. సౌరుమిఱువరాహశైలంబునందునుజయభక్తులకునెల్లజయములిడుట।
౨౨. కమలాలయమునందుఁగమలయమరుఁబోరిరత్నాకరంబునరత్నమనఁగ।
౨౩. పుష్కరంబునఁబొల్చుఁబురుహూతిపురుహూతసంస్తుతదాససంసదయసదయ।
౨౪. తనరెడుఁగేదారమునమార్గదాయినిసాంఖ్యమార్గదఫాలసదనబుద్ధి।
౨౫. రుద్రకోటినిఁదగురుద్రాణిశిరసునశిఖనాఁగసూత్రమస్థితిఁదెలుపుచు।
౨౬. కాళంజరాద్రినిఁగాళిగ్రాలెడుఁగడుఁగాళరాత్రియనంగఁగడిమినెగడి।
౨౭. అలమహాలింగంబునందువెలుంగొందుఁగపిలదివ్వొగదివెకంబమందు।
౨౮. మకుటంబునందొప్పుమకుటేశ్వరికిరీటముననగ్రరత్నంబుదనరుకరణి।
౨౯. ఒనరుసాలగ్రామమునమహాదేవిపెన్ననినుండునట్టిబంగారమనఁగ।
౩౦. శివలింగమందుండుశివప్రియదాజలప్రియనాఁగనభిషేకప్రియసతిగద।
౩౧. మాయాపురిసగుంగుమారితల్లికుఱంగటంగ్రీడసల్పుబిడ్డయనవేడ్క।
౩౨. సంతానముననుండుసంతతసతతంబుసంతానమునసుమస్తబకమనఁగ।
౩౩. అగునుత్పలాక్షమునందుసహస్రాక్షమందుజీబంతయాయంబికపర।

౩౪. అవుమహోత్పలమున నాహిరణ్యాక్షంబునందటుజీబంతయూపరాంబ।
౩౫. గయయందుమంగళగడు నెసంగెడుఁబ్రణవంబున మాత్రాత్రయంబనంగ।
౩౬. పురుషోత్తమంబునంబొలుపొందువిపులతారకమునస్వరమట్లుప్రకటమహిమ।
౩౭. అలవిపాశనున మోహాక్షికటాక్షంబుచేతవిపాశులఁజేయుశ్రితుల।
౩౮. పుండ్రవర్ధనమునఁబొలుపిడుఁబాటలపాటలనాటలభక్తులకును।
౩౯. అల్లనుపార్శ్వంబునందు నారాయణిశంకరనారాయణాంకదయగు।
౪౦. అలరుఁద్రికూటంబునందుండురుద్రసుందరిసోఽహమను నెడఁదారకమున।
౪౧. విపులంబునందుండువిపులమహార్ణవమందూర్మియనఁగనైక్యముఁదెలుపుచు।
౪౨. మలయాచలముననమరియుండుఁగల్యాణిసవ్యాపసవ్యార్థ్వసరణిఁదెలుప।
౪౩. కోటితీర్థంబునఁగోట్యక్షివిహరించు నారాయణాష్టాక్షరాప్తిఁజూప।
౪౪. మాగధవనమందుమాధవవనమందువలపుఁగొల్పనుగంధభక్తతతికి।
౪౫. కుబ్జామ్రకంబునగోదావరిఁద్రిసంధ్యవెలయుఁద్రిసంధ్యలంద్విజవినుతగ।
౪౬. అడరుగంగాద్వారమందురతిప్రియభక్తులనెల్లసభవులఁజేఁత।
౪౭. శివకుండముననుండుశ్రీశుభానందనునందసర్వాశ్రితానందదయయి।
౪౮. దేవికాతటమందుఁదేజరిల్లెడుదేవినందినిభక్తౌఘనందినియన।
౪౯. ద్వారవతీపురిదై వారురుక్మిణిసాధ్వియత్తింటనెచనుఁగదమున।
౫౦. బృందావనమునందుఁబ్రియమందురాధబృందావనతులసినాసేవితయయి।
౫౧. మథురయందుండెడుమహనీయదేవకిగడుపారవెన్నునిఁగన్నతల్లి।
౫౨. పాతాళముననుండుఁబరమేశ్వరియుపాస్యకుండలినిగయోగిమండితయయి।
౫౩. చిత్రకూటమునందుసీతయారత్నదీపికనాఁగరామాత్ములకువెలుఁగిడి।
౫౪. వింధ్యాచలమునందువెలుఁగొందువింధ్యవాసినియగస్త్యతపశ్శిఖినిఁదెలుపుచు।
౫౫. ప్రకటంబుగనుసహ్యపర్వతంబుననేకవీరవీరార్చితవెలయుచుండు।
౫౬. ఆహరిశ్చంద్రంబునందుఁజంద్రికపొల్చుఁజంద్రకమునఁదావిచందమొంది।
౫౭. రామతీర్థమునందురమణప్రణవమునఁబరయెసంగెడుభంగిఁబరఁగుచుండు।
౫౮. యమునయందనువొందునాన్మృగావతిదానుదాపింఛవనినుమస్తబకమునఁగ।
౫౯. కరవీరమునుగూరుఁగదమహాలక్ష్మిదాఁబంచాక్షరింజేరుప్రణవముపలె।
౬౦. అభినుతమాయావినాయకపురినుమయొప్పఁదనయునిఁబోషించుతల్లివలెను।
౬౧. వైద్యనాథమునందుఁబరఁగునారోగ్యాంబభవరోగభేషజప్రాయయగుచు।
౬౨. అమ్మహాకాళపురాప్తమహాకాళిభర్త్రనువృత్తినిఁబరఁగుఁబేర।
౬౩. ఉష్ణతీర్థమునందునెప్పారునభయభక్తులకుశీతభయంబుఁదొలఁచుమునుఁగ।
౬౪. వింధ్యాద్రినానితంబినినితంబయనంగవత్సరంబునదినప్రతతిభంగి।
౬౫. మాండవ్యవనమునమాండవియుండెడుఁబ్రణవంబునందుండుపరయనంగ।
౬౬. మాహిష్మతిఁబరంగుస్వాహామహాదేవిపుట్టినింటనెయుండుపాలఁతుకకద।
౬౭. ఛగలాండమందుఁబ్రచండదీండ్రిలుచుండుఁబశువిశసనమునఁబ్రౌఢిమెఱసి।
౬౮. అమరకంటకముననడరెడుఁజండికచండాసురధ్వంసశంసితయయి।

౬౯. సోమేశ్వరమునందుశోభిలునలవరారోహసోమపరిరోహిణియన।
౭౦. ఔఁబ్రభాసాహ్వయంబౌతీర్థమునఁబుష్కరావతిపుష్కరిణీవిభాఢ్య।
౭౧. సౌరుమీఱుడుసరస్వతియందునద్దేవమాతయదితివియద్దీతిగఁదగి।
౭౨. ఔమహాలయమునయందుమహాభాగదనరుఁబారావారతటమునంగ।
౭౩. వెలయుఁబయోష్ణినిఁబింగళావతిపాలకడలిమణిద్వీపఘనతమెఱయ।
౭౪. కృతశౌచమునమహోద్ధతసింహికచెలంగునిద్ధపాపేభసింహియయనంగ।
౭౫. కార్తికేయమునందుఁగనుయశస్కరిఖ్యాతిశాంకరియనఁగనుసన్మహిమను।
౭౬. కననుత్పలావర్తకమునందులోలయాఁబ్రణవంబునందుండువ్యాహృతితతి।
౭౭. సింధుసంగమమునఁజెలఁగుసుభద్రయర్జునయశస్సంపదవననిధిగను।
౭౮. సిద్ధవనమునఁబ్రసిద్ధలక్ష్మీదేవిసిద్ధిప్రదయయాశ్రితులకెల్ల।
౭౯. భరతాశ్రమమునందుఁబరఁగునసంగయనంగునంగనయానసంగనంగ।
౮౦. మొగినిజాలంధరమునవిశ్వముఖియొప్పుసత్కృతిసరసోక్తిచందమొంది।
౮౧. కిష్కింధగిరియందుఁగ్రీడించుఁదారయుదారబలిష్ఠునిధనమిలయన।
౮౨. దేవదారువనాప్తిదీప్తయయ్యెడుఁబుష్టిదేవేష్టదయునయిదివ్యమహిమ।
౮౩. కాశ్మీరమండలఖ్యాతయానామేధవేధోముఖాదిత్యవినుతయగుచు।
౮౪. ఆహిమాద్రినిభీమయభినుతయగుచుండుదండితామరశత్రుకాండయయ్యు।
౮౫. విశ్వేశ్వరమునందువెలుఁగొందుఁదుష్టినావిశ్వేశ్వరునియందువెలయుతుష్టి।
౮౬. ఒనరుఁగపాలమోచనమునశుద్ధిభైరవశుద్ధికరియఁటప్రజకుఁగాదె।
౮౭. కాయావరోహణఖ్యాతమాతయెసంగుఁగాయావతారయకాదెమాత।
౮౮. పొనరుశంఖద్వారమునధ్వనియదియెనాదబ్రహ్మరూపమైతలఁపుఁగొలుపు।
౮౯. పిండారకమునందుభృతియనందగుఁగొందఱందురుధృతియనియఖిలవినుత।
౯౦. చంద్రభాగాపగన్సన్నుతయగుఁగళచంద్రునందలికళచందమునను।
౯౧. అచ్ఛోదసరసుననగుశూలధారిణిశూలినియదెయరిజాలశూల।
౯౨. వేణయందమృతయావేణువందునువీణయందునుస్వరవైఖరిందెలుపుచు।
౯౩. బదరియందూర్వశిముదమందునిడుఁగడుగంగాధికయనంగఁగనుఁగొనంగ।
౯౪. ఉత్తరకురువందునొప్పొందునోషధిపాండవవంశప్రబాలరుచిగ।
౯౫. ఆకుశద్వీపంబునందుఁగుశోదకకుశలవనుతయానుగుశలవనుత।
౯౬. హేమకూటంబుననెసఁగెడుమన్మథసవిజయదుర్ముఖసక్తకాదు।
౯౭. కుముదంబునందగుగురుతనుసత్యవాదినిసత్యవాదిగాయెనయుగురుత।
౯౮. అశ్వత్థమునయందునగువందనీయరాగివిపండుటాకులుదవఁబసిఁడిగ।
౯౯. పుణ్యజనాధిపుపురమునవిధియగుఁబుణ్యంబుననెకాదెపొసఁగునుసిరి।
౧౦౦. వేదవదనమునవిలసిల్లుగాయత్రిబిడ్డతల్లియకదావేదమాత।
౧౦౧. శివసన్నిధిన్మించుశివపార్వతితదీయముఖ్యశక్తియయాటముదమిడుఁగడు।
౧౦౨. అమరావతీపురిననురునింద్రాణిదానింద్రసంపదయయియుద్ధమహిమ
౧౦౩. బ్రహ్మాస్యమునసరస్వతిచెలువొందెడుఁజెలువుఁబొందినవాణచెలువయనఁగ।

౧౦౪. సూర్యనారాయణుశోభిల్లఁజేయుసుప్రభప్రభాకరునిఁగఁబద్మహితుఁగ।
౧౦౫. మాతృకలందగ్రమహితయావైష్ణవిగ్రహములలోమించుగ్రహపతియన।
౧౦౬. సతులలోననరుంధతిపొల్చునక్కరములనకారమనఁగ మొదలదెకద।
౧౦౭. మత్తకాశినులఁదిలోత్తమయుత్తమసౌమ్ములలోఁగిరీటమ్మనఁజను।
౧౦౮. కనఁజిత్తమునబ్రహ్మకలయొప్పనెడలనుజీవుండనన్ శ్రుతిసిద్ధముగను।
ఇందుఁగలదనియునుమఱియందుఁగలద। నియనుసందియమెందునునిశ్చయముగ।
నలరుసర్వశరీరులయందుశక్తి। యదియయనియెఱుఁగందగుమొదవఁగ॥౧౩౦॥

కం॥ మాయననమయననుమయన। నాయెంబ్రణవమ్ముత్రిఖండతఃఖండములే।
మాయిందిరయమకాళియు। మాయనఁగసరస్వతియగుమహిమమహాదుల్॥ ౧౩౧॥

కం॥ మాయమయుమగూడంగా। నాయెనవోత్తరశతముగన వెక్షేత్రంబుల్।
మాయప్రకృతిహ్రీంకృతిమఱి। యాయెంబురుషుండుప్రణవమక్షరసరణిన్॥ ౧౩౨॥

కం॥ పదిలోఁగదయడఁగెడుఁదా। మ్మిదియనిప్రకృతినిభజింత్రుమేలనుచన్యుల్।
పదియవదినున్నపురుషా। స్పదమాయయటంచుఁబురుషభజియింత్రార్యుల్॥

కం॥ అహమనుటయందెసర్వము। మహితంబుగలీనమగుటమనుక్షేత్రంబుల్।
మహినష్టోత్తరశతమని। గ్రహించిరివిబుధులవెపలుకంబడియెఁగదా॥ ౧౩౪॥

కం॥ ఇదిదేవ్యష్టోత్తరశత। పదరత్నస్రజముభక్తభద్రదమువుఁడ।
త్పదభజనఫలమునిడియెడిఁ। గుదురుగఁజదివిననువినినగుణవంతులకున్॥ ౧౩౫॥

కం॥ దేవ్యష్టోత్తరశతపద। దివ్యస్తుతిచేనరుంధతియుయోగంబున్।
భవ్యుఁడుపురూరవుఁడుసుర। సేవ్యంబులలోకములనుజెందెందనరన్॥ ౧౩౬॥

కం॥ పుత్రులఁగాంచెయయాతిధ। రిత్రీపతిభార్గవుండురిక్థముఁబొందెన్।
చిత్రంబెసురాసురులుప। విత్రులుసంపన్నులైరిపెక్కురుదీనన్॥ ౧౩౭॥

కం॥ ఐరిలఁజిత్రచరిత్రులు। భూరిమునులువర్ణధర్మభూషితులునరుల్।
శ్రీరుచిరులుపెక్కండ్రిది। చేరినదుర్గతులెవుడునుజెందరుమనుజుల్॥ ౧౩౮॥

కం॥ అనియాత్మహత్యమానిచి। చనెనారదుఁడంతనతఁడుశాంతాధియునై।
కనఁడురుచిబెండువడియెన్। గనసద్యోజ్వరవిముక్తుకైవడినంతన్॥ ౧౩౯॥

## వర్షర్తు వర్ణనము.

ఉ॥ ఎప్పుడువానవచ్చునని యెచ్చినబత్తిఁగృషీవలుల్నయం।
బొప్పఁగవేఁడజ్యోతిషికులోపికనారని రేపొమాపొకో।
తప్పకవచ్చువర్షమనఁదద్వచనానుస్మృతిన్మెలంగునా।
నప్పుడుదిక్కులన్మెఱపులబ్ధమురాకనుదెల్పెఁబొల్పుగన్ ౧౪౦॥

కం॥ వడివానగురియునంచని। గొడుగులనిడుకొనిరొయనఁగఁగుముదాబ్జసఖుల్।
బెడఁగుగఁగడువఱిదగుడుల। నడరిరిదైవజ్ఞవచనమదివితయవునే॥ ౧౪౧॥

కం॥ చీమలుగదగ్రుడ్లఁగొనుచుఁ । బోమొదలిడెబారులుగనుబుట్టలెడలిత।
మ్మోముకొనసొలములకున్ । దామరమునవలసవోవునరులనసరగన్॥ ౧౪౨॥

చ॥ ఘనులఁటవారివాహులుజగద్భయదార్భటులంటగర్జనల్।
గనులఱఁజేయుమించులఁటగాంచవిషాత్మకవర్షమంటమిం।
చునఁటయెటంగుభేకములస్తోత్రములయ్యహరీశశోభలే।
మినినగుదుర్దినంబులనిమింటనుదగ్ధిశకేగెహంసముల్॥ ౧౪౩॥

శా॥ కామేహంసలయట్లుమేమునితరుఖ్యాతిన్సుపక్షద్వయిన్।
శ్రీమత్పద్మసరోవిహారకలనన్ జీరాంబుయోగైకభో।
దామోదంబాకఁడేముగైకొనముమాకన్నందగున్మధ్యమం।
బైమాన్యంబగుసుస్వరంబనియవాగాశంగనెంగొక్కెరల్॥ ౧౪౪॥

ఉ॥ మాపురిమాళిఁదాల్చెఁబ్రథమస్వరవిజ్ఞతలాస్యచాతురిన్।
బాపురెకృష్ణుఁడట్లుఘనవంద్యుఁడుసద్రసుఁడిచ్చుమెచ్చఁగన్।
బ్రాపయిప్రోవుమీఱవనువారమవారిగదాతయాతఁడే।
త్మోవుఁడుమేఘుఁడానవిశిఖావళముల్గడునాడెవేడుకన్॥ ౧౪౫॥

మ॥ వుడమింగల్గుజలంబుఁగ్రోలమెవుడుంబాల్పొందఁబర్జన్యుఁడే।
యిడువర్షోదకబిందువుల్గొనెదమంచేతెంచెస్తోకంబుల।
ప్పుడెయస్తోకములైఘనాదృతినెయెడ్పుంగోరుదుర్గాకపెం।
పెడలన్హీనులప్రాపువేఁడరుగదాయీడ్యుల్కృపుల్పండితుల్॥ ౧౪౬॥

కం॥ హరులునుగిరులునుమఱికా । సరములుగరులునుఘనాశజలదాదమమున్।
బారిఁబారిఁగోరుచునుండెన్ । బరికింపవదాన్యుఁదెకదవంద్యుండెందున్॥ ౧౪౭॥

జలద వృత్తము.

వేసవినెండనుక్కఁగడు-వెక్కసమై । వేసరిజేసినందపము-విశ్వజనుల్।
వాసిగవారినేలహరి-వచ్చెసెనా । భాసిలెనింగినింజలద-వారమహా॥ ౧౪౮॥

జలధరమాలా వృత్తము.

ఆదించాపింఛములుగ-నంతందంతు । ల్గాదైవారున్మలలుగఁ-గాంచన్మబ్బుల్।
శ్రీదంబుల్మేలనిరహిఁ-జెందంగాపుల్ । శ్రీదంబుల్ఘోరములని-చెప్పంబాంథుల్॥ ౧౪౯॥

మేఘవిలసిత వృత్తము.

చాలందీథితి-సరఘులుదనయం । దోలింగూర్చిన-వానరుఁబెఱిలివే।
యాలోకింపుఁడి-యనునసఁగఁజద । ల్గాలెన్మేఘవి-లసితముగనెగిన్॥ ౧౫౦॥

విద్యున్మాలా వృత్తము.

ఆద్యంబుల్బిందుల్పుష్పంబుల్ । వాద్యంబుల్గానుర్మల్ప్రమోయన్।
హృద్యామర్త్యస్త్రీలాస్యంబై । విద్యున్మాలావృత్తంబొప్పెన్॥ ౧౫౧॥

శా॥ ప్రావృడ్డేహినిశాంధకారవసతి న్భావించి వెల్గొందఁగాఁ।
గావించెం ఘనభిత్తిఁ గోలమెఱుపన్కాష్ఠాగ్నినిం గీచుటన్।
రావంబుప్పతిలెంగదా యుఱుమునం గ్రాలెన్మహావృష్టిధా।
రావారంబది వైద్యుతానలకరవ్రాతంబు నానాతటిన్ ౧౫౨॥

మ॥ రవియన్యాంత్రికుఁ డంశుయంత్రమున నభ్రంబన్తుషారోరుఖం।
డవిశ్రాంతంబును జేసి మిన్న నెడి యింటం బెట్టనీయిష్టమం।
చువడింగల్గిన గాలికిచ్చు నతఁడిచ్చున్వాన గాభూమికిం।
పవుభంగిన్వడగండ్లురాలునవి గాయాఁ జూడఁ దత్ఖండముల్॥ ౧౫౩॥

చ॥ గొనకొని వాన కార నెడు గొల్లఁడు మబ్బను నల్ల నావునుం।
బనివడి గాడ్పుదూడ గుడువన్మెఱపన్పెను ద్రాటఁ గట్టి పా।
లనుజడిఁ బిండెడుం బుడమియన్బలు బాననుబాలెయవ్విగా।
వనిన జలంబు నేలపయి మందురు చీమల వేలమూఁగెడున్॥ ౧౫౪॥

స్రగ్ధర॥ విద్యుత్ఖడ్గాభ్రఖేటో - ద్వలనితరుచిరై - భీమపర్జన్యగర్జా।
ప్రోద్యత్క్ష్వేళాప్తినింద్రా - యుధవితతధనుః - ప్రోద్యతుంజాచుధారా।
విద్యోతాజిహ్మగాళు - ల్వేసఁగురియుచోగిన్ - ప్రేయుచున్హ్రాదినిన్ద।
ఖద్యోతద్యోతముంద - ద్ఘనసమయమహా - యోధవుండోర్చెఁ బేర్చెన్॥ ౧౫౫॥

చ॥ ఇనుఁడు నదీనదాంబుధుల నెక్కువ వేండ్రముఁ జూపి యేపునం।
గొనివసు వించుకించుకగఁ గూర్చ ఘనంబుగ మింట గెంటుకొం।
చును జను చెందునెందొమిను చూలి మహాబలుఁడిచ్చు నిచ్చగన్।
వనదము జీవనంబొకఁడు వారక మూరుప వేఱొకండిడున్॥ ౧౫౬॥

ఆ-వె॥ వసువుఁ జేర్చినట్టివానినిదను నినుఁ । గాంచరెలమి జనులు ఖరకరుఁడని।
యిచ్చువానిజలదు నెంతురు ఘనుఁడని । యంచొతపనుఁ డప్పు డగపడండు॥ ౧౫౭॥

ఉ॥ జోరను చెల్లెడన్మసురు చొప్పడెఁ దోడ్పడ గాడ్పు ప్రేల్మిడిన్।
వారకనిండెఁ జెర్వులును వారిగఁ బాఱె సరిత్తులున్నరో।
వారములొప్పె భూసమత బావులు నూతులు వార్ధియన్న నో।
యారక వెన్కదీ నెనిటులుండుటఁ బాత్రత నొను భాగ్యముల్॥ ౧౫౮॥

కం॥ పచ్చుబడిగల్గ నెచ్చుగ । నెచ్చంబును దగు తెలిఁగున వెలయనవలయున్।
లొచ్చదిమైన నెమ్మదటికె । వచ్చు బెడదయని చెఱువులు వాఱెన లుఁగులన్॥ ౧౫౯॥

ఆ-వె॥ పాత్రమెఱిఁగి యిడుట భాగ్యంబు చాగిక । పాత్రమందు నిడుట వ్యర్థమగును।
మాకుదకము నిడుట మాన్యుఁడు ఘనుఁడబ్ధి । నగునెయన జలాశయంబులలరె॥ ౧౬౦॥

శా॥ ప్రావృట్చేటిక గూర్పనేర్పరుచులొప్పం బొంగి రారాఁగనే।
ల్లేవేళం గడురాగవారి గలయన్ హేరాళమై వార్ధిస్వీ।

యావల్లఘనసీలనీరయుతమైయర్ధాంగనేశాకృతిన్।
దైవారెన్బొరినీలలోహితుఁడనన్దన్మూర్తిదానాఁగదా॥ ౧౬౧॥

ఉ॥ చెల్వుగవర్షధారనభిషేకముగాఁగనుగూడ మేఘముల్।
బిల్వముఖోరుభూజములు పెంపుఁగనంద్విజసత్వముల్దగ।
న్నిల్వఁబయింబొగింజొనలనిచ్చలు మెర్మలునుర్మలొప్పఁగా।
నల్వగునింద్రపూజ్యములనంగనుగొండలులింగమూర్తులై॥ ౧౬౨॥

చ॥ జడిఁబడియాడియాడికడుఁజక్కఁగమొల్కలవన్నెచీరయిం।
పడరఁగనింద్రగోపతతియన్మయిపూఁతనుగాంచి గేదఁగుల్।
బెడఁగుగఁదాల్చిగుబ్బలు లెబింకపుగుబ్బలుగాఁగవాఁకలొ।
ప్పిడఁగనుదండలైతగెమహీసతివార్షికరాజ్యలక్ష్మినాన్॥ ౧౬౩॥

## శరదృతు వర్ణనము.

సీ॥ ఘనుఁడునిర్వానుఁడయిక నెనునైవర్ణ్యంబుఁగొండలపాలయ్యెగండడంగి।
విద్యుల్లతాలాస్యవిద్యుతికతయయ్యెనుజుముద్దెలయులివుజు నెచటను।
గొప్పతనముగొంద్రుకప్పలెప్పడొమానెఁదాలములిఁకవేయఁజాలమనఁగ।
నాటపాటలుమాకుఁబాటిగావనియె మొజుట్టుపిట్టలు నేరెఁబుట్టలకడ।
వానయనుమాటలేదఁటవానకోయి । లలెటఁగనుపట్టుమున్నిటి నెలఁతలొయొగి।
హద్దులిడుకొనుచడుగంటనుద్దవడిని । బుడమిమనినట్టుచూపట్టెఁబడనిచెట్ల॥ ౧౬౪॥

శా॥ అంతన్వింతగఁదోఁచెనజ్జాకఁడుజభ్రాభ్రోరుకేశుండుస్వ।
చ్ఛాంతర్జీవనఫుల్లసల్లలితవక్త్రాబ్జుండుహంసాశ్రయై।
కాంతస్వాంతుఁడుశారదార్చనరతుండజ్జేక్షణోద్భోధకుం।
డెంతేసైకతలింగపూజనశరాశీతుండువృద్ధుండనన్॥ ౧౬౫॥

కం॥ అన్నాభిషేకములుమఱి । పన్నగదీపోత్సవములుప్రబలెంబుడమిన్।
జెన్నారెనుడుగ్రహములు । మిన్నునభువిదివులురెండుమృడమూర్తులెకా॥ ౧౬౬॥

ఉ॥ కొందఱిలంబ్రదోషమునఁగోరెదరెప్పుడునక్తభుక్తినిం।
గొందఱుసోమవారములఁగొందఱుమాసమునందునాశివా।
నందముటంచునట్టినెలనల్వఁగఁజొప్పడెనప్పుడొప్పగం।
జెందిరితారకాధ్వమిదిసిద్ధమటంచువరప్రతుల్మతిన్॥ ౧౬౭॥

కం॥ శరదవసరమునయప్పుడు । శరదబ్దత్వమననీరసతయమ్మునికిన్।
బరుపూర్వశాపఫలముగఁ । బారనెనుగర్మంబుఁదొఱఁగబొమ్మకలవియే॥ ౧౬౮॥

## అంబరీషోపాఖ్యానము.

చ॥ కలఁడిలనంబరీషుఁడనుక్షత్రియవంశనితాంబరీషుఁడు।
జ్వలవిమతాంబరీషుఁడుకృపాఽభ్యవితారిజనాంబరీషుఁడా।
పలదురుదివ్యభాగవతభానురపద్మవనాంబరీషుఁడుం।
దులితమహాంబరీషుఁడువిదూరితకామముఖాంబరీషుఁడున్॥ ౧౬౯॥

సీ॥ తనప్రతాపముఁ గనితపనుండు హరిమిత్రుఁడై లోకబాంధవుఁడై వెలుంగఁ
దనయశోరుచిఁ గాంచి తగఁ గళంకియు నమృతాంశుఁడై శివమౌళి నుండఁగోనఁగ
దనధరాధారేయత నుజూచి శేషుండు శేషుండయై విష్ణు సేవ సేయఁ
దనగుణగ్రాహితఁ గనుఁగొని ముకుగాళు లెక్క గాఁ దెలివులుఁ గెనయ నల్వ
నసదృశను శౌర్యధుర్యుండు నసమకీర్తి । యనుపమైశ్వావనీధరుఁ డసదృగధుల
గుణుఁడతఁడె చక్రవర్తియుఁ గువలయాప్తుఁ । డానసంతుఁడు రాజహంసాధిపుఁడును॥

మ॥ పరఁగుం బేర్కొనఁ జక్రవర్తియనుచుం బాటిన్సహస్రారము
ద్ధురమై చాలఁగఁ గ్రాలుటం గువలయాప్తుండంచు సర్వోర్విని
బొరిఁ గాపాడుటచే ననంతుఁడనుచుం బొల్పొందు శశ్వద్యశ
స్స్ఫురణం జూడఁగ రాజహంసుఁడనుచున్ క్షోణ్యేకరాజర్షితన్॥ ౧౭౧॥

కం॥ పగతురు జముఁడని జడియఁగ । మగువలు మరుఁడనుచు మరగ మణిజను లెల్లన్
జగతీశుఁడనుచుఁ గొలువఁగ । నెగడెను నాభాగసుతుఁడు నృపమణియనఁగన్॥ ౧౭౨॥

శా॥ అంతశ్శత్రుల నోర్చి పేర్చి బలియుండా తండు బాహ్యారులం
బంతంబొప్పఁగ గెల్చి టబ్బురమెయాత్మన్ సంస్మరింపన్నగున్।
గుంతేష్వాసముఖాయుధంబులును దండుల్ రాజచిహ్నార్థముల్।
శాంతం బేరసమంబరీషునిదె రాజ్యంబౌననంగం బ్రజల్॥ ౧౭౩।

సీ॥ అరిఁగొను నాజివయంశంబెయెట్లొ యప్పాదపదించు కయు రాజ్యోపచితిని
దండించువిధ్యుక్తధర్మానుస్మృతి నెట్లో జనకుఁడనంబడు జనుల కెల్ల
ననకట్టకాల్వల నలరింపఁ డెట్లొ ము శ్వాఖుపండెడు సస్యకాండములిల
రథ్యలఁ బొగబండ్లరచియింపఁ డదియెట్లొ వాణిజ్యమెల్లెడఁ బ్రబలెడుఁగడు
నగ్నిభయమాశరత్రాసమనిలహతియు । విషమదృష్టియు లేకుండఁ బృథ్వి నేలె
నారదిక్పాలకాంశజుండగుటనతని । కొప్పెఁగాక న్యనృపతులకొప్పనెయటు॥

సీ॥ భృత్యవర్గమునకు హెచ్చు జీతము లేదు పని బాగులకు సొమ్ము వమ్ముగాదు
వాగ్దండధనదండవర్ష్మదండంబులు వరుస న్యాయ్యములయి వజలు సమత
నెవ్వడి నెందెంత హిత మొయ్యవ్వడి నందు నంతవర్గంబెయా నందజలర
సర్వత్రచవుకమై సర్వవస్తువులుండు బందుగుల్గుమిగూడి యుందు రెందుఁ
జందనాయితుండు జ్వలనుండు సతులకుఁ । జక్రరక్షితములు సకలదిశలు
నచలమద్ధిరయ్యెయల్లసామ్రాజ్యవి । శేషమీడ్యమంబరీషునిదగు॥ ౧౭౪॥

సీ॥ వివిధవిద్యలయందు విశ్రుతులగువారు గౌరవశ్రీలముఖ్యతఁ జెలంగ
శూరులు ధర్మైకసారులై విజయులై బాహుభూతులు నయిభాసిలంగ
బేరంబు సారంబు పెంపొందఁ బ్రజనుస్థితికి బేరులూరు జేందిరఁదగంగ
గోలలు సర్వకార్యాళులకుం జనజనతకుఁ బత్త్రియత నుబొసంగ
నెల్లవారు నిజోచితవృత్తిఁ బ్రాప్త । సంపదంచితులై తృప్తినింపెసంగ
నీతులజనెల్లెడను నెల్ల నీతులడర । నంబరీషుని సామ్రాజ్యమాఁగనంగ॥ ౧౭౬॥

సీ॥ కామంబు స్వస్త్రీసుఖంబున నామతిఁ గలిగెఁ బో హరిభక్తిఁ గలుగు ముక్తి।
క్రోధము శాస్త్రీయబోధాచరణ నామ యయ్యెఁ బో నాస్తిక్యమందుఁ దృష్ణ।
లోభంబు దపమునందౌ భవ్య పుణ్యంబునందు యశంబందు నైన నుమతి।
మోహమ్ము పుఁగరమ్ము శ్రీహరిరూపమ్మునందు మతియుఁ దద్గుణాళిహాళి।
మదము భగవత్కటాక్షప్రాప్తి మత్సరంబు । శ్రీమహీశేష గరుడుల శ్రేష్ఠతలను।
వెలయ నరిషట్కమిట్లు లోకులకు నంబ । రీషుఁడే లెంబ్రజను స్వశరీరము వలె॥ ౧౭౬॥

సీ॥ వర్ణసాంకర్యంబు వరచిత్రములయందు ధర్మభంగము హారౌద్ధత్యమంద।
శూన్యవాదము స్త్రీలసొబగు నడుములందు వావిదప్పుట పశువర్గమంద।
పలుకుటతోఁ జినపగిదిఁ జిల్కలయందు పంచమోద్ధతి పికహారమంద।
జీవనక్షయము గ్రీష్మావసరమునందు యశ్రువులానందమందు టంద।
శిశుహనన మాతుజాతినె స్త్రీమరణము । వరుని యనుస్మృతియు వమ్మృతి సురభిళమృగ।
ములనె విధవోపయమవార్తవులుఁ గులంద । స్త్రీస్వతంత్రత గణికలఁ జెల్లె నపుడు॥

సీ॥ తెలిసెఁ దెల్పించెను దివిరి ధర్మము నర్థమును గామమును మోక్షమును జనులకుఁ।
జేసెఁ జేయించెను జెన్నొంద జన్నము ల్వేనవేల్వేలు పుల్వాన నెమ్మిఁ।
బెట్టెఁ బెట్టించెను బొట్టలు నిండంగ నన్నంబు నందఱకమరఁ దనివి।
పూనెఁ బూనించెను ముఖ్యంబుగా ద్వాదశీవ్రతం బఖిలేష్టసిద్ధిదమును।
స్వాహ్వయస్మృతిమాత్ర సర్వాఘహరుఁడు । నమరవరవంద్య సచ్చతురాననుండు।
వైష్ణవాగ్రేసరుండన వాసిమీఱె । నంబరీషుం డపరకనకాంబరుండు॥ ౧౭౯॥

కం॥ తననీడవోలెఁ గ్రాలెడు । వనితామణితోడఁ గూడ ద్వాదశివ్రతమున్।
ఘనుఁ డంబరీషుఁ డొనరిచె । వనమాలియమేలన మధువనమునఁ దనరన్॥ ౧౮౦॥

ఆ-వె॥ ఆవ్రతాంతమందు నాతండు కాళింది । స్నానమొప్పఁ జేసి సంధ్యవార్చి।
క్రమముగా నొనర్చెఁ గాళిందివల్లభు । సారషోడశోపచారపూజ॥ ౧౮౧॥

కం॥ చేసెను షోడశదానము । లోసరిలక కాంచియంద ఆహా యనఁగన్।
భూసురవర్యులకున్ హరి । దాసులకా భాగవతుఁడు ధన్యుఁడు భక్తిన్॥ ౧౮౨॥

సీ॥ ఆభాగవతమణి యటలక్ష విప్రసంతర్పణముం జేసి దక్షిణాన్వి।
తంబుగాఁ దాంబూలదానంబుఁ గావించి యందియాశీర్వచనాక్షతములఁ।
దానిష్టపంక్తితోఁ దగఁ బారణ నొనర్ప సంసిద్ధుఁడై యుండె క్షమనిధి యన।
దారపుత్రేష్టబాంధవులెల్లఁ బెల్లుగ నాఁకొని యన్నపూర్ణాంబఁ దలఁపఁ।
బిడుగు పడ్డట్టు నరసింహుఁ డడరినట్లు । ప్రళయకాలోగ్రభైరవు భంగిఁ బొంగి।
దక్షయజ్ఞంబునకు వచ్చు త్ర్యక్షుకరణి । వచ్చె దూర్వాసుఁ డధికతీవ్రక్షుధార్తి॥

కం॥ వచ్చినయామునిఁ గనుఁగొని । చెచ్చెరఁ దాలేచి రాజు నేసెఁ బ్రణామం।
బిచ్చెఁ గనకాసనము వా । క్రుచ్చె సమయసముచితోక్తిఁ గోరెం గుడువన్॥ ౧౮౪॥

ఉ॥ అందుననామునీంద్రుఁడుమహాపరితోషముఁజెందివత్తుఁగా।
ళిందిమునింగియంచుఁజనిలీలమదావళమట్లునీటము।
న్క్రిందనరారెయోగరతిగాత్రముపైస్మృతిమానెఁజేనిమా।
టుందలఁపంగలండెయకటాయచితజ్ఞులెయెందుఛాందసుల్॥ ౧౮౫॥

ఉ॥ ఆదటనంబరీషుఁడునిజాత్మఁదలంచెవచించెగోష్ఠితో।
ద్వాదశియోముహూర్తమునదాఁటెడురాఁడుమునీంద్రుఁడింతటన్।
గాఁదగుకర్జమెయ్యదియొగ్రక్కునఁదెల్పుఁడటంచునవ్వసి।
ష్ఠాదులువల్కిరిట్లుదగనయ్యలురామినమాసనిల్చనే॥ ౧౮౬॥

చ॥ వ్రతపరిపూర్తిముఖ్యమగువచ్చినయయ్యతిథింద్యజించిను।
వ్రతభుజియించుటొప్పదిటఁబారణనీరముచేతఁజేయునా।
క్షితిపతివిప్రవాక్యమునశ్రీహరిపాదసుతీర్థమానెశ్రీ।
పతినసుఁబ్రోవుమంచుభగవంతుభజించుచునుండెనంతటన్॥ ౧౮౭॥

ఉ॥ స్నానముఖాహ్నికక్రియలఁజల్పియథావిధిదాపసేశుఁడా।
జేనిస్మరించివచ్చివడితెక్కలచిల్వయనంగనంబడెన్।
మానవనాథచేష్టితముమానసమందునెఱింగిభగ్గనన్।
నూనెపడంగమండెడుతనూనపదుండనమండియిట్లనెన్॥ ౧౮౮॥

కం॥ కంటిరెయీరాజాధము । గెంటియతిథినన్నుఁగుడిచెక్షితిరాజ్యమదం।
బంటఁగభాగవతుఁడువీఁ । డంటధరామరతిరస్క్రియంజేసెఁగదా॥ ౧౮౯॥

కం॥ ఇలక్షాత్రోర్జితతేజో । బలంబుకంటెన్వరమగుబ్రాహ్మణతేజో।
బలమనివీఁడెఱుఁగఁడోనేఁ । డెలిపెదఁజూపెదమదీయతేజశ్శక్తిన్॥ ౧౯౦॥

మ॥ అనియంతంభ్రుకుటీయుతుండచలరక్తాక్షుండుదష్టోష్ఠుఁడున్।
స్వనదుచ్ఛ్వాసుఁడుసంచలద్వపువునైపాదాహతక్ష్మారజో।
ఘనభస్మాంచితుఁడైమహోగ్రుఁడగుచుంగాలానలాభీలుఁడై।
కనదర్చిఃప్రతిమంబునొక్కజడవీఁకంబీఁకివైచెన్క్షితిన్॥ ౧౯౧॥

ఉ॥ తోడనెతజ్జటోత్థితుఁడుతోఁచెనొకండుమహాగ్నికల్పుఁడ।
వ్వాఁడిమగండుమున్మొనలవాలునువాలునుగొంచుజేనిఁజెం।
డాడఁగడంగనయ్యునినారయుచుండుసుదర్శనంబుదో।
ర్తోడనెకోటితిగ్మరుచితుల్యముగన్వెలుఁగొందివ్రేల్మిడిన్॥ ౧౯౨॥

తే-గీ॥ ప్రబలుకార్చిచ్చుమునుగడ్డిపరకనేర్చి । మెగమునున్మ్రింగఁగడఁగెడుపగిదినపుడు।
కడిమిఁదత్కృత్యఁబురుషునిఁగాల్చికూల్చి । మునినిఁగబళింపమునుకొనెముందునిల్వ॥

కం॥ వెఱచఱచిమునియుఁగడువడిఁ । బఱచెనదియువెంటనంటెబలుమిత్తియనన్।
మొఱయిడఁగనల్వకడకుం । దఱియంబడియతఁడుప్రోవుతాతాయనియెన్॥ ౧౯౪॥

కం॥ హరిచక్రమువారింపన్ । వెరవెఱుఁగనునీవరుగుమువేగమవత్సా।
హరుఁడుప్రణతార్తిహరుఁడగు । హరికింజక్రప్రదుఁడతఁడనిబ్రహ్మయనెన్॥ ౧౯౫॥

కం॥ క్రచ్చఱనత్తాపసుఁడుం । గ్రచ్చఱశివుడాయఁబోయికావుమనంగం।
దచ్చంద్రశేఖరుఁడుహరుఁ । డచ్చక్రమువలనిదప్పినార్చెనెకింతన్॥ ౧౯౬॥

కం॥ అంతకుఁదాళకయతఁడీ । సంతాపంబుడుపుమన్నశంకరుఁడుహరిన్।
గాంతేనిశ్లేషంబుగ । శాంతంబగుననుచుఁబనిచెసంయమియంతన్॥ ౧౯౭॥

కం॥ చనిచక్రిశరణనంగా । ననెనాతఁడంబరీషుననుమిటులతఁడా।
ఘనచక్రవర్తిసదయుఁడు । పనివడినినుఁబ్రోచుఁజక్రబాధనుమాన్పన్॥ ౧౯౮॥

కం॥ అనిహరివంపనిలింపులు । గనుఁగొనిమెచ్చెలనంగగరువంబఱియా।
మునిదీనవదనుఁడగుచో । జనపతిరక్షింపునన్నుశరణార్థిననెన్॥ ౧౯౯॥

మ॥ అపుడామానవభర్తగేల్మోగిచియోయాత్రేయకమ్మావెస।
న్విపులానందుఁడవంచుసౌమ్యభణితిన్విత్రాసుసోల్లాసునిన్।
కృపమైభక్తిమెయింబొనర్చెనహహాశ్రేష్ఠుల్మహాత్ముల్మహా।
రిపులైనన్శరణన్నఁబ్రోతురుగదాప్రీతిన్స్వకీయాత్మగన్॥ ౨౦౦॥

శా॥ ఆవింతంగనిశాంతమయ్యెనుసహస్రారంబుఘోరంబహా।
తావిశ్రాంతినిశాత్రవప్రతతివిధ్వంసంబునుంజేసికా।
కేవెంటంగనదెందుశాంతిహరినేయేచెన్నృపాకారతన్।
భావింపంగనునంబరీషుమదితోవర్తించెఁజిట్టల్గదా॥ ౨౦౧॥

మ॥ తరువాతన్నృపపుంగవుండుదనచెంతంగాంతిఁగొంతేనియుం।
దొరయన్నేరకయున్నయత్తపసిచంద్రుందుష్టినొందించెని।
ష్టరసాన్నంబులఁబెట్టినెట్టనఁగళాసంపన్నునింజేసెభా।
స్కరవంశప్రభవుండుభాస్కరరుచింజానొందెయుక్తంబెకా॥ ౨౦౨॥

శా॥ తర్వాతంధరణీశుఁగాంచియతఁడత్యంతవ్యథంబల్కెనో।
యుర్వీనాథక్షమానిధీనినుఁగరంబోర్చెదినొప్పించితిం।
దుర్దైవదగ్ధ్యమునొందినేనకటనాదోసంబునుంబాపితా।
సర్వైశ్వర్యములొందునెందునినునీసత్కీర్తినిత్యంబగున్॥ ౨౦౩।

చ॥ అనవుడునానృపాలుఁడుమహావినయుండయికేలుమోడ్చియి।
ట్లనియెమునీశమీరలుమహాత్ములుబ్రహ్మకుఁబౌత్రులత్రికిం।
దనయులుశంకరాత్మకులుతాపసమాత్రులెమీకుఁదప్పలెం।
దనుగలవేసనుంగరుణస్తుత్యునిఁజేసితిరారయుండిఁకన్॥ ౨౦౪॥

చ॥ గురుఁడుస్వశిష్యుచేజితుఁడగుంబలువిద్దెలనద్దినింద్యమే।
గురుఁడుస్వపుత్రుచేజితుఁడగుంగుణసంపదనద్దిదోసమే।

గురుఁడనుఁడిందుచేనడఁగుఁగొంతయదొక్కకొఱంతయేజగ।
ద్గురుఁడవునీవునన్నరసిస్తుత్యనునర్చితఘంబెమేలెయా॥ ౨౦౫॥

చ॥ దినకరుఁడెంతయున్ స్వరుచిఁదీండ్రిలకున్ననువానలబ్బునే।
యనలుఁడువేఁడిమిందనరకాఱిననోరెములుల్లభించునే।
యనిలుఁడువీవకుండిననుబ్రాణులునున్నెభవాదృశుల్మహా।
ఘనులలరారరేన్యశముఁగందురెమాదృశులోమునీశ్వరా॥ ౨౦౬॥

కం॥ పరమేశ్వరుండుగరుణ । న్నరునిన్మన్నించుబ్రోచునలువుననన్నుం।
బొరిక్షమియింపుమురక్షీం । పురహాన్నేదమెదినీకుఁబురహరునికినా॥ ౨౦౭॥

మ॥ అనిభక్తిన్నుతియించిసప్రణయుఁడైయాదిత్యులున్మెచ్చఁగ।
న్ఘనుఁడాఱేఁడునమస్కరించియనుపన్నాగంబునాగారిచేఁ।
గనిహానిన్విగతానుతంగనకవేడ్కంబాసివేపాఱులా।
గుననేగెన్మునిహానిదంబగుఁగదాక్రోధంబనాఖిత్యముల్॥ ౨౦౮॥

కం॥ పదపడియతఁడునిజాశ్రమ । పదమునవెలకొనిస్వమానభంగంబేర్పన్।
మదిఁదేజెడలినయగ్గిగఁ । బ్రిదులుచుబెంధువడియుండెఁబీనుఁగనంగన్॥ ౨౦౯॥

శా॥ తత్సంతాపమునార్పఁజందురుఁడనందానేగుదెంచెందగన్।
సత్సంతోషదుఁడైననారదుఁడుజ్యోత్స్నాప్రాయగానాంగుఁడై।
సత్సప్తస్వరతత్సురాగప్రణహాంచన్నాదసంసూచక।
ప్రోత్సంగాప్తవిపంచికాంచితుఁడునైయోహోయనన్దేవతల్॥ ౨౧౦॥

తే-గీ॥ వచ్చిసురమునిదుర్వాసువలనఁబొంది । సత్కృతులనిట్లువాక్రుచ్చెసకలమెఱిఁగి।
వత్సవగఁబొగులకుమీవుస్వకృతసుకృత । దుష్కృతఫలంబువెడలునెతొడరకెందు॥

ఆ-వె॥ ఔర్వశాపఫలమునసుభవించితివీవు । తీఱెగోరమింకనూఱడుమది।
విడువుక్రోధమదియవేధించుఁగదనిన్ను । దానఁగాదెనీకుహానులాదవె॥ ౨౧౨॥

సీ॥ ధర్మగృహాఖిలదహనంబునర్థసస్యాంతకచండకరాతపంబు।
కామాంబుదనిరాసకారిప్రభంజనమమృతౌష్ణ్యతాంశుబింబాస్తమయము।
సర్వసుఖోత్కరసారభేయవ్యాఘ్రమఖిలప్రయోజనహాలహలము।
స్నేహలతాతతిచ్ఛేదనోగ్రలవిత్రమెల్లవారికకాలమృత్యువయవు।
నీళ్లనాఱడునీడచేనిలువదణఁగ । దెప్పడునుగల్గునలయదుమేశునుఱడు।
మొక్కవోవదుదప్పదుముప్పఁదెచ్చుఁ । గ్రోధమదియుగ్రశత్రువుగొనఁగనగునె॥

కం॥ తపమునదుర్లభమదిగద । విపులార్థముదాపసులకువిశ్రుతనిధియాఁ।
జపలునికిఁగ్రోధికదియనఁ । గపికబ్బినదండయోటికడవజలమువున్॥ ౨౧౪॥

కం॥ నాపుడునయ్యాత్రేయుఁడు । డావాకొనియెనువగపునఁదంత్రీక్రోధం।
బేవిడుతునిపుడతపముఱ । కేవిఠమునవెలయునాకునెఱిఁగింపునెఱిన్॥ ౨౧౫॥

క॥ నావిని నారదుఁడనియెన్ । శ్రీవనమున బిల్వనాథు సేవింపుము త।
ద్దేవుదయంద్వదభీష్టము । భావింపలభించునీకుభద్రంబవుతన్॥ ౨౧౬॥

క॥ నేవేధశ్శాసనమునఁ । గావించితినందుఁదపముఁగాంచితిగాన।
శ్రీవిభవముశ్రీతత్త్వం । బావిర్భావంబునొందునటువరసిద్ధుల్॥ ౨౧౭॥

ఉ॥ ముందుసనత్కుమారుఁడటబోధననందిదివొందియెంతయుం।
బొందుగఁగంజశైలమునఁబొల్పెసలారెడుచిత్ప్రకాశము।
న్వందితతీర్థమందుఁదగబల్విడిఁజేసితపంబువాంఛితం।
బందెనుదత్సరోవరపదార్థముఁదాశివరాత్రిఁబూర్తిగన్॥ ౨౧౮॥

చ॥ అటశివరాత్రినేరయిననక్కఱనెక్కొనియాసరస్సునం।
బటుతరభక్తిమైమునిఁగిబైల్వదళార్చనమొప్పఁజేయను।
త్కటకృపబిల్వనాథుఁడిడుఁగామితసత్ఫలముల్దపంబునీ।
కటమటమొందకంబొదలునాకడఁజేయుతపస్సులెస్సగన్॥ ౨౧౯॥

మ॥ అనుచుంబోధనసేసినారదుఁడువోనాతండుగ్రోధంబర।
మ్మనెరాఁగానదిదేహధారియయియొయ్యన్సాంజలిందానిఁజూ।
చిననున్నిన్వెడఁబాసిపొమ్మిపుడనీచేనాతపంబెల్లఁబో।
యెనువ్యర్థంబుగఁబ్రాణమానములకొన్హింసింపకింకేగునాన్॥ ౨౨౦॥

మ॥ అదియీరీతినిబల్కెసోమునివరాయైతీవునావల్లనే।
విదితోగ్రాతతసత్తపోఽధికుఁడవున్విధ్వస్తమాయుండవున్।
విధుచక్రాదితవిగ్రహుండవునుబృథ్వీస్వర్గపాతాళభా।
స్వదినాథుండవునన్నునేలవిడువంబాలింపుమాలింపుమా॥ ౨౨౧॥

ఉ॥ వ్యర్థముగాఁగనన్విడిచెదయ్యనిజాశ్రితుపీడఁబాడియే।
వ్యర్థుఁడవీవుగావెననునాదకయేదిననింకొకప్పుడే।
న్సార్థకతన్భజింపననునక్కఱఁగోరెదుగాకయంచుసం।
ప్రార్థనసేసియక్కడళియాత్మపలెంజనెనద్దిపద్దుగన్॥ ౨౨౨॥

సీ॥ ఐదవమొగమేదినట్టినల్వయనఁద్రివిక్రమాకృతిమానువెన్నుఁడనఁగఁ।
జిచ్చుకన్నైనట్టిశివుఁడనఁగనువజ్రరహితుఁడైనట్టియాయహరివుఁడన।
వేఁడిమియెడలినవేఁడివేల్పనఁగనిజాధికారములేనియముఁడనంగ।
ననిఁబానిచిక్కురక్కసుఁడనఁబాశంబుఁబాసినయాదసాంపతియనంగ।
గతివిహీనతఁగనుసదాగతియనంగ । దీనుఁడైనకుబేరుండెయాననంగ।
మూలఁబడినరుద్రుండనముదమఱఁదగెఁ । గ్రోధమెడలుటదూర్వాసుఁడీధరిత్రి॥

క॥ కోఱలువోయినపామునఁ । గోఱలుమఱిగోళ్లుచన్నగురుసింహమనం।
గాఱెక్కలఱినగరుడుఁడు । నాఱేకులులేనితమ్మినానతఁడొప్పెన్॥ ౨౨౪॥

ఉ॥ పిమ్మటనమ్మునీంద్రుఁడువ్యపేతరుగర్వుఁడెయాచునాత్మజ।
న్నెమ్మిగనెమ్మిఁదోడుకొనినేరిమిఁజేరెనుగంజగోత్రమం।
దిమ్ముగముమ్మరమ్ముగమహీవలయమ్ముచలింపఁగందప।
మ్మమ్మహితస్థలమ్మునమహామహిమంజలిపెంజయార్థియై॥ ౨౨౫॥

వసనవృత్తము॥ ఇదిప్రకృతిభాగమూ। ముదమిడెడునింకనే।
మ్మదిఁబురుషభాగమిం। పొదవుననెశ్రీశ్వరా॥ ౨౨౬॥

## గద్యము.

ఇది, శ్రీతనుమధ్యాంబాకరంబిత శ్రీబిల్వనాథమహాదేవశిష్య తిష్యోపజ్ఞాక్షర సాంఖ్యాచార్య పర్యవితకవిత్వ తత్త్వవిత్ప్రకాండ శ్రీమత్కొక్కొండ వేంకటరత్నశర్మ
వినిర్మితంబై,
కవిమణినామంబునం బరఁగు
శ్రీబిల్వేశ్వరీయంబను పద్యకావ్యరత్నంబునం
బంచమబింబమగు దూర్వాసబింబమునం బూర్వభాగము ప్రకృతిభాగము.

శ్రీ బిల్వేశ్వరాయ నమః

# బిల్వేశ్వరీయము.

## పంచమ బింబము.

### దూర్వాస బింబము.

### ఉత్తరభాగము. పురుషభాగము.

### మార్తికోపాఖ్యానము.

తోటకవృత్తము॥ పురుషోత్తమశ్రీధర-భోగిశయా। నరసింహవినంగదె-నామనవిన్।
మరిసూతుఁడువల్కెను-మౌనులతో। స్మరణీయముమార్తిక-సచ్చరితన్॥

ఉ॥ చేరిసురాసురుల్గలశసింధువునమ్మథియింపఁగల్గినం।
దారనుధాఘటంబుదితిజాంతకుఁడింతిగనైసురాళికే।
యారసమారఁబోసిచనెనంతమహాహవమయ్యెనయ్యెడన్।
శ్రీరమణీశుసత్కృపనుజెందిరివేల్పులుగెల్పుఁబొల్పుగన్॥ ౨॥

శా॥ ఆకయ్యంబునజానుమండలసమాఖ్యాతుండుదైత్యుండొకం।
డైకాంచెన్హనుమంతురీతిఁబదమన్వర్థంబుసాంఖ్యైక్యమా।
లోకింపంగనుజానుమంతుఁడనఁగన్లోకప్రసిద్ధుండువాఁ।
డాకంజాసనుఁగూర్చిచేసెఁదపమాహావీఁగఁబన్నంబొగిన్॥ ౩॥

ఆ-వె॥ తత్తపోఽగ్నితాపతప్తులైతాళలే। కింద్రముఖ్యులైనయెల్లసురలు।
జానుమంతుకోర్కెసఫలంబుఁగావింపు। మంచుఁగోరిరవ్విరించనునిని॥ ౪॥

కం॥ వరమువడసెఁదాఁజెడమిగ। సురాసురులవలనవాఁడజునిచేమహిషా।
సురుఁజేసికొనియెఁజెలిఁగా। హరిముఖహరిదీశులనెగినడఁచెఁగడంకన్॥ ౫॥

ఉ॥ వేలుపులందఱుందమకుఁబెంపఱజన్నములందునాహుతుల్।
మేలిమిపూజలుంగలుగమింగడుఁగుందివిధింభజించిరో।
యేలికమమ్మునేలవెరహిన్మనుదైత్యతపోఽగ్నికీలలం।
గాలకయుండనిడ్డువడిఁగావుమువానిప్రతాపవహ్నిలోన్॥ ౬॥

చ॥ అనితనుఁగోరవారిఁగనియంబుజసంభవుఁడిట్లువల్కెనో।
యనిమిషులారమీరెకదయాయసురస్వరదానతోషితుం।
బొనరుపుమంమువేఁడితిరిముందటనిప్పుడువానిఁజంపఁగా।
వెనుబడివేఁడువారకటపెట్టినచెట్టునుగొట్టఁబాడియే॥ ౭॥

శా॥ ఐనన్నాధులబాధనైఁ పఁదగదయ్యాదిత్యవిద్వేషినిం।
బూనం జంపఁగఁ జక్రిదైత్యరిపునిం బొందొందఁ బ్రార్థింతమం।
చానాళీకభవుండు దోడుకొని యాయాదిత్యులం బోయి శ్రీ।
జానిం జక్రధరుం భజించెన తఁడాశర్వున్ స్మరించెన్ హృదిన్॥ ౮॥

మ॥ పలికెన్నాకునజయ్యుఁడయ్యసురద్రుంపన్నేనుశక్తుండఁగా।
నళినాక్షుండగు మృత్యుమృత్యువు జగద్వ్యాపాదనైకక్షముం।
డలరక్షోఽధిపు ద్రెళ్ళిడిన్మడు వునంచాతందు పేంద్రుండున।
జ్జలజాతోద్భవముఖ్యదేవతలతో శంభుంగడున్వేఁడినన్॥ ౯॥

చ॥ హరుఁడనె నేను వానిని మహాబలునిం గెలువంగ నేరనీ।
సరసిజసంభవుండొసఁగెఁ జక్కఁగ వానికిఁ బెన్వరంబుమున్।
సురల సురల్జయింపరని చొప్పడఁ బాముకుఁ బాలువోసిన।
ట్లరయన్స్ఫురింపదెయ్యదియు నక్కట నేనిట నేమి సేయుదున్॥ ౧౦॥

## మౌక్తిక సంభవము.

మ॥ అనుచెంతే నియుశూలి చింతిలఁగ నాహారౌద్రమారుద్రునం।
దునుగన్పట్టెను నెట్టనన్వడఁకె మేన్దోఁచె న్పెమల్గ్రొంబొవ।
ల్గనుముక్కున్నులమూడు చిచ్చులుగ జ్వాలల్గెంజడల్గామహా।
ఘననిర్ఘోషమునట్టహాసమది గాన్ ఘర్మంబు వర్షంబుగాన్॥ ౧౧॥

ఉ॥ దక్షిణబాహుదండమది ధాత్రిని నెత్తిన పోత్రిదంష్ట్రినా।
నీక్షణపర్వమైయెసఁగనింపెసలారఁగనందునుండి స్వే।
దక్షణమైకబిందువురుతారమనంగనురాలె నేలపై।
నాక్షణమందునుండి యొకఁడద్భుతతేజము వెల్వడెన్వడిన్॥ ౧౨॥

శా॥ తత్తేజంబుగనుంగొనం గ్రమముగా దైవారెసాంధ్యారుణో।
ద్వృత్తంబైన జటాకిరీటముగ భూతిప్రాయవర్మంబుగా।
మిత్తిన్మొత్తఁగఁ జాలుదండముగఁ బేర్మిన్యజ్ఞసూత్రంబుగాఁ।
జిత్తానందదమౌకమండలువుగా శ్రీమన్మునీశుండుగాన్॥ ౧౩॥

శా॥ ముక్తాభేశ్వరఘర్మబిందుభవుఁడై పొల్పొందుటం జేసియున్।
ముక్తాకారుఁడు మూర్తిచిత్తములనై ముక్తేహుఁడై యొప్పుటన్।
ముక్తర్షిప్రవరుండునై పొలుచుట న్మోదంబు సంధిల్లఁగా।
ముక్తర్షిప్రథితుండునయ్యెనతఁడాభూతేశు పుత్త్రుండొగిన్॥ ౧౪॥

కం॥ ముక్తయెమౌక్తికమగుట । న్ముక్తర్షియె చెప్పనొప్పె మునిముఖ్యులలో।
మౌక్తికమునియనిదివిభువి । యుక్తముగద పేర్లు వేఱె యొకవస్తువయౌ॥ ౧౫॥

కం॥ మౌక్తికమురత్నమవుట । న్మౌక్తికమునిరత్నమునియనందన రెంట।
న్మౌక్తికమోంకృతిప్రాసా । దోక్తంబుగ్రమాంకములన పొలుతన్మయమౌ॥ ౧౬॥

శా॥ శుండాలాస్యుని రెట్టినాభుజయుగిన్నొఖిల్లియగ్న్యుద్భవుం।
డొండామోమునఁబుట్టినాజలజుఁడై యుగ్రౌర్వతేజస్సమ।
గ్రుండై శూలితృతీయపుత్రుఁడితఁడౌరుద్రుండు పూర్ణుండనం।
గండారంగనెసంగెమౌక్తికమునిత్స్మభర్తసర్వేడ్యుఁడై॥ ౧౭॥

ఉ॥ సోముఁడువల్కెవేల్పులనుజూచిసుధాంధసులారమీరువిం।
డీముని జ్ఞానమండలునియేపణఁచున్ హరివృత్రునింబలెన్।
బ్రేముడినిందువీనికినిస్వీయమహాస్త్రములెల్లనేనును।
న్నామహనీయపాశుపతనామకమస్త్రమునిత్తునిత్తఱిన్॥ ౧౮॥

కం॥ అనుచుంబాశుపతాస్త్రముఁ। దనయునికమ్మునికినిచ్చెఁదగఁగడపటన।
ద్దనుజునినిజ్ఞానుమండలు। నినిదీనస్రూపుమాపునీవనిపనిచెన్॥ ౧౯॥

కం॥ కరమునఁబాశుపతాస్త్రము। పొరిమెఱయన్మౌక్తికముని పొలిచెజగత్సం।
హరణమునకడరుమాఱట। హరుఁడనఁదజ్జ్ఞానుమండలాంతకుఁడంతన్॥ ౨౦॥

కం॥ కనుఁగొనెఁదెఱగంటులనవు। డెనయందిగ్విజయముననవెంతయుసంతు
ష్టినిమఱిసంత్రాసంబున। మునుకొనిదిక్పాలురెల్లఁబుడికిరికరముల్॥ ౨౧॥

సీ॥ బ్రాహ్మమస్త్రంబునుబమ్మయిచ్చెనుమఱిబ్రహ్మదండంబునుబదిలముగను।
వేయంచులదివాలువెన్నుండొసంగెనునారాయణాస్త్రంబునల్వుగాను।
వజ్రివజ్రంబునుబావకుండుస్వశక్తివండధరుండాత్మదండమునసిఁ।
బుణ్యజనుఁడుపాశమునుబ్రచేతనుఁడునుధ్వజమువాయువుగదవైశ్రవణుఁడు।
మూలవేల్పుశూలమునిడెనిజాస్త్రంబు। నారపల్లమున్ననీరుచేరు।
కరణిదొక్కొక్కకడఁగూడునట్టుల। మ్మునికినస్త్రసమితిమొగిలభించె॥ ౨౨॥

ఉ॥ ఆయువుదీర్ఘమైతగననంతసుఖంబెసఁగంగనెంతయు।
న్గేయముగాఁగజ్ఞానమునిన్మణినామకుఁజేసిరూర్జిత।
శ్రీయుతునిన్విధాతయునుశ్రీపతియున్నిపుఁడంతఁబూనిత।
జ్ఞాయలువిద్యలన్నిరులసర్వసుశక్తులనిచ్చిరిచ్చగన్॥ ౨౩॥

కం॥ గ్రహనవకంబొంహరయని। మహితాత్మోచితఫలములమానుగనొసఁగెన్।
మహనీయుఁడుముక్తర్షికి। మహామహిమవెలయజ్ఞానుమండలుఁడీల్గన్॥ ౨౪॥

కం॥ అణిమాద్యైశ్వర్యంబులు। గణనీయుండైనయతనిఁగాంక్షవహించెన్।
ఘనరత్నగర్భదిగ్వా। రణములువహియించినట్లురంజిల్లంగన్॥ ౨౫॥

కం॥ మౌక్తికుఁడగునుగ్రమన్యా। సోక్తంబుగశ్రీశదీపికోహ్యప్రాసా।
దోక్తిఁదెలుపుఁదనుమధ్యగ। శక్తులతనిఁబొందుటరుదెశక్తుఁడతఁడెయౌ॥ ౨౬॥

కం॥ సూత్నమెసర్వార్థమహా। రత్నంబులునేరెనొకటరత్నమునీశున్।
రత్నాకరుఁజేరునదీ। రత్నంబులుదారుదారెప్రవహించుచొగిన్॥ ౨౭॥

కం॥ సర్వాస్త్రశస్త్రయుక్తత । సర్వైశ్వర్యాష్టిశర్వజత్వముచేతన్ ।
సర్వానలైక్యతేజో । ధూర్వహుఁడాత్మాగ్నియనఁగఁదోఁచెనతండున్ ॥ ౨౮॥

కం॥ అతఁడరిప్రభంజనుండగు । నతిబలుఁడుమహాబలుఁడననాతఁడెతగునీ ।
క్షితిసప్తసప్తమరుదై । కృతనుండననొప్పఁగాజగత్ప్రాణుండున్ ॥ ౨౯॥

కం॥ శివవిష్ణుశిరగ్నిపదములఁ । బ్రవిమలమతినైక్యముగనువడిగనెడుమహా ।
ధ్రువుఁడతఁడనంతుఁడనఁగాఁ । దవఁడేగాంగేయనిభుఁడుదారుఁడుశక్తిన్ ॥ ౩౦॥

సీ॥ కర్ణావతంసంబుఁగావించికొననెంచిరల్లజేజేలెల్లరల్లిబిల్లి ।
నక్షమాలికగాఁగనాత్మభావించిరిమునులుదపస్సిద్ధిబుద్ధిశుద్ధి ।
మొగినిశిరోరత్నముగఁజేసికొనఁగోరిరభవభక్తులుసర్వశుభసమృద్ధి ।
నధరామృతంబాననభిలషించిరియచ్చరలునిచ్చలునుమచ్చికలనుహెచ్చి ।
యిట్టులందఱువేఁడంగబిట్టుగమది । ననఘుఁడునువృత్తుఁడుశుభుండునమలుఁడతఁడు ।
మించెమౌక్తికమునిచంద్రుమించెఁగళల । సర్వనుగుణుండుగాఁడేఁడుసర్వనుతుఁడు ॥

## విశ్వామిత్ర యజ్ఞ రక్షణము.

శా॥ విశ్వామిత్రుఁడువేఁడెబిల్వపతినిన్విశ్వేశనీపుత్రునిన్ ।
విశ్వస్తుత్యునినీవెరత్నమునినీవేయజ్ఞరక్షార్థమం ।
చాశ్వాసించియొసంగెనద్దశరథుండారామునర్పించిన ।
ట్లీశ్వీభూతశివుండుశంకరుఁడుసద్ధర్మప్రకర్షంబుగాన్ ॥ ౩౨॥

మ॥ పలికెన్శంభుఁడుస్వాత్మసంభవునితోవత్సామదీయాజ్ఞనీ ।
వలరంజేయుముగాధినందనుసవవ్యాపారమేపారనా ।
వలయాగంబొనరింపుమందువలనంబ్రాప్తించునీకున్మహా ।
బలమానట్టిబలంబునద్దెఱఁగులంబ్రత్యర్థులంగెల్వఁగన్ ॥ ౩౩॥

మ॥ కొనుమీయానిమిషాఖ్యఁగాళినిదినీకుంగంకటంబైకడుం ।
బొనరుంబ్రహ్మశిరంబిదేమకుటమొప్పందారమాఁగాదెవి ।
ల్లనఁబంచాక్షరిపంచబాణచయమానంచిచ్చిముక్తర్షినె ।
య్యనఁగౌఁగింటనుజేర్చిపుచ్చెజయిఁబీవామంచుదీవించుచున్ ॥ ౩౪॥

శా॥ భక్తిన్మ్రొక్కియుమేషపీఠికొనిజగద్భద్రాత్ముఁడాత్మజ్ఞుఁడా ।
ముక్తర్షీంద్రుఁడుగాధినందనునితోఁబుణ్యైకగణ్యంబును ।
వ్యక్తంబుంగనియెందదాశ్రమముబ్రహ్మధ్యాననిత్యంబుసం ।
త్యక్తాఘంబుసవత్సధేనుయుతమున్జంద్రుండుభూమింబలెన్ ॥ ౩౫॥

శా॥ స్వాహాంకారులురాక్షసుల్బలుపడిన్యజ్ఞంబుమాయింపఁగా ।
నూహంజేరిరిగానియచ్చటఁబ్రతాపోగ్రుండుముక్తర్షిద ।
త్సాహాయ్యంబొనరింపనుంటఁగనియంతన్నిల్వలేకేగిరా ।
హాహావిఘ్నునిఁగన్నఁబాఱుదురుగాయజ్ఞుల్పటాపంచలై ॥ ౩౬॥

## మౌక్తికయజ్ఞము.

శా॥ జన్నంబాఁకయలేకచేసితగవిశ్వామిత్రుఁడిట్లాడెనో।
యన్నారత్నమునీంద్రనీవలననాయాగంబుపూర్ణంబుగాఁ।
జెన్నారెన్మునుధర్మభంగమదినీచేనయ్యెనియ్యజ్ఞునన్।
వన్నెంగాంచితిధర్మరక్షమఖమున్భావింపఁగావింపవే॥ ౩౭॥

ఉ॥ నావుడుముక్తదేవుఁడుఘనంబుగఁగౌశికుఁగాంచిపల్కెసం।
భావితనీవుబ్రహ్మవగుమాయటులైననునేనుయజ్వనై।
శ్రీవిలసిల్లువాఁడననిప్రీతినొడంబడిచెన్మహాత్ములన్।
దావరియించెబ్రహ్మమయతాపసులన్యజనైకగణ్యులన్॥ ౩౮॥

కం॥ గౌతముఁడధ్వర్యుండు । ద్గాతభృగుండుప్రతిహర్తగలశభవుఁడుప్ర।
ఖ్యాతిగవసిష్ఠముఖమును । లాతతధృతులాగిసదస్యులైయలరారన్॥ ౩౯॥

ఉ॥ చేయుచునుండెరత్నమునిచెన్నగజన్నముసన్నుతంబుగాఁ।
జేయహిరణ్మయంబులుగశ్రీదుఁడుదక్రతుసాధనంబులన్।
గేయులువాసవాదులుమొగింగయికొంచలరంగనాహుతుల్।
బ్రోయగఁబిట్టుమంత్రములుపుట్టఁగహేతులుహేతిహేతులై॥ ౪౦॥

## నారద రాయభారము.

ఉ॥ అత్తఱినారదుండుగలహాశనుఁడెంతయునీయదంతమున్।
జిత్తమురంజిలంగనిచనెన్దెలుపంగనువేడ్కవేగనె।
క్షేత్తుగజానుమండలునికిట్లనెఁదత్కృతపూజలందియో।
యుత్తమశౌర్యనిన్గెలువనోపకయేపటియెల్లవేలుపుల్॥ ౪౧॥

మ॥ కలికంటుంభజియించిరంతనతఁడుంగల్పించెముక్తర్షియన్।
కలుషన్మానినినాతఁడిప్పుడునినున్ఖండింపఁగాఁగోరియే।
త్తెఱదండుంగడుఁగూర్చుకోఁగడఁగెనిష్టింగౌశికుండేదెదున్।
జెలుపన్మేలగునీకునద్దియయినంజేటౌనుమేల్కాంచుమీ॥ ౪౨॥

మ॥ అనిబోధించినసురర్షిమౌక్తికమునిన్హర్షంబునంగాంచియి।
ట్లనియెందత్కృతసత్క్రతుల్వడసియోయయ్యాత్వదీయాధ్వరం।
బనువొందంగలదైననీపగతుఁడీయాగంబుమాయింపఁగా।
ఘనసైన్యంబునుబంపుజన్యమిటనాఁగాశింభజింపంగదే॥ ౪౩॥

మ॥ అనుచుంబోధననేసినల్వకొడుకొయ్యంబోవదేవేంద్రునిం।
గనియెన్ముక్తమునీంద్రుఁడంతహరినేఁగావింతురక్షశ్చమూ।
హననంబేలుమజన్నమున్ననుసురల్హర్షంబునుంబొందిరిం।
తెనయంగౌశికుఁడెన్నఁడున్నతులఁదానెలుంగదాకాశినాన్॥ ౪౪॥

కం॥ వినిముక్తర్షితథాస్తనె । మునులందఱు గాధిపుత్రు మొగిఁ బొగడిరి యం।
తనువెఱగంటులుదగునని । రనువగుసుచితోక్తికెవ్వరలరరొగిమదిన్॥ ౪౫॥

## మహిషమర్దినీ విజయము.

కం॥ అటజొనుమండలుండును । స్ఫుటముగమహిషాసురునినిజూచియిటులనెన్।
బటువిక్రమనీకొకపని । ఘటిల్లెనెఱవేర్పనీవెకడుఁదగుదువనన్॥ ౪౬॥

చ॥ మహిషమహాసురుండుబహుమానముగానిటులాడెవేడుకన్।
సుహృదుఁడకల్గెనెట్టిపనిచొప్పడఁజెప్పుమొనర్తునిత్తఱిన్।
ద్రుహిణహరీశులంగెలుతుసోహరిముఖ్యదిగీశులన్మహా।
మహితమహీశులన్దెలుపుమాయనసోయననాతఁడీతఱిన్॥ ౪౭॥

ఉ॥ కౌశికునాశ్రమంబునమఖంబొనరించెడునొక్కఁడుక్కునన్।
నాశమునాకుఁగోరిసుఘనంబుగసైన్యముగల్గవానిడు।
ష్టాశయడంగఁదత్క్రతువునంతయునాశముసేయుమంతనీ।
వోసరిలంగనీకతనినుక్కఱఁద్రుంపుముతత్సహాయులన్॥ ౪౮॥

ఆ-వె॥ అనఁగనాతఁడోయియనుఁగయీతుచ్ఛమౌ । పనికినేలనేనుబనుపుబంట్లు।
గొరఁబోవుపనికిగొడ్డలియేటికి । ననఁగవినవెనాఁగనతఁడిటులనె॥ ౪౯॥

ఆ-వె॥ నన్నుమన్నిగొనఁగనన్నెలదాలుపు । కేలఁబట్టివాఁడుకేవలుండె।
పిన్నపామునైనఁబెద్దకఱ్ఱలతోనె । కొట్టవలయుననుటఁబట్టవినవె॥ ౫౦॥

చ॥ ప్రబలులుగౌశికాదిమునివర్యులుశాపమహాయుధుల్గనన్।
సవనసహాయులాసురలుశౌర్యసమగ్రులువాసవాదులా।
హవసుభటుల్స్వభావమునగనాతఁడుదేవుఁడుగాకమర్త్యుఁడే।
శివసుతుఁడాఁగదాయసదెచెచ్చెరఁబొమ్ముజయింపుమింపుగన్॥ ౫౧॥

చ॥ అనుచొడఁగూడనాడిమహిషాసురుసైన్యసమేతుఁగాఁగఁబం।
పెనుమఱిసర్పబాహునినిబేర్మిఘసోదరుఁజండశౌర్యునిం।
పెనయసురాంతకున్నచివులీరలునాకయిననన్మదీయశ।
త్రునిఁదునుమాడుఁడంచనిచెఁదోడనప్రాణసమానులన్వెసన్॥ ౫౨॥

శా॥ సైన్యాపేక్షయజింపముక్తమునియుత్సాహంబుతోదైత్యరా।
ట్సైన్యప్రోద్యతవాద్యఘోషముదధీట్సంభూతహాలాహల।
ధ్వాన్యౌద్ధత్యముగావినంబడియెనంతన్మానులెంతేనియున్।
దైన్యాధీనులయ్యైరిదేవతలుకృత్యంబారయంజయ్యనన్॥ ౫౩॥

## దేవాసుర యుద్ధము.

శా॥ వ్యావల్గత్తురగోర్మికానికరమత్యాఘాకితేభోత్కరో।
ద్దీవ్యద్గ్రాహసమూహముజ్జ్వలరథశ్రేణీతరణ్యోఘము।

గ్రావేశోద్ధతయోద్ధృమత్స్యనివహంబై వచ్చె రక్షోబలం।
బావేళం బ్రళయాబ్ధికై వడిమహాహంకారవాతోద్ధతిన్॥ ౫౪॥

మ॥ దివిషద్వాహిని విష్ణుపద్యభిధనుద్దీప్తంబు మేశోత్తమాం।
గవిభూత్తంసను ఫేనశోభితమునై గర్వించి సన్నద్ధమై।
ఛవిమచ్ఛక్రకృశానుదండధరరక్షఃపాశహస్తానిలై।
లబిలేశానమహాంతరీపము మహిన్ లాలించె నెంతేరహిన్॥ ౫౫॥

మ॥ జవవద్ఘోటకహేషితంబులు మదస్తంబేరమేడ్ఘీంకృతుల్।
శివకృత్స్యందననేమిఘట్టనమహాస్ఫీతధ్వనుల్సద్భటో।
ద్ధవను ష్వేళలు తూర్యవర్యవిలసద్ధ్వానమ్ములాక్రమ్మడిం।
బ్రబలెం దైవతసేనలోఁ గలకలారావంబు దారంబుగాన్॥ ౫౬॥

ఉ॥ వ్రాలెను వ్రీలి టెక్కెములవల్వలు వ్రస్సెను అల్లానల్వడెన్।
వాలులు గోలలుం దితిజవర్గమునందమరేంద్రసేనలోఁ।
గ్రాలెను పై జయంతులను రాజిలె నాయుధముల్ జ్వలించెఁ దూ।
ర్యాళులు మించె హేషలు భటావళి ష్వేళలు నుగ్రమంబుగన్॥ ౫౭॥

చ॥ వసమతి మ్రొగ్గె వార్వములు వారణముల్ రథముల్ దిగంబడెన్।
బసయెసఁగం దురంగములుఁ బద్ధ్యులు దేరులు మించెఁ గాంచన।
య్యసురులు జంకి రాసురలు పాత్తనురోచుల నేచిరెంతయుం।
బొసఁగను వామదక్షిణవపూర్వరపార్శ్వములందు స్పందముల్॥ ౫౮॥

మ॥ కురిసెన్నెత్తురు పుష్పవర్షమొగి రక్షోదేవసైన్యంబులం।
బొలసెం గాలి సధూళియై పలుమఱుం బొల్పొప్పఁగానప్పుగా।
విరిగ్రమ్మెం గడుఁ గాంతి మించె హరియుర్వీభాగమల్లాడె భూ।
ధరతావాప్తియెసంగెఁ దారలురిలెన్ దారర్షి గాంచెం ధృతిన్॥ ౫౯॥

చ॥ తొలుదొలుతన్సురారివితతుల్మదవారణవారముల్గడుం।
బలిమినిఁ గొమ్మలన్వ్రచిచిపంత మెలర్పఁగఁ బీఁకి మ్రాఁకులన్।
జెలఁగఁగఁగసోఁకుమూఁకలాగిఁ జిచ్చులు వెట్టుచుఁ గాల్చి రవ్వియ।
య్యెడరునఁ బుల్గులున్మృగములేపటిరూపజెనెన్నియేనియున్॥ ౬౦॥

చ॥ మునులకుటీరముల్ప్రదివిపూర్వసురుల్దహియించిరుద్ధతిన్।
ఘనతపహించి మించునలకౌశికునాశ్రమసీమ నేరఁగా।
ఘనులు సురల్సరోత్కరముగా ఘనవర్షము వారినాఁగిరా।
దనుజులు గాసరాసురప్రధానులు సొచ్చిరి పేర్చి చెచ్చెరన్॥ ౬౧॥

సీ॥ పసచెపరశ నలఁబట్టి వేత్రెంచు వోఁబురిఁ గొటికెడునట్టి వెరవుదోఁచు।
యూపంబులనుబట్టియొగిఁ బెల్లగించుచోఁ దుంగముస్తలనెత్తుభంగిదోఁచుఁ।
గుండంబులనుగలగుండుగా వించుచోఁ గొలఁకులఁ గలఁచెడు బలిమిదోఁచు।
వేదికలను బూని వెసఁ గుల్లగించుచోఁ గట్లఁ గోరాడెడునట్లుదోఁచుఁ।

గ్రిందుమీఁదులనున్న యాజ్ఞికపదార్థ । ములనుహరియించుచోఁబుట్టగలుపిడతలఁ।
గడుపునిండించుకొనునట్టికడఁకదోఁచు । నిట్టులసురులుచెఱిచిరయ్యిష్టిఁదుష్టి॥ ౬౨॥

సీ॥ పశువులవెసఁబట్టివిశసనంబును జేసి రేమెళమితలము నేమె మెఱుఁత।
లమనివ పొంగమొఱామముల నెనర్చిరి మేమె వేల్పులమంచు మెసఁగిరొగిని।
బెక్కండ్రుమునులనునుక్కడంచిరిమించి ప్రాగ్వంశమంతయుఁ బాడు నేసి।
రెల్లశాలలనేర్చి రేపునతిథులనభ్యాగతులమ్రింగిరఱగసరగ।
నాక్రతువుభంగపఱిచిరట్లయ్యసురలు । మొఱకుతనమునశివశివమున్నదక్షు।
జన్నమననదియయ్యెనుజానుమండ । లానురేశాజ్ఞయనుజెల్లెఁగాసవసవ॥ ౬౩॥

కం॥ మహిషమహాసురుప్రాపున । నహితులసురలిష్టినురలనడఁచినెగడుటల్।
కుహనాప్రభుత్వకలనను । మహిఁద్రాకృతులణఁచిబుధులమహిమనుగనుటల్॥ ౬౪॥

కం॥ మునులపుడుశాపహతిచే । దనుజులఁబెక్కండ్రబూడిదను జేసిరి పే।
ర్చినకినుకభూరిశస్త్రము । లనస్త్రములఁజంపిరసురలంగీర్వాణుల్॥ ౬౫॥

మ-స్ర॥ క్రతుభుగ్వ్రాతప్రయుక్తో - గ్రతమవిశిఖము - ల్గాఁగదంభోళులుద్య।
ద్ధతిజుల్విధ్వస్తగాత్రు - ల్దైగిపడిరిధరి - త్రీధ్రముల్గాఁగరక్షః।
క్షతజంబుల్వాహినుల్గా - సరవిఁబఱచెనా - జాడఁజూడంగనోనా।
శతమన్యుండున్సహస్రా - క్షతఁగడునలరెన్ - శౌర్యముత్సాహమెచ్చన్॥ ౬౬॥

కం॥ హతశేషులురాక్షసులా । తతబలులుంగాందిశీకతంబాఱిరిమా।
రుతహతినిఁబోవుచూరుగుల । గతిజేజేల్ప్రాఁకులనఁగఁగాంచిరిస్థిరతన్॥ ౬౭॥

సీ॥ మెఱుపుగముల్గాఁగమెఱయువాల్చాదుక్కులుమిగులఁగన్నులమిఱుమిట్లుగొలుప।
నుఱుములచాలుగానెగిఁదూర్యములుగేఁకలవిధియించిచెవులనుజెవుడుపఱుప।
నిట్టూర్పుగాడ్పులబిట్టేచివాలంపజడివాన మేనులఁగడిమిముంపఁ।
బిడుగులపిండయివెలయుమహాస్త్రకలాపమువేల్పులరూపుమాప।
నాపరానిమహాగ్రహమేపుఁజూప । మేఘవాహనుఁబడనెట్టిమించునట్టు।
మిన్నుమన్నొక్కటిగనయిమేరమీఱి । వచ్చెమహిషమహాసైన్యవారిదతతి॥ ౬౮॥

మ-స్ర॥ మహిషుండుచ్చైశ్శ్రవంబు - న్మదముఱఁబొడిచె - న్మాన్యుఁదత్సాదినింద్రుం।
డహితున్దాఁకెన్జిగీషన్ - హరిహరిహరిన - య్యభ్రమాతంగయుక్తున్।
మహిగంపింపంగఁగూల్చె - న్మహిషుఁడుగపలో - న్మానశక్తిన్మహేంద్రుం।
డహహాయెక్కెన్శతాంగం - బసురసురపతి - స్యందనంబెత్తివైచెన్॥ ౬౯॥

మ॥ బలియుండైనఘనోదరుండుదగరున్వహ్నింగడింగాఁగ్రమిం।
గిలసద్విద్యుదదంచితంబుమొగిలుంగేడించెనార్వాగ్నిను।
జ్జ్వలమానట్టిమహార్ణవంబునుశిఖావంతుండుగర్భస్థుఁడై।
పరఁగెన్జాఠరనిత్యయజ్ఞహితుఁడౌవైశ్వానరుండయ్యెనాన్॥ ౭౦॥

శా॥ గండారంగనుజండశౌర్యుఁడునిజాఖ్యంజేసెనన్వర్థమున్।
జండాంశూద్భవుఁగిట్టిముట్టికడిమిన్బాధించెనానావిధా।

ఖండోద్దండసుభండనంబులఁదుదింగావించెఁబ్రేతేశుఁగా।
నొండాడంగనులేకవీఁకఱియముందున్నాఁడోలేఁడోయనన్॥ ౭౧॥

స్రగ్ధర॥ అంతంజవత్సర్వబాహుం - డడరితొడరితా - నాపృషద్వాహుఁబట్టెన్।
బంతంబొప్పంగ్రమింగెం - బలువడినహిగ - ప్పంబలెంగ్రిందుమీఁదై।
యెంతోయుక్తిన్సమీరుం - డెడలియడలివే - హీనతంబాఱెదానన్।
జింతంజెందంగఁబెళ్లై - క్షితినతనికొగిం - జెల్లెనయ్యాశుగాదుల్॥ ౭౨॥

మ॥ తనవాఁడంచునుపీడెఁబుణ్యజనుయాదస్స్వామినింబైసియా।
ర్చెనుబాశంబునఁగట్టిశ్రీదునినినిర్జించెన్వడింజేసిశ్రీఁ।
గొనెనీశానునిఁజేసెసాముగనునెక్కొల్పెన్దగన్మ్యాలఁగూ।
ల్చెనుదేవాంతకుఁడెల్లవేల్పులనుగాంచెంబేరుపెంపెక్కఁగన్॥ ౭౩॥

ఉ॥ అత్తఱిరక్కసుల్సురలనక్కఱనుక్కడఁగించిమించియి।
ట్లెత్తినకిన్కనాడిరవుడీరలుద్రావరెయాసుధారసం।
బిత్తఱినధ్వరాహుతులనింపుగమెక్కరెక్రక్కుఁడంచుఁజా।
మొత్తిరిమ్రుచ్చులధ్వగులఁబోలెనుబిల్లులుచిల్కలంబలెన్॥ ౭౪॥

ఉ॥ చావొనగూడదయ్యెననిసంకటమొందుచునిందనేసిరా।
దేవతలాసుధన్వరమతింగలవారలెయయ్యునయ్యెడన్।
ద్రావరెమున్నుగోరియమృతంబిపుడేటికిదానిదూఱఁగా।
దావలమైనహానియెముదంబునుదుఃఖముగాఁగఁదోఁచుఁగా॥ ౭౫॥

చ॥ ప్రబలలులాయదైత్యకృతబాధలకోర్వఁగనేరకంగదల్।
ప్రబలసుపర్వులోహరిహరాద్రుహిణాపరమాత్మయంచునా।
త్మఁబలుమఱున్స్మరించిరిసమస్తమున్వీయముశక్తివమ్ముగా।
నబలతఁగాదెతుట్టతుదనందఱునాభగవంతునెంతురా॥ ౭౬॥

చ॥ జలజజుఁడల్లనల్వహరిశక్రునితోననియెన్సురావళిం।
గెలిచితిపిష్టపేషణముగీర్తితమేయనిమానునేనునీ।
వలచినదిచ్చెదన్వరమువర్యుఁడెనిన్ననుపంగజానుమం।
డలుఁడఱెనీకునేతచనునాపలుకుల్వినవేనిహానియా॥ ౭౭॥

కం॥ అననేనికినీకేయగు। ననిమహిషుఁడువలికెఁదొలఁగెనజుఁడజమడవిన్।
బెనుబులికిఁజిక్కకెడగలి। గినవడువుననెవఁడుగఱటికెంగఱవునైటిన్॥ ౭౮॥

సీ॥ పాంచజన్యధ్వనిబహుళగర్జనముగాశార్ఙ్గమింద్రధనుస్సుచందమొంద।
వివిధశరౌఘంబువితతవర్షంబుగానందకాసితటిత్ప్రభందనరఁగ।
సరవిసుదర్శనచక్రంబుశతకోటిగాఁగఁగౌమోదకీగదసపక్షు।
భూధరవరముగాభుజగారిఝంఝానిలమ్ముగానెమ్మెనుగ్రొమ్మొగిలుగ।
జయజయధ్వానులగుసురలచ్చాతకములు। గాఁగరక్షఃపరాగంబుగడునడంగ।
ఋషులుకృషికులువినుతింపనింపుమీఱ। వచ్చెనారాయణుఁడుజడివడియనంగ॥

సీ॥ పచ్చియాకులపొత్తిఁగుచ్చినట్లుగపడె బాణవిద్ధపలాశపంక్తినలఁగఁ।
గానుగొట్టిన చింతకాయలవలెఁదోఁచెఁగదఁజదిసినవిరక్తసులయొడళు।
లడిదంబునం దెగినవియసురాంగములుపనసకాయలకూరలనస్ఫురించె।
సుడివాలువేఁడిమిసోఁకినసోఁకులకాయములుగుమ్మువంకాయలుగను।
గాంచఁగనుపట్టెభూతముల్గాంచెఁదుష్టి । భావిమహిమానురాజిసుపర్వమునను।
సంస్కరారోపణంబనసంగుమీఱె । దైత్యారిపునిదిప్రథమయుద్ధంబిటువలె॥ ౮౦॥

కం॥ నారాయణప్రయుక్తో । దారపృషత్కోగ్రతమప్రదాకుగ్రస్త।
స్ఫారాసురభేకానును । ఘోరంబయ్యెన్రణంబుగువలయమద్రువన్॥ ౮౧॥

కం॥ హరిశరవర్షమునకుఁగా । సరాసురుఁడుగొండగనయిజానెందెందై।
త్యరిపుఁడుగొమోదకిచే । వెరపరియైయడిచెవానిపెనుదలపగులన్॥ ౮౨॥

కం॥ దానంగొండొకతడవల । దానవుఁడుస్స్వమ్మసిల్లితగఁదెప్పిఱిలెన్।
ప్రాణపడఁబైనడంగియు । మానకమండెడుదవాగ్నిమాడ్కిఁగడిమిన్॥ ౮౩।

కం॥ పరిఘముననడిచెమహిషా । సురుఁడురువడిగరుడగమనుసొమ్మసిలెన్ శ్రీ।
హరియతనిఁగొనుచుఁబఱచెన్ । గరుడుఁడసురలార్వసురలుగడువెఱఁబఱవన్॥

కం॥ దనుజారియెట్టకేలకుఁ । గనెనుదెలివినాహుతులిడఁగ్రముముగజ్వాలా।
ఘనమగుహోమాగ్నియసం । గనువచ్చెంజక్రమేనెఁగాసరునిపయిన్॥ ౮౫॥

కం॥ దానినిసరకుగొనకవాఁ । డానారాయణునహరిపునహాహాపొడిచెన్।
బూనికఁగొమ్ములఁజిమ్మెన్ । గానఁగరారైరివాఁడుగనిరిస్వపదమున్॥ ౮౬॥

శా॥ రుద్రుండంతటదుంతరక్తనునిపైఁగ్రోధంబునన్ శూలమున్।
ముద్రించెంబలువాఁడివాఁడిదియెనీముఖ్యాయుధంబంచుగ।
ర్వోద్రేకంబునఁగేఁకవేసికసునాయుగ్రాయుధంబంచునా।
రుద్రున్మ్రదితుఁజేసెశృంగయుగళిన్ రోషంబువాసింగనన్॥ ౮౭॥

కం॥ రుద్రుండుశూలవుంద్రుని । మాద్రిఁద్రిశూలధరుఁడగుటమహితుండయ్యెన్।
ఛిద్రోర్ధ్వవుంద్రుపోలిక । నద్రిసదృశుఁడెసఁగెశృంగియమ్మహిషుఁడటన్॥ ౮౮॥

శా॥ జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలకునశ్వద్విట్టుపట్టైజయో।
దగ్రుండైకనకాద్రిశృంగకలనందర్పించినైచున్నదా।
త్యుగ్రుండైసురమానులంగొరిజలంద్రొక్కన్స్వవుచ్ఛంబురా।
జ్యాగ్రార్చ్యంబగురాజదండముధ్వజంబైయుండఁదీంద్రిల్లఁగన్॥ ౮౯॥

ఉ॥ అంతసురల్మనుల్భయమునందిమమున్వెసఁబ్రోవుమంచున।
త్యంతనుభక్తిమార్తికునినక్కఱమిక్కిలివేఁడిరాతఁడుం।
జింతిలిదీక్షితుండఁగదచేయఁగనేమగుఁజెప్పఁడన్నన।
ప్పాంతనెయొప్పచున్నమునిపుంగవుఁడిట్లనెఁగౌశికుండొగిన్॥ ౯౦॥

కం॥ ఎంతటిజేనికినైనన్ । మంతిరిగావలయునదనమదివెలయఁగదు।
ర్ధాంతదవాగ్నికినైనన్ । గాంతారముఁగాల్పఁగాలిగావలయుఁగదా॥ ౯౧॥

కం॥ కంతుకృతాంతాంతకునికిఁ । బంతమునంద్రిపురదహనవరకార్యమునన్।
సంతసఁబితామహుండుని । యంతగదా నేనునీకునగుదునటులిటన్॥ ౯౨॥

ఉ॥ ఈవుసురక్షితుండవయితేకపచంబుననింతపట్టుఁడ।
ద్దేవిభజింపుప్రోచునదిదేవమునిప్రచయంబులీలమై।
నీవిబుధారులందునుమునేటికిజాగననాతఁడాతజిన్।
భావమునందలంచెనుశుభంబుగఁగాళికనల్లెయామెయున్॥ ౯౩॥

ఉ॥ దేవతలెల్లమహాశ్రక్తికనిదీక్షితభావముఁగాంచియాసలే।
దీవరవర్ణివల్లననియెంతయువంతనుబొందిపోయిరా।
నీవియెసంగకున్ననవనీశునిఁబాయరెయాశ్రితుల్ధన।
శ్రీవిలసిల్లదేనిగృహిచేరువనుందురెయెందుబందుగుల్॥ ౯౪॥

కం॥ ద్రుహిణహరిహరులతోనా । త్మహానివిని చిరలమహిషుదౌరాత్మ్యమువా।
రహితుఁదెగటార్పనుపమును । సహితముఁగోరిరపుడజుఁడుసదయతననియెన్

కం॥ మీబన్నముమాతోడన్ । లేబరముననాడుటరయలీలయకాదే।
బాబులువినుండుమద్దెల । తోఁబోరోల్మా అయిడుటగఁదోఁచెడునకటా ౯౬॥

కం॥ మేమేవానికిలోఁబడి । నామంటమీరనగనెంతనలిఁదలువులనే।
వేమఱుబ్రిమింగెడువానికి । నేమఁటయప్పడములకటయేమగువగవన్॥ ౯౭॥

కం॥ పురుషులకవధ్యుఁడగువాఁ । డురుతరబలుఁడెవఁడువానినోర్వఁగలఁడెటన్।
పరమట్లునేనయిచ్చితి । హరుఁడువృకునకున్వరమిడినట్టిదియయ్యెన్॥ ౯౮॥

కం॥ అరయఁగనరిదిగఁగలదాక । వెరవయ్యసురుండుసచ్చువెలఁదుకచేతన్।
శరణముమనకదియిపుడన । వరవర్ణినిలేదువలఁతివానింగూల్పన్॥ ౯౯॥

కం॥ కావలయునేనియందఱు । దేవతలాత్మీయదివ్యతేజశ్శక్తుల్।
గావించినసొకటిగనది । దేవిగనానామెచేతఁదెగువాఁడెటులేన్॥ ౧౦౦॥

కం॥ అనివలికెసురజ్యేష్ఠుం । డనిమిషులటబ్రహ్మవిష్ణుహరముఖ్యులుశ్రీ।
జననిఁబరాశక్తిని నా । త్మనాత్మతేజోమయినిటుదలఁచిరిభక్తిన్॥ ౧౦౧॥

## పరదేవతా స్తుతి.

సీ॥ శ్రీమాతయగ్రపూజితవువిశ్వంబునుగన్నతల్లివినీవుగదయిదెనతి।
శ్రీమాతవిశ్వవిమైమింపశ్రీశక్తివివిశ్వేశ్వమునకాటనిదియెజోత।
శ్రీమాతవిశ్వేశ్వరివిగాఘననునీవుశ్రీమతివాదువుచెందమ్రొక్కు।
శ్రీమాతతెలిపెదజీవదేవైక్యంబుఁజిన్ముద్రనైనమస్కృతిఁగొనుమిదె।
శ్రీకరాక్షరమాతృకశ్రీపదాంబ । శ్రీప్రణవరూపతనుమధ్యశ్రీకిమాత।
శ్రీవిమాతవుబిల్వాంబపీఠవాస । శ్రీనిమాతజోహారిదెచేకొనుమము॥ ౧౦౨॥

సీ॥ ఆత్మయనంబ్రహ్మమగుజీవుఁడగుఁబ్రకృతిమతియుఁదనువవుఁదెలుపఁగీని।
నాత్మపర్యాయమైయమరిపంచాక్షరమైయొప్పతనుమధ్యమాభిధాన।
మోమననుమనాఁగనెగిఁబంచమాత్రబీజాక్షరమననీకెయర్థ్మమవును।
దనువునుమనముప్రధానంబుజీవుండుబ్రహ్మంబునీవనీవంటెదన్య।
మొండెఱుంగముమేముదానుండెనేని । మాకెఱింగింపుమట్లైనమమ్మునీవ।
ప్రోవవలయునీబిడ్డలముగదయాత్మ । మాతతనుమధ్యమాదేవిప్రీతిరావె॥ ౧౦౩॥

సీ॥ పరికింపసగుణమాబ్రహ్మంబవీవసృష్టిస్థితిసంహారసిద్ధికీవ।
మూలమాప్రకృతివైపోలుటమూలప్రకృతియనఁబరఁగెదువితతమహిమ।
గుణగణగుణమనగ్గికోదండపంచతన్మాత్రసాయకకామమహితపాశ।
క్రోధాంకుశోజ్జ్వలక్షోణ్యాయితాంగశతాంగపంచేంద్రియహయాసుబుద్ధి।
సారథీచిద్ధ్వజాయహంకారరూప । యద్వయాత్మికతనుమధ్యయాత్మభక్త।
రక్షణక్షణమమునేలురావెవేగ । శృంగిరక్కసుఁజక్కాడుచెలఁగువిజయ॥ ౧౦౪॥

కం॥ దాసావయమనుచమ్మా । గాసిల్లితిమేముదితిజకాసరునవనీ।
వానిదెలియఁదనుమధ్యా । యాసోఁకుంగూల్పుదాస్యమూర్పుముమాకున్॥ ౧౦౫॥

కం॥ గాయత్రీసావిత్రీ । ధ్యేయావ్యాహృతిసరస్వతీతనుమధ్యా।
గేయదయాకలితాలలి । తాయేలన్రావెనీదుదాసులమమ్మున్॥ ౧౦౬॥

కం॥ చేతస్సితాంబుజస్థిత । ప్రాతస్సూర్యప్రకాశపాశాంకుశహా।
స్తాతనుమధ్యావరదా । భీతికరామ్రొక్కెదముకువేవేరావే॥ ౧౦౭॥

## మహిషాసురమర్దిన్యవతారము.

ప్రభాత॥ అనిసురలందఱు-నాత్మశక్తివేఁడం । గనుజనియించెను-కండొకంటుగాఁగన్।
వనజభవాదుల-వల్లఁదేజముల్దా । మొనసెనెకొండుగ-నెల్లబ్రహ్మమాఁగా॥ ౧౦౮॥

సీ॥ బ్రహ్మముఖప్రభవప్రభపాదద్వయంబుగానాభిపర్యంతమగుచు।
విష్ణుహృదయజన్యవిద్యుతియష్టాదశభుజోత్కరంబుగాశుభదమగుచు।
రుద్రశిఖోద్భూతభద్రతేజంబుత్తమాంగంబుగానాగళాంతమగుచు।
నాత్మసారముజ్యోతియాపాదమస్తకవ్యాప్తముగానఖండాత్మమగుచుఁ।
గాలకాంతిజములుగాఁగఁగేశంబులు । సాంధ్యములుగబొమలుజాతవేద।
జాతములుగఁద్ర్యక్షులాతతశ్రీదశో । భోద్భవంబుగాఁగనెనరనాస॥ ౧౦౯॥

సీ॥ కౌమారతేజోజమైమించనుత్తరోష్ఠమధరోష్ఠమరుణచ్ఛవిగనుద్విజ।
ములుగఁబ్రాజాపత్యభూరిద్యుతిరసోత్థశక్తియైరసనగాశ్రవణములుగ।
సామీరియాశక్తిసౌమ్యతేజస్స్ఫూర్తిస్తనయుగంబుగనైంద్రశక్తిమధ్య।
ముగనూరుజంఘులమొగివారుణద్యుతిభామతేజమునితంబంబుగాఁగ।
వాసవశ్రీకరాంగుళివైభవముగ । నర్కరోచిపాదాంగుళులైయశేష।
దేవతేజంబులొక్కటఁదేజరిల్ల । నంగనగనైయెసంగెఁబూజ్యసతిగాదె॥ ౧౧౦॥

కాంతి॥ ఆదిన్సుధఁగాంచిన - యట్టులెయ । య్యాదేవినిఁగాంచిరి - హర్షముతో।
నాదేవతలెల్లను - మహాప్రవణుల్ । శ్రీదేవినిఁగొల్చినఁ - జెందరె శ్రీన్॥ ౧౧౧॥

ప్రమితాక్షర॥ హరివల్కె-దేవతలు-సాదరులై । వరశక్తికి మెఱసను-వస్త్రవిభూ।
లనిండుస్వాయుధజ-శస్త్రతతిన్। వెరవారనీవిఁగద-వేపనులా॥ ౧౧౨॥

క్షితివృత్తము॥ అ। న। వి। ని॥ ౧౧౩॥

మానిని॥ చేలములిచ్చెను క్షీరసముద్రుఁడు - చెల్వగు సొమ్ములఁ ద్వష్టమహా।
మాలిక నావరుణుండు ధనేశుఁడు - మద్యవుఁ గోరహిమాద్రిహరిన్।
శూలము శూలియొఁ జక్రముఁ జక్రియుఁ - జొప్పడ బ్రహ్మ కమండలువున్।
గాలుఁడు దండముఁ గైదువఁ బల్కెను - గంధవహుండిషుకార్ముకముల్॥ ౧౧౪॥

కవిరాజవిరాజిత॥ ఒసఁగెను వజ్రము వజ్రిహుతాశనుఁ - డుగ్రశతఘ్నినిశక్తిఁ బ్రచే।
తసుఁడు స్వపాశము శంఖముఁ ద్వష్టగ - దంబరశుంభ్వజమయ్యనిలుం।
డసదృశమా ప్రభలొప్పఁ బ్రభాకరుఁ - డగ్ని ప్రహేతుల నన్నెలమే।
లసమువసంగన నెమ్మది స్వాశ్రితు - లందల దేవి యొసంగెఁగడున్॥ ౧౧౫॥

కం॥ మహిషాసురమర్దినియన । మహితవుగమ్మను చుదివిజమహిజులు దేవిన్।
బహుభంగులఁ బ్రార్థించిరి । మహిళయు మైకొనియెఁ బ్రబలెమహామద్భుతమై॥ ౧౧౬॥

కం॥ జయజయయని రాజేజేల్ । జయజయయనిరఖిలమునులు సకలమనుజులున్।
జయజయయనిరందువలన । జయజయయని మొరసెఁ బుడమిచదలుం దెసలున్॥

కం॥ వినియలరిపు హుంకారోత్సాహముఁ । గనెను మహాశక్తి దైత్యకాసరుఁడు నిదాఁ।
దన గెలువుఁ దెలువు సకినం । బనితుదఁగద తెలియవలయు నయ్యెడు ఫలమున్॥ ౧౧౮॥

శా॥ వీతెంచెం బరదేవతాట్టహాసనత్స్వోశార పంబూర్జిత।
స్ఫీతాశ్వాయితసింహగర్జనముదాసీభూతసర్వామరో।
ద్భూతస్ఫూర్జితమై మహాప్రళయసంభూతాఖిలాంభోధిజీ।
మూతవ్రాతమహాబలధ్వనిబలంబున్మించుచున్మించుచున్॥ ౧౧౯॥

మ॥ కనియెంగాసరరాక్షసేంద్రుఁ డెదుటం గాంచంగలేకెట్టకే।
నినకోటిద్యుతి నాదటన్మకుటసంస్పృష్టాభ్రఁ బాదాంచితా।
వనినష్టాదశబాహుసంవలితదిగ్వ్యాప్తజ్యగత్వ్యాప్తసిం।
హనిషణ్ణన్నిశితేషువర్షణను దేజోఽక్షీణఁ ద్ర్యక్షేక్షణన్॥ ౧౨౦॥

కం॥ కనితన సేనాపతులం । బనివడి వురికొల్పెఁ బోరఁ బంతము మీఱం।
గను వారు మిడుతలెరగలిఁ । గనుకనిఁ బడునట్లు దేవిఁ గని చెనకిరొగిన్॥ ౧౨౧॥

సీ॥ చచ్చెఁ దొల్దొల్తను జక్షురుండను వాఁడు మహిష చక్షుఃప్రాయుఁ డహిసముండు।
తెగె నంతటను మహాధీరుండు వాహరి జిహ్వాయితుండమరాహ్వయుండు।
హూలెఁ బిమ్మటను దగ్రుండు గరాసుండు దుంతరక్కెను కొమ్ము దోయి కెనసఁ।
గాలంబుచే నెచాష్కలుఁడు దాగ్రుఁడు దున్నరాకానిపీనులయాకృతిగను।

మడినైనంధకుండుమహిషునిబుద్ధి నాఁ । గెడనైనుగ్రముఖుఁడుచెడఁగనోరు।
దుదిమహాహనుండుదోరెదుర్ధ్మనువన । మఱిత్రినేత్రుఁడా కెమదమకైనన॥ ౧౨౨॥

సీ॥ చెల్లెబిడాలుండుపిల్లలఁగొఱికినపాపాతిశయముకోపైపొసంగ।
బిద్దెనుదుర్ధరుఁడుద్ధవడింబెఱసొమ్ముదోఁచినమహాఘమ్మెసంగ।
నీల్గెదుర్ముఖరుండునిర్జరమునివిబుధులనుదూషించినదోషమెచ్చ।
బెద్దనిద్దురవోయెగ్రద్ధఱికాలుఁడాఖిలహింస్రతఁగలుషాళిహెచ్చ।
రూపఱియెనుగ్రదర్శనుఁడాఁపరాని । దర్పమునసాధులకతిసాధ్వసము నేసి।
సమనైననిలోముఁడమరులయములనరులఁ। దాఁకినొప్పించిననికృష్టదౌష్ట్యమునను॥

మ॥ తెగటాఱెందరువాతసర్పభుజుఁడుందేవాంతకుండున్మహా।
కుగుణుండైనఘనోదరుండుగడునిక్కంజండశౌర్యుండుస్రు।
క్కగదాచక్రకృపాణశూలములచేశిక్షించివాహారిచి।
త్రగతిన్మానసరీతిబుద్ధిక్రియసాద్ధత్యక్రియావైఖరిన్॥ ౧౨౪॥

మ॥ చతురంగంబులు నేనలొక్కమొగినాశక్తిస్వసంగప్పెనా।
హుతులగ్నింబలెభస్మసాత్కృతములైయుక్కెడెనక్కాసరే।
ట్చతురంగ్రుద్దైగెనాఁగఁదోఁకయనఁజంచత్కేతుదండంబొగిన్।
శితివాలెంగొఱమాలితుత్తునియలైశేషించెవాఁడొక్కఁడే॥ ౧౨౫॥

## దేవీ మహిషాసుర ద్వంద్వ యుద్ధము.

సీ॥ అంజనాచలనిభంబైనమేనజగవశార్ఙ్గశరాసనసమములైన।
కొమ్ములుమహితవహకుండతుల్యంబులౌకన్నులుమందరకందరముల।
కెనయైనముకుబొక్కలెక్కఁగామూడులనెమరిడుచండఋనమరులువెఱ।
బర్హిర్ముఖతఁగోరబలుబులుమేనిపలుంకారభైరవమగునోరుదనర।
బాల్యయౌవనకౌమారవార్ధకదశ । లనఁగఁబరువంబుగలిమియునాధిపత్య।
మజ్ఞతయునననలుగాళ్లనమరగొరిజ । లష్టభోగాశలుగనుమాయగనుదోఁక॥ ౧౨౬॥

కం॥ మహిషుఁడునిజరూపముతో । మహిబ్రచ్చుచుముందుగాళ్లమహితుంగాలున్।
వహియింపకేచిత్రోఁచిన । మహిషంబనదేవితోడమఱియిట్లనియెన్॥ ౧౨౭॥

చ॥ తలఁచినఁజిత్తవిభ్రమముదార్కొనఁగాంచినఁగంటివేదురా।
నెలమినిదాఁకమైగరఁగునింతియకాడెపిశాచిభీరువుం।
బలువడినోఁకువీఁకఁగనుమాంత్రికతాంత్రికశక్తియుక్తుల।
న్వాలువడదౌరధీరులవనిన్స్మరియింతురెయింతిఁగాంతురే॥ ౧౨౮॥

ఉ॥ శూరుఁడుసాటిగానబలఁజూచునెచూచునెపోరనారినిన్।
బూరికినుద్దియంచుఁదనబుద్ధిఁదలంచుఁద్యజించుబోటికిన్।
బౌరుషమబ్బనెట్లురతిఁబ్రబ్బెదునేమొతొలంగుమంగనా।
యీరజనీచరేశుఁడుసహింపఁడుదొయ్యలితోడికయ్యమున్॥ ౧౨౯॥

ఉ॥ నారదువల్కెనల్కమెయినాకరుచించెఁద్వదంత్యవాక్యమే।
నేరమీవచ్చితిందునుమనిన్నసురాధమప్రవచ్చెదంద్వదీ।
యూరుచిరోరుచర్మమెముదంచితభేరికివేయుదుంజుమీ।
యూరకకాఱులేలఱచెదుగ్రరణంబుననిల్వుపాఱకన్॥ ౧౩౦॥

ఉ॥ పాఱిననేమిపాశమునబద్ధునిఁజేసెదనిన్నుఁగ్రన్ననన్।
దూఱిననారసాతలముఁదోఁచనెయీడ్చెదనంకుశంబునన్।
మాఱిమసంగుభంగినినుమ్రందఁగఁజేయుదుశూలపాణినై।
యూఱడియాఱఁబోరుమఱియందుమదీయపదారవిందమున్॥ ౧౩౧॥

చ॥ అననగుమేలుమేలనుచునామహిషుండడరెంగడున్వడిన్।
ఘనుఁడెనుఁగప్పచొప్పననఖర్వముగర్వముగండుగుండనం।
గనుబెనుసింగముంగనలిగ్రక్కుననుక్కునక్ష్వేడతోడఁజి।
ప్పననొకచెంగఁబైకుఱికిపొల్పఱముంగలికాళ్లగోళ్లచేన్॥ ౧౩౨॥

ఉ॥ వేచఱవన్వడింగొఱుకవేఁడిగఁబొంగెడుక్రొత్తనెత్తుటిన్।
వాచవిగ్రాలఁగ్రోలఁగనువాఁడొగిఁగొమ్ములఁగుమ్మిచిమ్మినన్।
బీఁచమడంగిసింగమదిబెల్కుఱిదవ్వులవాలెనవ్వడిన్।
ఖేచరవంద్యయాసతిమొగింగురిసెంబొరిశస్త్రవర్షమున్॥ ౧౩౩॥

చ॥ నిశితవిషాణకోటులనునింగినిశైలమయంబునేలగాఁ।
గుస్పృతిఖురప్రహారములక్షోణినణూత్కరమాకసంబుగం।
బొసఁగఁగఁజేసినిశ్శ్వసనఫూత్కృతిచేతఁగలంచిసంద్రముల్।
పసరపురక్కసుండెసఁగెవాలముగాలునికోలఁబోలఁగాన్॥ ౧౩౪॥

ఉ॥ కొండలపిండుఁబిండిగనుగొబ్బుననబ్బురమబ్బఁజేసెన।
చ్చండికవజ్రపాణియయిత్మ్మెఁగడుగట్టిగనుండఁజేసెను।
ద్దండతవర్షణాస్త్రమునఁదావరుణాస్త్రముచేతఁగాచెన।
క్కాండఘులన్స్వపాశమునఁగట్టెనుగాసరుమీసరంబఱన్॥ ౧౩౫॥

సీ॥ కులపర్వతోత్తుంగగురుశృంగములవలెగబ్బిగుబ్బలుమస్తకమునఁదనర।
మిడిగ్రుడ్లుమించులైమించఁగాఁదొండంబుకాలదండమువోలెఁగ్రాలఁజాల।
ద్వైతసిద్ధాంతంబుఁదగఁబ్రకటించునాఁగొమ్ములుబలుభిదురమ్ములుగను।
బుష్కరశీకరపుంజంబుజడిగాఁగమదధారలేఱులైమహినిఁబఱవ।
ఘీంకృతులుగాఁగనుఱుములుగెరలినడచు । నడలనదలంగఁబుడమియునొడలుడిగిన।
మొగిలనఁగఁబెనుసవగొంపపగిదిఁజెండ । నైరిభాసురుఁడపుడుగజముగనడరె॥

మ॥ మునుబంచాస్యనిపేఁకఁదాఁకినద్విపంబోనాఁగనాగౌరుసోఁ।
వనుబంచాస్యరథన్గదున్వడిమహాక్రోధంబునందాఁకెను।
మ్మెనుజిమ్మెందనదంతకుంతములబల్మింజెండుముండన్మదం।
బునఁబెన్స్మాఁకునుబోలెఁబట్టికడిమింబోఁద్రోచెనాచండియున్॥ ౧౩౬॥

కం॥ పరశుప్రహారములన । క్షురికరరదనములనతికఘనశాఖలనాన్।
హరిపారణనే సెనుద । ద్వరమ స్త్రిక్షమున నురలఁదారకములిలన్॥ ౧౩౮॥

శా॥ శౌర్యావార్యముఁజొటఘీటస్మృతులుశశ్వచ్చామరశ్రీఁగనన్।
భూర్యుద్ధూతసుకేసరప్రతతియెప్డుంగోటలుంగోళ్లాగిం।
గార్యస్థత్వముఁగాంచఁగేతుతయుఁదోఁకన్నెక్కొనంజక్కఁగా।
హార్యక్షాకృతిఁదాల్చెనాక్షణమరక్షోఽధ్యక్షుఁడక్షీణతన్॥ ౧౩౯॥

భుజంగ॥ సటారుగ్ఘాటముల్నిక్క-శంబోగ్రదంష్ట్రల్ । స్ఫుటంబుల్లగర్జిల్లు-చున్విచ్చగోళ్లన్।
బటుక్రోధమాపంచ - వక్త్రింబు వేగన్ । దిటంబొప్పలంఘించె - దేవింగ్రసింపన్॥

ఉ-వ॥ అపర్ణయాత్మాఖ్యస - హార్థముంగా । నుపేంద్రవజ్రంబన - నొప్పుకత్తిన్।
వ్యపేతశీర్షుండుగ - వానిఁజేసెన్ । క్షపాచరాధ్యక్షుని - సైంహదేహున్॥ ౧౪౧॥

ఉ॥ వాఁడయిమానవుండుగభవానిదిదక్షిణబాహువాడనీ।
కోడకకొట్టెఁబెన్గదమహోద్ధతివజ్రమిదంచుజన్నిదం।
బీడగ్రహింపుమంచుననినేసెనువామభుజంబుడీల్పడం।
బీడజనింపనామెసురఁబ్రీతినిఁగ్రోలిశ్రమంబఱంబొరిన్॥ ౧౪౨॥

ఉ॥ ఘోరపలాశినేసెనసిఁగ్రూరతదక్షిణవామభాగవి।
స్ఫారములైనజందెములచాడ్పునఁజండికరెండువ్రేట్లవే।
యారయనయ్యెఁగాపదిగనయ్యవియొయ్యనవ్యాసపీఠసా।
కారముఁగాంచెరెండెనయఁగంబదియానననిరౌరరోమకుల్॥ ౧౪౩॥

చ॥ వివిధవిశేషవేషములవేడుకఁగైకొనిపిమ్మటన్నిజ।
మ్మవుతొలిరూపునొందుఘనుఁడైననటుండననాలులాయదా।
నవుఁడటువెన్కఁగిన్కనుఘనద్యుతిమించుచుమించుదున్నపో।
తవుచునుఱంకెగర్జగమహాఘనశక్తినిఁదాఁకెపీఁకతోన్॥ ౧౪౪॥

పథ్యాకందము॥ పలికెనుమహిషుతోడన్ । నిలునిలుమొక్కింతపడవు-నేనిపుడే।
బలుదమిఁద్రావెదమధువున్ । వలసినఁబులుమేయుమపల-బవరమువున్॥

ముఖచపలాకందము॥ అనికలుపలుమాటానెం । గనుంగవంగెంపు-గడలుకొనన్।
గనవీరపాణమాఁగా । ఘనశౌర్యోత్సాహతరువుఁ-గడుఁబెంపన్॥

విపులాకందము॥ పరమేశ్వరియటుకాదం । బరినాస్వాదించిపొలిచె-బవరమునన్।
దురగాధ్వరమునహుతతతిఁ । బరిత్ర్పుప్తుండైనమహిత-వహ్నివలెన్॥ ౧౪౭॥

చ॥ పలికెనువాఁడుచూడుననువజ్రశరీరుఁడమిత్రిమిత్రినై।
పొలయుదుసర్వలోకములఁబ్రోచెదనేనసృజింతుసర్వమున్।
నిలువఁగలేరునాయెదురనిర్జరులున్సురవైరులున్నరుల్।
గొలిచెదరెప్డునన్నబలకోరెదుగెల్వఁగనీకుశక్యమే॥ ౧౪౮॥

ఉ॥ ధీరుపవీవుమద్యమును వేమఱుఁద్రావితివంతె కాకక్రో।
ధోరుప్ప దాకుహారవయిత్రొక్కటరాక్షసరాజనైననా।
చేరహిఁజిక్కితౌనబలచెప్పెడిదేమిఁగమల్లుగల్లునిం।
పారఁగఁద్రోలెఁదేలడిచె నాదటపయ్యము మొత్తెనాఁదగెన్॥ ౧౪౯॥

చ॥ అనవినిలోకమాతయసురాధముఁబ్రేలెదవేలనీబలం।
బునుజలముంబ్రభుత్వమును బొల్పఱుపూనినఁగన్నుజ్ఞానముం।
గనవుస్మరింపవెన్నఁడునుగట్టడివైననునాత్మశక్తనీ।
కసెుదవునెట్లుసద్గతియగున్కృతిమృత్యువనాదునీకిటన్॥ ౧౫౦॥

ఉ॥ మత్తుఁడెఱుంగఁడీశమహిమంబు స్వశక్తినెసర్వమానటం।
చలైఱఁగేనిజంబయిననంతములేకమునంగరాదని।
త్యోక్తమవృత్తినెల్లపుడునొక్కతెఱంగుననుండరాదెచా।
వెత్తఱినైననానగుటనీశ్వరుభక్తిభజింపనింపగున్॥ ౧౫౧॥

శా॥ నానాదైత్యుఁడుతెర్లునానెపయిఁజిన్కన్నీరువేభగ్గనం।
గానత్యంతముమంటమండునటులాజ్ఞానాంబతోనిట్లనెన్।
నేనేయీశుఁడనాకునీశుఁడొకఁడున్నేనన్నుబోధించెదే।
యానంచమ్మనుగుమ్మమష్టమతికొయ్యందెల్పఁగీడౌఁగదా॥ ౧౫౨॥

శా॥ బంధించెంబసిమోహపాశముననప్పైనెక్కత్రొక్కన్వడిన్।
సంధించెంగదుఁగాలశూలమమయశ్వద్వేషిద్వేషమ్కుస్ఫు।
క్సింధుంగ్రక్కుచుఁదన్నుకొంచునసిఁగాన్ఛిన్నంబుశీర్షంబుసం।
బంధంబర్థముప్రాణమేపనరరూపంబూర్ధ్వకాయంబుగాన్॥ ౧౫౩॥

## మహిషాసుర సంహారము.

కం॥ వాలునుబలుకయుఁగొనియ । క్కాళినిసుప్పించెవాఁడుగడుఁదచ్ఛిరముం।
గూలిచెసుడివాఌనసల । కాళికయిడెబలిగినిలకుఁగందమిదిగదా॥ ౧౫౪॥

ప్రభార॥ మహిషమహాసుర - మస్తకంబుపైనా । మహిధరపుత్రిక - మానుగానటించెన్।
మిహిరుఁడుప్రాగ్గిరి-మీఁదశృంగయుగ్మ । ప్రహితసుమధ్యమ-రంగమందుఁబోలెన్॥

ప్రమితాక్షర॥ పరమొత్తెనత్తఱినిఁ - దానుమయూ । దరమత్తసత్తములు - దార్కొనిరా।
దరమొత్తిపాటిరొగిఁ - దారసురల్ । దరమెంచనేఁదరమె - తన్మహిమల్॥

కవిరాజ॥ జయజయయంచునువేలుపులాడిరి - సజ్జయరూర్యరవాన్వితులై।
జయజయయంచునునచ్చరలాడిరి - సత్కుసుమాంజలిమంజులలై।
జయజయయంచుమునుల్నుతియించిరి - సారతమశ్రుతివాగ్యుతులై।
జయజయయంచుభజించిరియార్యులు - సైరిభమర్దనిసార్థకులై॥ ౧౫౫॥

సీ॥ నీయుగ్రమాంగంబునీయైక్యమొంక్రులినీపరాంత్రముల్లుజీన దేవభావ।
ములనహమ్మనుచునుభుజములునీయవినీపేరుజయయనినెమ్మిఁదెలుపు।

మహిషమౌనజ్ఞానమతిదానిఁదెగఁద్రొక్కియమ్మజ్ఞానస్వరూపమ్మవవుచు।
శూలచక్రమ్ములసారిదినోంకృతితత్త్వమసినసియనితెల్పిరాత్మశక్తి।
మాతయోమహిషాసురమర్దినియుమ । నీకునెవరైనగురుమూర్తినీవెకాక।
నీవెయీసర్వమఖిలంబునీవెబ్రహ్మ । మవుపరాశక్తినీకునమస్కృతులివె॥ ౧౫౮॥

## మహిషాసురమర్దనీ కంద నవరత్నహారము.

౧. ఓమునమాయననమయుమ । నామటేయనుహ్రీమనఁగనునలువలరెవపి।
వౌమహిషాసురమర్దిని । శ్రీమాతానీకునరులు సేసెదముశివా॥ ౧౫౯॥

౨. నరసురమునినికరభయం । కరునిన్మహిషాసురునినిగడతేర్చిమముం।
గడిణనుగాపాడిరికెం । కరులమునీకేమునతులఁగావింతుముమా॥ ౧౬౦॥

౩. మోదముజ్ఞానముమానస । మాదటఁబ్రాణంబుసన్నమనుకోశములై।
దౌదేవీతనుమధ్యమ । నీధనములుమహిషమర్దినీజేపరతుల్॥ ౧౬౧॥

౪. మహనీయాద్యపుమాతా । మహిషాసురశిరముపైనిమహితసవుదపెూ।
విహితాచారులునిన్నుఁగ । మహిదివిమదిఁగొలువసంద్రమహాన్యచరిత్రా॥ ౧౬౨॥

౫. హితవీవెల్లరకగుమవు । మరివగుటన్మహిషదనుజమర్దినిరహిబే।
పతఁగలిగింతువుపెంతువు । హృతిఁదుదిబ్రహ్మమునెచేనెదీశ్వరిప్రకృతీ॥ ౧౬౩।

౬. షడరులవశ్యలఁజేయుము । షడక్షరాఖ్యపరాంబజననివిమాపక్।
విడకుమముమహిషమర్దిని । కడునిహపరసౌఖ్యములనుగాంతుమునీచేక్॥ ౧౬౪॥

౭. మరిమాతవుగాయత్రివి । సరినీకెటఁగలదుమంత్రసరణినమారుసి।
పరదైవతమునవినమే । పరమేశ్వరిమహిషదమనిభావింతుమునిక్॥ ౧౬౫॥

౮. మర్దితమహిషాజ్ఞానవు । దుర్దాంతపుజ్ఞానమయివిదుహారవుసా।
హార్దమనస్కపుభక్తుల । దుర్దశలన్మాన్పవమ్మదుర్గాదేవీ॥ ౧౬౬॥

౯. మాన్యైర్థితసచ్చరితము । జన్యాసేయదిదిమహిషజన్యాగ్రజయా।
దైన్యమునుమాన్చునతులక । నన్యజయముసుముసుసఁగుననిసేమురస్లే॥ ౧౬౭॥

కం॥ కందనవరత్నహారము । కందంబవునిద్దిమహిషకందంబవునీ।
కందమవుఁబద్యముఁబద్య । క్కందాక్షరలత్యమంత్రపముతనుమధ్యా॥ ౧౬౮॥

మాలిని॥ అనివినుతినరుల్సే-యంగనాయంగనాకా।రనుపముశివవిష్ణుబ్రహ్మదు ...వ్యక్తతత్త్వం।
బినవిధుహుతభుక్సూ-ర్యేడితంబంబరంబం।దనుమతిఁగనుమించ-త్రోయదంబందుఁబోలెక్॥

కం॥ పరభక్తినినీమహిషా । సురమర్దినివిజయమునుసుఖలువినఁజదువక్।
బారనెదరభీష్టములనా । పరమేశ్వరిఁగొలువవేఱుపలుకవలయునే॥ ౧౭౦॥

## జానుమ త్సంతాపము.

కం॥ మిగిలినయొకరిరువురునే । పగిదినొరక్కసులజములువ్యాఘ్రముబారిక్।
నుగియకతప్పినచాడ్పునఁ । బాగులుచుఁబోయిరిదారకిదిమునువినిపింపక్॥ ౧౭౧॥

కం॥ వినిజ్ఞానమండలుండున్ । దనమునముననిక్కమునుచుఁదలఁపండయ్యెన్।
దనమంత్రులనలువురనే । య్యనిమహిషాసురునిముగుదయొకతెచదువుటన్॥ ౧౬౩॥

కం॥ మాయాసిద్ధుండనుదై । తేయుఁబనిచెమహిషుఁడటుకుస్త్రీజయ్యఁడెయం।
చాయసురయరసియంతయు । సోయననిజమనియెనుజుమయొగిఁబిడుగయ్యెన్॥

ఆ-వె॥ జ్ఞానమంతుఁడధికసంతాపమునఁబ్రాను । పడియెబ్రానుపడినపగిదిఁబడియె।
సచివుఁడైననాఁడుజయబుద్ధిదేర్చెను । విహితకృత్యవితతివినుతఫణితి॥ ౧౬౪॥

కం॥ గతమునకుపగచుటెంతయు । వితథముగదభావికార్యవితతిఁదడవనా।
గతిమునకుగురువుశుక్రుం । డతనికివినిపింతమంతనగునదియగుతన్॥ ౧౬౫॥

ఆ-వె॥ వెజ్జువ్యాధిమాన్చునెజ్జయాధినిమాన్చు । వెజ్జుకంటెనెజ్జపెద్దగాఁడె।
యాత్మబుద్ధికంటెనాచార్యబుద్ధిమే । లంచువినమెయరుగనగుమనకన॥ ౧౬౬॥

ఉ॥ అంతదురంతచింతనమురారిజనేనుఁడుజ్ఞానమండలుం।
డంతికమౌనిశాంతముననక్కఱనెక్కొనువానిమౌనిన।
శ్రాంతతపోమహత్త్వజితసర్వసుపర్వగురుంగురుంగృపా।
త్యంతసురక్షితాఖిలమహాసురచక్రునిశుక్రునింగనెన్॥ ౧౬౭॥

కం॥ కనుఁగొనిసాష్టాంగముగాఁ । బ్రణతింగావించిభూతవార్తలనెల్లన్।
బనిఁబూనిపూసగ్రుచ్చిన । యనువుగఁదగవిన్నవించెనతిదైన్యముతోన్॥ ౧౬౮॥

కం॥ అనెఁగవికవియగపడునే । యినునకునుచ్చస్థితినెగిహీనస్థితినే।
కనఁబడుఁదులగవికగుఁగా । కినునకగునెహాక్తికునినయెంచుముకవిఁగన్॥ ౧౬౯॥

కం॥ నొప్పించితిజంతువులను । నొప్పించితిమానవులనునొంచితమరులన్।
జెప్పఁగనేటికిఁదత్ఫల । మిప్పుడుచొప్పడియెఁదప్పనేకుడువవలెన్॥ ౧౭౦॥

ఆ-వె॥ గొడ్డుసచ్చెమంత్రికుంజరులునునీల్గి । రసురులెల్లఁబొలిసిరౌరయాఁడు।
దానిచేతవిధినిఁదప్పింపఁదరమౌనె । వగపనేలయాలమగునిజంబు॥ ౧౭౧॥

కం॥ గెలిచిమునిససిరియగునిట । గెలువకచచ్చిననదియటనగుఁగీర్తియొసుఖమో।
కలనఁగనునారపూరుఁడు । హరియొతగరొయగుతమంతకంతకుమేల్గా॥ ౧౭౨॥

కం॥ పుట్టకయెయుండవలయును । బుట్టిననెన్నటికినైనఁబొలియనవలయున్।
గట్టిదప్రాణులకిదగుట । నెట్టనమేలందుటందునెఱతనముగదా॥ ౧౭౩॥

కం॥ ప్రాణాయామంబుననేన్ । బ్రాణభయదమైనయట్టిరణముననేనిన్।
బ్రాణత్యాగముబాగగుఁ । బ్రాణమెడలుటితరగతినరకమదిగాదే॥ ౧౭౪॥

కం॥ మాయాత్మభవుఁడనంగా । శ్రీయుతుఁడనసర్వజగదజేయుఁడనంగా।
గేయుండవైతివిపుత్ర । శ్రీయుతుఁడవునైతివేమిచెందెదవిందున్॥ ౧౭౫॥

కం॥ నాజ్ఞానమండలుండెవు । డాజికినుత్సాహమొందునట్టిఁడుగానన్।
సుమనసుసునీతినీనా । కుమారుసుకుమారుబాలుఁగొనుమేలుపయన్॥ ౧౭౬॥

శా॥ పుట్టెన్నెట్టనలక్షణజ్ఞుఁడనఁగా భూమ్యంతరిక్షంబులం
బిట్టేపొందఁగమండుచుండశిఖినావెల్గొందుచొక్కుండుగ
స్పష్టుంజూడనఘోరుఁడౌజగతిసర్వజ్ఞుండుసర్వాయుధుం
డట్టిట్టౌనరసింహుఁడారయఁగఁబంచాస్యుండగున్ శూరతన్॥ ౧౯౯॥

ఉ॥ చారువినీలకుంతలుఁడుచంద్రసదృగ్వదనుండుకైరవో
దారసులోచనుండుసకలాభరణాఢ్యుఁడుచంద్రహాసశో
భారమణీయుఁడాకృతినుభావితభావితవామదేవుఁడా
శారదనూనపాశసృణిజ్యాఁగలిగెన్సువిలోచనుండనన్॥ ౨౦౦॥

మ॥ తరువాతంజనియించెనిమ్ముఖబృహద్భానుప్రభాభాసురుం
డురుచక్రాబ్జకరుండునీరదనిభుండూరీకృతుండొక్కరుం
డరిసంత్రాసకుఁడాశ్రితావనుఁడపాస్తాశేషదోషుండుశ్రీ
ధరుఁడౌఁజూడనుబాహుఁడీక్షమనుసద్యస్సంభవుండౌఁగదా॥ ౨౦౧॥

కం॥ రథగజతురగపదాతి। ప్రథితచతుర్బలములకునుబ్రభులుక్రమముగన్।
బృథివీశులునలువురువా। రథోక్షజశ్రీభుజసములగుదురుమహిమన్॥ ౨౦౨॥

శా॥ ఆవిరేశచతుష్టయంబుపయిసర్వాధీశుఁడై యుత్తమాం
గావిష్కారముగానెసంగెడునుముత్కర్షిశుఁడీశానుఁడా
నావిష్కారవరాళికాఢ్యకలనన్నానాస్త్రసంపన్నతన్
ద్యావాపృథ్వ్యవకాశసంభరితదివ్యాత్మీయతేజస్స్థితిన్॥ ౨౦౩॥

కం॥ ఏకత్రిపంచసంఖ్యల। యేకతఁబొలుచునదియద్దియేధ్వజమాన
వ్యేకాక్షరంబుపంచమ। మైకానంబడెడుఁగావెయాగమలక్ష్మన్॥ ౨౦౪॥

కం॥ నామూర్తిపనికిఁకెవ్వరు। సామర్థ్యముదమదిదెల్పసాహాయ్యంబుం
బ్రేమముసఁజేయువారని। స్వామియదుగభృత్యుఁడిట్లుపలికెఁగుశలతన్॥ ౨౦౫॥

కం॥ కౌశికముఖగీర్వాణులు। కౌశికముఖసంయములునుగౌశికవచనుల్।
గౌశికముఖులగుప్రజలును। గౌశికముఖపత్నులుననఁగాఁబతియంతన్॥ ౨౦౬॥

కం॥ వింతలురానీసుతులుళ। కుంతములుందోడులెయహికులరిపులుండా
రెంతటివలంతులోబుష్టు। లంతటిబలవంతులౌదురౌరసుధాంధుల్॥ ౨౦౭॥

కం॥ కొఱమాలినయీపరకతె। నెఱితోడులతనికినన్నునిర్జింపంగన్।
బఱపునెరవలిఁబిడికెదు। గటికనుజల్లార్పఁగోరుకఱటియతఁడనన్॥ ౨౦౮॥

కం॥ గరుడుండుగాఁడెసహాయుఁడు। హరికమిత్రాసురహననమునందతఁడహిసం
హరుఁడుమునిభవుఁడునిఖిలవి। కిరదేవుఁడుగదయనిపలికెనుస్వశుఁడినుతోన్॥

కం॥ సింగముదామృగరాజని। పొంగునుమాతంగసంఘముంగెలుచునుబల్।
చెంగలువైచునుబొబ్బలి। డుంగడువలబోనునంబడుంగావెతుదిన్॥ ౨౧౦॥

కం॥ అని పోఁడాడఁగ వేగిటు । లనిమొనుదిన్నగను దేవ రాసింహమనన్।
దన రెప్పవనిరలఁ జెద । నని పటుబ్ము న రాకాఁజూ బియనుగుఁడ్ఁటులనెన్॥ ౨౧౧॥

తే-గీ॥ రగదెనిం పెూపమానంబు దగదుగాక । నీకుని పుడన్న న న్నెలనిన్నుమన్ని।
గొనెదననిక త్తినెుఱఁ బెఱుకనుగనుఁగొని । యద్దపడి జయబుద్ధి యయ్యాలుకమా న్చె॥

సాయంవృత్తము॥ ఆయాదిత్యుఁడు-న స్తమింపవిత్రుఁడు । ద్సేయన్సాంధ్యాను-సిద్ధకృత్యమాస్థన్।
దాయంహాళ్లన-దంగనందబింబు । బ్సాయంవృత్తము-జానుమిం టెంజూడన్॥

సీ॥ జానుమద్విక్రమ సద్ధామతరణినాఁదరణియ పూర్వాబ్ధిఁదా నెమునిఁగె।
ము క్తర్ణి నాసీరము ఘ్యమై మానికలనఁగనక్షత్రములగప దెదివి।
వెలనైనుసోఁమమూఁకల పొగబంప్ల చాళ్లనఁ బెనుచీఁకటులడరు మఁగడు।
మా క్తికమునిడనమాల్కవిస్ఫుటఁదెల్పు నాసుధాంశు రుబిధాని తెలలి।
జయముఁబొందివిబుసులుస్వోచ్ఛస్థిఁగను । కరణిన సురులునీవరిఁగాంచునట్లు।
జంగమస్థావరప్రపంచంబు నైన । వెన్నెలయి గానెనిరులు గ్రిందన్నదంగె॥ ౨౧౪॥

కం॥ ఘననిర్ఘోషము బృంహిత । మును హేషిరమునును మహాగ్రముగ త్యేద ఘం।
బునువినియినుఁడిదియేమనఁ । గనుమాయాసిద్ధుఁడిట్లుకదఁకన్నుడి వెన్॥ ౨౧౫॥

ద్రుతవిలంబిత॥ విజయమందఁగ-వేవిజయంబునన్ । విజయుఁడ ననఁ-జేర్చిన సైన్యుఁడై।
గజఘటాలము-ఖాయిరుఁదుగ్రుఁడు । య్యాజిరుఁడిమ్ముని-యప్పుడె వచ్చెఁగా॥

ఉ॥ వచ్చెనె చూడఁగా వలయువానిని వానిచమూపులన్ననై।
స్వేచ్ఛయమిత్రునాకనుచు నెుక్కఁడె దుర్గముపైకె నెక్కియ।
పక్కద్విరుఁడొప్పఁజెప్ప వెనుకోవిదరచ్చరిదంబులన్ననా।
రిచ్చరప్పగియేలమటియేపటివాపఁగ నేలచాలునాన్॥ ౨౧౭॥

కం॥ ఏరికయనెమాయాసి । ద్ధాలరిమిత్రుఁడనుగా నెరగనీకనవాఁ।
డెలిదమునిజమె ఊనిఁ । బోలఁగమిత్రుం డెవండుభువిరవిడక్కన్॥ ౨౧౮॥

ఆ-వె॥ నేను సేవకుఁడను నీకుమిత్రుండను । నంతఘునత నాకునబ్బునెట్లు।
వందపురిదినేష బలవదగాడిద । కాఁపుచేరఁజెచ్చెఁగాదెమున్ను॥ ౨౧౯॥

కం॥ నా కేఁడొడమనాప । న్మాతాదమమాపి చెప్పమాతద్వృత్తం।
బూజదుమనటోటనుదలఁ । దూటదిరోఁకటికెలవఁడాలఁగు నెయనుమన్॥ ౨౨౦॥

## మాాత్రికి సైన్య వర్ణనము.

కం॥ మాయాసిద్ధుండిటులనె । నోయనసజ్జానుమండలాగ్రునితోడన్।
నాయెడఁగోపింపకనీ । కాయవొ్పెత్తినవిరమునసంతయుఁజూపుదున్॥ ౨౨౧॥

ఉ॥ సూరెలవారువంబులువసుప్రకరంబులుగాఁగబాగుగాఁ।
చేరులువాని వెన్కరవిదివ్యరథప్రతిమప్రనాదముల్।
గారుచిరాయుధప్రభలుగాంచఁబ్రభాకరవిభ్రమంబుదే।
వారిని ఁయకాయరుచిఁబాయఁగనోయనఁజీకువాలిలన్॥ ౨౨౨॥

చ॥ పరిసరసంచరద్ద్విరదపాళిము దాళికులాళిఁబోలఁగాఁ
బరఁగుపదాతివర్గములుపజ్జను రేకులువోలెఁ గ్రాలఁగే
సరములభంగి సన్మనులు సన్నిధినుండఁగ నంగరక్షులై
కరము వెలుంగునానడుమఁ గాంచుముమార్తికుబ్రహ్మసన్నిభున్॥ ౨౨౩॥

మ॥ విపులోరస్స్థలలక్ష్మిదీర్ఘతరదోర్విక్రాంతశార్ఙ్గంబు నా
ర్యపరిష్కారసుకౌస్తుభంబు వనమాలాకారసత్కీర్తియ
ప్రసవంశాపళిదావపావకసమస్వర్ణాంబరంబుం ద్యుర
త్నపరామర్శికిరీటమొప్పె దురమానాథుండె ముక్తర్షియో॥ ౨౨౪॥

శా॥ కంఠేమింటను వెల్లవెల్లియొజపైగంగేందుశోభంగనె
మ్మంటల్గ్రిక్కెడుఁగన్ను జన్నిదము వున్నాగంబునుంబోలెడున్
గంటన్నవ్వన్నెలపల్కలంబు వులితోల్గానెప్పెడుం జొప్పడున్
ముంటంగ్రాలెడు వాలు గేలనెవఁడీ ముక్తర్షియాఁ జూడుమా॥ ౨౨౫॥

ఉ॥ కోశికుఁడోద్దఁదద్దయును గారవమారఁగనుండి వెండియుం
గోశవిభేదముం గజపనొక్కచు నక్కపిలుండు దెల్పసాం
ఖ్యాశయమున్ స్త్రీపాతవిధి నానడుమన్మన చాయఁ జూచుచున్
వేశరమేయఁ జూచుఁగన వేపురవైరియతండు గాఁడొకో॥ ౨౨౬॥

కం॥ అతనికిమనకనుముందు । ధృతిని సులక్షణుఁడువాఁడె తేజరిలెడుది
కృతిముఖ్యుఁడనఁగఁదూర్పున । నితఁడుగదా రథపతియయియెసఁగెడునుగడున్॥

కం॥ ఇతఁడతిరథికశ్రేష్ఠుం । డితఁడె జ్యేష్ఠుండుమార్తికేష్టిభవులలోఁ
బ్రతిపక్షకుధపక్ష । క్షతికరుఁడారయ సహస్రచక్షుండాజిన్॥ ౨౨౮॥

కం॥ పక్షిణమున పక్షించుము । పక్షుండధ్యక్షుఁడిభవితతికినుఁడుజగ
చ్చక్షుర్ఖ్యాతసదృక్షుం । డక్షజయుఁడులక్షణజ్ఞుఁడనువాఁడధిపా॥ ౨౨౯॥

కం॥ ఈతఁడగుదక్షిణాగ్నిగ । నీతని గెలువంగనగునె యెరికినేనిన్
ఖ్యాతిమద్దరులసహితులతఁ । బ్రీతికరుఁడుయజ్ఞభవుఁడువిజ్ఞవినుతుఁడా॥ ౨౩౦॥

కం॥ ఏచుసుబాహుఁడువీఁడుప్ర । తీచిన్వరుణుండనంగఁదీండ్రిలుఁగనుమీ
భూచరఖేచరగోచర । గోచరులందెవఁడుగాని కొనునే సమతన్॥ ౨౩౧॥

కం॥ పాదాతపతియితఁడగున్ । యాదఃపతికంటెనధికుఁడతఁడు మొసలికిన్
సాదియగు నితఁడురఘుపుర । గాదిసమారోహణచణుఁడానన దారయున్॥ ౨౩౨॥

కం॥ ఓరిమాయాసిద్ధుఁడ । మారీచుఁడవపుడవుటనెమఱియు సుబాహున్
బేరిమిఁబొగడెదకట్టుము । నీ రామాయణము దీచి నెఱిఁగంపమనన్॥ ౨౩౩॥

కం॥ ఉత్తరమేలినవారిసు । చిత్తమ్మునకిమ్ముగుటయె చెన్నొప్పఁదత్కా
ష్ఠోత్తరపతి గెల్పుటశివు । లత్తెనునర్చుటయనితగనాడెనువాఁడున్॥ ౨౩౪॥

కం॥ సువిలోచనుండువీఁడవు । నవనీశ్వరయేకపింగళాఖ్యునికన్నన్।
సువిపులసంపన్నుఁడురా । పవిజితనలకూబరుండుప్రబలుఁడుకలనన్॥ ౨౩౫॥

కం॥ అశ్వపతిచంద్రుఁడండమె । శశ్వజ్జ్యోత్స్నాయితాచ్ఛసత్కీర్తియెహో।
విశ్వైకమిత్రమునుమఱి । విశ్వేశ్వరహాశిలాల్యవిహితార్చనుఁడా॥ ౨౩౬॥

సీ॥ నేలయీనెననంగనింగివర్షించెనాఁడెమ్మెరదుమ్ముఁగాఁడెచ్చెనాఁగ।
నౌర్వాగ్నినెనుమంటలుర్విపైఁబర్వెనానీరధులిట్లయ్యెనూరసననఁ।
బుష్పవంతులుస్వాంశువులనీదృశములను జేసిరోయనఁగనురోసమునను।
మూర్తికమానియేమహితకౌశికమైత్రిఁబ్రతిసృష్టిఁజేసెనోప్రతిననఁగ।
నేఁడియీయష్టమూర్తియేయియీయనువున । నాయెనానాయనాకననంతమెనయ।
కన్నదీబలమింతనివెన్నఁదరమె । దేవరకెవేద్యమునివేగుదివిరిపలికె॥ ౨౩౭॥

ప్రహరణకలితవృత్తము.

కరముమెఱయఁగాఁ-గలరుగలనిలో । నరికరిహరులై-యమితబలముచే।
నరయనెదలితో-నవిగలుగుటనీ । వరభటులెపుడుం-బ్రహరణకలితుల్॥ ౨౩౮॥

అశ్వగతివృత్తము॥ ఎంతనునైపమనూర్థము - లీహరులోటనెకో।
పంతముమీఱఁగఁగాంచెను - బంచనుధారలరే।
వంతునివీఁపునమోచును - బైఁబ్రణవంబనఁగా।
నెంతయుఁగాంతముతోఁగను - మీమహితాశ్వగతుల్॥ ౨౩౯॥

కరిబృంహిత॥ మించునఱిమిఱిమేఘరవమును - మించువినుకరిబృంహితం।
బెంచఁగనుదరమేద్విరదములి - వేకరదనునిఁగేరునూ।
ఱించులడిదముభీతిఁగలదని - యట్టిగిరులహసించువే।
యంచుఁగయిదువదారికణఁగని - యట్టిదితిజులఁగూల్చెడిన్॥ ౨౪౦॥

రథోద్ధత॥ ఏపుమీఱుఁగను-మీరథోద్ధతం । బౌపరింద్రిజగ-దంచితంబునుం।
గోపురౌఘయుత-గోపురంబనం । జూపులోఁగొనెడు-సూర్యబింబమో॥

కుసుమవిచిత్ర॥ కువలయమందుం-గుసుమవిచిత్రం । బవువనమానా-నగపడునీనే।
నవివిధవర్ణో-న్నతిమదపానో । ద్ధవమధులిట్సం-తతివినుతంబై॥ ౨౪౨॥

నిశావృత్తము॥ పులుఁగులునిదురించు - ముద్రించుచుంజంచువుల్గౌశికం।
బులునిదురయులేక - పోరాడికాకంబులంగూల్చెదున్॥
గలకలరవమొప్పఁ - గావించుచుంబైఁడికంటుల్గదున్।
చెలిపెదుశకునాల - దేవానిశావృత్తమిట్లుండెడున్॥ ౨౪౩॥

కం॥ నావుడునుజానుమండలుఁ । డీవుహితముఁజెప్పితోప్పనిప్పటికనిసం।
భావించివానిఁబొమ్మనెఁ । గావలనీనఁదుటుముఁగొనుచుగ్రక్కననసికిన్॥ ౨౪౪॥

కం॥ అనమాయయానిద్ధుఁడుదన । మనమునజింతించియిట్లుమసలకపలికెన్।
ఘనునికగుఁగాకదావా । గ్నినార్చఘనశక్తిగల్గనేయన్యులకున్॥ ౨౪౫॥

కం॥ దేవేరిఁ గోరు నినుఁగను । మావరసతి మేలెసఁగఁగ నాశీస్సులిడున్ ।
దేవరకు విజయమానన । నావేలుపునూడు కేఁడు నరిగెఁబడకకున్ ॥ ౨౪౬॥

## శుభాంగి నీతి.

ఉ॥ వచ్చి శుభాంగి యిట్లనియె వల్లభ దుర్లభమయ్యె యియ్యనిన్ ।
మెచ్చఁగ గెల్పుఁ దెల్పవలెనే కలఁగంటిని నే నెమూర్తికిం ।
డిచ్చుట కేగుదెంచినను నేత్రైలబూదిఁ జేసి నీసుతున్ ।
సచ్చరితున్ను నీతినిఁ బొసంగను బట్టముఁగట్టినట్టులన్ ॥ ౨౪౭॥

చ॥ కనుక నుమార్తికిం దొడరి కాటియఁ బొందఁగ నేలపోలనీ ।
తనయునికీవె రాజ్యమిడి తెచ్చివ పుత్రుని కొప్పఁ జెప్పి వీ ।
డ్కొనుమన మెందునైనఁ జని ఘోరతపంబొనరింత మెంతవా ।
రునియతిఁ దాఁటఁ గాఁగలరె రోసము దోసము గాదె యేదమీ ॥ ౨౪౮॥

కం॥ కనుకను తనకం బెంగడు । ఘనుఁ డుద్ధతి నెత్తిరాఁ దగన్వినతియె మే ।
ల్గినుక నెదురొడ్డఁ గీడగుఁ । గన మే వెల్లువను రెల్లుగడ్డిన్మ్రొనిన్ ॥ ౨౪౯॥

తే-గీ॥ సార్వభౌమ యిప్పటికొప్పు సంధి నేఁత । సరగఁ జేయుము మనెదము చావ నిపుడు ।
బ్రదికియుండిన సుఖములఁ బడయవచ్చు । ననెడి యార్యోక్తినిఁ దలంపుమాదరింపు ॥

కం॥ అనిన విని జానుమండలుఁ । డనెఁ దన సతితో డశోభితాంగి నీవా ।
డిన దొప్పనైన నాదగు । మనమున కొప్పదు గదికిని మందననిందున్ ॥ ౨౫౧॥

కం॥ ఎందువలన నన నెఱుఁగవె । యింద్రాదుల గెలిచి లోకమేలితి నేనా ।
పందలు దెచ్చినవానికిఁ । గ్రిందై మననేల చావ గెలుపోయపుతన్ ॥ ౨౫౨॥

కం॥ గెలిచి మనిన సిరియగు నిట । గెలువక ఱిన నదియటన గుఁ గీర్తియొ సుఖమో ।
కలనఁ గను సౌరశూరుఁడు । హరియొ తగరొయగు తమంతకంతకు మేల్గా ॥ ౨౫౩॥

కం॥ అని గురుఁ డుపదేశించెను । గనుకఁ గడఁక విడక నేను గయ్యము సేయం ।
గను నిశ్చయించినాఁడను । మొనసినపని మాననా నెముగియింపకొగిన్ ॥ ౨౫౪॥

మంజుభాషిణి॥ మును నేను దిక్పతులఁ-బూని గెల్వఁగాఁ । జనునప్పుడెల్లనను-సంతసంబుతోఁ ।
బను తెట్టులట్టిపుడుఁ-బంపుమింపుగా । మనకుం జయంబొదవ-మంజుభాషిణీ ॥

తోదక॥ అననల సుందరి-యాదటఖేదం । బునుగనుటం దన-పొల్పుఱఁ దెల్పెన్ ।
గనులను నీరొగిఁ-గార్చుచునూర్చెం । దనులత వాలఁగ-దానవు శ్రీనాన్ ॥ ౨౫౬॥

కం॥ అంతం జింతాకులుఁడై । కాంతుఁడు గాంత నొగిఁ దేర్చెఁ గడుఁ గడఁకని శా ।
కాంతుఁడు గాంతోత్పలి నిన । దెంతో సంతృప్తిపఱచు నెసకమెసఁగఁగన్ ॥ ౨౫౭॥

ప్రభాత॥ అటుతనయాలిని-నాదరించి దైత్యుం । డటుతరువాత స-భాలయంబు సొచ్చెన్ ।
గుటిలతయామినిఁ-గుస్తరించి చంద్రుం । డటుపిదపంజర-మాద్రిన స్తమించెన్ ॥ ౨౫౮॥

ప్రభాత॥ దివి యల రిక్కలు-దీప్తిఁబాసెఁ జీఁక । ట్లవిసెను దిక్కుల-హా ప్రకాశమొందెన్ ।
రవియుదయించెను-రాజి లెందినాస్యం । బు విసస మంబది-వో ప్రభాతమయ్యెన్ ॥

## జానును ద్యుద్ధోద్యోగము.

మ॥ జయబుద్ధిప్రముఖుల్ప్రధానసచివుల్జానుంపఁగంగొల్వఁగా।
నయముంగోరఁగఁగార్యకర్తలగుమాయానిష్ఠముఖ్యుల్గడున్।
భయముంభక్తియుఁదోఁపఁజేయఁగనుసేవన్సింహపీఠింబగ।
జ్జయముంజేసినజానుమండలుఁడుభాస్వద్భాస్వరుండైతగన్॥ ౨౬౦॥

శా॥ దుర్గాధ్యక్షునిఁగాంచియిట్లుపలికెందుల్యుండునీకుండునే।
దోర్గర్వంబునశక్తియుక్తిసకలస్తుత్యుండవీవెప్పడుం।
దుర్గప్రాయుఁడవైతిమాకగుటనేదుర్గాసురాఖ్యుండవై।
దుర్గాధ్యక్షతఁగాంచిమించితివినీదుర్గంబుఁగాపాడవే॥ ౨౬౧॥

మ॥ అనఁగావాఁడిటులాడెస్వాత్రిభువనేశాబ్రహ్మవిష్ణ్వీశులుం।
జెనకంజాలిరెనన్నుమున్నరులునాచేఁజిక్కినన్స్రుక్కరే।
మునియామార్తికుఁడెంతవానిబలమున్మ్మాలింతునేలీలనై।
ననుస్త్రీఁజూడఁగనోడువాఁడనననానాఘుండుసభ్యాళితోన్॥ ౨౬౨॥

శా॥ హర్యక్షంబుమదావళంబులమహాహంకారహుంకారమై।
శౌర్యంబింపుగఁజంపుఁగాకయెలుకంజంపందలంపూనునే।
యార్యస్తుత్యుఁడెయాజితేంద్రియుఁడునార్యాలోకముంజేయునే।
కార్యజ్ఞుండితఁడైనఁగానరుపలెంగానోపునేమోకదా॥ ౨౬౩॥

చ॥ అనజయబుద్ధియిట్లనియెనక్కటమిక్కిలియక్కజుండువే।
ర్కొనఁదగువాఁడువీఁడబలకుంబుయిలోడెడువాఁడెయేమనం।
జనునలచండముండులనుసాయముగానెనరింతమంతనీ।
ఘనుఁడుజయించుమించిమునికాండముదైవతకాండమున్వడిన్॥ ౨౬౪॥

చ॥ అనఁబతిచండముండులనయంబునఁజేరఁగఁబిల్చిమీరలీ।
ఘనునికిదుర్గపాలునికిఁగండుసహాయులటంచుఁజెప్పిమై।
పెనయఁగనొప్పగించెనుసుపీషణుగెల్వఁగఁదానెపూనెమా।
న్యునిజయబుద్ధివెన్కకడనుండనిదేశమునేసెవానిగన్॥ ౨౬౫॥

కం॥ అరులాజుగురాజూర్మ్ములు। వరమండలముగనుదనసుఁబరఁగఁగనుంతెన్।
వెరవునసుద్వాదశారము। కరణిసునీతిపితశత్రుకర్షణబుద్ధిన్॥ ౨౬౬॥

## మార్తిక జానుమండల సైన్య యుద్ధము.

కం॥ రాజాజ్ఞందుర్గానురుఁ। డాజిన్సూచింపనెత్తెనాత్మీయంబౌ।
భ్రాజచ్ఛంఖముదుర్గవి। రాజితముంజేసెభయదరక్తధ్వజమున్॥ ౨౬౭॥

శా॥ ఆకాశస్పృగుదగ్రదుర్గశిఖరప్రాంచచ్ఛతఘ్నీవ్యంబుదా।
నీకాగ్నిద్యుతివిద్యుదావళిమహానిర్ఘోషనిష్ఠ్యూతనా।

నాకారోగ్రతరోరుగోళచయ ఘోరాసారముం జేసెలో।
కాకాలప్రళయంబనంబటిమదుర్గాఖ్యుండు దుర్దాంతుఁడై॥ ౨౬౮॥

ఉ॥ కావిరిగ్రమ్మినట్లు పొగ గ్రమ్మఁగఁ గన్నులు గానరాక పోఁ।
గావడి భమ్మభమ్మనుచుఁ గాలఁబిరంగులు రివ్వురివ్వనన్।
రాఁబెను గుండ్లు ఘోరభిదురంబులు గానయి తాఁకనిల్వలే।
కావడి సోహటించి వెఱఁగాంచెను బాణనుమాని సైన్యముల్॥ ౨౬౯॥

ఉ॥ రక్కసులందఱొక్క మొగిఁ గ్రాఁగిన దండి పిరంగి గుండులై।
యుక్కునఁ జక్కడంపఁగ మహోద్ధతి వెల్వడి రోయనంగఁ బ।
ల్వ్రిక్కలఁ జేసెన వ్వపలు వ్రయ్యలుగా నెగివాని లోనివా।
పెక్కులు గుండులున్సరెలు పెక్కురముక్కలఁ జేసె నెక్కుఱన్॥ ౨౭౦॥

చ॥ అలజడిగాఁగ గుండ్లదిమహాశనివర్షము మాని సేనకే।
యలజడియయ్యెముక్తబలమయ్యెనుముక్తబలంబుకోటితే।
రులు నుఱుమయ్యె నన్నిలె గెరోఁజుచు రౌతులతో డగుఱ్ఱముల్।
వెలుకుఱికూలె నేనుఁగులు పీనుఁగులై యెటులై రొయంఘ్రుగుల్॥ ౨౭౧॥

ఉ॥ అంతనితాంత చింతను మహామునిమార్తికుఁ డొందినివ్వఱన్।
జెంతనె యున్న కౌశికమునింగని యేమిది నాన తండనెన్।
వింతయిదో మయుండనెడు విశ్రుతదైత్యుఁ డొకండు దీనిఁదా।
నెంతయు నేర్చి రాక్షసులకిచ్చె శతఘ్నికళావిశేషముల్॥ ౨౭౨॥

ఉ॥ చూచితె దుర్గ పర్యమదిసొంపఱికాలెదు మాడ్కఁ జూడ్కకిం।
దోఁచుచునున్న దెన్న హరదోర్గ్రప్రభ వుండవు గాన నాఁజుమీ।
నీచులు దైత్యులారయఁగ నేరరు చూతురు గాతమీతఱి।
న్నాచతురత్వమం చొకక్షణంబున సృష్టినిఁ జేసెఁ జేసినన్॥ ౨౭౩॥

చ॥ అకలితరథ్యముల్చతురయాంత్రికకల్పితభూఖగంబులు।
న్వికలితధూమముల్భిదురభీకరగోళసువర్ణముల్వలా।
హకతులితంబులద్భుతమహాగ్నిమయౌషధసద్విశేషముల్।
ప్రకటశతఘ్నికాశకటరాజులురాజిలెఁ గోటికోటిగన్॥ ౨౭౪॥

చ॥ మునిదనుజేట్ఛతఘ్నులను బుట్టిముఖాముఖిఁ దాఁకు గుండ్లు వీఁ।
కనునిరువాఁగులంగలము గల్దగఁ జేయుదురింకఁ గయ్యమి।
ట్లనున నరక్కరక్కనిరయంబు మెఱుంబలు ప్రక్కలై యిలం।
గనుకనిరాలియందఱను గ్రచ్చఱఁగూల్చెను బిడ్గుతునక్కలై॥ ౨౭౫॥

శా॥ గుండస్థంబు గఁదాఁకకున్నఁ దొలఁగంగొం తేనియుం దాఁకిన।
న్నిండారన్వడి నిల్వకేగి యొరులన్నిర్మూలముం జేసెగుం।
ఢ్లొండొంటిన్సమమించి పోవఁగ నెహో హో హోతోఁ చెవ్యాఘాతమం।
తండంఘమ్మన కొక్కమిక్కుటపు నాదం బెట్టి దోపుట్టెఁగా॥ ౨౭౬॥

మ॥ బలవన్మానిశతఘ్నికాభ్రవిగళజ్జ్వాలాభరేరమ్మదో।
జ్జ్వలనిర్హ్రాదవిగర్జితాయసమహాజాజ్వల్యమానోగ్రశ।
స్త్రిలసద్గోళమహాశనిప్రకరవర్షంబుద్ధతింజూపెనే।
పలరన్ రాక్షసపత్తనప్రళయకుంచాదిత్యులెంచంగడున్॥ ౨౭౭॥

కం॥ నూతనశతఘ్నికాని । ర్ఘ్యాతాతతగోళలహరినొక్కటఁగూలెన్।
రాతిరిద్రిమ్మరికోటయుఁ । జేతోహరహర్మ్యములుగుచిత్తునిరులన్॥ ౨౭౮॥

కం॥ కోటయెబురుజులతోబలు । మీటగుమాడుగులతోడమెయ్మొయిదమ్మై।
పాటిగనగ్దపూడెను । బోటరిరక్కసులగరులుఁబొసఁగునెపలుకన్॥ ౨౭౯॥

కం॥ ఓయనదండాపూప । న్యాయమునటఁజెప్పనెప్పనప్పుడొదవెన్వా।
హాయనుపదమక్షరయుగ । మాయెనుమునిదనుజసేనలందుఁగ్రమముగన్॥ ౨౮౦॥

కం॥ పాలాళంబునదాఁగిరి । ధీరినిఁగడుదనుజులెల్లవిద్దనివారల్।
భూతపతిపుత్రుఁడత్తఱి । ఖ్యాతిగనాగ్నేయమస్త్రముదరించుటయున్॥ ౨౮౧॥

శా॥ నిశ్శబ్దంబుగనయ్యెనయ్యదనునన్నిట్టాలసంచారరా।
ద్దుశ్శీలాయితదుర్గమగ్గలికఁదోద్ద్తోవారుణాస్త్రంబునుం।
దోశ్శక్తిద్యుఁడుమాక్తికుండువఱపెందోషాచరాంకూరముల్।
దుశ్శార్యోజ్జ్వలముద్రసాతలమునందున్నిల్వకన్వెల్వడెన్॥ ౨౮౨॥

ఉ॥ అంతకుముందెకౌశికుఁడుస్వాత్మనెఱింగితుపాకులన్ననీ।
ధ్ధాంతముగాసృజించిసుభటావళికిచ్చితదీయకృత్యమున్।
సాంతముగాఁగనేర్పనయనాదరమొప్పఁగనేర్పనేర్పడం।
బంతముమీఱబంట్లనికిఁబ్రబ్బినయుబ్బునసిల్చికాల్చుడున్॥ ౨౮౩॥

ఉ॥ అంతటఁబోరుఘోరముగనయ్యెనుజయ్యనమానిదానవా।
నంలచమూద్వయంబునమహాహవశూరులుద్వంద్వయుద్ధము।
త్యంతముగానొనర్చిరపుడయ్యనిడయ్యనివారువేరుడు।
ర్దాంతముగాఁదుపాకులనుదాఁగ్కొనికాల్చిరిగుండ్లుగండ్లుగాన్॥ ౨౮౪॥

శా॥ తోటాగ్లేపులుపెట్టుటొత్తుటయుఁగెల్డోఁపంగరాదొక్కటన్।
నూటింబాఱెడుగుండ్లురొయ్యనుచునచ్చోఁగ్రొంజడింజొప్పడం।
జాలెంబెన్దుములంబుగాఁదొడఁగినన్నన్నీనుపోటుల్గదుం।
బాటిల్లెంగరవాలుచిమ్ములనొగిన్వర్థిల్లెస్పర్థోక్తులెన్॥ ౨౮౫॥

కం॥ నఱుకులగుండ్లంబడిపడి । తఱచుగరూపఱుటరథ్యలండంబులతో।
నఱవఱలగుటశతాంగము । లఱిముఱినటనయ్యెమఱిశతాంగములహాహా॥ ౨౮౬॥

కం॥ పలుపఱియలుగనునఱుకం । బడియునునేనుఁగులునేలఁబడకరిదిగము।
న్నిలిచినయట్లేయుండెడుఁ । జెలువగుకీల్బొమ్మలనసజీవంబులనన్॥ ౨౮౭॥

కం॥ వేటాఱుతునియలనిమెడి । మాటకపుడులత్యమనిసమకొనియెరౌతుల్।
నూటిగనఱుకఁగరెండుగ । ఘోటముపల్లంబురౌతుగొఱలుటచేతన్॥ ౨౭౮॥

కం॥ నఱుకఁబడినతలయరితలఁ । గొఱికియొకఱచియొముగించికూలున్నేలన్।
మఱినిలిచినమొండెమురిపు । నఱికియొపొడిచియొకెడపియనంతరముపడున్॥

కం॥ పొడిచినసన్నీనులఁదముఁ । బిడికిళ్లన్నశికములనువెసఁబట్టికడుం।
బొడిచికొనిచెంతవచ్చినఁ । బొడిచిరినఱికిరలయరులఁబోటరులలుకన్॥ ౨౮౦॥

కం॥ మునుపడ్డపీనుఁగులపై । వెనుకనిలిచియున్నభటులువీరావేశం।
బునఁగనకత్రొక్కుచునుజని । చనిపగతురఁగూల్తురౌరసంరంభమునన్॥ ౨౮౧॥

కం॥ పలుబల్లెంబులునీటెలు । బలుబాకులుఁబిడియములునుబరశువులనులున్।
బలిమిఁదమపనులుముగియదొ । రలుదొరలంబఱియలయ్యెరణరంగమునన్॥ ౨౮౨॥

కం॥ రక్కసులక్రందడంగెం । జక్కగముక్తర్షిపదగసైన్యమునచ్చెన్।
మిక్కుటముగానుబాహువు । ప్రక్కగెలుపుఁదెలిపెనిడమువాఁగెఁబిరంగుల్॥

కం॥ అక్కరణినెల్లకడలం । డెక్కెములుఁబిరంగిమ్రోఁతడెప్పరముగనే।
పెక్కెమునిసేనలందుం । బెక్కులువాద్యములుగెలుపువెలయందెలిపెన్। ౨౮౪॥

## మౌక్తిక దుర్గాసుర యుద్ధము.

కం॥ కనివినిదుర్గాసురుఁడ । మ్మునివిజయద్యోతకాంకములనైఁపకయే।
చెనుజత్మశ్శ్రీవముఱకే । చినజనునింగఱువనుఱుకుచిన్నెయెసంగన్॥ ౨౮౫॥

చ॥ కనుఁగొనికేతుతత్త్వమునుగ్రక్కునసెక్కవిమానమెక్కిమిం।
టనెగనినూటిగాఁగనువెడందగభూవలయంబునున్నగాఁ।
గనియెశతఘ్నిగోళగతిఁగాంచెనవక్రనురేఖలంగనుం।
గొనెనిదిరాహుతత్త్వమనిగొబ్బునఁగ్రిందికివచ్చిచెచ్చెరన్॥ ౨౮౬॥

చ॥ సొలయకదానవేసులనుశుంభనిశుంభులఁబూర్వపశ్చిమం।
బులకునుజండముండులనుబొందుగఁబంపెనుదక్షిణోత్తరం।
బులకునుదానుబైనరిగిముక్తమునీశ్వరుఁడాఁకెవీఁకమై।
బలసహితంబుగంబొరిఁబ్రపంచముపంచతఁగాంచనెంచెనాన్॥ ౨౮౭॥

శా॥ శుంభుండంతనులక్షణుంగనిమనఃక్షోభంబునంబోరెసం।
రంభంబొప్పఁగమూర్ఛపండితునివైరంబారఁగాఱించుమా।
డిక్కంభంభమ్మనిచిందమాడుచుఁదుపాకింగాల్చెఁబల్మాఱుప్రాం।
రంభింపండుఱకయ్యభిజ్ఞుఁడనికిన్రాజిల్లెనాశుంభుఁడే॥ ౨౮౮॥

మ॥ ఘనుఁడాచండుఁడుచండశౌర్యుఁడుజగత్ఖ్యాతుండుచండాంశుభూ।
తనిభున్విజ్ఞునిలక్షణజ్ఞునివడిందాఁకెంబ్రయోగోద్ధతిం।
బ్రణుతాశేషగురుండతండదరహోరాహోరిగాఁబోరుమీ।
ఱెనుజండుండెజయించెమించెనిలుదూఱెన్లక్షణజ్ఞుండనిన్॥ ౨౮౯॥

చ॥ పిదపనిశుంభుఁడుందొడఁగెఁబిస్టలుగాల్చుచునాసుబాహుతోఁ।
గదనముసేయనాయనయుఁగాంచిహసించిఘటాలనంగబె।
ట్టిదముగఁగొట్టిచెంపఁగడుడెప్పరముంగలిగించిపిస్టలే।
పొదవఁగలాఁగికోఁగఁదగవోయనియార్చెనిశుంభుఁడెచ్చుగన్॥ 300॥

ఉ॥ ముండుఁడుగండుమీఱియలమోహనునిన్సవిలోచనుంజగ।
న్మంథనుగోప్రకాండములమ్లానితుఁజేసెనుగోలఁగోడలిన్।
ముండయినత్తమొత్తుక్రియముద్దగునస్యమునల్చినట్లుగా।
దండముచేతఁదద్బలముఁదార్కొనిమూర్కొనెఁజేసిక్రొంబొడిన్॥ 301॥

మ-స్ర॥కడఁకన్ముక్తర్షిఁదాఁకెం - గడువడిఁగడిమిం - గర్విదుర్గాసురుండ।
ప్పుడతండుంచారసిల్లెం - బొరిబవరముగాఁ - బొంచికాంచెంబుధాళుల్।
జడిగాబాణౌఘముగ్రా - స్త్రములుపిడుగులై - చాలఁగ్రాలంగఁగాలుం।
డడరెన్నాదుర్గదైత్యుం - డధికుఁడయిమునిన్ - వ్యాఘ్రునింజేసిత్రోసెన్॥ 302॥

## దుర్గా విజయము.

తే-గీ॥ అపుడుముక్తర్షిదుర్గదైత్యార్దితుఁడయి । బిలుకుమాఱడునెట్టనవీఁడుఁజండ।
ముండశుంభనిశుంభులుముదితచేతఁ । గానితెగరంబగలదనిగాధిజుఁడనె॥ 303॥

స్రగ్ధర॥ కావన్రావమ్మమమ్ముం - గరుణనునిమిషా - కాళికాభద్రకాళీ।
కావేనీవేనతార్తి - క్షయకరివరినిం - గాసరుంగూల్చవేము।
న్నీవేళన్వ్యాళమిందున్ - హితమునెనరుతే - నింపుసొంపొందమాకో।
దేవీయీదుర్గముఖ్యా - దికమసురతతిం - ద్రెంపుమాయింపుమింపా॥ 304॥

రథోద్ధత॥ కోరనిట్లతఁడు - గొబ్బునన్మహా । హీరవాహయయి - యేగుదెంచెనా।
క్రూరశక్తిబహు - ఘోరహేతులన్ । బారణంగొలుపఁబ్రబ్బునుబ్బునన్॥

ఉత్సాహము॥ ముందువెన్కలారయకయె - మున్నిశుంభశుంభుల।
య్యెందుమాళితోడఁబోరి - యెఱిఁగిరెరగలిదియటం।
చందుమిడుతలగుచుమంది - రౌరశుంతులీడ్యులన్।
గందురెట్లుగౌరవముగఁ - గనకమానభంగమున్॥ 305

సుగంధివృత్తము॥ వచ్చిదుర్గదైత్యుఁడెందుఁ - బాఱెనున్ననిష్ఠతా।
వచ్చుఁగాకయంచునల్కఁ - బల్కఁజండముండులున్।
వచ్చితాఁకిరాకెవారిఁ - బట్టికట్టిగొడ్లనాన్।
వ్రచ్చెనిచ్చెసింహరాజు - వాంఛితంబెలర్పఁగన్॥ 306॥

పంచచామరవృత్తము॥ఎఱింగియాత్మమృత్యువీమృ - గేంద్రమధ్యయంచుఁదా।
మఱింగియున్మజుంగఁగోరె - మానహానికోర్వలే।
కుఱుందుప్రాణమాటచేత - నుత్సహించెఁబోరనే।
ర్పెఱుంగుఱాలువేయిగల్గు - తేరినెక్కియుక్కునన్॥ 307॥

శా॥ హర్యక్షోపము శౌర్యుఁ డుద్ధతుఁడు దుర్గాఖ్యుండు మర్త్యారియా।
హర్యశ్వాశ్వను ఖడ్గ ఖేటధర శూలాభీలనీకించియో।
హర్యక్షేంద్రను మధ్యనీవు గద చూయందున్న క్రుముందించితే।
హర్యక్షుండను గెల్తువేయని గదన్ హర్యక్షి ముక్త్రేయఁగన్ ॥ ౩౦౯

కం॥ ఆసింగంబత్తాఁకున । కోసరిలం జేసె జతనము మయున స్త్రైనన్।
గానింబడిప డెఁబుడమిన । హాసింహము గ్రాముసింహ మయ్యెననంగన్॥ ౩౧౦॥

ప్రభాకలిత॥ హరిహయుఁ డప్పుడె యొప్పగించె స - హస్రవాజివిరాజితం।
బరదము నాయుధ సంభృతంబు స - హస్రధామరథోపమం।
బరిభయదంబును హరిసింహము - హాధ్వజంబు మనోహరం।
బరుదని లోకము లెల్ల మెచ్చన - హాప్రభాకలితాఖ్యమున్॥ ౩౧౧॥

మత్తకోకిల॥ పొంగి కైకొని దానినయ్యుమ - పొంతనున్న శుభాంగిభూ।
తాంగి నాఁగను బేరుగన్నుమ - హామహన్వరశక్తినె।
ప్పంగ సారథిఁ జేసికొంమను - బల్విడింబ వరంబునే।
యంగడం గెను సూర్యకోటిస - మాద్భుతప్రభయై యటన్॥ ౩౧౨॥

తరళ॥ అపుడు దుర్గమహాసురుండుమ - హామహుం డిషువర్షమున్।
విపులమై యెసఁగంగఁ జేసెను - విశ్వమాతృకపైవడిన్।
కుపిత దానవశక్తియాయమ - కాండవృష్టినిఁ జెసియ।
స్రపుని సారథినిన్ హయంబుల - స్యందనంబును గూలిచెన్॥ ౩౧౩॥

ఉ॥ చావకతప్పి వాఁడెటులొ శౌర్యమవార్యము గాఁగనింగినుం।
చావడి వాలుఁ దోలుఁగొని యాఘనశక్తిని వ్రేసె వ్రేసినన్।
దేవియుఁ బంచవస్త్రిపయిఁ దేజరిలెన్ హరిదుర్గపెద్దలన్।
గైవడిమిఱఁగాఁ జఱచెఁగ త్తినిఁ గుత్తుకఁ గోసె దుర్గయున్॥ ౩౧౪॥

భు॥ పడెం దుర్గుమూర్ధంబు - ప్రాగ్గోపురంబై । పడెన్వాని మొండెంబు - ప్రాకారమో నాన్।
బడంవాటి రెండున్ దక్షపాచారులార్యుల్ । గడుం గూడిరద్దుర్గఁ - గాశింభజింపన్॥

చ॥ పదపడి మూర్తికాదిముని వర్గమునింద్రముఖామరౌఘమున్।
సదమలభక్తియుక్తినలచండిని మెండుగఁ బ్రస్తుతించెనో।
పదయతలంతు మేము నినుఁ జంపకమాలిక పోలికన్భువ।
ల్పదమును దుర్గ ముఖ్యమధుపప్రకరంబు భజించుట బ్రహ్మా॥ ౩౧౬॥

కం॥ దుర్గాసురుఁ డా సంసృతి । దుర్గతి యది దాని మాన్చి స్తుత్యవయిత్రివో।
దుర్గా నినుఁ గొల్చినఁ గద । స్వర్గము మోక్షంబుఁ బడయఁ జను జనతతికిన్॥ ౩౧౭॥

కం॥ దుర్గా నమస్కరింతుము । దుర్గమ సంసారవార్ధిఁ దోఁగకయుండన్।
వర్గత్రయమును మఱియప । వర్గము మాకీవె లోకవర్గస్తుత్యా॥ ౩౧౮॥

కం॥ తాందుర్గామనుమంత్రము । దుందుర్గేయనుమనువునుదొడఁగిజపింపం।
గందుమఖిలమునుదుర్గా । కందుముగదనీపదమునఁగలశామృతముౕ॥ ౩౧౯॥

తోటక॥ అనియిట్లునుతింపఁగ-నంబయుబా । గనియాశ్వయుజంబున-నష్టమిరాౕ।
దనుఁగొల్వుఁడుమీకవు-దాననుమే । లనిదిచ్చెమొగంబుగ-నయ్యెనటౕ॥ ౩౨౦॥

## ఉభయ సేనాపతి యుద్ధము.

చ॥ గొనకొనిమాక్షికుండుపురికొల్పఁగనాకడజానుమండలుం।
డునుదమవీరవారముఁగడుంగడునయ్యెనుగయ్యమయ్యెడౕ।
గనదినరాత్రులొక్కమొగిఁగావరమెక్కఁగఁబోరుతీరునం।
దనరెను రెండువాహినులఁదార్కొనురక్తముసాంధ్యరోచిగాౕ॥ ౩౨౧॥

మ॥ జయమాబుద్ధినెయంచునెంచుచుమహాశౌర్యంబునన్నించుటౕ।
జయబుద్ధిప్రదితుండహమ్మతియగున్సాంఖ్యప్తసంకేతనా।
మయుతుండాతఁడులక్షణజ్ఞుఁజెనకెౕమాన్యుండుబ్రహ్మజ్ఞుఁడా।
ప్రయతుండోడకపోరెఘోరముగసారథ్యమ్ముఁడత్యుద్ధతిౕ॥ ౩౨౨॥

శా॥ బంధించెంజయబుద్ధిపాశములచేబద్ధుండుగాకాజగ।
ద్బంధుండీడ్యుఁడులక్షణజ్ఞుఁడరినిౕదార్కొల్పెఁగాలాతిథిం।
గంధార్థ్యంబునబాణశూలములనుక్కంపేసియొక్కమ్మడిౕ।
సింధుప్రాయముగాలధర్మమడరంజిత్తోన్నతుల్నిల్చెనే॥ ౩౨౩॥

తే-గీ॥ సర్పవృశ్చికరోములన్సంజ్ఞలఁగల । దానవులుమాక్షికునిసేనఁదార్కొనిరట।
నయ్యెఁబెల్లాచెదరుగాఁగనయ్యదివెఱఁ । బాఱెనెరయంగఁదేల్లనుబాములునెగి॥

కం॥ ముక్తేశుఁడాసరీసృప । యుక్తిన్రూపఱఁగఁజేసెనుచిత్రక్రియనా।
నక్తంచరులనుబాహుఁడు । త్యక్తగరుత్కుక్కుటములననఁదెగనఱికెౕ॥ ౩౨౪॥

సీ॥ నానాలతావేల్లితానోకహంబులువామాసమాశ్లిష్టవరులఁదెలుప।
వివిధబంధవిచిత్రవిభవోరుహర్మ్యముల్సంభోగశృంగారసరణినెఱప।
సురభిళచందనసుమదామధూపముల్భక్ష్యభోజ్యాదులుభ్రాంతిఁగొలుపఁ।
బఱపులనెఱపగువనితామణులురత్నభూషణభూషితల్పొందుసలుప।
నున్నయట్లుచూపెనోలిమాయానిద్ధుఁ । డాటవెలఁదియభినయంబువోలె।
నార్షికులగుయోధులందఱామాయకుఁ । జిక్కిసుఖులమాడ్కిఁజొక్కపడిరి॥

కం॥ అక్కారునరక్కసులొగిఁ । జక్కాడిరియార్షికులనుజాలమునందుౕ।
జిక్కినమీలంబోలెం । గ్రక్కునమాక్షికుఁడుమాయగదుమాయించెౕ॥ ౩౨౭॥

ఉ॥ ఆయెడమంచువోలెవిరియంగనుమాయయుఁగొండమాడ్కివాఁ।
డాయెనుగానమాక్షికుఁడహర్పతితేజుఁడుశూలరోచిన్నై।
యాయసురన్స్వరంధ్రునిఁగనాదటఁజేసెఁబరాసుఁగాజగ।
ద్గేయుఁడుశూరుఁడేచిననధీరతమోనివహంబునిల్చెనే॥ ౩౨౮॥

శా॥ విద్యుజ్జిహ్వుఁడనంగదైత్యుఁడొకఁడవ్వేళన్ స్వకీయానన।
ప్రోద్యద్వహ్నిశిఖావళిన్మునిబలంబుందావకీలావళిన్।
మాద్యత్క్షుద్రపతంగసంఘముననన్ మాడించికేడించె థీ।
రాద్యుండమ్మునివారుణాస్త్రమునఁజల్లార్చెన్ శిఖిన్వానినిన్॥ ౩౨౯॥

కం॥ శాంతరసైకాదరుఁడై। సంతతయోగంబుసలుపు సంయమియతఁడ।
త్యంతయరౌద్రరసైక। స్వాంతుండై తోఁచెఁగాలభైరవుఁడనఁగన్॥ ౩౩౦॥

కం॥ మొనయన్న ప్రశతాక్షౌ। హిణులయితగుమూలబలము నెక్కటిచక్కా।
డెనుముక్తేశుండొకదిన। మునశస్త్రాస్త్రములరుద్రభూతుఁడుగాఁడే॥ ౩౩౧॥

ఉ॥ ఆదటజానుమండలుఁడుస్వానుగులెల్లరుఁ జెల్లుటంబొదల్।
ఛేదమునొందనొంటిగనుజిక్కినప్రమాఁకనఁబొల్చెనిల్చెనిం।
పేదియునేవువీడకమహింగుబుసంబుదొరంగినంబొరిం।
బాదజనింపవైపెషలఁబాఱెడుపాముసఁదప్పియప్పుడే॥ ౩౩౨॥

చ॥ చనిపొడగాంచిశుక్రునికిఁజొఁగిలమ్రొక్కిగురూత్తమాదయం।
గనుఁగొనుమయ్యమున్నసురకాండముసచ్చినఁబుట్టువెండియున్।
మునుకొనినీమహామహిమఁబొందెడలందగునయ్యాయియ్యెడన్।
మనఘనసైన్యమెల్లఁదెగెమన్నవెస్వాశ్రితరక్షణక్షణా॥ ౩౩౩॥

మ॥ అనియెంతేనియు వేఁడనోడకుమటంచాచార్యుఁడత్యాదృతిన్।
బెనుపొందన్మనిచెందళంబులనుబృథ్వీదేవిభారార్తయై।
వనటంబొందఁగనమ్మెనల్గరముచేవన్మించియేతెంచెన।
ద్దనుజాధ్యక్షుఁడుజానుమండలుఁడుప్రోద్యద్దీప్తిఁబొల్చెంగడున్॥ ౩౩౪॥

శా॥ అంతన్మౌక్తికుఁడావునర్జనితసైన్యవ్రాతముంగాంచితాఁ।
జింతాసాగరమగ్నమానసుఁడునై చేయంగనేదేనియున్।
స్వాంతంబందుస్ఫురింపమిన్మునినివిశ్వామిత్రునింజూడనా।
శాంతారాతిసృజించెయంత్రమయహాసత్సైన్యముంజయ్యనన్॥ ౩౩౫॥

కం॥ ఆరెండుదండులుంబోరిఁ। బోరాడెంభువినిదివినిభువనమునందున్।
శూరతసింహాఖగేంద్రో। దారోగ్రతిమింగిలగిలతతులవితమునన్॥ ౩౩౬॥

తే-గీ॥ జానుమండలుఁడొక్కండెసంహరించె। మానిసైన్యంబునంతయుమత్తహస్తి।
తొడరితామరగమినెల్లఁద్రుంచుకరణిఁ। దన్మహాశక్తిఁగనిజగత్త్రయమువడఁకె॥

ఆ-వె॥ మౌక్తికుండొకండెమంత్రశక్తినిఁజేసి। సోఁకుమూఁకయందుఁజొనిపెభ్రాంతి।
దానసొండొరువులుదానవుల్దమలోనె। శత్రుబుద్ధిఁజంపిచంపఁబడిరి॥ ౩౩౭॥

మాలిని॥ కనుఁగొనివిబుధుల్మ - క్తర్షినింజక్రభావం।
బునుగనిరిసురారు - ల్వాందిరోఘూకభావం।
బునుద్యుమణివెలుంగం - బొల్చునేచీఁకటుల్వే।
ఱ్ఱనుగనిరటనిర్వ్వర్ - కౌశికుల్వింతయొఁగా॥ ౩౩౮॥

మ॥ వెలయంజాలసులక్షణాదికచతుర్వేశులాస్యాభులై।
చెలఁగంగాధిజముఖ్యమానులువసుశ్రీమద్భుజప్రాయులై।
యలరంగానుజడాజడంబులగుసైన్యంబుల్ప్రదాభంబులై।
యలముక్తేశుఁడుజానుమండలునిడాయన్వచ్చెనీశుండనన్॥ ౩౪౦॥

మ॥ హతశేషాసురసైనికుల్గలభశోభాఢ్యుల్గనుంగొల్వఁగా।
వితతాయోధనసాధనాన్వితమునైస్ఫీతాశ్వయుక్తంబునై।
ద్రుతయానంబగుస్యందనంబుసగరుత్మోణీధరాకారమై।
జతనంబారఁగజానుమండలుఁడుమెచ్చన్వచ్చెఁబోరంబోరన్॥ ౩౪౧॥

## మౌక్తిక జానుమండల ద్వంద్వ యుద్ధము.

శా॥ ముక్తేశుండునుజానుమండలుఁడునెప్పంగాంచిరయ్యుద్ధమున్।
యుక్తాయుక్తవచోవిశిష్టులగుచుంబ్రోత్సాహులైజెట్లనన్।
శక్తంబుల్వరపుండరీకములనన్మత్తేభముల్నామహా।
శక్తిద్యంబులుసింహవర్యములనన్శక్రాహులోనానెగిన్॥ ౩౪౨॥

మ॥ కవచుల్సన్మకుటుల్శరాసనధరుల్ఖడ్గోరుఖేటాన్వితుల్।
ఛవిమచ్చక్రగదాత్రిశూలకలితుల్శక్తీడితుల్శాంఖికుల్।
వివిధాస్త్రాంచితులిద్ధతేజులురణస్ఫీతుల్సుకీర్తుల్రణో।
ద్ధవులామౌక్తికజానుమండలులుబద్ధస్పర్థులైరుద్ధతిన్॥ ౩౪౩॥

చ॥ అతిరథులస్త్రశస్త్రవిదులాహవదోహలులభ్యుపాగతుల్।
చతురులుసత్కళాఢ్యులువచస్కుశలుల్వరవీరశేఖరుల్।
ధృతియుతులున్ధృతాయుధులుదృప్తులుదీప్తులుధీవిశాలురుం।
బ్రతికృతిరామరావణులభంగినెసంగిరివారలిర్వురున్॥ ౩౪౪॥

కం॥ ఆజానుమండలుండవు। డాజటితోఁబలికెనిట్లుయమియనినీకే।
లాజుఁగుమునాకెనగాఁ। డాజినిద్రాత్రిమూర్తులందెవ్వండున్॥ ౩౪౫॥

ఉ॥ నీవననెంతమర్త్యుఁడవునిల్తువెమాయెదురన్నరాదులన్।
గావరమొందిమానవుఁడుగానకచేరుటవంటయింటిలోఁ।
దావడివచ్చికుందెలదిదాఁటుటగాదొకొనీదుక్రొవ్వుమా।
కోవరమారిగొట్టియలుక్రొవ్వినగొల్లనికౌనులాభమే॥ ౩౪౬॥

కం॥ నాఋషియోరీరాక్షస। నోరికివచ్చినదియెల్లనోనాడెదునీ।
సారమిటఁదెలిపితివిమే। ల్గారవమునమొఱుగుకుక్కకఱవంగలదే॥ ౩౪౭॥

కం॥ రక్కసులక్కఱమనుజుల। మెక్కుదురదిసహజముగదమేటిమగలుదా।
రుక్కుననరులెందఱినిన్। రక్కసులందునుమరైరిరాక్షసకనవే॥ ౩౪౮॥

కం॥ జగదపకారులురాక్షసు। లగుటందన్నాశమఖిలహర్షదమయగున్।
సగణుఁడవైవచ్చితినిను। ముగించుటకెమొనయుమనికిముగియింతునినున్॥ ౩౪౯॥

కం॥ నరుఁడెవఁడో యెఱుఁగుదెనీ । వరనీవ నెఱుఁగుదువు గాక హరుఁడని యట్లే।
వరయనికతమున నేకద । దురితాకృతి రాక్షసుఁడయి తోఁచితివిచటన్॥ ౩౫౦॥

చ॥ అనవుడు జానుమండలుఁ డహంకృతితో ననె నోరనీ ఋషి।
త్వనిపుణ తన్ను బోధమును వారక మాకెఱిఁగింపవచ్చితే।
కనఁగను బ్రహ్మ మెల్లఁగద కామొకొ మేమును బ్రహ్మమాఁబురే।
కొనుమిదె పారితోషికము గొబ్బున నంచొక శూలమేసినన్॥ ౩౫౧॥

చ॥ అదిభయదంబుగా నదర నడ్డమువచ్చి సులక్షణుండు పెం।
పొదవఁగ దాని బాణముల నొప్పఱఁ జేయఁగ నప్పళించియ।
య్యదియు నణంగకుక్కు మెయి నక్కున గ్రక్కునఁ దూఱ ధారుణిన్।
ముదమఱి బోరగిల్లఁబడె ముమ్మె నవాలును ముమ్ము గూల్ప నాన్॥ ౩౫౨॥

మ॥ పడి నిశ్చేష్టితుఁడౌ సులక్షణుని సంభావ్యుండు ముక్తర్షి యొ।
క్కఁడె యొత్తెన్ దిగి భాఘుసద్బలుఁడు చిక్కం బట్టి యాశూలమున్।
వెడలించెన్ స్వకమండలూదకము చే వేగంబు నర్జీవితుం।
గడిమిం జేసెను లక్షణుండతఁడు డాకంజారి నాఁ గాఁదగెన్॥ ౩౫౩॥

ఉ॥ అంత సులక్షణుండు జగదంచితుఁ డుద్ధతి జానుమండలుం।
బంతము మీఱఁ గంగదను బల్విడి మొత్తెను మూర్ఛవోయిది।
ష్టాంతము నొందకయ్యసురుఁ డప్పుడ తెప్పునఁ దెప్పిరిల్లిదు।
ర్దాంతతమాత్తకుం దొడరెఁ దద్దయు నుందన కుద్ది యంచటన్॥ ౩౫౪॥

లయగ్రాహి.

పొంచుచును బైఁబడఁగ - నెంచుచును నొండొరులఁ - గాంచుచును మాటలను - మించుచును వాలం।
కించుచును వేయుచును - గొంచెమని పోవఁగను - మంచిదని వెండియును - గొంచకయ యేయం।
ద్రుంచుచును దున్కలుగ - నించుకయు డయ్యక గ్ర - హించుచు గదల్మఱియుఁ - బెంచుచును వ్రేటు।
ల్నించుచును గాయముల - నెంచుచును సొమ్మసిలి - రంచితము స్వర్గమును - గాంచిరన వారల్॥

ఆ-వె॥ స్వర్గసుఖముఁ బొందిసరగ జన్మించెడు । నట్లు జానుమంతుఁ డంతఁ దేఱి।
శూలమునను బొడిచె శూలి పుత్రుని మఱి । పీఁక లేక పోయె విడిచి దాని॥ ౩౫౬॥

కం॥ ఆవలహాహాకారము । తో విశ్వామిత్రుఁ డడరి తోడ్తో శూల।
మ్మే వితమున నూతీనెన్ । గావించెన్మాత్తకుని బునర్జీవితుఁ గాన్॥ ౩౫౭॥

మ॥ పిదప న్వొండియు జానుమండలుఁడు గర్విష్ఠుండు మత్తేభరీ।
తి దలిర్పంగను వచ్చి చెచ్చెరగదం ద్రెళ్లంగ మోదెన్మునిన్।
బద రెన్ది కెడుదీన నీపని మునిత్వం బాఱు దీపంబనం।
గఁదగెన్మత్తసమాఖ్యుఁ డీవుగదముక్త ప్రాణుఁడుం గమ్మనన్॥ ౩౫౮॥

జానుమండల సంహారము.

ఉ॥ కౌశికుఁడాడెదివ్వెఁబొసఁగంగ నొనర్చు తెఱంగెసంగఁగ।
న్నాశము నేయఁ బాశుపత నామకమస్త్రము వీని దానినీ।

వీసమయంబునం బఱవుమిప్పుడె జాగిఁకఁ గూడదంచుఁ గీ।
నాశవినాశకుండనఘనక్రుధమాత్రికుఁడయ్యెనయ్యెడన్॥ ౩౫౯॥

కం॥ గురునిస్మరియించెను జగ । ద్గురునిం బాశుపతమే నెఁ గ్రూరజగదరీ।
సురవైరిజానుమండల । పాలియమనుచు నతఁడు హరుఁడు పూస్త్రియమునన్॥

సీ॥ శతకోటిశతకోటిసాటిగామిని సహస్రాక్షదుర్దర్శమైయసమమగుచు।
శతధృతిశతధృతిసమభిష్టుతము గాఁగ బ్రహ్మపూర్వాహ్వయాస్త్రశతమగుచు।
సారమనస్సహస్రారసహస్రారమై సహస్రాస్యశయాప్తమగుచు।
లక్షాక్షరమనూర్ధ్వ లక్షలక్ష జపోపలక్షితశివమార్గపక్షమగుచు।
నాత్మతేజోభయంబునన స్తమింపఁ । బ్రొద్దుచిచ్చాఱ మెఱపబ్దమునను దాఁగఁ।
బాశుపతమస్త్రరాజంబు బయలు దేరె। నదియదానికి నెనగానియన్యమగునె॥ ౩౬౧॥

మహాస్రగ్ధరా వృత్తము.

కలఁగెన్వార్ధుల్ధరాచ - క్రముదిరిగెఁగుల-గ్రావముల్ వ్రయ్యలయ్యెన్।
వలఁకుల్ మ్రోసెన్నభతారా - వ్రజముఱిలెగ్రహ - వ్రాతముందప్పెదారుల్।
వడఁకెన్ లోకంబులెల్లన్-బశుపతిశరమా-బల్లిదుంజానుమంతుం।
బొలియించెన్ శప్పలేశం-బునుదవమువలెం-బొల్పఱంబాదిగాఁగన్॥ ౩౬౨॥

కం॥ శాంతంబయ్యెఁదన్నిస్త్రిం । బంత సుపర్వులు సుపర్వులైరి గురిసెఁదా।
నెంతయు సుమవర్షమసుర । కాంతానికరామితాశ్రుకణవర్షంబున్॥ ౩౬౩॥

జానుమత్పత్నీవిలాపము.

సీ॥ జలజలరాలంగ సరగ సీమంతమణులు మోఁదికొంచు నుదలఁ బలుమఱు।
బేసరి నత్తులు వెసఁ బిండిపిండిగా మొగమున య్యొయ్యాయని మొత్తుకొనుచుఁ।
గడిఁదిముత్తెపుసరుల్గచ్చునున్నంబుగాఁ గొనబఱఁగను గొట్టుకొంచుఱొమ్ము।
వదులయిజాఱిన వరకాంచికాంగదకటకమంజీరోర్మికలవదలుచు।
నెఱులునీలంపుముసుఁగుగ నెఱయనూర్పు । లెండగాడ్పులు గా వాయియెండ నేడ్పు।
రవళికోయిలయెలుగు గా రామ రామ । శోభితాంగియె తెంచెనుశుగ్రతియన॥ ౩౬౪॥

ఉ॥ కాటుకదీఱెనంతనఁ గాటుక కన్నులనీరు పాఱఁగా।
నీటుగుగంధమంతెయననిర్మలచందనచర్చ చెమ్మటన్।
స్ఫాటికవర్ణమైకరఁగి పర్వఁగఁ గుంకుమబొట్టు గుట్టుగన్।
వాటమఱంద్రి వేణిగను వారకయేడ్చెను శోభితాంగియున్॥ ౩౬౫॥

కం॥ హానాథుఁడనాథుండా । హానాథా నాథ నన్ను ననదఁగఁ జేయం।
గానగునే నీదానిని । మానఁదగునె కావరా వెమదనాకారా॥ ౩౬౬॥

కం॥ పిలిచిన బలుకవదేలా । నిలువవెదురనేల నేలనీరూపుఁడనం।
దెలుపనొమఱుఁగయితివి నినుఁ।దలఁతు ననంగునిఁగరమ్ము దయయుఁదలిర్పన్॥ ౩౬౭॥

సీ॥ పగలు రేయును నీదు భావంబు నూహించి వర్తింప నేనీవు బాగనఁగను।
నీవారు నావారు భావంబునను మెచ్చ మెలఁగ నేయెల్లరు మేలనఁగను।
గార్యంబులను దాసికైవడి మంత్రంబునందు మంత్రిగఁగా నెపొందికగను।
గురుబంధుమిత్త్రార్థి పరిజనోల్లాసంబు వెలయింప నేసతీతిలకమనను।
నీకనిష్టంబు చేసితి నేయెవ్వుడయి । ననుమదీశ్వర పోయితె నన్నుఁ బాసి।
యాశ్రితావన సమధర్మ మానెయన్య। మేను నినుఁ బాయ నినుఁ బొంద నేగు దెంతు॥ ౩౬౮॥

కం॥ చెప్ప నెవలదిప్పోరని । యొప్పకనీయెత్తికోలయోయేలాయీ।
యొప్పనిపని కొగ్గి చెడితి । మొప్పితనము చేయ కెగ్గుమగియు నెయెందున్॥ ౩౬౯॥

కం॥ తనకుం దెలియక యాప్తుల్ । మునుకొని చెప్పంగ వినక మొఱకుతనముతో।
ఘనునిందొడ రెడువాఁడవు। వనవహ్నింబడెడు మిడుత వలఁబడు మీనున్॥ ౩౭౦॥

తే-గీ॥ నీకు నేనెఱిఁగింపంగ నేర్పుగలుగు । దాననని చెప్ప రానైతి నూనకు మెదఁ।
గినుక నామాట యేటికిఁ దనయుఁ దలఁవు। మీషణత్రయమున మేటియేయగుఁగద॥ ౩౭౧॥

కం॥ మానితి త్రిలోక రాజ్యము । మానితి వీశోభితాంగి మానిని నన్నున్।
మానఁదగునే సునీతిన్ । సూనుఁడుగద వీఁడు నీకు సుఖసుం డెందున్॥ ౩౭౨॥

కం॥ వీఁడగు నీప్రతిబింబము । చూడుము నాయందు వీని సొబగొందెడు వీఁ।
డేడఁబితృవిరహదుఃఖం । బేడ సహింపంగఁదర మెయెవ్వారికేనిన్॥ ౩౭౩॥

శా॥ నీరూపంబును నీవిలాసమును నీనేర్పెల్ల నంగల్గునే।
యారుద్రుండకటా మనోభవునిఁ దానాకారరాహిత్యుఁగా।
వైరంబాఱఁగఁజేసెఁగా కటునినున్ భావించుటొప్పెయయో।
సారాసారవిచారుఁడే నతఁడునిన్ శస్త్రకృతిం జంపునే॥ ౩౭౪॥

ఉ॥ పిల్లికిఁ జిల్కముద్దగునె పిల్లియుఁ గుక్కకు వేఁపి వేఁగికిన్।
బల్లిదమైన వ్యాఘ్రమది వ్యాధుని కెందును వేటకానికిన్।
భిల్లుఁడు ధర్మరాజునకుఁ బిత్రధినాథుఁడు శూలికాతఁడే।
చెల్లఁగఁ జేసె నస్త్రమయి చిత్తజవైరి నిను న్సహించునే॥ ౩౭౫॥

ఉ॥ కాలుని గెల్చినాఁడనని గర్వముఁ బూనెడు శర్వుఁడాతఁడా।
కాలునిఁ దన్ను గెల్చినని కామపరాక్రము నిన్ను నైఁచునే।
చాలమి నాలముం జులుపఁ జయ్యన నెయ్యన నస్త్రమైనినుం।
గాలవశంబుఁ జేసెనె గిఁగారణమయ్యెను మౌక్తికుండిటన్॥ ౩౭౬॥

కం॥ మౌక్తికుఁడు నిన్ను ద్రుంపఁగ । శక్తుండే నిర్దయుండు శర్వుండయ్యెన్।
యుక్తమె శంకరుఁడఁట యతఁ।డుక్తుఁడగు నశంకరుఁడుగ నెన రెఁగననిటన్॥ ౩౭౭॥

### శుభాంగీ మౌక్తిక సంవాదము.

మ॥ అని ముక్తేశ్వరుఁ జూచి యిట్లని యెనోయయ్యా మదీశుండు నీ।
కును నేమేని నరించెనే యపకృతిం గ్రోధంబున న్నాపతిన్।

ఘనునింజంపితివేలనన్నువిధవంగావించితేలానినుం।
బనిలేదాఁడఁగనిన్నుఁగన్నతనినప్పశ్వీశునేదెప్పెదన్॥ ౩౭౮॥

ఆ-వె॥ అనపరాధుఁడైనయట్టినానాథునిఁ। జంపియీసునీతిజనకరహితుఁ।
బరసహాయవాంఛుఁబచరించితివిగాన। ఫలముననుభవింపవలయునీవు॥ ౩౭౯॥

కం॥ నీసంతతివారుస్వధ। ర్మాసక్తులుగాకక్షత్రియాభాసులునై।
వానిరయఱఁజిత్రకరులుగ। భానిల్లెదరనిశపించెభైరవిభంగిన్॥ ౩౮౦॥

ఆ-వె॥ అనుచుశాపమీయనాశోభితాంగినిఁ। గాంచిమార్త్తికుండుగడఁకనుడివె।
శాపమేలమొసఁగశంకరేచ్ఛయదెట్లో। యట్లుజరుగుసర్వమబలవినుము॥ ౩౮౧॥

కం॥ నీమగఁడునిరపరాధుఁడె। శ్రీమంతుండననుచుఁగ్రొవ్విచేసెనఘాఘం।
బేమాడ్కిమనెడుదేవ। గ్రామద్రోహంబుగూర్చుఁగాబలుగీడుల్॥ ౩౮౨॥

కం॥ మహనీయవినుముమాతా। మహినీవిభుఁడధికశౌర్యమాన్యుఁడిటనటన్।
మహితసుఖములనుగనియెను। విహతముగదయాహవమృతివినుతింపఁదగున్॥ ౩౮౩॥

కం॥ నీవువిదగ్ధవెయయ్యున్। ధీవెడఁబాయటనుశివునిఁదెగడెదుతగవే।
పోవమ్మయన్నపుత్రునిఁ। బ్రోవంగలదేనిదలఁపుపొమ్మిరవునకున్॥ ౩౮౪॥

## సునీతి పట్టాభిషేకము.

ఆ-వె॥ అనుచుమార్త్తికమునియడరంగఁబలుకంగ। ననురగురుఁడచటికినరుగుదెంచి।
యమృతకరునికరణినతనితోనిట్లనె। ననుజయీసునీతి నరయుమయ్య॥ ౩౮౫॥

మ॥ అరినింగెల్చితివొప్పఁదత్తనయుఁబ్రహ్లాదుంబలెంబ్రోవుమీ।
శరణార్థిన్స్వగుణున్విభీషణునిఁగాసన్మిత్రుసుగ్రీవుఁగం।
గరుణందద్భగదత్తుఁగాయమజుఁగాఁగావాసవుంగాఁగనీ।
ధరణింబట్టముఁగట్టునీముదలనేదైవారఁగావింతునన్॥ ౩౮౬॥

కం॥ మైకొనికానిండనఁగా। నాకవియానందమందియపుడెసునీతిం।
గైకొనిచనియలరించెం। బ్రాకటముగఁబురముఁబౌరబాహుళ్యముగాన్॥ ౩౮౭॥

కం॥ చేయించెనుత్తరక్రియ। లాయదనంజానుమండలాసురపతికిన్।
బ్రోయించెసునీతికినగు। నాయనపట్టాభిషేకముత్సవమనుచున్॥ ౩౮౮॥

## శతపత్ర వృత్తము.

దారులసమంబులము - దంబెసఁగఁజేసిరటఁ - దార్కొలిపిపందిళులాగిం।
జారువసనంబులను - జాందిసులఁగట్టిమఱి - స్తంభములరంభలమరం।
దోరణములొప్పఁగను - దుష్టిగఁబతాకలును - దోఁపఁగయినేసీరెలమిన్।
వారకసుయంత్రముల - వారిఁదడియంబుడమి - పైనపలుముగ్గులమరెన్॥ ౩౮౯॥

సీ॥ క్రొత్తసున్నపుఁబూఁతనత్తఱిఁదనరెనుగోడలన్నియువజ్రకుడ్యములుగ।
నెఱమట్టిపట్టెలునెఱయఁగ్రిఁమీఁగడల్వీలనిల్లెవిద్రుమాంచలములనఁగఁ।

బరఁగెవివిధరంగవల్లీయుతంబులు వేదికల్వరరత్న పీఠములుగఁ।
బస పుగుంకుమములఁబసమించెవాకిండ్లుభర్మారుణాశ్మవిభ్రాంతిగలుగఁ।
దోరణములొప్పెఁబచ్చలతోరణముల । నంగముంగిళ్లవిరులనెసంగుచప్ప।
రములుమణిమండపములుగా రాజిలెఁగన । నచటియిండ్లెల్లఁబెండ్లియిండ్లట్లతోఁచె॥

ఉత్సాహ॥ పౌరమందిరములెయిట్లు - పరఁగనగరియందమున్।
వేరువాకొనంగవలెనె - విశ్రుతోరుచారుస।
ద్ధీరముఖ్యమణిమయమయి - దేజరిల్లెఁబెల్లుగా।
వారకారయంగనెనగ - వైజయంతమగునొకో॥ ౩౯౧॥

మంగళమహాశ్రీవృత్తము.

బిట్టుగనుమ్రోయఁగను - బెక్కులగుతూర్యములు - పేర్కొనఁబిరంగులు సెలంగన్।
బట్టియభిషేకమును - బాగుగను జేసెనట - భద్రహరిపీఠినలరించెన్।
బట్టమునుగట్టెనుశు - భంబుగనునీతికిని - భార్గవుఁడనర్గళముగాఁగన్।
నెట్టననెసంగుమని - నెమ్మినిడిదీవెనల - నేర్మిఁగడుమంగళమహాశ్రీ॥ ౩౯౨॥

కవిరాజవిరాజితవృత్తము.

వెలయఁగవేల్పులకుంద్రిదివంబిల - వేల్పులకున్భువిసోఁకులకున్।
విలసిలఁగానురసాతలమెంతయుఁ - బ్రీతినునీతిజగత్త్రియమున్।
జెలఁగెనువారలుగారవమారఁగఁ - జేకొనిస్వేష్టపదార్థములిం।
పెలయఁగనేలుమురాజ్యమనంగొని - యెంగవిరాజవిరాజితమున్॥ ౩౯౩।

మణిభూషణవృత్తము॥ భక్తినిచ్చెనునీతియుఁ - బన్నుగనెన్నఁగన్।
ముక్తదేవునికిసన్మణి - భూషణరాసులన్।
రక్తిఁదత్పరిజనాళిని - రంజిలఁజేసెఁదా।
యుక్తసత్కృతులధన్యత - నొందెనుబొందుగన్॥ ౩౯౪॥

ఆ-వె॥ అప్పుడమృతవృష్టినద్భుతంబుగఁబున । ర్జీవితులుగనరులఁజేసెనింద్రుఁ।
డట్లుచేసెఁగొందఱసురులమంత్రాప్తిఁ । దదనుమతినిఁజెందిదైత్యగురుఁడు॥ ౩౯౫॥

కం॥ ఈతెఱఁగునముక్తేశుఁడు । ఖ్యాతిగనునీతికిచ్చియఖిలమురాజ్యం।
బాతతనిజసైన్యముతోఁ । బ్రీతింగాధేయుతోడవెలువడియెవడిన్॥ ౩౯౬॥

ఆ-వె॥ చేరికౌశికమునిసిద్ధాశ్రమంబునం । బలికెనతనితోడవరమునీంద్ర।
నీకతముననేనునెగడితినరిగెల్చి । కలశభవుఁడుశివుఁడుగావెనీవె॥ ౩౯౭॥

కం॥ అనవిశ్వామిత్రుండి । ట్లనియెనుజనునయ్యయిట్టులాడఁగనీచే।
ననువొందెనామఖంబే । వినుతిఁగనితిశివసుతునకువిజయమరిదియే॥ ౩౯౮॥

తే-గీ॥ అవబృథస్నానమునుజేయుమయ్యయజ్ఞ । మయ్యెఁగావుననవనిపల్కనట్లెచేసి।
మ్రొక్కెఁగౌశికునకుభక్తిముక్తదేవుఁ।డతఁడుదీవించెఁబెండ్లినీకగునటంచు॥ ౩౯౯॥

రథోద్ధత॥ జానుమద్దనుజ - సంహృతిన్వినం । గానెఱింజదువఁ - గానరుల్గదున్।
జ్ఞానవంతులయి - కంద్రుసౌఖ్యమున్ । జ్ఞానవన్నుతము - గాదెశ్రీదమే॥ ౪౦౦॥

## శివమౌక్తిక సమాయోగము.

ఉ॥ అంతటజానుమద్దనుజహంతనులక్షణముఖ్యులుంచనుం।
జెంతనుజేరికొల్వఁగడుఁజెల్వుగనల్వురుపంచవర్ణమా।
మంత్రమనంగనంగయినుమంత్రునిసాధకుగాధినందనున్।
సంతసమొప్పఁదోడుకొనిచయ్యననయ్యనుజూడవెల్వడెన్॥ ౪౦౧॥

చ॥ ఇటులనెనవ్దుగాధిసుతుఁడేధితసమ్మదముల్లసిల్లస।
త్పటుతరసద్రసోక్తులనుదారునితోనలమౌక్తికర్షితోఁ।
జటులచతుర్విధాస్మదురుసైన్యవిజన్యపరాగమేగుము।
న్నిటమనరాకశంకరునికింపుగఁదెల్పఁగఁబోవుభూమినాన్॥ ౪౦౨॥

మ॥ ఉరుధూళీపటలంబుసాంధ్యరుచిగానొప్పొందునైన్యోత్థితో।
ద్ధురకోలాహలమండభూకలకలద్యోతంబుగావాహినీ।
శ్వరులుంజుక్కలమాడ్కివేడ్కఁబ్రభఁగాంచంగంబ్రదోషంబుగా।
స్ఫురియించుంద్వదభిఖ్యచంద్రరుచిగాఁజూడందగుంగాశివున్॥ ౪౦౩॥

శా॥ ఆశాధీశ్వరరాజధానులివెయూహంగొల్పుఁబ్రాసాదముం।
బ్రాసాదాగ్ర్యముతారహారఁగదయదేవాలారుఁదారాద్రినాఁ।
గాశశ్వద్రుచిఁగాంచుఁగాంచితివెముక్తర్షీశకైలాసముం।
దీక్షుండుండెడుఁదారకార్థదుఁడురత్నేశుండనన్రత్నమా॥ ౪౦౪॥

చ॥ కనుఁగొనివెండికొండఁగడుఁగన్నులపండువుగానులక్షణుం।
డనియెనునాయనాయిదినిజాత్మజునిర్జితజానుమండలు।
న్నినుఁగనమేనువొంగఁగనునిల్చినశంకరుఁడోయనంగఁబో।
ల్చెనుగనుమాయటంచుమఱిచెల్వుగనిట్లనెలక్షణజ్ఞుఁడున్॥ ౪౦౫॥

శా॥ పాదాంగుష్ఠవిమర్దితున్దశముఖున్భజించిధ్యేయుండునా।
కైదైవారెడురాముఁడీతఁడుజితోగ్రాత్మీయధర్మున్మనస్।
ఖేదాపాదకుజానుమండలునిఁబూన్కింజంపెనెల్లెంతునం।
చేదేఁదోఁపకయున్నస్థాణువననీయాశాద్రిభానిల్లెదున్॥ ౪౦౬॥

మ॥ అనఁగానిట్లనెనానుబాహుఁడుమహాహర్షంబునంబావురే।
తనయాపాదితకీర్తిరాశిపయినాస్థన్నిమించుధన్యుండుస।
జ్జనకుండీశ్వరుఁడీనితాగశిఖరస్థానస్థితింబొల్చునం।
చునసంగానువిలోచనుండిటులనెన్శ్రోత్రామృతంబౌనసన్॥ ౪౦౭॥

చ॥ విలసిలునస్థిపంజరమువిశ్రుతమీమడికానుగట్టెయాఁ।
దలశిఖరంబుబుద్ధివసుధాధరపుత్రికతారమారయన్।

జెలువగునందియాత్మయగుసిద్ధముగాశివుఁడంచునెంచెదం|
దెలిసెదరాత్మయోగులిటుధీరులటంచుఁదలంతునెంతయున్॥ ౪౦౮॥

మ॥ భసితోద్ధూళనయోగపీఠకలనన్భాసిల్లుయోగీశ్వరుం|
డుసుమీనిశ్చలసత్సమాధిమహితుండన్వెండికొండందుస|
ర్వానుశక్తిడితబుద్ధికుద్రభవత్రమ్ముండురాముండుజ్ఞా|
నసమాకారుఁడుతారమాత్మయగుఁగన్నందారశైలంబిదా॥ ౪౦౯॥

కం॥ అనిముక్తేశుఁడుపలికెం| జనుఁజనుననియెల్లరథికసంతోషమునం|
జనఁజననానాసుమసౌ| ఘనగంధముదోఁచెదివ్యగానమయముగన్॥ ౪౧౦॥

కం॥ అచ్చరలెదురుగవచ్చిరి| సచ్చరితున్మాక్తికునినిసంసేవింపన్|
దెచ్చిరిపల్లకిదేవత| లిచ్చిరికైదండలుసుహహారంబులాగన్॥ ౪౧౧॥

ఆ-వె॥ ఎక్కెనందలంబునెసఁగముక్తేసుండు| పొగడిరపుడుప్రమథపుంగవులును|
సురలుజయజయయనిశోభిల్లఛత్రచా| మరములయ్యెఁబయనమురుమహితము॥

చ॥ మునుచనిమ్రొక్కికౌశికుఁడుమోదముతోశివుతోడవిన్నవిం|
చెనుజగదీశనీసుతుఁడుచెందెజయంబునువచ్చునిప్పుడే|
నినుఁగొలువంగనామదినినిర్భరహర్షమునిండిమెండుగం|
బెనుపుగవెల్లిపాతెననవెల్వడెఁగన్నులసమ్మదాశ్రువుల్॥ ౪౧౩॥

ఉ॥ వచ్చెసుభక్తిమాక్తికుఁడుపాదములంబడిచాఁగిమ్రొక్కఁగాఁ|
గ్రుచ్చికవుంగిలించెసుతుగొబ్బుననుబ్బునరోమహర్షణం|
బెచ్చఁగఁద్ర్యక్షుఁడుబ్బునెడలింపుగవజ్రపువర్మమిచ్చెన|
ట్లిచ్చగమూరొకనెన్శిరముదీరితరత్నకిరీటమిచ్చెనాన్॥ ౪౧౪॥

కం॥ అంకమునసుంచుకొనికే| లంకించుచుమేనునివురుచర్భకయెటులా|
పంకభవుజానుమండలుఁ| గొంకకగెలిచితివనజనకునకుఁగొడుకనెన్॥ ౪౧౫॥

కం॥ లోకములనెల్లబాధిగ| నేకక్షణమునసెనర్పనేడ్తెఱగలయా|
ప్రాకటపాశుపతాస్త్రము| నాకొసఁగితిదానవాఁడునాశమునెందెన్॥ ౪౧౬॥

తోదకవృత్తము॥ అనవినిశంకరుఁ - డాత్మజుతోనీ| వెనయమభీష్టము - లిత్తువరంబుల్|
దనయమణీయనఁ-దద్దయుమోదం|బుననతఁడిట్లనె-బోధ్ధలుమెచ్చన్॥

ప్రమితాక్షర॥ ప్రమథాధిపావినుము - భద్రమునా| కమరించెగాధిజుఁడు - ప్రాణదుఁడై|
ప్రమదంబొనర్పుమని - పర్యనికా| దిమదీయవృత్తముత్వ - దీయమెకా॥

తోటక॥ అనఁగావినిశంకరుఁ - డమ్మునితో| ననెగాధిజవేఁడుమ - యావరమి|
త్తుననన్నిజగోత్రజుఁ-దుష్టిదుఁజే| యనుగోరెదమాక్తికు-నంచడిగెన్॥ ౪౧౯॥

పృథ్వీవృత్తము॥ తథాఽస్తనుచుఁబల్కెశంకరుఁడు - దాపసుండెంతయు|
బుధస్తుతుఁడుగౌశికుండెననె - భూరిసంతోషమున్|
సుధాకలశమొందినట్లనుజు - సొంపుగన్స్వామనున్|
విధుంగనినయట్లురత్నముని - స్వీయుఁగాఁజెందుటన్॥ ౪౨౦॥

## మౌక్తిక పరిణయ ప్రశంస.

శిఖరిణీవృత్తము॥ ఒసంగెన్ శంభుం డాత్మభవునికి స - ర్వోత్తమములౌ।
లసద్భూషల్విష్ణుం డజునికిడులీ - లన్ శ్రుతితరుల్।
రసస్ఫూర్తుల్మించన్ రమరమణుఁడా - ర్యాకలితుతో।
వెసం బెండ్లిం జేయన్వలయునలర - న్వానికనియెన్॥ ౪౨౧

కం॥ కలదెందు వీనికిం దగు । నెలఁతుక యని శివుఁడడిగె ననెమ్మి న్విష్ణుం।
డలరి పలికె నెలతాల్పా । కలదు గదా ముక్తియనెడి కన్యామణి నాన్॥ ౪౨౨

కం॥ అది యెవనికూఁతు రెందుం । బొదలుం దెలుపుమన నెఱుఁగవో సర్వజ్ఞా।
యదిదుర్వాసుని నందని । గదయని వెన్నుండు నుడివెఁ గడుముద మొదవన్॥ ౪౨౩॥

కం॥ తద్వృత్తాంతం బెఱిఁగిను । రద్విషుఁడా జానుమంతు ప్రాణాప్తుఁడొకం।
డుద్వాహము మౌక్తికునకుఁ । బ్రద్వేషంబునఁ బొరిఁ జెఱుపన్వడిఁ గడఁగెన్॥ ౪౨౪।

తే-గీ॥ క్రోధభట్టారకుం డనుగ్రోధమునియు । ననఁ బ్రసిద్ధినిఁ జెందిన యత్రిపుత్రుఁ।
డపుడు క్రోధవిరహితుఁడై యజగరంబు । నట్లు కంజాద్రియందుఁ జేయంగఁ దపము॥

## కంజరాక్ష సాద్ధత్యము.

ఉ॥ కంజసమాఖ్యుఁ డయ్యసురకంజ నగంబునఁ జేరి నాదిదౌఁ।
గంజుఁడనంగ శంభువఁటకంజభవుండఁట కంజదృక్కుఁ దేఁ।
గంజుఁడ నంచు గర్వమున ఖర్వము గంగని సైంహికేయునః।
ట్లంజ కయాక్రమించెను నిజాఖ్య నెసంగెడు నద్రి నబ్జునాన్॥ ౪౨౬ ॥

చ॥ ఒసఁగుము ముక్తినే నొసఁగ నొప్పమయొప్పనిఁ కేని కిత్తురా।
క్షసునకు నీను గోవెలకుఁ గట్టుదె నీకిడు కంటెనట్టులే।
నిసము చితంబు నిల్వకిట నేగుము పోయెదఁ బంపనోయి నీ।
దును తన దేలనాదు సతి దూఱనె దైత్యుఁడు దాపసుండొగిన్॥ ౪౨౭ ॥

ఆ-వె॥ అన్యకన్యనిట్టులాఁచికోలుచితంబె । యంచు న్యాయమాడె నత్రిజుండు।
రాక్షసుండఁగాన రాక్షసోద్వాహంబుఁ। జేసికొందునని యెఁ జెలఁగి యసుర॥ ౪౨౮॥

కం॥ మునియొండుపలుక నేరక । తను జవిడిచి బిల్వ నాథుఁ దగ సేవించెన్।
ఘనుఁడై నవిరక్తునికిన్ । దనరవిడువఁ దగని దేదిదైవము దక్కన్॥ ౪౨౯॥

కం॥ గౌరీసరోవరంబున । గౌరీమహిమం జలంబు గనఁ బడదయ్యెన్।
గౌరీశారాధనకై । నీరముఁ దేన రుగునతఁడు నిత్యము గిరికిన్॥ ౪౩౦॥

ఆ-వె॥ అరిగి చిత్ప్రకాశమందు నాహ్నికములఁ । దీర్చికొని జలంబుఁ దెచ్చికొనుచు।
నుండెఁ గొన్ని నాళ్లు మండితుండమ్ముని । చూచి చూడకుండె నసురరిపుండు॥ ౪౩౧॥

ఉ॥ క్రోధనుఁ డీతఁడంచు నెవరుం దొలుతం గని చేరరైరొగిన్।
సాధువు గాఁగ నుంటఁ గనిచయ్యనఁ గొందఱు పల్కరించిరా।

బోధఘనుండుమానియయిపొల్చుటగేలిసెనర్చిరార్చిరో।
యీధృతిశాలివేయనుచునేచుచునెట్టిరికొట్టిరాతనిన్॥ ౪౩౨॥

కం॥ ఓర్చుకొనియుండెనాతఁడు । పేర్చితనున్నెంచువారిఁబ్రియమునఁగనెదున్।
జేర్చికొనెఁబరమశాంతినిఁ । గూర్చికొనెంబిల్వనాథుగొనకొనియాత్మన్॥ ౪౩౩॥

ఉ॥ కంజుఁడుముక్తికన్యకనుగాంక్షదలిర్పఁగనేర్పుమీఱఁగా।
మంజులసౌధమందునిచిమజ్జనభోజనవస్త్రభూషణా।
నంజనగంధమాల్యకుసుమాంచితతల్పమనల్పమున్సుఖం।
బుంజెలిపిండుఁగూర్చితనుఁబొందఁగఁగోరెనుదన్మృగాక్షియున్॥ ౪౩౪॥

చ॥ జనకునిఁబాసియుండుటనుసద్గుణుసెందమిదైత్యునందునుం।
దనకనురక్తిలేమినలఁతంగడుముక్తిసుఖంబుదుఃఖమా।
ననితలఁచెన్సుఖింపదొకయప్పుడునుంజెఱఁబడ్డదానియో।
జనెతగెదుఃఖితేమననిసర్వమసహ్యమనంగలక్ష్యమై॥ ౪౩౫॥

ఉ॥ రమ్మనిపిల్చెఁబల్మఱునురామికిఁగారణమొప్పఁజెప్పమం।
చిమ్ముగఁగోరెనుత్తరమునేమియుఁజెప్పమిదెప్పెబల్మిమైఁ।
గ్రమ్ముకొనంగడంగెనలరక్కసుఁడుక్కననప్పొలంతియ।
ష్డమ్మకచెల్లపూనలపనబ్బనెమేల్వలపుబ్బుప్రబ్బఁగన్॥ ౪౩౬॥

చ॥ కలదువ్రతంబునాకొకటిగారవమారఁగబిల్వనాథునిం।
గొలువవలెన్ననున్విడువుకూడనెనీవునురమ్మునెమ్మిమైఁ।
గొలువుముపొందుపొందుననఁగూడదునీవరుగంగనీదువె।
నక్కలలితమానెరాకయునునాకతఁడీశుఁడెయంచువాఁడొగిన్॥ ౪౩౭॥

కం॥ కాముకుఁడగుటనుదుదకా । కామినికాంక్షితముఁదీర్చికలయఁగఁగోరెన్।
గామారిసేవసేయం । గామొదలిడెఁగామసిద్ధిగలుగునెదానన్॥ ౪౩౮॥

ముక్తి మౌక్తిక సమాలోకనము.

చ॥ తెలతెలవాఱనారమణితేటగునీటనుదానమాడియుం।
పలరఁగమేలుజిల్గుధవళాంబరముద్ధరియించిమోమునం।
దెలమినిబూదిపూఁతలవహించివినీలకచంబునార్చుకొం।
చొలయుఁదమాలమాలతులనొప్పెడుచంపకమాలయోయనన్॥ ౪౩౯॥

ఉ॥ అవనితాశిరోమణిసుధాంశుశిరోమణిబిల్వనాథుస।
ద్భావమునంభజించుటనుధారసనిక్తునిఁజేయుఁజూచుటన్।
దావెలయించునెంతయునుదారమహోత్పలమాలికాంచితుం।
గావిలసిల్లుమోలఁదనకాయముచక్కెరబొమ్మయౌననన్॥ ౪౪౦॥

మ॥ సతిదానంజలిసేయుసన్నఖరముల్జానొందనీరాజనాం।
చితదీపంబులుగాఁగగీతములుసూచింపంగఁబుష్పాంజలిన్।

గతిమత్తేభగతిం బ్రదక్షిణమునం గల్పింప నాట్యంబునీ
క్షితి నిస్సీముఁడటంచు దెల్పునన గాఁ జేయున్నమస్కారముల్॥ ౪౪౧॥

శా॥ బింబవ్యాజముచేతనవ్వెలఁదినవ్విశ్వేశుఁడేలోఁ గొనుం
బింబోష్ఠిం జగదేకసుందరినహో విశ్వంబునం గల్గువా
రింబారంగని రేనిమానఁగల రేదృగ్దర్పణంబందురూ
పంబుం బాయక యంటియుండ మరుఁడొప్పం జేయఁ జిత్రంబుగా॥ ౪౪౨॥

సీ॥ చూడవలెను దీనిసొగసు సుజ్ఞాచిననినిమిషత్వంబబ్బు నబ్బురముగ
వినవలయును దీనివిశ్రుతగానంబు విన్న నాదోపాస్తి వేఱువలదు
పలుకవలయు దీనిఁ బలికింపఁ బలికినఁ జెలఁగు శబ్దబ్రహ్మసిద్ధి సుధగ
మూర్కొనవలె దీనిమోము దామరకమ్మవలపు మూర్కొనఁ గుంభకలన మొదవుఁ
గౌఁగిలింపఁగవలె దీనికాయకల్ప । వల్లి కౌఁగిలియిడఁ గల్పభావమగున
టంచుఁ బంచేంద్రియంబు లర్పించి కాంచు । చుందు రందఱు నమ్ముక్తియుక్తిర ॥ ౪౪౩॥

చ॥ కనుఁగొనె ముక్తదేవుఁడలకామినిఁ గామునిశక్తియంచు నె
మ్మనమున నెంచె మోహమున మ్రాన్పడె యోగసమాధినిష్ఠ నాఁ
గనెనెగి ముద్రశాంభవినిఁ గన్నుల నన్నును మ్రింగు నాఁగ నా
కొనరు నెయిద్దియంచుఁ దనయుల్లమునం దుఁదలంచెఁ బెల్లుగన్॥ ౪౪౪॥

ఉ॥ ఆయెలనాగ గాంచె నపుడద్భుతసుందరమూర్తి మౌక్తికున్
గాయజు రుక్మిణేయు రతికైవడి నయ్యనిరుద్ధు నయ్యుషా
బ్జాయతనేత్ర గాంచినటు లబ్బెడు నే యితఁ డుబ్బుమీఱ నా
నాయకుఁడంచుఁ గూర్పను మనంబునఁ గోరెను బిల్వనాథునిన్॥ ౪౪౫॥

కం॥ దరనతసుధాంశుబింబం । బురుతారౌఘంబు గురుమహోత్పలముకుళం
బురణన్మణిభూషాద్విజ । పరిష్టుతము గాఁగ వనిత పచరించెనతిన్॥ ౪౪౬॥

కం॥ ముక్తర్షియుఁ గామార్తిన్ । ముక్తర్షి గనయ్యెనె యనము నుదనచే నా
సక్తిశివునికిడఁబడినది । ముక్తికొసఁగెఁ బారిజాతపుష్పస్రజమున్॥ ౪౪౭॥

తే-గీ॥ అడిగె నెవ్వనికూఁతుర వబ్జవదన । యంచు నయ్యంచుబోఁడియు నాదుమునిజ
నంచుఁ బల్కెడునంతలోన సురకేరలి । పొదమని యెంచెఁ బానకములోని పుల్ల యనఁగ॥

కం॥ రక్కసుఁ డదృశ్యుఁడై యా । చక్కనె తానుండి చూడఁ జాలక సూర్యం
డొక్కయన వెలుఁగుముక్తిసు । నక్కడ నిల నీకముక్తినటు గొనిచనియెన్॥ ౪౪౯॥

ఉ॥ కోరెను ముక్తదేవుఁడలకోమలి ముక్తినిఁ బెండ్లియాడఁగాఁ
గోరెను గంజరాక్షసుఁడు గొబ్బున నుబ్బునఁ బొందఁ బొందుగా
నారసు రాసురుల్ప్రధనునై కడఁకన్ గడలిన్మథించిన
ట్లారయ చుండి రయ్యిరువు రయ్యది మోహిని గానె సంగఁగా॥ ౪౫౦॥

ఆ-వె॥ కంజుఁడయ్యె ముక్తికాంతను వలపింప । మౌక్తికాకృతిగను మానినియును
గీ లెఱింగి వాఁతఁ బోలఁ బెట్టెననంగ । యుక్తిపన్ని తెలిపె యుక్తముగను॥ ౪౫౧॥

చ॥ పలికెఁబ్రతీపదర్శినియువ్యాళియుతంబగుకైతకంబన।
న్నలువుగనత్తిలోత్తమయనంగనువీరునినందికేశ్వరుం।
గెలువుమతండురక్కసులగీటడఁగించునుదేవమిత్రుఁడా।
టలలిననంగమేలనికడంకనుమీసముదీటెఁగంపాఁడున్॥ ౪౫౨॥

కం॥ ఓతరుణీనినువలచెనె । యాతండుఁడునావలెనెతదాఘ్రుండేమో।
నీతండ్రియనుచుమర్త్యా । రాతతరోషంబుతోడననిఁద్రుంతుననేన్॥ ౪౫౩॥

ఆ-వె॥ అప్పుడప్పడంతియక్కటాయికూ్కళి । రక్కసుండెవరినినుక్కడంచు।
నెక్కవిసఘుఁబాడినినెక్కల్పనూదిన।యాటవెలఁదితల్లినయితెనయ్యొ॥ ౪౫౪॥

తరువోజ॥ అయ్యయ్యొననుఁగన్న-యయ్యయేమగునొ-యయ్యార్యపర్యని-కయ్యెనేనెడరు।
సయ్యమివరుఁదండ్రిఁ-జంపించిపాప-జయ్యనైడయ్యనే-జముచేతఁజిక్కి।
యయ్యయోశైలాది-యాశైవరత్న-మయ్యభవహయుండ-హాయెటులపుసు।
కయ్యంబునంగెల్వ-గల్గునెవ్వనికో-క్షయ్యంబుదనప్రాణ-సంచయంబంచు॥

తోటక॥ అనియెంతయుఁజింతిల-నద్దనుజుం । దనెనెంతనుగాంతుప్ర-హా-యనం।
గొనిముల్లునుగొజ్జును-గొట్టినయ । ట్లైననెన్వొఅభీరువ-హీనముగాన్॥ ౪౫౬॥

శా॥ వారింపైకొనరాఁగమున్నవలెనెదుర్వానుండుచేగన్నిరా।
బారింబారికిఁబాలునేనెబలిమింబాపిష్ఠుఁడద్దైత్యుఁడే।
పారంగాలికకృత్యముల్నడపనీకమ్మానిబిందెన్గెనె।
న్గేరెందిట్టైనుగొట్టెఁబాఅఁదిజీమెన్ధృష్టుండునే్వష్టాప్తికై॥ ౪౫౭॥

## కంజాసుర సంహారము.

మ॥ అలమర్త్యానుఁడుక్రోధిగాకయనుహాహాకారముంజేయుచో।
హరబిల్వేశ్వరకంజరాక్షసునిసంహారంబుఁగావింపుమి।
బలియుండానుడివాలనంగెడిపనన్బంతింబునన్వచ్చెనా।
వెలయందేజమునందినందిదనుజున్వేగిమ్మెశూలమ్మునన్॥ ౪౫౮॥

శా॥ కంజుండుండనుఁగుమ్ముతండిపయివ్యాఘ్రుంబోయనంబైఁబడెన్।
గంజాద్రిప్రలిమానుఁడైచఱచెన్రుక్కంగ్రుద్దైగ్రొచ్చెంగడు।
న్నంజన్నంజుడుగ్రోలనల్లయనుశూన్యంబైననైరాశ్యమొ।
ప్పంజెన్నేదితోలంగకన్నిలిచెదుర్వ్యాపారమేపారఁగన్॥ ౪౫౯॥

స్రగ్ధర॥ తండుండుంగుమ్మిచిమ్మెం-దగుబలిమిమహశా-ర్థత్యునింద్దైత్యుఁగంజుం।
దుండించెన్వజ్రిముస్నై-స్దనుకలుగమరుత్-స్తోమముంజేసినట్లే।
ఖండంబుల్వానివేవే-క్కడఁబడెఁదదభి-ఖ్యాకముల్గాత్రిమముల్గా।
యుండుంజూడంగనంది-శ్వరుమహిముఁడతం-డొప్పఁగంజారినాఁగన్॥ ౪౬౦॥

మ॥ దివిఁగంజారియొకండుద్రిమ్మరెడువృద్ధిన్సంక్షయంబందుచున్।
భువిఁగంజారియొకండుగ్రుమ్మరెడునెచ్చుంగాననోపీటనో।
తవఁగంజారియొకండుపాల్కడలినిద్రంబొందునీనందియో।
యవుఁగంజారియపశ్చిమాస్యుఁడయికంజాద్రింగనున్నిచ్చలున్॥ ౪౬౧॥

## నీవానదీ సంభవము.

కం॥ ఒదవమినభిషేకంబున । కుదకముదరపిల్లైనాతఁడోబిల్వేశా।
సదయాగంగాధరయా । యదనంజీవనముఁగూర్పుమనికోరుటయున్॥ ౪౬౨॥

ఉ॥ ఇమ్ముగఁబిల్చెధూర్జటిత్వమేహియటంచుజటాటవీప్రచా।
రమ్మెనరించుగంగనదిరంగదభంగతరంగయైతదా।
ఖ్యమ్మెనయంగఁదారకమహార్థముసాంఖ్యముచేస్ఫురింపఁగా।
నుమ్మలమేదఁజంద్రగిరినుండివెసంజనుదెంచెవింతగాన్॥ ౪౬౩।

ఉ॥ ఓటనుచంద్రశైలభవయద్దిసుధామయవారిపూరగా।
నూటలఁజాలఁగ్రాలెమఱియుత్పలమాలికలోలిరాజిలన్।
బాటిలెఁబోవినీలయయిభాసిలునయ్యమునాకృతింగడున్।
వాటముమీఱఁగానదియెవాహినినీవయవుంగనుంగొనన్॥ ౪౬౪॥

శా॥ ఆచంద్రాచలపాదదేశమునయందావిర్భవించెంజనెం।
బ్రాచీన్ శ్రీదదిశన్సువర్ణముఖరీప్రఖ్యాతినయ్యేఱిద।
ప్రాచిన్వచ్చెనుయామ్యదిఙ్ముఖియునై పాపాత్ములంబ్రోవఁగా।
నాచంద్రార్కముగాఁగసద్గతులిడన్ హర్షాప్తికీనీవగా॥ ౪౬౫॥

కం॥ ఆచంద్రాత్మజనర్మద । యేచెంబురుకుత్సుఁగూడియేరేవపురే।
యీచంద్రాత్మజనీవయె । నేచెంబిల్వేశుఁగూడనిలువశరధినే॥ ౪౬౬॥

కం॥ ఇనజయమునవిధుభవతో । నెననిశివునివిశ్వనాథుహితమతిఁగనెన।
య్యినజయమునవిధుభవతో । నెననెంబిల్వేశ్వరుండ్వమేహినదియిదే॥ ౪౬౭॥

కం॥ భాగీరథిశంతనునెల । నాగవసుజననిమృతులకెనాకమొసఁగుసో।
మాగజత్వమేహియోసాం । ఖ్యాగమమునఁదారకమునహామనఁగనిడున్ ॥ ౪౬౮॥

కం॥ పర్వతరూపుఁడగేశుఁడు । పార్వతిరోధస్వినీస్వభావయుఁగానన్।
శర్వుఁడుబిల్వేశుఁడుకం । జోర్వీధరముదనుమధ్యయుమనీవయవున్॥ ౪౬౯॥

కం॥ పొందుగనార్షికులనెముద । మొందించునుదీచినీవయుత్తరయదియా।
నందఱుఁదనియించుటనిదె । వందితదాక్షిణ్యనీవవరయుత్తమయా॥ ౪౭౦॥

కం॥ శ్రీవనమునఁబ్రవహించుట । శ్రీవిలసత్పర్ణఫలపరిష్కృతయవుటన్।
నీవయశ్రీపర్ణయనం । గావిలసిల్లెశ్రీఫలయనఁగనుశ్రితనుతయై॥ ౪౭౧॥

కం॥ శ్రీవనమునఁబ్రవహించుట । శ్రీవాహినియనఁబరఁగెఁబ్రసిద్ధము గాఁగన్।
ద్రావిడమునఁదిరువెళ్లము । నావినుతింగనియెనీవనదితటపురమున్॥ ౪౭౨॥

కం॥ ద్రావిడులుత్వమేహియనం । గావిలసీలు నాఖ్యకర్థకల్పన నేయం।
గావెడలిరినీవాయని । నీవయునివయనియునుండునిర్జరభాషన్॥ ౪౭౩॥

కం॥ వాణియెనీవయనంగా । రాణించెను బిల్వనాథుప్రబలపరమునన్।
స్థాణుండగునప్పశుపతి । క్షోణినపాశయయిమించెగురుతరమహిమన్॥ ౪౭౪॥

కం॥ ఎంతటిమూఢునినేనియు । నంతర్వాణిగను జేయునంతర్వాణిన్।
సంతతమాకారణమున । నెంతురునీవయనిదాని నెలమినభిజ్ఞుల్॥ ౪౭౫॥

కం॥ సర్వాఘంబులఁబాపుట । సర్వజనులఁబావనులనుజలుపుటమఱియున్।
శర్వతఁబొందించుటనది । శర్వాణియుఁబావనియనఁజనునీవాఖ్యన్॥ ౫౭౬॥

కం॥ తానీరవాహినియనం । గానెసఁగుటనీవయనఁగఖ్యాతింగాంచెన్।
వానీరప్రాచుర్యం । బైనెగడుటనీవనాఁగనదినదియొనరున్॥ ౪౭౭॥

కం॥ నీవారధాన్యమేనది । యేవడినిన్వేలయఁజేసి ఋషులనుబ్రోచున్।
నీవయనెడిసదభిఖ్యన్ । దావహియించెనదియద్ధితాపసనుతయై॥ ౪౭౮॥

కం॥ ఎందునివాపాంజలులిడఁ । బొందెదరప్పడపెతరులు పుణ్యగతులన।
చ్చంద్రధరజనివనీవయ । నందగెఁబిత్రుముక్తికారణమయితనర్చున్॥ ౪౭౯॥

కం॥ హారయహారాత్రభవం । బైరాజిలునట్టులెఱుఁగనగునరయంగన్।
సారమునీవసినీవా । లీరితమానూరుగఁగుహువెసఁగుఁగుఱఁగటన్॥ ౪౮౦॥

కం॥ నిర్ణయముగవాగ్వాదిని । వర్ణములాద్యంత్యములిటవ్యత్యయముల్గా।
వర్ణితమునీవయనిమం । త్రార్ణములనునివయనియురహస్యమదెయిదా॥ ౪౮౧॥

కం॥ నీసున్ననలువదైదవ । దౌసముచితముగనువాశివోఽహమనియవున్।
వాసిగముప్పదియాఱవ । దౌనీశివలతశివగతియగునీవగదా॥ ౪౮౨॥

కం॥ నీవనవార్థకగావున । నేవారెదియభిలషింరితుచ్చుందానిన్।
వేవేగబ్రహ్మవిష్ణుశి । వావిష్కృతభావములనునభినందింపన్॥ ౪౮౩॥

కం॥ నీవాభననుచుఁబార్వతి । దేవిభవానియను పేరఁదేజరిలుందా।
శ్రీబిల్వనాథుసామయి । నీవాభయెమైనఁబూర్ణనిఁగలోఁగొనదే॥ ౪౮౪॥

కం॥ ఏవారినేరుగానీ । నీవానీవారమన్ననీవానదిదా।
జీవన్ముక్తులఁజేయున్ । జీవలతయెవేదమాతశివలతయిదిగా॥ ౪౮౫॥

ఐం॥ వ్యాధిదారిద్ర్యనిర్వాపణచణయాయురారోగ్యభాగ్యదయగునునీవ - హరిసతినా।
బుద్ధివికాసంబుఁబొసఁగించిసర్వార్థసిద్ధిదయగుసిద్ధసేవ్యనీవ - శివయవునా।
తనుమధ్యమాకారవినుతమైమధ్యమావాక్సిద్ధిసమకూర్చువఱలునీవ - వాణియెనా।
సచ్చిదానందులఁజలుపునుని జభక్తులనుముక్తులను జేఁతలలితనీవ - లలితయెనా।
దక్షిణామూర్తిరూపిణిదానగుటను - ధార్మికతన్।
దక్షిణాభిముఖియకాఁగఁదనరునీవ - దక్షిణగా।
తన్నెదురొకనిస్నానంబుఁదగనొనర్పఁ - దజ్ఞునికే।
నుత్తరోత్తరశుభవృద్ధినొసఁగునీవ - యుత్తమగా॥ ౪౮౬॥

బిల్వవృత్తము॥ బిల్వదళాపగ । బిల్వదళాంబిక । బిల్వకుజేశుఁడు । గొల్వయినిల్వఁగ॥ ౪౮౭॥

శా॥ దుర్వాసుండుతదాపగన్మునిఁగి సంతుష్టిందదీయామృతం।
బుర్వీభృత్తనయాధినాథునికి నిత్యోత్సాహమింపొందఁగా॥
నిర్వర్తించె మహాభిషేకమును బూన్క్రింబిల్వపూజందదీ।
యోర్వంచత్ఫలసన్నివేదనముఁదా నుల్లంబు రంజిల్లఁగాన్॥ ౪౮౮॥

## మౌక్తిక విరహము.

కం॥ ఆనీవాశైవలినిన్ । మానితసురసాలసాలమంజునికుంజో।
ద్యానంబున మౌక్తికముని । ధ్యానంబొనరించె ముక్తిఁదద్దయురక్తిన్॥ ౪౮౯॥

కం॥ సూచీముఖుఁడనియెడునొక । ప్రాచీనసఖుండు చూడఁబనివడివచ్చెన్।
వీచులెడలుకడలివలెన్ । దోఁచునతని మౌక్తికముని దూర్జటిఁజూచెన్॥ ౪౯౦॥

ఉ॥ చూచిసఖుండ మౌక్తికుఁడ చూడఁగవచ్చితి నిన్ను నన్న నాఁ।
జూచుటనెల్లకల్లస్మరసుందరుఁడూరకయుండె నుండఁగా।
నాచతురుండు నిష్ఠనొకొ యౌనితఁడిట్లని యెంచి కాంచలే।
వేచెలి ముక్తినీశజుఁడవేటికి నిట్లలయంగ నావుడున్॥ ౪౯౧॥

తే-గీ॥ ముక్తిపదమంత్రమున మోహమూర్ఛఁదెలిసి । తేజివికసితనేత్రుఁడై తివిరిముక్తిఁ।
గాంచియరుదెంచితే యనుఁగాయటంచుఁ । బలికె మౌక్తికుఁడాతఁడ బ్రింబుఁబొంది॥

తే-గీ॥ అచ్చరలజిల్వచెల్వాలనలరఁడుకన । మనుజకన్యలఁదలఁచునే మౌక్తికముని।
యేటికిమునీంద్రకన్యకలోటు మేటి । నైనదుర్వాసునుతముక్తియైననుండు॥ ౪౯౩॥

ఆ-వె॥ అనుచునిశ్చయించియాత్మలో మౌక్తికు । తోడనిట్టులంచుఁదొడఁగెనుడువ।
ముక్తిఁగాంచినిన్నుముదమొందఁ జేయంగ । వచ్చినాఁడనన్న నెచ్చెలిఁగని॥ ౪౯౪॥

ఉ॥ రక్కసుచేతఁజిక్కకడురాయిడిఁబొందుచువందు సుందరిన్।
జక్కఁగఁగంటి వెక్కరణిఁజూమునినుంగని మాటలాడెనె।
ట్లక్కజమయ్యెడున్మఱియు నక్కమలాయతనేత్రనాపయిన్।
మక్కువగల్గియుండెడునె మాటిడకొప్పఁగఁ జెప్పుమంతయున్॥ ౪౯౫॥

కం॥ అనవిని సూచీముఖుఁడి । ట్లనియెనుమౌక్తికుఁడ నాకునతిచిరకాలం।
బుననుండి శిష్యురాలా । వనితామణిగీతనృత్తవాదిత్రములన్॥ ౪౯౬

శా॥ కంజుండున్న నుగారవించుగురుతంగానంగనుంగొందునే।
ష్టుంజంద్రాననవానినాతనయఁగా బుద్ధింగ్రహింతున్ స్మరిం।
తుంజంద్రగ్రహణంబుగాన సురచేదుఃఖంబునుంబొందుము।
క్తింజూడంగనినుందలంతుననురక్తింజంద్రచూడాత్మజున్॥ ౪౯౭।

కం॥ ఒసఁగెను నాకుంగంజుం । డెసకమెసఁగనొక్కహారమెలమినదియెదన్।
బొసఁగంగంగంటిఁగనియు । ల్లసితమిదియటంచు ముక్తిలలనయ్యనెనన్॥ ౪౯౮॥

తే-గీ॥ కనుఁగొనవెయమ్మయిమ్మౌక్తికస్రజమని । యెత్తిచేతికినిచ్చితినిష్టమేని।
దాల్పుమంటినినాకిదిదాల్చనట్టి । యోగ్యతయుభాగ్యమెదియనియువిదయనియె॥

చ॥ అనఁగనుమౌక్తికాధిపసుధాంశుసహోదరపుత్రిముక్తనీ।
కొనరదెమౌక్తికస్రజము యోగ్యతకేమికొఱంతభాగ్యము।
న్ననుదగునీకెనిక్కముగనల్వగదీనిఁబరిగ్రహింపుమిం।
పెనయనటంచునేనిడితినింతిస్వతంత్రులుమీరలంచనేన్॥ ౫౦౦॥

చ॥ అనవుడుమౌక్తికస్రజములబ్బెడునుబ్బఁగనీకనేకముల్।
గనియెదునాదుపల్కనుచుఁగల్కినివీడ్కొనివేడ్కమీఱఁగాఁ।
జనికనిబిల్వనాథుసభఁజక్కఁగనెక్కశుభోదయోక్తివిం।
టినిశివకేశవోక్తులవడిన్నినుఁగన్గొనితెల్పవచ్చితిన్॥ ౫౦౧॥

చ॥ అననదియేమితెల్పుమనియక్కఱమిక్కిలివేఁడెమౌక్తికం।
డనెనతఁడేమివింతయనియాడెదస్వాశ్రితవాంఛితంబెయాఁ।
గనభగవన్నిదేష్టమదిగావలెముక్తికిమౌక్తికర్షికిన్।
ఘనముగఁబెండ్లియన్ననుడికారముగాకమఱేదిలేదటన్॥ ౫౦౨॥

మ॥ అనుచుందెల్పననల్పకౌతుకముతోనమ్మౌక్తికర్షీశ్వరుం।
డనువొందంగనెఁబారవశ్యమునుబ్రహ్మానందముంబొందెనాఁ।
గనుసంఫుల్లసరోజనేత్రుఁడగుచుంగ్రాలంగఁబూర్ణేందుశో।
భనునెమ్మోముపుడుబ్బనుబ్బనెడల్వలెక్రన్నసంబొల్కఁగన్॥ ౫౦౩॥

ఉ॥ ముక్తకమౌక్తికస్రజముముందెయొసంగియొసంగఁజేసితీ।
మౌక్తికుఁడైననాకుశుభమంజులవార్తనుచెప్పినిల్పితీ।
వుక్తులుపెక్కులేలనినునుల్లమునందుఁదలంతుమౌక్తిక।
ప్రాక్తనభాగ్యరూపుఁడనిభావమభిఖ్యకుఁబొందియుండెదున్॥ ౫౦౪॥

## ము వనితా వర్ణనము.

కం॥ పులిగడిగినముత్తెంబుచి । కిలినేసినమరుకటారికృతకఘనతటి।
త్తలలలనమునితనయయే । నెలనెలఁతయొప్రాద్దుసతియొనీరజుప్రియయో॥ ౫౦౫॥

చ॥ కనుఁగొననాఁడ్రభాతసువికస్వరవారిజమాననంబుఖం।
జనయుగళంబుదృగ్యుగముజక్కవదోయికుచద్వయంబుతి।
న్ననినడయంచమేల్నడగనల్వగుకోయిలచిల్కపల్కులా।
ప్పనుదినలక్ష్మియోయనఁగభాసిలునాసుదతిందలంచెదన్॥ ౫౦౬॥

ఉ॥ తానధరద్యుతిన్నెఱులతద్దయుమేల్జిగినీలకంతులన్।
బూనికినాడఁజేయుశిఖిభూషితులన్నఖరాళివైశమే।
మానులసంధ్యవార్వఁగనుమానుగనూల్కలుపున్నిజోరులన్।
గానఁగఁజేయుశోభనముగాదాకొయయ్యదిసాంధ్యలక్ష్మియున్॥ ౫౦౭॥

చ॥ పడుచులిరులారఁదారలుగఁగోరులుసోముఁడుగాఁగమోముబ।
ల్పజపగుకన్నులెన్నఁగలువల్గనుబల్కులుగాఁజకోరముల్।
గుబుచలుగానిచేతులనుగొప్పగుచన్నులుదండచెండ్లుగాఁ।
దెఱవనిశేందిరాకృతిగఁదేజరిలుంగనఁజామశ్యామగా॥ ౫౦౮॥

చ॥ సులలనచూపుగొంతుకయిసుందరమాదరమారమాకమా।
నెలఁతుకవేణియాఱునుడినీలహరిన్లహరిన్హరిన్నగున్।
వెలఁదుకనవ్వుమోమునడవెన్నెలయైనెలయైలయైకయై।
యలరెడురూపుమైపిఱుఁదునప్సరసన్సరసన్రసస్థైనున్॥ ౫౦౯॥

ఉ॥ ఖంబోకోకౌనుసుందరముఖంబుసుధాకరమండలంబుశం।
ఖంబుగళంబుకోకిలసఖంబుస్వరంబగుశంబరారిపుం।
ఖంబులమీఱుఁజూడ్కులనఖంబులమాడ్కినిరిక్కలొప్పనున్యాం।
ఖంబవురూపుముక్తికెనుఖంబుగదాయలదానిఁగూడినన్॥ ౫౧౦॥

ఆ-వె॥ కొండమీఁదనుండఁగొఱలుజేజేకొమ్మ । నాఁగనాగకన్యనదిమునుంగ।
నానెసంగుగుడినిమానవియానిల్వ । భువనమోహినియనఁబొలఁతియొతగు॥ ౫౧౧॥

ఉ॥ ఆయదెయానురోభవమహామృతకుంభయుగాఢ్యవాక్సుధా।
గేయయపూర్వమోహినిసుకీర్తితవర్తనయుక్తిముక్తిను।
శ్రీయుతసర్వరత్ననిధిశీలితలాలితసత్త్వదాత్త్వక।
ధ్యేయసురాసురార్చితనుతింపనుదానిఁదరంబెయేరికిన్॥ ౫౧౨॥

సీ॥ ముద్దియనెమ్మొద్దుమొగమునెంచుటగాదెతథ్యంబుగావిధుధ్యానమమర।
బిబ్బోకవతిగబ్బిగుబ్బలెంచుటగాదెబిల్వేశ్వరునినేవవిశ్రుతముగఁ।
బాలఁతుకనడకనుబొసఁగనెంచుటగాదెయంచరౌతునుబ్రస్తుతించుటరయ।
సుందరీరత్నంబుసొగసునెంచుటగాదెశ్రీమహాశక్తిఁబూజించుటగనఁ।
దరుణిషోడశకళలనుధ్యానమొనరఁ । జేయుటేపరమాత్మకుఁజేయుషోడ।
శోపచారంబులగుఁగాననాపయోజ । పత్రనేత్రస్మరించెదభక్తిముక్తి॥ ౫౧౩॥

కం॥ వలచెదనుముక్తినేయది । యలవడినంజొలుసుఖసముద్రుఁడనగుదున్।
జెలఁగుదునదెయమృతముగా । కలస్వర్గముసుఖముసుఖమెయమృతమమృతమే॥

కం॥ అదియొదవదేనినాకున్ । వదలిమదీయంబుస్థూలవపువపుడుముదం।
బుదలిర్పసూక్ష్మతనువున । సుదతీమణిముక్తిఁబొందిసుఖియింతుననన్॥ ౫౧౫॥

చ॥ శివశివయేలయట్లనెదుసిద్ధముగానదినీకెదక్కని।
కవడిగఁబెండ్లియానిపుడుకార్యముపాయముఁజెప్పఁజేసెదన్।
దివురకతెల్పుమంచతఁడనెన్వినిమాక్తికుఁడైననుండుమం।
చువలులభ్రానిజాబొసఁగిసుందరికందఁగఁజేయుమెట్టులేన్॥ ౫౧౬॥

కం॥ అనినర్మసఖుననిచిపలు । కునుహాయనివెచ్చనూర్చుఁగోమలియరుదెం।
చెనటంచుఁగౌఁగిలించును । మొనసిబయలుచనెడుఁబడెడుముక్తశ్రియటన్॥ ౫౧౭॥

ఉ॥ అత్తఱిమాత్తికుండటనిశాంతముఁబాసినిశాంతమందొగిం।
దత్తటినింజరించునదిదల్పమనల్పమయంచునెంచుగ్లా।
యత్తమిలంగఁగ్రుంకుమలహాయనుఁదన్ముఖసామ్యమేనగో।
చిత్తమురంజిలంగనఁగఁజేయనెకోతపమంచుఁజింతిలున్॥ ౫౧౮॥

సీ॥ పుణ్యభూమియిదంచుఁబొలఁతిచరించినతత్ప్రదేశంబునఁదనరఁదిరుగు।
యంత్రమయంబంచునదిచెరలాడినయవనినినడుగులయందునిలుచు।
దానియాలాపమంత్రతతియంచుగ్రహించియటశుకపికరవమాలకించు।
జపతపోధ్యానాప్తిసవరింపఁదత్పదస్మరణనువిరహార్తిసతిమదిఁగనుఁ।
జంపకామోదమునుగనిచానయరుగు । దెంచెనంచనుహర్షించుఁదెలిఁగుపడమి।
నున్నరనియార్చుఁగొమ్మపైనెలయుకమ్మ । తెమ్మెరయటంచునెమ్మినిసమ్మతించు॥

ఉ॥ కన్నులఁగట్టినట్లతివగన్పడనెల్లెడనుల్లముల్లసి।
ల్లన్నిఖిలప్రపంచమువిలాసవతీమయమంచునెంచుఁద।
న్నెన్నకొనుంగృతార్థుఁడనియెయ్యెడఁదొయ్యలిఁగానకయ్యెనా।
విన్నను వేలనేనయితివీఱేఁడినంచుఁదలంచువందురున్॥ ౫౨౦॥

కం॥ నిలుచుంగదలకనడచున్ । బొలుపఱఁగూర్చుండుఁబండుఁబొరలున్ లేచున్।
దిలకించుదానిపోయిన । వలనునుహాయనుచుఁబలుకుఁబలుమఱుఁబనుపున్॥ ౫౨౧॥

## సింహావలోక పంచపాదోత్పలమాల.

హాయనునీలనీరదకచాయనుఁబూర్ణసుధాకరాస్యబిం।
బాయనుఁగామబాణనయనాయనుశోణవిభాధరోష్ఠబిం।
బాయనుఁగంబుసుందరగళాయనునుత్తననిర్జితేభకుం।
భాయనుసింహమధ్యకలితాయనునూరుతిరస్కృతోరురం।
భాయనుఁబద్మజిత్కరపదాయనుఁగాంచనవిగ్రహాయనున్॥ ౫౨౨॥

ఉ॥ ముక్తియెమేలనున్మఱియుముక్తినెకోరెదనేననున్నదా।
సక్తుఁడముక్తిచేతననుసర్వమొసంగెదముక్తికైయనున్।
భక్తినిముక్తివల్లఁగనిభవ్యుఁడనైతిననున్విధేయుఁడన్।
ముక్తికనున్మదీయమనుమోదమునిత్యముముక్తియందనున్॥ ౫౨౩॥

ఆ-వె॥ ఉక్తిభక్తిభుక్తియుక్తిరక్తియుసక్తి । సూక్తిపక్తివ్యక్తివక్తియనెడు।
పదములందుమొదలఁబొదలమువర్ణము । ల్బాగటంచుఁబలుకుఁబ్రాఢిమెఱసి॥ ౫౨౪॥

కం॥ ముక్తియనిబ్రాయునెల్లెడ । ముక్తిప్రతిమనులిఖించుముదమునఁగనెడున్।
ముక్తర్షియిట్టులుండఁగ । ముక్తియటన్మాక్తికాశమొనయంగఁగడున్॥ ౫౨౫॥

## ముక్తావిరహము.

మ॥ తనతంబ్రిందనుజుండునెంచుటయునాతండున్వెలింబాఱవెం।
టనువాఁడేగుటనాలకించియయయోనాయందమేయింతకున్।

మొనసెంగాకతమైయటంచడలనమ్ముక్తాంగనారత్నమా।
యనవీతెంచెనుపశ్రుతీరితముకంజాంతంబెయానయ్యెనాన్॥ ౫.౨౬॥

కం॥ కనికడుముదమునుభయమును । బెనఁగొనఁదనపితఁదలంచివెతనొందఁగయ।
శ్రేణిపలికెముక్తిజనకుఁడు । దనరఁగమనియుండెడునవిధ్వనియదివినుటన్॥ ౫.౨౭॥

చ॥ కడుముదమొందియుందరుణిగాంచుటఁగాంతవియోగమెంతయున్।
వెడవిలుతుండుగాఁజియనుబెట్టఁగబిట్టుగనూర్చిమూర్ఛచేఁ।
బుడమిపయింబడెంబడఁతిపొందెడలంబడునించువిల్లనం।
జడయళిపాళినారిగనుజానఁగనన్మరుఁడేనివాలఁడే॥ ౫.౨౮॥

మ॥ చనవొప్పంజెలియోర్తుసార్తియగుచున్శైత్యోపచారంబులం।
బొనరించెంగనువిచ్చికాంచుమునిజస్వాబ్ధించెనోయమ్మనీ।
ఘనశత్రుండతఁడండ్రిమేల్గనియెవేడ్కంజెందకిట్లేటికే।
పెనువంతంగనినావుకాంతవిరహాప్తింగాంచితంచెంచెదన్॥ ౫.౨౯॥

చ॥ అతఁడెతఁడొక్కొ కాంతమణియక్కరొనిక్కముఁదెల్పుపొల్పుగం।
జతురతఁదెత్తునిత్తఁజినెజానుగనేర్తునుగూర్తుమిమ్ముస।
మ్మతముగమూర్తికావళియుమంజులనాయకరత్నమొప్పన।
ట్లతివరొనిన్నునాతనినటంచనముక్తివచించెనూక్తులన్॥ ౫.౩౦॥

తే-గీ॥ గుణవతివిసూచియనుపేరఁగొఱలుదాన । వమ్మరోరత్నములహారమిమ్ముగాను।
గూర్పనేర్పననీకెకాయేర్పడియెడిఁ । గానవాకొందునూఁకొనుమూనిచెలిమి॥ ౫.౩౧॥

మ॥ కనుఁగొంటింజెలిబిల్వనాథవసతింగాంతాకృతింగాంతునె।
క్కనిమున్నక్కడదారుకావనమునంగామింపమున్యంగనల్।
వినుతాకారవిశేషుఁడాశివుఁడనన్వొల్గొందుఁగందర్పుఁగ।
మ్మననీఁడమ్మకచెల్లవానికెనవాఁడానమ్ముయిమ్మాఁగనన్॥ ౫.౩౨॥

సీ॥ నలువారఁబున్నమనాఁటివెన్నెలతేనివడువుననడరెడువానిమోము।
జయలక్ష్మికల్యాణసముచితవేదికభంగినెసంగెడువానిఱొమ్ము।
దిక్కరితొండమునిక్కునుక్కడఁగించుబలునిడువులునగువానిచేతు।
లిభవైరియనఁదోఁచుశుభమధ్యమునఁనేచువడిమించుఁగడిమినివానినడక।
కరఁగిపోసినబంగారుకరణివాని । వన్నెచెన్నెసలారెడువానికన్ను।
లన్నఁగన్నులవిల్తునియబ్జశరము । లెన్నఁదరమానెదరమానెయన్నుమిన్న॥ ౫.౩౩॥

చ॥ అరయఁగనల్వగానిచతురాస్యుఁడుకృష్ణుఁడుగానియట్టిశ్రీ।
ధరుఁడునపంచవక్త్రుఁడగుధర్మధరుండసహస్రనేత్రుఁడా।
సురపతిరుద్రభీతిపొడసూపనివూవిలుతుండునిత్యవూ।
ర్ణరుచివెలుంగుచందురుఁడునాప్రియకాంతుఁడతండుచూడుమా॥ ౫.౩౪॥

కం॥ అందరుశివనందనుఁడని।యందఱతనిగుణగణములనరసినరత్నం।
బందరుమార్తికుఁడనిపే । రందనరెడునతఁడనమునిరత్నంబెయగున్॥ ౫.౩౫॥

తే-గీ॥ పురుషరత్నంబతండునామ్రొక్కుఁగాంచి । పారిజాతసరంబొండుపరఁగనాకుఁ।
బాళిగానిడెనేదానిఁదాల్చినాను । దోడితేవమ్మనానాథుఁదొడఁగివడిగ॥ ౫౩౬॥

ఇంద్రవజ్ర॥ నీతండ్రిపేరేమని - నెమ్మినాతోఁ । జేతోహరుండాతఁడు - చేరిపల్కెన్।
గాతర్యమాఱన్మని - కన్యనంటిన్ । ఖీతిల్లసోఁకైవిధి - వేఱుచేసెన్॥ ౫౩౭॥

తోదకవృత్తము॥ సదయుఁడునాకొక - జాబునుబంపెం । జదువుమిదంచది - చన్గవనుండం।
బదిలముగానిడెఁ-బత్రికదానిన్ ।ముదమునదూతిక-వోలఁబఠించెన్॥ ౫౩౮॥

తే-గీ॥ ముక్తినీవాడుముక్తయమౌక్తికమును । గానస్త్రీరత్నమవుమవుగానమౌక్తి।
కాఖ్యుఁడనునేనురత్నంబనరసినన్నుఁ । బురుషరత్నంబుగంజేసిపొగడుఁగనవె॥

కం॥ అనిచదివిదీనికేమని । యనువుగఁబ్రత్యుత్తరంబునని చితివన్నన్।
నినుఁబంపఁదలఁచినానని । యనెముక్తియుదూతియుక్తమాయెటులగునాన్॥ ౫౪౦॥

మౌక్తికమాలా వృత్తము.

మౌక్తికమాల - న్మహితముదీనిన్ । మౌక్తికమాల - న్మఱియొనరింపన్।
యుక్తముగానీ - యురుతరచాతు । ర్యోక్తివితానం - బుఱునటులౌటన్॥ ౫౪౧॥

చ॥ వినతినిఁగొమ్మకొమ్మచనవేచనవేచనవేదినావాకో।
వినవొకొవానిఁబూనికనవేకనవేకనవేలనావెనీ।
వినతనునేలుమేలుమనవేమనవేమనవేమినాఁగనా।
వినుతునిఁదెమ్ముతెమ్ముపదవేపదవేపదవేగమెచ్చఁగన్॥ ౫౪౨॥

సభావృత్తము.

అనఁగానిమ్మని । యనఁగానిమ్మని । పనిచెన్నాయిక । పనిచెన్నాయిఁక॥ ౫౪౩॥

శా॥ నీవాశైవలినీప్రతీరమహివానీరోరుకంజంబునం।
భావింపన్వలఁబడ్డసింగమనవార్వ్యాహాంతరిందుండనన్।
భావప్రోద్భవకారబద్ధుఁడనఁగావర్తిల్లుముక్తర్షిసం।
భావింపంగనిదూతియిట్లనియెదేవాముక్తికేసెచ్చెలిన్॥ ౫౪౪॥

చ॥ అనవినిమౌక్తికుండుగడుహర్షముతోనిటురమ్మయమ్మనీ।
త్తినయననుందలంచునెకొతండునిచేతనుగంజుఁడీల్గెఁగా।
తనజనకుండుమెండుగముదంబునుబొందెఁగదామదీయలే।
ఖనుగనియుత్తరంబిడమిగాదెయయుక్తమనంగదూతియున్॥ ౫౪౫॥

ఉ॥ మానసికంబుగందపముమానకచేయునునిన్నుఁగూర్చినీ।
మానితనామమొందుటనుమౌక్తికమాలికనక్షమాలఁగాఁ।
బూనెడునీదుకమ్మనినుఁబోలెనుదాల్చునురోజసీమనీ।
జ్ఞానగుగీతమంత్రములసమ్మదమిమ్ముగసంజపించెడున్॥ ౫౪౬॥

ఉ॥ కానసుబ్రాణయుక్తయయికాంక్షచలిర్పఁగనున్నదయ్యన।
న్నాననబోజినీకడకునంపెస్వమౌక్తికమాలనీకిడం।

గానిదెయంచునిచ్చికొనఁగారతిఁగిమ్మననీనిదానిన।
మ్మానినిఁదెత్తుఁదెమ్మనినమాచెలియింటికివత్తెతెల్పుమా॥ ౫౪౭॥

శా॥ నాముక్తర్షియనెన్నసఖీయుచితమానామాటగాఁజెప్పుమా।
రామారత్నముతోడబిల్వపతిదుర్వాసుల్వివాహంబునుం।
బ్రేమన్మాకొనరింపయత్నమునునేర్మింజేయుమంచన్నమే।
లౌషేలంచనుదూతివీడ్కొనిమహాహర్షంబుతోఁజెప్పినన్॥ ౫౪౮॥

## ముక్తిముక్తిజనక సందర్శనము.

చ॥ కొనకొనిసక్తిముక్తిజనకుండుదనుంగనరాఁగఁగాంచినా।
యనయనియంకపాళినిమహాత్మునిఁజేరిచియాతఁడక్లైచే।
యనెసకమొప్పనప్పగిదినప్పగతుండజెనీవుతప్పిత।
ప్పనినుఁదలంచివందితినివచ్చితెభాగ్యమటంచుఁబల్కఁగన్॥ ౫౪౯॥

చ॥ అతఁడనెముద్దుబిడ్డవినుమయ్యెడనయ్యనురుండునన్ననా।
తతభయుఁజేసిగాసియిడదైవతనాథునిబిల్వనాథునిన్।
గతివగునాకునీవనఁగఁగ్రన్ననఁదత్ప్రహితుండుతండుఁడు।
ద్ధతుఁడయివానిఁగూల్చెమఱితత్పరివారజనాళిలీలగాన్॥ ౫౫౦॥

చ॥ కనుఁగొనవమ్మనీవయనిఖ్యాతివహించినయొక్కవాఁకయ।
క్కనకమహీధ్రకార్ముకునికట్టెదుటంబ్రవహించుబిల్వకా।
ననరమకంతసూత్రమననల్వగుఁగోరితినీరువాహినిం।
జనవుననిచ్చెబిల్వపతిశంకరతుల్యవదాన్యుఁడన్యుఁడే॥ ౫౫౧॥

కం॥ నీనేమమెఱుఁగవచ్చితి । నానురరిపుఁడెట్లునిన్నునరసెనటన్నన్।
నేసత్యముగాఁబలికెద । నీసత్కృపఁగన్యకగనెనెగడితిఁదండ్రీ॥ ౫౫౨॥

కం॥ అనినుడువుడుఁగడుముదమునఁ । దనతనయంగౌఁగిలించితపసియిటులనెన్।
మనబిల్వపతియనుగ్రహ । మునమనితిమియింకమనలమొనయుశుభంబుల్॥ ౫౫౩॥

## ముక్తికన్యానిశ్చితార్థము.

మంజుభాషిణి॥ అనిపల్కుచుండఁగనె - యద్భుతంబుగాఁ।
జనుదెంచియవ్విధులు - చంద్రభ్రాతతో।
ననిరార్యముక్తిముని - కబ్జభృజ్జుఁడా।
మునికింద్వదాత్మజను - ముక్తినీవెనాన్॥ ౫౫౪॥

ప్రహర్షిణి॥ మెండైసంతసమొగి-మేరమీఱిదుర్వా। సుండుంగూఁతునుగనె-జోటిమేటిహారం।
బొండుంజూపెనుగని-యుక్తమిత్తునంచా।తండుంబల్కెనువిధి-దానవారులెంచన్॥

మత్తకోకిల॥ వెన్నుఁడున్నలుమోమువేలుపు - వేడ్కమైనరుదెంచిము।
న్విన్నవించిరిపండటంచును - బిల్వనాథునికాదటన్।
దన్నిదేశముచేతనాతఱిఁ - దత్పురిందిరదద్దయుం।
బన్నగాసమలంకృతింగని - భానిలెన్నవిలాసమై॥ ౫౫౬॥

## మార్తిక వివాహ సన్నాహము.

చ॥ అతులసుధామయాంచితవరాఖిలకుడ్యముభిత్తిచిత్రితా।
మితగురుమార్తికాయనమమేయకదళ్యురుమాలికోల్లస।
ద్వితతనుతోరణంబుధ్వజవిశ్రుతమున్ఘనతూర్యవర్యమై।
ప్రతిగృహమున్వివాహగృహభంగినెసంగెమనోహరంబుగన్॥ ౫౫౭॥

శా॥ గౌరీతీర్థమునుండిపందిరులాగింగైలాసనాథేశ్వరా।
గారంబంటఁగవేసిరీశవినతుల్గంజాద్రికందుండియుం।
పారన్వేసిరిపందిళుల్వరఁగనయ్యత్ర్యుద్భవాజ్ఞప్తులున్।
దారింగాంచఁగరత్నకంబళమనంతైవారెనేకాకృతిన్॥ ౫౫౮॥

శా॥ సర్వాశాపరిపూరకాంచితసరస్సంబింబితానేకకం।
జోర్వీభృచ్ఛిఖరాయితాయతవిమానోదారసౌధావళీ।
సర్వస్వంబువివాహశోభనకృతస్వర్గాధికంబీడ్యమై।
దుర్వాసఃపురమొప్పెనప్పుడుగడుందుష్టిప్రదంబిష్టమై॥ ౫౫౯॥

కం॥ అమరమునినరులుగొలిచిరి। విమలాశ్రితరక్షణైకవీక్షానిమిషున్।
గమనీయానిమిషంధృగ।నిమిషంబరిపాలితసదనిమిషన్నిమిషున్॥ ౫౬౦॥

కం॥ ఉల్లమునఁగొలిచిరెల్లరు। పల్లవపాణులుద్రిమూర్తివారిజవల్లిన్।
సల్లలితోల్లసితదయా। వల్లినిశ్రీవల్లినేకవల్లిన్నల్లిన్॥ ౫౬౧॥

సీ॥ జడముడిసడలించిచక్కఁజిక్కెడలించితలయంటెసంపెఁగతైలమునను।
బూదిపూఁతలుమాయఁబాసఁగంగఁగడుఁజాయనలుఁగిడెవలపులనలుఁగుఁబిండి।
నఘమర్షణస్నానమదియేలయనితానమాడించెగోర్వెచ్చనైననీట।
నారచీరఁద్యజించినల్వఁజల్వగ్రహించితుడిచెనుదానిచేఁదడియునాఱ।
సైకతచంపకగంధినవోజ్జ్వలాబ్జ।క్రమకరకృష్ణవేణిసైకతకళత్ర।
మార్తికునిఁబిలిగడిగినమార్తికముగ।సానఁబట్టినవజ్రంబుజాడఁజేయ॥ ౫౬౨॥

సీ॥ కట్టించెనళఁదియాపట్టుఁబుట్టంబునుగాంతుదీఱఁగనొక్కకమలపాణి।
పట్టించెఁగస్తూరిఁబచ్చకప్పురమునసలరుగంధమునొక్కహంసయాన।
పెట్టెసొమ్ములనెల్లఁబెట్టెదండలఁజుట్టెఁజెల్వొందఁగానొక్కసింహమధ్య।
బొట్టునెట్టనదిద్దిముందునిల్పెనునిల్వుటద్దమొక్కతెవేల్పుముద్దులాఁడి।
పసపుఁబూసిరాసయెసలారఁగాఁగుంకు। మాక్షతంబులిడిరియైత్రెముక్తిఁ।
గోరమార్తికుండవారసారూప్యంబుఁ। గాంచితంచుహాస్యకలనసతులు॥ ౫౬౩।

ఉ॥ శ్రీవిలసిల్లఁబెల్లుగఁగిరీటముఁబెట్టెనొకర్తెవాసర।
శ్రీవలెజాళువాజిలుగుఁజేలముమేల్వలెవాటువేసెనిం।
పైవెలుఁగొందనొక్కవికచాబ్జముఖీమణిమంజులంబులౌ।
పావలులీలమైఁదొడిగెఁబల్లవపాణియొకర్తయత్తఱిన్॥ ౫౬౪॥

కం॥ నీవాళియెత్తిరాదట । దేవస్త్రీలాత్మదృక్ప్రదీపితదీప।
శ్రీవిలసిలమంగళగీ । తావళులన్మాక్తికునకుహర్షమెసంగన్॥ ౫౬౫॥

మ॥ మునుమున్వెల్వడిరోలిదిక్కులదరన్ ప్రోయించుచుంబల్మఱున్।
ఘననిర్ఘోషములౌపిరంగులను వెన్కంబల్దుపాకుల్దగం।
గనుయోద్ధ్రులథముల్గజంబులుదురంగంబుల్భటుల్దార్యముల్।
వినుతానేకవరాప్సరోనికరముల్వేడ్కన్గడున్వెల్వడన్॥ ౫౬౬॥

మ॥ పవిశక్త్యుజ్జ్వలదండఖడ్గవిలసత్పాశధ్వజాంచద్గదా।
ఛవిమచ్ఛూలకరుల్సభార్యులగుచున్శక్రాగ్నికాలాసుర।
ప్రవరాంభఃపతివాయుయక్షపవిదిక్స్వాముల్మహోభోరణా।
శ్వవిపత్క్రూన్నరమాకరైణహయగోపత్యంచితుల్వచ్చిరా॥ ౫౬౭॥

చ॥ అమలినవారియైనవిబుధాపగనాఁగవెలుంగబ్రహ్మనూ।
త్రముజపమాలకుండికయురాజిలనిర్మలపుష్కరోడుచం।
ద్రములనమిత్రుఁడోయనఁగబ్రహ్మయుబల్విడివెల్వడెన్ స్వవా।
గ్రమణియెకాఁగశారదమరాళముశారదనీరదంబుగాన్॥ ౫౬౮॥

శా॥ కావింపన్గుహవాజితాండవమువిఘ్నధ్వాంతవిధ్వంసిసం।
భావింపన్సురచాతకాళిపొగడన్భక్తేష్టవృష్టిప్రదం।
బైవీట్వక్షమరుత్ప్రచోదితమునైయబ్జోత్థగర్జార్భటిన్।
శ్రీవిద్యుల్లతయుల్లసిల్లఁగనెదంగృష్ణాబ్దమున్వెల్వడెన్॥ ౫౬౯॥

మ॥ మొగినెక్కుమ్మడినెక్కినెక్కినమలన్మక్కుంటిపండుల్గడల్।
దిగమింగంగనువెల్గపండ్లుదినసక్తిన్సర్వభక్ష్యంబులన్।
జగదాద్యుండుగజాస్యుఁడున్వెడలెవిఘ్నధ్వాంతముంజోపిభ।
క్తగణంబుబ్బఁగసర్వసిద్ధులిడఁగన్దానెక్కిపెన్గెక్కుపైన్॥ ౫౭౦॥

ఉ॥ ముప్పదిమూడుకోట్లుసురముఖ్యులునైనికులైభజింపఁగా।
నప్పుడువచ్చెషణ్ముఖుఁడహర్పతితేజుఁడుమూసబాహుఁడు।
య్యొప్పులకుప్పవల్లియుమహోత్పలలోచనదేవసేనయుం।
జొప్పడదక్షిణోత్తరరుచుల్పచరింపశిఖావళాశ్వుఁడై॥ ౫౭౧॥

కం॥ తనదుషడక్షరమంత్రం । బునుజనులకుఁదెలుపునఁగఁబుత్రుండుమహా।
ఘనుఁడుషడాననుఁడైతన । ఘనతన్దెలుపుచునుమ్రోలఁగ్రాలన్జాలన్॥ ౫౭౨॥

మ॥ వినుతామర్త్యనదీసమేధితమునైవిధ్వస్తతాపంబునై।
ఘనకంఠద్యుతిభృంగమైసఫలమిష్టాభీష్టదంబౌచుశ్రీ।
తనుమధ్యాంచితకల్పవల్లియలరన్దాబిల్వనాథామరా।
వనిజంబున్వెడలెన్సురభ్యధిపతిస్వర్గోపురానీతమై॥ ౫౭౩॥

మ॥ తనకుంభంబులుదొండమున్నడకయుందన్విస్తనోరుప్రచా।
రనుతింబెల్పననల్పకల్పనలసర్వస్తుత్యముక్తావళిం।

దనమస్తంబున దాఁచుటంగనుఁగొనందద్భూతనాఁదోఁచుచ।
క్కనిమత్తేభమునెక్కి వెల్వడియె ముక్తర్షీంద్రుఁడత్యున్నతిన్॥ ౫౭౪॥

సీ॥ వీఁడఁటే మార్తికవిప్రశుతరత్నంబు శంకరదోర్వంశసంభవుండు।
వీఁడఁటే జన్నంబు వెలయంగఁగావించి నేనసృష్టించినసృష్టికర్త।
వీఁడఁటే లోకైకవీరుఁడౌ నాజానుమండలుఁ జెండినదండిదండి।
వీఁడఁటే మనముక్తిఁ బెండ్లియాడం బోమ విండ్లు రెండూనినపెండ్లికొడుకు।
కులము శక్తియు శూరత చెలువమమరు। వీని కెనయొరుఁడెందుండు వీనిఁగాంచు।
భాగ్యమబ్బెనటంచునుత్పలనయనలు। సూచిరానేచనకమని చోద్యముగను॥ ౫౭౫॥

చ॥ అనువుగవచ్చిరచ్చటికి నత్త్యనసూయలు పౌత్రిపెండ్లికిన్।
మునివరుఁడైన గాధిజుఁడు ముఖ్యహితుండగు శిష్యుపెండ్లికిన్।
ఘనులు సులక్షణాదులు సుకాంతసుదంష్ట్రిడిది పెండిలింగనన్।
జననుతుఁడౌ సునీతియను స్వప్రభు పెండిలిఁజూడ వేడుకన్॥ ౫౭౬॥

కం॥ తనదౌహిత్రిదిపరిణయ। మునుగన నార్వ్వండువచ్చె మోదముతోడన్।
ఘనులు వసిష్ఠాదిమునుల్। వనితలతో వచ్చిరధికవైభవమెసఁగన్॥ ౫౭౭॥

కం॥ మచ్చినవారల నెల్లన్। మచ్చికదుర్వాసుఁడు దగుమాటలఁ బ్రేమం।
బెచ్చఁగ సమ్మానించెను। సచ్చరితుఁడితండనంగ సకలజనంబుల్॥ ౫౭౮॥

క॥ మున్నుగను బెండ్లికూఁతుఁగఁ। జెన్నుగఁగై నేసిరంతఁ జెలియలు ముక్తిన్।
మున్నీటికన్నె నచ్చర। యన్నులవలె గౌరి నిన్సురాంగనలవలెన్॥ ౫౭౯॥

సీ॥ తలవాకిట నునిల్చుఁదనభర్తఁ బలుకంగ నీయమికనగట్టివాయి యొకతె।
యెదనెక్కొనియె నెక్కొ యిందీవరదళాక్షి పతిహృదయంబాఁగు పగిదినొకతె।
సామేన నెలకొని సగము నేసిముగనినరికట్టునా నొప్పనతివయొకతె।
పెనిమిటి నన్యాంగన నుజూడనీదన వేఁగంటియని నాథుఁ బిలుచునొకతె।
కాంతునెవ్వరునుం బొడఁగాంచనట్లు। తనునిఁగావించుకొనె నాఁగఁదనరు నొకతె।
తరమె యీముక్తిసౌందర్యమరసి పొగడ। ననుచుఁదగఁబాడె నప్సరోవనితయొకతె॥

## మార్తికోద్వాహము.

కం॥ ఇనుఁడు మకరముననుండఁగ। ననిమిషగురుఁడుండ మీనమందౌ లగ్నం।
బున మాఖశుద్ధపంచమి। నొన రెంబరిణయముహూర్తమురు శుభకరమై॥ ౫౮౧॥

కం॥ కన్యాదానము నేసెన్। ధన్యుఁడు దుర్వాసుఁడ వుడుస్థాణుభవునకున్।
మాన్యనకుస్మ త్తర్షిక। నన్యజ జయుఁడవు శివునికి నగపతిపగిదిన్॥ ౫౮౨॥

శా॥ కట్టెన్మంగళసూత్రమంచితుఁడు ముక్తర్షీశుఁడమ్ముక్తికిన్।
గట్టింపొందఁగ రశ్మిఁబద్మినికిఁ జక్రస్వామి వోలె న్రహి।
న్మట్టెదండలఁ బ్రాలపోఁతలకుఁగానన్ స్వాతివర్షంబుగా।
మెట్టించెన్సనెకంటి మార్తికుఁడు నెమ్మిన్మించు చేమబ్బునాన్॥ ౫౮౩॥

కం॥ అల్లునికత్రిజుఁడొసఁగెం । బెల్లుగవస్త్రాభరణసువిశ్రుతధనగే।
హొల్లసితక్షేత్రంబుల । మొల్లంబుగబహుగవాశ్వములదాసతతిన్॥ ౫౮౪॥

కం॥ చదివించిరంతనందఱు । నదనిదియనివివిధభూషణాంబరములనిం।
పొదవవధూవరులకుస్వ । ర్ణదీనదీనులకువృష్టిప్రకరములనఁగన్॥ ౫౮౫॥

పంచచామర॥ అరుంధతీవసిష్ఠులస్మ - హామువంబునంబొరిం।
బరంగనల్లదంపతుల్మ - భంబుగానుగాంచిరం।
తరంగమందువారియట్లు - తాముగూడియుండఁగన్।
స్మరించెగాధిజుండుదాను - జానకీవివాహమున్॥ ౫౮౬॥

కం॥ కంజాప్తుఁడుగదరవిపగ్రటం జేరఁగనీకరతికటందన్మిథునం।
బుంజాఱెఁగాలవశుఁడై । సంజయొసమకూర్పదూతిచందమునొందెన్॥ ౫౮౭॥

ఉ॥ యామినియొప్పెనప్పువదనాబ్జయునుత్పలమాలికాఢ్యయున్।
గాముకచిత్తషట్పదనికాయనికాయసరోజకుట్మల।
శ్రీముదరోజముక్తివలెఁ జెల్వయిమౌక్తికుఁజేసెవశ్యనిన్।
శ్యామయనంతమౌక్తికప్రశస్తయొనర్పదెశ్రీకుమౌక్తికున్॥ ౫౮౮॥

కం॥ హరిణీగణకరకలిత । స్ఫురితానిలవైద్యుతరుచిసురుచిరదీపో।
త్కరదీప్తముసురభిత్త్య । జ్జ్వలమైతేజోమయముగుశయనగృహమునన్॥ ౫౮౯॥

సీ॥ జీవదంతవుఁగోళ్లఁ జెల్వయి శ్వేతవరాహదంష్ట్రాధృతరసయనంగ।
శాతకుంభస్తంభసంభృతంబయి మేరుశృంగసంగతము జేజేనెలవన।
మౌక్తికస్రజ్మిశన్మల్లికామాలికాజాలమైచంద్రాంశుజాలమనఁగ।
గాలివరవుదిండ్లుఁబూలపానువుగల్గికడకులఁగ్రాలుపాల్కడలియనఁగ।
నొప్పమేల్మంచమునఁగూరుచుండి రెలమి। ముత్తియునుమౌక్తికుండునుయుక్తముగను।
విరులఁజల్లుచునలరువీవెనలవీచు । కీలుబొమ్మలునూడిగంబోలిఁజలుప॥ ౫౯౦॥

తే-గీ॥ అల్లమంచంబుదంపతీసల్లలితము । దర్పణాత్మకకుడ్యవితానమందు।
వెలయఁగంబ్రతిబింబించువిధముఁజూడ । దిక్పతులుదానిఁగొనిచనుతెఱఁగుదోఁచె॥

తే-గీ॥ సుషిరతతతాళమురజముల్ శోభనంపుఁ । బాటలాటలువుత్రికాకోటినెరప।
నప్సరసలల్లనల్లననానెపమున । జుణిగిరటువృద్ధవేశ్యలవొప్పెలర్ప॥ ౫౯౨॥

కం॥ తలయెత్తవుతిలకింపవు । పలుకవుగదియవుకలయవుపంతమొతపమో।
వలవునిలుపవశమాయని । చెలువుఁడుముస్మన్నమించిచెలువం జెనకెన్॥ ౫౯౩॥

సీ॥ పాణిపల్లవమొకొపద్మంబొకోకందుననికరగ్రహణమునమరఁజేసె।
మీఁదఁబామనిపల్కిమెలఁతుకదలయెత్తజడయనిచెక్కులనిడియెముద్దు।
లివిశంఖచక్రములవునొక్కోయనిగళస్తనములనివిరెను జక్కఁబుణికె।
నీవినావిగకొందునీవడినంచునునీవినిసడలించెనెలఁతపెనఁగ।
నాయకుఁడతండుమౌక్తికుఁడాయతివయొ । ముక్తిముక్తయెయగునైక్యముక్తముగద।
తన్మహానందమెన్నంగఁదరమెయొరుల । కనుభవైకవేద్యంబనియనఁగనెతగు॥ ౫౯౪॥

కం॥ అనుదితవాక్యయదత్త । ప్రణయాలింగనగణయునరచితరుచిరచుం।
బనవిరతియువిహితప్రా । సనాసనిసువృత్తమువలెసవియలరించెన్॥ ౫౯౫॥

కం॥ తమతపములకనుఫలముగ । రమణియురమణుండుగూడిరత్యానందం।
బమరఁగనఁదానిఁగేలనఁ । బమిగూతికరీతిఁదొలఁగఁబరవెఁబలఁగన్॥ ౫౯౬॥

ఆ-గీ॥ నిదురవారిఁజేరనేరకరాతిరి । తోడఁగూడవీడెఁగ్రిడబాపలుఁ।
జిన్నెలగుచువారినేవించిమించెన । త్సంగరంగదాయసముసమానము॥ ౫౯౭॥

శోభన మహాస్త్రీ వృత్తము.

చూడంగదేచంద్రు - సోఁకెంచుంబరిది - కొంపెఁగెందామలు - శోభనమే।
వాడెంగదేకల్ప - వల్లిమతలియిది - నానిల్లెమంజరులు - పాగనమే।
వీడెంగదేరిక్క - పిండొప్పెనస్థముల - బింబంబునంటులు - రిలనమే।
యాడంగలేదేల - యంచన్నశోభనము - హాస్త్రీయిదెసనిరి - యాఘనమే॥ ౫౯౮॥

మత్తకోకిల॥ చిత్తజాయిరునిన్వసంతునిఁ - జేరియావనదేవరా।
మత్తకాశినిరంజిలుంగప - మంజుకీరముబింబమున్।
జిత్తగించెనుగాంచుఁబంచని - చెల్వగిన్కఁగనుంగొనన్।
మత్తకోకిలవృత్తమిత్తటి - మాన్యమానినిరంగనన్॥ ౫౯౯॥

మంగళ మహాస్త్రీ వృత్తము.

పొందఁగనువృష్టిఁగ్రరు - ఛుక్కలుప్రహర్షమును - బొంపగమహార్ధులువగంగన్।
జెంపఁగముదంబుఁగవి - రులుపందిరులుఁ - పెంపఁగనుభూసురులశీగీన్త్రీ।
మందిరులురాజులును - మాన్యులచుబంధువులు - మైత్రికలవారలునుబృత్యుల్।
పొందనిలనందఋత్ర - పూజ్యదేవమాపరులు - పొందిరిమంగళమహాస్త్రీ॥ ౬౦౦॥

పౌరుష ప్రశంస.

మ॥ అనెమృత్యుంజయుఁడత్రిపుత్రకునిశోనైచేంయక్రోధిగాఁ।
గనునీవొందితిగాదెలత్ఫలములింకంగోరుమాక్రోశమున్।
జనదెల్లప్పుడుదానిఁబూనవిదువన్నైకంబయేనుంచఁజా।
ప్పనహాసున్నములేకపమ్ములమునొంపుంగెంపుఁబుట్టించునే॥ ౬౦౧॥

ఉ॥ నెట్టనఁగోపమున్విడువనెమ్మదిగల్గదుదానినెప్పదుం।
దొట్టమినెట్లసాధువులఁద్రుంచుటఁద్రుంపమిసాధురక్షణం।
బెట్టగుఁగోపమేదజనుఁడెంతయుహైన్యమునొందివ్యర్థుఁడౌ।
గుట్టినఁదేలుగుట్టమినిఁగుమ్మరపుర్వనరేనరుల్ధరన్॥ ౬౦౨॥

చ॥ తనరుసహస్రధాముఁడునుతైక్ష్ణ్యమునొందిమరీచిసూచియై।
తనుఁగననీకయెవ్వరినిధన్యతలోకనమస్కృతుండుగాఁ।
గనుఁగొననెల్లవారలకుగాదిలిగానయిశీతరశ్మిదాఁ।
గనియెఁగళంకమున్ క్షయముఁగాంచెడుఁబల్మఱుపాముకాటులన్॥ ౬౦౩॥

ఉ॥ సత్తముఁడొందుఁదేజమును శౌర్యము మానెడు మానహీనుఁడే।
మెత్తనివాని నెత్తెదరు మిక్కిలి దుర్జనులక్కటా బలో।
ద్వృత్తునిఁ జేరఁబోరు బహుభీతినిఁ గ్రుద్ధు సమిద్ధశౌర్యునిన్।
మెత్తనికుంచెలుందునిమి మెక్కుదురక్కరివైరిఁ గందురే॥ ౬౦౪॥

ఆ-వె॥ ప్రాణమానములను రక్షించుకొనవేఁడు । వాఁడు తేజమూనవలయువాని।
నెల్లనట్టి వెడఁగుపొల్లువోవిడిచెడు । నగునుదే జెఁలిన యగ్గియట్లు॥ ౬౦౫॥

కం॥ ప్రావృడ్వారిదము వలె । స్నిగ్ధుండువుముందిపుడన నీరసశరద।
బ్దావళివలెఁ గనుపట్టెదు । శ్రీవిలసిలసరసుఁడవయి చెందుముఘనతన్॥ ౬౦౬॥

కం॥ నావుడు దుర్వాసుఁడు నిజ । మీవిధమని సంస్మరించె నిటఁ గ్రోధంబా।
రా వేయని యది సాంజలి । యై వెలయఁగఁ జేరె శిష్యుఁడాత్మగురు ననన్॥ ౬౦౭॥

కం॥ ఎలమినిఁ గ్రోధనుఁడమ్ముని । వెలసెను సక్రోధుఁడగుచు విబుధుఁడు సచ్ఛా।
త్రలసితుఁడగు నట్లాహుతి । విలసిత శిఖియనఁగ మేషవిహిత హరియనన్॥ ౬౦౮॥

కం॥ పరిహాసోక్తులలక్ష్య । స్ఫురితాహంకారవచనములు నగుచేష్టల్।
గరమఱజనులందుంచ । ద్వరముని దుర్వాసుఁడదరఁదన తేజమునన్॥ ౬౦౯॥

కం॥ విరినేఁదమమింకెవిష మొగిఁ । గరము ఱఁబంకము దివాంధగణమోలములం।
దిరవుకొనెన త్రిజాహ । స్కరుఁడు స్వతేజంబుతోడఁ జాలం గ్రాలన్॥ ౬౧౦॥

ఉ॥ వాసిగఁ గాంచి హర్షము వివాహము పూర్తిగఁ గాంచి శంకరుం।
డాసమయంబున నంబలికె నత్రిజుతో వరమేదియేనియు।
ల్లాసముతోడ వేఁడుమదిలభ్యము గాఁగ నొనర్తు నన్నదు।
ర్వాసుఁడు నేశపించినఁదపంబఱకుండ వరంబొసంగు నాన్॥ ౬౧౧॥

చ॥ శివుఁడనియెన్ శపించినను జెన్నగు రెట్టిగ సీతపంబటం।
చవితథవాక్యుఁడై మఱి ప్రహర్షణలక్ష్యము గాఁగ నింక వేఁ।
డు వరములిత్తునాఁగ నుగడుంగడు వేడుక నత్రిపుత్రుఁడిం।
పు వెలయ వేఁడె నోవరద భూవిను తా తనుమధ్యమాధవా॥ ౬౧౨॥

సీ॥ కంజశైలమునకుఁ గడఁగి నీ వేఁటేఁట రావలయును నుత్తరాయణమున।
మాఖపంచమియందు మానితంబుగ ముక్తికల్యాణమిట జరుగంగవలయు।
శివరాత్రి వఱకీవు చెలఁగుటనిటను దత్కాలంబునందిందుఁ గడఁకనిన్నుఁ।
బూజించువారెల్ల భుక్తిముక్తులఁ జెందవలయును మఱి వేఱువడిని నైన।
నిచ్చటికి వచ్చి నినుఁ గొల్వ నిర్జతత్వ । మెనయవలె నెవ్వరేనియు నీకథఁ జది।
విననువినిననుసుజ్ఞానమును గనవలె । ననుచు వరమత్రిజుఁడు వేఁడె నభవుఁడిచ్చె॥

మ॥ తమఁ గంజాచలమందుముక్తిజనకస్థానీయ మేకాకృతిన్।
నిమిషాఖ్యాంతరయేకవల్లి యెచటన్నిచ్చల్వసించుం దదా।
ది మశైలూష పురంబుదాఁక నెగడం దీపించె నా పేరనే।
కొమరారెం దదుదార బిల్వపురి యక్షోభ్యంబు రక్షోఘ్నమై॥ ౬౧౪॥

కం॥ మునిదుర్వాసునిఁ గ్రోధం । బునఁ దపము ఱకుండ మఱియుఁ బొంపిరివోవన్ ।
ఘనునిఁ గఁ జేసితిమమ్ముం । జెనయింపకుమయ్య క్రోధశిఖి బిల్వేశా॥ ౬౧౫॥

౨
కం॥ నలువుగ దుర్వాసః పుర । చరిత్ర దనుఁ జదువ వినఁగ జనులకుఁ గూర్చున్ ।
బలువితములైన మేలులఁ । గలపములకు వలపుల ల్లఁ గదియించు క్రియన్॥ ౬౧౬॥

సుభగవృత్తము॥ అని సూతుం-డనువాంద । న్వినిపింప-న్వినిమానుల్ ।
గని రాత్మన్-ఘను బిల్వే । శుని దుర్వా-సుని ప్రోలన్॥ -౧౭॥

కం॥ కనదుర్వాసస్సంఖ్యగఁ । దనరఁ బ్రకృతి పురుష పద్యతతి యిది దగుఁ బే ।
ర్కొన దుర్వాసో బింబం । బని శ్రీబిల్వేశ్వరీయమందో శ్రీశా॥ ౧౬౮॥

శార్దూలవిక్రీడిత వృత్తము. (గోమూత్రికా బంధము.)

పారావారశయాదయాశయ మహాపాపాటవీపావకా ।
ధీరాకారజయాశ్రయా ప్రియమహాదీపాభవిద్రావకా ।
ఘోరాకారసురారిభూధ్రభిదురద్దుర్వాయితాంచన్నఖా ।
తారాధారపరాస్వభూయభిసరత్సర్వామృతాశన్నఖా॥ ౬౧౯॥

డిణ్డిమ వృత్తము.

బిలేశయశయానువిదిత - వీర్యసంశ్రయా ।
జ్వలజ్జ్వలనవీక్షణఘన - సజ్ఝగర్జనా ।
కులాచలనిభాఙ్గవిమత - ఘోరసఙ్గరా ।
పలాశముకుళాభనఖర - భక్తరక్షణా॥ ౬౨౦॥

తుల్య వృత్తము.

మారాకృతికృత - మారానువిజిత - మారానువిధృత - మారాక్షసహర ।
శూరాగృహకృత - శూరాకృతసుర - శూరాధృతపర - శూరాజరుధిర ।
ధీరాశయనిత - ధీరాజనితను - ధీరాజమదను - ధీరత్నవినుత ।
నారాయణశ్రిత - నారాయణనర - నారాయణహరి - నారాయణహిత॥ ౬౨౧॥

గద్యము.

ఇది, శ్రీతనుమధ్యాంబాకరంబిత శ్రీబిల్వనాథమహాదేవశిష్య తిష్యాపజ్ఞాక్షర సాంఖ్యాచార్య పర్యవితకవిత్వ తత్త్వవిత్ప్రకాండ శ్రీమత్కొక్కొండ వేంకటరత్నశర్మవినిర్మితంబై కవిమణినామంబునం బరఁగు శ్రీబిల్వేశ్వరీయంబను పద్యకావ్యరత్నంబునం బంచమబింబము, దుర్వాసఃపురీబింబము, దూర్వాసబింబము.

ఉత్తరభాగము, పురుషభాగము.

శ్రీబిల్వేశ్వరాయనమః.

# బిల్వేశ్వరీయము.

## షష్ఠ బింబము.

### రత్నాయనపురీబింబము, అభేదేశబింబము.

### ప్రథమభాగము, బిల్వేశభాగము.

కం॥ శాండిల్యవనావాసా । శాండిల్యాయితఖరనఖసదభిమతఫలా।
శాండిల్యమునీశస్తుత । శాండిల్యేశఘటికాద్రిచరనరసింహా॥ ౧॥

౬

మ॥ యమిసంవేద్యముజీవదేవులయభేదార్థంబభేదేశభా।
వమునేతెల్పెడునెద్దియద్దియెమహావాక్యంబువేదాంతగో।
ప్యమగుంగాత్రిపదాప్తి బిల్వమదిసంభావ్యంబభేదేశుఁడీ।
క్షమబిల్వేశుఁడనంబడుంగనుకఁగాంక్షంగొల్తునాశ్రీశ్వరున్॥ ౨॥

ఉ॥ యత్నముతోనయత్నమునసర్షులుపెక్కురుగొల్చియక్కడన్।
రత్నములన్ప్రథంగనుటరత్నముతాత్త్వికమందుఁదోఁచుటన్।
రత్నమువర్గమూలమటరాజిలఁబొల్చుటబిల్వకంబదే।
రత్నపురంబనంబరఁగురత్నపురీశుభజింతునెంతయున్॥ ౩॥

కం॥ అనిరత్నపురియురత్నా । యనపురియనిబిల్వవనికినాహ్వాయములవె।
ట్లొనరెఁదెలుపుమనసూతుఁడు । వినుఁడీరలటంచునిట్లువినిచెమునులకున్॥ ౪॥

### గేయ శాండిల్యోపాఖ్యానము.

శా॥ శాండిల్యుండనుమానివర్యుఁడుతపస్సామ్రాజ్యదంబుర్వినే।
దుండున్క్షేత్రవరంబుఁదెల్పుమనుచత్యుత్సాహుఁడై వేఁడస।
త్కాండస్తుత్యముక్షేత్రరత్నమదియొక్కండుండుఁదన్మూలమా।
శాండిల్యావనిజంబుబిల్వమనిశశ్వద్భక్తిఁదండుండనెన్॥ ౫॥

సీ॥ వినుతింపఁబడుఁగర్మజనితకుష్ఠాదిరుగ్వితతిఁబాపునుగానబిల్వమనఁగ।
స్తుతియింపఁబడునతస్తోమంబుపాపంబువెసఁద్రెంచుఁగావునబిల్వమనఁగ।
బొగడంబడునుదుఃఖపుంజంబులంబారిభేదించుటంజేసిబిల్వమనఁగ।
గొండాడఁబడుముక్తిగోపురద్వారంబుబీగముచేయుటబిల్వమనఁగ।

నక్షరద్వయమేకాక్షరార్థబోధ । కంబభేదాక్షరాద్యంతకలితమునయి।
ద్వైతసాలంబుఁగూల్చియద్వైతసిద్ధి । వెలయఁజేయుటనెగడెడుబిల్వమనఁగ॥ ౬॥

సీ॥ ఎదిశ్రీతపంబుననుదయించెశ్రీఫలశ్రీనామములశ్రితశ్రీకరముగ।
దేనిశాదలలందుదేవతలందఱుగోరితాల్చెదరుమాలూరమనఁగ।
దేనిపేరొందుటంద్రిజగన్నుతుందయ్యెమున్నుశాండిల్యుఁడన్మునియుఁబరఁగ।
దేనిశైలూషాఖ్యమానితంబుగఁజేయనాయెనుహానటుండభవుఁడుదగ।
నేదియష్టోత్తరశతాఖ్యలెనసీతనదు । నామధేయంబుస్మరియించినసువినినను।
స్మర్తకునుశ్రోతకునుసర్వసౌఖ్యములిడు । వినుతమదియాపవనస్ఫతిబిల్వమనఁగ॥ ౭॥

సీ॥ తనమీఁదిగాలిసోఁకిననరులనునిరామయులఁబావనులఁగామహిమఁజేయుఁ।
దననీడనిలిచినఁదపనతాపంబునుదాపత్రయంబునుదలఁగఁజేయుఁ।
దనయాకుఁగనఁద్రిణేత్రునిపూజఁదనజగత్త్రియపూజ్యతనుమదిఁదలఁపఁజేయుఁ।
దనపండ్లఁగైకొనవనితోపభోగంబుతోఁద్యాగమునునెదఁదోఁపఁజేయుఁ।
దనదువిటపంబునేమఱిచెనకముండ్ల । చేతశిక్షించుగురునట్లుశ్రీఘటించు।
ఔనిపోలికనారాధ్యమైనముక్తి । వెలయనొసఁగుశివాకృతిబిల్వమనఁగ॥ ౮॥

సీ॥ దేనిచిగురుఁగోరిపూనెడునెలదారిసామేనిచానమైచందమునను।
దేనియాకులుగుల్లెనేనియుమఱియెండెనేనియునిడఁదగునీశ్వరునకు।
దేనిముయ్యాకులంబూనినిత్యంబునుబూజింపముక్కంటిముత్తినిచ్చు।
దేనినిగనినను జేనంటిననుబత్తినెరఁగిననానాఁటిదురితమణఁగు।
దేనిఁజూచినఁబుణ్యంబుదేనిఁబుడుకఁ । బాపనాశంబుదేనినిభక్తిమ్రొక్కఁ।
గోటిజన్మసుకృతతుల్యమాటనదియ । వెలయునెటుగాంచిననునారబిల్వమనఁగ॥ ౯॥

సీ॥ వేదండములవేనవేలనులక్షోపలక్షలగుఱ్ఱంబులనిడుఫలము।
గోవులఁగోటానకోట్లనుగోటికన్యకలదానముచేయునట్టిఫలము।
మూడుకోటులగ్రామములఁబదికోటులుచెఱువులఁగలిగించిచెందుఫలము।
మఱికోటిసాహస్రమఖములుసల్పుటనయ్యెడునురువైనయట్టిఫలము।
శివునికొకబిల్వదళమిడఁజెందవచ్చు । వినుతమోక్షప్రధానంబుబిల్వమంద్రు।
సరవినిచ్ఛాక్రియాజ్ఞానశక్తిత్రిదళ । విలసితంబందురార్యులుబిల్వమనఁగ॥ ౧౦॥

సీ॥ అంగనయాసర్వమంగళమాలూరసాలముంగావించెనాలినోలి।
జగదేకసుందరస్వశరీరమొల్లకశ్రీకేలనయ్యెనుశ్రీఫలముగ।
నార్యాంగసౌకుమార్యమునిచ్చగింపకమారేడుచిగుళులఁగోరికొనెడుఁ।
కైలాసమునుబాసిశైలూషవనముననలరుశాండిల్యేశుఁడగుచనయము।
బిల్వమనబిల్వవనమనబిల్వపత్రి । శయనబిల్వేశయనిననుగడఁగివారిఁ।
బ్రోచుబిల్వవనింబెంపఁబ్రోచుపెట్లొ । బిల్వనాథుండెమెఱిఁగెడుబిల్వమహిమ॥ ౧౧॥

బంగారము.

అనియుబిల్వవనంబునందుఁదపంబునుజెలువుమంచుననందిదెలుపనతఁడు - దెలిసికొనెన్।
తెలిసియాతండటనెలకొనినీవాతటంబునంబిల్వవనంబునిలిపె - నింబడరన్।
తద్దళంబులుగొన్నితనపూజకిడుకొనిపూజకులకునెల్లఁబొసఁగనొసఁగెఁ - బుణ్యుఁడుగా।
పృథివిబిల్వమయిగానెసఁగించెబిల్వేశ్వరాష్టమూర్త్యన్యతమాకృతియనఁ - బ్రాంచితుఁడా।
వేయునేలశాండిల్యుండెబిల్వమనఁగ - వెలసెబిల్వ।
మానెశాండిల్యనామమహామునియోగి - గానెసంగెఁ।
బోష్యపోషకభావంబుపొసఁగెడునన - బుధనుతమై।
గేయశాండిల్యమననిదికీర్తితమగుఁ - గృతివరంబు॥ ౧౨॥

ఆ-వె॥ మఱియుఁగాళభీమమత్తులన్వారలు । నింకశూరనందిశంకరులాగి।
స్వాహ్వయాద్యుపాస్యునక్షరగేయుబి । ల్వేశుఁగొలిచిరొందిరీప్సితముల॥ ౧౩॥

ఇది, గేయశాండిల్యోపాఖ్యానము.

---

## కాళోపాఖ్యానము.

మ॥ అలబిల్వాటవిస్కంధసౌధమనఁగాహర్షప్రదంబైయొకం।
డలరుంగొండయదానువల్లిమలనానందుండునెక్కుండుభి।
ల్లలలాముండుకుటుంబికాళుఁడనఁగాలక్ష్యైకచక్షుండుస్వో।
జ్జ్వలబాణాంశునిపీతసర్వమృగశశ్వజ్జీవనుండింపుగన్॥ ౧॥

కం॥ శివరాత్రినాఁడువఱువా । తవెడలెవేఁటకయివాఁడుదగవిల్లమ్ముల్।
వివిధస్థలములవెదకెను । దవదొకమృగమునుబతంగతనెరవిగ్రుంకెన్॥ ౨॥

శా॥ గౌరీతీర్థముదండనుండెనపుడకాళుండుక్షుత్పీడితుం।
డైరావేయిటనీరుగ్రోలమెగముల్ వ్యాయామముం జేయుదుం।
దోరింపంగనటంచునున్ననటశార్దూలంబొకండంబుపెం।
నారంభంబునవచ్చెఁగ్రచ్చఱమహోగ్రాత్ముల్వెలుంగంగడున్॥ ౩॥

చ॥ పొడఁగనిదానిచేరువనెపొందిమహాభయముందడంబడం।
గడఁకనుబిల్వవృక్షమునుగ్రక్కననెక్కెనుబోయయామెడం।
గుడువకనీరువ్యాఘ్రమదిగొబ్బననుబ్బఱబొబ్బరించుచున్।
మడువకనంగలేయుచునుమండిడియుండెనువానిఁగాంచుచున్॥ ౪॥

ఉ॥ వాఁడపుడోర్చియాఁకటినిఁబైకొనుకూర్కుదొఱంగఁగోరిమా।
రేడుదళంబులంబెఱికిక్రిందనువేయఁగఁజొఁగెనక్కడన్।
వేడుకగాస్వయంభువపువిశ్రుతలింగమెసంగెసంగతిం।
జూడఁగబిల్వనాథపదసూచితమయ్యెదియయ్యెనయ్యెనన్॥ ౫॥

ఉ॥ అంతటఁగొంత సేపటికినవ్వలివోయెనునవ్వదీకెనాఁ।
గంతుహరుండు బిల్వదళకాయసమర్చితుఁడాటనెట్టులే।
నంతకతుల్యుఁడాయెఱుకుత్యక్తదరుండయి ప్రానుడిగ్గియా।
ప్రాంతమునన్సుధార్తుఁడయి యారయుచుండె మెగంబులంబొరిన్॥ ౬॥

తే-గీ॥ అత్తటింజలపానార్థమరుగుదెంచె । హరిణియొక్కటిగర్భభరాలసయయి।
యాకుగదలినఁబులివెఱవ్యాధభీతి । బెళుకుఁజూడ్కులునిక్కువీనులునుదనర॥ ౭॥

ఆ-వె॥ వచ్చియాకిరాతుబాణపాణినిఁగాంచి । కాలవచ్చినా వెకరుణనన్నుఁ।
గావుమన్నయంచుఁగట్టిరిదిగనర । భాషఁబల్కెలేఁడివాఁడుసూచి॥ ౮॥

కం॥ చిలుకలునుగోరువంకలుఁ । బలుకుమనుజభాషణములవలెవర్ణములం।
బలుకంగలేవులేఁడియి । దలరంభాషించుదీనినరసెదనంచున్॥ ౯॥

తే-గీ॥ పస్తుపడుటనుశివరాత్రిప్రథమయామ । పూజనెట్లైనఁజేయుటభువనపతికిఁ।
దనకునాలవపాల్పాపమునశియింప । ధర్మబుద్ధియొకించుకదనరనలరి॥ ౧౦॥

కం॥ హరిణీ నేఁజంపితిబలు । వెరవారన్వివిధజంతువితతులనెందున్।
నరభాషన్భాషించిన । వరమృగమునుగానఁగానవాంఛగలిగెడున్॥ ౧౧॥

కం॥ నీవెవ్వరవెందుఁగలిగి । నావేలామృగిగనయితినరభాషయును।
శ్రీవెలయఁగలిగెనీకిటు । లేవిందుందెలుపుమనఁగనిట్లనెనదియున్॥ ౧౨॥

సీ॥ తల్లితల్లియెతల్లిదగుమామమామయెతండ్రిగడలివెన్నదగినయన్న।
తల్లితల్లియెయక్కదగుమామమామయెబావపున్నెముగల్గువారుమగలు।
గొడుకంచనెఱరొతుగోడలుచదువులనాతికూఁతురుమలకూఁతురల్లుఁ।
డావలిమలయల్లుఁడనుఁగుబిడ్డలుపెక్కరొడయలుజడదారులెడయనిపరు।
పమ్మమాయనియందమ్ముపమ్ముగాని । పొందునింపొందఁగందాళిబొట్టెడపక।
యలరునేరికివేల్పుప్రోలాటపట్టు । వారలచ్చరలనమెచ్చువడయువారు॥ ౧౩।

కం॥ వారలలోహరిణియనెడు । పేరనలరుదాననేనుబ్రియతమనైతిన్।
ధీరహిరణ్యాక్షుండను । వీరాసురునికినతండుప్రియతముఁడయ్యెన్॥ ౧౪॥

తే-గీ॥ క్షుత్పిపాసలునిద్దురసోఁకనట్టి । చోటుగదస్వర్గమందుండిసురతమునకుఁ।
బ్రొద్దుసాలకయొండొరుల్పద్దుఁబూని । పెనఁగుచుంటిమికాలంబెపెద్దగడచె॥ ౧౫॥

ఆ-వె॥ శివునినెట్టకేనిసేవింపఁగైలాస । మునకుఁబోతినొక్కదినమునందుఁ।
గాంచినన్ననతఁడుకామినితడవులఁ । బట్టిరావదేలపలుకుమన్న॥ ౧౬॥

కం॥ త్ర్యక్షహిరణ్యాక్షుండను । రక్షఃపతినాకుభర్తభ్రమఁదత్సేవా।
ప్రేక్షణనగుటందడసితి । రక్షింపవెకరుణనాదురమణునినన్నున్॥ ౧౭॥

కం॥ అన్నన్ననుఁగనిహరుఁడో । యన్నాదనుజవిటుమరిగియరయవిటంబా।
లున్నాకంబెంఘనుఁడే । యన్నిశిచరుఁడగుముహరిణివతఁడుహరిణమా॥ ౧౮॥

కం॥ అనిశపియించిన నేహరి । ణిని గానన్ హరిణినగుట నెగడుహిరణ్యా।
క్షునిహరిణముగాఁ జేయుట । చను నేమైన జతఁ గూర్పు సారంగధరా॥ ౧౯॥

కం॥ నీదాసుల మెన్నఁడునిను । మోదంబునఁ గొలుతుమిట్లు ముందిఁక శాపం।
బేదునిదియెట్లనన్ మృడుఁ । డాదటఁ బలికెనిటు సత్కృపావేశమునన్॥ ౨౦॥

కం॥ తొలఁగెడు నీశాపం బిఁక । నిలఁ బంద్రెండేఁడులగుడు నెక్కటివ్యాధుం।
డొలసినినుఁ జంపఁదలఁపడుఁ । బలికెదవు నృభాష నాఁడు ప్రాగ్జన్మకథన్॥ ౨౧॥

కం॥ పదపడి బిల్వేశ్వరునిన్ । ముదమున సేవించినీవు ముక్తిఁబడ సెదో।
ముదితా నీవలె నేనీ । హృదయేశుఁడు నిన్నుఁ గూడుఁ గృతకృత్యుండై॥ ౨౨॥

కం॥ అనిశాపమోక్షముం జె । ప్పెనుమును మినువాఁక దాల్పు వింటింగంటిన్।
ఘనుఁడ మృగవ్యాధుఁగని । న్గనియెద నెకొయింక బిల్వనాథును మేశున్॥ ౨౩॥

కం॥ నాఁటంగొలెను నేబి । ల్వాటవినిటనుండుఁగనమి నాబిల్వేశున్।
జీటికిమాటికిఁ జిక్కితి । నేటికొ చూలైతిఁ బిల్లనీన నదనిదా॥ ౨౪॥

కం॥ ననుఁ జంపరాదు గదధ । ర్మనిధీ చూలాలఁగాన మఱిచంపిననీ।
కునయినఁ దిండికి నేఁజా । లనకట వ్రతమఱిన సుఖములవడన్వలదే॥ ౨౫॥

ఆ-వె॥ వ్యర్థముగనధర్మమార్జింపఁగానేల । బ్రదిమియన్న నెక్షణభంగురమగు।
నొడలు వీడుఁగాకగడియించుకొన్నది । పాపమనుభవింపవలదె పిదప॥ ౨౬॥

తే-గీ॥ విన వెమాయన్న మఱియొక్కపెంటి లేఁడి । వచ్చునిచ్చటికి పుడదిపరువమునను।
బలుపునను మెచ్చఁదగియుండుఁ గొలుపుఁ దనివి। నీకుటుంబంబునకునీకు నిక్కముగను॥

ఆ-వె॥ అంతెకాదు విన వెయంతటనెకజింక । పోతు రాఁగలదది పోతరించి।
యుండుఁ జంద్రువలననుండి వచ్చినయిజ్జీ । యనస్ఫురించు నిన్ను నలరఁ జేయు॥ ౨౮॥

ఆ-వె॥ పిల్లనీని నాదు ప్రియసఖులకు నొప్ప । గించివత్తు నీదు గీమునకును।
దెల్లవారనమ్ము తెఱఁగొప్ప నామాట । నన్నవాఁడు విస్మయంబు నొంది॥ ౨౯॥

కం॥ ఔనది గానిమ్మనిమది । నూనియనూనదయఁ బలికె నోసారంగీ।
పోనగునా కున్నమ్మిక । గానెట్టిడియన్న నద్దిగడఁ గెన్నుడువన్॥ ౩౦॥

సీ॥ అనృతమాడినఁగల్గునఘమును భూతహింసను గల్గునట్టి దోషంబు మఱియుఁ।
బారదారికవృత్తి పరిలభ్యపంకంబు పరధనాపహరణప్రాప్యపాప।
మాప్తవిశ్వాసభంగావాప్తపాప్మ పరాపవాదాపాదనాత్తదుష్కృ।
తంబన్యరచితసత్కార్యాంతరాయలబ్ధాంహంబు సజ్జనహానిజైన।
మితరదూషణకిల్బిషమీర్ష్యజనుల । యెడలఁ జెందున నూయనౌవృజినముదలి।
దంద్రులను నాలుబిడ్డలఁ దనుపనికలు । షంబు నాకగు రాకున్నఁ జనిపదపడి॥ ౩౧॥

కం॥ అనియాఁడు లేఁడియదినె । ప్పినవిని మేలంచు నెప్పి విడిచెను బొమ్మం।
చను దానిబోయ సత్యం । బున కెవ్వరులోను గారు బుధనుతమదిగా॥ ౩౨॥

ఆ-వె॥ నమ్మితోయమానియమ్మహాతీర్థంబు । నందుఁబోయెనల్లనక్కురంగి।
యారసుకృతమున్ననరిమిత్రమాఁగద । కాచుఁగాదెమిత్తికావలియయి॥ ౩౩।

కం॥ తరువాతవాఁడు లేఁడిని । నరయంగంగూర్కురామికళ్లెమాలూ।
రరుచిరపత్రంబులఁబొరిఁ । బొరిదూసియు నేసియట నెప్రొద్దుఁగడపఁగన్॥ ౩౪॥

తే-గీ॥ దానిమానిన పుణ్యంబు చేనచటను । రెండుజాములుశివపూజ శ్రీదళములఁ।
జేయుటనిజాఘమర్థంబు చెల్లెనల్ల। యెఱుకువానికిసౌశీల్యమెసఁగెనంత॥ ౩౫॥

కం॥ మున్నగమూర్కొనుచునిలం । దిన్నఁగనిడుచడుగులు వెఱదిక్కులదృక్కుల్।
పన్నగనెఱపుచుఁదనమగ । నిన్నెమకుచువచ్చెనొక్కనెఱజింకయటన్॥ ౩౬॥

తే-గీ॥ పచ్చియచ్చేరువనెయున్న వ్యాధుఁగాంచి। కాంచివ్యాకులతనుమృతిఁగనియెనొక్క।
యక్కయిక్కాళచేనేలయార్తియంచు । నెంచిదిటవూనివానితోనిట్లులనియె॥ ౩౭॥

కం॥ అన్నావచ్చెనెయిచ్చటి । కిన్నాయక్కయదియుక్తికింబ్రత్యుక్తిం।
జెన్నారంగనెసంగుమి । యన్నంద్రుంచెదను నిన్నుహరునెంచుమనన్॥ ౩౮॥

తే-గీ॥ హరిణిబెగడొందిపగఁగుందియనియెవాని । తోడనాప్రశ్నమునకుఁబ్రత్యుత్తరంబె।
నీదుపలుకిదియోయన్ననిత్యదుఃఖ । నకటమనుకంటెనీల్గుటెయగును మేలు॥ ౩౯॥

కం॥ నానిత్యదుఃఖమూలం । బానేదనెదేనివిన వెయతివకుఁబతిచేఁ।
గానైనదిసుఖమెఱుఁగను । జానేమికొఱంతనేనెచచ్చెదనైనన్॥ ౪౦॥

ఆ-వె॥ ఆత్మహత్యగూడదంచునెంచితిమును । పిప్పడొప్పకొందుహితమునతిథి।
కెనయఁజేయనంచుననుకొన్న నేబక్క । దానఁగానవ్యర్థమానుమృతియు॥ ౪౧॥

కం॥ ఆలము నేయకనాపలు । కాలింపవెవచ్చునిచటికధికామిషమై।
చాలంగ్రాలెడుజింకల । యేలికయొకఁడందువలన నెననెదుముదమున్॥ ౪౨॥

ఆ-వె॥ నన్నువిడువుమిపుడు నాయప్పఁగని రేపు । వత్తునీదువసతికత్తెఱఁగున।
వత్తునంచునీకుఁబ్రత్యయమొదవంగఁ । బ్రతినఁజేయుదానఁబలుకబొంకు॥ ౪౩।

సీ॥ మగనికింపుగను మెలఁగని మెలఁతపొందు బెడదఁబొందుదునయ్యపెత్తనమఱఁ।
ప్రాణేశ్వరుని కెదురాడుచేడియపసుగోడుఁగుడుతునయ్యపోఁడిమియఱఁ।
బతిమాఱుకొని మొత్తునతివగాంచెడుకడగండ్లఁబడుదునయ్యగౌరవమఱ।
నుపపతిఁబొందెడునువిదదోసము నేనుబడసెదనయ్యసౌభాగ్యమునఱ।
భర్తఁబొరిగొన్నయన్నెందుపాట్లుపడుదు।నయ్యయన్యునిఁబెండ్లియాతొయ్యలిగను।
నడియిడుమఁగాంతునయ్యనీసదనమునకు।సరగ రేపురానైతినేహరహరహర॥ ౪౪॥

చ॥ అనిపలుకంగఁబొమ్మనియెవ్యాధుఁడుపిమ్మటలేఁడియద్దివే।
డ్కనటనునీరువట్టెడలఁగాఁజెనెనట్టులవాఁడుమూడుజా।
లనడపెఁబాపభాగములలావరియిట్టియొకండుకృష్ణసా।
రనుతములీలమైశివకరప్రహితంబనవచ్చెవచ్చినన్॥ ౪౫॥

ఉ॥ చెచ్చెరవాఁడువాఁడియగుచిల్కులనల్కలు నేయనెంచుచో।
నచ్చపలేక్షణంబు మృగమమ్మృగయుంగని జంకియుంక నే।
మిచ్చెడుఁగయ్యెడుంజమ్ముఁడదీర్ఘ నెమ్మున్నుగపీని చేత నేఁ।
జచ్చెదనన్లయా లెడలఁజిచ్చుట మెల్లదనాకు నీకడన్॥ ౪౬॥

మ॥ అకటా మత్కృతదుష్కృతంబుఫలమిట్లై నే ప్రియావిప్రయో।
గకరూపంబున భార్య చావు బహుదుఃఖంబెన్నఁ నైదింటిలో।
నొకఁడయ్యెన్మొదటుంగణింపఁబడు టౌయు క్తంబు జాయాంతర।
ప్రకటానందము నొందు నేనిఁదద భావం బెన్నఁగుందొందదే॥ ౪౭॥

శా॥ జాయోపేతునికింట నేనడవి నే సౌఖ్యంబు సిద్ధించెడున్।
జాయాపేతుని కెందునున్న సుఖమే చందంబునం గల్గెడున్।
గేయం బౌ గృహమాశ్రమూలమయినన్ స్త్రీ ప్రియ యుక్తుఁడౌ వానికిన్।
గేయం బైనది హర్మ్య మేన్వనమవున్ స్త్రీహీనుఁడౌ వానికిన్॥ ౪౮॥

సీ॥ ఆత్మకుఁ బ్రకృతి నానగుటఁ బురుషునకు ననువొంద రెండవదౌ ద్వితీయ।
ధర్మార్థకామ సద్ధర్మాచరణమందుఁదగుట నెప్డును సహధర్మిణిమణి।
పతినినిభువిదివిఁ బాయకుండుటఁ జేసిభానిల్లులోక సంభావ్యపత్ని।
పాణిగ్రహణమొందిభర్తలాగుకొనుట చేత నే పాణిగృహీతి ప్రీతి।
లలితముగఁ బెనిమిటకిఁ బెండ్లాముసామ । వంశభూషణమామంజువాణిరాణి।
యెలమిబిడ్డలఁగనికుల మేలునాలు । అరయ గార్హస్థ్యధర్మమిల్లాలు గ్రాలు॥ ౪౯॥

సీ॥ భర్తభుజించినఁ బదపడిభుజియించువానియుచ్ఛిష్టంబుఁ బరమభక్తి।
నతఁడు వేఱూరికి నరిగినఁ దాముంచితిండిదిన దుఃఖిత్వఁ బండదుమఱి।
కైనేసికొన నెప్డుఁగాంక్షించుఁ దత్క్షేమమును స్వాగతమతండు గనిన నుమ్మతి।
సహగమనము నేయుఁ జావకమనియున్న వైధవ్యదుఃఖంబుఁ బడ నెడుఁగడు।
నారయారయ సాధ్వి భార్యకు నెనయవు। బంధువాండెమిత్రుండొండెఁబడఁతియొండె।
నున్నె తత్సమమాసుఖమున్నెయసమ। యగుట జయమందునెంచు జయయవు జాయ॥

తే-గీ॥ వివిధదుఃఖరుగార్తునికవును దార। వెజ్జురాలును మందును విశ్రుతముగ।
గృహిణిలేక సంసారంబు నెనయుకంటె। సన్యసించి కాఱడవికిఁ జనుట మెచను॥ ౫౦॥

కం॥ ఇది మానవవిషయము నా। యదియన నొక్కర్తు ప్రాణమనఁదగు నాకున్।
ముదితమణొక్కతె ప్రాణము। నొదవించునదంచు నజిన యోనితలఁచుచున్॥ ౫౨॥

కం॥ కౌనదిగా నిమ్మనిమది। నూనిదిటవులుబ్ధుతోడ నోయీనిన్నున్।
నేనొక్కటినడిగెదనా। కౌనననిమ్ముత్తరమ్మనక్కటికమునన్॥ ౫౩॥

కం॥ ఈయధ్వ వచ్చెనే హరి। ణీయుగ్మము దానినీవు నీల్గించితివే।
యాయదినీదయఁ బోయెనె। బోయన యాదారిఁ దెలిపి పుణ్యముఁగనవే ౫౪॥

కం॥ నావుడు నాలుబ్ధకుఁడుం। భావంబున నలరి దాని పలుకులకున్నం।
భావింపఁదలం పొందెను। దేవతయిదియంచు నెంచి ధృతినిట్లనియెన్॥ ౫౫॥

ఆ-వె॥ వచ్చెరెండులేఁడులిచ్చటికవినిన్ను । నాకుబలిగనిచ్చినచ్చికదగ।
మగుడవచ్చెదమనిమహితశపథములఁ । జేసిపోయెనట్లె చెండెదనిను॥ ౫౬॥

కం॥ అనవినివాతాయువువా । నినిగనియవియెట్లొనర్చెనెమ్మిఁబ్రతిజ్ఞల్।
చనవునఁజెప్పుమాయనివిని । చిననలరియదట్లకోరెఁజెంచుంగ్రించుక్॥ ౫౭॥

కం॥ వాఁడేమికారణంబున । వేఁడెదుపోవంగఁదెలుపవేయననదినా।
పోఁడిమిపెండ్లముబుతుమతి । కూడికనలరించిరేపెగొబ్బునవత్తున్॥ ౫౮॥

కం॥ అనవుడుశబరుఁడుమెగమును । గనిన్యంకువబొంకెదవుదగందప్పిచనం।
గనుమఱలవత్తైమిత్తిని । నైనయుబెటిఁగియెవరువత్తురెత్తఱినైనన్॥ ౫౯॥

కక॥ పలుకుమువినియెదనీప్రతి । నలననినమెకమ్మువలికెనమ్మికవుట్టన్।
లలిగనికరమునవినుమా । బలియుఁడధార్మికుఁడయంచుఁబ్రౌఢిమెఱయఁగన్॥ ౬౦॥

సీ॥ షట్కర్మములఁదగఁజల్పనిపాఱుండురణమున్నఁబాఱెడురాచవాఁడు।
నింద్యవస్తువులమ్మినెగడుకోమటిద్విజశుశ్రూషలేనిబజ్జెయుస్వధర్మ।
పరుఁడుగానినరుండుపారమార్థికబుద్ధిలేనిమానవుఁడుస్వేచ్ఛానుగుండు।
దుర్వృత్తుఁడునుమహాదోషండుభార్యనుగర్భధారణయోగ్యకాలమునను।
గూడనట్టివాఁడుగుడుచుపాపఫలంబుఁ । బొందువాఁడనగుదుఁబోయిరేపు।
నీయిరవునకువెసనేరాకయున్నను । నిజమునాదుప్రతిననెమ్మినమ్ము॥ ౬౧॥

కం॥ అనిచెప్పనవ్వళిందుం । డెనసీముదములేఁడిగూడనిజ్జీచనుమం।
చునుబంచిననాజింకయు । గొనకొనినీరానికానకుంబోయెవడిన్॥ ౬౨॥

కం॥ తరువాతనక్కిరాతుం । డరుణోదయమగుడుమనికికరుగఁదలఁపఁగా।
హరిణియొకటిశిశుయుతగా । నరుదెంచెన్వాఁడుగాంచియమ్మేయనెడన్॥ ౬౩॥

కం॥ అదివల్కెనుల్కిధార్మిక । వదలకుమీయమ్మధర్మపథమునరయవే।
కొదమనుగూడినలేఁడిని । వధియింపంగూడదేనువధ్యనగుదునే॥ ౬౪॥

కం॥ ధర్మస్పృహలేకననున్ । మర్మస్పృగ్బాణహతినిమ్రందింతేవు।
ష్కర్మఫలమనుచుఁదలఁచెద । శర్మశిశువునింటవదలిచయ్యనవత్తున్॥ ౬౫॥

సీ॥ పనిఁగొనితగినంతఫలమునుబనివానికిడనికృతఘ్నునికేదిగతియొ।
యేలఁబడియుఁదనయేలికమేలునకెనయనికూళకునేదిగతియొ।
పండితుండయ్యునుబడసినాస్తిక్యంబునేచునీచాత్మునికేదిగతియొ।
ధనమదంబునఁబూజ్యులనునవమానించుహీనమానవునికినేదిగతియొ।
దేవతాగురుభూసురదివ్యతీర్థ । వేదనిందకునకునెందునేదిగతియొ।
యదియనాకగునీయింటికరుగుదేర । నేనివెంటనెనాపల్కునెమ్మినమ్ము॥ ౬౬॥

కం॥ అనవినియాటవికుండును । గనివిస్మయమేగుమనెమృగస్త్రీశిశుకన్।
జనెనిజనివాసమునకది । ఘనుఁడామృగయుఁడునుధర్మగౌరవమసదే॥ ౬౭॥

కం॥ శివరాత్రినాఁడువాఁడటు । పవలున్రేదిండియునుదవమినలుజాముల్।
శివునకుబిల్వదళార్చన । మువఱలఁజేయుటనుబూర్ణముగనఘుండై॥ ౬౮॥

చ॥ తలఁచిమృగంబులందుఁగలధర్మవిధిజ్ఞతకిచ్చమెచ్చిని
చ్చలుమృగఘాతినై తిఁగులసంభరణార్థముస్వాంగపోషణం
బలవడమానవుండనైనరాకృతినుండుమృగాధముండజ్ఞా
నలవమునేనిగంటినిటనాకుగురుల్గదయీకురంగముల్॥ ౧౯॥

ఉ॥ ఎవ్వతెదల్లిదండ్రియెవఁడెవ్వరుసోదరులేదిభార్యవా
రెవ్వరుచుట్టముల్ధనమునిచ్చినమెచ్చెదరీయకున్నచో
నెవ్వనుబ్రువ్వదూఱెదరుహీనతవారలకైమెగంబులం
గువ్వలఁగూల్చికిల్బిషముఁగూరఁగనేలత్యజింతుఁదద్వ్యథన్॥ ౨౦॥

కం॥ నాకడుపునకననింకం । గైకొనియెదఁగందమూలకాననఫలముల్ ।
నాకవిగావేఁబోని । మ్మీకాయముపాయుఁగాదెయెన్నఁటికైనన్॥ ౨౧॥

కం॥ తనతోనురాదుతనతను । వెనయఁగమృతిదానివారలేవత్తురయో ।
మనుజుఁడువివేకియైనన్ । దనతోడన్వచ్చుధర్మధనమెకొనునిలన్॥ ౨౨॥

ఆ-వె॥ అంచునెంచిచేసియస్త్రీసన్యాసంబు । గాలిఁగదలనిదివెవోలెఁగడలు
లేనికడలివలెనుబూనికనాఁకటి । కోర్చినిశ్చలుఁడయియుండెమునిగ॥ ౨౩॥

సీ॥ అప్పుడప్పగిదినందావ్యాధుచేవిడువంబడినదియిజ్జీవసతికరిగి
మొదలేఁడితోఁగూడికృకృత్యమైదానితోనప్డెయీనినదానితోను
బిల్లలదానితోబెల్కురనిట్లనెవ్యాధునిఁదత్కుటుంబంబుఁబ్రోవఁ
బోయెదసత్యంబుపొసఁగనిందుండుఁడుపులియెలుకలబారిపొరయకుండఁ
గడఁకమిమ్ముమీపిల్లలఁగాచుకొనుఁడు । సంతతినిస్వర్గమబ్బెడుసమకొనమిని
నరకమగుఁగానఁగూనలనరయుఁడనఁగ । లేఁడులవిమూఁడుగోడునవాడెనిట్లు॥ ౨౪॥

ఉ॥ మేమునువత్తుమయ్యెడకుమేకొనినారముకామెవత్తుమం
చామృగహంతమోలశపథావళులన్మొగిఁబల్కియుల్కునన్
రామనసొప్పకున్ననిటరాదెయొకానెకనాఁటికేనిఁజా
వీమృషఁజేసిసంయమనినేటికిఁజేసెనయంగమాకిఁకన్॥ ౨౫॥

కం॥ ఆసమయంబునమేమటుఁ । జేసినసమయంబుఁదీర్పఁజేరెదమీల్గన్ ।
వానిగస్వర్గముఁజెందుదు । మాసహగమనోత్సవంబునదిగదతగెడున్॥ ౨౬॥

తే-గీ॥ భర్తయుండినసుఖములఁబడయవచ్చు । భార్యకతఁడుమృతుండైనఁబరఁగుసాగు
మానమువ్విత్తుగాఁగల్గుమరణబాధ । మనినవైధవ్యదుఃఖమానవరతము॥ ౨౭॥

తే-గీ॥ మగనికిల్లాలుచెల్లినమఱియొకరిత । యాలుగావచ్చుమగఁడీల్గనాలికిమఱి
యొకఁడుమగఁడానెయయ్యెఁబోయువిదయద్ది|విధవయేయవువాఁడుగావిధవమగఁడు॥

సీ॥ పతియుండమృతిఁజెందుసతిసతియతఁడీల్గసహగమనమునేయుసాధ్విసాధ్వి
వైధవ్యమునుబొందిబహుదుఃఖములడిందిబ్రదికెడియాలునిర్భాగ్యరాలు
విధవయైవెండియుఁబెండ్లియాడినఁబునర్భువుధర్మపత్నియేబుధవినుతయె
మిండగాండ్రనుగూడిమెలఁగెడునద్దియిల్లాలెఱిఁగఅంకుటాలెకాక

ధర్మమెడలంగనేటికాధర్మ్మచేత । బాధలఁబడంగనేమిటికీధరిత్రి।
నిందనొందంగనేలననిష్ఠఁబూని । యిందునందుఁబతివ్రతయైనయమ్ముదము॥ ౭౯॥

కం॥ అనిపనివిపనివియామూ । డును లేఁడులుమృతికినిగుడుదుంబిల్లలతో।
డనుహరిణమనియెఁగాంతలు । మనుఁడీసంతతినిఁబ్రోవమనఁగనరఘుముక్॥ ౮౦॥

కం॥ ఒనరును సంతానముఁబ్రో । చినసమితముసుకృతమొనరఁజేయమిదురితం।
బనికాదెదశరథాంగన । లునుగుంతియనుత్తరయునలోలతమనిరో॥ ౮౧॥

కం॥ అనియెంతచెప్పిననువిన । కనుగమనమునందెనిశ్చయముగల్గితనుక్।
వెనుకొనులేఁడులతోడం । జనెనాయిఱ్ఱియనుసత్యసంరక్షణకై॥ ౮౨॥

ఆ-వె॥ అఖిలధనమునేనిఁద్యజియింపఁగానగు । నాలినేనినాత్మజాలినేనిఁ।
దనశరీరమేనిఁదగదుత్యజింపఁగ । సత్యమదియకాదెసర్వహితము॥ ౮౩॥

కం॥ ఆస్తికులెల్లరుసత్యా । న్నాస్తిపరోధర్మయంచునాడెదరుగదా।
నిస్తులుఁడుబలిత్రిశంకుజుఁ । డాస్తిక్యఫలంబుసత్యమనిచూపిరిగా॥ ౮౪॥

మ॥ సకుటుంబంబుగనిఱ్ఱియాసరసులోస్నానంబునుంజేసిపా।
యకబిల్వేశ్వరుభక్తిఁగొల్చివలగొంచందుండివేవేగఁబో।
యికిరాతుంగనికాలనన్నుమొదలక్హింసింపుమంతంజలిం।
పకయీలేళ్లనుబిమ్మటక్శిశువులక్భక్షింపుమింపొందఁగక్॥ ౮౫॥

తే-గీ॥ వ్యాధులకుభక్ష్యములునున్ము వనమృగమ్ము । లందువలననువాంఛకునఘమొదవదు।
సత్యపూతులమైమేముస్వర్గమునకుఁ । జనియెదముమముఁజంపుముజంపఅనన॥

శా॥ వ్యాధుండిట్లనెఁగృష్ణసారమజగద్వంద్యంబవీవుండుస।
ద్బోధంజేసెదుమాదృశాధములకుక్భూమిందివింగొందునీ।
బోధోత్కర్షముచేతజంతువధనేఁబోనాడితింబొంకటం।
చేధర్మక్తినిత్రమొక్కెనక్కజమటంచేతెంచెదివ్యధ్వనుల్॥ ౮౭॥

తే-గీ॥ దేవదుందుభులుఱుములతెఱఁగుఁజూపెఁ । బూలు రాలుటవానలపోలుపుఁజూపె।
విబుధవాహినులేఖలపెంపుఁజూపె । వ్యోమయానముసత్సభపోల్కిఁజూపె॥ ౮౮॥

సీ॥ ఓమృగవ్యాధనీవామృగవ్యాధునిపగిదిఁబూజ్యుఁడవైతిజగములందు।
శివరాత్రినిట్టుంటిశివశివయనియంటినాలుగుజాలు రేమేలుకొంటి।
బిల్వేశ్వరునినీవుబిల్వపత్రార్చనఁబ్రీతునిఁజేసితిబెరసితిధృతి।
సత్యవంద్యంబులౌసన్మృగంబులురాఁగఁజంపకవిడిచితివింపెలర్పఁ।
గానశివలోకమునకేగుగౌరవంబు । గలిగెనీకీవిమానంబునలరనెక్కు।
మనుచుసురదూతయొక్కండుహర్షమునను । బలికిమఱిపల్కెమెగముతోఁబరఁగనిట్లు॥

చ॥ మృగవరసత్యసంధచనుమీవుమృగీత్రితయంబుతోడనిం।
పుగశిశురాజితోడనునభోగతిసద్విజమందునుండఁగాఁ।
దగునదినీదుపేరిటనుదారకమంచననంతవ్యాధుతో
మృగమువిమానమెక్కెచనిమిక్కిలిముక్కవనెక్కెనెనిద్దివిక్॥ ౯౦॥

కం॥ ఈ కాళోపాఖ్యానము । జోకఁజదువవినఁగనగుఁబశుపతికరుణచే।
లోకులకునుశివరాత్రిన్ । శ్రీకాంతారేశుఁబూజనేసినఫలముల్॥ ౯౧॥

ఇది కాళోపాఖ్యానము.

## భీమోపాఖ్యానము.

చ॥ గుడమువలెన్న సోహారమగున్విషయంబెదియద్ది చూడఁగాఁ।
గడుకొనిగౌడదేశమనఖ్యాతివహించెను దానియందునిం।
పడరెడునెక్కుడు ప్రోల్మధురయన్న దిపన్న గరాజశాయికిన్।
విడిఁదియనంగఁబొల్చునటవిప్రకులంబమరౌఘవంద్యమై॥ ౧॥

కం॥ విశ్వామరేశ్వరుండన । విశ్వవినుతుఁడందు నొక్కద్విజవరుఁడుండున్।
శశ్వన్మహదైశ్వర్యుఁడు । వైశ్వానరతేజుఁడాత్తవాణిజ్యుండున్॥ ౨॥

కం॥ భీమేశ్వరుగుఱిఁచితపం । బామహితుఁడు సేసెనాత్మజార్థముగలిగెన్।
శ్రీమంతుఁడుధీమంతుఁడు । భీముఁడనఁగనొక్కకొడుకు పేర్మినతనికిన్॥ ౩॥

చ॥ చదివెను వేదశాస్త్రములత్మో విబుధుల్సభలన్నుతింపఁగాఁ।
బొదలెఁగళాకలాపమునభూపతులెచ్చుగమెచ్చనిచ్చలున్।
విదితుఁడునయ్యెనెయ్యెడలవిద్యనుబోలెను విత్తమందతం।
డొదవఁగనాలుబిడ్డలమహోత్సవమొందెఁబరాకుపీఁకమైన్॥ ౪॥

ఉ॥ వానికినెయ్యుఁడుండు బుధవంద్యుఁడొకండుకుబేరమిత్రుఁడన్।
జ్ఞానియొకానొకప్డతఁడుగాంచఁగఁదాఁగనిభీముఁడోయియా।
స్నానినుఁ బెక్కునాళ్లకుఁగనంగలిగెంగుశలంబెనీకునీ।
చానకునెందుఁబోతివనసంతసమెచ్చఁగనాతఁడిట్లనెన్॥ ౫॥

సీ॥ నేఁగంటినూటయెన్మిదిక్షేత్రములనిలశైవవైష్ణవశాక్తసన్నుతముల।
వైష్ణవాష్టస్వయంవ్యక్తస్థలములను శైవస్వయంవ్యక్తషట్స్థలముల।
నేఁబదిపీఠములెలమినష్టాదశయోగినీపీఠములాగిమునుకొని।
మోక్షదాయకములౌముఖ్యపురములేడుయోగీంద్రవినుతముల్బాగుగాను।
నాకననిక్షేత్రమే లేదు ప్రాకటముగ । నామునుంగనితీర్థమునహినహినహి।
నావిననిస్థలముహిమమునయనఁగఁదగు । నాపడనిపాటులున్నెయాశ్రీపతిగతి॥ ౬॥

కం॥ భగవదనుగ్రహమున నే । జగమునఁగలతీర్థములకుఁజనినిగమోక్తం।
బుగజరిపికార్యజాతము । మగుడనిటకువచ్చినాఁడమానినితోడన్॥ ౭॥

ఆ-వె॥ ఎన్నిపాట్లుపడ్డనున్నతీర్థములెల్లఁ । గొలిచిరాఁగఁగలిగెఁదెలియఁగలిగెఁ।
దత్త్వమందునందుఁదనరుపెద్దలవల్ల । నిందునందుసుఖములందఁగలిగె॥ ౮॥

కం॥ అనవిని యెందెందేయే । ఘనులనుగంటివనియడుగఁగాభీమునికిన్।
జనవునఁగుబేరమిత్రుఁడు । వినిచెనువినవయ్యయార్యవృత్తంబనుచున్॥ ౯॥

కం॥ వృద్ధాచలమున నొకగుణ । వృద్ధుఁడు విద్యాసముద్రుఁడి ద్ధైశ్వర్యం।
డుద్ధతుఁడు గాకయుండెడు । శుద్ధుఁడ తఁడు నాథశర్మ సుజనహితుండై॥ ౧౦॥

సీ॥ విద్యామృతాఢ్యుఁడై ద్విజరాజపూజ్యుఁడై వెలసియు నుప్పొంగియలపుఁగోలుపఁ।
డార్యావతంసుఁడై యఖిలకలాఢ్యుఁడై యలరియుశివపద మెలమి నెడలఁ।
డురుతరతేజుఁడై పరభయంకరుఁడయి పరఁగియు శాంతస్వభావసహితుఁ।
డత్యున్నతుండయి యమరాశ్రయుండయి యుండియు గుణివినమ్రుండగుఁగనఁ।
గాన నేవాని కెదశ్రీశుకమ్రుశయన । సదనముగఁదగు శిఖరుద్రపదనుతముగ।
బ్రహ్మశిరముగ సంచరద్రత్నసాను । వుగను దనువతఁడన్న నొప్పగు మణియన॥ ౧౧॥

మ॥ విబుధుల్విగ్రహరూపులై తదుదితప్రీతిన్నుతింగాంతురా।
విబుధుల్సత్కృతిరూపులై తదుదితప్రీతిన్నుతింగాంతురా।
విబుధుండాతఁడె కాఁడె భూవిబుధుఁడన్విఖ్యాతియొండెక్కడా।
విబుధుండాతఁడె కాఁడె నాథపదమే పేరయ్యెఁ దద్యోగమా॥ ౧౨॥

పృథ్వి॥ సరస్వతికరాబ్జశ - స్తమవుపుస్తమశ్వానన।
స్ఫురత్కరసుపుస్తకం - బుమఱిదయీణామూర్తిస।
త్కరాస్తకృతిగ్రంథము - ల్గలవులోకమందెన్నియ।
న్నిరాజిలెడువానిస - న్నిధిని నెన్నఁజెన్నొఁగదా॥ ౧౩॥

ఆ-వె॥ వానితోడ మైత్రి వర్ధిల్లె నాకొగి । వృద్ధిచంద్రికయన వింతగలిగెఁ।
బగలు రేయి నాకపరఁగెడువాఁడన్నఁ । గందులేక వెలుఁగుఁగడుఁ బుడమిని॥ ౧౪॥

ఉ॥ నావుదు భీముఁడెంతయు మనంబున నచ్చెరువంది మెచ్చుచు।
న్నేవిని నాఁడమున్నె యతనిన్బహుభంగులఁ జూడవేఁడెదన్।
నీవును వత్తువే నిఁగడు నెమ్మిని వెల్వడి తీర్థయాత్రకై।
యావర వృత్తుఁగాంతమనెనా తఁడు నొప్పఁగ నప్పుడొప్పగన్॥ ౧౫॥

మ॥ మనకున్నాఁగలపైకమంతయును నేమంబొప్ప రావయ్యెదా।
నిని సర్వంబును దెత్తునిత్తఱిన పూన్కిం జాగు నేయంగరా।
దని కైకోల్గొనితంఁడ్రి వల్లఁబయనంబై మిత్రుతోఁ దీర్థయా।
త్ర సొనర్చెంబితృలబ్ధలుబ్ధతను డిందం దానముల్ధర్మముల్॥ ౧౬॥

మ॥ ధన మొందందగు నెందునం దెచ నెడుందాఁబోయి వాణిజ్యముం।
బొనరించున్మఱితీర్థయాత్రకు ఫలంబుం గంటినం చెంచుభీ।
మన సూచీముఖహస్తుఁడర్థులకు నమ్మంజూపు నా నెచ్చెలిం।
గనుఁడీతండుకు బేరమిత్రుఁడనుచుం గాంతేంపవారాతనిన్॥ ౧౭॥

ఆ-వె॥ తీర్థయాత్ర నిట్లు తెఱఁగొప్పఁగావించి । గ్రంథసంగ్రహాశ గలిగి యరిగె।
భీముఁడనుఁగుతోడ వృద్ధాచలమునకుఁ । బన్తుపడ్డపులిగఁబారణకన॥ [illegible]

ఉత్సాహ॥ ఆకుబేరమిత్రుఁడనఘుఁ - డైననాథశర్మకున్।
శ్రీకుఁడైనభీమునకును - జేసెఁజెల్మి నేర్మిచే।
లోకమీఱ వెజ్జునకును - జొప్పడంగరోగికిం।
బ్రాకటముగమైత్రిఁజెలువు - బ్రౌఢుఁడీతఁడ నన‌న్॥ ౧౯॥

ఉ॥ భీముఁడు నాథశర్మకనెఁ బెద్దన నీవని యెంతు నిన్ను నే।
వేమఱు విన్నవాఁడఁ గడు విశ్రుతనాముఁడ వీవు వాదసం।
గ్రామమునందు సింహమని కంద్రరులందఱు నీదు సంగతి।
స్నేమహిమంబుఁ గాంచుట కెనిక్కముగా నిటకేగుదెంచితిన్॥ ౨౦॥

మ॥ ననుఁ గైకొమ్మని మ్రొక్కనక్కపటి నిన్నమ్మె న్మదిన్నాథశ।
ర్మ నెఱిన్ మ్రొక్కెడియట్లెయాతమనియెన్ మైత్రింబొనర్చంబొరిం।
గనితద్గ్రంథధనంబు భీముఁడతికాంక్షం బొందియాషాఢభూ।
తినిఁబోలెం బచరించె బాహ్యమగు మైత్రిన్మించినానాఁటికిన్॥ ౨౧॥

ఉ॥ అంతట నాథశర్ముఁడు చిదంబరయాత్రకు నేగనెంచి తా।
నెంతయు నమ్మి కందనసుహృద్వరు చేతికి గ్రంథకోశముం।
దంతికి వెల్గపండువలె దాఁపఁగనప్పనఁజేసె వాఁడుని।
శ్చింతగ గ్రంథరత్నములఁ జేకొనెఁ జేఁపలఁ గొంగభంగిగన్॥ ౨౨॥

ఆ-వె॥ నాథశర్మయాత్ర నల్వొప్పఁ గావించి। వచ్చి గ్రంథకోశవరమునడిగె।
నప్పగించె భీముఁడా నాథశర్మయొ। యరయఁడయ్యె భీముఁడరయఁడయ్యె॥ ౨౩॥

మ॥ తనదేశంబునకేగె భీముఁడు గృహీతగ్రంథరత్నుండునై।
తనరారంగను నాథశర్మపిదపం దా గ్రంథకోశంబునం।
గనఁగా సత్కృతులెన్నియో దొరకమిం గట్టల్కఁ దద్గ్రంథచో।
రుని ద్రోహిన్ శపియించె మూకునిఁగ సత్క్రోధంబు సామాన్యమే॥ ౨౪॥

కం॥ కనవినఁగలిగిన గుఱిపోరిఁ। దనరఁగ విలుకానిములికి దాఁకు నుదప్పన్।
గనవిననలవడకున్నను। జనుని మనఃక్షోభ మరులసమయించునహా॥ ౨౫॥

కం॥ భీముఁడు కృతిరత్నంబుల। బామెను గైకొని జయంబుఁ బొందితిననుకొం।
చేమోపితతోఁ బలుకుచుఁ। దామూగగనయ్యె నద్భుతంబుగ నంతన్॥ ౨౬॥

ఆ-వె॥ తండ్రికొడుకుఁ జూచి తగఁబల్కవేమని। మాఱుపల్కలేమి మదినిఁ గుంది।
నాయనా యిదేమి రా యంచు విలపించెఁ। జేరి రప్పుడెల్లవారరిదిగ॥ ౨౭॥

ఆ-వె॥ వ్యాధిభేదమనుచు వైద్యుండు సెప్పెను। ముట్టె దయ్యమనుచు భూతవైద్యుఁ।
డానుగాముదోసమనుచు జ్యోతిషికుండు। పాపఫలమటంచు బ్రాహ్మణుండు॥ ౨౮॥

మ॥ జనకుండందఱు సెప్పినట్లొనరిచెన్ శాంతిక్రియల్బ్రాదివే।
ల్చిన హోమంబులు గాఁగనయ్యె నవియోలింగాంచి యూహించి బు।
ద్ధినిఁ దన్మూకతమూలమున్ యది సుహృద్ద్వేషప్రదైగికింఫల।
మ్మని యాభీముఁగు బేరమిత్రుఁ డవుడోయ్యం గొంచుఁ జోయెందగన్॥ ౨౯॥

మ॥ చని నెమ్మింగని నాథశర్మను జగత్సంస్తుత్య చారిత్రునిన్।
జనవంద్యా కరుణింపుమంచును నమస్కారంబుఁ గావించి భీ।
ముని మ్రొక్కించిన నాతఁడిట్లనె నఘమ్ముం జేయఁగా నేల క్రొ।
వ్వున దద్దుష్ఫలమంద నేల వగనొవ్వున్నవ్వఁగా నందఱున్॥ ౩౦॥

తే-గీ॥ మేలు నేసిన మేలగుఁ జాలఁ గీడు । నేయఁ గీడగుఁ గీడేల నేయవలయు।
మేలె చేయంగ రాదా కోపాలఁ జూడ । బుద్ధియే మేలు గీళ్లకు మూలమగును॥ ౩౧॥

కం॥ అని రోమశుఁడని యెడు నెక । మునివరునకు మ్రొక్కి భీము మ్రొక్కించితగం।
గను విన్నవించె మునియం । తనయుపదేశించెఁ బంచదశ భీమునికిన్॥ ౩౨॥

సీ॥ శ్రీకాళహస్తిలోఁ జెలఁగు జ్ఞానప్రసూనాంబంబరాశక్తి నాశ్రయించెఁ।
కాంచీపురంబునం గ్రాలు కామాక్షినిఁ బశ్యంతి నత్యంతభక్తిఁ గాంచెఁ।
పిమ్మట నిమ్మగం బిల్వవనంబునఁ దను మధ్యమన్సాంఖ్యదను భజించె।
నందె యక్షరమూర్తియా తనుమధ్య నుమీనాక్షి వైఖరిఁ బూని యెంచె।
భీముఁడు యథావిధిగఁ దపోవిలసితుఁడయి । తనరఁ గావించె జపహోమతర్పణములఁ।
బూని యొనరించె బ్రాహ్మణభోజనంబు। ధ్యానపూజలఁ దనుమధ్యఁ దనివిఁ గొలిచె॥ ౩౩॥

సీ॥ కెందమ్మిఁ బొందమ్ము లందమ్ము గంగ్లైన నఁదమ్మి గద్దియ నడుగుల డర।
మంకెనపూఁ దోఁటఁ బొంక మూత్రాలి సంజ ప్రొద్దునా గెంజీరఁ బొనరఁ గనెడ।
లక్కారముల సరియరిది పాత్తము పల్కుఁ జెల్వన ల్వాయసంగఁ జేతులఁ దగ।
నిక్కడ నీకోర్కి యెసలారు నీకింక జంకు వల్దనునాఁగ నింకఁ గేలు।
గవయు నెసఁగఁ గరత నాల రవణములును। బొందిఁ బొందుటఁ జెలువొందఁ బోలమోముఁ।
గ్రొన్నెలని వాళియననిగఁ జెన్ను మీఱ । నెట్టయెదుటను గనుపట్టె గట్టుపట్టి॥ ౩౪॥

ఉత్సాహము॥ కాంచి భీముఁడంతఁ గనుల - కఱవు దీఱ నా జగ।
త్ప్రాంచితన్నిరస్తమూక - తన్నుతించె నెంతయున్।
సంచుగాఁ గనించు విలుతు - జక్కతక్కరస్థమై।
మించునదియ నంగజనులు - మేలు మేల నంగడున్॥ ౩౫॥

సుగంధి॥ ఛాలు రుల్ల సిల్లు చెల్ల - వైదుషుల్గ నంగడున్।
బాలయంచుఁ బేరుగాంచి - భద్రమూర్తివై శివం।
చోళిఁ గొందఱింద్రు గాక - యుల్లమందు నెంతునో।
బాలతావకాఖ్య సత్య - భావదంబటంచు నే॥ ౩౬॥

జాగ్రద్వృత్తము॥ అరుణారుణ కరుణామయి - హరిణాధిప సుధ్యా।
శరణాగత భరణాశశి - శరణా తనుమధ్యా।
శరణమ్మని నెఱనమ్మితిఁ - జరణమ్ము నునీ దే।
కరుణింపుము కరుణింపుము - కరుణింపుము నన్నున్॥ ౩౭॥

జాగ్రజ్జాతి॥ పరఁగింపకుమాశంగ్రుధఁ - బాశాంకుశపాణీ।
వరమీయవె వెఱఁబాపవె - వరదాభయహస్తా।
కరకమలాముక్తైక్షవ - కార్ముకసుమబాణా।
కరుణింపుమి నిశ్చలమతి - ఘనధృతిఁ దనుమధ్యా॥ ౩౮॥

సీ॥ అంబ గాయత్రివీవగుదు వేదవతివి హంసవాహనవమ్మ ప్రాహ్ణసంధ్య।
మాతసావిత్రివమ్మా ధర్మవతివి నీవశ్వద్వృషభపు మధ్యాహ్నసంధ్య।
యమ సరస్వతివి నీవాగి సత్యవతివమ్మ యహివైరియాన సాయాహ్నసంధ్య।
యోంకృతిబిల్వాంబయోనివి శ్వేశిపరాశక్తివీవర్ధరాత్రసంధ్య।
యయ్యునెక్కుర్తుక వెశోణహరిణకృష్ణ। చిత్రవర్ణములనులలిఁ జెలఁగెదువిధి।
విధువిధుకరీటవినుత యో విశ్వజనని। ప్రకృతినతినీకుఁ దనుమధ్యభక్తిసాధ్య॥ ౩౯

కం॥ భారతివి విద్యలిడ శ్రిత। వారములకు సిరులలొసంగ భార్గవి పరిసం।
హారము సేయంగాళివి। గౌరితనుమధ్యమమ్ముఁ గావవె మాతా॥ ౪౦॥

ఆ-వె॥ నీదుకప్పఁ గొప్ప నీవు కాళికవని। నీవు వాణివనుచు నీదు వాణి।
శ్రీవినీవెయంచు శ్రీమాతనీనామ। మారతెలుపుఁ బ్రోవవమ్మ మమ్ము॥ ౪౧॥

కం॥ తనుమధ్యాతనుమధ్య। న్నినుఁ గనుఁగొన నేరకెందొనెమ కెదరు జనుల్।
గనఁ బురుషార్థచతుష్టయ। మొనరుంగదనీదు పేరెయొగిస్మరియింపన్॥ ౪౨॥

కం॥ తనుపదము తత్సందోంధన। మనుఁ బ్రత్యాహారమున ననుమధ్యపదం।
బున టుశివా గౌరీడ్యో। యనినిను సాంఖ్యాంబనెంతు నమ తనుమధ్యా॥ ౪౩॥

తే-గీ॥ దేవి బహుపదవయ్యు నీవు ద్విపద। వవుటఁ దలఁచెద నిందందు నందఁగలుగు।
ఫలములెల్ల నుద్వృత్పదద్వంద్వ సేవఁ। బడయవచ్చునటంచు సుభక్తిఁ గొలుతు॥ ౪౪॥

క॥ అని బహుభంగుల వినుతిం। పను దనుమధ్యాంబ భీముఁ బరమప్రీతిన్।
గనివత్సా వేఁడుము వర। మన నతఁడిటు విన్నవించె నతిహర్షమునన్॥ ౪౫॥

తే-గీ॥ ఆశ్వయుజపూర్ణిమన్నాకు హర్షమిడితి। కానసీతిథి నీవాపగనుమునింగి।
నిన్నుఁ గొలిచిన నాకథ విన్నవారి। కిడవె తనుమధ్య వాగ్భూతి నిష్టసిద్ధి॥ ౪౬॥

తోటక॥ అని వేఁడుడు నట్లగు-నంచు వరం। బొసఁగి శివార్చన-ముఖ్యము గా।
నొనరింపుము మేలని-యో మనశ్రీ। తనుమధ్య తటిత్తనఁ-దామటిఁగెన్॥ ౪౭॥

ఓష్ఠ్యకందము.

భీమాభీమాభామా। భామాభూమా విభూవిభవభావభవా।
వామావామాభ్యూమా। వామాంభోభవభవా విభావభవవిభా॥ ౪౮॥

నిరోష్ఠ్యకందము.

శ్రీకర శ్రీకరజాతా। శ్రీకంఠా శ్రీశ శేఖరీకృతచంద్రా।
లోకాలోకకృదీక్షణ। నీకిదె నతినన్ను నేలు నెనరొనరంగన్॥ ౪౯॥

### ఓష్ఠ్య నిరోష్ఠ్య సంకర కందము.

విధివిధునుమ స్తమునీ । పదమునువీక్షింపఁడుమఱిపరవీక్ష్య మొకో।
బుధవంద్యమదిస్మరింపుడు । విధుమౌళిఫలములొసఁగవెబిల్వేశా॥ ౫౦॥

### అ చ ల జి హ్వా కం ద ము.

వామావామాంగమహాం । గామాహావిభుహయామహామహిమామాయా।
భీమాయమకామభయ । వ్యామోహాపహవిభావహాగేయాఖ్యా॥ ౫౧॥

### అ స్ప ర్శ కం ద ము.

స్వాయశోంశుసారసార్య । శ్రేయయంహేహాహరహరావిషసహాశివశివా।
శయసురసింహాశైలా । శ్రయయరయవెస్వీయవెసవృషహయాశ్రీశా॥ ౫౨॥

మాలిని॥ అనుచుననతఁడెంతో - యాస్థతోబిల్వనాథున్।
ఘనముగనుతియించె - న్నానుగంగొల్చెనల్లే।
వినుతముగవరంబుం - బిల్వనాథుండొసంగెం।
బొనరుఁగదశివార్చన్ - భుక్తియున్ముక్తినిచ్చున్॥ ౫౩॥

కం॥ భీమోపాఖ్యానంబిది । నేమంబునఁజదివినను వినిననుజనులకున్।
గామితఫలసిద్ధియగున్ । శ్రీమద్బిల్వేశకరుణసిద్ధముగాఁగన్॥ ౫౪॥

ఇది, భీమోపాఖ్యానము.

---

### మ త్తో పా ఖ్యా న ము.

ఉ॥ శ్రీవిభుసంభవోర్మికరశీలితకంకణకంకణాంచిత।
శ్రీవిభవాభిరామశశిశేఖరమౌళిసుధాకరాకృతిన్।
భూవనితాధృతాంచితమనోహరమౌక్తికహారమధ్యహీ।
రావళియోజనెక్కునదిరాజిలుఁగౌశికినాఁగబాగుగన్॥ ౧॥

శా॥ తత్తీరంబునఁబ్రోలొకండుపొలుచుంధర్మప్రజాభిఖ్యమం।
దాత్తప్రస్ఫుత్యతివీర్యవిత్తహలమానాస్యప్రవేష్టోరుపా।
చాత్తోత్పత్తిమహాజనాఘుమదిసత్యాచారనిత్యేడితం।
బుత్తంసాయితమెల్లవీడులకునంచూరీకృతంబైతగున్॥ ౨॥

మ॥ కలఁడింద్వంకమనంగఁదత్పులజుఁడొక్కండన్వయోపాత్తభూ।
జ్వలుఁడుచ్ఛృంఖలశృంగుఁడిష్టమహిషీసంగుండుసీలాద్రినాఁ।
గలితాకారగుణుండుదానపరభృంగత్యక్తుఁడాఢ్యుండస।
మ్మిళితార్యుండుయిమధ్వజాత్మజుఁడహామృత్యుంజయాఖ్యుండటన్॥ ౩॥

చ॥ అకటయతండురాజయిమహామునిరత్నమురైక్వునిన్నిజా।
ప్రకటకులానువర్ణనమువానిగసత్కృతిఁజెప్పఁగోరియ।
ట్లకుటిలవృత్తినాతఁడుమహామహిమప్రచయింపనింపుమై।
సుకృతులుమెచ్చఁగాకొనియుసొంపుగఁదన్పఁదలంపఁడాతనిన్॥ ౪॥

కం॥ మఱిరైక్యమునియెతనకి । త్తఱిఁదిండింబెట్టుమంచుఁదలవాకిటఁబెం
పఱనిల్వనరయకాదార । కొఱగామిగఁగుడిచిపగటఁగూర్కెంగోర్కెన్॥ ౫॥

తే-గీ॥ ఆఁకటనుడస్సియున్ననియాతఁడుగడు । వేఁడనెవరునులోనికివెఱచిరరుగ,
నంతఁదెంపరియొకఁడాప్తుఁడధిపులేపి । భూపరైక్యుండువచ్చెఁదన్నుమనెఁదనర॥ ౬॥

ఆ-వె॥ మండిపడుచునిదురమానుటనాకేఁడు । దండనంబునీకుఁదగెడునెవ్వఁ
డెట్టులైననేమియేగుమంచనిపంచెఁ । జెడుగునకుహితంబుఁజెప్పనగునె॥ ౭॥

సీ॥ ప్రభులుకృతఘ్నులుపాపులవిశ్వాసులనుచితజ్ఞులటంచుననిరికొంద,
ఱిభ్యులుధనమత్తులెంతయులుబ్ధులహంకారతనులంచుననిరికొంద,
ఱాఢ్యులుశుష్కప్రియాలాపులునుశూన్యహస్తులగుదురంచుననిరికొంద,
ఱధిపులుసంపన్మదాంధత్వబధిరత్వఘనవంచకులటంచుననిరికొంద,
ఱనిరికొందఱుపరివృఢులాత్మకార్య।ధుర్యులర్థిమరీచికలార్యనింద్యు
లంచునొకకొందఱిటువంటియఘుఁలఁదలఁప।నఘమగునటంచుహరహరయనిరిమఱియు॥

సీ॥ కడుపునించుకొనఁగుక్కలులేవెతమపొట్టఁదామునించుకొనంగధనులుధనులె,
గూళ్లఁగట్టుకొనవెకోరియాగిజిగాఁడులిండ్లుగట్టుకొనంగనినులునినులె,
యెనుములనెక్కవేయేత్రింతలెందునువాహనములనెక్కఁబ్రభులుప్రభులె,
సొమ్ములఁదాల్పరేయిమ్ముగాలంజెలుతొడవులఁదొడుగంగదొరలుదొరలె,
స్వాశ్రితులకన్నమిడఁగల్గునధిపులధిపు । లాప్తులకుమనుకులనిడునాఢ్యులాఢ్యు
లిష్టులకువాహనములిడునిభ్యులిభ్యు । లెలమిఁగవులకుధనమిడునృపులునృపులు॥ ౯॥

సీ॥ కఱవునఁబ్రజలనుగాపాడఁడేనానెరాజునూడఁగనుదరాజెకాక,
పనిపెట్టితగినట్టుఫలమిడండేనానెమానవపతిగొడ్డుమ్రానెకాక,
తుచ్ఛుఁడుదొరకీర్తిదొరయనేకుక్కసింహంబౌనెగ్రామసింహంబెకాక,
మోసమునన్యాసిమొనసెనేనియునరపతినక్కయెశివాఖ్యఁబడయుఁగాక,
యడుగకున్ననెఱిఁగియఖిలజనులకిష్ట । సిద్ధినేయువాఁడెక్షితిపతిదన,
కిష్టసిద్ధినేసియెలమినన్నమువేఁడు । మునిఁగనమిన్నృపుండెపుండెకాక॥ ౧౦॥

సీ॥ అన్నార్థివాకటనున్నవానినిమానియాపోశనముఁగొంటయగునుమద్య,
పానంబుభోజనమానుగోమాంసభక్షణమునిద్రించుటచావుగాదె,
కాలవశంబునఘనులర్థులైరాఁగవారిఁదన్పగవద్దభక్తియుక్తి,
నొప్పరికింపవేఱొకయెడకేగివారొందరేసంతృప్తియోగ్యతాప్తిఁ,
బూజ్యపూజనొనర్పమిఁబొసఁగునయశ । మర్థహైన్యంబునాధర్మహానిదగిఖ,
మవులనరకంబుజన్మాంతరానుభావ్య । మానఘఫలంబనుచుజనులాడిరంత॥ ౧౧॥

కం॥ అప్పుడుమునియప్పబువుం । జెప్పఁడెదియుమత్తుఁడనుచుఁజింతించిచనెన్,
గొప్పతనంబిట్టిదియని । చెప్పజనులువిసముమ్రింగుశివుఁడితఁడనఁగన్॥ ౧౨॥

కం॥ చనినను మిన్నకయమ్ముని । మనమున నణపంగఁబడ్డమన్యువునృపుపా,
లనుబడెఁబిరంగిగుండన । ఘనులమననుగందఁజెడరెకట్టడులెందున్॥ ౧౩॥

కం॥ ఎట్లది వెలికుబ్బె నెజను । లిట్లని రీతఁడు నృపుండెయెన్న నరుండే।
యెట్లగుముని నేచెమత్తుం । డట్లనమత్తాఖ్యయతనికయ్యె సతముగన్॥

కం॥ ఈనృపతిమృత్యుహరుఁడే । పూనెనుమృత్యుంజయాఖ్యముగదతనముగా। ౧౪॥
తానెయమధ్వజజుండఁట । మానుగమహిషీపతియఁటమఱియనవలెనే॥

కం॥ అనిపలువురుపలువితముల । ననలోకులాకాకులాయననగులోకోక్తిం। ౧౫॥
దనహానిలోకనిందయు । ననునానుడిఁదలఁచివగచెనతఁడంతంతన్॥

కం॥ దుర్వాసుఁడుశాపమిడను । పర్వేశునిరాజ్యలక్ష్మివారిధిఁబడెరై। ౧౬॥
క్రౌర్యాంతంక్రోధానల । ముర్వీపతిరాజ్యవార్ధినుడికించెనహా॥

తే-గీ॥ వానలేబరమయ్యెనుబలిసెనెండ । పొలముమడితోఁటబీళ్లయ్యెజలముద్రావ। ౧౭॥
నొదవదయ్యెనులేదయ్యెనోదనంబు । క్షామదేవతయే మొసాక్షాత్కరించె॥

మ॥ జనులెల్లంజెలరేఁగితన్నుఁదెగడన్ సైరింపలేకాత్మనా। ౧౮॥
యనయెంతేనియువంతతోనపయశోయద్యస్తికింమృత్యునా।
యనుసూక్తిన్ స్మరియించిదక్షిణముఖుండై పోయెసంత్యక్తస।
ద్వనితానందనబంధుమిత్రజనుఁడై భ్రష్టుండుగష్టుండునై॥

సీ॥ పంచకూటాచలప్రాభవంబునఁదోఁచుఁబ్రాసాదమంత్రంబుపయిపయిఁగనఁ। ౧౯॥
దల్లక్ష్యపంచవక్త్రిస్వచ్ఛచక్షుశ్శ్రీవసద్దృగ్లింగాప్తిఁబ్రణవమొనరు।
నవదళంబైయఖండంబైనయొకబిల్వమునశివసాయుజ్యముక్తియొదవుఁ।
దుమ్మిపూవొకఁడిడద్రోణపుష్పంబుగానలరుననంతలింగార్చనముగ।
నెందుఁజూరనెట్టిఁడేనియునైనయుమోక్ష । మట్టిదక్షిణకైలాసమందుఁబొందు।
గానుశ్రీకాళహస్తీశుజ్ఞానశక్తిఁ । గొలిచియాతండుసర్వాఘకోటిఁగూల్చె॥

కం॥ తనపేరనెక్కతీర్థం । బునెక్కలింగంబునిలిపెభువనాంచితమున్। ౨౦॥
ఘనుఁడామృత్యుంజయరా । జనువాందఁగనందఱందునభినందింపన్॥

ఉ॥ అందునంతండొకానొకనిశాంతమునందనమండపంబునం। ౨౧॥
గుందుచుఁగూర్కఁగోర్కెనెడఁగూర్పఁగనేర్పుననిందుమౌళియుం।
బొందమృకండుజుండనఁగనుండికలన్విలపించెదేలరై।
క్యందిలకింపుబిల్వవనినుండునతండనిపల్కెఁబల్కినన్॥

మ॥ మఱునాఁడేపయనంబునేసియతఁడామార్గంబునన్మేలుచే। ౨౨॥
కుఱిగాయత్రియెశేషశైలమనుచుంగుస్తంబులేడాస్ఫటల్।
చిఱుకొండల్లగవ్యాహృతుల్ప్రణవమేశ్రీవేంకటేశుండటం।
చెఱిఁగెండానెఱఁగెన్మహోఘధగిలాభృత్తిద్దెయుంచెంచుచున్॥

మాలిని॥ కనుఁగొనెఘటికాద్రిన్ - గల్మషధ్వాంతకాద్రిన్। ౨౩॥
ఘనుసటనరసింహున్ - జ్ఞానిరక్తైకరంహున్।
ప్రణవపదుననంతున్ - రాజయోగప్రశాంతున్।
మునిహనుమదుపాస్యున్ - భుక్తిముక్తిప్రదాస్యున్॥

౨౪॥

పృథ్వి‖ కనుంగొనెఁగుఱంగటంబిదపఁ - గంజశైలంబునా
ఘనుండువలఁగొంచుదానినటఁ - గాంచెనీవానదిన్।
మునింగెఁదనుమధ్యమాంబకును - మ్రొక్కెశ్రీకాంతునం।
తనెంచెఁదనుమధ్యఁదల్లినిని - చంద్రిబిల్వేశ్వరున్‖ ౨౫‖

శా‖ ఆతండక్కడనక్కడన్వెదకుచాహాచూచెనాచెంతగా।
రీతీర్థోత్తమతీరధాత్రినొకచోశ్రీశాఖిక్రిందంజగ।
త్పూతంబౌనొకపర్ణశాలమునిశార్దూలున్మృగత్వక్స్థితున్।
భూతిప్రాంచితునగ్నికల్పునొకరుద్రాక్షమాలాధరున్‖ ౨౬‖

ఉ‖ చూచిభయంబుభక్తియనుజొప్పడనీతఁడెశైక్యుఁడంచెదం।
దోఁచుటస్వప్నదృష్టమునిధూర్జటివాక్యముదోడుసూపనా।
లోచనఁజేసినెమ్మనములోననిజమ్మనినిశ్చయించిన।
త్యాచరణంబొనర్చెనృపుఁడమ్మునికాతఁడొసంగెదీవెనల్‖ ౨౭‖

కం‖ మీరెవరనిమునియడుగుడు । ధీరతనృపుఁడిట్లుపలికెదివ్యమునీంద్రా।
ఘోరాఘదూషితుఁడమీ । కారుణ్యముచేతసుకృతిగాఁగలవాఁడన్‖ ౨౮‖

సీ‖ పండితంమన్యతబహుసాధువులమదిఁగుందించిసద్గతిఁజెందనయితిఁ।
బత్నినిఁగికురించిపరవనితలఁగూడిపాపమార్జించితిఁబలువితములఁ।
బ్రజసుఖదుఃఖముల్పరికింపకొప్పఱనొప్పించికైకొంటిఁగప్పములను।
జెప్పినమాటనుదప్పితినేఁగృతఘ్నుఁడనైతిఁగుడిచితిఁగొనకతిథిని।
దాఁపనేటికిఁగౌశికిదరినిధర్మ । ప్రజమునేలినయాయమధ్వజనుతుండ।
నన్నునంద్రుమృత్యుంజయుండనిమహాప । రాధినీశరణార్థినీబోధఁబ్రోవు‖ ౨౯‖

కం‖ నగురోరధికమ్మనుచు । న్నిగమమ్ములువలుకుకతననినుగురువుగనే।
నుగణించితిశరణంటి । న్దగుఁగదశరణార్థిరక్షణముడుపుమఘమున్‖ ౩౦‖

కం‖ అనిసాష్టాంగనమస్క్రియ । యొనరఁగలేవకయయున్నయుర్వీపతిన।
మ్మునిపతినృపలేలెమ్మని । చనవునఁగూర్చుండఁబెట్టిచననిట్టులనెన్‖ ౩౧‖

శా‖ స్ప్రేరించుటఁగారచించితినిమున్నీవంశచారిత్రముం।
గాపాడంగలవాఁడవయ్యుననుదత్తామంబునంజూడవై।
తాపాపంబునఁగాటకంబుననునెయ్యంబాసినిన్బెండెఁబెం।
పేపేదంగనులేవడింగుడిచితీవెంతేనకీర్తిన్నృపా‖ ౩౨‖

ఉ‖ నీవుననుంగనుంగొనమినేనుగడుంగడుమేలుఁజెందితిం।
దేవుఁడుగాళహస్తిపతినెమ్మిఘనమ్ముగనన్నుఁగ్రొన్నెల।
న్గావెలయించెనక్కఱవునన్గననాతఁడెరాజమౌళిగా।
యీవడిఁబ్రోచునిక్కడనుశ్రీశ్వరుఁడొక్కఁడెకాఁడెయెక్కడన్‖ ౩౩‖

కం॥ చచ్చువఱకున్నఁబెండ్లిం । జెచ్చెరఁ జేసెదననుక్రియఁ జేవదలితివి।
వెచ్చఁగఁబాడఁగనేసో । మెచ్చితిసరియన్నయట్లుమెలఁగితెఱుఁగవే॥ ౩౪॥

కం॥ కానైననిడకసత్కృతి । వానిగఁ గైకొనెననినినుఁబలికెదరజ్ఞుల్।
మోసమెయాశాపాశము । నోసరిలఁగఁ జేసిజ్ఞానమొసఁగితిసుఖమున్॥ ౩౫॥

కం॥ చేసితిశ్రీబిల్వేశ్వర । భాసురచరితంబుసర్వపాపహరంబున్।
దాసాభీష్టదమునదే । యీసురుచిరకృతిమణిగనుహితమనిడియనేన్॥ ౩౬॥

కం॥ శ్రీరామాయణమునకుం । గారణముగిరాతునెడనుగలిగినశాపం।
బారీతినీచరిత్రము । కారణమీబిల్వనాథఘనకృతికయ్యెన్॥ ౩౭॥

కం॥ ప్రేరకుఁడవుకారయితవు । నారయననుమోదకుఁడవునాత్మాన్వయస।
చ్చారిత్రమునకునెట్లు । ట్లోరాజాయీకృతికయియొప్పెడుసుకృతీ॥ ౩౮॥

కం॥ నాలేవడినీవెనసితి । పోలఁగబిల్వేశుకృతినిఁబొసఁగెడుయశమున్।
శ్రీలెసఁగఁగొనకనాకే । చాలనొసఁగితెవ్వరీడుసాధుతనీకున్॥ ౩౯॥

కం॥ మృత్యువగునాశయదియెదు । రత్యయమద్దాని గెలువనలవఱిచితహా।
మృత్యుంజయత్వదాతవు । మృత్యుంజయరాజనఁగనుమెఱసెదవధిపా॥ ౪౦॥

కం॥ నీపాపంబుసమస్తము । నీవేదఱికమునఁదీఱెనెగడినసడిచే।
భూపర్యటనంబుననను । తాపంబునస్వేష్టదేవతాగురుభక్తిన్॥ ౪౧॥

మ॥ నరనాథామునునీదువంశచరితన్నాచేతఁ జేయించితీ।
విరవందంగనుబిల్వనాథకృతికయ్యెంబంటకెర్వట్లుత।
ద్వరపుణ్యంబునబిల్వనాథునినిగొల్వంజాలితీవుండునే।
దురితంబుల్దవదభిఖ్యనెన్నఁదొలఁగుందోడ్తోడమృత్యుంజయా॥ ౪౨॥

తే-గీ॥ నీవుదోషరహితుఁడవుగావుననెమ । హార్షదక్షిణకైలాసమందుస్వాఖ్య।
నెగడఁదీర్ఘలింగంబులనెలకొలిపితి । వరుగుదెంచితిమునిరూపహరునియాజ్ఞ॥ ౪౩।

పంచచామరము॥ అపేతలజ్జతన్నిజాఘ - మంతదెల్పితందుచే।
నృపానశించెనద్దియెల్ల - నెమ్మినమ్మిమిమ్మగం
దపంబొనర్పమిందిఁకన్మ - దంబుఁగందువెంతయుం।
గృపాళువైనబిల్వనాథుఁ - గీర్తనీయుఁగొల్వఁగన్॥ ౪౪॥

సుగంధి॥ చేయుస్నానముంద్వమేహి - సింధువందునేనిట।
న్గేయగౌరితీర్థమందు - నేనిబిల్వనాథునిన్।
ద్యేయుశ్రీపతిన్భజింపు - మీవుబిల్వనాయకున్।
శ్రీయుతుండవౌదువిద్ధి - సిద్ధమంచునెంచుమా॥ ౪౫॥

ఉ॥ కాశికనేకవల్లినిఁదగంగభజింపుసులత్మ్ములేగెడున్।
మాశినుధాంశురేఖఁదనుమధ్యనుగొల్వుములత్మ్ములబ్బెడున్।
వైశముబిల్వనాథుశివుభక్తినుతింపుముముక్తిగల్గెడున్।
గాలగళున్స్తుతించినజగంబునదుర్లభమెద్దియయ్యెడున్॥ ౪౬॥

క౦॥ రక్షకము బిల్వనాథా । ష్టాక్షరమంత్రంబు శ్రీదమగు తనుమధ్యా।
ష్టాక్షరిఁ గొను మని రైక్యుం । డాక్షణమునఁ జెప్పె నతని కానాదము గాన్॥ ౪౭॥

ఇం-వ॥ ఆదిత్యవర్ణేయను-నట్టి మంత్రం । బా దివ్యమౌనీంద్రుఁడు-హర్షమొందం।
గాఁ దేట తెల్లంబుగఁ-గాంచఁ జెప్పెన్ । శ్రీదంబగున్నికిది-సిద్ధమంచున్॥ ౪౮॥

ఉ-వ॥ అతండు రైక్యోక్తము-నాచరించెం । గృతజ్ఞుఁడై కాంచెను-గృత్తికాప్తిన్।
నుతంబు నారాకని-నున్నపుంగ । ల్పితాంగు బిల్వేశ్వర-లింగమందున్॥ ౪౯॥

సీ॥ కంటిమంటయొకింతయంటుటఁ గరఁగెనాఁ గడలివెన్న సగంబు గ్రాలఁ జాల।
జడలను నెఱమంటల డరఁ బాల్పొంగెనా వేలుపుజక్కు రజాలువార।
గడిమినిఁ బజ నెల్లఁ గాపాడఁ గల్గి నగుఱుతునా విసమెంతొ యఱుతఁ దనర।
సోబనంబుల ప్రోవునాఁ బొల్చు గట్టురాపట్టి యెడమతోడ పయినిబరఁగ।
సత్తిదాపలి కేల్దండ హత్తఁ దనదు । బత్తులను జంకవలదన వలపలికయి।
జింకము మ్మొనవాల్ప యిచేతులఁ జన । గిత్తరౌతయి బిల్వేశుఁ డత్తఱిఁ దగె॥ ౫౦॥

క౦॥ కనుఁగొని కరమరుదందుచుఁ । గని పరమానందమొంద ఘనభయభక్తుల్।
మును కొని చాఁగిలఁ బడి లే । చి నిలిచి సాంజలి శిరుఁడయి చేసెన్వినుతిన్॥ ౫౧॥

క౦॥ శివపంచాక్షరినీ పే । రవునక్షరసంఖ్య లెనయనై దుఁబదౌటన్।
దవనైదుపదిగనిన్నెం । తువెలయ బిల్వేశప్రణవనుతిఁ గనెదాదిన్॥ ౫౨॥

ప్రాసాదాస్య బిల్వేశ్వరస్తుతి.

ఇం-వ॥ ఓంకారరూపాయమ - హోదయాయ।
హ్రీంకారవంద్యాయమ - హేశ్వరాయ।
పంకాటవీదాహక - పావకాయ।
ప్రాంకేఽత్ర బిల్వేశన - మోఽస్త్వినాయ॥ ౫౩॥

ఉ-వ॥ నమోఽస్తు తేఽజాయఘ - నాయకర్త్రే।
రమేశరూపాయవ - రాయభర్త్రే।
ఉమేశ్వరాయేశమ - హోగ్రహర్త్రే।
నమత్సు బిల్వేశ్వర - నామధర్త్రే॥ ౫౪॥

ఉ-వ॥ మహాత్మనే తేఽస్తున - మశ్శివాయ।
మహామతే తేఽస్తున - మశ్శివాయ।
మహీధ్రజేశాయన - మశ్శివాయ।
మహేశ బిల్వేశన - మశ్శివాయ॥ ౫౫॥

ఉ-వ॥ శివాయ దేవాయశ - శిప్రభాయ।
శివాంకమూర్తేశశి - శేఖరాయ।
శివంకరాయాశ్రిత - శేవధేఽస్త్వం।
శివేశ బిల్వేశద్యు - శెనమస్తే॥ ౫౬॥

ఇం-వ॥ వామార్ధజానేంగళి - వస్తులాయ।
వామీకృతాబ్జేక్షణ - వల్లభాయ।
ధీమాయబిల్వేశ్వర - విశ్రుతాయ।
స్వామిన్నమస్తేఽస్తుశి - వంకరాయ॥ ౫౭॥

ఉ-వ॥ యమాంతకాయత్రిపు - రాంతకాయ।
సుమాస్త్రహంత్రేఽంధక - సూదనాయ।
నమోఽస్తుబిల్వేశ్వర - నామధేయ।
నమోఽస్తుమృత్యుంజయ - నామగేయ॥ ౫౮॥

కం॥ అనిపొగడంబిల్వేశుఁడు। గనియింద్రోపేంద్రవజ్రకలితప్రాసా।
దనుతిగ్రహియించిమించుగ। ననుగ్రహించియిటులనియెనాభూపతికిన్ ౫౯॥

కం॥ నీనుతిచేనీకుఁదగినది। యీనిరుపమవస్తువనుచునిచ్చెగురుతరం।
బైనెగడురత్నలింగముఁ। దానతఁడురత్నసానుధరమనఁదనరెన్॥ ౬౦॥

కం॥ నాగాయుతబలుఁజేసెన్। భోగివిభూషణుఁడువానిభోగిన్యోగిన్।
గాఁగన్సార్థకనామునిఁ। గాగొనకొనిమఱియువరముఁగాంక్షింపుమనెన్॥ ౬౧॥

కం॥ అననతఁడీతిధినుత్సవ। మొనరుతఁగననీదువినుతియనుమత్కథయున్।
వినఁజదువనిష్టసిద్ధులు। జనులకుఁగలుగవలెనంచుసంప్రార్థించెన్॥ ౬౨॥

కం॥ పతియుఁదథాస్తనియంత। ర్హితుఁడందేకాఁగరాజుహితమతిరైక్యన్।
నుఱియించితనిపిచనెగుణ। తతివెలయఁగస్వపదమేలెధన్యుండయ్యెన్॥ ౬౩॥

పృథ్వి॥ కృతఘ్నతయుదోషము - లైడయుమత్తమృత్యుంజయ।
క్షితీశచరితంబునం - జెడియెడిన్స్మయాజ్ఞానముల్।
కృతజ్ఞతయుసద్గురు - ప్రియముశ్రేయముంగల్గునీ।
కృతిన్వినఁబఠించినన్ - శ్రితులకబ్బునిష్టార్థముల్॥ ౬౪॥

అమృతవాహిని॥ ఈమత్తనృపచారిత్రం। బేమర్త్యుండేనెఱింగినన్।
శ్రీమత్పాపాపహమంత్రాప్త। శ్రీమంతుండగునిజంబుగన్॥ ౬౫॥

ఇది, మత్తోపాఖ్యానము.

---

## శూరోపాఖ్యానము.

ఉ॥ ఇందుకులంబునందుజనియించుటనొద్విజరాజయయ్యెఁబా।
న్కిందగునీతఁడేయనుచునిర్జరులెన్నఁగఁదన్నుసన్నుతిం।
పందనరారుగాధిజుఁడుబ్రహ్మమునిత్వముఁగోరిబ్రహ్మమున్।
డెందమునందునిల్పిపొగడెంగడుఁజేసెఁదపంబువానిగన్॥ ౧॥

చ॥ తడవుగబమ్మయమ్మునికిదర్శనమిచ్చియనెన్మహాద్యమం।
బెడలకొనర్చిదీవిదివహించుటదుర్లభమౌనునైననెం।

కఁడుపముగల్గువిన్మమునుగాంచెఁజతుర్థకులుండొకండునా।
కొడుకగునట్టిభాగ్యమునుగొబ్బుననారదుఁడాతఁడాఁజుమీ॥ ౨॥

శా॥ శ్రీపర్ణాఖ్యనదీతటంబునఁదగున్ శ్రీపుర్యభిఖ్యంబుప్రా।
లాపూర్వార్యమునందునెప్పఁదనుమధ్యాదేవిశ్రీపర్ణనా।
శ్రీపర్ణేశుఁడుబిల్వనాథుఁడనఁగాశ్రీకంఠుఁడాప్రాశికిం।
బాపంబుల్దొలఁగించిపుణ్యఫలముల్ప్రాపింపఁజేయుందయన్॥ ౩॥

మ॥ కొలువన్వచ్చిరిగొందఱంచితులుయోగుల్భిక్షులచ్చోటికిన్।
దొలుకన్భక్తిరసంబువచ్చెనదిచాతుర్మాస్యమున్దోడనే।
చలుపన్సేవనువారికందుననసత్సాంగత్యమేయింపుగం।
గలుగంగోరెడుఁగాదెసజ్జనుఁడువేడ్కన్ప్రాణిప్రాణంబనన్॥ ౪॥

కం॥ దానేరుండొకరుండా। భూసురసన్యాసులనునపుడుసేవించెన్।
వానిగనుదదుచ్ఛిష్టము। నాసక్తింగుడుచుచుండెనావ్రతమగుడున్॥ ౫॥

కం॥ ఆపారికాంక్షులుశివ। శ్రీపాదంబులకుమ్రొక్కనెలవొందిధరి।
త్రీపర్యటనముసేయఁగ। వేపోవుచువానిఁజేరిప్రియమెనయంగన్॥ ౬॥

కం॥ తనుమధ్యాబిల్వేశుల। ననువొందఁగనాశ్రయింపుమమలాత్ముఁడవై।
వినుతముపౌతన్నామము। లనయమ్ముస్మరియింపుమిష్టలాభములబ్బున్॥ ౭॥

కం॥ అనిచనవారలువాఁడున్। ఘనభక్తిభజించుశివులఁగావించుఁబ్రద।
క్షిణములనుగోవెలకుమఱి। యొనరించున్నతులుపెక్కులొక్కమ్మడిగాన్॥ ౮॥

సీ॥ కాళికాతీర్థప్రకాండంబునమునుంగుఁజేయుస్నానమునివాసింధువందు।
నవగాహనమొనర్చునల్లగౌరీసరస్తల్లజంబునబూదిఁజాలఁదాల్చు।
బిల్వదళంబులవివిధపుష్పంబులఁదెచ్చిదేవళమునకిచ్చుమెచ్చు।
నగ్రహారికులకునాశ్రితుఁడైయెట్టొపొట్టపోసికొనెడుఁబ్రోచుఁదల్లిఁ।
దలఁచుఁదనుమధ్యలనియెల్లతలిరుబోండ్ల। నెంచుబిల్వేశులనిమదినెల్లమగలఁ।
దత్పదాంకులసేవించుఁదత్పరుఁడయి। శివశివయటంచువచియించుస్మృతియెసంగ॥

సీ॥ చనునిత్యమునుప్రదోషసమయమందునాగుడికిఁదాఁగట్టినకుసుమబిల్వ।
హారంబులనుగొనియర్పించుబిల్వేశునత్తనుమధ్యనునధికభక్తి।
సేవించునందుదీపావళిదర్శించిలెక్కించితత్త్వంబులీలనెఱిఁగి।
చొక్కుఁబ్రాసాదంబుస్ఫురియించినదానుబంచాక్షరినెపూనిపల్కుఁదనదు।
శూద్రజన్మంబునకురోయుఁజొప్పడంగఁ। గోరుబ్రాహ్మ్యంబుబిల్వేశుఁగూడవేఁడు।
వాఁడుశివకీర్తనంబులఁబాడునాడు। సాత్వికాంకవిశిష్టుఁడైసన్నుతుఁడగు॥ ౧౦॥

కం॥ ఘనసంగీతజ్ఞుండనఁ। దనుమధ్యాబిల్వనాథతనయుండనవాఁ।
డొనరంగానరసమునిడు। టనునారదుఁడనఁబడెనుబుడమిఁగడుఘనతన్॥ ౧౧॥

కం॥ తనుమధ్యాబిల్వేశుల। వినుతిగలుగుకృతులుగాకవేవేయుఁబా।
డనుగడఁగడువేవేలి। చ్చిననుత్సవకాలమునకుఁజేరెడునటకున్॥ ౧౨॥

కం॥ ఇచ్చునవారిగవిడిముడి । వచ్చినయాచకులకెల్లభాగ్యమటంచున్।
విచ్చలవిడిసత్త్రములకు । వెచ్చించున్స్వార్జితమగువిత్తమునెల్లన్॥ ౧౩॥

ఆ-వె॥ ఎప్పుడేదివచ్చునప్పుడేయదియీశ్వ । రార్పణంబునేయునాసఁగొనఁడు।
దాఁపస్వాపతేయమీవుట్టువేచాలు । నంచునతఁడుదెలివియతిశయిల్ల॥ ౧౪॥

ఆ-వె॥ దానశూరుఁడగుటఁదానుశూరుండను । పేరువడసెవాఁడుపెంపెసంగ।
శూరుఁడగుటనోటుజోటిందలంపఁడు । స్వప్నమందునేనభవుభజించు॥ ౧౫॥

ఆ-వె॥ ఆటవెలఁదిపద్యమైననువిననొల్లఁ । డాటవెలఁదినాతఁడాసఁగొనునె।
పెండ్లిచేసికొనుముప్రియమవుననవాకుఁ । బెండ్లిలేకయుంటప్రియమనియెడు॥ ౧౬॥

చ॥ జననిమృతింగనంగ్రియలఁజల్పియనల్పముగాఁగనీఁగినా।
ఘనుఁడితఁడేయటంచుజనకాండముమెందుగమెచ్చనచ్చటం।
దనువుదొఱంగిసత్యమునఁదార్కొనినన్నమదాత్మజుండుగ।
న్గననముసెంచెవాఁడెచుమినారదుఁడయ్యెనువింటెగాధిజా॥ ౧౭॥

ఉ॥ నారదుఁడుంబురావతరణంబునహాసనఁజేసిశ్రీవనిం।
జేరిభజించెశ్రీశివులశ్రీనిజతత్త్వముఁగాంచిమించెన।
ట్లారహిఁగాంచఁదాత్త్వికులకెల్లనుదారిగశ్రీఫలాపగన్।
నారదతీర్థముంచెనటస్నానమునేసినసబ్బెదున్నిరుల్॥ ౧౮॥

కం॥ నారమననీరమగుమఱి । సారంబగుజ్ఞానమానుజ్ఞానామృతమున్।
వారకొసఁగునదియగుట । న్నారదతీర్థమగునద్దినాదప్రదమున్॥ ౧౯॥

శా॥ తత్క్షేత్రంబుమహత్త్వమింతయనుచుందర్కింపఁగాశక్యమే।
సత్క్షేమంకరమద్దియందుఁదపముంజల్పంగబ్రహ్మర్షితన్।
హృత్క్షేత్రంబునుబొందెదీవనిచనేన్సృష్టిప్రభుండంతభా।
స్వత్క్షాత్రుండటకేగికొల్చెశివువిశ్వామిత్రుఁడాత్మజ్ఞుఁడై॥ ౨౦॥

సీ॥ ఇంద్రతీర్థంబననెసఁగునీవానదినాగ్నేయతీర్థమానట్టికనెము।
నంమఁబిందో చితయామ్యతీర్థంబునఁదగునదీద్వయసంగతహ్రదమునఁ।
బుణ్యజననుతీర్థమునగుతాండవనాథ తెప్పకేళాకూళినొప్పువరుణ।
తీర్థంబుకాళికాతీర్థంబునాఁడగుచెఱువునవాయవ్యసిద్ధతీర్థ।
మనఁజనెడివల్లిమలమీఁదిదొననుశ్రీద । తీర్థమగుహరిచెలమనుదివ్యకంజ।
శైలశంకరచంద్రాబసరసునందు । గౌరివాపినిమునుఁగునగ్గాధిజుండు॥ ౨౧॥

సీ॥ స్కాందతీర్థమునుండిచనెదుసనత్కుమారునితీర్థమునకొకరుఁడటనుండి।
తాండవనాథతీర్థమునకునందుండిహరితీర్థమునకునచటనుండి।
తెల్పునల్పులునదుల్దెఱఁగొప్పఁగూడెడుసంగమతీర్థముసంగతికటు।
నుండిగౌరితీర్థకాండంబులందాడిబిల్వేశుఁబ్రణవాత్ముఁబేర్మిఁగొలిచి।
వ్యాహృతిద్యోతకములగునట్టిబిల్వ । వృక్షములకునెనర్చిప్రదక్షిణములు।
భక్తిఁదనుమధ్యగాయత్రిఁబ్రస్తుతించి । చేరుగుహాగిరికమ్మునిసింహమొగిని॥ ౨౨॥

## షష్ఠ బింబము.

సీ॥ స్కందునారాధించియందువల్ల నెఱింగి యల్ల విశ్వామిత్రుఁడనుదినమును।
గాయత్రి జపియించుఁ గంజశైలంబున సావిత్రి భజియించు సరసిజాక్షు।
సరసున నెగి సరస్వతిని సేవించు నుదనుమధ్య సన్నిధిఁ దామనమున।
బిల్వనాథునిఁ గొల్చు విశ్వేశ్వరుని బ్రాహ్మణారాధ్యు బ్రాహ్మణ్యమంపఁగోరి।
పరఁగుఁ బ్రాసాదము త్రిపత్ర బైల్వమనుచుఁ। గంజశైలమకారంబుగాను విష్ణు।
పాదము నుకారముగను బిల్వపతి సన్ని। ధి నిమకారంబుగా నెంచి ముని భజించు॥ ౨౩॥

ఉ॥ అందుఁ దపంబొనర్చెను మహామహుఁడా మునిరాజు గాధిరా।
ణ్ణందనుఁడంత బిల్వవననాథుఁడు శ్రీతనుమధ్యతోడ వే।
డ్కం దగ వచ్చి బ్రాహ్మ్యమభికాంక్షితమిచ్చి మహర్షి సప్తకం।
బందు నెకండుగా నునిచె నాతని నాయకరత్నమానసన్॥ ౨౪॥

తే-గీ॥ ఇద్ది శూరనుపాఖ్యానమెలమిఁ దెలుపు। యత్నమే ఫలసాధనమారయంగ।
వినతులకుఁ గాదె ముంగిటి పెట్టుచెట్టు। బిల్వనాథుని భజనము విశ్వనుతము॥ ౨౫॥

ఇది, శూరోపాఖ్యానము.

---

## నంద్యుపాఖ్యానము.

మ॥ ఉమపుత్రున్ స్మరజన్మ నగ్ని భవు గంగోద్భూతు నిద్దివ్యునిన్।
సమరుద్దేహశివాత్మజున్ విబుధరాట్సైన్యైకసద్వర్తినిన్।
గొమరుండంచు సనత్కుమారుఁడట ప్రొక్కన్ వేయకే పోయె సం।
యమి యాతండొగి విస్మరించె సకలామ్నాయార్థముల్ వింతగన్॥ ౧॥

ఉ॥ ఇమ్ముగ బమ్మతో ననియె నేటికొ నేఁటికి నెల్ల విద్యలం।
గ్రమ్మనఁ గోలుపోయితిని కారణమే మల సోమకాసురుం।
డమ్మహి వెండియుం బొడమె నా యపరాధము నాది యేదియే।
నుమ్మలికంబొనర్చెద నెకో యన నా చతురాస్యుఁ డిట్లనెన్॥ ౨॥

పంచచామరము॥ అమేయశక్తియుక్తునిన్మ - హామహుం గుహుం గురుం।
గుమారునిం గుమారుఁడంచుఁ - గోరి ప్రొక్కకుక్కునన్।
సమాగతుండవై తివీవు - జ్ఞానమున్నె నీకున।
య్యుమాత్మజుం భజింపుమన్న - యుక్తమంచు నప్పుడే॥ ౩॥

సుగంధి॥ ఆసనత్కుమారుఁడాస్థ - నల్లబిల్వకంబునన్।
వాసిమీఱఁ గాంచె దొల్త - భక్తియుక్తి సక్తిగా।
రీ సరోవరంబు పొంత - శ్రీదు బిల్వనాథు గౌ।
రీ సతీమణిం భజించి - శ్రీఫలాంబ నింబుగన్॥ ౪॥

మ॥ కనె నుల్లాసముతోడ వల్లి మలలో స్కందున్ మహేశాననం।
దనునిం బొందుగ వందనంబొనరిచెం దా సావనోల్లాసత।

ప్పనునాదెన్నకుఁ బ్రోవుమీవడినినీ పుణ్యంబు నాభాగ్యమా।
నననా స్వామిసనత్కుమారవినుకంజాద్రిన్నివుంగొల్వనాన్॥ ౫॥

శిఖరిణి॥ అహంకారంబోనానహివితతిచే - నాశ్రితమునై।
మహావ్యాళాభీలంబయిచదలుఁజిం - పన్నైఅయున।
మ్మహీభృత్తుంగంజాహ్వాయమునుగనె - న్మానియతఁడ।
నహమ్మన్నర్థంబే తెలుపుఁగదకం - జాఖ్యయెపుడున్॥ ౬॥

శా॥ అక్కాండంగవినెక్కొనెంగొలనిలోఁ ద్రావ్యవస్తులన్మన్గెడున్।
గ్రుక్కండక్కడనున్నలింగచయమున్నొంపొందఁ బూజించునిం।
పెక్కంబిల్వదళంబులంబలువిడింబెక్కొఁడులయ్యన్ఫలం।
బొక్కింతేనతఁడొందఁడయ్యెఫలమయ్యోదైవలభ్యంబెకా॥ ౭॥

మందాక్రాంత॥ పొందన్లేకెంపునువగవునే - పొందుటంజేసిరోసెన్।
మందోత్సాహుండయియతఁడట - న్మానెఁజేయందపంబున్।
మందాక్రాతంబనఁగఁదినదా - మానసంబొప్పనష్టా।
నందంబొందన్మభశకునము - ల్నల్వమీఱన్స్ఫురించెన్॥ ౮॥

తే-గీ॥ అంతనాబ్రహ్మపుత్రకుఁడాత్మఁదలఁప। నందికేశ్వరుఁడరుదెంచివందితుఁడయి।
యెఱిఁగి సర్వంబునతనికిహితమొనర్ప। నెంచిహేరంబప్రభువృత్తమిటువఠించె॥ ౯॥

ప్రభు వృత్తము.

మునువిధిగొలిచెను - బొసఁగన్సృజనం - బునెనర్పఁగన - ప్వరముల్గెలువం।
గనుహరుఁడునుహరి - గడలింగపిసం - ఘముగట్టఁగనా - క్రతుభుగ్దనుజుల్।
పనివడిజలనిధి - బలిమిందరువన్ - భజియించిరియ - ప్పరముంగణనా।
ఘునిఁగొలిచినసిరి - దొరయున్విడువం - దొడరుంబెడదల్ - ధ్రువమానరయన్॥౧౦॥

తే-గీ॥ గణమనన్హల్ప్రితతిమఱిగాంచఁబతియ। సంగనచ్ప్రికరంబుగణపతియనఁగ।
నక్షరాత్మకమాబ్రహ్మమపుఁ బ్రణవము। బాణిపతిలక్ష్మిపతియుమపతెయునగును॥

కం॥ పరుఁడుగణపతియయనియెడు। నిరువదియొకరూపులతనివిభవస్ఫ్రింబో।
వెరవునభద్రాస్యుండనుఁ। బరికింపఁగనతనిశుండప్రణవముఖుఁడనున్॥ ౧౨॥

కం॥ శ్రీగణముబిల్వకుటతతి। శ్రీగణపతిబిల్వపతియెనిద్ధంబైనన్।
శ్రీగణపతిఁగొలిచియెమఱి। శ్రీగణపతిజనకుశివుని సేవింపవలెన్॥ ౧౩॥

కం॥ సోముఁడుహంసుండగ్నియు। నాముహితుగణపతిసుఱకయందిరిక్షయమున్।
వామాత్మ్యహితమునిందన్। శ్రీమించిరిపిదపనతనిప్రీతి నెటులనన్॥ ౧౪॥

చంద్ర శాప మోచనము.

---

సీ॥ అత్రిమునీశ్వర నేత్రంబువలననుద్భవించెబ్రహ్మాంశభవుఁడనంగ।
గురునిగురుంజేసెగొనకానితాఁగళానిధియనువిఖ్యాతి నెగడియెందు।

దక్షుఁడశ్విన్యాదితనయలఁదనకీయఁడా రాపతిఖ్యాతిఁదనరఁడాల్చె।
రాజసూయమహాధ్వరంబొనర్చెను నాదిరాజనఁబ్రఖ్యాతిరాజిలెలలి।
రాజవంశంబునకుమూలమైజగముల । నయ్యెద్విజరాజెవండువాఁడమృతకరుఁడు।
గణపతినిఁగాంచినవ్రతకారణమున । మతిచెడఁగరోహిణీతరసతులనెడసె॥ ౧౫॥

సీ॥ అశ్వినిఁజేనంటఁడరయఁడుభరణినిఁగృత్తికఁదలఁపఁడుచిత్తమునను।
మృగశిరఁగవియఁడుప్రీతిఁజూడండార్ద్రవిడిచెఁబునర్వసువీడెఁబుష్య।
నాశ్లేషకేనియునాశ్లేషమొసఁగండుమఖసుఖింపింపఁడుమానెఁబుబ్బ।
నుత్తఁదుత్తరహస్తఁజిత్తస్వాతివిశాఖరంజింపఁడయ్యనూరాధజ్యేష్ఠ।
మూలనేలఁడుఱఁడుపూర్వోత్తరాషాఢ । లనెడఁబానెశ్రవణమునుధనిష్ఠ।
శతభిషక్కుభాద్రజతనెన్నఁడారేవ । తినిఁదొఱంగెరోహిణినెనసిశశి॥ ౧౬॥

శా॥ అంతందక్షుఁడురోహిణీతరలచేనాలించిలాలించిము।
న్నెంతేనీతినుపన్యసించియునుమున్నెట్లట్లయుండన్నిశా।
కాంతున్వెండియుఁగోపగించియనుజక్కంగామిశాపంబిడెం।
బంతంబేయఱువుందెవుల్గలిగెడుంబద్మారినీకంచొగిన్॥ ౧౭॥

ఉ॥ అంతనిశాకరుండతనియంఘ్రియుగంబునవ్రాలినైఁవుశా।
పాంతమనుగ్రహింపుమనియక్కఱమిక్కిలివేఁడనీవునీ।
కాంతలనందఱన్సమముగందనియించినశాపముక్తియా।
వంతఁదొఱంగుమంచనిపెఁబన్నగనల్లునిమామప్రేముడిన్॥ ౧౮॥

చ॥ పదపడిశాపఘతిఁదనభామినులందఱఁదుల్యభావమిం।
పొదవఁగఁగూడఁజొఁగెశశియొక్కదినంబునకొక్కరిక్కఁగన్।
మదిమొకయించుకేనియనుమానదురోహిణియందువానికిన్।
వదలదురాజయక్ష్మయనువానినిడయ్యెఁగఁజేయునెయ్యనన్॥ ౧౯॥

కం॥ నలుగుడువడివడిసడలఁగ । నెలయఱువుందెవులుచేతనెంజెలివడుచుం।
దలఁచెనుదనచెడుఁజెయువుఱఁ । దలఁచుఁగదాచెనఁటివనటఁదనదుండగముల్॥

ఆ-వె॥ అంతఁగొంతవడికినతఁడుస్మరించెము । న్నమరులకునుదనకునాహవంబు।
పొసఁగనసురగురునిపొందుఘటించిరె । ల్పొసఁగినట్టినల్వయొక్కపట్టి ౨౧॥

కం॥ వచ్చిననురమునిఁగనుఁగొని । చెచ్చెరనెదురేగిపూజనేసివినీతిం।
దెచ్చియుచితాసనంబిడి । యచ్చుగనార్తిఁదెలుపనతఁడిట్లనియెన్॥ ౨౨॥

కరిబృంహిత వృత్తము.

కామమురిగనుగ్రోధమదిస్పృణి - గాఁగఁగరములఁగ్రాలఁగా।
నాముగురియఁగఁజెక్కిళులనొక - హస్తమునబలుమచ్చరం।
బైమెఱయఁబెఱచేతఁగుడుముగ - నైతనరఁగనుమోహము।
ద్దామకృపణతకొక్కగనుజను - దైవతముగణనాథుఁడా॥ ౨౩॥

కం॥ ఏనుఁగుతలయునుగుఱుచగు । మానిసిమేన్పెద్దబొజ్జమఱనొకపడుముం।
గైనిడుకొనితొండంబునఁ । బూనెడునక్కొక్కరాతుఁబోడఁగనినఁగన్॥ ౨౪॥

మ॥ కుపితుండైయతఁడిచ్చెశాపముననీకుంబోయెనొక్కింతయ।
ట్లిపుడీరూపుననిన్ను నేచునకటాఁయీవింతనేనాతనిన్।
గృపవుట్టంగనుగొల్వుబిల్వవనిలోఁగ్రీడించుచున్నాఁడువాఁ।
నిపితన్మాతభజింపుమంతటనుబూనిక్కన్మెలగున్నికన్॥ ౨౫॥

కం॥ వినివిధితనయునినారదు । వినయంబునమ్రొక్కివిధుఁడువీడ్కొల్పితపం।
బొనరించెబిల్వవిపినం । బునశ్రీగణనాథునగ్రపూజ్యుంబొగడెన్॥ ౨౬॥

గణనాథ వృత్తము.

దక్కితివిమూలా - ధారపరమాత్మా । నిక్కముగనీవే - నేతవరయంగాఁ।
జక్కఁగనునాకు - న్నంతసమునీవే । మ్రొక్కెదనునీకు - న్ముందుగణనాథా॥ ౨౭॥

కం॥ పూనుటనాలుగుచేతుల । జానుగఁబాశాంకుశరదసన్మోదకముల్।
దానమొనర్పన్భక్తుల । కూనితివైదవకయియనియును నేనెంతున్॥ ౨౮॥

ఆ-వె॥ తప్పులెన్నకేలుదానుండనీవాఁడ । మొట్టికాయలొప్పమ్రొక్కువాఁడ।
దానమాన్యవరదదాసరిపత్పదం । డంబుతోడసరియనందగుఁగద॥ ౨౯॥

కం॥ అనివినుతించినగణపతి । దనకన్నగనెంచెమాశిధరియించెనుధాం।
శునినక్షయుఁగాఁగనుద । జ్జననియుజనకుండునుతనిజప్రియమెనయన్॥ 3౦॥

సీ॥ ఆదులునలువురికలరంగముద్దిడుఁజతురాననుండనఁజతురతదగఁ।
జననుకారాదులకునుమూపురకునఖక్షతములనిడుఁద్రివిక్రముఁడనఁదమి।
మాదులౌముగ్గురికాలింగనమొసంగుబిల్వేశుఁడనఁగనుబింకమడర।
నింకహలాదులనెల్లఁబెల్లలరించువ్యంజనంబులస్వరమడుకునట్లు।
తారకావళితారకావళిగనెప్ప । రాజురాజిల్లెనాయకరత్నమగుచు।
వారుస్వాధీనభర్తృకలైరతండు । దక్షుఁడుండయ్యెనెసఁగెమేల్దంపతులకు॥ 3౧॥

కం॥ ఆవిషధిజుఁడమృతమయుం । డైవెలనెనుసోముఁడనఁగనాప్తోచుండై।
శ్రీవనమునశ్రీగణపతి । సేవించిననిష్టసిద్ధిఁజెందుటయరుదే॥ 3౨॥

చంద్రశ్రీవృత్తము.

క్షపాధీశుండయ్యెన్క్షయయుతుఁడు-గాఁగాంచినవ్యన్।
ద్విపాస్యుందచ్ఛాపంబునఁదపము - బిల్వాటవింజే।
సిపుణ్యుండయ్యెంబెల్లుగనువిల - సిల్లెందగంద।
త్కృపంజంద్రశ్రీయీకథయిడుస - త్యభర్తృయుక్తిన్॥ 33॥

సూర్య ప్రతాప శమనము.

మ॥ ఉరుతాపంబునకోర్వలేకయినునాలొప్పంగనిర్మించియొ।
క్కరితన్ఛాయనుఛాయనాఁబరఁగుక్రొల్గంటిందగంబల్కెనో।

గరితానావలెనుండునాపతికడంగాపాడుమీబిడ్డల
న్మరలన్నేనరుదెంచుదాఁకనిదియుండన్మేలుగోప్యంబుగాన్॥ ౩౪॥

చ॥ అనుచునుసంజ్ఞభర్తకినుమంతయుఁదెల్పకపుట్టినింటికిం
బనివినితండ్రినింగనియెభవ్యుఁడతండనెఁగూఁతుఁజూచినా
తనయరొరమ్మయమ్మయటఁద్వత్పతికిన్సుఖమేశిశూత్కరం
బునకునునీకునేమమెసుపుణ్యయియేటికినొంటివచ్చితే॥ ౩౫॥

సీ॥ అనుకూలుఁడైయుండునమ్మనీనాయకుఁడటుగాకదక్షిణుఁడానెశరుఁడు
ధృష్టుఁడైయుండునేతేజోఽధికుండాటసైఁపలేవాకొయైనశాంతమూర్తి
సరకుగొనకయుండెజానఖండితానాయికవయితద్ధనత్వమునకు
భంగంబుగారసభంగంబునేసితేయాతఁడేనిన్నొల్లఁడయ్యెనెకొ
యెక్కరణినైననతనికినెఱుకపడక। యుండవచ్చితివనియెంతుగండఁడతఁడు
తెలిసెనేనినిన్నెంటిగఁదెఱఁగఱఁగఁగ। నంపునేవచ్చుటెఱిఁగినహానిగాదె॥ ౩౬॥

మానిని॥ భర్తయెదైవముభార్యకునారయ - వానియనుజ్ఞనెవామకెటన్
వర్తిలుటొప్పనువాఁడెటులున్నను - వానినిపీడుటభద్రముగా
దార్తియవుంజెడదాయిలువాసియ - హాయిలువాసిగయాళిగరా
ధూర్తవటంచునుదోఁచిననుంబతి - ద్రోచునెయేచునెదూషితగాన్॥ ౩౭॥

ఆ-వె॥ పుట్టినింటఁబాసెమునుగొంటకంటెమే। లత్తవారియింటనంబలిగొను
టుత్తమాంగనలకునత్తింటనెత్తిడి। మేలుపుట్టినింటమించుకంటె॥ ౩౮॥

తే-గీ॥ ఎట్టిఁడైనసుభర్తతోనెనయుటొప్పుఁ। దదితరులుమేలువారైనఁగదియఁదగదు
తండ్రినేనన్ననేఁదనతనయనేని। సాధ్వివృత్తంబుగరముదుష్కరమునూవె॥ ౩౯॥

కం॥ అత్తింటివారుగోడలిఁ। జెత్తగనుదలంతురమ్మచెనసినసడిచే
నత్తనికూఁతుందలఁచుచు। మొత్తుకొనెదరమ్మపుత్రిపుట్టమిమేలౌ॥ ౪౦॥

తే-గీ॥ పిష్టపేషణమేటికిఁబ్రియునిఁబాసి। రాకకుంగారణంబేమి రామచెపుమ
యనఁగనాయనయెఱుఁగవెయాయినుగుణ। గణమునెంతనివచియింతుఁగాంతువంత॥

సీ॥ తేఱిచూడఁగరాదుధీరతనెక్కింపగనుఁగొన్నఁగన్నులుపనికిరావు
ఎంతదవ్వననైనఁగొంతేనినిల్వశక్యముగాదునిల్చినఁగాలుమేను
పంతంబుననుజేర భస్మంబుగావించునెంతనుతించిననెందునోరె
చాఁగిలఁబడశ్రమజలమోడునొడికల్గట్టివట్టైదుఁబల్కుఁడెట్టులైనఁ
బట్టెనావేయిచేతులఁబట్టినలుపుఁ। బీల్చిపిప్పిగఁజేసెడుబీరమారఁ
దఱలకున్నసహస్రపాదములఁదన్ను। నెట్టులోర్తునునీయల్లుఁడిట్టులుండు॥ ౪౧॥

సీ॥ శతకోటిశతకోటిజాజ్వల్యమానుఁడాఘోరసహస్రారకోటిమీటుఁ
ద్ర్యక్షశూలాయుతలక్షలనిరసించుబ్రహ్మాస్త్రఖర్వగర్వమునడంచు
మండుమెండుగఁగాండచండజ్వలజ్జ్వాలనోజ్జ్వలతైక్ష్ణ్యంబునోకిలించు
ఫాలాక్షఫాలాక్షిపావకజ్వాలలఁగ్రక్కునీజామాతఖరకరుఁడఁటు

యెట్లుచూడవచ్చునెట్లుచేరఁగవచ్చు । నెట్లుపొందవచ్చునెట్లుమనఁగ।
వచ్చునాకుఁజాకబ్రదుకుటనరయంగ । వింతయింతకంటె వేఱుగలదె॥ ౪౩॥

తే-గీ॥ విశ్వకర్మాత్మభవనయి వెలయుటనొకొ । యల్లమార్తాండునకుభార్యనగుటనొక్కొ।
మరణవేదననెల్లప్డుఁబొరయఁదగిన । దాననగుటనొబ్రదికియున్నాననుచును॥ ౪౪॥

కం॥ కరుణంబుగఁగురరివలెం । గరమేడ్చెదుకూఁతుఁజూచికనికరమొదవం।
బొరివిశ్వకర్మతనకే । వెరవునుమదిఁదోఁపకుండివినెవినుపలుకున్॥ ౪౫॥

చ॥ గణపతినేకదంతునినిఘస్మరుఁగాంచిహసించెఁబూషుఁడా।
ఘనదురితంబునన్రదనికాయముపోయెనుదక్షుయజ్ఞినా।
శనమునవానికిన్భగునిచక్కనికన్నులుమిన్నులయ్యెన।
య్యనుతనువాతశాతమువహించుతనంతనుశాంతతేజమున్॥ ౪౬॥

సంజ్ఞావృత్తము.

అనివినియతఁడతి - హర్షముతోఁగూఁ । తునుగనుఁగొనియిదె - తోడనెవత్తున్।
జనుమిరవునకనె - సంజ్ఞయుఛాయం । గనిమయిమఱువనఁ - గంగ్రహియించెన్॥

ఉ॥ తిన్నఁగవిశ్వకర్మయరుదెంచితగంబొడఁగాంచియర్కునిం।
బన్నగనిట్లుపల్కెభగవంతుఁడవీవుజగత్ప్రభుండవి।
ట్లున్ననుజన్నెదుస్సహమయోభవదీయముతేజమించుకే।
చెన్నగువీటిసున్నమనశ్రీకదయాకరలోకబాంధవా॥ ౪౮॥

ఉ॥ నావుడునేయుపాయముననాజిగివేఁడిమివీడిచల్లనా।
నావిధమొప్పఁజెప్పుమనియల్లుఁడువేఁడినమామయిట్లనెన్।
నీవవుదేనియున్మణిగనేర్పుననల్లనసానఁబెట్టెదన్।
నావినిమైకొనెన్రవిజనప్రియకృత్తనుశౌరసజ్జనుల్॥ ౪౯॥

శా॥ శాకద్వీపమునందుఁద్వష్టయొగిభాస్వద్రత్నముంబూనితా।
నాకాశంబనుశాలవత్సరమయంబౌశాణచక్రంబునన్।
జోకన్రాపిడిఁబెట్టెరాలెఁజిద్రుపల్ జ్యోతిర్మయంబుల్లస।
ల్లోకంబుల్పదునైదుషోడశకళాలోక్యుండినుండైతగన్॥ ౫౦॥

కం॥ ఆదిత్యుండునుదనపదు । నైదుకళలగమిసనఁబదునాఱవభాగం।
బూఁదిమిగిలెనిజరుచినిర । జాదివిసర్గమననిరసియవునొఱయనఁగన్॥ ౫౧॥

మ॥ శాణవిఘృష్టరత్నముగఁజక్కఁగజక్కవనెయ్యుఁడయ్యునా।
శాణవిఘృష్టరత్నములసత్ప్రభఁగాంచఁగనైతినంచుసం।
క్షీణధనుండుదాతయనఁజెందెనుగుందనుద్వష్టనిష్ఠనా।
స్థాణునిజ్యేష్ఠపుత్రునిభృశంబుగశ్రీవనిఁగొల్వఁబొమ్మనెన్॥ ౫౨॥

కం॥ అంతటనుదివాకరుఁడట । దంతివదనుబిల్వనాథతనయాగ్రణిన।
త్యంతసుభక్తిభజించెను । గాంతివిశేషంబుఁగనియెఁగడునుతియించెన్॥ ౫౩॥

సుకాంతి వృత్తము॥ గణేశనా । ప్రణామమును । గనంగదే । మణిస్తుతా॥ ౫౪॥

ప్రభాతవృత్తము.

అనివినుతించిన-నందిమోదమెంతే । ఘనుఁడిభవక్త్రుఁడు-గాంతిమంతుఁగాఁగా।
నినునెనరించిగ్ర-హించెదటం చెణాశం । గనుశివులట్టులె-కాంచిరశ్లైలోకుల్॥ ౫౫॥

భాస్కరవిలసిత వృత్తము.

కాంచెగణపతినలక్ష్యముగాఁగం - గావుననయనుఁడరదుఁడునయ్యెన్।
గాంచెనురవిదితకాయతవీత - ఖ్యాతరుచియునయికనితెలివిన్నే।
వించెనుగనియెనువిశ్రుతశోభ - న్విశ్వవినుతుఁడయివెలసెనుసంజ్ఞా।
పంచశరుఁడనఁగభాసిలెఁగానన్ - భాస్కరవిలసితమిదికథయొప్పన్॥ ౫౬॥

దోదక వృత్తము.

ఈకథవిన్నను - నెంతయుభక్తి । నైకులకెల్లను - నొరథసిద్ధుల్।
చేకుఱుశ్రీవని - సిద్ధిగణేశున్ । శ్రీకరుఁగొల్చిన - శ్రీలభియించున్॥ ౫౭॥

అగ్నిపావనత్వాపాదనము.

చ॥ మదినిఁదలంపకగ్నిగడుమాన్యనిఁగాఁగవినాయకుంజగ।
ద్విదితునివీరభద్రకరవిశ్రుతఖడ్గదితాత్మజిహ్వుఁడై।
పదమఱివెండియుంబడనిభావజబాణవిదీర్ణభావుఁడై।
కదినెఁబురాణసంయములకాంతలఁగూడఁగవేఁడెవేడుకన్॥ ౫౮॥

సీ॥ చూచుసహస్రాక్షశోభనుగనుమనస్సంగంబుశతధృతిసరణిఁజేయు।
సంకల్పమునుజల్పసంకల్పజాభిఖ్యయస్వప్నతస్వభావమైయెసఁగను।
దనకృశానుపదంబుననెతనకార్శ్యంబుప్రకటంబుగానెందుఁబడయఁడురస।
మన్యులుగంద్రనియణఁగకకీలాకరావళినతివలనంటఁదివురుఁ।
గుమిలిచిటపాటలాడుచుఁగోమలులను । గలఁచెసన్నగిలెనుమఱిగనియెనంత।
మట్లుదశదశలనుబొందుటరయదశక । శ్లాఘ్యుఁడతఁడగుటనెయనియపుడుతోఁచె॥

కం॥ స్వాహాదేవితదాశయ । మూహించెన్నిశ్చయించెనుల్లమునందా।
మోహాముపాయఁగనాయన । కీహానుమానుపఁదలంచియెంచెంబుద్ధిన్॥ ౬౦॥

ఆ-వె॥ ప్రోఁదిమీఱునయ్యరుంధతిదక్కంగ । జిక్కియున్నఋషులచెల్వలాఱు।
గురిపలెంజెలంగెఁగొని కామరూపముల్ । స్వాహయాటవెలఁదిచందమొంది॥ ౬౧॥

ఆ-వె॥ అగ్నిరుద్రుఁడనుచునామ్నాయమనుటనో । యంగిరుండునగ్నియగుటనెకొ।
యతనిభార్యశివగనగ్నిజాయయెయాయెఁ । దొలుతవచ్చెమెచ్చిచెలువుఁడలర॥

సీ॥ వీక్షించెవనమాలవేయునాలక్ష్మినానాత్మనాయకునినిహారిగనెంచి।
పలికెనుముత్తెములాలుకంగవాణినాఁబెనిమిటిఁజతురాననునిఁగఁదలఁచి।
కదిసెనుమయిమయిఁగలయనయ్యార్యనాభావించిపతిభూతిభాసితునిఁగ।
భర్తస్వరూపంబుపరఁగుటఁద్రేతగావేదికాకృతిగనువెలసెఁదెలిసి

కేలు మోడ్చెను మన మిట్లులీలఁ గూడు । దమని సూచించు నామునిదయితనిన్ను।
వలచివచ్చితి నలరింపు భావజరతి । ననుచుఁ గైదండ గళమునఁ దనరఁ గనిడె॥ ౬౩॥

కం॥ మేమాఱు పురమునీదౌ । కామము నెఱిఁగితిమి కామె కామినులమునిన్।
గామించితి మేలుముమము । సోమహితావత్తు మొక్కరొక్కరు గాఁగన్॥ ౬౪॥

కం॥ నేమును వచ్చితినంగిరు । చామను శివయనెదు దానశంకరుఁడవుగ।
మ్మామున్ను నీవెకోరితి । గాహానమి దేలయల మెకామిని రానాన్॥ ౬౫॥

ఉ॥ కాముకుఁడౌటనాతఁడెఱుఁగండు నిజాంగనయంచు మానిరా।
గ్రామ లెయంచు నెంచు చవిరామము గారమియించె రేపవల్।
కామిని గౌఁగిలించుకొనఁ గాంచు నెధర్మ మదర్మ మంచు నే।
కామనుఁడేని శూలి సతి కౌఁగిలిఁ జెందిద కాన్యునెలఁడే॥ ౬౬॥

కం॥ ఈలీల ననుఖాంభోనిధి । నోలాడఁగఁ గాలకూటమోయనఁ గలిగెం।
గీలిని నరుంధతీతర । కౌలలనలుగూడిరి మునియాండ్రను సడియన్॥ ౬౭॥

పంచచామరము॥ ఎఱింగి యంగిరుండు సర్వ - మెంతయేని నోర్వకిం।
పఱింగ సర్వభక్షకుండ - వయ్యెదంచు నగ్నికో।
ప్పఱింగ శాపమిచ్చెనంత - నాండ్రఁబాసి రాఋషుల్।
దొఱింగఁడావసిష్ఠుఁడాలి - దూఱువొందమిందగన్॥ ౬౮॥

ఆ-వె॥ అగ్ని దేవుఁడఁటు మహర్షి భార్యలఁగోరి । సర్వభక్షకుఁడుగ శాపమొందె।
నెవఁడులాఁతి నాఁతి నెనయన పేక్షించి । చెడక యుండు రెంటసిద్ధముగను॥ ౬౯॥

శా॥ ఆబింబాధరి యగ్ని భార్య విభుర త్యాపేక్షవాచంయమి।
స్త్రీబింబాకృతులన్వహించి పరిసంప్రీతాత్ము నింజేసెఁగా।
కాబేలల్మునిపత్ను లందిరిసడింబ్రాణేశ సంత్యక్తలై।
స్త్రీబుద్ధిఃప్రళయంకరీయనుట సిద్ధించెం గదా యీయెడన్॥ ౭౦॥

తే-గీ॥ ఆయరుంధతి సాధ్వీత్వమసమముగద । కామరూపిణ యాస్వాహ యామెరూపుఁ।
గాంచ లేదయ్యె నట్లుండఁగా దె పెండ్లి । దంపతులుగాంతు రయ్యరుంధతి వసిష్ఠు॥ ౭౧॥

ఆ-వె॥ నిందఁబొంది శాపమొంది వందికృశానుఁ । డంగిరను నెశరణనంగ నాతఁ।
డనిమెనలవరించుకొనిన యఘముఁగల । మనుభవింపవలయు వినుముమును వు॥ ౭౨॥

ఆ-వె॥ తల్లియోగవహ్ని దగ్ధమైనను గాన । కెప్పువగను మెక్కు కొక్కురౌతుఁ।
దిండిపోతఁటంచుఁ దెగడితి పందుచే । సర్వభక్షకతయు సడియుఁగలిగె॥ ౭౩॥

ఆ-వె॥ బిల్వవనమునందు విఘ్నేశుఁడున్నాఁడు । వానిగొలువు హాని కొను హాని।
శుభమునకును శుభము చొప్పడుఁ బొమ్మన్న । నంటరాని వేలుపచటికరిగి॥ ౭౪॥

కం॥ తనదిశఁదన నామంబునఁ । దనరించె వసించె వహ్నిద తీర్థమునన్।
గనెఁ గచ్ఛపతనుగచ్ఛం । బనఁబడెన దెక నెముశివజునతఁడు భజించెన్॥ ౭౫॥

సుగంధి॥ సర్వభక్షకుండవయ్యు - సర్వపావనుండవై।
యుర్వినిందివిన్వెలింగె - దున్నతింజగన్నుతిన్।
బర్వదింకనిందయంచుఁ - బావకున్స్వఫాలదృ।
క్పర్వధూర్వహుంబొనర్చె - వారణాస్యుఁడీశుఁడున్॥ ౭౭॥

తే-గీ॥ ఎట్లుగణపతిఁగొలువకయీశుఁగొల్చు। టట్లునిష్ఫలమానుజిండార్చలేమి।
వానిమహిమను జెప్పుదుఁగొంతెనివినుము। గాంగజలకణమనఁగనఘంబునణఁచు॥

తే-గీ॥ సోమసూత్రాభిముఖముగసాబగుమీఱు। జహ్నుమునియనఁగనుశివార్చననిరతుఁడు।
శైవనిర్మాల్యభాజనుఁడైవఱలెడు। వాఁడెశివసేవఫలమిడఁబ్రభువుసూవె॥ ౭౮॥

కం॥ నావుడుసనత్కుమారుం। డావిఘ్నేశ్వరునిఁగొలిచియాభృంగీశున్।
శ్రీవిల్వేశ్వరుఁజెందున్। సేవించెనుశ్రీనిజ్ఞానసిద్ధింగాంచెన్॥ ౭౯॥

మత్తేభ వృత్తము.

శ్రీకారకాననప - రిష్కారమానవఁగ - శ్రీమించుబిల్వపతినిన్।
మాకీడ్యమైనతను - మధ్యంద్విపాననుఁగు - మారున్వృషాదులనిటున్।
శ్రీకాముఁడానరుఁడు - సేవించిసర్వసుఖ - సిద్ధింగనున్నిజముగా।
నాకైవడింజదువ - నాలింపనందిదియు - పాఖ్యానమిష్టదమిదా॥ ౮౦॥

ఇది నంద్యుపాఖ్యానము.

## శంకరోపాఖ్యానము.

సీ॥ అఇఉణ్మనుజ్ఞేయుఁడగుటఁదెల్పనెయనదివ్యమాకేరలదేశమందు!
వృషయానమాత్మీయవిభవంబుఁదెల్పనావిశ్వనుతంబగువృషధరమునఁ।
బూర్ణచంద్రనుశోభఁబొనరుటఁదెలుపునాభవనేడ్యఁబూర్ణాఖ్యపుణ్యనదినిఁ।
గాలకంఠతఁదెల్పుగతిఁగాలటియనంగనలరారునొకయగ్రహారమందు।
శివగురుండనుభూసురుఁజేసెసార్థ। కాఖ్యనిఁగఁదానుబుట్టుటనతనికిఁదన।
శివతలోకంబులందుఁబ్రసిద్ధిఁజెంద। సందియంబేలయతఁడెకాశంకరుండు॥ ౧॥

చ॥ కలియననష్టరాధ్వమునఁగాంచఁగనొంక్రుతియాటవిక్రమా।
ర్కులసితమాశకాననటుగాఁగఁజతుర్దశవర్షమైనయీ।
శ్వరపదవత్సరంబునవిశాఖయురాకయుఁగూడుమాసమొ।
ప్పలరఁగశుద్ధపంచమినిజాఖ్యగశంకరుఁడుద్భవిల్లెఁగా॥ ౨॥

కం॥ పంచాస్యుఁడుదానగుటనె। యంచితముగలగ్నమొప్పనత్యుచ్చగతిన్।
గాంచన్రవికుజగురుశను। లెంచఁగలిగెమహితుఁడతఁడుహితసాంఖ్యుఁడనన్॥ 3॥

సీ॥ ద్విజరాజునాదాకృతిగమౌళిమఱుఁగిడిద్విజరాజమౌళినాఁదేజరిల్లె।
విష్ణుపదిన్వక్త్రవివరంబునందాఁచినారాయిణస్మృతినల్పుకొల్పె।
వ్యోమకేశతనేమొబోడియైనిజమగువ్యోమకేశపదార్థమొనరఁదెల్పె।
మూడవకన్నన్నమొగిజ్ఞానమేయనితనదుసర్వజ్ఞతఁదనరఁదెలిపె।
ముమ్మొనలవాలొకటియాటముదమునసొక। దండమానెనుభ్రమింగెనుద్వైతమతము।
నభయమద్వైతమమృతంబునలరనొసఁగె।శంకరాచార్యుఁడేకాఁడెశంకరుండు॥ ౪॥

కం॥ ప్రథమానమహిముఁడాతఁడు । ప్రథమాబ్దముననె స్వభాష భాషించెఁదగం।
ప్రథితముగ వ్రాసె రెంటం । బుధులొప్పఁగ బాసలెల్ల మూడవయేఁటన్॥ ౫॥

కం॥ వినని కనని గ్రంథములం । బనివడి చదువంగ వ్రాయవలఁతిగ నయ్యెన్।
జనులందఱు నరుదందం । దనయీడగు బాలకులకుఁ దా గురుఁడయ్యెన్॥ ౬॥

కం॥ శివములన వర్ణములుద । చ్చివుఁడే శంకరుఁడగుచును శివనుతిఁ జేసెన్।
దవనక్షరమాలిక చే । శివనుతి యది చదువఁగా రెసిద్ధులు బాలుర్॥ ౭॥

కం॥ శివగురుఁడు తృతీయాబ్దము । నవరమతిం బుత్రకున కొనరఁ జౌలంబుం।
దవఁ జేసి భావిసన్యా । సవిధిం గాంచెనెయనఁ జనె స్వర్గంబునకున్॥ ౮॥

కం॥ పంచమవత్సరమున వృష । మంచితముగ నయ్యె నుపనయము శంముఖతన్।
గాంచుట నోయన నతనికిఁ । గొంచక ఖిలవిద్యలతనిఁ గొలిచెన తులనన్॥ ౯॥

కం॥ శంకరచరితముఁ జదివిన । నంకిలి లేకెల్ల విద్యలబ్బు వటులకున్।
బొంకము గా బొంకము గా । శంకరకృతులన్న నెన్న శంకరములు గా॥ ౧౦॥

తే-గీ॥ వటువు గానుండి యతఁడొండు భవనమునకుఁ । జనియె భిక్షార్థియై యిల్లమనికి గరిత।
పేదరాలన శక్తను బికిరమిడఁగ । ననుచు వగవఁగఁ గనికరమడర నతఁడు॥ ౧౧॥

తే-గీ॥ ఉన్నదే దేని నిడుమన్న నువిదయొక్క । నెల్లికాయయొసంగె దానినగు నమృత।
మనుచుఁ గైకొని శ్రీమాతనలరఁ బొగడె । సంపదలనీయవమ్మ యీ సాధ్వికనుచు॥ ౧౨॥

శా॥ ప్రత్యక్షంబయి లక్ష్మి మ్రొక్కియనె నీ వామాక్షీ మున్నెన్నఁడున్।
ధృత్యుత్సాహములొప్పఁ గాంచనిది దాతృత్వంబు నెట్లిత్తునా।
ప్రత్యూరీకృతుఁడీవయస్థ్స ఫలముం భక్తిన్ సమర్పించెనా।
కత్యంతోత్సవమొందనాఁ గదయనన్ హర్షాతిరేకంబునన్॥ ౧౩॥

కం॥ బంగారు సిరికకాయల । మంగళదేవత స్వదృష్టిమాత్రన కురిరియుం।
చెంగీమునిండ బ్రాహ్మణి । పొంగఁగ నపుడాకు చేలు ప్రోయాలివలెన్॥ ౧౪॥

కం॥ ఒక నెల్లికాయఁ గైకొని । ప్రకటముగ సువర్ణతిష్యఫలవర్షంబ।
త్యకుటిలమతిపాలు తకిడె । సకలార్థములిడఁడె కొల్వ శంకరుఁడుదయన్॥ ౧౫॥

కం॥ తనతల్లి స్నానమునకుం । జనియేటికి నెండ దాఁకి సదనమునకు రా।
ననువేది నేలవాలం । గనామెనిలు నేర్చెనదినిఁ గడుకొని పొగడెన్॥ ౧౬॥

కం॥ ఆవాఁకయింతి యైరే । పేవచ్చెదనీవసతికి నెంతయుఁ జెంతన్।
సేవింతు నిన్ను హాలపద । నావినిరవుడందునున్న నారులు నరులున్॥ ౧౭॥

కం॥ మఱునాఁటి రేపకడనం । దఱుగనియరుదంది రేఱు దాపునఁ బాఱం।
గఱకంఠుఁడు శంకరుఁడని । యెఱిఁగి రిశరణార్థియనఁగ నినుఁడుదయించెన్॥ ౧౮॥

కం॥ అయ్యుజ్జడాత్మికనీచగ । యయ్యాపగ యతనికవితకలరి సరసనాఁ।
జయ్యన సేవించె సరసు । లయ్యార్యేశ్వరుని కృతులనగుటరుదె నతుల్॥ ౧౯॥

కం॥ అసదృశకవిత్వశక్తియు । నసదృశపాండిత్యశక్తియసదృశమహా।
విస్ఫురత్ప్రభావశక్తియు । నసముఁడయిన శంకరుని కెయగుననఁగ జనుల్॥ ౨౦॥

కం॥ విని కేరళేంద్రుఁడతనిని । గనుఁగొనఁగొనిరమ్మటంచుఁ గడువడిఁ బంచెన్।
దనమంత్రి నతఁడు వేఁడెను । జనపతిఁ గనరానని యెను శంకరుఁ డంతన్॥ ౨౧॥

కం॥ ఈవృత్తాంతము విని రా । జే వచ్చి నమస్కరించి స్వీయకృతుల్మూ।
డావిడిఁ జదివెను దన్నుతిఁ । దావడసెను శంకరకృపఁ దనయులఁ గాంచెన్॥ ౨౨॥

కం॥ తనరచియించిన కృతుల । న్వినిపించి ప్రజాధ్యుఁడయ్యెఁ బృథ్వీపతి ద।
గ్ధనకృతులఁ జదివి కొల్చిన । జనులకు సంతానమేల సమకొనకుండున్॥ ౨౩॥

కం॥ ఎనిమిదవయేఁటనాయే । టను స్నానముఁ జేయుచ తఁడెడమ కాల్పట్టం।
గనుదనది మొసలి యమ్మా । ననుయతిఁ గమ్మనుము విడువు నాకగు ననియెన్॥ ౨౪॥

కం॥ కానిమ్మని కమ్మారితి । గానమ్మయు సమ్మతింపఁ గర్మందిగనై।
మానసమునఁ బోనెంచఁగ । శ్రీనాథుఁడు కృష్ణుఁడతనిఁ జీరి యిటులనెన్॥ ౨౫॥

కం॥ నీతల్లి మేలు కైకా । దే తెచ్చితి చెంత కేఱుతీరస్థమునా।
దాతిరుకోవెల తత్సం । పాతితమగు నన్నుఁ బ్రోవ వానానతఁడున్॥ ౨౬॥

కం॥ మునుబమ్మను వెన్నుని మూఁ । పున నెత్తిన బల్లిదుఁడనముదమున నవలీ।
లనుగృష్ణమూర్తిఁ దానె । త్తెను వేఱెడ నెలకొలిపెను దివ్యులు మెచ్చన్॥ ౨౭॥

కం॥ కంసారభీతిరహితుఁగఁ । గంసారి నెయుద్ధరించెత్మోధరునతఁడీ।
సంసారభయులభక్తులఁ । గంసారులఁ జేయలేఁడె గతదరులనుగాన్॥ ౨౮॥

కం॥ ప్రణవాంకద్యోతకమై । యొనరిన నవమాబ్దమందు నొంకృతినే పూ।
ననుదలఁచి యాతఁడుత్తర । మునకరిగెను గురువరింప మోదముతోడన్॥ ౨౯॥

కం॥ రేవానదిదరి నొకదరి । గోవిందయతీంద్రువలనఁ గొనె సన్యాసం।
బావారాణసి నొకనతు । భూవిబుధ సనందనునిఁ గఁ బొనరిచె యతిగన్॥ ౩౦॥

కం॥ కలియుగమున సన్యాసము । నెలకొలిపెను శంకరుండు నిజముగఁ బిదపం।
గలిగిన యతిగా వలదే । యలరఁ గృతజ్ఞుండు తదనుయాయిగ నెందున్॥ ౩౧॥

కం॥ గోవిందయతీంద్రునతఁడు । సేవింపం దన్నుసరకు సేయండని యో।
గోవిందాగ్రజుఁడింద్రుం । డావడిఁ గురియించె వాననైదు దివసముల్॥ ౩౨॥

కం॥ జడిపెట్టున సోమోద్భవ । గడుఁ బొంగెను దత్ప్రవాహ కాండరయహతిన్।
బడె గ్రామకులిండ్లు మనుజుల । పడుపాట్లెన్నంగఁ దరమె బ్రహ్మకునైనన్॥ ౩౩॥

కం॥ అపుడా గోవిందుఁడు యో । గపరుఁడయి సమాధినిద్రఁ గనఁగ నగస్త్యుం।
డిపుడీతఁడనఁగ శంకరుఁ । డపరూపముఁ జేసె వఱదనంతయుఁ గరకన్॥ ౩౪॥

కం॥ నర్మద వెల్లువ నెల్లం । గర్మందియ తండడంచెఁ గడిమిఁ గరకచేన్।
దుర్మదవిమతోక్తిఝరీ । నిర్మథన మొనర్పలేఁడె నిజభక్తులచేన్॥ ౩౫॥

కం॥ వసియించె విశ్వనాథుని । వసతిం గాశీపురిన్నివాసము గాఁగన్ ।
లసితోత్సవమూర్తియనన్ । రసికులలర శంకరయతిరాట్టొకనాఁటన్ ॥ ౩౬॥

కం॥ అందా శంకరయతిపతి । మందాకినిఁ దీర్థమాడ మధ్యాహ్నమునం ।
దుందనశిష్యులతోఁ బో । వం దారిం దారసిల్లె శ్వచతుష్టయుఁడై ॥ ౩౭॥

కం॥ పంచముఁ డొకరుఁడు శంకరుఁ । గాంచెఁ దొలఁగి పొమ్మనియెను గర్మందీంద్రుం ।
డించుకయును గొంచక వాఁ । డెంచఁగ నద్వైతివాదు వేయీవనినన్ ॥ ౩౮॥

కం॥ మనమున సర్వము బ్రహ్మం । బని తలఁచెద భేదభావ మందని జముగం ।
గనియెద ద్విజునెడఁ జండా । లుని యెడ సమబుద్ధిజ్ఞానులు గురులు నాకున్ ॥ ౩౯॥

కం॥ అని సాంజలియయి శంకర । మునియా పంచమునిఁ బంచమునిఁ గాఁగ నెనా ।
త్మను జంద్రమౌళి శివుఁ గాఁ । గను నాలుగు జాగిలములఁ గని యెశ్రుతులఁ గాన్ ॥ ౪౦॥

కం॥ కనుఁగొని భయమును భక్తియు । వినయంబును ముప్పిరిఁగొన వినుతించి మఱి ।
ట్లనెఁ దనువున నీదాసుఁడఁ । గన నీయంశమను జీవకల నేనీవే ॥ ౪౧॥

కం॥ అనవుడును మహాదేవుం । డనె నీవే నేను సత్యము గునైననునీ ।
మననమరసితి వేదవ్యా । సుని వలె భాసిలుము చేయు సూత్రవివృతినిన్ ॥ ౪౨॥

కం॥ అని శివుఁ డంతర్హితుఁడ । య్యెను వ్యాసుని సూత్రమునకు నిమ్ముగ భాష్య ।
మ్మొనరింప శంకరుఁడు శ । క్తినిఁ గనె నద్వైతసిద్ధికిన దెకుదురుగా ॥ ౪౩॥

కం॥ పదపడి బహుశిష్యులతో । బదరీవనమునకు నరిగెఁ బంద్రెండవయేఁ ।
టఁదగం జేసెను భాష్యము । మొదటనటం బ్రహ్మసూత్రమునకతఁ డంతన్ ॥ ౪౪॥

కం॥ క్రమతదశోపనిషద్భా । ష్యముగీతాభాష్యమును బొసంగం గావిం ।
చె మఱిసనజ్జాతీయము । నమరించె సభాష్యముగ నృహరితాపనమున్ ॥ ౪౫॥

కం॥ ఉపదేశసహస్రము మొద । లపరిమితగ్రంథముల నుహారం బెసఁగం ।
గృపఁ జేసి చేనె శంకర । కృప లేని జనాళికవ్వి ప్రియము లెటులవున్ ॥ ౪౬॥

కం॥ చదివించెన్ ఛాత్రులచే । ముదమున నుస్వభాష్యములను ముమ్మాఱతఁడొం ।
పదమాత్రాత్రయసూచన । మొదవ సనందనుఁడు సద్గుణోత్తముఁడయ్యెన్ ॥ ౪౭॥

కం॥ అతనిసహాధ్యాయులతని । యతిశయతకు నోర్వలేక యలఁదురగురుఁడొ ।
క్కతఱిసనందను రమ్మనె । ధృతిమంతుం గంగకవులఁ దిరుగుచునుండన్ ॥ ౪౮॥

కం॥ భవజలధితారకంబఁట । శివగురుచరణాశ్రయణము సింధుతరణ మెం ।
త వెడలెదనని సురాపగ । నవనిన్వలె నతఁడు నడచె నానీటిపయిన్ ॥ ౪౯॥

కం॥ అడుగునఁ బొడముట నోయది । యడుగడుగున కిడియెఁ జేతులనఁ దామరలా ।
తఁడు దానఁ బద్మపదుఁడనఁ । బుడమిఁ గడుఁ బ్రసిద్ధుఁడయ్యెఁ బుణ్యమలఁతియే ॥ ౫౦॥

కం॥ హరిపద్మాత్ముండయ్యెను । హరిసతి పద్మకరయయ్యె హరసేవనుశం ।
కరకృపనయ్యె సనందనుఁ । డరుదుగఁ బద,ః డీతఁడధికుఁడు గాఁడే ॥ ౫౧॥

కం॥ విష్ణుపదినడచెఁబదముల । విష్ణువునంశంబనంగ వెలసెగురుకృపన్।
నిష్ణాతుఁడబ్జపాదుఁడు । జిష్ణులగుటయరుదెయతనిశ్రితులన్నింటన్॥ ౫౨॥

కం॥ పశుపతిదానయ్యనతఁడు । పశుపతిమతధర్మముందవన్ ఖండించెన్।
బశువిసరమునుసృజించియుఁ । బశువిశసనమొనరుచుటయెపనిదనదనియో॥ ౫౩॥

కం॥ భాగీరథీతటంబున । శ్రీగురుఁడుపదేశమునొగిఁజేయుచునుండం।
బాగొగను సూత్రభాష్యము । రాఁగనభోమధ్యమునకురవియపుడందున్॥ ౫౪॥

కం॥ ముగియించినాఁటిపాఠము । రుగఁదలఁపఁగనందఱొక్కరుఁడుముదిపొఱుం।
డగపడినీవెవ్వఁడవే । మిగఱపెదవనియనెసంయమిప్రవరునితోన్॥ ౫౫॥

కం॥ అంతేవాసులనిరిభగ । వంతుండాబ్రహ్మసూత్రభాష్యమగునటం।
చింతనతఁడువాదించెం । బంతమునదినాష్టకంబువరయతితోడన్॥ ౫౬॥

కం॥ శంకరుఁడేశంకరుఁడగు । నింకనితఁడెవ్యాసుఁడుహరియీయిరువురదా।
శంకరనారాయణవా । దాంకమెవరుదీర్తురనుచునబ్జపదుఁడనెన్॥ ౫౭॥

కం॥ మునిశంకరుఁడత్తఱివృ । ద్ధునిఁజూడఁగమాయమాయెఁదోడ్తోవ్యాసున్।
దనదుపరాపరగురునిని । దనరనిజాకారుఁగాఁగఁదాఁగనిమ్రొక్కెన్॥ ౫౮॥

కం॥ తనబ్రహ్మసూత్రభాష్యము । ఘనభక్తినొసంగెనతఁడునైకొనిసర్వం।
బునరసిమేల్మేలనిమె । చ్చెనువరమిచ్చెనుదషో౽బ్దజీవిగమఱియున్॥ ౫౯॥

కం॥ చేయుముభాష్యప్రవచన । మీయెడనని పెరుగనాయువిడెనతనికిద్వై।
పాయనుఁడాభాష్యములిల । నాయుర్వృద్ధికరములునతాళికిఁగావే॥ ౬౦॥

కం॥ ఆందుముశంకరవిజయము । నెందున్మేలంచువ్యాసుఁడిచ్చెవరముమే।
మందుముశంకరవిజయం । బెందున్మేలిడెదునంచునెంచెదముగడున్॥ ౬౧॥

కం॥ వెలువడివిజిగీషువతఁడు । తిలకించెఁబ్రయాగమునను ద్రిదివపతితుఁడై।
చెలువఱినహుషుఁడోయన । నలికితుషాగ్నిశయుఁడైనయలభట్టపదున్॥ ౬౨॥

కం॥ కనిసత్కృతుఁడయియిదియే । మనినఁగుమారిళుఁడువలికెనఘశాంతికినే।
నొనరించుచున్నవాఁడను । ఘనప్రాయశ్చిత్తమన్నఁగనికరమొనరన్॥ ౬౩॥

కం॥ వేదవిరోధులబౌద్ధుల । సాధించితికర్మయోగసక్తుఁడవైతే।
లాదారయుగురుద్రోహం । బాదటనీశావమానమఘముకుమారా॥ ౬౪॥

కం॥ ప్రాయశ్చిత్తముఁగైకొం । టీయెడనీవింతెచాలునిఁకగతతాపుం।
జేయుదునినుసుఖముగమను । మీయస్మద్భాష్యమునకువృత్తిఁదెలుపునాన్॥ ౬౫॥

కం॥ మండనమిశ్రుండనువాఁ । డుండెడుమచ్ఛిష్యుఁడొక్కఁడుద్ధతుఁడుబుధా।
ఖండలుఁడువానివాదపు । భండనమునగెలుమువృత్తివాఁడొనరించున్॥ ౬౬॥

కం॥ నాయననీకక్కటికము । నాయెడఁగలదేనిఁజేయునాకుపదేశం।
బీయదననునినువేఁడెద । ధ్యేయయనందారకోపదేశమునే నెన్॥ ౬౭॥

కం॥ ఔరాశంకరుకరుణను । మారిలునిఁదుషాగ్నిదహ్యమానసుఖినిఁగా।
వారకొనరించెభక్తుల । నేరదెచేయంబ్రమోదనిత్యులుగాఁగన్॥ ౬౮॥

కం॥ సోమోద్భవాపగాంచిత । ధామామహిష్మతికిఁబరమహంసుఁడరిగియం।
దామండనమిశ్రునిస । ద్ధామములోఁగింటిమింటిదారిందిగియెన్॥ ౬౯॥

కం॥ కనెనటఁగృష్ణద్వైపా । యనుజైమినిఁబాద్యమునసమర్చించెడువా।
నినిశ్రాద్ధకర్తనలమం । డనమిశ్రునతనికియతికినలివాదయ్యెన్॥ ౭౦॥

కం॥ అగువిష్ణుండభ్యాగతుఁ । డగుణుండనితలఁపకుమితఁడగుజ్ఞానగుణుం।
డుగదాయతియనివ్యాసుఁడు । తగునీకీతనికిఁబూజఁదనరింపుమనన్॥ ౭౧॥

కం॥ వల్లెయనివిశ్వరూపుఁడు । నల్లనశంకరునిభిక్షుకరుదేరుమనెన్।
బల్లిదుఁడయ్యతితల్లజుఁ । డొల్లనిడినవాదభిక్షనొసగఁగొనెదననెన్॥ ౭౨॥

కం॥ వాదమురేపగుఁగాకిపు । డాదరమునభిక్షఁగొనవెయంచునతండా।
బాదరిజైమినులనుమా । వాదంబునజయముఁదెలుపవలయుననంగన్॥ ౭౩॥

కం॥ వారలుమాధ్యస్థమునకు । నీరమణిసరస్వతితగునిశ్చయమనినన్।
ధీరుఁడుమండనమిశ్రుఁడు । వారలనుద్రిమూర్తులనసభజియించెఁదగన్॥ ౭౪॥

కం॥ గురుశిష్యులరిగిరగపడ । కరుదందుచుశంకరయతియరిగెనురేవా।
సరిదంతికదేవాలయ । మిరవుగమఱునాఁడుమిశ్రునింటికివచ్చెన్॥ ౭౫॥

కం॥ ఆవిశ్వరూపుఁడునుదన । దేవిజయాపజయములనుదెలుపంబనిచెన్।
దావచ్చియామెయతిపతి । గ్రీవలదండలిడివాదగెలుపొందవదనెన్॥ ౭౬॥

కం॥ కావింపంగ్రహ ము । లావరవర్ణినిచనఁగమహాజనులువినన్।
ధీవినుతుఁడుశంకరయతి । భావంబుననిశ్చయించిపలికెఁబ్రతిజ్ఞన్॥ ౭౭॥

శా॥ ఏకంబౌఁగనబ్రహ్మమద్దిసకలంబింపొందుసచ్చిత్సుఖం।
బేకార్థంబదిశుక్తివెండిభ్రమగానెచ్చోనవిద్యావృతిన్।
లోకంబందువెలుంగునయ్యదియఖుల్ లోజ్ఞానదృష్టింగనన్।
వీఁకంజీవతమాయుబ్రహ్మమెయవున్ వేదాంతమేమానమా॥ ౭౮॥

ఉత్సాహము॥ అనుచువాదమేసొనర్తు - నైననాకునోటునా।
ఘనతయఱఁగవదలివైతుఁ - గావిశాటులంధరిం।
తునుసితాంబరంబులంబు - ధుల్గనంగనీకునే।
నొనరనగుదుశిష్యుఁడనని - యుద్ధతిన్వచించినన్॥ ౭౯॥

మ॥ అరయంగాదుప్రమాణమాశ్రుతిశిరంబాబ్రహ్మమానిర్గుణం।
బురహింధ్యానమునేయనేదియగునెట్టుంగర్మమేచేయనా।
దొరయున్సాఖ్యములెల్లఁగానశ్రుతియేస్తుత్యప్రమాణంబుమ।
ద్గురువాదంబఖిలంబుకర్మపరమందుంగాదనన్ శక్యమే॥ ౮౦॥

ఉత్సాహము॥ అనుచుఁజేయువాఁడవాద - మైనచోఁబరాజయం।
బనఁగవలెనెప్రతిననాది - యాదునీకుశిష్యుఁడన్।
గొనెదసన్యసనమటంచుఁ - గ్రుద్ధుఁడామెమండనుం।
డొనరెవిబుధసభలురెండ - మొూభువిందివిందవన్॥ ౮౧॥

ఆ-వె॥ శంకరుండుపలికె శార్దూలవిక్రీడి । తంబుగం బ్రతిజ్ఞ దగుదగు మఱి।
మండనుండువలికె మత్తేభవిక్రీడి । తంబటంచు రసికతతులు వొగడ॥ ౮౨॥

శా॥ వాగ్వాదం బెసఁగెం గ్రమంబుగను శశ్వచ్చంద్రికా వైఖరిన్।
ఋగ్వేదాదికవిద్యలందునుదితాద్రిద్యోత సంకాశమై।
భృగ్వారణ్యకదావపావకవిభారీతిం దగన్ వారికిన్।
స్రగ్వల్లం కరమండనుల్లారిజతం జూ సెందిరంతంతకున్॥ ౮౩॥

కం॥ మత్తద్విరదములవ లెన్ । మత్తవ్యాఘ్రములవ లెను మత్తములై యు।
ద్వృత్తములవు హరులవ లెగ । రుత్తులు గలకొండలవ లెఁ గ్రుద్ధోద్ధతులై॥ ౮౪॥

శా॥ వాగ్యుద్ధంబొనరించిరయ్యిరువు రావాదంబు నం బెంపుగ।
న్భాగ్యోపాత్తములై శ్రుతిస్మృతి పురాణస్తోక్తులే యైతగన్।
యోగ్యా జిహ్మగముల్ శరాసనములై యొప్పం గవక్త్రింబులీ।
దృగ్యోద్ధలర లేరనందమకు సాదృశ్యంబదృశ్యంబుగన్॥ ౮౫॥

కం॥ ఇటులై దాఱుదినంబులు । పటుశక్తిన్వాదుల్ఘాడఁబంతంబునవా।
క్కుటిలాలకయతిభిక్షకు । నిటరండనుఁబతినిభుక్తికిటురండనెదున్॥ ౮౬॥

తే-గీ॥ విశ్వరూపుఁడు బ్రహ్మయా విశ్వనాథుఁ । డానుశంకరుఁడా డెదరానివాడు।
కర్మమేజ్ఞానమేముక్తికారణమని । తీర్ప నేర్పరు లేరు గీర్దేవిగాక॥ ౮౭॥

కం॥ అనిజనులనఁగడపటిదిన । మున నావాణిగనిమాల్యమునుదనపతిదా।
నినితాంతతాంతమునుబిలి । చెనుభిక్షకు లెండటంచుఁ జెలువునినియతిన్॥ ౮౮॥

కం॥ అనిమఱియుశంకరమునీ । శునితో భారతియ నెయతి శూరాదుర్వా।
సునిశాపముతీ రెనునీ । ఘనజయమున నాకనిచనఁగడఁగందివికిన్॥ ౮౯॥

కం॥ వనదుర్గామంత్రముచే । తనుబంధించెనల బ్రాహ్మిఁ దనరం గెలువం।
గనుశంకరయతిపతినే । ననుపఁజనెదు గాకపోకుమనినిలి పెనహా॥ ౯౦॥

కం॥ పరమేష్ఠ్యంశజుమండనుఁ । బరిభవపఱిచెనఁటవాదప్రౌఢిమచేతన్।
ధరనిలిపెమంత్రశక్తిన్ । సరస్వతినిశంకరుననుసములుం డ్రెందున్॥ ౯౧॥

కం॥ ప్రశమితగర్వుండయ్యాస । విశయుండయిమండనుండువిద్వద్వంద్యా।
ప్రశమియగుజైమినియనే । లశతాధికసూత్రవితతులం జేసెనసన్॥ ౯౨॥

కం॥ జ్ఞానమునకుఁగర్మముమే । లైనదిసాధనముగాననదిముఖ్యమటం।
చేనిర్మించెన్సూత్రముఁ । గానియెడం బ్రహ్మసూత్రకర్తఁగొలుచునే॥ ౯౩॥

కం॥ అనిశంకరుండు నెప్పిన । నెనయకసంతృప్తినతఁడుహృదిఁదలఁచెనుజై।
మినినమ్మునిమండనమి । శ్రునితో శంకరగదితము సుమహితమనియెన్॥ ౯౪॥

కం॥ పలికెనుజైమినిమఱియుఁగ । పిలుఁడగుఁగృతమునను ద్రేతవినుతుఁడుదత్తుం।
డలవ్యాసుఁడు ద్వాపరమునఁ । గలినీయతిశంకరుండుగదశివుఁడనుచున్॥ ౯౫॥

కం॥ శరణార్థివగుమయిాశం । కరపారాశరికినీవుగనియెదు మేలం।
చురిదిగబోధించిపరా । శరజాంతేవాసివోవసప్రత్యయుఁడై॥ ౯౬॥

కం॥ ఆవిశ్వరూపుఁడాయతి । దేవునికిన్ మ్రొక్కి భక్తిధృతి నుతియించెన్।
గావించితి జితుఁగా నను । నీవిద్యాబలమున నిఁక నెమ్మి నరయవే॥ ౯౭॥

కం॥ నావుడు శంకరుతో వా । గ్దేవి యిటులఁ బలికెఁ బతిని గెలిచితి ననుచున్।
నీవను కొనకుత దర్థము । గావఱ లెద నేను నన్నుఁ గద గెలువవలెన్॥ ౯౮॥

కం॥ నానాశంకరయతిహంసి । తానసుఁడయి మేలు మేలహో యబలలతో।
జ్ఞానులు వాదింతురొకో । మానఁగఁదగు నన్న వాణి మఱి యిట్లనియెన్॥ ౯౯॥

కం॥ ఈనెపమునఁ దొలఁగింపం । గానెన్నె దెనన్ను మున్ను గార్గిన్సులభన్।
జ్ఞాననిధి యాజ్ఞవల్క్యుఁడు । ధీనిధి జనకుండుఁగొన రెధృతి వాదింపన్॥ ౧౦౦॥

కం॥ అనవుడు నాఁగాకనియా । ఘనుఁడు దొడఁగె వాదమునకుఁ గడఁగె ను భాషా।
వనితయు విద్యలయందె । ల్లనువీరోజ్జ్వలరసములు లలిఁ బొరు ననన్॥ ౧౦౧॥

కం॥ పదునేడు నాళ్ళు చెల్లం । జదువుల వెలఁదుకకు నల్ల సర్వజ్ఞునకున్।
సదసున వాదము యతికే । యొదవె జయము పౌరుషబలము న్నె విదుషికేన్॥ ౧౦౨॥

కం॥ పదపడి యాప్రోడ వెలఁది । మదనాగమవాదమూనె మస్కరి హరుతో।
మదవతులు చదివి రేనియు । మదమునఁ బురుషులను గెలువ మదిఁ దలఁతురు గా॥ ౧౦౩॥

కం॥ అమ్మా నెలగడువు ననా । కిమ్మా యనియడిగెనా మెయిచ్చితి ననుడున్।
బ్రమ్మన శిష్యులతోఁ జని । యిమ్ముగఁ గంజాద్రికాతఁ డిట్లనె నరన్॥ ౧౦౪॥

కం॥ వినుఁడో ఛాత్రులు నేనా । తనువిందీకందరమునఁ దనరని డెదనీ।
రనవహితులగుచు నరయుఁడు । కనివత్తుం గామవిద్యఁ గామినిఁ గెలుతున్॥ ౧౦౫॥

కం॥ అనిలింగశరీరముతోఁ । జని యొకదేశంబునందు స్వర్గమునకుఁ బో।
యిన యమరకుఁ డను జనపతి । కుణపంబునఁ జొచ్చె మనియెఁ గుతలపతి యనన్॥

కం॥ తరువాత నద్రాజ్యము । వెరవారఁగ నేలె వాని ప్రియురాండ్ర నెగిన్।
వరనీతిను రతమున శం । కరుఁ డీతఁడ నంగ గడువు గడసను నంతన్॥ ౧౦౭॥

తే-గీ॥ పద్మపాదాదులా పరివ్రాజకమణి । రాకతడయుట నమరక రాజధాని।
కరిగి గాయకులయి పాడిరతఁడు వినఁగఁ । దత్త్వమసి తత్త్వమసి యని తచ్చరితము॥

ఆ-వె॥ సొమ్మసిల్లినట్లు క్షోణిపైఁ బడెదంభ । కుంభినీశుఁడు యతికుంభినీశుఁ।
డయ్యె శంకరుఁడు గస్వాశ్రితులకశంక । రుఁడుగ నమరకుని తరుణులకయ్యె॥ ౧౦౯॥

కం॥ మతిమంతులు మంత్రులు కే । ని తెఱఁగు నూహించి కుణప నిచయము నెందున్।
వెతకి వెతకి కాల్పించుచు । నతివేగమున నుదనతను వడరి దహింపన్॥ ౧౧౦॥

కం॥ కని తనయొడలం జొరఁబడి । ఘనుడాతఁడు సంస్కృతి దనుఁ గాఱించుటగా।
మనమున నెంచె నుబ్రాచిత । మనుకొనె మను జహరి నెంచె మంటలు మానన్॥ ౧౧౧॥

తే-గీ॥ అపుడు లక్ష్మీనృసింహ కరావలంబ । మిమ్ము నాకని శ్లోకాళి నిమ్ముగాను।
జేసి తులసీస్రజంబనఁ గాసమర్ప । ణంబు నొనరించె వినుతించె నయమెలర్ప॥ ౧౧౨॥

కం॥ అనివినుతింపఁగనరహరి । ఘనదాహభయంబుమాన్చికరముననివిరెన్ ।
దనువెల్లఁదొంటికంటెను । దనరమనకుభేదమున్నెతనియమనిచనెన్ ॥ ౧౧౩ ॥

కం॥ పిమ్మటనిజశిష్యులతో । నమ్మునిచనుదెంచిమండనాలయమునకున్ ।
రమ్మనెశారదరోవా । దమ్మునకననామెమ్రొక్కితాజితయనియెన్ ॥ ౧౧౪ ॥

కం॥ ఈశానుండవువిద్యల । కీశుండవుభూతములకునెల్లనుబ్రహ్మా ।
ధీశుఁడవుబ్రహ్మమవుదుస । దాశివుఁడవుశంకరయనితగవినుతించెన్ ॥ ౧౧౫ ॥

కం॥ నేనుండలేనుభర్తృవి । హీననయిమహీస్థలముననేగఁగనిమ్మా ।
నానెలవునకనశంకరుఁ । డానారీరత్నముఁగనియనెనోయమ్మా ॥ ౧౧౬ ॥

కం॥ పరవీవేపశ్యంతివి । మరిమధ్యమవైఖరియనమాన్యవవుదువో ।
పరమేశ్వరివాగ్దేవీ । శరణమ్మువుకమ్మధాతృసతితనుమధ్యా ॥ ౧౧౭ ॥

కం॥ కోడలవుకూఁతురవునా । తోడంబుట్టువవుతల్లిస్తుత్యవునిన్నున్ ।
వేఁడెదనామతములలో । వేడుకనీకళనునునుపవేయననటులే ॥ ౧౧౮ ॥

కం॥ పోఁగాకనివీడ్కొనిచనె । వాగంభోజాక్షిరజితవరభూషణమై ।
తాగగనవీథిఁదనపురి । కాగురువిజయధ్వజమననందఱుగనఁగన్ ॥ ౧౧౯ ॥

కం॥ తరువాతమండనుఁడుశం । కరుఁడునలరిరామెపోవఁగాసంసృతిపా ।
శరహితతదనరెననిశ్రుతి । శిరోంచితాత్మీయమతముచెలఁగెననిదివిన్ ॥ ౧౨౦ ॥

కం॥ పూజింత్రుసరస్వతినిన్ । జేజేలునునట్టివాణిఁజేనెజితఁబరి ।
వ్రాజకుఁడుశంకరుఁడతనిఁ । బూజింపఁగఁదగునుగాదెబుధులకునెందున్ ॥ ౧౨౧ ॥

కం॥ ఆవిశ్వరూపుఁడాత్మధ । నావళులనుయాగముననుద్యాగముసేసెన్ ।
భావించిశంకరోక్తము । గావెలసెసురేశ్వరుఁడనఁగర్మందిగనై ॥ ౧౨౨ ॥

కం॥ కొలువఁదనుఁబద్మపాదుని । వలెనల్లసురేశ్వరుఁడునుబయలవెడలెన ।
బ్బలియుండుశంకరుండొగి । గెలువఁగనుయమాశయమునిగెలుచుటమునునాన్ ॥

కం॥ తొలుతమహారాష్ట్రంబున । వెలయించిజయంబునాంధ్రవిషయంబునఁబెం ।
పలరఁగశ్రీశైలంబున । నెలవుకొనియెబుద్ధిదలనునెలకొనెడిక్రియన్ ॥ ౧౨౪ ॥

కం॥ కనమల్లికబ్రహ్మమహ । మ్ముననర్జునమగుటమల్లికార్జునుసత్యా ।
త్మునిఁబ్రణవాత్మకుభ్రమరాం । బనుగాయత్రినిషడంఘ్రిభక్తిభజించెన్ ॥ ౧౨౫ ॥

కం॥ చేయించెవాదమన్యమ । తాయనులుపరాజితులయియరుగమృగేంద్ర ।
ప్రాయులచేశిష్యులచే । నీయతిదక్షాధ్వరారియేయనఁగజనుల్ ॥ ౧౨౬ ॥

కం॥ భైరవమతస్థుఁడొక్కఁడు । మారీచుఁడనంగవచ్చిమస్కరిహరినిన్ ।
గారవమునఁగనినీతల । భైరవునకుఁగావలెననిభక్తిన్వేఁడెన్ ॥ ౧౨౭ ॥

కం॥ కానిమ్మనియమ్మహితుఁడు । ప్రాణాయామమ్మునర్చిపరవశుఁడుగవాఁ ।
డూనిత్రిశూలాసులరాఁ । గానెఱిఁగిపయోజపదుఁడుగ్రముఁగనుఁగనుకన్ ॥ ౧౨౮ ॥

కం॥ స్మరియించెఁగనకకశిపూ । దరధరవజ్రాయితఖరతరనఖరునిశ్రీ।
హరినినృసింహునిభీకరు । నరిసంహారంబు సేయనతఁడతఁడయ్యెన్॥ ౧౨౯॥

కం॥ ఇతోడ నెయ్యాగురువర । ఘాతకుఁగాపాలికుఁదనఖరనఖరములన్।
వేత్రెఱఁగులఁజీల్చితనదు । కాత్రాశవుఁగాళికిఁగడుఁగడిమిబలినిడెన్॥ ౧౩౦॥

కం॥ కావించెనట్టహాసము । వేవేల్ క్ష్వేడలూక పెట్టఁబిడుగులకోటుల్।
తావలముగఁబడినట్టుల । భూవలయంబద్రువవ్రయ్యభూధ్రములెల్లన్॥ ౧౩౧॥

కం॥ ఎడలఁగసమాధిశంకరుఁ । డదరెదునరసింహుఁగాంచియతిభయభక్తుల్।
దొడరఁబ్రణుతించెఁజాఁగిలఁ । బడిశాంతునిఁజేసెనృహరిఁబ్రహ్లాదుఁడనన్॥ ౧౩౨॥

కం॥ శంకరశిష్యుండయ్యెం । బంకజపాదుండునృహరిభావుండరినా।
మంకుంగ్రుంకించెంద । త్కింకరులకమిత్రులుంద్రెకెడయకవుడమిన్॥ ౧౩౩॥

కం॥ అరియభ్యర్థించినచో । నరుదుగఁదనతలనొసంగెనఁటశంకరుఁడా।
వరదాతగొలువనిడఁడే । వెరవారఁగభుక్తిముక్తిస్వీయనతులకున్॥ ౧౩౪॥

కం॥ గోకర్ణంబునకరిగెం । బ్రాకటముగశంకరుఁడటఁబ్రణుతించెన్శ్రీ।
గోకర్ణేశుంబ్రణవా । ఖ్యాకునిభద్రాభిధానగాయత్రీడ్యున్॥ ౧౩౫॥

కం॥ అందుండిమూడునాఁడులు । పొందుగనందుండి వెడలిపోయెహరిహరా।
ఖ్యందగుక్షేత్రమునకుగో । విందున్శివవిష్ణ్వభేదవిగ్రహుఁబొగడెన్॥ ౧౩౬॥

కం॥ కులిశాద్రిమ్మూకాంబం । గొలువనరిగియందజీవుఁగొడుకుఁగనికదున్।
బలపించుదంపతులద్విజ । కులులందిలకించివందెగురువర్యుండున్॥ ౧౩౭॥

కం॥ పలికెనశరీరవాణియు । నిలుఁగుదొలఁగఁజేయలేకచెందుకనికరం।
బులలినగుఁగుందునకేకత । మెలమిగలుగమనుపవలఁతులెవరికొమరున్॥ ౧౩౮॥

కం॥ అనవినిశంకరుఁడనెఁదా । ననెడిపదార్థంబుమనుపనగుననన వుడే।
చనిపోయినయాకొండిక । కనులఁదెఱచిలేచెమేలుకనినతెఱఁగునన్॥ ౧౩౯॥

కం॥ అందఱుగనుఁగొనికరమరు । దందిమునుమృకండభవునినరసెనివుడుక।
ర్మందిగనయియాకందువుఁ । బొందుగబ్రదికించెనితఁడెపోశంకరుఁడా॥ ౧౪౦॥

కం॥ మృత్యుత్రస్తులుమర్త్యులు । మృత్యుంజయుఁగాదెకొలువమేలునతఁడే।
సత్యముగశంకరుండని । నిత్యముసేవింపకున్ననిత్యులగుదురే॥ ౧౪౧॥

కం॥ ఆకర్మందిభజించెన్ । మూకాంబంబ్రణవమాతమొగిశ్రీబలినా।
లోకించెనగ్రహారము । నాకడవిద్వత్ప్రభాకరాత్మజుమూకున్॥ ౧౪౨॥

కం॥ తజ్జనకుఁడుగడువేఁడం । బుజ్జగమునమూఁగతలనుబొసఁగనిడికరం।
బిజ్జగమునజడమవెయి । య్యజ్ఞునఁబలుకుమనఁబలికెనతఁడతిప్రౌఢిన్॥ ౧౪౩॥

కం॥ హస్తామలకంబుగశ్రుతి । మస్తార్థముదెలియఁబద్యమాలికఁబలుకన్।
హస్తామలకుఁడనన తఁడు । శస్తుండయియతిగనతనిఛాత్రుండయ్యెన్॥ ౧౪౪॥

కం॥ మూకుఁడు శ్రీశంకరయతి । ప్రాకటమహిమనపుడయ్యెవాక్పటిమసుధీ।
లోకాభివంద్యుఁడా గురుఁ । జేకొని భజియింపఁగా రాశ్రితులిలవిబుధుల్॥ ౧౪౫॥

కం॥ అలరనెడమకుడిచేతుల । వలెవెన్నుఁడునల్వపద్మపాదసురేశా।
ఖ్యులుగననిలుండుహస్తా । మలకుడుగాశంకరుండమరెశృంగగిరిన్॥ ౧౪౬॥

కం॥ అందుందుంగాపగతట । మందున్ శారదనునిలిపెనతఁడొకమఠముం।
బొందుపఱిచెనటభాష్యము । లందనవానినలవఱిచెలలిశిష్యులకున్॥ ౧౪౭॥

కం॥ గురువరుఁడుభాష్యపాఠము । జరుపుచునొక్కింతతడనెజలజపదుఁడు శ్రీ।
కరజాగేలయనంగం । గిరిరాఁడయ్యెఁగదభాష్యకృతికృతియనియెన్॥ ౧౪౮॥

కం॥ గిరిగిరియెజ్ఞానశూన్యత । నిరక్షరాస్యుండుభాష్యనిపుణుఁడెవానిం।
గురుఁడుగడుఁబొగడుఁబెద్దగఁ । బరిచర్యాధిక్యమునకుఁబ్రతిఫలముగనౌ॥ ౧౪౯॥

కం॥ అనిపద్మపదుఁడుదనమన । మునఁదలఁచెనుశంకరుఁడును మొగిఁబదునాల్గా।
ఘనవిద్యలగ్గిరికిఁగలు । గనతండానందగిరిగఖ్యాతింగనియెన్॥ ౧౫౦॥

కం॥ అయ్యానందగిరియునది । సెయ్యనగురువర్యువలువలుదికితలపయిన్।
జయ్యననిడుకొనిబోధం । బయ్యెడఁదోఁపఁగనుదనకునర్హకవనమున్॥ ౧౫౧॥

కం॥ తోటకవృత్తంబులస । య్యాటముగరచించిపాడుచాడుచువచ్చెన్।
సూటిగవేదాంతార్థము । తేటపడఁగఁదోటకాఖ్యతెఱఁగుపడంగన్॥ ౧౫౨॥

కం॥ ఆతఁడుపద్మపదాదుల । జ్ఞాతియనఁగనెగడెనందిచందముదోఁపన్।
ఖ్యాతిఁగనెనర్థమాత్రము । భాతిన్ శాంకరులు మేలువడయుటరిదియే॥ ౧౫౩॥

కం॥ అరయనకారముగనురే । శ్వరుఁడునుకారముగనబ్జపదుఁడాహస్తా।
మలకుఁడుమకారముగము । ద్గిరినాదముగాఁగబిందుధృతిశంకరుఁడౌ॥ ౧౫౪॥

కం॥ వివిధములవువేదాంత । ప్రవరగ్రంధములశిష్యవర్యులచేతన్।
దవఁజేయించెనుశంకరుఁ । డవితథతీర్థాటనమునకనిచెనశపదున్॥ ౧౫౫॥

కం॥ తనతల్లియంత్యకాలం । బునఁదనుఁదలఁచుటనతండుబోధముననెఱిం।
గెనుగగనగతినిఁజనిమ్రొ । క్కెనునిర్గుణశైవములనొగింబోధించెన్॥ ౧౫౬॥

కం॥ అమెదనకుఁదెలియదనన్ । బీమతిగాఁగనుబదపడివిష్ణుధ్యానం।
బామెకునుపదేశించెను । శ్రీమద్వైష్ణవపదంబుఁజెందించెఁదుదిన్॥ ౧౫౭॥

కం॥ తరువాతందచ్ఛవముం । బరఁగదహింపంగఁగోరబంధులునిందా।
పరులగుచురాకయున్నం । గురుఁడద్దిదహించెనింటికుఱఁగటనంతన్॥ ౧౫౮॥

కం॥ శపియించెఁగేరళీయుల । విపులామరులనువ్యపేతవేదులఁగాయ।
త్యపగతులఁగాఁగగృహముల । యుపకంఠముననెశ్మశానమొనరఁగనందున్॥ ౧౫౯॥

కం॥ పంకులతనిఁదెగడిరిని । శ్శంకంబుగశత్రులైరిసాగరులనఁగన్।
శంకరదూషకులెందున్ । సంకటములఁబొందకుంద్రెసౌఖ్యముఁగంద్రే॥ ౧౬౦॥

కం॥ చేయంగం దిగ్విజయము । నాయతిపతి వార్చియుండె నబ్జపదుని రా।
కాయెడ మహాసురేశా । ఖ్యాయుతు నచ్యుతు భజించె నాతఁడు గూడన్॥ ౧౬౧॥

కం॥ సరసిజచరణుండు నుశం । కరునకు నిటు విన్నవించెఁ గన్నీ రొలుకన్।
స్వరచితము భాష్యటీకన్ । బొరివోవ న్మాతులుండు పొరిఁ గాల్చె ననన్॥ ౧౬౨॥

కం॥ విని కరుణానిధి గురువరుఁ । డనె వందర నేల వ్రాయు మయ్యవచింతన్।
మును నీవు రచించినదే । యని చెప్పె లిఖించె నాతఁ డానా ననుచున్॥ ౧౬౩॥

కం॥ ఆలించి యీయాయుదంతము । నోలిం జను దెంచి కేరళోర్వీపతిన।
న్నేల వె మున్నీ విన్నది । కాలెఁ బ్రమాదమున నాటకత్రయి యన్నన్॥ ౧౬౪॥

కం॥ ఉర్వీశ నేను జదివెద । సర్వమును లిఖింపు మీవు నైరణ ననుచుం।
బర్వఁగ నది పూర్తిగఁ దన । సర్వజ్ఞత్వంబుఁ దెలిపె జగతికి నెల్లన్॥ ౧౬౫॥

కం॥ అంతన నంతాకాంతుం । డెంతయు సంతసముఁ బొందియే మొనరింతుం।
గంతుహర నాఁగ గురుఁడు స । హంతులఁ గాలటి ద్విజుల నమర్పు మటుల నెన్॥ ౧౬౬॥

కం॥ విని నవి నని గ్రంథములన్ । జనవున శంకరుఁడు చెప్పి సంతోషింపిం।
చెను రాజశేఖరుని నా । వనజాతు సెనర్పలేఁడె భక్తుల నల్లే॥ ౧౬౭॥

సీ॥ మెలఁగఁ బద్మాంఘ్రి సౌమిత్రి నానానందగిరి మిత్రజుండనఁ బరఁగ మఱియు।
నంగద ప్రాయుఁడై హస్తామలకుఁ డొప్పఁ దనర సుధన్వుఁ డధ్ధరణిపతియు।
హనుమంతుఁడనఁ గొల్వ నత్యంతభక్తుఁడై పలువురు శిష్యులు వాహినీశు।
లనసూరెల భజింపఁదను మిక్కిలిగ నిక్కు ద్వైతాదిమతముల న్దశముఖాదు।
లను జయించి యద్వైతమన్జనకజాత । నుద్ధరింపను దండెత్తె సోయనఁ జనె।
సేతుయాత్రకు విమతులుం జేరి మ్రొక్క । శంకరాచార్యుఁడనెడు దాశరథియపుడు॥

సీ॥ మాయయ హమ్మను శేయని ప్రణవంబుఁ బ్రాసాదమంత్రంబుఁ బరఁగఁ దెలుపు।
మధ్యార్జునంబను మహితమౌ క్షేత్రంబునందు శంకరుఁడు మధ్యార్జునేశు।
నద్వితీయసుభక్తి నర్చించి యొడ్డియద్వైతమన్గొడ్డలిచే తద్వైత।
మతమని యెడిపెను మ్రాఁకును ఖండించె ద్వైతులోడి యు నెల్ల కేతడఁబడ।
నల్ల మధ్యార్జునేశు చే నందఱకును । దెలియఁబలికించె ముమ్మాఱు ధృతి దలిర్ప।
సత్యమద్వైతమౌనని శంకరుండు । వారి నద్వైతులను జేసి పడనె జయము॥ ౧౬౯॥

సీ॥ రాముఁ డాత్మయె యీశుఁ డౌ మహాదేవుఁడు శివుఁడను నర్థంబుఁ జెప్పనట్టి।
రామేశ్వరమునందు రామశక్తియె తదుపేతుఁ డీశ్వరుఁడు రామేశ్వరుఁడను।
గౌరీందిరా శారదోరు పరాశక్తిమతనిష్ఠులం గెల్చి మని చివారి।
నాత్మశిష్యులుగాఁగ నా రామనాథుని జాహ్నవీజలముల స్నాతు బిల్వ।
దళ సమర్చితు ఫలభుజు నలరఁ జేసి । యుండి రెండు నెలల్ శైవపండితుల జ।
యించి వారల నట్లు గావించె మాన్చి । శైవచిహ్న విశేషముల్ శంకరుండు॥ ౧౭౦॥

సీ॥ సేతువుప్రణవంబుసిద్ధమైననుయుక్తిస్వరమెయాటనుబిందుసంజ్ఞఁదెలుపు।
నట్టియనంతశయనమునకరిగిశంకరుఁడొకనెలయందుఁగడపెఁబ్రొద్దు।
నగుననంతంబననాకాశమదివిష్ణుపదముగదాబిందువదియమేయ।
మందొండెమఱిదహరాకాశమందొండెశయనించునాత్మయేచక్రపాణి।
యనుచునుదలంచెఁబద్మనాభునినుతించె । వైష్ణవులనాఱుతెగలగువారినోర్చి।
వైదికేతరచిహ్నముల్వదలఁజేసి । చేసెనద్వైతులుగయతిసింహుఁడతఁడు॥ ౧౪౧॥

సీ॥ అరిగెసుబ్రహ్మణ్యమనుక్షేత్రమునకందుమునిఁగికుమారధారనుగుమారు।
సర్పరూపునుతించిసరసిజాసనశశిభాస్కరమతములవదలఁజేసి।
భూతలామరులనద్వైతులఁగావించిత్రిసహస్రశిష్యతతిదనుఁగొల్వ।
గణవరమనుపురిగణపతియాశ్రమమందుఁగౌముదినదియందుస్నాన।
మాచరించిగజాస్యునినభినుతించి । మాసమందువసించిషణ్మార్గులైన।
గాణపత్యులనుజయించికఱిపిపంచ । పూజకులనెనరించెనుబాగడుఁగాంచె॥

సీ॥ కాంచికినరుదెంచికర్మందిశంకరుఁడందుఁగామాక్షిగుహావిలీన।
నేకామ్రమూలగునేకాంబరేశ్వరుఁగరిగిరిసదనునివరదరాజుఁ।
గనిదేవతాత్రయికనువొందఁగోవెలల్గట్టించిచేసిచక్రప్రతిష్ఠ।
తాంత్రికపూజలఁదలఁగించివైదికపూజలనెలకొల్పెభూసురులను।
నెలకొలిపెఁబౌరులుగనటవలనునిలిపె । నష్టసాహస్రసంఖ్యాకులైరివారు।
సాశ్రయాశులైవచ్చినయాంధ్రవిప్రు । లాఱువేలవారిననటులాదరించె॥ ౧౪౩॥

మానినీ వృత్తము॥ కాంచియనన్మొలనూలుగదాయది - గ్రాలుఁదగందనుమధ్యకెయా।
ప్రాంచితయేదెటనుండెడునంచును - భావమునందుఁదలంచిరహిం।
గాంచెనుబిల్వవనంబునశ్రీపతి - కాంతయటంచునుశంకరుఁడీ।
క్షించెద్వమేహినదిన్మనిఁగెన్స్మృతిఁ - జెందెశివోహమటంచునటన్॥

నలినీ॥ వినుతించెనుమున్మనుదే - వినిఁగాశికన।
త్తనుమధ్యమనాదిమభ - క్తనుభావహయో।
గ్యనుయోగమునిద్ధిపాసం - గనుయోగినిశ్రీ।
వనపాలనశీలనుస - ర్వనుతందనరన్॥ ౧౪౫॥

మాలినీ॥ శరణమవుమటంచు - న్సన్నుతించెన్సభక్తిన్।
వరదునివరయోగ - ప్రాభవున్భక్తరక్షున్।
దరశయునరిహస్తుం - ద్రాసరాహిత్యముద్రు।
న్నురుకరకలితోరున్ - యోగనారాయణాఖ్యున్॥ ౧౪౬॥

మణిభూషణ॥ శంకరుంబొగడెయోగము - చాలఁగఁగల్గరా।
జాంకమాళిశివుబిల్వవ - నాధిపుశంభువున్।
జింకగేలఁజెలఁగంగను - జెల్వవువానిషా।
లాంకునిన్డమరుహస్తును - మాంచితవిగ్రహున్॥ ౧౪౭॥

వనమయూర॥ నందిరథశూలధర - నాగమణిభూషా।
కుందశరదిందురుచి - కోశశితికంఠా।
వందనమునీశసుర - వందితపదాబ్జా।
యిందుధరబిల్వపతి - యేలుననుశ్రీశా॥ ౧౬౮॥

కవిరాజవిరాజిత॥ శరణుమహేశ్వరసామికృతాద్రిజ - చంద్రుఁడునీదుకపర్దమునన్।
సురసరిదుజ్జ్వలచారుసరోభవ - శోభనుశోభిలుఁగానియెడన్।
బరఁగునెయబ్జపదుండయినీనయ - నత్రయినీయదిశూలమునిన్।
వరదుఁడుబిల్వవనేశుఁడటంచును - భక్తులకెల్లనుదెల్పుశివా॥ ౧౬౯॥

కం॥ అనివృత్తషట్కనామా। దినిఁదల్పద్యాదివర్ణదివ్యాంకములన్।
మొనయఁగఁబ్రాసాదమునటి। తనుమధ్యనుతించెఁబ్రణుతతత్సదభిఖ్యన్॥ ౧౭౦॥

మత్తమయూర వృత్తములు.

౧. ఆదిక్షాంతామక్షరమూర్త్యావిలసంతీం। భూతేభూతేభూతకదంబప్రసవిత్రీమ్।
శబ్దబ్రహ్మానందమయీంతాంతనుమధ్యాం। గౌరీమంబామంబురుహాక్షీమహమీడే॥

౨. ప్రత్యాహారధ్యానసమాధిస్థితిభాజాం। నిత్యంచిత్తేనిర్వృతికాష్ఠాంకలయంతీమ్।
సత్యజ్ఞానానందమయీంతాంతనుమధ్యాం। గౌరీమంబామంబురుహాక్షీమహమీడే॥

3. మూలాధారాదుత్థితవీధ్యావిధిరంధ్రం। సౌరంచాంద్రంవ్యాప్యవిహారోజ్జ్వలితాంగీ।
యేయంసూక్ష్మాత్సూక్ష్మతనుంతాంతనుమధ్యాం।గౌరీమంబామంబురుహాక్షీమహమీడే॥

కం॥ అనిమత్తమయూరములన్। మొనయముభార్గములఁబ్రణవముగమటియట్లే।
తనరించెఫలశ్రుతితో। నెనిమిదివృత్తములవృత్తహితఁదనుమధ్యన్॥ ౧౭౧॥

తనుమధ్యావృత్తము.

మాంపాతునివాయా। స్త్రీరేనివసంతీ। బిల్వేశ్వరకాంతా। దేవీతనుమధ్యా॥

కం॥ అనితనుమధ్యావృత్తము। లనువొందఁదదాఖ్యసంఖ్యనవుడొనరిచెశ్రీ।
తనుమధ్యకింపుగనుస। జ్జనహితముగశంకరయతిచంద్రుఁడుభక్తిన్॥ ౧౭౨॥

తే-గీ॥ కాంచఁగాంచిప్రత్యాహారకలనఁదెలుపు। మున్నుకామాక్షిదనయందునున్నకతన।
నీసమాఖ్యనిజాఖ్యచేనెరపుమటియు। నెంచఁదనుమధ్యకామాక్షివీవెకావె॥ ౧౭౩॥

,, అల్లకామాక్షియనునామమగుటఁజేసి। యరయనిర్బిందువందుచేనందితివాకొ।
వెలయఁదనుమధ్యయనెడిసబిందుకాఖ్య। నక్షరాత్మకమదిసాంఖ్యమవుఁద్వదాఖ్య॥

,, కామరిపునకుఁగామాక్షిగాదనుచునె। మధ్యముఁడుశివుఁడవుటఁదన్మధ్యతనువు।
గావుననెనీవుతనుమధ్యనావటలెదు। సార్థకాఖ్యనుగాంచితౌనంబికశివ॥ ౧౭౪॥

తే-గీ॥ శ్రీశివయెయానుశివుఁడయాశ్రీపతియని। భక్తజనులకభేదభావముఘటిల్లఁ।
గాంచిపురినుండకిచటశ్రీకాననమున। నీవుతనుమధ్యయుందువంచేఁదలంతు॥ ౧౭౫॥

తే-గీ॥ నీవుసత్యవుదనుమధ్యనీదుపేరఁ। దాదియాంతార్ణములురౌద్రివనునృసింహ।
మంత్రరాజోక్తతనుతారమహితవపుచుఁ। గ్రాలెదునృసింహశక్తివెకావెబిల్వ॥ ౧౭౬॥

తే-గీ॥ నాల్గుకొలములవారును నాలుగాశ్ర । మములవారుచతుర్దశుల్మహిఁబుమర్థ।
భాజనులుగాఁగఁదనుమధ్యనాఁజెలఁగెడు । వేదమాతృకనినుఁగొల్తువిశ్వమాత॥ ౧౮౮॥

కం॥ అనునిత్యాద్యర్థవితతి । యనువొందెడునందుశంకరాచార్యకృతిన్।
వినుతస్రజ్మణితతిడా । లనఁగానయ్యెందునందునమృతమువోలెన్॥ ౧౮౯॥

కం॥ వినితనుమధ్యయలరియ । మ్మునికింబ్రత్యక్షమయిప్రమోదంబుననీ।
వొనరించిననానుతిఁజది । వినవిననిష్టార్థసిద్ధివెలయునతులకున్॥ ౧౯౦॥

కం॥ శంకరవిజయమునీకౌ । శంకరవిజయంబునీవిజయముశ్రితులకున్।
శంకరవిజయంబగునీ । శంకరవిజయముస్వవర్ణసరణిజయమెయా॥ ౧౯౧॥

కం॥ నావుడునతఁడనెనంబశి । వావైశాఖమునశుద్ధపంచమినాకు।
న్నీవగపడితీదినమున । సేవించినజనులకిష్టసిద్ధినిడుముమా॥ ౧౯౨॥

కం॥ అననానతనుమధ్యయ । ననుఁదనుమధ్యగనుగొలిచినాఁడవుగానన్।
దనువెడలకయేశంకర । చనుమాకైలాసముకనిచనవరమొసఁగెన్॥ ౧౯౩॥

తే-గీ॥ శంకరుఁడుబిల్వనాథుఁడైస్థాణులింగ । మగుటఁగదలండుభిక్షుకుండయ్యెనీతఁ।
డరుగునెందనితనకయియభిముఖుఁడుగ । నయ్యెననఁదోఁచునందినయ్యతినుతించె॥

తే-గీ॥ చనియెనంతటవేంకటాచలమునకతఁ । డాఱువేలశిష్యులుదనుననుసరింప।
స్వామిపుష్కరిణీతీరసవిధభూమి । శ్రీనివాసునిసేవించెఁజెందెముదము॥ ౧౯౪॥

కం॥ దక్షిణకైలాసంబున । నక్షీణసువర్ణముఖరినవగాహించెన్।
వీక్షించెజ్ఞానాంబను । ద్ర్యక్షునిశ్రీకాళహస్త్యుపాఖ్యునినీక్షన్॥ ౧౯౫॥

చ॥ చనియెవిదర్భదేశమునుజల్పుచుఁగన్నడనీమమున్నగాఁ।
గనుబలునాళ్లస్వీయములఁగాంచెనెరుంగ్రకచాఖ్యభైరవా।
యనునిరసించితజ్జనులసాయుధులన్దహియించెహుంకృతిన్।
మునికపిలుండనందనకుమ్రొక్కినవారలనేలెశూలినాన్॥ ౧౯౬॥

సీ॥ చార్వాకమతముపుస్తకభారమునుమోసెఁగడఁగిమోచెనుబాదుకలనుసౌగ।
తమతముక్షపణకకుమతముకాలప్రతీక్షణంబొనరించెఁదివిరిజైన।
మతముధాన్యాధికృతితఁగనెబౌద్ధసిద్ధాంతంబుభట్టురాజయ్యెనల్ల।
మల్లారిమతముబ్రాహ్మణధర్మమూనెవిష్వక్సేనమతముద్వార్థసత్త్వమెననె।
సంతమన్మథరాద్ధాంతమంతమొందె । శంకరుఁడుత్ర్యక్షుఁడెదురుండఁజాలుదురెవ।
రతఁడువాదోన్ముఖుండయియడరగిరులు । భిదురపాణికినెదురున్నెప్రిదులకున్నె॥

సీ॥ పాకశాసనుఁడయ్యెఁబాకశాసనుఁడుగాఁగ్రతుభుగ్రణినాఁగఖ్యాతిఁగనుట।
దండధరుండయ్యెదండధరుండుగాధర్మరాజాభిఖ్యఁడానెనయుట।
నప్పతియయ్యెనయ్యప్పతిగాఁబ్రచేతోఽభినుతింగనియప్పలిడుట।
ధనపతియయ్యెనుధనపతిగాశంకరసుహృత్సమాఖ్యచేఁబ్రథితుఁడగుటఁ।
దమమతంబులునామమాత్రమునధాత్రి । నిలువదిక్పాలకులెయోడికొలువవలఁతు।
లలఁతులవువారువాదించినిలుతురెట్లు । నరులువాదులుగాఁగవానరులుగారె॥ ౧౯౯॥

సీ॥ వాయుమతస్థుండువ్యజనసేవనుజేసె శూన్యవాదిగనాయెశూన్యవాది।
వారాహరాద్ధాంతివంచుకొనెనుదల సత్యసిద్ధాంతియసత్యుఁడయ్యె।
గుణవాదియయ్యెనగుణవాదిసాంఖ్యుండు దనదుప్రధానవాదమునఁదగ్గె।
యోగినియోగిగానైనరేఁదాననువాదియణువాదియేయాయెనంతఁగర్మ।
వాదులుపరాఙ్ముఖులయిరివచ్చియస్త। మితుఁడుగానయ్యెఁజాంద్రుండుక్షితిజముఖ్య।
హార్చకులుశాంకరోక్త్యాతపావృతులయి। యగపడకయుండిరిహరికిహస్తులెదురె॥

సీ॥ పైతృకమతమనఁబారాశరీతరగృహముల దాఁగెభుక్తియెఫలముగ।
శేషమతంబుక్తిశేషంబుగానయియడుగంటెనిట్టూర్పులడరగరము।
గారుడమతమయ్యెగారడమనగాలిపటమసూత్రంబనంబాటెమింట।
సిద్ధమతంబప్రసిద్ధంబుగానయియడవులఁగొండలనండఁగొనియె।
వెలయనేరకపమనాల్గువిద్యలందు। వెలవెలందులగాంధర్వవిమతమెనసె।
ఛాతికమతంబుశివునాజ్ఞఁబఱచెనిలిచె। సత్యముగుటనుశాంకరసన్మతంబు॥ ౨౦౧॥

సీ॥ హరదత్తగురుఁడగునానీలకంఠుతోఁగోకర్ణమతిభక్తిఁగొలిచెద్వార।
వతిప్రముక్కఁజెల్లించెఁబాంచరాత్రులతోడసన్నుతిఁజేసెనుజ్జయినిభట్ట।
భాస్కరుతోడనవంతిజనపదముల్బాణదండిమయూరప్రముఖకవుల।
తోవిధేయతఁజూపెఁదొడరిబాహ్లికదేశమర్త్యవితతితోనడఁకువఁగనె।
నైమిశారణ్యమద్వైతనవ్యభాష్య। సురతరువులకుదోహదస్ఫూర్తినొసఁగెఁ।
బెక్కునాడులానీడలకిక్కలయ్యె। శంకరాచార్యవిజయముక్ష్మనుతించె॥ ౨౦౨॥

సీ॥ భట్టపాదునకునుభట్టభాస్కరునకునాప్రభాకరునకునాయుదయను।
కోర్వనసాధ్యుఁడైయుద్ధరుండైనఖండనకారుశ్రీహర్షునినిబలుమఱు।
వాదాజులజయించెవలనొప్పభీమయుక్తినడంచెమాగధుఁగృష్ణుఁడనఁగఁ।
గామరూపవిషయఖ్యాతునినభినవగుప్తునిహరుఁడువృకునిహరికన।
నబ్జపాదునికిడెనుమురారిమిశ్రు। నుదయనునిధర్మగుప్తునినొగినిభాస్క।
రప్రముఖులనువేర్వేరప్రౌఢిగెలిచె। శంకరుఁడుసర్వలోకవశంకరుండు॥ ౨౦౩॥

తే-గీ॥ వీరువారననేటికేపృథ్వినాఁటి। యున్నసర్వమతస్థులనోర్చెనతఁడు।
గోఱిలనొకపెట్టనుత్తరగోగ్రహణము। నందునర్జునుఁడననుయశోర్జునుండు॥ ౨౦౪॥

తే-గీ॥ శంకరాచార్యసిద్ధాంతసరణికడ్డ। పడినవాఁడెట్టిఁడైననపయశుఁడగును।
భానుబింబంబునకునడ్డపడ్డచంద్ర। ముఁడుగతద్యుతిమానహీనుఁడగునట్లు॥ ౨౦౫॥

కం॥ ఎంతెంతదూరమగునో। యంతంతవెలుంగుబుధునికబుధుఁడరయఁగా।
నెంతెంతచెంతఁజేరునొ। యంతంతయడంగునిందుఁడర్కునకువలెన్॥ ౨౦౬॥

కం॥ కనెగౌడపాదుఁబరమగు। రునిఁదత్ఫలమనఁగశంకరుఁడుకాశ్మీరం।
బునసర్వజ్ఞునుపీఠము। ననుమధ్యాహ్నార్కునివలెనలువొందెలలిన్॥ ౨౦౭॥

సీ॥ ప్రాగ్దిశనెలకొల్పెఁబద్మపాదునిజగన్నాథంబునన్మఠనాథుఁగాఁగ।
దక్షిణముననిల్పెఁదగశృంగగిరిమఠంబందుసురేశ్వరుంబొందొనరఁగఁ।

బశ్చిమదిక్కునఁబరఁగించెహస్తామలకునిద్వారకమఠలక్ష్మిదనర।
నుత్తరముననుంచెనొగిఁదోటకాచార్యుబదరికాశ్రమమఠపరివృఢునిఁగ।
నూర్ధ్వముననుండఁదనమఠముల్లమునఁద । లంచియో శంకరుండుకైలాసమునకుఁ।
జనియెఁబంచాస్యధర్మంబుదనకెతగున । టంచువిబుధులనబుధులనభినుతింప॥

కం॥ తనుమధ్యవలనఁగలిగెం । దనుమధ్యవరమునసతనుతనుబరమందెం।
దనుమధ్యాద్యక్షరసం । ఖ్యనయిననెయేండ్లుండెశంకరాచార్యుఁడిలన్॥ ౨౦౯

తే-గీ॥ శంకరాచార్యశిష్యులుసర్వజనులు । మునుఁగవలదెశివోఽహమంచునుద్వమేహిఁ।
దత్సదోంకృతిఁదనుమధ్యఁదత్పురుషుని । నాత్మబిల్వేశుభజియించియలరవలదె॥

పృథ్వి॥ కకారమొకఁడాటచేఁ - గనన కారమాబ్రహ్మగా।
లకారమగురేఫమే - లలినభేదతన్మాడుఁగా।
నుకారమగువిష్ణువే - యొగిశమాప్తిఁబంచాస్యుఁడీ।
త్రిశైక్యమునఁదెల్పనోం - కృతినిశంకరుండాఖ్యచేన్॥ ౨౧౧॥

కం॥ శివపర్యాయపదముగద । యవుశంకరుఁడనఁగశంకరాం కాప్తినహా।
మ్మవుఁబ్రణవార్థముఁదెలుపున్ । శివోఽహమనిశంకరుండుస్వీయాభిఖ్యన్॥ ౨౧౨॥

సీ॥ బదరినానగుటచేఁబ్రణవమాబదరికాశ్రమమందుఁగొన్నాళ్లుసనవసించి।
నారాయణునిమనోంభోరాశిశాయినిభజియించియాతఁడుపరమభక్తి।
నందుండివెడలిఫాలాక్షుఁగేదారేశుమార్గదాయినిఁదనుమధ్యమమతి।
సంస్మరించితపోఽగ్నిసంతప్తకుండంబుసవరించివిధిప్రమొక్కసత్యమెనని।
జంగమంబైనకైలాసశైలమనఁగఁ । దనుఁగొలువనాగతుండైనతండుమీఁద।
నెక్కియాత్మాకృతినెతనయిక్కఁజేరె।శంకరుండోంకృతియవువిజయముజయము॥

తాండవజవవృత్తము॥ అనిశంకరవిజయమువిధి - యాత్మజుఁడిదిసత్యం।
బనునర్థమువిశదపఱుప - హాయిగమునుసాపా।
యనిపాడునుహరిమురజము - నందికొనియునోంమో।
మనధింధిమనుచుఁబలికెడుఁ । ద్ర్యంబకుఁడిపుడాడున్॥ ౨౧౪॥

కం॥ శంకరునియుపాఖ్యానము । శంకరమగునిందునందుఁజదువవినఁజనున్।
బంకములుసంకటములుని । రంకుశముగనబ్బువిజయమాగురుకరుణన్॥ ౨౧౫॥

గద్యము.

ఇది, శ్రీతనుమధ్యాంబాకరంబిత శ్రీబిల్వనాథమహాదేవశిష్య శిష్యోపజ్ఞాక్షరసాంఖ్యాచార్య పర్యవితకవిత్వ తత్త్వవిత్ప్రకాండ శ్రీమత్కొక్కొండ వేంకటరత్నశర్మ వినిర్మితంబై
కవిమణినామంబునంబరఁగు
శ్రీబిల్వేశ్వరీయంబను పద్యకావ్యరత్నంబునందు
షష్ఠంబగు నభేదేశబింబంబునం బ్రథమభాగము బిల్వేశభాగము.

శ్రీబిల్వేశ్వరాయనమః.

# బిల్వేశ్వరీయము.

## షష్ఠబింబము, అభేదేశబింబము.

### ద్వితీయభాగము, రత్నేశభాగము.

ప్రియంవదావృత్తము॥ అవధరింపుమణి-హారవక్షమా । ధవనృసింహమణి-దామశోభితా।
శివదరత్నతను-శీలశ్రీకరా । తవినరత్నచరి-తంబునింబుగన్॥ ౧॥

శ్రీవృత్తము॥ శ్రీ బి ల్వే శా ॥ ౨॥

కం॥ అనిబిల్వేశాభిఖ్యం । గనుభాగముఁ జెప్పియొప్పఁగాశాద్వ్యాఖ్యా।
దినిఁబ్రాసాదముగేయము । మొనసినబిల్వేశనామముదగెడుననుచున్॥ 3॥

శా॥ బాలుండొక్కఁడురత్నమక్కడఁగనెంబ్రాసాదముందారకం।
బోలిందానుఁడుగుప్తుఁడైమఱియునోంహ్రూవర్మయైశర్మయై।
క్రాలంజాలఁదపంబుసల్పికనియెన్రత్నాయనాభిఖ్యనా।
రారత్నేశ్వరుఁడయ్యెబిల్వపతినారత్నేశుభావించెదన్॥ ౪॥

శ్రీవృత్తము॥ శ్రీ ర త్నే శా ॥ ౫॥

సలిలవృత్తము॥ అనిసూతుఁడు । మునురెట్లది । యనివేఁడఁగ । ననెనిట్లని ॥ ౬॥

## రత్నదాససర్గము.

చ॥ శ్రుతమెటనయ్యెరామునకుక్షోణిజరావణుఁడెత్తుకొంచును।
ధృతిఁజనెనన్నవార్తమతితస్కరురాజసమూర్తినింద్రియ।
ప్రతతినుఖాశుఁబంక్తిముఖురాముఁడయాత్మఁడెగెల్వుమంచదే।
శ్రుతగిరినాఁగఁబేర్వడనిశోభిలునాదమహాదయంబనన్॥ ౭॥

కం॥ తదుపత్యకఁదదభిఖ్యా । విదితమువీడుండునెందువిద్వద్వంద్యం।
బదిభాస్కరవిప్రకులా । స్పదమయికోదండరామపరిలసితమగున్॥ ౮॥

మ॥ మునుపారామునిముద్రసీతకునుదద్భావుత్రిచూడామణిన్।
మనుజాధీశ్వరుఁడైనరామునికిడన్మాన్యుండుదానాటచే।
తనుచేర్చన్వడిజాబులాశ్రితులకంతంబొందుఁబత్రార్చఁబా।
వనియప్పాలసరాలఁదాల్చనటఁడప్పాలాంజనేయుండనన్॥ ౯॥

ఉ॥ ఉండెఁదదీయమధ్యమతనూదితమామతమందునందుఁగో।
ల్కొండనృసింహుఁడుండుక్రియక్షోణిసురుండొకరుండుతద్భవా।
ఖ్యుండుతదీయభక్తుఁడుబుగుత్తమవేదుఁడుగాధిపుత్రగో।
త్రుండుసునైష్ఠికుండుమహితుండువరిష్ఠుఁడుసద్గుణంబులన్॥ ౧౦।

సీ॥ నరసుతుఁడన నేలసురసుతుఁడుసునగుధర్మైకనిరతతదానపరత।
రమ్యుండువిద్యచేసౌమ్యతమితహితసత్యభాషణములశాంతవృత్తి।
సింహసంహననుండుస్థిరతశౌర్యముచేతనంతరరుల గెల్చెనరు లెవరిఁక।
గణనీయుఁడతఁడెలోకత్రయజయమునఁగామరోషాళులఁగననికతన।
రాజపూజ్యుండుస్వాశ్రితరక్షకుండు।యమనియమముఖయోగాంగుఁడాత్మబోధుఁ।
డుచిత్రవేషుండుభూసురుండుత్తరుండు। శ్రీముఖాభిఖ్యుఁడితఁడె నాఁ జెలఁగునతఁడు॥

చ॥ అరణియుసీతరేవతియునాటస్వభర్తృపదైక్యలాధృతిం।
బారయక రామ రామయనుభూవిదితాఖ్యనురామనామ మే।
దురితనివారకంబెననిస్తుత్యగనయ్యెఁగనెన్ రమాఖ్యశ్రీ।
తరుణియనంగఁదద్గృహిణిధన్యయమాన్యయునైయెసంగెడున్॥ ౧౨॥

సీ॥ పతియెప్పుడనుఁబిల్వమతినెంచునోయప్పుడండనుండెడుసంవిధానకలన।
భర్తయెప్పనిఁజెప్పభావించునోదానిఁగావించితినటంచుఁగడఁకఁదెలుపు।
ధవుఁడుభుజించుచోఁదాఁజూడకుండియువలయునంతయభీష్టవస్తువిడెడుఁ।
బ్రాణనాథుండుత్తరాచమనంబొనరింపఁగా నేవిడెమింపుగనిడు।
నతఁడుకార్యాంతరాసక్తుఁడయిచనమఱి। కొనెడుఁదానియతాహారమునుదదీయ।
భుక్తశేషంబుగృహకృత్యములనుదీర్చుఁ। బ్రొద్దుఁగడపెడుదయితోక్తిఁబుణ్యకథల॥

కం॥ అతిథులనభ్యాగతులం। బ్రతిదినమధికాదరమునబంధువులనుదా।
నతితృప్తులఁజేయునుసం। తతముస్వకృత్యములమగఁడుతద్దయుఁదనియన్॥ ౧౪॥

తే-గీ॥ ఇరుగుపొరుగులయిండ్లకునేగదుపతి। యనుమతినిఁజెందకాత్మీయజననితోఁడ।
నేనిమంతనమాడఁగాఁబూనదువ్రత। తతినొనర్పంగడంగదుతనకుఁదాన॥ ౧౫॥

మ॥ కనియుంగాననియట్లయుండునెవరేన్గావించినందోసముల్।
దనరందెల్పెడురెంటమూటమఱిసందర్భింపఁగార్యాంతరం।
బునవారిన్నెలకొల్పునిల్పుమదినిన్ భూషింపఁగావారలున్।
మొనయుంజేయదువెచ్చమెచ్చుగనుసొమ్ముంగూడఁబెట్టుందగన్॥ ౧౬॥

చ॥ పలుకదుపల్కువమ్ముగనుబల్కిననూటికినొక్కమాటగాఁ।
బలికెడుఁగల్గనక్కఱవంబదిదిన్నఁగనుండునెన్నఁడు।
న్నిలువదువాకిటన్మగలునిల్వఁగనిల్వదువారిఁగాంచినం।
దొలఁగిచనుంగనుంగొనదుతోఁచునుదల్లిగనెల్లవారికిన్॥ ౧౭॥

చ॥ పెనిమిటికింపుగందొడుగుఁబేర్మినిఁగల్గినసొమ్ములిమ్ముగం।
జనవున నేని వేఁడదెదినైరణఁగూరుటచేసదాముదా।
ప్తినలరియయ్యరుంధతిగఁదేజరిలుంబతినిన్వసిష్ఠుఁగం।
బొనరిచెనారపూరుషుఁడుపుణ్యభరంబునఁగాసుభార్యుఁడా॥ ౧౮॥

తే-గీ॥ వేయునేలబహిశ్ప్రాణమాయనకల। లలనయామెకతండ్లెల్లెయలరుజెప్ప।
పాటునెప్పాటునోర్తురబ్రంబటుంచు। నెంచెదరువారిఁగాంచినయెల్లవారు॥ ౧౯॥

ఆ-వె॥ గుణములెన్నియున్నఁగుదురునేసిరియది । భాగ్యలభ్యమెయగువచ్చుఁబోవుఁ।
గానఁగలిమిగొఱఁతగాఁజెప్పనగునైనఁ । గొఱఁతలేదుతనివిగొఱలుకతన॥ ౨౦॥

మ॥ అనపత్యత్వవిదూనమానసులునై యార్యోక్తమార్గంబులన్।
జననానావ్రతతీర్థసేవనములన్సత్కార్యముల్సేసిరం।
దునజన్మించెఫలస్వరూపుఁడనఁబుత్రుండుందదీయాన్వయా।
మ్మునకున్దీపమువోలెవారికిమహామోదాంకురంబౌనన న్॥ ౨౧॥

కం॥ ఐతిఁబిత్రృణవిముక్తుఁడ । నాతతభగవద్దయననియానందాబ్ధిన్।
బ్రీతిన్మునుంగుతెఱఁగున । నాతఁడునీళ్లాడెనింటియాల్నీళ్లాడన్॥ ౨౨॥

మ॥ ప్లవవర్షంబునఫాల్గునాదిఁదదియంబద్మాగ్రజుండశ్విని।
న్గవయన్భూజుఁడుగూడధర్మముననుండంగంగురుండైనిగుం।
భవసత్సౌమ్యుఁడుమీనశుక్రరవులొప్పన్సింహకేయాప్తవై।
ష్ణవగేహంబునరత్నమాననఁగజన్మంబొందెనొక్కండటన్॥ ౨౩॥

ఆ-వె॥ అట్లుపుట్టినట్టియాశిశువంతట । రత్నదాసుఁడనధరంబరంగె।
విష్ణుభక్తిచేతవెలయువీఁడయ్యెడుఁ । బుండరీకుఁడనుచుఁబొగడబుధులు॥ ౨౪॥

కం॥ పరనెఱుఁగుటచేజన్మాం । తరవృత్తముదోఁపనుత్తుధనానినువేడ్చున్।
బొరిఁజేఁపుచనులద్వైత । స్ఫురణనునద్వైతదుగ్ధమునుగనినగెడున్॥ ౨౫॥

కం॥ తనబింబంబిలనెల్లెడఁ । బొనరుంబొరిననఁగఁబొరలబొరగిలఁగదోఁ।
గనునేర్చెనుబశ్యంతిం । గనునాదదశకముననఁగఁగనుదశదిశలన్॥ ౨౬॥

కం॥ అఱచేతులుమోకాళులు । నఱకాళ్లలకొనలునేలనానఁగనాఱున్।
నెఱయఁగదోఁగాడెడువాఁ । డఱిముఱిఁబ్రాసాదనుమషడంఘ్రియనంగన్॥ ౨౭॥

కం॥ కుడియెడమచేతివ్రేళులఁ । గడుకొనిచీఁకెడునువాఁడుఘనసాంఖ్యసుధన్।
గుడుచుననవైఖరికిము । న్నడరినమధ్యమయెసంఖ్యయగుటదగుఁగదా॥ ౨౮॥

ఉ॥ మాటలచేతనేబ్రదుకమన్పఁగస్వాశ్రితులజ్జగంబునన్।
మేటిగనాటకోయకటమిక్కిలిచక్కఁగఁబల్కురొక్కవు।
న్మాటలుగాఁగమాటలనుముద్దులుగుల్కఁగఁదేనెలొల్కఁగాఁ।
బాటిగవాఁడురత్నమనబాల్యమునంబ్రజలిచ్చమెచ్చఁగన్॥ ౨౯॥

కం॥ వెన్నునకుయోగమాయవ । లెన్నల్వ్యగవానికినిజెలియలుగలిగెన।
చ్చిన్నదిపితామహిదిపే । ర్గన్నదిమనియున్ననప్లైకనకున్నెప్రథన్॥ ౩౦॥

ఆ-వె॥ అంచుఁగాంచువారలెంచఁదల్లియుఁదండ్రి । పెంచుచుండిరిదమబిడ్డలఁదమి।
నుబ్బుచబ్బకబ్బకబ్బినలిబ్బుల । నాఁగఁబ్రోచుచుండిరేగరెడలి॥ ౩౧॥

ఆ-వె॥ వచ్చుబడికిమించివెచ్చంబుగలుగుటఁ । గాసొకండుగానికలుగదచట।
నప్పునప్పులొప్పనొప్పఱనైనను । ధీరుఁడాతఁడెట్లొతీర్చుచుండు॥ ౩౨॥

తే-గీ॥ అత్తెఱంగునగృహకృత్యమమరుచుండఁ । గొడుకుదొడవులఁగొరంగఁదొడఁగెనపుడు।
మొదటికేమోసమఁటలాభమునకుగ్రుద్దు। లాటయనుమాటవాటమైపాటిలెనట॥ ౩౩॥

శా॥ స్వామిత్వంబు పొసంగెఁ బుత్రునకు దాస్యంబొందు నింకెట్లునే।
నీమేనన్గనువాఁడనాదివికిఁబోయెం దండ్రితద్రామయో।
రామాభర్తృవియోగదుఃఖమున ఘోరంబైన దైన్యంబుతో।
నేమాడ్కిం బ్రదుకంగఁగల్గె శిశురక్షేహన్మనంబో లెదుల్॥ ౩౪॥

ఉ॥ ఆపదమీఁద నాపదయె యన్పలుకంతటఁ గొన్ని నాళ్లకే।
చేపడెనయ్యయో యదియుఁ జెప్పక తప్పనెయామెతల్లిదల్।
బాపలఁ గొంచుగుంటిపురివావిరిఁ జేర్పఁగ నందుఁ గుందఁగాఁ।
బాపవుమిత్తియాఁడుఁబని పాపను బ్రింగెను వేఁగిలాగునన్॥ ౩౫॥

చ॥ పెనిమిటివోవ నేడ్చునలి వేణికిఁ గూఁతురు సావవంతయెం।
తనఁ జనుగోరి చుట్టుపయినబ్బినరోఁకటి పోటునందగుం।
దనయునిఁ దొట్టెనాగ్రహణి దల్లి మహోదధి సోటియోడయై।
మనెదనువీనితో నెయనిమానసమందుఁ దలంచియుండఁగన్॥ ౩౬॥

ఇం-వ॥ రక్షంతి పుణ్యానిపు - రాకృతాని । నాక్షోణిభాసిల్లెదు - నానుడిన్వాఁ।
దైక్షేమియోగంబును - నందెనొలిన్ । వీక్షింపఁ జంద్రుండన - వృద్ధిఁ బొందెన్॥

ఉ-వ॥ ఆనందగుం జంద్రుఁడ - టంచువానిన్ । జనించెఁగా వాఁడును - జంద్రవారం।
బునందు వృద్ధిందుని - పోల్కిఁగాఁడే । దినంబదే శుద్ధ - తృతీయయాఁగా॥ ౩౮॥

ఆ-వె॥ రత్నదాసుఁ బ్రోచె రాజాంబ సుతునిఁగా । శ్రీనివాసశర్మ చిన్నభార్య।
చిన్నయమ్మయామె చేపట్టువానికి । వడుగునయ్యెనైదవదగు నేఁట॥ ౩౯॥

తే-గీ॥ అతని పెదయాలు భీమమ్మయామె కన్న । కొడుకులకతండు తిరుమలగుండులకును।
జదువుఁ గఱపింపవినిక నిజాణతనముఁ । గాంచిమించెను వాఁడు శుకముని యనఁగ॥ ౪౦॥

కం॥ వామనచరిత్రఁ జదివెడు । వామనుఁడన రూపమున నువలెదు వీఁడా।
వామనుఁడు త్రివిక్రముఁడే । యామాడ్కి న్వెలయు ననుచు నవని సురులన్॥ ౪౧॥

సీ॥ శ్రీనివాసుఁడు నల్లెచిత్తంబునఁ దలంచియా రత్నదాసుని నరయుచుండఁ।
దద్భవులాత్మాఖ్యదగఁ గఠినాత్ములై కోయిలం గాకులు గూడియేచు।
కైవడి నా బాలుఁ గడుఁ గడు నొగిలింత్రు నిష్కారణారులై నెఱియ సూయఁ।
జేసి తల్లిఖితముల్ చించివై తురు దైన్యదాయక విధిలిఖితములననఁగ।
నంతె కాకవానిదౌ యోగ్యతను బాప । నోపరై రితూఁడు లౌన రనీరు।
గాకయెవ్వరేనిఁ గలరె పాపఁగ నంచ । పాలునీరు వేఱుపఱుచు శక్తి॥ ౪౨॥

తే-గీ॥ సవితృమండలవాసుఁడై నెవడుటను కొ । శ్రీనివాసుండు పడమటి సీమకేగె।
వేంకటాచలపతిఁ గాంచి విష్ణుభక్తి । రత్నదాసుండు ధ్రువుఁడన రాజిలెఁగడు॥ ౪౩॥

తే-గీ॥ చదువుఁ గర్ణామృతముఁ గృతిసరసులెన్న । గీతగోవిందమును దరంగిణిఁ బురంద।
రాది కృతకృతులనుఁ బాడునాడు వాఁడు । చూడఁ బ్రహ్లాదుఁడనఁ దోఁచు సుజనులకిల॥

కం॥ మంగళగిరి నరహరి నెపా । సంగంగొలిచెం ద్రయోదశంబగు నేఁటన్।
మంగళము ప్రణవమాటను । సంగతి నరులదిదౌ ఱంగిచ నెఁటవమునకున్॥ ౪౫॥

మ॥ కనెనంతంగములాంచితాంఘ్రినిఁదటిద్గౌరింగనచ్ఛారదేం।
దునిభాస్యన్ సృణిపాశభాసితకరన్మాలాంకురాంబంభజిం।
చెనుముగ్రుక్మిణియాశివంగొలిచియేశ్రీకృష్ణునింబొందెనం।
చునులోకుల్దగవాకొనన్వినివలత్సజ్ఞానలక్ష్మీహలన్॥ ౪౬॥

కం॥ ఆనందమాఖపంచమి । జానొందఁగమేనమామస్వానుతనొసఁగిక।
ల్యాణమునుజేసెవానికి । జానకిజనకుండురామచంద్రునికివలెన్॥ ౪౭॥

ఆ-వె॥ అంధ్రుగానిపరిణయంబువిద్యాచంద్రి । కకునుదర్శమంచుఁగాదుబ్రాహ్మ।
పరిణయంబనార్తవవరవధూయుక్తి । నగుటబ్రాహ్మపరిణయంబెమేలు॥ ౪౮॥

కం॥ లౌకికసాంగత్యంబే । ప్రాకటముగఁగలుగుకతనవాఁడౌనరించెన్।
లౌకికవిద్యాభ్యాసమె । రూకయయిననొదవదయ్యెరూఢిగదానన్॥ ౪౯॥

కం॥ అబ్బినదివ్యర్థమయ్యెను । అబ్బనియదిసార్థకంబమైననునేమా।
నబ్బదుగదయిటులుండం । బ్రబ్బెంబోయర్కవృక్షవర్షమననెగుల్॥ ౫౦॥

కం॥ దైవవశంబుగనంతట। జీవికదొంటిదటడిందెజీవనముమఱొం।
డావడినొదవమివాఁడెటు । త్రైవిక్రమవృత్తిఁగనెడుఁదగెవామనతన్॥ ౫౧॥

ఆ-వె॥ పొట్టివానికుండుఁబుట్టెడుబుద్ధుల । టంచుఁగాంచువారలనఁగనఁగ।
విన్నకన్నకృతులవిధమునగ్రంథాంత । రములఁజేయఁగోరురాదువిద్య॥ ౫౨॥

ఆ-వె॥ డబ్బులేకయున్ననబ్బబ్బవాఁడేమొ । ధనికులవిమనోరథములనొందు।
నందరానిపండ్లనాసించుగుజ్జనఁ । గొదవసిరికిఁగోర్కెకొదవునెకొద॥ ౫౩॥

శా॥ ముద్రాశాలఁబ్రతిష్ఠనేయఁదిపురుస్మ్యఖ్యస్వకగ్రంథము।
ల్ముద్రింపంగనుదంతపత్రికనుసమ్మోదమ్ముమైనందుధీ।
మద్రమ్యంబుగఁగోరుఁబ్రాభవయశోమాన్యత్వమర్థంబెలే।
దద్రవ్యేచ్ఛలభిత్తిచిత్రములుగాయంచెంచుచుండెన్మదిన్॥ ౫౪॥

తే-గీ॥ పృథ్విరిక్తునిమనసుకోరికలుపెద్ద । పెదవిఁగదలింపనగెదరుపెద్దలేని।
యనినిరుత్సాహుఁడైయుండనంబవాని । తోడనిట్లనెనమృతంబుదొలుకనీతి॥ ౫౫॥

కం॥ తలఁచినదాజన్మముననె । యలవడునొడఁగూడదేనియవునన్యజనిన్।
దలఁపెటులేనియుసఫలము । తలఁపేయొనఁగూడకున్నఁదత్ఫలమెటులౌ॥ ౫౬॥

ఆ-వె॥ తలఁపుగలుగఁగాదెతానువిశ్వామిత్రుఁ । డయ్యెబ్రాహ్మణుఁడుమహర్షియేల।
యిచ్ఛచేతఁగాదెయీవిశ్వమంతయుఁ । గలిగెబ్రహ్మవలనఁదలఁపుదగును॥ ౫౭॥

ఆ-వె॥ మోక్షమందునిచ్ఛమొనసినఁగదయవుఁ । దాముముక్షువనఁగధరణినరుఁడు।
పొసఁగుఁగోరనెల్లపురుషార్థములుస్వాశ । లేనివాఁడుపుడమిలేనివాఁడు॥ ౫౮॥

ఆ-వె॥ తలఁపువిత్తనంబుదాననుబూనికి । యానుబొలముదున్నటగునుగడఁక।
వానదైవికంబుఫలసిద్ధిభాగ్యాను । సారమనుచుబుద్ధిశాలిదలఁచు॥ ౫౯॥

కం॥ చిరజీవులఁదలఁపుముమఱి । వరమునినిమృకండుతనయువాసవముఖులౌ।
సురలనుమఱివిధివిధువిధు । ధరులఁబ్రయత్నమునఁబూనిక్కఁదగఁగనుసిద్ధిన్॥ ౬౦॥

క॥ సర్వముసాధ్యమసాధ్యం । బుర్వింగన నెదియు లేదు ప్రోత్సాహుఁడవై ।
నిర్వాహకుఁడవు గమ్మా । సర్వైశ్వర్యములఁ బడయఁ జాలుదువీవే॥ ౬౧॥

మంజుభాషిణీ వృత్తము.

అనియంబవల్క విని - యాతఁ డెంతయున్ । గనిసంతసంబుఁ దన - కాంక్షఁ దెల్పని।
కొనఁగూడుఁ గోర్కులని - యల్లసిల్లఁ గా। న నెమాతృకోక్తియెప్పు-డైన మాఱునే॥ ౬౨॥

ఆ-వె॥ రత్నదాసుఁ డంతరత్నాకరంబుతీ । రంబునందు రత్నరాశియనఁగఁ।
దగినయొక్క రాజధాని మౌక్తికపురిఁ । గనెఁ బ్రవాళవీథిఘనహరిమణి॥ ౬౩॥

సీ॥ కాలుగేల్గడుగక మైలగుడ్డలతో నెచలుపంగిఁ గుడుపులు జన్నిగట్టు।
లిట్టిపాటులకంటె నేముగామే మేలటంచు నాలవవారు మించమాల।
మాదిగలామీఁద నైదవవారమే మెక్కువయని నిక్క యొక్క బండ్లఁ।
బంచమాంగనలయి మించనోవిధవలై దువలు గాఁ గేరఁ జతుర్థసతుల।
స్త్రీపురుషజాతులుండెడు రెండె ప్రకృతి । పూరుషాకృతులని తెల్పుపోల్కి నరసి।
యంతమోహినియయ్యెఁ గాలాంతకుఁడు గ । పాలియయ్యెను రుల్వల్కువారెకలిని॥

క॥ ధనవిద్యలఁ బ్రబలలగుచు । వనితలు పురుషులను గెలిచి వఱలెడుతత్వ।
త్తనమును గని వెఱఁగందుచు । మనుగడ దన కెటులిటనని మదివగగదురన్॥ ౬౫॥

క॥ క్రమశిక్షవిద్య లేమిన్ । గ్రమాగతంబైన లేమిఁ గాను నెదవమిన్।
భ్రమదొట్టవాఁడు దిరిగెన్ । సమీరహతిఁ దూలుతృణము చాడ్పున నచటన్॥ ౬౬॥

ఆ-వె॥ ఐనఁ దల్లిశిక్షనలవడె గుణములు । చదువ వ్రాయనేమొ శక్తిగలిగెఁ।
గానమానహానికార్యంబులం జూర । కెట్లొ లేఖకత నెయెనసిమనుచు॥ ౬౭॥

శా॥ తద్ధీరోభవయన్న సూక్తిఁ గృపణత్వంబొంది విత్తాప్తికై।
ముద్ధీనుండయి యాఢ్యులం గొలువకెవ్వున్ ధీరతార్థాప్తిహృ।
త్సద్ధామంబున శ్రీనివాసునతనిన్ దాఁ జూడఁగా వేఁడి సం।
సిద్ధార్థప్రదు శ్రీనివాసునిఁ గనెన్ శ్రీబిల్వనాథున్ శివున్॥ ౬౮॥

సీ॥ అందుండి వెలువడి యారత్నదాసుండు కాంచిఁ గామాక్షినిఁ గాంచి రేయి।
నగ్గుడిలోఁ బండెనం దేఁడొ ముదిపాఱుఁ డయ్యనీవిఁకఁ బెంపునందెదప్డు।
నన్ను నావారినిఁ బన్నుగా నారయుమఱవవల్దని చని మఱుదినమునఁ।
బెరుగూరగాయలోగిరముఁ జల్దినిఁ బెట్టెఁ బేరునీకేదన బిల్వనాథుఁ।
డనియె నెందుందువనఁగ బిల్వాటవిననె । గ్రామము న్నెయనంగఁ దిర్వలమనియెను।
వృత్తియేమన భక్తసంపత్తియనియెఁ । దెరువిదేయని చూపి యదృశ్యుఁడయ్యె॥ ౬౯॥

సీ॥ అంతనెంతయు వింతనందినందియనంగ రత్నదాసుండు దిర్వలముఁ జూచెఁ।
దొలుదొల్తఁ దద్ప్రాంతమిలయెల్లఁ దాఁ దొల్లి చరియించిన స్థలంబు చాడ్పునఁ గనుఁ।
బదపడి మలలను బలుమఱు దావలగొని యెక్కనవి గాఁగఁ గనుఁ గొనియెడుఁ।
దరువాత నదిఁ జిరపరిచయమున్నట్లు నీవాయటంచును నీవఁ గాంచు।

నేటిపడమటిగట్టున నుత్తరముగ । నూరుగనుపట్టఁగందక మొప్పఁగోట।
యిద్దియెన్నఁడో మున్నదానెఱిఁగినట్టు । నున్నయట్టునుదలఁచుచునూహనేనె॥ ౭౦॥

సీ॥ లేదలంగముకోట మేదినినగపడదేఱుభ్రమింగెనెయంచు నెంచి నెమకు।
బురుజులొకటిరెండు పొడవడంగకయుండుఁదక్కిన వెందనిచక్కవెదకు।
గవనులేవేనియుఁగనఁబడవేమయ్యెబమ్మయైదవమోమువహానిఁగనెనె।
సిరికిరవనఁగను జెలువొందునగరెందువన్నెలఁ జెన్నొందువాడలేడ।
నిండ్లుదొడ్లయ్యెదొడ్లయ్యెనిండ్లుగాను । బండిబాటలుమాఱినట్లుండెడునని।
కాళయుక్త్యబ్దమాఘశుక్లద్వితీయ । రత్నచానుండుదానుదిర్వలముఁ జేరె॥ ౭౧॥

సీ॥ చేరియాతండువిచారించెబిల్వనాథుండనుముదిపాఱుఁడుండు నెచట।
నని లేఁడనియెఱింగెన పుడువల్లీశుఁడన్ శైవద్విజుఁడొకండు చనవుననె।
బిల్వనాథుండను వేలుపిచ్చటనుండునతఁడెనీకచ్చటనల్లెతోఁచి।
యుండునుదనుమధ్యయుండెడునిట దేవిమునితపంబొనరించెముక్తిజనకుఁ।
డబ్బయిటశివదర్శనమబ్బుముక్తి । యనుచుఁజూపెనుగోవెలనతనితోడఁ।
దండ్రిగాబిల్వనాథునిఁదల్లిగఁదను । మధ్యనారత్నచానుండుమానుగఁగనె॥ ౭౨॥

సీ॥ గుడిదనయిల్లనుకొనుచు నే వేళనుమెలఁగునచ్చటనె మెయ్మెయివలగొను।
నెఱఁగుఁబల్మఱుమఱియిరవొందఁగాఁ బారిజాతసుమంబులసరులుగూర్చి।
యిచ్చుబిల్వేశునికిచ్చమెచ్చఁగముత్తెములుపగడములునుగలయుదండ।
లనఁగనుశివశక్తిఘనయోగసూచకమనవాగ్రమూర్ధితననఁగఁగంజ।
పర్వతాభిముఖుండయిపరఁగుతండు । సోమసూత్రాభిముఖుఁడగుసుముఖుఁ జెండు।
శ్రీశ్వరాభిముఖుండగుభృంగినిఁబలుమాఱుదర్శించుబ్రమొక్కనమ్మాడిక్కఁగానె॥ ౭౩॥

సీ॥ తనజన్మనక్షత్రమునబిల్వపతికందుబ్రహ్మోత్సవంబుప్రారంభమగుట।
మఖఁదీర్థవారియుమానగుటసునాఁడు పున్నమయగుటనుబోల్చిచూచి।
తనకునుదత్క్షేత్రమునకుఁబ్రాక్సంబంధముండునదెట్టిదోయొగిఁదెలియఁగ।
వలయునంచెంచుచావాసరంబునరాత్రిసోమోపరాగంబుశుద్ధమోక్ష।
మునుగనుంగొనితనుముంచుకొనినమాయ । యిట్లువీడుస్వరూపంబెయెఱుఁగఁబడెడు।
జ్ఞానమునఁదనదికాలానుగంబయనుచు । మదిగ్రహించెసుభక్తినమస్కరించె॥ ౭౪॥

చ॥ కలఁగనెదేవళంబుననెకానెకతెంగనకొంగినీలవే।
ఱిలలితశారదేందుముఖినీరజలోచనఁగంజకుట్మలో।
జ్జ్వలకుచవల్కలాంశుకనుభస్మసితంబరివాదినీసుగీ।
తలసితబోధితైక్యశివధన్యనుమాన్యనుమానికన్యకన్॥ ౭౫॥

కం॥ స్ఫటికాక్షసరంబెదఁబ్రా । కటముగధరియించిమించెఁగన్యకయద్రిప్ర।
స్ఫుటమానిమానసావళి । నటమటమునఁగొనియెనెయననంతనెపొంతన్॥ ౭౬॥

ఉ॥ బంగరుచాయవాని నెలప్రాయమువాని జటాకిరీటుబా।
దింగడుసెప్పిపుష్పాడినిఁదీండ్రిలుతమ్మియనంగనెమ్మెగ।

మ్ముంగలవానిరేకులనుబోలినకన్నులవానిమూర్తికా।
శింగడునెప్పవానిశివలీలునినెక్కమునింగనుంగొనెన్॥ ౭౭॥

కం॥ కనియంతఁదనమనంబున । ననుకొనియెనురత్నదాసుఁడా రావీరల్।
మునిదంపతులెవరోయని । చనిచిత్పురికింగనెనటఁజంద్రాపీడున్॥ ౭౮॥

కం॥ కనియతఁడుంగాదంబరి । ఘనకావ్యముచదువుమిందుఁగనెదురహస్యం।
బనియిచ్చిదిచ్చుమొగము । య్యెనుదానన్ రత్నదాసుఁడెంచెనిటుమదిన్॥ ౭౯॥

తే-గీ॥ అదెమహాశ్వేతయాతండెయానుబుండ । రీకుఁడాచైత్రరథమిదే శ్రీవనమని।
తెలియనచ్ఛోదమిదెగౌరితీర్థమిశుఁ । డతఁడెబిల్వేశుఁడనియాత్మనరసియరసి॥ ౮౦॥

తే-గీ॥ బుద్ధియద్దిమహాశ్వేతపుండరీకుఁ । డేనెరమపుత్రకుఁడనుబిల్వేశుకరుణ।
నామహాశ్వేతనేపొందియాదుబుద్ధి । మంతుఁడనుశివభక్తిసన్మాన్యుఁడనని॥ ౮౧॥

కం॥ తనమనమునధ్యానించున్ । జనకునిఁగాబిల్వనాథుస్వప్నములందున్।
గనఁబడియతఁడోగిఁదెలుపం । గనేర్చివిద్యలనునతనిఁగనెజాగ్రత్తన్॥ ౮౨॥

పథ్యాకం॥ బహుముఖములవినుతించెన్ । మహేశుబిల్వేశ్వరుఁడనుమధ్యాంబన్।
మహితకృతులొప్పఁజెప్పెన్ । వహించెఁదాఁబుండరీకవరకీర్తిన్॥ ౮౩॥

కం॥ మునుశూద్రకవైశంపా । యనులయెదురమొరయఁదొడవులారమమింటం।
జనినట్లుమాతదివికిం । జనియెనుబంజరమువానెసతిసమకొనియెన్॥ ౮౪॥

తేఁటిబోటి॥ అత్తకంటెఁగోడలుత్తమురాలని - యందఱెంచ।
నయ్యరుంధతియొకొయననూయయోయని - యనజనులా।
రత్నదానుజాయరామరామయొయనఁ - బ్రస్తుతయై।
సుగణఖనియనంగసుమతియనందగె - సుముఖిపేర॥ ౮౫॥

తేఁటి॥ రత్నదాసునకాదిభార్యగనగుటకు - రహివహించి।
తప్పఁగోరికయొకటానచెప్పరాని - మెప్పుమూనెఁ।
జుప్పనాతియనంగనుసుముఖికయ్యె - సూడుగాఁగ।
సుముఖికింగానియదిగదాకుముఖియద్ది - కుముఖిపేర॥ ౮౬॥

తేఁటిబోటి॥ రత్నదానుఁడొక్కరాత్రిగలను - బ్రాంశువుడు।
ర్వాసుఁగాంచిమ్రొక్కభయముభక్తి - ప్రబ్బఁగడున్।
వినుతిసేసెనతఁడుప్రీతుఁడగుచు - వెలయుమయా।
భుక్తిముక్తిఁగనుటమూర్తికువలె - శక్తినసెన్॥ ౮౭॥

కం॥ మునిదుర్వాసునిదేశ । మ్మునసమ్మణిదానుడంతఁబోయియదృచ్ఛన్।
గనకాంబావ్యాఘ్రేశ్వరు । లనువ్యాఘ్రపురంబునఁగనిలలినుతియించెన్॥ ౮౮॥

సీ॥ విద్వత్సమయములవేచియుండుటమానెవిద్వద్వినుతుఁడైనవిబుధుఁడయ్యె।
వృత్తాంతమెరులచేవినుటయుఁదామానెవార్తాశిపత్రికాస్వామియయ్యె।
ముద్రాక్షరములనుమొగిఁగూర్చుటయుమానెముద్రాక్షరాధ్యక్షముఖ్యుఁడయ్యెఁ।
బ్రభులపజ్జనునిల్చిపనిచూచుటయుమానెఁబనివాండ్రుదనుఁగొల్వఁబ్రభువయయ్యెఁ।

దానమునుగోరుకోర్కులువినరసఫల । ములుగమాతృవరంబెంచెముదముఁగాంచె।
ధాన్యమఱఁగవణిగ్వృత్తిధర్మముఁగనె । రత్నదానుఁడుశివశంకరప్రసక్తి॥ ౮౯॥

సీ॥ శ్రీకాళహస్తిలోఁ జెలఁగెడుజ్ఞానాంబస్వప్నసందృష్టయైపాడఁ దాను।
గీతములనుగోరెఁబ్రీతినాతఁడొనర్చియర్పించెశ్రీకాళహస్తిపతియు।
రత్నదానునివత్సరమొకండుదనదండగుహుఁబోలెఁదగనుంచుకొనిప్రియమున।
బిల్వనాథక్షేత్రవిభవంబుఁదెల్పెనునెలకొల్పెరాజధానినివినుతుఁగ।
మహితనుజీవనమ్మునెమ్మదియుఁగుదుర । విహితవిబుధావళులతోడవెడలివాఁడు।
వెండియునుబిల్వవనికేగెఁబ్రీతిచేతఁ । దల్లిదండ్రులఁగొలువంగధర్మబుద్ధి॥ ౯౦॥

ఆ-వె॥ అరిగినీవయందునవగాహమొనరించి । దేవళమునుగాంచితెల్విఁగాంచి।
తిరిగిపుట్టమికయితిరిగిపుట్టినయట్లు । ఎలగొనియెనుమ్రొక్కినిలనుజాఁగి॥ ౯౧॥

మాలిని॥ కనుఁగొనెఁదనుమధ్యన్ - గౌరినిన్లోకమాతన్।
గనెజగదధినాథున్ - గాంతుశ్రీబిల్వనాథున్।
దనదురితమునెల్లన్ - దగ్ధముంజేయుమంచుం।
గనుమనుచునుసాష్టాం - గప్రణామంబునేసెన్॥ ౯౨॥

కం॥ పాపుఁడనుబాపకర్ముఁడఁ । బాపాత్ముఁడఁబాపభవుఁడఁబాపిష్ఠుఁడనా।
పాపములనెల్లఁబాపుము । కాపాడుముశివశివయనికావించెనతన్॥ ౯౩॥

ఉ॥ శంకరనాకునీవఱకుస్వప్నములందునుజిల్కుపల్కులన్।
బొంకముగాఁగనేర్పితివిపొందితిసాహితిగద్యపద్యముల్।
వంకరపాటలాటలనుబాటలెఁగానినుబుద్ధిగాననే।
వంకనుబోదుభేదమునఁబ్రబ్బునెభక్తినెముక్తియోశివా॥ ౯౪॥

ఏకావళి.

శ్రౌతస్మార్తాగమికములగుబఱు - సత్కృత్యములనుదగఁజలుపన్।
శాస్త్రనిషిద్ధాచారంబులఁగడుఁ - జెలువుదునేమనఁగలనింకన్।
తదుభయదోషప్రాయశ్చిత్తము - దగునీసంస్మృతియనుచెటులేన్।
శివశివయనుచేస్మరింతుననునెటు - చేనెదొశివశంకరశ్రీశా।
ననునేనెఱుఁగనునినునెటునెఱుఁగుదు - ననుకొందునునజ్ఞుఁడనేమో।
అందఱింద్రునినుసర్వజ్ఞుండని - యాత్మజ్ఞుఁడనునీవాత్మవుగా।
జ్ఞానమునాకిడుమిడవేనీకే - కలిగెదుసడిగదుఁగాంతువయా।
పొగడినఁదెగడినఁబొరయనుఖేదము - ముదమునెదేననుఁబ్రోవుదయన్।
ధ్యానింతునునినుస్మరియింతునునీ - యాఖ్యన్బాజింతునునిన్నున్।
తెలిసితిసగుణోపాసనగాదనఁ - దెలుపునిర్గుణార్చనముశివా॥ ౯౫॥

---

ఏకావళి॥ ప్రాసరహితముగఁబరఁగినరత్నా - వళియేకావళియానెటులేన్॥

### జ్ఞానవృత్తము.

అజ్ఞానముఁదొలఁగింపుమ - హమ్మతిఁబరమేశా।
సుజ్ఞానముఁగలిగింపుము - చొప్పడఁగను మేశా।
ప్రజ్ఞానముగదబ్రహ్మము - భక్తునికిడుమీశా।
విజ్ఞానముశివమీవని - వేఁడెదశిప్రశీశా॥ ౯౬॥

### రథోద్ధతావృత్తము.

ఆసదాసులగు - నట్టివారలే । దాసులెల్లరకుఁ - దారెయాదుర।
ద్దాసవృత్తిననుఁ - దార్కొనంగనీ । కోసదాశివవి - భూవరంబిదా॥ ౯౭॥

### తోటకవృత్తము.

అనివేఁడఁగశంకరుఁ - డట్లగునం । చనెరత్నమునీదుమ - హాచరితం।
బునెఱింగినదాస్యము - వోయెదునం । చనెఁగోర్కినిమించుమ - హార్థమిదా॥ ౯౮

### రత్నావళి.

దాంపత్యంబునుధర్మముసంతతి - ధర్మముశర్మముదైవికమై।
సొంపఱఁగల్గెదులేవడిసావులఁ - జొప్పడునెప్పమిదిట్టతనం।
బింపగునీతినుబోధముమానుష - మీశ్వరభక్తిజగద్గతివీ।
ఝింపఁగనానిటరత్నదాసకృతి - శ్రీకరమీయదిచెలఁగునిలన్॥ ౯౯॥

అమృతవాహిని॥ ఈరత్నదాససర్గంబు । నేరేనిచదువన్వినన్।
గూరంగలరభీష్టంబు । ల్వారలెల్లనుబెల్లుగన్॥ ౧౦౦॥

ఇది రత్నదాస సర్గము.

---

రత్నావళి॥ విలసిలురత్నావళియనుపద్యము - విద్వద్వంద్యంబయిప్రాసో।
జ్జ్వలమయిపాడఁగనెల్లరువినము - ప్పదిదినములనెలవలెనెలనా।
నిలలలివర్ధిలనూతనముగఁగవు - లెక్కువమక్కువఁగనఁగొనఁగాఁ।
జెలువుగముప్పదిమాత్రలఁబాదము - చెల్లవిరతిపదునేడింటన్॥

## రత్నగుప్తసర్గము.

శా॥ సారాచారగురుండు యోగకలనాచార్యుండు శైవాగమో
ద్ధారుం డాంగిరసప్రభూతుఁడు భరద్వాజుండు ప్రాసాదమం
త్రారాధ్యాద్యుఁడు మానిగణ్యుఁడు సుబ్రహ్మణ్యుండు పుణ్యుం డటన్
శ్రీరత్నేశ్వరు బిల్వనాథు శివుని న్సేవించి సంప్రీతుఁడై॥ ౧॥

కం॥ గీతామృతవర్షదుస । త్ఖ్యాతునతు న్రత్నదాసుఁ దాఁగని యనియెన్
ప్రీతుఁడయి రత్నగుప్తుని । రీతిఁ దన రెదీవు శివసమృద్ధి నటంచున్॥ ౨॥

చ॥ అనుటయు రత్నదాసుఁడు మహాత్మ యెవండల రత్నగుప్తుఁడా
ఘనుని చరిత్రముం జెప్పుమ గారవమారననంగ నాతఁడు
న్వినుమని చెప్పఁగం గడఁగె బిల్వపతి న్వినుతించి రత్నగు
ప్తుని చరితంబుఁ జిత్రముగ భూరివచోఽమృతవృష్టిఁ దుష్టిగన్॥ ౩॥

ఉ॥ సారతరంగిణీసుకృతసమ్మిళితాంచితగోమతీసరి
త్తీరవిరాజమానము సుధీనుత మొక్కపురంబు కుంభినీ
హారగనాయకం బనఁగ హర్మ్యగవాక్షమృగేక్షణాస్యనీ
హారకరాశయాగతఖగాప్తము భామతి నాఁగ భాసిలున్॥ ౪॥

మ॥ వినుతాత్మీయకులోచితార్జితమహావిత్తౌఘసంయుక్తుఁడై
ధనదుం డేయితఁ డంచు నెంచఁగ జనుల్ధాత్రీశమిత్రుండునై
ధనగుప్తుం డనువైశ్యుఁ డీశ్వరదయాధన్యుండు మాన్యుం డొకం
డెన లేకుం డెడు నందు నిందిరకుఁ దానిల్లై సముల్లాసుఁడై॥ ౫॥

సీ॥ కనుఁగాక మేల్కనికరితురగంబుల నెక్కండు వాకిట నెన్నియున్న
వినుఁగాక మంగళవినుతుల రానీఁడు తనతోడ నొకని నేననుచరునిని
జనుఁగాక తాఁ బాదచారియై స్యందనాందోళికారోహణతోషమెనయఁ
డనుఁగాక భక్తిమైహరినామముల్లనఁ బలుకం డెవరిఁ గన్నఁ దొలఁగుఁదానె
యిట్లు గోమతికనుదిన మేగియందు । స్నానసంధ్యాదికార్యముల్సలిపి పరిమి
తంపుదక్షిణలను క్షితిదైవతతతిఁ । దనిపి చనుదెంచు నింటికా ధార్మికుండు॥ ౬॥

శా॥ ఇక్కన్నెక్కొనియుండు నెల్లపుడు నూహించు న్సమార్జింపఁగా
రొక్కం బెవ్వరిఁ గన్న నవ్వ మొగమై మ్రొక్కున్నియుక్తస్థముల్
లెక్కల్దాఁ బరికించు వెండియునుదల్లేఖౌఘముల్దాఁచుఁగా
సొక్కండున్విడువండు వడ్డిన ధమర్ణోపాయముల్పాయఁగాన్॥ ౭॥

ఆ-వె॥ అందఱుందురతనికన్నియుఁగలవంచు । నైన లేవుగొన్నియరయనరయ
స్వాంతమందు నెందుఁ బరసతీరతి వంచ । నమున సత్యభాషణము నిజముగ॥ ౮॥

చ॥ జలధికిగంగభంగినిశచందమునన్నెఱచందమామకుం।
గలదలనెట్టికింగృహిణిగాంచనచంపకమాలికాకృతి।
న్నలవియెయెన్నఁగాసురభియంచునభిఖ్యవహించెసాధ్వియా।
చిలుకలకొల్కియార్యయఁటచిత్రమెసర్వగుణాఢ్యయాటయున్॥ ౯॥

సీ॥ అధిపాజ్ఞకునధీనయైమెలంగెడునెట్లొతత్ప్రార్థితయునగుఁదగననయము।
తళుకుబెళుకులఁజూడఁదానెఱుంగకయుండునెట్టులోనాధునినింద్రుఁజేయుఁ।
బలుకప్పుదొలఁగనవ్వకయుండునెటులొతాఁదనువుఁగాంతచకోరమునుమునుకొని।
యంటినఁగందెడునంగవల్లికతోడవల్లభులోఁగొనుబలిమియెట్లొ।
యెఱుఁగుఁగాకాకెయెటొయేరికెఱుఁగవచ్చు। నచ్చెలువచెల్వుదెల్వియునమితసంప।
దయనుదయితానురక్తియుఁదలఁపవాణి। యారయనవిధినిర్మించినట్లుతోఁచు॥ ౧౦॥

కం॥ కాంచనలకారకోటులఁ। గాంచినవాఁడయ్యునంతకంటెనధికగాఁ।
బంచలకారన్నాభర్యం। గాంచునతండామెమగనిఘననిధిఁగఁగనున్॥ ౧౧॥

కం॥ కలిగెనుగొమరుండొకరుం। డలనలకూబరుఁడనన్జయంతుఁడనంగా।
నలినరివుఁడనమరుండనఁ। దలిదండ్రులప్రేమచెప్పఁదరమేదరమే॥ ౧౨॥

ఉ॥ పేరిడెరత్నగుప్తుఁడనిబిడ్డనికిన్సకలోచితక్రియా।
వారమొనర్చెఁజేసెమఱిద్వాదశవత్సరమందువడ్గుఁబెం।
పారఁగనెల్లవిద్యలమహాఘనుఁజేసెనునూరులెన్నఁగా।
నారయువానిఁదానెతనకబ్బకయబ్బినలిబ్బికైవడిన్॥ ౧౩।

చ॥ తనకులవిద్యముఖ్యముగఁదద్దయునొద్దికనేర్పనేర్పత్రి।
ప్పెనుదనవీటమాటికినిబేర్మినిలాఁతిపురంబులన్నిలాఁ।
తినిఁదనయుంజితశ్రమునిఁదిన్నగఁబన్నుగఁజేసెవానిమీ।
ఆనుధనసంచయార్జనమునంగనొనర్చెనునేర్చెనాతఁడున్॥ ౧౪॥

కం॥ అంతటధనగుప్తుఁడుదన। కెంతోసంతోషమొదవనిల్లాలికినెం।
తెంతోతదగ్రజాత్మజఁ। జింతామణిఁగోడలినిఁగఁజేసికొనెఁదగన్॥ ౧౫॥

తే-గీ॥ పనులయెడబానిసగఁగర్జమునకుఁగడఁగు। నెడనుబ్రెగడగరూపునఁగడలికూఁతు।
రుగనుసైరణఁబుడమిగనెగడుకూర్మిఁ। దల్లిగనునెజ్జలంజెగఁదగునదియొగి॥ ౧౬॥

కం॥ అత్తదనమగనికేతగఁ। జిత్తమురంజిలఁగమెలఁగుఁజిన్నదికోడల్।
పొత్తుగమగనికిమామకు। నత్తకునటులగుటఁగోడలత్తనుమించెన్॥ ౧౭॥

ఆ-వె॥ అత్తలేనికోడలుత్తమురాలను। టల్లకోడలియెడనమరదయ్యెఁ।
గోడలుండనత్తగుణవంతురాలను। టల్లయత్తయందుఁజెల్లదయ్యె॥ ౧౮॥

కం॥ తలిదండ్రులాలుమేలుగ। నలరఁగనారోగ్యభాగ్యహర్షంబులున।
ట్లలవడనుమతియుశాస్త్రిము। గులవిద్యయుఁగూడరత్నగుప్తుఁడుకృతియై॥ ౧౯॥

సీ॥ జననీజనకగురుజనులనుగననిల్చునిల్చిపల్కెడుబత్తినివ్వటిలఁగ।
శ్రద్ధాళువైకర్మజాతంబునొనరించునొనరించికలలఁజింతనమొనర్చుఁ।

పెట్టినదే దేని బిఱబిఱ భుజియించు భుజియించి పిత్రాజ్ఞఁ బుచ్చుఁ బ్రొద్దు।
నలయక లెక్కలన్నింటిఁ బరికించుఁ బరికించి చేవ్రాలు పరఁగఁ జేయుఁ।
గినుక యెట్టిదొ యెఱుఁగండు క్రీడ నేని । బొంకఁడుం దఱఁదనవలె బుద్ధిఁ దలఁచు।
దాననిరతుఁడు దారుండు గానరత్న । గుప్తుఁ డత్తండ్రి నిన్నించె గురుతఁ గాంచె॥ ౨౦॥

చ॥ కసరక యర్థ మర్థులకు గారవ మారఁగ నిచ్చు నివ్వలన్।
వినువక సన్మృదూక్తులను బ్రీతులఁ జేయునువారి నేరి నే।
నసదుగ నెంచి మించఁడు మహాబలవంతుఁడునయ్యు నన్నిటన్!
ననియనిమానకూనుఁ బొరి నైరణసత్కృతి గాఁడె చూడఁగన్॥ ౨౧॥

చ॥ వినయసమంచితంబయిన విద్యయు గర్వయుతంబు గాని శ్రీ।
యును బరసుందరీవిముఖతోర్జితయావనము న్నకృత్రిమం।
బనఁదగు నందముం ద్రికరణైక్యకృతాంచిత కార్యముం జగ।
జ్జనవినుతాత్మవర్తనముఁ జక్కఁగ నెక్కొనియుండు నక్కడన్॥ ౨౨॥

చ॥ అలరుచునుండెఁ దండ్రియు నిజాత్మను నాత్మజు సత్ప్రవర్తనం।
బలవడఁ జూచు చింతయుఁ గృతార్థతఁ జెందితి నంచు నెంచుకొం।
చెలమినిఁ గొంత కాలమున కెన్నెను సన్నుతుఁ డేని దుష్టసం।
గలనితుఁడైన భ్రష్టుఁడగుఁ గావలుఁడై చెడు నంచు నంతటన్॥ ౨౩॥

చ॥ హరికథ గీత నృత్తముల నంచిత వాద్యముల న్మహామనో।
హరముగ విస్తరింతుమని యాపటుఁ బల్వురు చేరఁజొఁగిర।
త్తరుణుఁడు వారినెల్ల రముదంబునఁ బెల్లుగఁ దన్పుచుండె స।
త్కరణము లొప్పఁ జేయుచును గాంచె నుతిన్రసికప్రభుండనన్॥ ౨౪॥

ఉ॥ నాటకసత్ప్రదర్శకులు నల్వురఁ బల్వురు చేరి కూరిమిన్।
గాటముగాఁగ మూఁగిర రసికప్రవరుం బొనరించి రాటలన్।
మాటికి నాకిరాటు నటమాన్యుఁడతండయి నాకిరాటనన్।
బోటిగ నిచ్చుచుండె మణిభూషణవిత్తవరాంబరంబులన్॥ ౨౫॥

కం॥ ఆరత్నగుప్తుఁ డంతన । నారత సంగీతరక్తి నల్వురఁ బాడ।
న్నేరిచె నే చెవిపంచి । న్వారకొసఁగు గాయకనటవైణికతతికిన్॥ ౨౬॥

కం॥ అంగనల సంగతిం గొ । మ్ముంగలము నిదపము వపలిమున్నన్నట్లా।
బంగారువంటి కోమటి । సంగీతము చేత బేరసారములుడిగెన్॥ ౨౭॥

మ॥ ధనగుప్తుండు నిజాత్మసంభవుని వృత్తంబంతయుం జూచిచూ।
డనియట్లుండియుఁ గొన్నినాళ్లు సతితోడం జెప్పె నప్పాత్తిమే।
ద్దనరం గాఁదన మేనకోడలికి నత్తన్వీశిరోరత్నమా।
తనికిం దోఁపఁగ గేళికాగృహమునం దాఁ జూపి చిత్రాకృతుల్॥ ౨౮॥

ఉ॥ కంటివె ప్రాణనాథ మృగకాండము వ్యాధుని వేణునాదమున్।
వింటకువచ్చి చిక్కువల బిత్తరమందుచుఁ జూచుఁ ద్రాఁచ యో।

కంటకుబుఱ్ఱపాటవినిగ్రక్కునఁబుట్టదొఱంగియాడెడుం।
బంటవలంతిగానమగువాగురమర్త్యులకంచునెంచెదన్॥ ౨౯॥

కం॥ నావినినాయకుఁడెంతయు । భావజ్ఞుండగుటఁదనదుప్రాజ్ఞతమెఱయన్।
దేవీసంగీతాజ్ఞులు । భావింపమృగాహులంతభవ్యులెయనియెన్॥ ౩౦।

చ॥ పదపడితల్లియక్కొడుకుఁబజ్జనుబుజ్జగమొప్పఁజేర్చియా।
యదనునవేర్చినాఁడవాకొయక్కఱపాలినగానమేలరా।
వదలినమేలునీకునవెవాఁడుఱకమ్మరొపాలుగ్రోలినన్।
విదితములౌఁజవుల్వేలయువేద్యములేయవివానినానమిన్॥ ౩౧॥

ఉ॥ నావుడుఁదండ్రియిట్లనియెనాయననాయెడనీకుగౌరవ।
శ్రీవిలసిల్లునేనివిడుచెచ్చెరమచ్చికగానమందిదాఁ।
జూవెయనర్థకంబాగినిజొప్పడుదుర్వ్యయమంతనంతయుం।
బోవుధనంబునీవుచెడిపోదువటంచుఁదలంచెదన్మదిన్॥ ౩౨॥

కం॥ సంగీతమునరునాదిభు । జంగోత్సంగునిఁగఁదుదిభుజంగుఁగఁజేయున్।
ముంగలఁబొంగించుందుదఁ । గ్రుంగించుఁబయోముఖవిషకుంభంబుగదా॥ ౩౩॥

ఆ-వె॥ అనుచుఁజెప్పఁదండ్రికల్లనఁగొడుకిట్టు । లనెభుజంగతాప్తిపానరదేని।
గానమాననఘముగాయనజనకుండు । పుట్టఁజేయిపెట్టునట్టులనియె॥ ౩౪॥

తే-గీ॥ నారదాదులుగానవిశారదులయి । బాజుఁగుల్లైరోటుమాటలుపాదలెనాను।
గూనఁబెంచినగండాయెఁగూటికుండ । కమ్యోఁజేటంచుఁగొమరుఁడయ్యుయ్యయనఁగ॥

తే-గీ॥ తండ్రికొడుకులతగవునుదానుదీర్చె । సురభిమాధ్యస్థమొనరించిశూలజోలి।
లేకనేరంగగానంబుజోకమీఱ । వానినేమియునకుండవలనెఱింగి॥ ౩౬॥

ఉ॥ అంతటరత్నగుప్తుఁడునిరంతరగానకలావినోదమం।
దెంతయువేడ్కఁగాంచుటరహిన్వినితిన్నఁగఁజేరవచ్చిర।
త్యంతవిలాసపేశలనయప్రణయోక్తిజితార్యకోటుల।
శ్రాంతనటీవిటీసురతసంఘటనాటులుచేటులేవునన్॥ ౩౭॥

చ॥ అనెనొకరుండుధర్మఫలమారయఁగంబురుపార్థమర్థమే।
ఘనమనితత్ఫలంబగుటఁగామవుమర్థమెముఖ్యమంచొకం।
డనియెమఱొక్కఁడెంచెఁగనన్నాత్మసుఖంబెపరార్థమంచితం।
బనిమఱియొక్కరుండనియెనంతయుభాగ్యవశంబటంచొగిన్॥ ౩౮॥

సీ॥ దేనలీనాత్మఁడైతెలియఁడహమ్మనియానందమదియెబ్రహ్మమనెనొకఁడు।
గానంబుననుగాకకలుగదువేఱొండుపాయంబుననటంచుఁబలికెనొకఁడు।
పరికింపఁగానెల్లవారికబ్బునెయదిచెలువలసొమ్మనిచెప్పెనొకఁడు।
వారలందఱకునువలనొప్పఁగల్గునేయంగనకెవతెకోయనియెనొకఁడు।
బాలమేలనెఁబాడఁగాఁబోలనొకఁడు । తరుణిగాత్రంబునకునెనఁదవిలియొకఁడు।
ప్రౌఢజంత్రమునకునెఁబ్రౌఢినొకఁడు । వనితయదిదంటయన్నింటననియెనొకఁడు॥

కం॥ అనవుడునురత్నగుప్తుం । డనుమోదముమీఱనడిగెనదియెవతెయటం।
చనెనొకఁడుపులుఁగువలఁదగి । లినవనిమదిఁదలఁచినెచ్చెలీవినుమనుచున్॥ ౪౦॥

ఉ॥ రామనురూపసంపదభిరామనికామకలాకలాపస।
ద్ధామనుగీతలాస్యగుణతర్పితభీమవిపంచికాంచితో।
ద్దామసదాదృతోత్కీర్తితతిదామనుమాస్త్రినిలేమయేమొనా।
హేమయనంగఁబణ్యసతియిప్పురినొర్తువసించుగణ్యయై॥ ౪౧।

కం॥ అనవినిమఱియొకఁడాహా । ఘనురాలదిగణికయెసురకాంతారత్నం।
బనఁజనుఁదద్దర్శనమున । ననిమిషులైరమరులనుచునాల్కెఁదలఁచెదన్॥ ౪౨॥

చ॥ అదియవునిత్యయౌవనశుభాంగిబినుంగదియంగివృద్ధనేన్।
త్రిదశునెనర్చఁగాంచనెనరించునురేంద్రమునిఁగాఁగఁబల్కెఁబా।
పదారగఁజేయునాటమఱిపాటనువీణియమీఱనేనిధా।
తదయితయౌనుగన్నసిరితాఁబరువంబుననార్యచూడుమా॥ ౪౩॥

చ॥ అనననెనొక్కఁడుక్కననహాయహహాయదియోపయోధిమం।
థనజనితామృతాహరణదర్పితదైత్యవిమోహనార్థసం।
జనితసుధాప్రదానకృతసర్వసుపర్వసుపర్వపార్వతీ।
ప్రణుతయయౌనుగావుననెభావభవారినిఁజేయుశ్రీయుతున్॥ ౪౪॥

కం॥ నారత్నగుప్తుఁడాదట । ధీరతమీఱంగఁబలికెదిగులొందఁగవా।
రీరీతిన్వారాంగన । మీరెంచుటఁగాంచనాకుమీపొందగునే॥ ౪౫॥

సీ॥ వసుతృణాశనునెల్లవారితోఁగ్రీడించుఁబశువుగాదేచూడఁబణ్యసుదతి।
వావిదప్పిరమించువలనెప్పవలపించుబలుపిశాచముగాదెవారనారి।
మంత్రతంత్రంబులమతిఁబాపురుజఁజూపుఁగ్రూరరాక్షసికాదెరోవెలంది।
యిల్లాండ్రనెగిలించునేమఱఁద్రుంగించుఁబెనుమిత్తియేకాదెవెలవెలఁదుక।
జాతిగౌరవాశసర్వమంగళముమ । ర్యాదలేదుశూన్యమాకృతజ్ఞ।
తయనదయయొనున్నదగునెధార్మికునకు । నాటవెలఁదిఁగొలఁపనఘమగుహార॥ ౪౬॥

కం॥ అనుడునుగుంతెనకాఁడొకఁ । డనియెనుగడుకొనిదిటవునతిచతురతతో।
గొనమరయకదోసంబే । మునుకొనిపలుకంగఁదగునెబుద్ధిఁదలఁపుమా॥ ౪౭॥

సీ॥ సతులపాతివ్రత్యసంరక్షణార్థమైకల్పింపఁబడినారుగారెవారు।
శ్రీకృష్ణకాంతలన్ శ్రేష్ఠతఁగన్నారుగారెయందఱుకుపకారిణులుగ।
దేవాలయములలోదేవదాసులులేరెబోటుఁగులకేద్దేవభజనఁగఱప।
దేవలోకమునందుదివ్యాంగనలులేరెరంభాదులుంబుణ్యసంచరణలు।
చూడనిత్యసుమంగలుల్సుఖదలఖిల । కలలఁగుశలలుభోగార్హలెలమినెల్ల।
వారికగుదురుభోగినుల్వారుగానఁ । బుణ్యసతులన్ననవుదురుపణ్యసతులె॥ ౪౮॥

ఉ॥ నావుడురత్నగుప్తుఁడుమనంబుననెట్లుఘటిల్లునక్కటా।
యీవఱకేసతీవ్రతుఁడనింకిటువారసతీరతుండనై।

యేవిధిదుర్యశంబునువహింతునుమానుదునన్నగానవి।
ద్యావిభవంబుగల్గదుగదాయనియెంచెవిలోలదోలనాన్॥ ౪౯॥

తే-గీ॥ హేమకుందగురత్నంబు హేమరత్న। మునకుఁదద్యోగమేగుణముననుహార।
మగునుమదనునికనెనొకండంతనొకఁడి । తండుహేమాశ్రయుండనేఁదగఁజతురత॥

మ॥ అదిరారాదిటకేగరాదటకునేనయ్యింతిమేల్బంతినై।
ట్టొఱవుంగాంచుటనాకునేకరణినానొక్కండుచక్కంగనం।
గఁదవుంగోవెలకేగబాగిపుడువేడ్కంజూడ్కికిన్విందుగం।
బాదమేయామనిపండుగుంగనననెంబొల్పొందియానెట్టియున్॥ ౫౧॥

ఉ॥ పంపెశివార్చనార్థముగభక్తినినిష్కసహస్రమాగుడిం।
బెంపెసలారనుత్సవముపేర్మినినాఁటికెధర్మకర్తకున్।
సొంపుగగోమతిన్మనిఁగిసూక్ష్మదుకూలములన్ధరించిక।
ట్టింపుగబొట్టుఁబెట్టుకొనియీశ్వరులన్భజియించిపిమ్మటన్॥ ౫౨॥

కం॥ తనయనుఁగులతోడంగుడి । చెనుగుడిదిప్రసాదమిద్దిశివసేవఫలం।
బెననెనుబగటికినిటులిం । కనుమేల్రేయాననిచెలికాండ్రాడంగన్॥ ౫౩॥

ఉ॥ ప్రీతిగమెక్కుగ్రక్కుననువెల్లనిమేల్సరిగంచువల్వలన్।
బ్రాఁతిగఁదాల్చిగందమొనరంగనుబూసియుఁబూనిసొమ్ములన్।
జేతమురంజిలంగసుమశేఖరుఁడైతిలకంబుదిద్దియుం।
జేతవిడెంబుఁగైకొనియుఁజిత్తజుఁడీతఁడనంగవెల్వడెన్॥ ౫౪॥

చ॥ కనుఁగొనెరత్నగుప్తుఁడటఁగాంతలతాంతనితాంతవాసనా।
వనవనమందునుత్పలినిపజ్జనుజంద్రికఁజంద్రకాంతశో।
భనుజెలువొందుసౌధమునభాసిలుశ్రీశివులన్భజించెస।
ద్ఘనతవహించెఁదత్క్షణమకాంచెనుహేమఁదటిత్ప్రభన్శుభన్॥ ౫౫॥

కం॥ అదిహేమరత్నగుప్తుని । మదినెఱుఁగుటనతనికిఁదనమణిమయభూషల్।
విదితములగుటకొమనమిఁకఁ । గదియుదమిటులనితెలుపనొకనికేల్మోడ్చెన్॥ ౫౬॥

చ॥ గవినెనఁదీసితంత్రులఁదగంగనుమీటిబిగించిమేళగిం।
చివితతతానరాగములఁజెల్వుపుపల్లవులంబదంబులం।
బ్రవిమలరీతిదేశ్యగతిరంజిలసాహితులున్స్వరావళుల్।
వివిధవిచిత్రవైఖరులవీణనుబాడెనభేదసిద్ధిగాన్॥ ౫౭॥

శివవృత్తము॥ వన్నెఁగన్నవాఁడ। వున్నవాఁడవీడ। నిన్నునెన్నుచున్న। నన్నునేలుశ్రీశ॥

శంకరవృత్తము॥ శంకరశివశంకరశివ - శంకరయనరే।
శంకరిశివశంకరిశివ - శంకరియనరే।
పంకములఱుఁబుణ్యములుశి - వంకరములుగాఁ।
బొంకములగుమీకెపుడును - బొంకముకనఁగా॥ ౫౮॥

శివశంకర వృత్తము॥ శివశంకరశివశంకర - శివశంకరయనరే।
శివశంకరిశివశంకరి - శివశంకరియనరే।
శివుఁడాత్మగశివబుద్ధిఁ - జెలువొందఁగఁగనరే।
శివుభక్తినిభజియింపుఁడు - స్థిరసౌఖ్యముఁగనరే॥ ౬౦॥

దేవవృత్తము॥ కావలెమాకావలెమా - కావలివీవీశా।
కావవలెన్ బ్రోవవలెన్ - గామముఁగామేశా।
నీవలెఁదానీవెవఁడా - నీవిడుశ్రీశ్రీశా।
దేవమహాదేవమహా - దేవమహాదేవా॥ ౬౧॥

దేవజాతి॥ కావవెనీవెందఱినో - గరళగళాశంభూ।
భావింతురు సేవింతురు - భక్తులకిడుశుభముల్।
నీవుసదాశివుఁడవుగద - నీనతులుసశివులే।
కావలయునుగదశంకర - కరుణింపుమునన్నున్॥ ౬౨॥

మనోహరవృత్తము॥ దేవదేవశర్వసర్వ - దేవసేవితా।
సేవసేయుచుందునిందు - శిష్టభావితా।
కావవయ్యనన్నుమున్ను - కాలకంధరా।
సేవకుల్భజింతురింత - శ్రీదశంకరా॥ ౬౩॥

మనోహరజాతి॥ సర్వమంగళాన్వితాంగ - చంద్రశేఖరా।
సర్వమంగళంబులొసఁగు - సదయశంకరా।
నేర్వఁగొలువనెరులఁగోర - నిన్నెకొల్తురా।
శర్వనన్నుఁబ్రోవనీవ - చాలెదీశ్వరా॥ ౬౪॥

సీ॥ ముందుగోపురతత్త్వమునుబొరిఁబరికించిప్రాకారతత్త్వంబుఁబదపడికని।
ముఖమండపముతత్త్వమునుగాంచియంతరాళాఖ్యమండపతత్త్వమవధరించి।
గర్భాలయమువిరెక్కలతల్పులెడలించికుంచెకోలనులోనిగుప్తలింగ।
మరసిగంగావారినభిషేకమొనరింపనానందమబ్బుబ్రహ్మంబదెయవు।
నానుగాయభిషేకప్రియశ్శివయను । యతఁడుసద్యఃఫలదుఁడననడరుఁగాదె।
చేయుఁడీరలులింగాభిషేకమొప్ప । సచ్చిదానందమయులుగాఁజాలుదురిల॥ ౬౫॥

చ॥ పరఁగెడుబ్రహ్మపీఠముగఁబైనలవిష్ణువుపానవట్టమా।
శిరసుగలింగమూర్తిగనుశ్రీగళుఁడొప్పశివుండెయుండుఁడీ।
యరయఁద్రిమూర్తిరూపముగనంచితమాశివలింగమెద్దియో।
పరమరహస్యతత్త్వమిదిభావమునంబరికింపుఁడింపుగన్॥ ౬౬॥

మ॥ హరిలోఁజొచ్చిస్వయంభువాదటఁగనన్ స్వచ్ఛాంగునిన్ రుద్రునా।
హరియాశుంగనునీలలోహితునతండారుద్రుఁడొక్కండగున్।
బరుఁడీశానుఁడుబ్రహ్మపంచకముతత్త్వంబౌనుబంచాత్మకం।
బరయుండీరుసదాశివాత్మకతబ్రహ్మానందమేబ్రహ్మమా॥ ౬౭॥

మందాక్రాంత॥ ఎంచుండయ్యెల్ హితమతులరై - యీర్ష్యలానాదబిందుల్।
పంచబ్రహ్మాసననుగనుఁడీ - పంచభూమంచభూతుల్।
గాంచంగాంచన్ లలితయదియోఁ - గాపరాశక్తియుక్తిన్।
గాంచుండానందమునుశివతన్ - గందుకామేశులీరల్॥ ౬౮॥

* మంజరి॥ శివయేయరయఁగ-స్త్రీరత్నమగున్ । బావడన్ శివుఁడే-పుంరత్నమగున్।
శివయోగమగున్-స్త్రీపుంయుక్తిన్ । శివమదియాతన్-శివసంసక్తిన్॥ ౬౯॥

† మణిమంజరి॥ అంగజవిజయుని-కంజలియిడరే । మంగళకృతిమణి-మంజరిఁగొనరే।
అంగనలారా-హర్షదమనరే । పుంగవులారా-పొలుపునుగనరే॥ ౭౦॥

ఆ-వె॥ అనుచుఁబాటకత్తెయట్లుపాటముగింప । వినుచునున్నయెల్లజనులలరిరి।
ముడిచిమల్లెదండవిడిచినన్వలపును । విడువకుండెడితలవెంట్రుకలన॥ ౭౧॥

కం॥ గానమునఁగొయ్యలిగురిడు । సూనఫలములీనురాలుసొరిదిద్రవించున్।
నానిజముఁగంటిమిటనీ । మానినివాయింపవీణమననుగరఁగుటన్॥ ౭౨॥

కం॥ పరివాదినియీసతితో । సరియగుడునటంచుమ్రోనిస్వరములనేవ।
ర్ణరుచిఁగనలేకమునుఁగును । బరివాదముఁగనియెఁగానఁబరివాదినియో॥ ౭౩॥

కం॥ ఘనగానామృతవృష్టిన్ । మనియుండనెశివులఁగాఁగమనలంజేసెన్।
వనితయిదియధరసుధనే । ఘనునిఁబరబ్రహ్మముగనుగావించునొకో॥ ౭౪॥

కం॥ దీనికిఁబ్రతిఫలముగమన । మీనేర్తుమెయీఁగిదీనినెంచుటెయంచున్।
వేనోళ్లంబొగడుచుహా । మానాయకరత్నయుతగమనుమనఁగజనుల్॥ ౭౫॥

తరళ॥ తరళలోచనహేమగానసుధారసోజ్జ్వలహారమున్।
దరళయుక్తముగానిజాఖ్యనుతంబుఁజేసియొసంగుటన్।
దరళమానసుఁడైయతండుముదంబుమాళినిమీఱఁగాఁ।
దరళయుక్స్రజమీయనెంచెనుదానికుద్దియెయెద్దియేన్॥ ౭౬॥

తే-గీ॥ రత్నగుప్తుఁడుదననవరత్నహార । ముఱుతఁదవిలించెహేమకునదియుఁదనదు।
పుష్పహారముమెడనేసెఁబొసఁగనతని । కట్టులయ్యిరుపురమరుఁడంటఁగట్టె॥ ౭౭॥

ఉత్సాహ॥ అంతనెంతయుందమింద - దాప్తమిథునమప్పడే।
కాంతమానిశాంతమునను - గలసిమెలసెనర్మిలిన్।
గొంతలోనిశాంతమనుచుఁ - గోడిగూసెనయ్యయో।
వంతయంతకంతకెసఁగ - వారలరిగిరిండ్లకున్॥ ౭౮॥

కం॥ తరువాతరత్నగుప్తుఁడు । వెరవారఁగఁబలుమఱిగివేశ్యవసతికిన్।
బోరిఁదనవయసునువసువును । శరధికివృష్టివలెనొసఁగిజొనఱుచుండెన్॥ ౭౯॥

---

* మంజరి॥ ప్రాసముతుదలం-బాదద్వయినే । భాసిలుమంజరి-బ్రహ్మవిరతినే।
† మణిమంజరి॥ ప్రాసముతుదనలు-పాదములందున్ । భాసురమణిమం-జరికళలాందున్।

ఉ॥ ఆమణిగుప్తుఁడొక్కతఱినాత్మగృహంబునఁబండియుండెదు।
ష్టామయుఁడైనయట్లయవుడాతనినాతిపొసంగఁబల్కెఁజెం।
తామణినేనుగల్గనిటుతామ్యతనెందఁగనేలనీకిటు।
న్నీమదికేదియింపదియనేనొనరించెదనన్ననాతఁడున్॥ ౭౦॥

సీ॥ ఆలివినవరత్నహారముల్హరియించిలంజెరంజిలఁగనలంకరించె।
నిల్లాలివంకీలనల్లనగ్రహియించిరోయాలిఁగై నేసిప్రోదిఁగాంచెఁ।
బెండ్లాముకడియముల్ప్రియమునఁగికురించివెలవెలఁదుకకిచ్చివేడ్కనించె।
రాణివాకర్ణశిరఃపరిష్క్రియలెత్తికొనిపోయియాటకత్తెనలరించె।
నింటిదానివిమేల్వల్వలెల్లఁదస్క । రించిభోగముదానికర్పించిమించె।
సతికిసొమ్మేలయనియొకొసంగ్రహించి । నగరమండనమేననేనగలనుంచె॥ ౭౧॥

చ॥ సురభియుఁబుత్రునందుఁగలసొంపునఁనాత్మవిభూషణంబులం।
బొదిఁబొరినిచ్చెనచ్చెదుగుపోకడఁబెట్టెనుబెట్టిదంబుగం।
దురితమునాకవీఁకనలతొయ్యలికొయ్యననంతకంతకా।
దరభరుఁడైబొజుంగునిజధర్మమునెన్నునెమిఁదెఱుంగునే॥ ౭౨॥

మ॥ ధనగుప్తుండదియంతయుందెలిసిసంతాపంబునుంబొందితా।
ననియెంబెండ్లముతోడనోసిసురభీయాత్మాఖ్యసందర్గబు।
ద్ధినిగన్నావటుగానసూనునినియుక్తింగాయకునైవ్వశికుం।
జనవెచ్చంగనొనర్చికూర్చితివినిన్శ్లాఘింపఁగాశక్యమే॥ ౭౩॥

సీ॥ కోడలినగలెల్లఁగొల్లవోవుటఁజూడనుల్లంబెరియకున్నెపల్లవోష్ఠి।
సొమ్ములునీవన్నిచూఱవోవుటెఱుంగమదివగంగనకున్నెమందయాన।
దీనారకోటులెన్నొనావిదొడ్డవోవుటనెన్నఁగలఁగదెబుద్ధిబోటి।
దుష్టవార్ధుషికులకిష్టమైనట్లులేఖ్యములిచ్చుటెంచదుఃఖముగదచెలి।
పోయినదియెల్లఁబోనిమ్ము పుత్రుఁడైన । సముచితధనార్జనముననేశక్తిఁగన్నఁ।
జాలుననుకొందమన్ననుసత్యహీనుఁ । డయ్యెఁగామకతనుగానహానినెకను॥ ౭౪॥

కం॥ కామమునసత్యమకొడున్ । గోమఱసత్యంబుగురుతకుందుపడియెడున్।
భూమింగౌరవమఱనరుఁ । డేమాడ్కింగాఁడుధనికుఁడిదినిజమువిదా॥ ౭౫॥

కం॥ ధనమున్నసర్వసౌఖ్యము । లెనయఁగలుగునదియలేమినెల్లసెలుగువొ।
ధనవంతుఁడఖిలనుతుఁడగు । ధనహీనుఁడుమృతసముఁడనితలపంబడెడున్॥ ౭౬॥

కం॥ ధనమగునుబహిఃప్రాణము । మనుజునకదిలేనివాఁడుమనువాఁడానే।
ధనమంతఃప్రాణాధిక । మనఁజనుఁగావలిగదనరుఁడాధనమునకున్॥ ౭౭॥

కం॥ మోక్షమునకుజ్ఞానమువలె । నీక్షితికిధనంబుమూలమింతయెఱ్ఱత్వ।
ధ్యక్షతకునుగనుకనుధన । మాక్షేమంకరమిహపరహర్షదమరయన్॥ ౭౮॥

ఆ-వె॥ దుర్లభంబుధనముదొడఁగిసంపాదింప । వలయునార్జితమునువెలయఁజేయ।
వలయునట్లుగాకవ్యర్థవ్యయమొనర్చి । బీదయైననరుఁడువెడఁగుగాఁడె॥ ౭౯॥

తే-గీ॥ బుద్ధిహీనుండువ్యర్థుండుపుట్టుకంటెఁ । బుట్టకుండుటమేలగుఁబుట్టెనేని।
గిట్టుటయుఁగొంతమేలగుగిట్టకుంట । యహహాసర్వంసహకుదుస్సహంబగుఁగద॥ ౯౦॥

తే-గీ॥ తల్లిదండ్రులకిల్లాలికెల్లబందు । గులకులోకంబునకుఁదనగుణగణమున।
హితముసేయనివాఁడుగీడెంచువాఁడు । నుండెనేమిభూమండలిమండెనేమి॥ ౯౧॥

కం॥ అనిపతితనతనయుఁడువిన । ననయమునెగులొగినెగడఁగనాడుటయునుద।
ద్యునితామణినాథునితో । వినయముభయమునువినీతివెలయనిటులనెన్॥ ౯౨॥

కం॥ అన్నియునెఱిఁగినమగలకు । నన్నులుదెలుపఁగవలఁతులెయ్యైననుమీకున్।
విన్నపమొకింతఁజేసెదఁ । బన్నుగనాలింపవలయుభవ్యముగాఁగన్॥ ౯౩॥

కం॥ విడిముడిముఖ్యమయైన । న్విడిముడికంటెనునధికముపెండ్లామెయగుం।
గొడుకంతకన్నమిన్నవు । నడరంగానీషణత్రయంబుననఘా॥ ౯౪॥

కం॥ నూతులునూఱిటికంటెను । ఖ్యాతిగనొకబావిమేలుగదతచ్ఛతక।
వ్రాతంబుకంటెఁగ్రతువొకఁ । డాతత్క్రతుశతముకంటెనాత్మజుఁడుసుఁడీ॥ ౯౫॥

కం॥ ధనమెల్లవ్యాపృతులకున్ । ఘనఫలమగుధనఫలమగుఁగాంతాయోగం।
బెనయంగఁదత్ఫలముగద । తనయుఁడహాపీడనాడఁదగునేకొడుకున్॥ ౯౬॥

కం॥ ధనమున్నలేకయున్నం । బనివడియార్జింపవచ్చుబహుభంగులభా।
ర్యనుబలుమఱొందఁగావ । చ్చునుగాకెటులెనయివచ్చునుతునటులకటా॥ ౯౭॥

కం॥ పుత్రశ్చపున్నామ్నోనర । కాత్త్రాయతయితియటంచుఘనులంద్రుగదా।
పుత్రునినంగజునాత్మజు । నీత్రైలోక్యంబునందునెవఁడుత్యజించున్॥ ౯౮॥

కం॥ శాస్త్రిపుపుత్రస్యగతి । ర్నాస్తీయనెనభార్యనధనునప్లైన్నెనెయో।
యాస్తికమణికనసంస్మృతి । కుస్తుభమునకౌనునావకొడుకెనిజముగన్॥ ౯౯॥

కం॥ కొమరుఁడుపరజన్మంబని । కొమరారంగోవిదులనుకొందురుప్రజయా।
హిమనుష్యగ్నిపూర్ణోయని । సుమహితముగశ్రుతివలికెడుఁజూడుదయానుతున్॥

కం॥ మీకుంబిడ్డలుగలరా । మీకెందఱుబిడ్డలనుచుమేలడుగుజనుల్।
వాకొందురుగాకెందఱు । మీకాండ్రెంతధనమనుచుమేలడిగెదరే॥ ౧౦౧॥

కం॥ కందువులులేమిమనమా । కందువనెన్నోవ్రతములఁగావింపమెకాం।
చందత్ఫలముగదాయీ । కందుఁడుకందఁగశపింపఁగనుదగునెయయో॥ ౧౦౨॥

కం॥ వాగాయత్తంబాఁగద । బాగోగంచెంచకుఱికపగతుంబోలెన్।
లోఁగకతనయుశపించెద । వాగడమాఁగాదెవీనినవుఁదవఁబ్రోవన్॥ ౧౦౩॥

కం॥ శరణనసరగనుబ్రోతురు । పరుసైనభవాదృశులగుభవ్యులుపుత్రున్।
గరుణనుమన్నింపరెమఱి । యరయరెనీపట్టినట్టులలరింపుమిటన్॥ ౧౦౪॥

ఆ-వె॥ చేయఁడింకనిట్టిచెట్టపనులటంచు । నొప్పఁజెప్పిమగనికొగినిసురభి।
కొడుకుచేతఁదండ్రియడుగులకిడియించె । జోతనాతఁడాత్మజునలరించె॥ ౧౦౫॥

కం॥ పిమ్మటనురత్నగుప్తుఁడు । పిమ్మటిని విముక్తుఁడయ్యెఁ బేర్మినతనికిన్।
గమ్మలఁగుంటెనకాండ్రఁగ్ర । మ్మఁగఁబనిచెదుద హేమమణి తావచ్చెన్॥ ౧౦౬॥

ఉ॥ చందురునెద్దనున్నకవిచందమునన్నలరత్నగుప్తునె।
ద్దండనరారుచున్నఘనుఁ దద్ధనగుప్తునిఁ గాంచిమ్రొక్కవే।
డక్కుందనప్రాణనాథునికిఁ గ్రద్దఱియాధనగుప్తుఁడుం భ్రమం।
బొందివచించె నీ వెవతె వోయిట నేటికి వచ్చితోయనన్॥ ౧౦౭॥

చ॥ పలికెను నేను హేమయను పణ్యసతి న్వరరత్నసంగ్రహా।
జ్వలమతి వచ్చితిన్నను భృశంబుగ ధన్యను జేయుఁడంచుఁగా।
శలమలరంగఁ బల్కఁగను సంతసమందుచుఁ బెద్దసెట్టినీ।
వలసినవానిఁ జేకొనుము బాగగునానది మేలు మేలనెన్॥ ౧౦౮॥

సీ॥ పద్మరాగములివె వలయువానిని గొను నాయకమణియొండె నాకుఁజాలు।
నాణిముత్తెములివె యారసికొనవె ముక్తాహారనైతి నాకదియ చాలుఁ।
బగడాలదండలువలయునే కైకొమ్ము పగడాలు నాకేల పొగడఁజాలుఁ।
బచ్చలివే కాంచివలసెప్పఁ జేకొను సౌమ్యతేజమిదొండె చాలుఁజాలుఁ।
గనకపుష్యరాగములివె కంటిఁజాలుఁ । జూడుమగరాలఁగవిమణిఁ జూడఁజాలు।
నింద్రనీలములివె కొను మెనయఁజాలు । నన్నియివి మేలురతనము లెన్నఁజాలు॥ ౧౦౯॥

కం॥ అనివారలుదగ బేరం । బునుజరుపఁగఁ దండ్రిదండఁ బుత్రుండుండెన్।
గనుఁగొనఁ బిల్లి గనుల్లముఁ । గనియదిమణి నెపమునన నెఁగరముచతురతన్॥ ౧౧౦॥

ఆ-వె॥ ఎన్నిరత్నములనె యిట్టివిగొంటిని । ఏలనాకునింక నింతెచాలు।
రత్నమెట్టిదైన రాయిగదా జీవ । రత్నమొకటిఁగొనఁగరహివహింతు॥ ౧౧౧॥

కం॥ ఆజీవరత్నమేనా । కౌఁజుమ్మదిగుప్తరత్నమబ్బిననిత్తున్।
రాజసమా సర్వస్వము । రాజసమా నాకలఘునరత్నమెవలయున్॥ ౧౧౨॥

చ॥ అనవిని సెట్టియిట్టులనె నక్కఱ నెక్కువచింతువింతిరో।
మనమునఁ బుంమణిందలఁచి మాటికి నల్లకృతార్థుఁ డెవ్వఁడో।
వినిచినవిందునాఁగనలవేశ్యయు జీవుఁడె దేవుఁడన్నత।
ఘనమతమూనియాడితెముదంబున వైశ్యశిఖామణీయనెన్॥ ౧౧౩॥

చ॥ పదపడియాతఁడుద్దవడిఁ బద్దుగనీవిటఁ గొన్నవానికిన్।
ముదితరొజట్టిఁ బెట్టికొనుమున్న గనేవిడనన్న నవ్వుచా।
సుదతి చమత్కృతిం బలికె సొంపుగనే వెలయాలఁగానెమీ।
కదివెలయేలమీధనమునైతిఁగ దాధనగుప్తనావుడున్॥ ౧౧౪॥

కం॥ వెలయేమాకున్వలయును । వెలయాలేలయని సెట్టి బిగువుగనాడెన్।
బలికె నెఱజాణయదినా । చెలువుఁడు లేఁడింటరాఁగఁ జెల్లింతు వెలన్॥ ౧౧౫॥

కం॥ రేపటికి వచ్చు సోమణి । మాపటికే వచ్చు సోనృమణియతఁడిపుడే।
నాపజ్జకు వచ్చెనె నా । తూపోవనియనికి మాన్పఁడాయనిడాయన్॥ ౧౧౬॥

ఆ-వె॥ నన్నుమీరునమ్మకున్ననునేమిమ్ము । నమ్ముదానఁగాననాదురత్న।
హారమిత్తుమీకునందుకొనుండిదె । సంచకరవటంచుఁజానవూని॥ ౧౧౭॥

ఆ-వె॥ తనదుమణిసరంబుఁదగరత్నగుప్తుని । చేతికిచ్చెగంధసింధురమున।
కొనరవశమొసంగుఘనశృంఖలంబనఁ । గామపాశమనఁగఘనతయెసఁగ॥ ౧౧౮॥

కం॥ తరువాతంధనగుప్తుఁడు । తరుణీమణివారముఖ్యతగునీకార్యం।
బరఝకసామాన్యయయని । వెరవఱిపల్కితిఁగొనిచనువిలిచినమణులన్॥ ౧౧౯॥

కం॥ అనికోరినరత్నమునిడె । ధనగుప్తుఁడుతత్తనయుఁడుదానికిస్వామసెూ।
ధనమప్పుఁదీర్పననిడెఁ । గొనిహేమనిజాలయమునకుంజనెనంతన్॥ ౧౨౦॥

తే-గీ॥ రత్నగుప్తుఁడుహేమహారంబుఁదండ్రి । కిచ్చెనతఁడిదినాకేలయీవెతొబ్బ।
మనుచుఁగొడుకునకిచ్చెనయ్యభికుఁడొయ్య। నయ్యెఁదద్ధరణమునహేమాశ్రయుండు॥

కం॥ మఱునాఁడుదండ్రిగొడుకుం । దెఱఁగొప్పఁగఁబిలిచివిలువఁదేరాయారో।
తెఱవవలననిపనిచెన్ । గఱుదునఁదనయుండుజనకుఁగనుఁగొనియనియెన్॥ ౧౨౨॥

కం॥ నననునపకుగణికాలయ । మునకేటికిఁజనఁగనాకుమొననెడిసడిసా।
లనునడునుఁద్రొక్కనేలా । కనుకనిఁగాల్గడుగనేలకావునఁబోవన్॥ ౧౨౩॥

మ॥ అనుచుందిన్నఁగవిన్నవింపసుతుతోనాతండనుంబుత్రకా।
వినుకార్యార్థిగనెందునేఁదగునుబోవేశ్యాగృహంబైననే।
మొనరంగన్వసులాభమేమనకుసర్వోత్కృష్టమానాఁబ్రహా।
ర్షణమొప్పంజనెరత్నగుప్తుఁడుప్రియాసంయోగసౌఖ్యాశతోన్॥ ౧౨౪॥

కం॥ వచ్చిననాయకమణిఁగని । చెచ్చెరఁదాలేచిహేమచేనెంబ్రణతిన్।
నెచ్చెలిమిరత్నగుప్తుం । డచ్చెలువంగౌఁగిలించెనదియునతనినిన్॥ ౧౨౫॥

ఆ-వె॥ చిలుకపంజరమునఁజిక్కియుండెడునట్లు । తండ్రియాజ్ఞనింటఁదలరుచుంటె।
యాలివలపువలనువీలఱితవిలితె । మఱచినావొనన్నుమమతవదలి॥ ౧౨౬॥

కం॥ అనివేశ్యామణివలుకన్ । వినివైశ్యశిఖామణియనెఁబిత్రాజ్ఞయయా।
ననురానీయమికింగత । మెనయవుహేత్వంతరంబులెఱుఁగవెయనుచున్॥ ౧౨౭॥

కం॥ తాఁబరమాదరముననహ । హాబొజుఁగిడెదానియఱుతహారమునుదనున్।
రాఁబట్టుకొనంబాశము । నాఁబడువుంబడఁతియిడెధనంబునుమణినిన్॥ ౧౨౮॥

పంచపాది.

ఉ॥ ఇచ్చియిదేమినానినురహింగనవచ్చితినింతెకాకనీ।
విచ్చినవెన్నిమానికములిట్టివిలేవిటనాకెఱుంగవే।
వచ్చినద్రవ్యమీవలయుఁబన్నగనయ్యదిచేతలేదటం।
చిచ్చనుమానకిద్దగుఱుతెన్నకునస్నెకరోవెలందిగన్।
వచ్చినఁజాలునీధనమువల్లభయుల్లముఁజల్లఁజేయుమీ॥ ౧౨౯॥

కం॥ చనవేచనవేజనకున । కనువొందఁగ ధనమునుగొనియనఁగ నతండా।
వనితదవుమననుతోవను । వుసుధాన్యముతోడఁగ సవుపోల్కిఁ గొనిచనెన్॥ ౧౩౦॥

చ॥ చనికనితండ్రికంతధనసంచయమప్పనఁ జేసియాసరో।
జనయునతోరహస్యమున సంగతిఁ జల్పుచునుండెఁ డబ్బులే।
కనతఁడు కూర్మి పేర్మి నది గావలె నాదదియాదటంధనం।
బునుగొనవచ్చు సర్వమని పూన్కిఁ గనుంగొను సస్యముంబలెన్॥ ౧౩౧॥

తే-గీ॥ అరయనర్థాతురులకును గురువుబంధు । వుండఁడనునభియుక్తోక్తియును మఱియును।
గొడుకువలననుధనికులకు భయమనుట । యటను లక్ష్యసమన్వితమయ్యె నకట॥ ౧౩౨॥

ఆ-వె॥ తండ్రి లుబ్ధుఁడగుటఁ దనరమి సుఖమింత । రొక్కములవడమిని నెక్కడేని।
గోరెరత్నగుప్తుఁ డారపిత్రంతము । లోభియఘమునకును లోనుగాఁడె॥ ౧౩౩॥

ఆ-వె॥ తల్లి కడుపునందుఁ దానుండునప్పటి । నుండి తన్నుఁ బ్రోచి మెండుగ ధన।
విద్యలిడిన యట్టి పిత చావు వేఁడెవాఁ । డహహ లోభమవగుణాద్యముగద॥ ౧౩౪॥

కం॥ కోరిక యెట్టిదొ వానిది । వారక చేకూఱె నారవైశము గాఁగన్।
జేరెను స్వర్గము సహగమ । నోరీకృతయగుచుఁ దల్లియును గాలగతిన్॥ ౧౩౫॥

కం॥ అంతట నురత్నగుప్తుం । డెంతయు సంతాపమందె నెట్టికఠినులున్।
గంతుగొనం దలిదండ్రులు । స్వాంతంబునఁ దలఁచి రేనివగవ రెమిగులన్॥ ౧౩౬॥

కం॥ మనియుండఁ దల్లిదండ్రులఁ । దనయులలక్ష్యముగనెంచి తనియింపరువా।
రెనసిన మృతిదుఃఖింతురు । చనిపోయిన వారిఁ జూడ సమకూడెడినే॥ ౧౩౭॥

కం॥ సిరియఱిన నుమరలనుబలు । వెరవుల నార్జింపవచ్చుఁ బెండ్లాలంబె।
క్కుఱ నేకరింపఁ జనుస్త్రీ । కరులను దలిదండ్రుల నెటుగనన గుమఱియున్॥ ౧౩౮॥

చ॥ అనిబహుభంగులం బొగిలి యాత్మధనంబఖిలంబు హేమకి।
చ్చెనదియునాలినాతనిని జిత్తమెలర్పఁగఁ బ్రోచుచుండెనె।
య్యనువునఁ దానె భార్యయననయ్యెడ వారొకనాఁడు వేడుకం।
జనిరి శివాలయంబునకుఁ జక్కఁగ నక్కడనందఱుండఁగన్॥ ౧౩౯॥

కం॥ ఉత్తమము స్వార్జితంబౌ । విత్తము మధ్యమము ధనము పిత్రార్జితమౌ।
నత్తోఁబుట్టుల దధమము । రిత్తం బధమాధమంబు స్త్రీద్రవ్యముగున్॥ ౧౪౦॥

కం॥ ద్రౌపద్యుపార్జితంబని । యాపాండవులాల్లకవనినరిగిరడవికిన్।
జేపట్టిరరి జయంబున । నాపట్టున రాజ్యలక్ష్మినంతననుచటన్॥ ౧౪౧॥

ఆ-వె॥ పంజరమున నున్న ప్రసన్ననియొక చిల్క । పల్కెఁ దేనెలొల్కఁ బద్దెమొకటి।
వెంటగోరువంక వినిపించె మఱియొక । పద్యమార్యపర్యహృద్యముగను॥ ౧౪౨॥

చ॥ మనసున గాడి పాఱఁగను మార్గణతుల్యములైతదుక్తులా।
ఘనుఁడు మనోవికారమును గాఢముగూఢముగాఁ గ్రుక్కెనై।
నను గరకంతుఁ డీతఁడనినల్వుగ హేమవచించె స్తన్యమున్।
మునుకొని క్రోలి కాదె జన పుంజము వర్ధిలుమానసానెనాన్॥ ౧౪౩॥

కం॥ చింతామణియిట్లనెభూ । కాంతధనముగాదెభుక్తిగాంచరెమనుజుల్।
కాంతలుగనుప్రజమోహిని । పంతంబుననమృతమిడసుపర్వులుగనరే॥ ౧౪౪॥

చ॥ అనములుదీనికొల్లడచినట్లుగఁదోఁపఁగఁదాపమోపకా।
యనతనయాలిలేనితనయాలినినవ్వెలయాలిఅవ్వగాఁ।
జనవఆఁబానిపోయెవనసంచరణుండయియుండెనాత్మని।
ట్లనుక్షొనెరత్నగుప్తుఁడహాహాగతినాదిటులౌనెయంచటన్॥ ౧౪౫॥

కం॥ అధికడునెగడనడవిగ । వ్యాధులుమెగములుగఁజెరిగెనాధివ్యాధుల్।
బాధించుఁగాదెమర్త్యుల । వ్యాధియొమందులనువదలునాధియెటులఱున్॥ ౧౪౬॥

చ॥ అనికడుఁగుందుచుండునవుడంగిరుఁడన్మునిముఖ్యుఁడంబుజా।
సనతనయుండుతత్సుకృతజాతనిశాముఖపార్వణేందుఁడో।
యనఁగనుపట్టెమింటమఱియాయనమేనిదిబూదిగాలిచే।
తనుదనువందువెన్నెలగఁదాఁకెనుదాఁకినరత్నగుప్తుఁడున్॥ ౧౪౭॥

కం॥ గళితాధివ్యాధిభవా । ఖిలసంతాపుఁడయిమఱిసుఖిగనయికాంచెన్।
గలితసుభక్తిన్ మ్రొక్కెన్ । సలలితదయరావెయనుచుసంప్రార్థించెన్॥ ౧౪౮॥

ఉ॥ అంతటనమ్మహాత్ముఁడుమహాదయఁజెచ్చెరవచ్చివానివృ।
త్తాంతముసాంతముందెలిసియందితిభూతివిభూతినింకనీ।
వెంతయుఁగాంతుబిల్వవనికేగుదుమంచునుదోడితెచ్చిశ్రీ।
కాంతునిబిల్వనాథునిటఁగాంచఁగఁజేసిభజించివేసనెన్॥ ౧౪౯॥

కం॥ చననతఁడురత్నగుప్తుఁడ । తనుదాహకుఁగొల్చుచతనుతాపముఁరేఁపన్।
వెనుబడియెఁబూర్వవాసన । మునుకొనివెలయాలినాలిమొగినిటుదలఁచెన్॥ ౧౫౦॥

ఉ॥ హాజగదేకసుందరిమహాగుణబృందసహేమహేమరో।
యీజగమందునెందెవుడునేవెలయాండ్రయినన్నిటాళిచే।
రాజిలడబ్బుఁజూఁఅగొనురామలెకాకబొజుంగుఁదత్సతిన్।
బూజితవృత్తిఁబ్రోచెదరెప్రోచితిదేవివిగాకవేశ్యవే॥ ౧౫౧॥

కం॥ పణ్యసతికెల్లనిచ్చిత । గణ్యాభరణములఁబతికిఁగావసువఆనా।
పణ్యసతిశ్రితవైతివి । పుణ్యసతీనీవలెనొకపొలఁతుకయున్నే॥ ౧౫౨॥

ఆ-వె॥ అంచునెంచుచుండనచ్చటికిన్వచ్చె । నల్లరత్నగుప్తునసుఁగుమఱఁది।
భామతీపురంబువలననుండిషీఠిప్ర । దక్షిణంబునేయుచాక్షణమున॥ ౧౫౩॥

ఉత్సాహ॥ వచ్చిరత్నగుప్తుఁగాంచి - పరమహర్షయుక్తుఁడై।
సచ్చరిత్రబావపారి - జాతుఁడంగదాయటం।
చిచ్చమెచ్చమ్రొక్కెవాని - నెత్తిరత్నగుప్తుఁడుం।
గ్రుచ్చికౌఁగిలించికూర్మిఁ - గోరెవారిక్షేమమున్॥ ౧౫౪॥

సీ॥ పారిజాతుండిట్లుపలికెనీవున్నట్టె వెల్వడి రాఁగనా వెలవెలంది।
హేమ నాయనుజఁజింతామణిఁబొమ్మ నెఁగట్టుబట్టను దాళిబొట్టుఁగొనక।
యంతనాయమమానిశాంతమునందెచ్చియుంచుకొంటిమియా మెయిమ్మలించు।
చున్నదిరావయ్యయుండనేటికినిందుమాయిల్లుమీయిల్లమరలుమన్న।
రత్నగుప్తుఁడుచింతించిద్రఢిమఁగాంచి । నేనుదీక్షవహించితిరానచటికి।
నంచువానినిబంచెనుమంచిగానె । తనమనంబుననిట్లనితలఁచెనంత॥ ౧౫౫॥

సీ॥ ఇమ్ముగానాసొమ్ము నెల్లఁగైకొనెఁగానవాలేవడిన్నన్ను నాగృహిణిని।
మనుచుసమ్మానమ్మునననినేనమ్మిరా హేమయేమనియొచింతామణినిని।
నామీఁదిప్రేమనునాఁడోలెనాలేమ పుట్టినిల్లునే రెఁడాఁబొందసుఖము।
స్వప్రయోజనపరుల్సర్వజనంబులుబాగెల్లరనుగూర్చునోగుదొలఁచు।
మగఁడునీల్గనాలుమనుఁజనదతనితో । వారనారిమాటవలెనెతలఁపఁ।
బురుషులజ్ఞులయినఁబోలఁతులవలతురు । దెలివిగలుగమగలువలయువదల॥ ౧౫౬॥

కం॥ అనితలఁచిదృఢతరవిర । క్తినిఁగనిసంసారవాంఛఁదెగడిభవవిము।
క్తినిఁగోరియిందెవనియిం । చెనుశ్రీబిల్వేశుగుడిఁచిచేనెఁబ్రపత్తిన్॥ ౧౫౭॥

చ॥ పదపడిరత్నగుప్తుఁడునివానదిమున్గివిభూతిఁదాల్చియొ।
ప్పిదముగనక్షమాలికలవేడ్కధరించిగురున్స్మరించిశ్రీ।
ప్రదునినిబిల్వనాథునిటభక్తిభజించెనుబాడెనిట్లుము।
న్నెదవినగానవిద్యగడునొప్పగసత్ఫలమైయెలర్పఁగన్॥ ౧౫౮॥

సన్నుతవృత్తము॥ ఓన్నమశ్శివాయయనుట - యొప్పగువినరే।
ఓన్నమశ్శివాయయనుచు - నొప్పగననరే।
ఓన్నమశ్శివాయయనుచు - నోరిమిఁగనరే।
ఓన్నమశ్శివాయయనిస - మున్నతిఁగొనరే॥ ౧౫౯॥

గాయకవృత్తము॥ హేహరనమోభవతే - హృదయేశా - యీశ్వరవిశ్వవిభో - మృడశ్రీశా।
బ్రూహిభవమామవభో - పురుషేశా - భోగివిభూషణశం - భపదేశా।
దేహిహితమేవచమే - ద్రిపతీశా - దివ్యచరిత్రనుతా - ద్రినుతేశా।
పాహిశివశంకరమాం - పరమేశా - పావనబిల్వపతే - ప్రణతేశా॥౧౬౦॥

మంజరీషట్కము.

౧. శివుఁగొలువుండీ-శివుఁగొలువుండీ । శివుఁగొలువుండీ-శివరతులారా।
శివుఁడవుబ్రహ్మము-సిద్ధముసుండీ । శివమవుసర్వము-క్షితిజనులారా॥ ౧౬౧॥

౨. కామునిరూపును-గాంచుటఁగాల్చెన్ । సామేననుదన-చాననుదాల్చెన్।
భూమినిదివినేన్-బోలునెవండీ । స్వామినిశివునీ-శ్వరుఁగొలువుండీ॥ ౧౬౨॥

3. విసమితఁడానన్-వేలుపులెల్లన్ । బసఁగాంచిరిసుధ-పారణకొల్లన్।
రసికులుభక్తిగ-రళగళుఁగండీ । యసమెసఁగఁగజగ-దాప్తులుగండీ॥ ౧౬3॥

౪. మృత్యువునంతకు-మెయ్మెయిగెలిచెన్ । మృత్యుంజయుఁడన-మేలుగఁబొలిచెన్।
సత్యాత్మకునీ-శ్వరుఁగొలువుండీ । మృత్యుంజయులుగ-మీరలుగండీ॥ ౧౬౪॥

౫. శ్రీకరుఁడనసీ-శ్రీకరజుండా । శ్రీకుజరూపుఁడు-శివుఁడెగురుండా।
శ్రీకాములకీ-క్షితివరదుండాఁ । ప్రాకటముగబి-ల్వపతివరుండా॥ ౧౬౫॥

౬. భువిఁదత్త్వత్రయ-బోధకమవుచున్ । దవుబిల్వముత-త్పదమిదిపొలుచున్।
శివులిటబిల్వము-లవుటఁదలఁచుచున్ । శివయోగము నే-చెందుఁడుగనుచున్॥ ౧౬౬॥

కం॥ అనివాఁడువివిధగీతము । లనువొందఁగఁబాడునాడునానందమునన్।
మనుజులనెంతయనిమిషు । లనువినికనివిగ్రహంబులుగనైరహహా॥ ౧౬౭॥

తే-గీ॥ క్షితినిసద్యఃఫలంబుసంగీతవిద్య । యనుటనిజమయ్యెవానిగానామృతాబ్ధి।
లోకమునుగలకండగాలోఁగొనియెను । శివశివుఁడునొక్కటిగనైరిశివమెసఁగదె॥

కం॥ దైవప్రావృట్కాలము । దావచ్చినఁబలుకులెల్లధనవర్షంబున్।
వేవర్షింపఁగనాతఁడు । శ్రీవిలసిల్లెశ్రీవనినిటసిద్ధేంద్రుఁడనన్॥ ౧౬౯॥

చ॥ శిరముననిష్టదేవగురుశిష్టవినమ్రతసత్త్రిపుండ్రభా।
సురతవిశాలఫాలమునశ్రోత్రములందుశ్రుతంబురంబునం।
బొరిరుదురాకపేరులునుబొల్పుగఁజేతజపాక్షమాలయుం।
బరమపవిత్రమంగుళినిభాసిలులేమినిఁగల్మివానికిన్॥ ౧౭౦॥

సీ॥ కంజాద్ర్యధిత్యకఁగల్పించెనొకపురిసత్యలోకమునకుసవతుగాఁగ।
బిల్వవనంబునంబెంపొందవైకుంఠమునకుసాటిగనొక్కప్రోలుగట్టె।
శరజన్మగిరిదండసవరించెనలకకుఁదులగాఁగనొకవీడుసులలితముగఁ।
గంజాచలోపత్యకంబంచకోణంబులందుమండపములఁబొందుపఱిచె।
బిల్వకముశ్రీపురంబుగావెలయఁజేసెఁ । దనదుపేరనుదనరించెధన్యుఁడతఁడు।
గురుతఁదనుమధ్యమూడవకొడుకనంగ । రత్నగుప్తుఁడుసద్భక్తరత్నముగద॥ ౧౭౧॥

తే-గీ॥ జ్ఞానభక్తివైరాగ్యముల్గల్గిబిల్వ । పతినిగానంబునభజించువాఁడవౌట।
రత్నగుప్తునివలెనీవురాజిలెదని । పలికితినభేదభావంబుఁదెలియుమనిన॥ ౧౭౨॥

కం॥ ఆరత్నదాసుఁడపుడీ । చారిత్రమువినుటఁజేసిస్వప్నముగఁగనెన్।
దారత్నగుప్తుఁడేయని । వైరాగ్యజ్ఞానభక్తివంద్యుండయ్యెన్॥ ౧౭౩।

రత్నావళి.

కలిగెడుసంగీతంబునదుస్సం - గతిదానన్వెలవెలఁదులపొం।
దలవడుధనమటుదారిద్ర్యంబున - నాధులువ్యాధులునొందునొగిం।
జెలఁగదుసంతతిపుణ్యముగీర్తియుఁ - జెడునయినన్సత్సంగతిచేఁ।
జెలువగుననియెడురత్నగుప్తకృతి - శ్రీకరమారయశ్రీకరమా॥ ౧౭౪॥

అమృతవాహిని॥ ఈరత్నగుప్తసర్గంబు । నేరేనిఁజదువన్వినన్।
గూరంగలరభీష్టంబు । ల్వారువారకకూరిమిన్॥ ౧౭౫॥

ఇది, రత్నగుప్త సర్గము.

## రత్నవర్మసర్గము.

---

కం॥ ఆరత్నగుప్తుఁడలమః । యూరవనమునందు శివుఁగొలుచుచుండెమహా।
దారుఁడు రాజనఁగనుజను । లూరీకృతసచ్చరిత్రమొప్పచునుండన్॥ ౧॥

తే-గీ॥ హరియెహరుఁడగు లేదు భేదావకాశ । మనుచులోకులకెఱిఁగింపననఁగరాచ।
తపనీయున్నెలవేలుపుఁదపనీయునయి । పరఁగుకౌశికమునిహరివచ్చెనటకు॥ ౨॥

ఉత్సాహ॥ వచ్చిబిల్వపతినిబిల్వ - పత్రికన్భజించి మే।
ల్మిచ్చికలరరత్నగుప్త - మండితుండునైయనన్।
సచ్చరిత్రరత్నవర్మ - చందమొందియుందువం।
చిచ్చగింపఁదచ్చరిత్ర - మిట్టులాడెవేడుకన్॥ ౩॥

చ॥ వెలయుదశార్ణదేశమునవిశ్రుతనాముఁడువజ్రబాహుఁడ।
న్నరపతిసార్థకాఖ్యుఁడుఘనంబుగరాజ్యమునేలుచుండెఁద।
త్సురపతివజ్రబాహువిటుదోఁచుననంగుణరత్నవర్మయై।
ధరఁదగెరత్నవర్మయనఁదార్కొనుఁగాదెయభిఖ్యవృత్తిచేన్॥ ౪॥

ఆ-వె॥ అతని పెద్ద పెండ్లమన్వర్థకాఖ్యయై । యమరునమరవినుతసుమతియనఁగ।
సుమతిభాగ్యముననుజూలాలుగానయ్యె । సవితృగర్భపూర్వసంధ్యయనఁగ॥ ౫॥

కం॥ అటులాపెయవుటకోర్వక । కుటిలకుమతిసవతియామెకుంగరళాన్నం।
బటుమటుమునఁబెట్టించెను । జటుబౌర్వానలముజలధిసమకొల్పుక్రియన్॥ ౬॥

కం॥ చావకబ్రదికెనుగాకా । దేవిగరముగరముచేతఁదెగులుగలుగఁగాఁ।
దావగఁబోగులుచునుండెన్ । దేవుఁడెతద్వ్యాధినాధిఁదెలిసికొనఁదగున్॥ ౭॥

ఆ-వె॥ సగరుఁడనఁగనొకఁడుసగరుఁడుపొడమెనా । సతికిరోగిరాహుజాతపీడ।
తోడఁగూడఁబొడముతోయజారాతినా । శ్యామికాన్వితముగుస్వర్ణమనఁగ॥ ౮॥

కం॥ ఆలాగునజనియించిన । బాలుఁడురోదనమునేయఁబాలుడిగికడున్।
లీలారుద్రుఁడనన్మే । ల్బాలానాంరోదనంబలమ్మనుటొనరన్॥ ౯॥

ఆ-వె॥ తనదుతాపముననైతల్లడిల్లెడితల్లి । యేడ్వఁగొడుకువ్యాధికేమినేయు।
నేడ్చునేడ్చుమఱియునేడ్చుఁదాఁగొడుకుతోఁ।దోడుపాడుననఁగఁదొడఁగియెపుడు॥

కం॥ ఎడపకతనయింటఁగడుం । గడుఁబెండ్లామునుగొడుకునుగావింపరొదన్।
జడమతియయ్యెకిమీఁద । ప్పుడువేసరివినికికుమతిబోధనచేతన్॥ ౧౧॥

కం॥ వీరాలుబిడ్డలేలరు । జారుచిరులుఘోరతరమహాఘులుశోకా।
కారులిచటనుండఁగఁదగ । రారయనడవికనుపంగనర్హులటంచున్॥ ౧౨॥

కం॥ సారథినిఁబిలిచిపిరిన్ । దేరునఁగొనిచనియరణ్యదేశమునందున్।
దూరముగవదలిరమ్మనె । సారథియటుచేసితెలిపెజనపతికలరన్॥ ౧౩॥

తే-గీ॥ సుమతి చింతిల్లెఁ దన మనస్సున నుదనడు । భాగ్యవిభ్రంశమునకును వ్యాధికి మఱి।
భర్తృనిర్ఘృణతకు నిజోద్వాహు నిఁ బ్రోవ । మునియెఁ గాకాకెగాకున్న మను నెవగను।

సీ॥ గొడ్డురాలుగ నైనఁ గుదురుగా నుండక చూలింతరాలుగా నేలయైతి।
నైతిఁబో కుమతి బల్లాతకమున కిడ్డవిస ఫుటోగిర మేల మెసఁగితినట।
మెసవితి నేమాయె నను రెడలక తీఱనట్టి తెగుల్వొందియడలవలెనె।
చూలైనఁ జెడ కేల సుతుఁ డుదయించెను వీఁడును నాపలె వెలయవలెనె।
యల్ల శ్రీరాముకరణి నా వల్లభుండు । నన్నుఁ బుత్రిణి నీ యరణ్యంబునకును।
బలిగ నొప్పింపవలయునే పాపఫలము । ననుభవింపక తప్పునే యనుచు వగచి॥ ౧౫॥

కం॥ అంతట సుమతి గనుంగొనెఁ । గాంతారత్నంబు ఘోరకాంతారంబున్।
సంతతకంటకదృషదా । క్రాంతంబుం బుండరీకకరిహరియుతమున్॥ ౧౬॥

సీ॥ పందులవలె నేదుపందులు పందులు నెలుగులవలె నలయెలుగులన్నఁ।
గాటుదున్నలు వోలెఁ గాటుదున్నలు నేనుఁగులవలె నేయేనుఁగులు మలలనఁ।
బిల్లులు చిఱుతల వితమునఁ జిఱుతలు పులుల పోలిక సింగములవలెఁ బులు।
లల్ల సింహంబులు నా శరభములట్లు శరభము లభ్ర కేసరులనంగ।
భీకరారావములఁ జేయుచా కడఁదన । కగపడఁగ ముండ్లపొదలలో నడఁగుచు వడి।
నడచుచును నడవఁగలేక యెడనెడ నొగి । నిలుచుచును మఱచనుచుండె నెలఁత సనుత॥

కం॥ ఆఁకటికిఁ దాళలేకా । స్త్రీ కనఁబడు నాకు నలముఁ జేకొని నములున్।
జోకఁబడి యవాఁకలనీ । రేకరణి నొ త్రాగు నేగు నెందో పందున్॥ ౧౭॥

కం॥ దారి యొకటి కనఁబడెనా । చేరెద నొక యూరి కటవసించెద నెట్లో।
నో రామా యని నెమకుచుఁ । జేరువ నొక బాటఁ జూచి చిత్తమునందున్॥ ౧౮॥

ఆ-వె॥ దక్షిణాభిముఖము దగ దెవ్వరికిఁ గాన । నుత్తరాభిముఖిగ నొగి నరిగెద।
నంచు నెంచి పోయె నాత్మజు నెత్తుకొం । చౌర్వమాతరీతి నల్ల చెల్వ॥ ౨౦॥

కం॥ భేరము సారము ప్రబలము । గా రాజిలు నొక్క పేటఁ గాంచెన్ రాజ।
స్త్రీరత్నము సుతరత్నము । తోరంజిల్లుచును జొచ్చి త్రోవ నొబ్బవన్॥ ౨౧॥

మ॥ కనెఁ బద్మాకరుఁ డన్వణిక్ప్రభుఁ డటం గారుణ్యవారాశి రా।
చనెలంతం దనయాన్వితన్ సుమతి నెయ్యంబొప్ప రప్పించి యో।
జననీ నీ వెవ రెందునుండి యెటకున్ సమ్మోద మేదన్వగన్।
జనె దమ్మా యని యామె పల్ల విని యాశ్చర్యానుకంపాహతిన్॥ ౨౨॥

శా॥ తల్లీ యెంతటివారికైన నను విధిం దప్పింపఁగా నా నెనీ।
యుల్లంబందు నుగుందుఁ బొందకు శివుండుద్యద్దయుం డేలునీ।
వుల్లాసంబున నిందునుండు మిది నీ కూహింపు పుట్టిల్లుగాఁ।
బెల్లాడంబని యేమి యంచు స్వసతిం బిల్పించి యొప్పించినన్॥ ౨౩॥

ఉ॥ ఆవణిగంగ నామణి మహామతి పద్మినియా నృపాంగనన్।
దావర పుత్రిగం దలఁచి దద్దయు నొద్దిక నాత్మగేహమం।

దేవసియింపఁజేసీపలుదీరులబిడ్డను నామెనోమెనా।
నావిధవైద్యకృత్యకలనంజరిపించెనతండుతండ్రిగా॥ ౨౪॥

కం॥ చేసినచికిత్సయంతయ । యోసంద్రమునందువానయోజనవ్వమ్మై।
వానియెఱఁగఁగొన్నాళ్లకుఁ । బానెనుసురునిసువువ్యాధిబాహుళ్యమునన్॥ ౨౫॥

కం॥ ముద్రితనేత్రుండగుచు । న్నిద్రించుసెనాఁగదీర్ఘనిద్రాంచితుఁడై।
చిద్రహితుఁడైనకొడుకుం । దద్రాజకళత్రముగనితాపము రేఁపన్॥ ౨౬॥

కం॥ ఆయ్యోయ్యాయయ్యోకొడుకా । యయ్యయ్యోయ్యాయనుచురమ్మునాస్యముశిరము।
త్రొయ్యలిలలిమొత్తుకొనుచుఁ । జయ్యననఱుకఁబడినరఁటిసాలమనఁబడెన్॥ ౨౭॥

ఆ-వె॥ కూలిసొమ్మసిల్లికొంతసేపటికిని । జెలువలూదిపట్టినేదఁదేర్పఁ।
గన్నువిచ్చినన్నుఁగన్నతండ్రీలెమ్ము । రమ్మటంచుఁజీరుఁగొమ్మనెమ్మి॥ ౨౮॥

తే-గీ॥ కనులుదెఱవమిఁబలుకమిఁగాంచిపాలుఁ । గ్రోలరావేలయనిపీనుఁగునకుముద్దు।
లిడుచునెత్తుకొనుంగనుచింతులెల్ల । నయ్యయోయనియేడ్వంగనామెయేడ్చు॥ ౨౯॥

కం॥ హారాజకులాంకూరమ । హారాజకుమారసుగుణహాసుకుమారా।
హారమణీకేయూరా । హారమణీయాయటంచునాక్రందించెన్॥ ౩౦॥

తే-గీ॥ నాయనానావ్యాధిబాధలనీయనువునఁ । దాఱఁగికంటివెసుఖనిద్రమఱచితెనసుఁ।
దల్లినిటుమానిపోనీకుధర్మమానె । నేనునీతోనువచ్చెదనిజముగాను॥ ౩౧॥

కం॥ తలిదండ్రులెడలిరంతం । జెలువుఁడెడలెఁబిదపఁగొడుకచెల్లితివిఁకనే।
నిలమననేలయనాథను । నిలువభువికిభారముగదనెలఁతయగతిగాన్॥ ౩౨॥

కం॥ అనికురరివోలెనేడ్చుచుఁ । దనయశవముఁగౌఁగిలించితనకదెగతియం।
చునువీడకపడియుండెం । గనుఁగొనిపద్మాకరుండుగడునూఱార్చెన్॥ ౩౩॥

ఆ-వె॥ ఎవ్వరెంతచెప్పనెన్నెనివితముల । సుతునిఁబాయకేడ్చుసతినిఁగనుచు।
నెల్లవారునూఱకేడ్చుచునుండిరి । సంజెఁబులుఁగులులిదియుజాడదోఁప॥ ౩౪॥

కం॥ మానవయత్నమ్మునన । మ్మానినినూఱార్పలేకమ్రాన్పడియుండన్।
గానందఱందునద్భుత । మౌననఁగందైవయత్నమదియొకఁడోదవెన్॥ ౩౫॥

ఉ॥ పాదుకలక్షమాలికయుభస్మసమంచితకక్షపాలయున్।
మోదముమీఱఁగాలజియముందెలుపంగలయోగదండమున్।
బ్రాదివరార్చనీయమణిరాజితలింగమెసంగశంకర।
శ్రీదనరారవచ్చెఋషిసింహుఁడుదాఋషభుండువచ్చినన్॥ ౩౬॥

కం॥ కనుఁగొనిపద్మాకరుఁడా । ఘనశివయోగీంద్రుభక్తిగడలుకొనంగన్।
మునుకొనిపూజించెనుసుమ । తినెగులుమానంగమానిధృతిబోధించెన్॥ ౩౭॥

చ॥ మునిఋషభుండునాశిశువుమోమునశాంభవమంత్రితంబుస।
ద్విసుతముభూతిఁబూసిమనువేగముగాననసిద్రలేచులా।
గునమృతబాలుఁడప్డుమనెక్షోణిమహాద్భుతమందియందఱుం।
బనివడిచూడవేడుకగఁబాలకుఁబాలకుఁడేడ్చెనేడ్చినన్॥ ౩౮॥

కం॥ అచ్చెరువడితల్లికొడుక । వచ్చితెమనిమనిచితిననువరమునికృపనం।
చెచ్చినమచ్చికతోఁబా । లిచ్చెఁజనులు నేఁపఁగజనులిచ్చన్మెచ్చన్॥ ౩౯॥

తే-గీ॥ అంతనయ్యింతిమేల్బంతియానినువును। ఋషభయోగీంద్రుపదములం దెలమినునిచి।
వీఁడునీవాఁడు నేనునువీనియశ్లె । యంచుఁజాఁగిలఁబడిలేచియశ్లెనిల్వ॥ ౪౦॥

ఉ॥ ఆఋషభుండుతత్సుమతికాపనిపాపనికిన్సమంత్రితం।
బైరుచిమించుభూతినిడియంగములందునలందఁజేసెనా।
నారియునర్భకుండవుడనంగరళామయబాధలేదఁగా।
శ్రీరుచిరాంగులై సుఖసమృద్ధినిఁజెందిరిదేవభావులై॥ ౪౧॥

కం॥ జనులందఱునరుదందఁగ । మునీంద్రుపదపద్మములకుమ్రొక్కినిలిచెనా।
వనితామణిరత్నాకర । తనయయనఁగశారదయనఁదగవినుతించెన్॥ ౪౨॥

తే-గీ॥ పలికెనయ్యింతిఁగనుగొనిపరమకరుణ।ఋషభయోగీంద్రుఁడోపుత్రిప్రియమెలర్ప।
నవుదువమ్మచిరంజీవినివిగనిత్య । భూరిసౌభాగ్యసామ్రాజ్యపూజ్యవనుచు॥ ౪౩॥

కం॥ ఎందాఁకనుందువీయిల । నందాఁకనుముదిమిదెవులునంటదునిన్నున్।
బొందెదునీపతినింబో । ల్పొందనచిరకాలమునన్పొసఁగుశుభంబుల్॥ ౪౪॥

కం॥ భద్రాశ్వకరుణచేతన్ । భద్రాన్వితుఁడగునువీఁడుబాలకుఁడనుచున్।
భద్రాయువనఁగవానికి । భద్రాభిఖ్యనిడియిట్లుపలికెఁబడఁతితోన్॥ ౪౫॥

కం॥ ఇందేయుండుముదగనీ । నందనుఁడీశానునికరుణన్వరవిద్యా।
సందోహవందితుండగు । నందనుకనుననుచుమఱియునావిప్రభుతోన్॥ ౪౬॥

కం॥ పద్మాకరనీయింటం । బద్మినికర్ధమునితోడవనీయించునుద।
త్పద్మినిసుమతియయవునీ । సద్మంబుననుండుఁబ్రోపుసుతహితముగన్॥ ౪౭॥

తే-గీ॥ ఆర్తులనుబ్రోచుసద్ధర్మమబ్బెనీకు । నీమహాభాగ్యముననీవునిత్యభోగ।
భాగ్యసంతానసత్కీర్తివంద్యుఁడవయి । యిందునందునునెగడెదవిద్ధమహిమ॥ ౪౮॥

కం॥ వారకపరోపకారం । బేరీతింగానిచేఁతహితముదనకదా।
నీరిడిపైరునుబెంచుట । చేరమ్యఫలంబుదనకెనిద్ధించుఁగదా॥ ౪౯॥

కం॥ ఎక్కడిరాజకళత్రం । బెక్కడిరాజనుతుఁడారయిక్కడనీకుం।
జిక్కిరిశరణార్థులుగాఁ । జక్కఁగఁబోషింపుమయ్యసంతోషముతోన్॥ ౫౦॥

కం॥ ఈబాలున్భద్రాయువు । నీబాలుండైననునయునింగూర్చితగం।
గాఁబెనుపుమువిద్యాఢ్యులఁ । గాబలుపొందెదరువీరుఘనసంపదలన్॥ ౫౧॥

ఆ-వె॥ కన్నవారికన్నఁగరుణనుబెనిచిన । వారెఘనులుగౌరవంబుఁగంద్రు।
సృష్టిఁజేయుస్రష్టచెందఁడుపూజను । బ్రోచుశ్రీపతిగదపొందుఁబూజ॥ ౫౨॥

మ॥ అనియయ్యోగివరుండువల్కవినివైశ్యశ్రేష్ఠుఁడిట్లాడెనో।
జనవంద్యామృతుఁడైనరాజనుతునిన్సంజీవితుంజేసిత।
జ్జననిన్మన్నిచితిరీరువీరిఁగరుణన్సాఖ్యాఢ్యులంజేసినా।
రెనయెవ్వారలుమీకుమాకుగురులీరేమెంతుమోశంకరా॥ ౫౩॥

కం॥ వీరినిమిత్తముచేమీ । కారుణ్యంబొదవ మేముగంటిమిఘనతన్।
నారయనుగుసుమదామము । చేరమ్యంబయిశిరంబుఁ జెందెడుపగిదిన్॥ ౫౪॥

కం॥ భవదాజ్ఞచేతవీరిన్ । దవఁగాఁ బాపెదనిదెంతదయనెల్లప్పున్।
శివరూపమమ్మనందఱు । శివయుతులుగఁ బ్రోవవలయుస్వీయులమిరే॥ ౫౫॥

కం॥ అనఁగానిమ్మనియందఱుఁ । జనవునవీడ్కొనియతండుసనియెయథేచ్ఛన్।
దనయయుతసుమతియచటనె । ఘనముగవసియించెసుఖముగఁబలుకొన్నంగన్॥ ౫౬॥

కం॥ తనతనయుఁడునృపతనయుం । డను భేదములేకయూరుజాధిపుఁడతఁడిం।
పొనరఁగఁ బ్రోచుచునుండెను । ఘనవిద్యాన్వితులఁగాఁగఁ గావించెనొగిన్॥ ౫౭॥

ఆ-వె॥ అంతఁగొంతకాలమైనపిమ్మటనమ్మ । నీశ్వరుండుబుషభుఁడేగుదెంచి।
యెల్లవారిచేతనెలమిఁబూజితుఁడయి । యాదరించివారినలరఁజేసె॥ ౫౮॥

కం॥ కనుఁగొనిభద్రాయువునో । యిననుస్నివెఱుఁగుదెమదినెంతయుభక్తిన్।
జననిన్సేవింతువెశివు । మునుకొనిభజియింతెసుఖివెపొందితెవిద్యల్॥ ౫౯॥

కం॥ నినునీతల్లింప్రేమం । బునఁబడ్నాకొంగ్లెడపకపోషించినయీ।
ఘనుఁబద్మాకరుఁదండ్రిగ । మనమ్మునంపలఁచిమెలఁగిమాన్యుఁడవైతే॥ ౬౦॥

మ॥ అనుచుందన్నడుగంగరాజసుతుఁడిట్లాడెంబ్వదీయానుకం।
పనుభద్రాయువనైతిఁబుట్టిమఱియీపద్మాకరుండేలుటన్।
జననీయుక్తుఁడనైసుఖంబుగనెయున్నాఁడన్యదాశక్తివి।
ద్యనుగన్నాఁడనుమీరెతండ్రులరయందాఁదండ్రివేఱుండునే॥ ౬౧॥

కం॥ అనఁగనులనీరుగ్రమ్మఁగ । జననిసుమతిభక్తిమ్రొక్కిసంయమివర్యా।
తేనరింపుఁడుమతిమంతుఁగిఁ । దనయునసుచువిన్నవించెదయదయివారన్॥ ౬౨॥

కం॥ అంతబుషభయోగీంద్రుం । డెంతయుసదయుండగుచునుహితమేనుపదే।
శింతున్భద్రాయువనీ । వంతయువినుమటులమెలఁగుమనియిటులనియెన్॥ ౬౩॥

బంగా॥ ఓముహాస్వాచారమా మొదటిదిధర్మమదిపురుషార్థావ్యమరయనరయ-నగుసుగదా।
ఆమార్గమునసర్థమార్జింపవలయునురెండవపురుషార్థమొందుగనది-యుండుఁగదా।
తదనుసారముగాఁగధర్మపత్నియుక్తిఁగామపుమర్థంబుఁగాంచవలయుఁ గ్రాలుఁగదా।
పదపడిమోక్షంబుపడయంగఁదగుశివభక్తిఁదారకమనుభవమునఁగని-పరఁగుఁగదా।
శ్రద్ధయత్నంబుమఱిసిస్పృక్షయుముముక్ష-సన్నుతముల్।
మొనయనానాల్గిటికిమూలములగుకతన-ముఖ్యములౌ।
కానశ్రద్ధాదులనుబుధుల్గాంచెదరవి-గనుమునీవు।
వానిఁబొందికృతార్థతవఱలెదవాగి-వర్ధిలుమా॥ ౬౪॥

వెండి॥ నటవిటగాయకకుటిలదురోదరమద్యామిషార్థులమచ్చికదగ।
దెపుడునుమ్రుచ్చులనెలమిఁజేర్చుకొనంగఁజనదిచ్చకములాడుజనులఁగూడ।
రాదుగూర్చుకొనంగరాదువంచకులఁబంచనునుంచుకొన-రాదుజనులనీచు।
లనుదురాచారులనైనయంగఁగూడదుకొండెగాండ్రనుగూడియుండరాదు।

నాగవాసమునాఁగను నాగవాస - మాఁగానను।
భోగినులను భుజంగులఁ బొందవిసము - పొసఁగుంగద।
పారదారికవృత్తినొ ప్రబ్బుమిత్తి - పాతకమా।
దుష్టసాంగత్యమేయెల్ల దోసఁగులనిడుఁ - దొడరకయ్య॥ ౬౫॥

బంగారము॥ మహనీయులైనట్టి మహీసురులను శాస్త్రవేదపురాణాగమాదివిదుల-వైదికులన్।
గ్గూర్చుకొను మునీతికోవిదులగువారి శ్రీకులను త్తమశ్లోకులగురు-లౌకికులన్।
సహధర్మిణిం దత్సుసంతతిబంధులసంతరింపుము గార్మ్యశర్మ మొదవు-సద్యశంబు।
శివవిష్ణ్వభేదంబు జీవదేవైక్యంబుఁ గాంచి యోగంబునఁ గనుము తార-కంబొనరన్।
క్రమత ధర్మార్థకామమోక్షములకొను-గనుఁగొనఁగన్।
సాధనములవి సర్వార్థసాధనమున-శ్లాఘ్యమగున్।
సాధుసాంగత్యమొకఁడె దేసారతరము-సన్నుతంబు।
గనుక సత్సంగతింగల్గి మనుమెసంగఁ-గను శివమున్॥ ౬౬॥

కం॥ అని ముని యినతనయునకును। దినమున శివకవచమున్ ధృతిందగనొసఁగెన్।
మనుపూతమైన భూతిం। దను వెల్లం బూసి మఱియు దయదళుకొత్తన్॥ ౬౭॥

కం॥ ద్వాదశసహస్రహస్తిబ। లోదారుఁడవగు మునివర మొసఁగె నొకటిస।
మ్మోదమ్మున శంఖమ్మునఁ। గాఁదగు శంఖమ్ము శ్రీసఖమ్మనఁగ ననిన్॥ ౬౮॥

శా॥ ఈశంఖంబు నృసింహగర్జనలఁ దానీనుం ద్విషన్నాగముల్।
నాశంబుం బొరయన్వినంగనుఁగొనన్ ఖడ్గంబిదో వజ్రసం।
కాశంబౌ నరిపర్వతంబులకు జోకన్వీనిఁ గైకొమ్మిఁక।
న్నీశత్రుప్రతతిం జయించికొనుమీ నీ పైతృకైశ్వర్యమున్। ౬౯॥

ఆ-వె॥ అనియనుగ్రహించి యా యోగివరుఁడేగె। హైమరథుఁడనంగ నడరునట్టి।
మాగధేశుఁడేగె మత్తుఁ డ్రమత్తునా। వజ్రబాహు గెలిచి వసుధఁ గొనఁగ॥ ౭౦॥

మ॥ మగధాధీశుఁడు నద్దశార్ణవిభుఁడు న్మత్తేభసంకాశులై।
జగడంబుం బొనరించిరుద్ధతినిఁ జంచత్పంచవక్త్రాభులై।
జగముల్ఘూర్ణిల వృత్రవాసవులతో సామ్యంబునుం గాంచిరం।
తఁ గడున్ హైమరథుండు పట్టియిడెఁ జెంతన్వజ్రబాహుం జెఱన్॥ ౭౧॥

తే-గీ॥ వజ్రబాహుఁడు చెఱవడ్డవార్తయెఱిఁగి। సౌమలేయుఁడు సునయు వైశ్యజుని సూతుఁ।
జేసికొని రథియై గురుఁ జేయబంధ। ముక్తుని సబంధు నర్జునస్ఫూర్తి వెడలె॥ ౭౨॥

సీ॥ చంద్రహాసాభ మాచంద్రహాసము రుచితోడ నేయాఁగె శత్రువ్రజంబుఁ।
పాంచజన్యంబనం బరఁగఁ జిందము గేలఁ దద్ధ్వనితోడ నేతాఱసిల్లె।
విల్లింద్రధనువుగా వెలయంగ నమ్ములజడి నెగడించె నుగడఁక విడక।
సర్వాస్త్రములు వజ్రసారంబులై వైరిసేనలఁ జేయ విచ్ఛిన్నములుగఁ।
దొమ్మిదక్షౌహిణులఁ గూల్చి తుదకు హైమ। రథునిఁ బెడ కెక్కలుగఁ గట్టి ప్రథనమునను।
దెచ్చెఁ జెఱఁబెట్టె విడిపించె ధీరుఁ దండ్రి। వజ్రబాహుఁ డవ్వైశ్యకుండనవళిలెనతఁడు॥

కం॥ నరుఁడో పరశుధరుండో । హరుఁడో ధృతశంఖచంద్రహాసుఁడెతండో।
గురుతేజోఽధికుఁడితఁడగు । నెరుఁడునవాక్షౌహిణులను నోర్వంగలఁడే॥ ౭౪॥

కం॥ అనికొనియాడఁగఁదనుజను । లెనయఁగనవ్వజ్రబాహునృపునకుమ్రొక్కెన్।
ఘనధృతిభద్రాయువుజన । కునిఁదనసుచరిత్రఁదనుపుకొడుకే కొడుకా॥ ౭౫॥

చ॥ కొడుకునుగౌఁగిలించిజనకుండితఁడాత్మజుఁడంచెఱుంగకిం।
పడరఁగఁబచ్చకప్పురముపన్నడమేలగుచందనంబునై।
నడరినయట్లుచల్లదనముంచెడునీవెవఁడన్నఁదండ్రితో।
నుడివెసుతుండిఁకందెలియనూల్కొనధర్మమురాజ్యమేలుమా॥ ౭౬॥

మ॥ అనఁగానప్పుడువజ్రబాహుఁడనురాజ్యంబేలయాంధ్రేలనీ।
వానరంధ్రోచితిబందముక్తులుగమమ్ముద్దండశౌర్యుండయీ।
ఘనరాష్ట్రంబునకీవెపాలకుఁడవై కావంగదేమమ్మున।
న్వనిభద్రాయువుపల్కెనిప్పటికిఁబృథ్వీభర్తవైయుండుమా॥ ౭౭॥

కం॥ అనిమఱియునెఱిఁగిజనకున । కనువుగభద్రాయువాప్తహర్షోక్తియునై।
జననిఁగనిమ్రొక్కెనంతయు । నెనరుపదందెలిపెసునయుఁడుల్లాసమున ౭౮॥

మ॥ కనిపద్మాకరుఁడాత్మజున్నృపతిజున్గాఁగింటనుంజేర్చెమె।
చ్చెనుసోత్సాహతనుత్సవంబొనరిచెన్ శ్రీమించభూపాంబరా।
శినెసంగెంగడుఁగూర్మిఁబెండ్లికొడుకుల్వేవేగఁగండంచనెన్।
జననుత్మేలనఁగాజనంబులుమరుజ్జాలంబుమేత్మేలనన్। ౭౯॥

మ॥ ఋషభుండాత్మనెఱింగియోగమహిమన్బ్రీతింజనెన్స్వేగమే।
నిషధాధీశ్వరుప్రోలికామహిపతిన్నెర్ప్పఁజంద్రాంగదుం।
దుపితుందెల్పెనుగీర్తిమాలినినిఁదత్పుత్రీమణింబెండ్లనే।
యషడాస్యాభుఁదునాకుమారునికిభద్రాయున్సుకింపొందఁగన్॥ ౮౦॥

కం॥ అనిపించుకొనితథాస్తని । మునివృషభుఁడుఋషభుఁడద్వైముదముననుగడున్।
జనపతిసుతుభద్రాయువుఁ । గనుఁగొనియేకాంతముననుగడఁకన్నుడివెన్॥ ౮౧॥

వెండి॥ తొలిపుట్టువుననీవుతొలిపుట్టువయియజామిళుఁడనుపేరనుమించిమించి।
నిజదాసితోఁగూడినెమ్మినిమ్మగునాలివిడనాడికొలమునువిడిచిచెడితి।
వంతటమఱియుభవాంతరముననీవుమందరుఁడనఁగనుమహీసురుఁడుగ।
జన్మించితాదాసిజనియించెఁబింగళనావేశ్యయైదానినేవరించి।
తప్పుడొకనాఁడుమీయింటికతిథినగుచు - నరుగుదేర।
నాకునాతిథ్యమునుజేసినారుమీరు - నారియదే।
యిప్డుచంద్రాంగదుండనునృపుతనయగ - నెగడుదానిఁ।
గీర్తిమాలినిఁబెండ్లాడికీర్తిఁగనుసు - కృతఫలమున్॥ ౮౨॥

ఉ॥ ఈకరణిన్వచించియతఁడేగఁగ వేగమె యానియానతిన్।
మైకొనియేగుదెంచిరియమాత్యులుదన్మనిశిష్యభద్రుఁబ।
ద్మాకరుతోడఁదోడుకొనితద్దయుహర్షముమీఱఁ జేర్చిరా।
శ్రీకరుఁగీర్తిమాలినివరించెనుబెండిలియయ్యెఁజయ్యనన్॥ ౮౩॥

కం॥ వావిరిసర్వనృపుల్సం। భావితులైయుండఁబెండ్లిమక్కువనడిగెన్।
నీవర్షవరుండెవండని। క్ష్మావరుఁడుదశార్ణపతినిషధపతిపలికెన్॥ ౮౪॥

సీ॥ వజ్రబాహువనీవువజ్రహృదయుఁడవై రుగ్ణులదారపుత్రులనువనమ్ము।
గాళికిబలిగాఁగనడవిపాల్సేసితా సుమతియుశిశువుతోసారిదిఁజేరెఁ।
బద్మనాఁగనువైశ్యపద్మాకరగృహంబునతఁడామెససుతనుస్వాత్మజగను।
బాలించెఋషభుండుబ్రదికించియాకందుభద్రాయువుంజేసివరమొసంగె।
ద్వాదశసహస్రహస్తులబలముదివ్య। ఖడ్గశంఖంబులనుశివకవచమిచ్చె।
నచ్చిరంజీవిభద్రాయువరులగెలిచి। నినునబంధుసబంధురాజునునెనర్చె॥ ౮౫॥

ఉ॥ వాకొననానెనీకొడుకుప్రాజ్ఞుఁడుతన్మనియాజ్ఞచేతనే।
నాకివుడల్లుఁడయ్యెఁగనునాఁగనుభద్రముఖాఖ్యుఁడింపుగన్।
ప్రాకటభక్తిఁదండ్రిపదపద్మములంబడెవజ్రబాహుఁడుం।
జేకొనికౌఁగిలించుకొనెఁజేసెనుదీవెనవానిపేరెకాన్॥ ౮౬॥

కం॥ సీమంతినిచంద్రాంగద। సీమంతినిసుమతిసుమతిఁజేకొనుమనుచున్।
ప్రేమమునవజ్రబాహుని। కామోదంబెసఁగఁజెప్పియవుడొప్పించెన్॥ ౮౭॥

తే-గీ॥ కీర్తిమాలినిచేతమ్రొక్కించెనత్త। మామలకుమీకుఁగోడలీమానినియని।
సార్థకాభిఖ్యవగుమనియనిరివార। లంతఁజంద్రాంగదాదులుహర్షమొంద॥ ౮౮॥

శా॥ సుప్రీతుండయివజ్రబాహుఁడువణిక్సత్రాముఁబద్మాకరున్।
సుప్రాగల్భ్యముతోడనాడెఁగనియోసుశ్లోకపోషించితో।
నాప్రేయస్వినియైనయీసుమతినిన్నాపుత్రుభద్రాయువున్।
నీప్రాగ్ర్యంబుఁబరోపకారమునువర్ణింపందరంబేయనన్॥ ౮౯॥

ఉ॥ వావిరియాతఁడిట్లనియెవ్యర్థునినన్నుబొగడంగనేలయో।
భూవరయోగిచంద్రుఋషభుంభజియింపుముభక్తినాతఁడే।
నీవరపుత్రుమన్నెమహనీయుఁడుగేయుఁడనంగనందఱున్।
భావమునందలంచిరికృపావిభవుండతఁడేలరాఁడొకో॥ ౯౦॥

ఆ-వె॥ ఆదశార్ణనాథుఁడత్యంతభక్తితో। ఋషభయోగిఁబొగడిప్రీతియెసఁగ।
వైశ్యవర్యుఁజూచిపలికెవాల్మికిగాఁ। బరఁగెదీవటంచుఁబ్రౌఢిమెఱసి॥ ౯౧॥

కం॥ నీకేమికావలయుఁబ। ద్మాకరయడుగుమదియిత్తుననసీసుమతిం।
జేకొనుమీభద్రాయువు। నీకోడలిఁగీర్తిమాలినిననెనతండున్॥ ౯౨॥

ఆ-వె॥ అంతనెల్లవారినావజ్రబాహుండు । వీడుకొనికుటుంబవిలసితుఁడయి।
సైన్యయుక్తుఁడగుచుఁజనెస్వదేశమునకుఁ । బూర్ణుఁడబ్జుఁడభ్రమునకుననఁగ॥ ౯౩॥

మ॥ పిదపన్వేడ్కనువజ్రబాహుఁడుసుతున్వీక్షించిభద్రాయువున్।
బొదలింపన్యువరాజుఁజేసెమొదటన్బోధించెసన్నీతినిం।
బొదవంబట్టముఁగట్టెనంతటస్వదేశోర్విన్మహారాజుగాఁ।
గుదిరించెన్నిజసింహపీఠమునఁగోర్కుల్పొందసాఫల్యమున్॥ ౯౪॥

పంచచామరము॥ దశార్ణదేశనాథుఁడంతఁ - దానువజ్రబాహుఁడున్।
దశార్ణమంత్రనాథురుద్రుఁ - దద్దయుంభజింపఁగన్।
దశార్థకార్ణయాటబిల్వ - తద్వనంబిదంచిటన్।
దశాంగుళార్థమొప్పఁగాంచెఁ - దత్త్వమున్నవార్థమున్॥ ౯౫॥

కం॥ ఆవజ్రబాహుఁడీకడ । శ్రీవనిబిల్వేశ్వరునికిశ్రీతనుమధ్యా।
దేవికినిరత్నవర్మము । భావింపనొసంగెరత్నవర్మయనఁదగన్॥ ౯౬॥

కం॥ ఆరత్నవర్మమేనీ । కారయఁగొనింకనొగినివ్యక్తంబగునో।
యీరత్నగుప్తకావున । నారుచినినురత్నవర్మయట్టిఁడవంటిన్॥ ౯౭॥

మంజుభాషిణీ వృత్తము.

అనిరత్నవర్మవయి-తంచుగాధిజుం । డనరత్నవర్మయని-ఖ్యాతిఁగాంచిమిం।
చెనురత్నగుప్తుఁడుప్ర-సిద్ధులార్యులెం । చినరాయివేల్పనిప్ర-సిద్ధిఁజెందుఁగా॥ ౯౮॥

రత్నావళి.

ఆలుబిడ్డలనువిడుచుటయగడగు - నన్యులనేనియుమాన్యులఁగా।
నేలుటబీదలసాదలసుకృతం - బెంతయుసజ్జనపూజగడు।
న్మేలుసునీతిపితృప్రియకార్యము - నిత్యశుభప్రదమంచెఱుఁగం।
బోలునుదీనన్రత్నవర్మకృతి - బుద్ధినివర్థిలఁజేయుఁబోరిన్॥ ౯౯॥

అమృతవాహిని॥ ఈరత్నవర్మసర్గంబు । నేరేనింజదువన్వినన్।
గూరంగలరభీష్టంబు । ల్వారలన్నిటమిన్నగన్॥ ౧౦౦॥

ఇది, రత్నవర్మసర్గము.

## రత్నశర్మసర్గము.

ఉ॥ అంతటరత్నవర్మయురమాంచితుఁగృష్ణునిఁగొల్చుచుండెఁదా।
నెంతయుభక్తియుక్తిసుమతీడితభార్యదనున్భజింపన।
బ్ధ్యంతికసీమఁగైరవిణియన్నొకప్రోలనుగృష్ణుఁడేకలన్।
మంత్రముఁదెల్పెవానికిఁదమూవిబుధాకృతిశ్రీహయాస్యమున్॥ ౧॥

తే-గీ॥ తజ్జపధ్యానపరుఁడయితనరురత్న । వర్మకగపడెనత్రియన్ప్రథితుఁడుఋషి।
పూజితుండయియనెద్విజరాజవగుచు । రత్నశర్మవలెన్నిపురాజిలెదని॥ ౨॥

చ॥ అనవిని రత్నవర్మ యమహాత్మ యెవండలరత్నశర్మ యా।
యన చరితంబుఁ దెల్పుఁడని యక్కఱ మిక్కిలి వేఁడ మౌని యున్।
విను మని యాడె వేడుకను వింతగ నెంతయు నాత్మగోత్రజా।
తనతుల యందుఁ బ్రీతి గద తాపసనాథులకేని నేతఱిన్ ॥ ౩॥

చ॥ కలదిల శ్రీఫలాహ్వయము జ్ఞానద మొండొక క్షేత్రరాజ మం।
దలర్చు శివద్విజుం డొకఁడహర్పతి తేజుఁడు రత్నశర్మ నాఁ।
గలిత సమస్త విద్యుఁడు నికామ పవిత్రచరిత్రుఁ డీడ్యుఁడు।
జ్జ్వలమతి బిల్వనాథ పదసారస పూజకుఁ డంచితార్యుఁడున్ ॥ ౪॥

సీ॥ ప్రతిసంధ్యయందు నీవాస్రవంతి నెగౌరి తీర్థంబున నెస్నాన మర్థిఁ జేసి।
మహితపంచబ్రహ్మ మంత్రంబులం బుర భస్మంబు నందగు భసితమలఁది।
రుద్రదయాపాంగ ముద్రితుఁడనఁగను రుద్రాక్ష భూషల రూఢిఁ దాల్చి।
మఱి పరాప్రాసాద మంత్రంబుల జపించి తగఁ దారకానుసంధాన మొనసి।
వచ్చు బిల్వేశు గుడి పూజకచ్చుపడఁగఁ । దదనుకంపాతిశయమునఁ దనుసమేతుఁ।
డైన మనసిజుఁడో దారు కాటవిన్వి । హర మొనరించు నాస్మరహరుఁడొ యనఁగ॥ ౫॥

కం॥ శైవద్విజరత్న మతం । డా వైశంపాయనుఁడన నౌరఱౌరే।
ఖ్యావళి రుద్రాక్షస్ర । గ్భావంబును బంజరముగఁ బరఁగుట నరయన్ ॥ ౬॥

ఆ-వె॥ రత్నశర్మ భార్య రాజిల్లు రత్నాంగి । భువనమోహిని యనఁ బొగడువడ నె।
రాముఁగాఁగఁ జేనె రమణుని మఱివని । ష్ఠునిఁ గవాము దేవుఁ గను సునిష్ఠ॥ ౭॥

తే-గీ॥ ఏకపత్నీవ్రతుం డాట నెంచఁడతఁడు । పెఱ తెఱవలను గృతభక్తి వేఱు దిండి।
వేఁడ నట్లల్ల ద్విజుని నివెలఁదు లెల్లఁ । గోరుదు రభాగ్యు లర్థముం గోరునట్లు॥

ఆ-వె॥ అటులఁ గోరు వారియందొక్కరి తముక్త । యనెడి యాట వెలఁది యచటి గుడిది।
రత్నశర్మఁ జూచి రతి చొక్కుఁ గనుచుండెఁ । గరఁగు ఘున్న వెన్నకరణి సరణి॥ ౯॥

కం॥ కని దాని కామవికృతిన్ । జనవున రత్నాంగి పిలిచి సకి యరొనీకో।
ర్కి నినిక్కము గావాత్రు । చ్చినఁ దీర్చెదననిన నదియుఁ జెప్పెన్నిజమున్॥ ౧౦॥

కం॥ తరువాత నెక్కనాఁడ । త్తరుణియు రత్నాంగి శయ్యఁ దవుఁడుండఁగఁ దా।
వెరవునఁ బలికెను ముక్తా । వరవర్ణినివల చెనిన్నుఁ బనిఁ గొను దానిన్ ॥ ౧౧॥

మ॥ అని తిన్నంగ నెవిన్న వింపను దబిం ద్వ్యాప్తిం బొరిన్మండు కాఁ।
గిననూనెం బొరుడించు చాతఁడు గను ల్గెంపొంద జ్వాలాకృతిన్।
గను బొమ్మల్ముదుటంగ మున్ము డివడంగా ధూమరేఖాకృతిన్।
ఘననిర్ఘోషము గానుబల్కె సతితోఁ గట్టల్క మైనుల్కఁగన్ ॥ ౧౨॥

కం॥ ఏమీ కుం తెనక త్తెవె । యా ముక్తకునద్ది నీకు నా నే నీయ।
ట్లా మాటు నాడ కిటనీ । వే మనుకొంటి వాకొ స్త్రీకువృత్తిఁ దెలిపితౌ॥ ౧౩॥

సీ॥ అన్యాంగనా వేణి యౌనె చూడామణి భావ్యము కృష్ణసర్పము గుఁగాక।
యితరవధూ ఫాలమతిరమ్యమౌనె చతుర్థీందు రేఖ గాఁదోఁచుఁ గాక।

పరభార్యకుచములుభర్మకుంభంబులా పొగలపిరంగిగుండ్లగునుగాక।
పెఱతెఱవవిత్రొడల్బెడఁగగుననఁటులాకశ్లేదినట్టిసంగళ్లుగాక।
యొరునియాలిచూపులాదవించువెఱపును । బూవుదండలనఁగఁబోలుఁగాక।
లాఁతినాతిపలుకులాతేనెలాలికెడు । వెలయనెందువిసముఁజిలుకుఁగాక॥ ౧౪॥

సీ॥ పరకీయగాదుగాపరికింపసామాన్యయననదిసరసమయేన్సరమయయగుఁ।
బరకీయయొకనిసొత్తరయంగబోగముదన్నసుమ్మడిసొమ్ముహానిగాదె।
వెలయాలుగదయనగదయెశూలాఖ్యయారోగాలపుట్టనారూఢియెకద।
నగరమండనయఁటసగరమండనయనఁదనరెడునదియెభోగినియగుఁగద।
యొరుఁడుకట్టివిడువనొదవినపుట్టంబు । కుడువమిగిలినట్టికూడునీరు।
ముడిచివిడిచినట్టిపూదండయెట్లట్లు । యాటనిజముసూవెయాటవెలఁది॥ ౧౫॥

సీ॥ హరిమోహినిగనయియసురులవంచించిసురలకుసుధనిడుచరితవినమె।
రంభనారాయణుప్రచురతపంబును జెఱుపఁబూనినకతఁ జెప్పవినమె।
యూర్వశిదనకుఁదానువ్వొంగువఱపఱనర్జునుశపియించినదియువినమె।
మేనకయాగాధిసూనునిబనిపూనిభంగపఱుచుటనెవ్వగనువినమె।
యయ్యజాముఖిదుర్వాసునత్తిలోత్త । మయలసుందోపసుందులమాన్యతార।
యబ్జుసారంగధరునిఁజిత్రాంగివలవ । వినమెమగలకునగుఁబెఱవెలఁదిమిత్తి॥ ౧౬॥

శా॥ ఔనానేసతినాదువేప్రమదరత్నాంగీననుందెల్పెదే।
స్త్రీనన్యస్వరియింపుమంచునిటునీచేష్టాప్తియిష్టాప్తిగా।
దానిన్నేనుగ్రహింతుభార్యగనినుంద్యాగంబుగావించెదన్।
నానాగేహినినాయకాంఘ్రియుగళిన్వాలెంబతద్రంభనాన్॥ ౧౭॥

ఆ-వె॥ అంతఁగొంతవడికినామెదెల్వినిఁబొంది । బావిఁద్రవ్వభూతమేవెలువడె।
ననెడినానుడియిటనయ్యెనాపాపంబుఁ । బాపుశాపమనియెభర్తనార్తి॥ ౧౮॥

తే-గీ॥ అతఁడనియెనవ్వుచుంజేసియంతనేడ్చు । చనుభవింత్రఘమునుఫలమనఁగవినవె।
పలికితహితంబుఁగల్గెశాపంబుమాన్ప । నాతరముగాదుమేలగుఁగాతనీకు॥ ౧౯॥

కం॥ అననీయాలదిగదయిఁక । ననునీపుట్టువునెట్టునాథగ్రహింతీ।
వనుడునతఁడనియెఁగూరిమి । ననునేకసతీవ్రతునిఁగనారియెఱుఁగవే॥ ౨౦॥

తే-గీ॥ ఆమగువముక్తనాకుజన్మాంతరమున । భార్యయగుఁబద్మనానివృద్ధపాయనిన్ను।
దానిఁగూడనునేననన్నదయితయనియె । మంటినిప్పుడునీకృపఁగంటిననుచు॥ ౨౧॥

చ॥ ఇనుమునుగూర్చియగ్గికఁటయేర్పడుసమ్మెటపెట్లనంగనొ।
ప్పినయలసామెతంగనితివేశ్యకునింపొనరింపఁబూనినే।
ఘనమగుహానిఁగాంచితినిగార్యముమించునటంచునామెము।
క్తనుగనికమ్మముక్శుకిగఁగావుసపత్నిగనాకునష్టనెన్॥ ౨౨॥

మ॥ అనఁగాముక్తగడుంగడుంగనలిరత్నాంగీస్వకీయాఖ్యభో।
గినినేనంచునెఱుంగఁజేసితిభళీకీడేలవాకొంటివీ।

వనినట్లజ్జనినిష్టభంగమయినన్ బ్రాణేశు జన్మాంతరం
బునఁ బెండ్లాడెదఁ బద్మనామును పెనువ్వుం జొందిపోకాలునాన్॥ ౨౩॥

శా॥ ఏమేమీయనదేపాకాలుమనినన్నేఁ బోదునాకంటేము
న్నోముక్తాశుకిపీవుగమ్ముమృతవై యుర్వీస్థలింబద్మనాఁ
గామాస్థన్మణిశర్మకాలగుముభోగస్త్రీయననింద్యవా
దౌషానంబటమన్కియేటికన మేలంచద్దియుంబిద్దినన్॥ ౨౪॥

సీ॥ నీకతంబునఁగాదెనాకు బిల్వేశ్వరభక్తిశ్రీతనుమధ్యభక్తిగుదిరె
నీవుముక్తగనాటనేనురత్నమనైతిగ్రంథముల్గామనకతలఁదెలుపు
నీవుపాడఁగఁగదాకావింపఁబడెగీతకృతులుముక్తాంకముల్ గృతినుతములు
నీపేరనేకదనిగిడెదుర్వాసుఁడేముక్తిజనకుఁడనుముఖ్యకథయు
నీవుశ్రీవని శ్రీవనినెమ్మిఁదలఁతు । వికృతిఘటషోడశదినాప్తివిడిచిపోతె
మాక్తికాలయమిదెరత్నమండపమిదె । ముక్తిమండపమిదెనీకుముదమొసఁగదె॥ ౨౫॥

కం॥ అనిరత్నశర్మముక్తం । బనవిపనవిమనమునోఁగడుబడలుపడంగన్
సునయుఁడుసుముఖుండనునెక । ఘనమిత్రుండింగితమునుగనియిటువలికెన్॥ ౨౬॥

తే-గీ॥ ముక్తయేచుమిశుకియనబాడమినిన్నుఁ । బొందనేరకశుకపురిఁబుట్టిపద్మ
యనఁగనీచెట్టఁబట్టెనింపెనయుమయ్య । పూర్వవృత్తంబెటింగింతుఁబొనరవినుము॥

శా॥ శ్రీరామామణికోడలింగనిమహాశ్వేతన్వచోదేవతన్
సారానేతలవాకిటన్నిలిచెదేచాలుంబు రేనీసతీ
చారిత్రంబనిపల్కెనల్కమెయిభాషాయోషయోయత్తనే
నేరన్నిన్నన శ్వేతకేతువెఱుఁగున్నీనాచరిత్రంబనన్॥ ౨౭॥

తే-గీ॥ అత్తకోడలినిశపించెనగుములంజె । వంచరుగుదెంచిశుమియింపుమనుచుఁబుండ
రీకుఁడొనరింపఁబ్రార్థనశ్రీకొడుకున । కిచ్చెశాపంబుమూథుండవీవవుదని॥ ౨౮॥

కం॥ తరళికయత్తటీననెనో । సిరియపరాధంబులేనిచెలువను జెలువున్
దురితమునకశపియించితి । కరిపూజితవపుటఁగం బెగజధర్మమనన్॥ ౩౦॥

మ॥ కినుకన్భార్గవివల్కెనుల్కనహాకీర్తింపఁగానెప్పనీ
ఘనచాతుర్యముభార్యగాఁదరళికాకమ్మింకనీపుండరీ
కునికిన్మర్త్యభవంబులన్నవతినీకున్నీమహాశ్వేతయాఁ
గనెదన్మీనెనరంతనెంతయునువేడ్కంగాంచుఁడీయంచనన్॥ ౩౧॥

సీ॥ శ్రీపుత్రయోపుండరీకనీవయితయ్యరత్నదాసుండనరత్నగుప్తుఁ
డనరత్నవర్మనాఁగనురత్నశర్మయనంగఁదెల్పెదనునీవింగవినుము
సుముఖిచింతామణిసుమతిరత్నాంగిగాఁదరళికభార్యనీకయ్యెనయ్య
కుముఖిగాహేమగాఁగుమతిగాముక్తగానయ్యెమహాశ్వేతయాత్మదయిత
యనినరత్నశర్మహాకపింజలమిత్ర । రత్నమాయటంచుఁబ్రతిభదనర
సుముఖుఁగౌగిలించిమముశోకవారాశి । గట్టుఁజేర్పనీవుపుట్టితివనె॥ ౩౨॥

కం॥ సుముఖుఁడు మీకిటు దెలుపుట । సుముఖుండను పేరు నాకు సొబగొందెను శా।
పము మీకుఁదీఱెఁ బద్మా । క్షిముదంబిడు నానుజ్ఞానవృద్ధియనిచ నెన్॥ ౩౩॥

శా॥ ఆదిం దోఁచిన యర్థమే నిజముగా నాత్మన్ స్ఫురింపంగ నిః।
ఖేదం బై యల రత్నశర్మ సతి నింగీర్తించు రత్నాంగినిన్।
మోదంబారఁగ బద్మఁ గూడి యలరున్ముగ్ధేందు చూడుండనం।
గా ధర్మజ్ఞుఁడు సాంఖ్యశాస్త్రగురుఁడై క్రాలెన్ శివాద్వైతియై॥ ౩౪॥

కం॥ నీవును దాదృశుఁడవె యని । భావించితి గుణములన్ స్వభావముచేతన్।
గావున సురత్నవర్మా । యావితమున రత్నశర్మవగుము నెమునినాన్॥ ౩౫॥

ఆ-వె॥ సంతసించి రత్నశర్మ యత్రికి మ్రొక్కి । స్వామి మీ దయ నిటశర్మనైతి।
సాంఖ్యమే మోకో ప్రసాదింప నర్హు లీ । రనియె నతఁడు గౌతము నడుగుమనె॥ ౩౬॥

కం॥ నేనెట గౌతముఁ డెటనో । మానీంద్రా కూడికయెటు మా కౌనఁ గూడున్।
నానీకుఁ బుత్రజననం । బౌనంతటు వానివలన నదియు ఘటిల్లున్॥ ౩౭॥

ప్రభాతవృత్తము॥ అనుచును వీడ్కొని - యత్రియె గెఁజంద్రుం।
డును జనెఁ దండ్రికి - డుంబ్రణామమోనాఁ।
గను జరమాద్రికిఁ - గల్యము య్యెనంచున్।
వనజహితుండును - వచ్చెవిచ్చెఁ దమ్ముల్॥ ౩౮॥

సీ॥ చింతామణి యనివ చింతురే లన మంత్రము నెడుఁగర్ణామృతాద్యమనియెడును।
సుమతీయనెద రేమి సుమతిశతకము రత్నాంగి సారంగధరాంబిక గద।
తలఁప మీ రేటికిఁ దరళిక యనియన మించు మాడిక్క సుషుమ్న మించు నను।
ముక్తావళిని నేల సక్తిఁ దలంతురు ముక్తావళి భజింప యుక్తము గద।
శుకి యనఁగ నేల శుకమాత శుకియ కాదె । పద్మయంద్రెద్దిలక్ష్మి సంపత్ప్రదయదె।
హా మహా శ్వేతయం ద్రేమి యా కథ విను । మనుచు సుముఖిని రత్నశర్మ యలరించు॥ ౩౯॥

మ॥ కవిరత్నంబనఁగ న్రచించి కృతులం గాంచెన్ యశోవిత్తముల్।
శివులం గూర్చియు నర్చె గ్రంథముల నోలిం గ్రాలెఁ దత్పుత్రుఁడే।
యవునం చెంచఁగ లోకులెల్లెడల రాజాస్థాన విద్యాగురు।
త్వవిశిష్టుండుగ రత్నశర్మ వెలసెన్ భాస్వత్ప్రభాభిఖ్యుఁడై॥ ౪౦॥

రత్నావళి॥ మగనికి వెగటుగ నాడఁగఁ గూడదు - మగువ యధర్మము వల్కిన చో।
వగఁ గుడి చెడి బహు భవములఁ గావున - భర్తకు భార్యయ డంగియెయుం।
డఁగఁ దగుఁ బెద్దల మాటకు నడ్డప - డం గూడద నెడు సచ్చరితన్।
బాగడఁగఁ దగుఁ గద రత్నశర్మకృతి - పుణ్యుల కెల్లఁ బ్రమోదదమౌ॥ ౪౧॥

అమృత వాహిని॥ ఈ రత్నశర్మ సర్గంబు । నేరే నిచదువన్విన్నన్।
గూరం గల రభీష్టంబు । ల్వారల వ్వారి గారహిన్॥ ౪౨॥

ఇది, రత్నశర్మ సర్గము.

## ర త్నా య న స ర్గ ము.

సీ॥ ఆరత్నశర్మ శ్రీకైరవిణీపురిద్విజరాజనంగను దేజరిల్లఁ।
జూడామణియనెడి శూద్రకన్యక యెన్మిదేండ్లదియొక్కతె యెలమి నతని।
నడిగెనకారాదులక్షరాలేటికి నిన్నియీక్రమమున నున్నవనుచుఁ।
దోడనే తెలుపఁ బ్రత్యుత్తరముం దనకుం దోఁపమినిమదిఁ గందికుంది।
బాహ్యపాండిత్యమేల కాల్పనెయనియతఁ । డాంతరప్రాజ్ఞతయె ముఖ్యమనియనికొని।
ధ్యానముం జేసెఁ దను మధ్యఁ గానుపుఁగనఁ । గాంతువనియాంతరజ్ఞానకాంతుసుండె॥

చ॥ అనువుగ లేఖ సోపకరణౌఘము నారదుఁ డిచ్చినట్లు దాఁ।
గనికలమేలు కాంచఁబోడక ట్టెను నెట్టన నాదయంత్రమో।
యన శ్రుతిరత్నశర్మకును దంతలతాకృతి నాదమాదినం।
తనుదమదంతసూచకని తాంతరవంబన ఖండసంఖ్యలన్॥ ౨॥

కం॥ తనుమధ్యాతత్త్వనిధిన్ । ఘనకృతిసురభాషనతఁడు గావించివఠెం।
చెను వినిసుబ్రహ్మణ్యుఁడ । వని సురుఁడు గన తనికొసఁగె వరవాగ్విద్యన్॥ ౩॥

ఉ॥ అంతట రత్నశర్ముఁడుదదాజ్ఞను విక్రమమాఖపంచమిన్ ।
సంత సమారఁ దిర్వలమునం దనుమధ్యకు భక్తి మ్రొక్కియ।
క్కాంతమహోపదేశమునఁ గాంచెను భార్గవకల్పవల్లిఁ దా।
నెంతయునిష్ఠతోడ జపియించెఁ దపంబొనరించెఁ బిమ్మటన్॥ ౪॥

మ॥ కలలో నొక్క శివద్విజుండు దనకుం గాన్పించి ప్రేమంబునన్।
లలితాకారములై నశ్రీనృహరిసాలగ్రామముల్ రెండిడం।
బొలు పొందంగని తెల్పె మిత్రులకు నా ఫుల్వారు పుత్రద్వయం।
బలరున్నీకు నృసింహయుగ్మమని రాహోయక్లైయయ్యెంగదా॥ ౫॥

సీ॥ ఆరత్నశర్మకు లాంగనారత్నంబు సుముఖి చూల్దాలిచి సొబగుమీఱె।
సవితృగర్భగనొప్ప శక్రాశకైవడి జరిగె సీమంతపుంసవనములును।
బదపడి కాంచెసుబ్రహ్మణ్యుఁ డారత్నశర్మను శంకరాచార్యశిష్య।
నరసింహభారతీగురురాజకోటీరయుక్తుఁ గానయ్యెఁ బుత్రోదయంబు।
నగ్రజుండు పుట్టినప్పుడు ద్వైతిగా । మనిన తండ్రిమతము మాఱుననియొ।
తనియనుల్లములను ద్వైతుల ద్వైతులు । సుత్సవద్వయంబు నొనరఁ జేసె॥ ౬॥

మ॥ అదుకన్యామున బూదిఁ బూసికొనినట్లద్దంబునం గాంచిన।
ట్లిది ధర్మంబగుఁ బూనుమంచుఁ దనునే రేరో మహాత్ముల్పదిం।
బదిఁ దెల్పంగను దాను మైకొని తదభ్యాసంబునుం జేసిన।
ట్లైదఁ దోఁపంగలలందుఁ బల్మఱు నతం డెంచెంగ దున్వింతగన్॥ ౭॥

కం॥ ఒనరిన ప్రస్థానత్రయ । మునకుం భాష్యములు పెక్కు పుట్టెని జమెదో।
కనుఁగొన సాధనమెదియో । యనియాతఁడు రత్నశర్మ యనిశము వగచున్॥ ౮॥

ఉ॥ వేదములర్థవాదములువిస్తృతముల్విధోక్తియుక్తముల్।
భేదమభేదముందెలుపుఁబెద్దగనాగమముల్పురాణముల్।
రాదిదినిక్కమంచునఁబ్రబ్బువిరోధములేలబ్రహ్మసూ।
త్రాదులువైఖరీమహిమనానుగదావివిధార్థముల్గటా॥ ౯॥

కం॥ ఏదిమూలమొవైఖరికె । య్యాదిసార్వజనీనముగసమార్థప్రదమో।
యదినిజమవుఁదనుమధ్యమ । సదయహృదయదానినాకుసమకూర్పవలెన్॥ ౧౦॥

ఆ-వె॥ కన్నతల్లిగాదెకన్నతండ్రినిఁదెల్పఁ । దగినదౌటబ్రహ్మతత్త్వమునిజ।
ముగనుదెలుపవలఁతిజగదంబయనితను । మధ్యఁదలఁచెనతఁడుమఱిభజించె॥ ౧౧॥

కం॥ ఆరేయిగలనుగాంచెన్ । ధీరుండయిరత్నశర్మతిరువలమునన।
య్యారనుమునుదాఁగననిది । యారౌద్రినినేకవల్లినంతంబగటన్॥ ౧౨॥

ఆ-వె॥ వైద్యనాథుఁడనెడుబ్రాహ్మణుండొక్కఁడు । జ్జయినినుండివచ్చిశర్మకప్పు।
డచ్చెరియముగామహాకాళికుంకుమం । బిచ్చెనగ్నిశిఖగనెడలఁదమము॥ ౧౩॥

చ॥ తలఁచెనురత్నశర్మమునుదానెపుడుంగననట్టిదేటికో।
కలఁగననయ్యెనయ్యదనఁగాళిగఁదోఁచునుగాంతుఁబోయియు।
ట్లలవడెనేనినుజ్జయినియందనువాందెడుకాళియద్దెయా।
విలసితకుంకుమంబుననుబేర్మినిఁబూజయొనర్చెదందగన్॥ ౧౪॥

కం॥ అనితలఁచితిరువలమునకుఁ । బనివినియటనటులెయేకవల్లింగాళిం।
గనుఁగొనితత్కుంకుమముం । గొనిపూజించెనుభజించెగురుతరభక్తిన్॥ ౧౫॥

ఆ-వె॥ అంతఁదోఁపనాత్మవింతగనేమేమొ । యతఁడుకైరవిణికినరుగుదెంచి।
యత్రివాక్యమెప్పుడలరఫలించునో । యంచునెంచుచుండనద్భుతముగ॥ ౧౬॥

## హేమంతర్తువర్ణనము.

మ॥ చనుదెంచెంధనురంచితుండుమకరస్థాయిత్వతాకుండుమ।
ర్త్యనుదద్దుర్మిహికేషునిర్దళితపాంథాంగుండునేమంతికా।
ఘననీరాజనరాజితుండుమఱియొక్కండొక్కమారుండనన్।
వణఁకంగుంభినిపంచమర్తువడరెంబంచాస్త్రసామంతుఁడై॥ ౧౭॥

సీ॥ పుట్టినిల్లెడలఁడుబొమ్మతామరచూలివెన్నఁడెన్నఁడుసాలువిడువకుండుఁ।
దోలుదాలుపుపులితోలునేనుఁగుతోలువదలఁడుచిచ్చుఁగన్నెదవినమఱి।
వేఁడివెల్గులఱేఁడుపేరెంబువాఱెడుసాంబరుండయిపగలఱఁగసరగ।
వేఁడివేలుపునిప్పవెలయునిగుఱువల్వఁగప్పికొంచడఁగాఱునెప్పనెడఁగ।
వైద్యుతాగ్నివార్తాశేషమైద్యుతియడెఁ । బాడబాగ్నియొయడుగంటెవార్ధినంట।
కతగనయ్యెనుమనుజులగతియిటులని । చెప్పఁదరమానెచలిబాదయప్పుడహహ॥ ౧౮॥

సీ॥ మగువలుమగలుదమకుఁగలచెలువంబుఁజీరలసొమ్ములఁజేరియొరులు।
చూడనట్లొరులవిసూడంగఁదామునుగైనేనికొనితమ్ముఁగాంచిమరుఁడు।

మరువముదవనమున్మొలకురువేరునుజేమంతులునుగూర్చిచేసెఁబూజ।
హితమతిననఁదగియిండ్లువెల్వడిమఱుతండ్రితిర్నాళ్లసుతగునెపమునఁ।
జెలులతోగుడికేగిరి స్త్రీపురుషులు । చాయయద్దాలుగానాత్మలేయదరిరి।
బత్తియెట్టిదొవెన్నఁజెప్పగిదిఁగనుసె । పగలువత్తునురాపత్తుపరఁగెనిట్లు॥ ౧౯॥

ఉ॥ వేకువస్త్రీలుపూరుషులువేడుకనాడిమడుంగుగుడ్డలన్।
జోకనుదాల్చిబొట్టులిడిచొప్పడవేల్పులఁబూజసేసిస।
త్ప్రీకటభక్తిఁబొంగళులబాగుగమెక్కిసుగంధమాల్యముల్।
వీఁకనుదాల్చిపొల్చిరిలవీరలువీరులుగెల్చినారనన్॥ ౨౦॥

చ॥ పలపలఁదెల్లవారఁదలవాకిళులంగయిసేసిముగ్గులిం।
పలరఁగఁబెట్టిగొబ్బిలిడియాపయిగుమ్మడిపూలఁగ్రుచ్చిచె।
ల్వలుగనవృద్ధులెంత్రుగుహావర్ధితలింగములంచుఁగాముకుల్।
దలఁతురుమన్మథగ్రహవిలాసవిలాలసలంచుమించుగన్॥ ౨౧॥

శా॥ ఈగొబ్బుల్పయిగుమ్మడుల్పొదలఁగానేపొందునాపోల్కినే।
రాఁగాఁజేసెదనెండచేఁబిడకలోర్వంగాలెడుంగాకవే।
వేగంబొంకలికించుఁదెల్పుననఁగావేవెల్గువానింగనున్।
రాగాస్యుండయిమిత్రనామకులుక్రూరస్వాంతులిట్లుండ్రుగా॥ ౨౨॥

సీ॥ అపుడుస్వభాన్వబ్దమందుధనుర్మాసదర్శమునన్భృగుతనయవాస।
రమునరేదొలిజామునమృగలాంఛనుఁడల్లమూలోడువునుగూడముదమెలర్ప।
బహుముఖియైనట్టివైఖరిచేసెనెక్కడలననిల్కడలేనిభావమునఁగ।
రత్నశర్మయునెక్కరమ్యగృహంబుననుయ్యాలయందూఁగుచుండెనుండఁ।
దొడలపైనున్నమూడేండ్లకొడుకునెడివె। నాయనాగౌతముఁడుమునినన్నుఁజూచు।
చనెడునానందరహియనియనుచులేచె। లేపెమ్రొక్కెనుమ్రొక్కించెలీలజనకు॥

చ॥ అచటికివచ్చెఁజెచ్చెరమహాతపుఁడాతపతేజుఁడైందవ।
ప్రచురవిభాత్ముఁడాత్మభృతభస్ముఁడునస్మరుఁడీశ్వరార్చనా।
రచితతదీయభక్తజనరంజనుఁడక్షపదుండుగౌతముం।
డుచలితశక్రుఁడున్విదితుఁడున్విదితావనిదేవశార్యుఁడున్॥ ౨౪॥

ఉ॥ వచ్చియతండుమ్రోలనిలువంబడివెంబడిరత్నశర్మచే।
నెచ్చుగఁబూజలంబడసియెంతయుసంతసమొందిపొందుగా।
నిచ్చగనిచ్చిదీవెనలనెమ్మియెనీకునభీష్టమెద్దియే।
నిచ్చెదవేఁడుమన్ననతఁడెన్నెనుసాంఖ్యముమానియిట్లనెన్॥ ౨౫॥

మ॥ కలదొక్కండుదశత్రయైకదశవిఖ్యాతాఖిలామ్నాయభా।
వలసద్బోధకసద్బుధాంచితమహావాక్యప్రబోధోదయో।
జ్జ్వలమాబిల్వవనంబుతారకరసస్థాయిత్వమేహ్యాపగా।
కలితంబింబగుతాళిబొట్టనఁగమోక్షశ్రీకినీక్షోణికిన్॥ ౨౬॥

ఉ॥ ఆయదిబిల్వకంబరయనాకడఁగాశికయేకవల్లియే।
నాయికయాకెఁగొల్వకజనప్రచయంబటునెట్టిసత్క్రియ।
ల్వేయిటఁజేసెనేనియుఫలింపవునాకయులేకయబ్ధిపై।
నేయనువొందిదాఁటనగునెట్టులచక్రరథప్రయాణముల్॥ ౨౭॥

ఆ-వె॥ తనకునభిముఖముగఁదనరించుశివునెది। యదిశివాశ్వముదనునరయువాని।
కభిముఖముగనుండునానందిభావమా। శివుఁడుగాకొరుండుచెప్పఁగలఁడె॥ ౨౮॥

ఆ-వె॥ అందువల్లనందునఖిలసిద్ధులుగల్గు। జపముఁదపముయోగసరణిఁగూరు।
వారికౌటనీవుభార్గవకల్పవ। ల్లినిభజింపుమయ్యకనెదుసిద్ధి॥ ౨౯॥

చ॥ అనవినిరత్నశర్మజగదంచితుగౌతముఁగాంచినేనటన్।
మునుకొనిచల్పితిందపముముఖ్యముగాఁగజపించినాఁడఁద।
న్మనువునుబూన్కిఁదత్ఫలమునాకులభింపకయుండునూషరం।
బనఁదగక్షేత్రమద్దియననమ్మనియిమ్మెయినాడఁగూడునే॥ ౩౦॥

కం॥ నీవుపూర్వభవాఘంబున। నాపట్టుననింతవట్టునందవుఫలమి।
ష్టాపాపముదొలఁగెనగుటఁ। బ్రాపించెదువేగఁబూర్వభవకథవినుమా॥ ౩౧॥

సీ॥ బిల్వేశదక్షప్రవేష్టోద్భవుండయిమౌక్తికుఁడనుమునిమణియొకండు।
రత్నర్షియనఁదానుప్రథితుఁడవుటఁజేసెబిల్వేశురత్నేశవిశ్రుతునిఁగ।
బొందియాదూర్వాసమునిపుత్త్రిముక్తనమ్ముక్తిముక్తియెయనిమోహమొంది।
ముక్తర్షియేయనముక్తర్షియైమఱిముక్తదేవుండయిముక్తదేహుఁ।
డయ్యెరత్నాయనుండననవనిఁబుట్టెఁ। గొల్చెబిల్వేశురత్నేశుఁబొల్చెసాంఖ్య।
విజ్ఞుఁడైయోగియైయుండెబిల్వవనము। నందతఁడెనీవుసందియమందవలదు॥ ౩౨॥

తే-గీ॥ ఏకవల్లిఁగులేశ్వరినెలమిఁగొలువ। మునిభవాంతరమునరత్నమునుమఱచితి।
వైనరత్నేశ్వరుండగునల్లబిల్వ। పతినిఁగొల్చుటచేరత్నపదుఁడవైతి॥ ౩౩॥

ఆ-వె॥ రత్నదాసుఁడనఁగరత్నగుప్తుఁడనంగ। రత్నవర్మయనఁగరత్నశర్మ।
యనఁగనలుతివయ్యాయల్లదుర్వాసుఁడు। మౌక్తికువలెనిన్నుమనుమనెఁగద॥ ౩౪॥

సీ॥ రత్నముశైవమంత్రముగుప్తమెఱిఁగీవురత్నాయనుఁడవౌమరత్నశర్మ।
రత్నముబిల్వేశ్వరచరిత్రమవుగోప్యతరమనిదాఁచితితనరనీక।
రత్నముసాంఖ్యశాస్త్రముగోప్యతమమనిచెప్పవైతెటువంటిశిష్యులకును।
గావునఁబుట్టితివీవిలనిఁకనేనిఁబ్రకటింపుమీనీజనికిఫలములు।
ప్రకటనముసేసినన్నీకుఁబ్రత్యవాయ। మొదవదుత్తమసుకృతమానెనరుముక్తి।
పరఁగురత్నాయనుఁడుసాంఖ్యగురుఁడనఁగను। వెలయురత్నేశుఁడనజగద్వినుతుఁడవయి॥

ఉ॥ ఏమఱితయ్యాయిజ్జనినెయెంచునినున్దనుమధ్యమాశ్రితుం।
డౌమహనీయుఁడీతఁడనియాడఁడెయాఁడెన్నృసింహభారతీ।
స్వామిఫలద్వయంబెలమిసత్సుతయుగ్మముగల్గునీకటం।
చామెయిఁగాంచవేకలనహాశివదత్తనృసింహమూర్తులన్॥ ౩౬॥

సీ॥ అనిమఱిగౌతమమునిరత్నశర్మతోన నేఁజోళుసకును ధాన్యముఁగొలుచుటఁ।
గోత్రశంధాననియత్తఱిన ఱవవారనిరిబిల్వేశ్వరునయ్యభిఖ్యఁ।
బరఁగుశివద్విజవరుఁడొకరుఁడుదీక్షితుండయిశివయోగధూర్జటియన।
వేన వేల్శిష్యులతోనెందుఁగడుగౌరవంబుఁగాంచెనుబిల్వపతిసమర్చఁ।
గంజశిఖరిసమాధిస్థకలనఁబొందెఁ । గొమ్మకొండనృసింహాఖ్యఁగొఱలెయతిగఁ।
బుత్త్రుఁడయ్యెనునీకునన్యోబల్చికనియె । సద్గురువరోపలబ్ధినశాంభుఁడితఁడు॥ ౩౭॥

కం॥ నీసతిసుముఖిసుతార్థము । గానేవించెన్సుభక్తిజ్ఞానాంబనుద।
ద్భానురఫలమీజ్యేష్ఠుఁడు । నీసూనుఁడుజ్ఞానియగుచునెగడెడుఁబుడమిన్॥ ౩౮॥

కం॥ నీవత్తనుమధ్యనుశ్రీ । దేవిన్సేవించినావుధృతిబహుకాలం।
బావరదఫలమిడెడునీ । కావిర్భూతుఁడుకనిష్ఠుఁడాత్మజుఁడినుఁడా॥ ౩౯॥

సీ॥ ఆదిభరద్వాజునంతనంగిరునివిశ్వామిత్రునత్రినిఁజరణనయను।
ననుఁగనుంగొంటిరత్నాయనుండగుచున్నవాఁడవునీకిఁకవలయుబ్రహ్మ।
యతఁడెజగద్గురుఁడాబిల్వనాథుండుపంచాననుఁడుగఁగాన్పించెనింక।
షణ్ముఖుండుగఁదోఁచుషష్ఠముఖమునీవుగాంచెదుప్రజ్ఞానఘనుఁడవాదు।
వరయఁబ్రజ్ఞానమామంత్రమగునురత్న । మదియెప్రాసాదమందుపైనమరఁదోఁచుఁ।
దానెతారకకలశంబుదానిఁగాంచి । తనరురత్నేశుఁడుగననిచనియెనుముని॥ ౪౦॥

సీ॥ ఆరాత్రియేస్వప్నమందతనికినొకశైవద్విజుండుసంజ్ఞానముఖము।
నగుచుఁగల్యాణాంతమగువేదమంత్రంబుఁబలుకుచునీవాశివక్షీరంబు।
నిచ్చెఁగప్రవుదివ్వెయెత్తరంబుగనందువెలుఁగజ్యోతిర్లింగవిలసితముగ।
గన్నెరుపూదండసన్నుతప్రాసాదమంత్రజపాక్షదామముగనుదగఁ।
బరఁగుముక్కంటిపంటిచిప్పలునిగూఢ । తత్త్వమునువ్యక్తమునుజేయఁదనరుబాది।
ప్రోవుభగవద్గుణౌఘంబుఁరీవిఁదెలుప । నిష్కమొక్కటిసాంఖ్యసన్నిధినిఁజూపు॥ ౪౧॥

మ॥ మునివాక్యంబుఁదలంచియాతఁడతనిన్ భూతేశుఁడాబిల్వనా।
థునిఁగానెంచినమస్కరించికనేఁజేతోవీథిఁగప్రంవుది।
వ్వెనునందుండెడునిష్కమందుఁదగఁగాన్పింపంగనామార్గదా।
యునిసంఖ్యాత్మికగాఁగమొక్కెమఱియయ్యెన్సాంఖ్యవిద్యార్థిగాన్॥ ౪౨॥

చ॥ తొలుతనువానికిన్మదినిఁదోఁచెనువింతగబిల్వనాథసాం।
ధ్యలసితదీపికార్చనమయందునశైవషడర్ణమంత్రము।
జ్జ్వలముగసర్వమూలమయిసంఖ్యలవర్ణములందుఁదారకం।
బలరనెగిన్సమస్తమతజాంచితమూలమునుత్తెఱంగులన్॥ ౪౩॥

సీ॥ గాయత్రిద్వాదశఖండాత్మకముపరహంసపరమహంసులలరఁబొలిచె।
మఱిజీవదేవైక్యమఱిముఱిదెల్పెనువేదమాతృకగఁబ్రాసాదయుక్తి।
వ్యాహృతుల్దెల్పెనుబ్రాసాదమంత్రమున్స్వీయాక్షరములచేసిద్ధముగను।
ప్రణవంబెఱింగించెఁబ్రాసాదమునుదారకముస్వార్థమదియెసత్యమనిమొనయ

నిట్లుతత్తునసత్తనోంకృతియునాత్మ । తత్త్వములఁదెల్పనాతండుతాత్త్వికుఁడయి।
సత్యమద్వైతమొందఁదత్సాధనంబు । సాంఖ్యమనిపూనిపరికించెసముచితముగ॥౪౪॥

సీ॥ వేదముశివమనివిశ్రుతిఁగనుటచేననుశివోఽహమ్మనియాగమమును।
గానశివాద్వైతమానుప్రాథమికంబుఋఙ్ముఖ్యవేదాఖ్యలెననితెలియ।
ననునోంనమశ్శివాయయనికావుననంతశివవిశిష్టాద్వైతమువుద్వితీయ।
మామ్నాయములునాలుగాఖ్యహ్రీమనశాక్తమతమేచెవైష్ణవమతముహరిగ।
నవలవేదాదియోంకృతిసోఽహమనేడు । ఋఙ్ముఖంబులుజీవదేవైక్యబోధ।
కంబువేదంబనుచునుయోగంబుప్రబలె । స్వానుభవమునఁగర్మమద్వైతముదుద॥౪౫॥

సీ॥ జ్ఞానప్రధానమైకలిగెనద్వైతంబుప్రజ్ఞానమేబ్రహ్మపదమనుచును।
సోఽహమనంగదాసోఽహమంచునువిశిష్టాద్వైతమబ్బెభక్త్యతిశయముగ।
వెలయఁగవేదముభేదార్థమేయనిద్వైతమువ్యవహారరీతిమెఱసె।
సాంఖ్యమూలముగాకస్వాభిమతంబుగఁబ్రబలెనద్వైతేతరమతశతము।
పరమహంసులనుటపరఁగునద్వైతిస । న్న్యాసులనుయథార్థమలరుటనట।
ద్వైతిమస్కరులనుబరమహంసులనుట । గాంచనేతిబీరకాయయయగు॥ ౪౬॥

కం॥ భూతలమునందుమాయా । మాత్రమిదంద్వైతమనుటమఱియారయన।
ద్వైతంపరమార్థతయను । టీతఱిగుఱిపడెనటంచునెంచెనతఁడెదన్॥ ౪౭॥

సీ॥ జీవదేవాభేదసిద్ధాంతమొనరించెశివవిష్ణ్వభేదంబుఁజెప్పెనొప్ప।
శంకరుండైమొక్కసాధువుల్వినఁగనునారాయణయటంచునలరఁబలికి।
శంకరనారాయణాంకుఁడొక్కండనెమఱిశివోఽహమ్మనిమహిమఁదెలిచె।
నద్వైతమతముసత్యమనిబోధింపించెమధ్యార్జునేశుచేమహిజనులకు।
నతఁడెసాంఖ్యవిజ్ఞుఁడగునుసర్వజ్ఞుండు । శంకరుండతండెశంకరుండు।
నాజగద్గురుండునతనిదేభాష్యంబు । సాంఖ్యసమ్మతమ్ముసత్యమరయ॥ ౪౮॥

కం॥ అనినిశ్చయించితన్మత । మునఁజేరఁగఁగోరెక్షీరమునఁజక్కెరనాఁ।
గనురత్నాకరమునశు । క్తినిఁబొందెదుస్వాతిచినుకుతెఱఁగొనరంగన్॥ ౪౯॥

కం॥ శాంకరమతతత్త్వంబుం । బొంకముగానరసియాద్యముగనలరునురే।
శాంకితశృంగేరీపీ । ఠాంకజగద్గురునిమతమునభ్యర్థించెన్॥ ౫౦॥

సీ॥ అందుశ్రీసచ్చిదానందశివాభినవనృసింహభారతీస్వామిస్వగురు।
ప్రీతిపాత్రుండనిప్రియముమైద్వైతపంజరబద్ధముక్తునిఁజలుపనతనిఁ।
దారణాషాఢాసితవరపక్షంబునంబంచమినిన్భానువాసరమున।
నద్వైతిఁగావించెనాతఁడైద్విజరత్నమంబికాకరరత్నమయ్యెసాంఖ్య।
ఖనినినద్వైతమనురత్నమునుగనుటను । ఘనతనద్వైతిరత్నమీయనయనఁదగె।
నంతనారత్నశర్మరత్నాయనుఁడను । ఋషిగనామెనుమార్గదాయినినిజేసె॥ ౫౧॥

శా॥ ఆరత్నాయనమానికత్తఱిద్వితీయాత్మోద్భవుండొక్కఁడిం।
పారంగల్గినృసింహరుద్రులయభేదాప్తిన్నిజాఖ్యాద్వయిన్।

శ్రీరంజిల్లఁగఁదెల్పె బిల్వపతికిన్ శిష్యుండెయాతండ్రివా
లారన్ శంకరశిష్యుఁడయ్యెఁదదభేదావాప్తియబ్రంబొకో॥ ౫౨॥

లఘురత్నావళి॥ తాసమకూడినయక్షరసాంఖ్యను - ధారసముందానెకఁడే।
గ్రాసముగాఁగొనకెల్లరకెడుటవ - రంబనిసంస్కృతభాషన్।
జేసెనతండలమార్గదాయినిని - జెప్పెఁదెనుంగునసారం।
బౌసువర్ణమణిమాలికఁ జెప్పెద - నారయుఁడీరుదగంగన్॥ ౫౩॥

## అక్షర సాంఖ్య శాస్త్ర సంగ్రహము.

### సువర్ణ పద్య రత్నమాలిక.

౧॥ ఆదిమధ్యాంత్యశూన్యము పూర్ణమోంకృతియగునుశబ్దబ్రహ్మము దెశివోహ-మనఁగవాక్కు।
వాగ్భేదములు నాల్గుపరయుఁబశ్యంతిమధ్యమవైఖరియనంగనవియెసంగు-నరయంగన్।
బరజ్ఞానమాత్రయాఁబశ్యంతి నాదాత్మికయవుమధ్యమసంఖ్యగాఁగనఁబడుఁ-గాంచవ
వర్ణస్వరూపయౌవైఖరివివిధభాషాకారగానసత్యంబుదానె-యగునెటులన్। [లెన్।
సంఖ్యసర్వత్రసమమాటసత్యమగును - సంఖ్యలచేఁ।
గలుగుటనుసత్యమగునుసాంఖ్యంబుదానఁ - గలిగినవే।
వర్ణపదవాక్యములుసత్యభావదములు - వంద్యములౌఁ।
గనుకనక్షరసాంఖ్యముంగఅవవలయు - జ్ఞానముకై॥ ౫౪॥

౨॥ జ్ఞానంబు బిందువుగానెప్పనాదంబునవఖండమయిమఱినవమమవుచు-నవునోమని।
బిందువునున్నయెపృథు నాదఖండముల్సంఖ్యలుతొమ్మిదై సర్వగతఁబ్ర-శస్తములై।
యూపదియంకముల్ హస్తాంగుళులనెన్నఁబడెడునుగుడినుండియెడమకొగిని-గడఁగికనన్।
దగును గేల్మోడ్పెయౌఁదాదశాంగుళమనఁజనుదశార్థంబుప్రాసాదమనువు-సాధువుగా।
మదిశివాయయన్నఁబదియవుఁగూడంగఁ - బదిగూడంగ।
నోంనమోయనియగునెగిఁగనుమిదె - యొప్పఁగదా।
లోకయాత్రకెద్దిప్రాకటమార్గమౌ - శ్రీకరంబ।
కానఁగంద్రులేచికరయుగంబుఁ-గడుహితంబ॥ ౫౫॥

౩॥ ఆదినోంకారంబునందవర్గము పుట్టెనైదుతొమ్మిదిమొత్తమైనలిపుల-నంతనాను।
నవనవార్ణములనుద్భవమందెఁగటవర్గములుఇనల్ మదబిందువులుగనెగిని-విలసిలుఁగా।
పంచాక్షరములలోఁబరఁగుపవర్గంబుమాక్షరంబునఁగల్గెనటశివాయ-యనుటవల్లన్।
గలిగెనష్టాక్షరకలితంబయి యవర్గమావర్ణములునల్వదైదవున్శి-వోఽహమనన్।

---

లఘురత్నావళి॥ అలరత్నావళియేగురువెడలుట - నంతమునసులఘురత్నా।
వళియనిపలుకంబడుఁబదునేడిట - వళియొప్పెడునప్పగిదిన్।
దొలుతనుమాత్రలుపదునాఱగుమఱి - దొడరెడుద్వాదశమాత్రల్।
గలయఁగనిరువదియెనిమిదిమాత్రలు - గాదెహరిహరైక్యంబే॥

బు ఌలురలతుల్యములుగ గ్రహింపఁబడెడు - నెన్ననిఁకన్।
మాననుస్వారమువిసర్గమానుహాను - లీనములే।
యవిస్వరానుగములుగాననంకములను - నందవిటన్।
వేఱుగానున్న నే లెక్క-బెరయుస్వరము - విదితముగా॥ ౫౬॥

౪॥ ఒకటితొమ్మిదభేదయుక్తిలావలెమూడుగానాళకారంబుగణనయందుఁ-గనుఁగొనంగ।
ఖాక్షర మొండు రెండాఱేడుదొమ్మిదిపదిపదకొండునాఁబరిగణనను-బరికింపఁగ।
సామాన్యముగనానుసంయుక్తమగునక్షరంబునందుదదివర్ణంబు లెక్కఁ-బంబునింక।
నాద్యమావర్ణంబునగు గ్రాహ్యమువిశేషముగనెక్కడను లెక్క-మొనయువర్ణ-ములునన్ని
నక్షరాభేదములను బ్రత్యాహృతులను - నంకెలకా। [యు।
నంకపథమాద్యమాశైవమక్షరాధ్వ - యాద్వితీయ।
మదియె వైష్ణవముభయాధ్వమానుశాక్త - మంకములన్।
గదురవ్యత్యాసమనుగ్రమగ్రహణముదగు - గనఁగసిద్ధి॥ ౫౭॥

౫॥ సంఖ్యలైదు దెగలఁజను గ్రహింపఁగన వివరింతుఁ గ్రమముగాఁ బ్రవిమలమతి-నవధరింపఁ।
జెలఁగునేకాదులుసిద్ధములై ప్రసిద్ధములవుస్థానసంఖ్యమహితములు - నమరునిఁకన్।
శతసహస్రాదులువితతార్థములను ప్రసిద్ధముల్వర్ణపదేద్ధములవు - నుద్ధరింప।
సాధ్యముల్నవయనఁజనునలువదియైదుపదకొండు రెండివిపరువడినిటు - పరఁగుచుండుఁ।
గన్న సంఖ్యావళులుపృథక్క్రమసమములు - గనుమఱియున్।
విషమములును విశేషముల్వెలయునైదు - విధములుగాఁ।
బ్రకృతులౌఁబదియంకముల్పదియవదయి - పరఁగునున్న।
వికృతులోయష్టవిధములై వెలయువాని - విస్తరింతు॥ ౫౮॥

౬॥ ఆదిసంకలనమువ్యవకలనముగుణకారంబు మఱిభాగహారమునెగి - నారయఁగా।
వర్గంబుమఱియునువర్గమూలంబుఘనముఘనమూలంబనంగఁదగుఁగ - నంగనున్న।
వలయుచో గ్రహియింపవచ్చువిచ్ఛేదంబు దానిచేఁగలుగుఁదథ్యంబుగాను - దక్కవయే।
నెక్కటిఁగూర్చుకోనెప్పవుసిద్ధిసిద్ధించునంతాఁకదత్సిద్ధియన్న - దేవజీవ।
భేదరాహిత్యమద్వైతమాఁదగంగ - వేదములీ।
యర్థముం దెల్పుసోఽహమోమంచునాది - నాగమముల్।
దారకమును శివోఽహమంచౌరభేద - దారకముల్।
సారమక్షరసాంఖ్యశాస్త్రమిదిటులను - జ్ఞానదమా॥ ౫౯॥

౭॥ సంఖ్యలక్షరములక్షరములు సంఖ్యలుగామాఱిసత్యంబుఁగడఁకఁదెలుపుఁ-గడునరయన్।
బదములుసంఖ్యలై పదములై సంఖ్యలుసత్యమానర్థంబుసరవిఁదెలుపు-సాంఖ్యమునన్।
సత్యంబెఱుంగనా సాంఖ్యంబె సత్యమాఁగావున నే సర్వకర్మములఁద-గనుసంఖ్యలఁ।
గల్పించిరటుమంత్రకాండంబుసంకేతపదములక్షేత్రదైవతములమదిఁ-బాఁదుకొనన్।
మునుమునులుసూత్రకర్తలుముదమునబహు-ముఖములచేఁ।
దనరుచుండుశాఖావిభేదములు పెక్కు-దానొకఁడే।

మూలమగుటను బరమార్థమునను భేద-ముగలుగంగన్।
జాలదరయంగవలదెవిజ్ఞానమెుదవ-జ్ఞానులాగిన్॥ ౬౦॥

ఉ॥ మానసవిషయమాధ్యానంబు వాగ్విషయంబౌను మంత్రంబిఁకంగవిషయ-మాసనాది।
త్రికరణైక్యాప్తిగాబుషికల్పితముధర్మ మెఱిఁగి యట్లొనరింప నెసఁగుసిద్ధి-హితమిదెకా।
యరయకయెునరించుటంధత్వమని వేఱుగాఁబల్కవలయు నేకనుటకిదియె-కన్నగదా।
సాంఖ్యమీయదె తెల్పు సత్యమిందన నెసంఖ్యావంతులై సాంఖ్యులగుదురుబుషు - లారయఁ
గార్యకారణసంబంధకలనగురువు-గదయిదగున్। [గన్।
బండితంమన్యతాధ్వాంతచండభాను-మండలంబు।
సత్యజిజ్ఞాసుసద్ద్విజచంద్రమూర్తి-జ్ఞానసుధన్।
సాంఖ్యచాతకజలదంబు సత్యమిదియె-సాంఖ్యమగున్॥ ౬౧॥

౯॥ పలుకఁజత్వారివాక్పరిమితాయని బుషుల్పరికించికనఁగదా బ్రాహ్మణతయుఁ - బ్రాజ్ఞత
గలుగునుదత్పరాదులమాటఁగనఁగోరబిల్వాంబఁదనుమధ్యబిల్వనాథు-విశ్వనాథు। [యుఁ।
సేవింపవలయునుసిద్ధించుఁదత్కృపఁదత్త్రియమునుజగత్త్రియమనఁగను-దద్దయనే।
ప్రాసాదతారకభాసురమూలమానక్షరసాంఖ్యమీయదియుపజ్ఞ-మయిస్ఫురింపఁ।
బ్రబలిరత్నశర్మరత్నాయనుండన - బ్రహ్మర్షిగ।
మహినిసాంఖ్యరత్నమాలికనిటు - మానవాళి।
కొప్పగించెఁగొన్నను త్తముల్శివసిద్ధి - నొందుచుంద్రు।
శివరహితులుజనులుచెందరెందు - శివమిదియా॥ ౬౨॥

తే-గీ॥ రత్నమీసాంఖ్యముగ్రహించుయత్నమెఱిఁగి। యోంద్రపెట్టైనుగాడిదలౌనరెనుశుభ।
శకునముగనంత వెలసెఁజిలుకలపలుకు। లనుచుఁదనుమధ్యబిల్వేశ్వరునిఁగనియనె॥

తే-గీ॥ చిల్కలవియాటఁగనుహంసనింహములుగ। గండభేరుండములుగవిజ్ఞానులుబుషు।
లుగనుశివులుగననిసాంఖ్యముఁగడుఁబొగడె। బిల్వనాథుండుతనుమధ్యవినుతిసేయ॥

కం॥ ఆకాపిలసాంఖ్యంబనఁ। బ్రాకటముగశంకరోక్తిబాహ్యమిదన్నన్।
శ్రీకరమక్షరసాంఖ్యము। లోకనుతముశంకరోక్త్యలుప్తాత్మంబౌ॥ ౬౪॥

రత్నావళి, షట్పది.

భాసిలునాదబ్రహ్మంబనియెుడి - బ్రహ్మాండమునసాంఖ్యరవి।
శ్రీసన్నిధిశబ్దబ్రహ్మంబను - శ్రుతిగోళమువెలిఁగెడునందున్।
హాసిగబహుభాషామతములుగహ - నంబులుసంస్కృతమతవనిలోఁ।
బ్రాసాదంబాపైఁదారకమది - పరమార్థముప్రాప్యముశివమా।
నీసాంఖ్యమునరథాంగములలరెడు - నింపఱకున్నెదివాంధంబుల్।
మీసరముగఁగించిజ్ఞులువిజ్ఞులు - మింత్రైయసంఖ్యావంతులిలన్॥ ౬౬॥

---

రత్నావళి, షట్పది॥ రత్నావళిషట్పదియెుప్పెడునెుక - ప్రాసంబునఁగాల్గాఱౌనరన్।

సీ॥ అడుగుమెట్టగుభక్తియది మెట్టమొదటిదియాపైదిసోపానమౌనుగర్మ।
వాదిమతంబందుమీఁదిదిజ్ఞానంబుశిరమువంటిదికర్మశిథిలబుద్ధి।
దంబ్రబుద్ధులకుంబైదిమహితంబుయోగంబునైష్కర్మ్యముండుఁబైన।
నానందమందుపైనలరెడుబ్రహ్మంబుసాయుజ్యదముశివచంద్రశాల।
యదరిపెరుగునహంకారమడవిఁదడవి । కొట్టిజిజ్ఞాసయనుగంద్రగొడ్డలిగొని।
సాంఖ్యవిజ్ఞానసరణినిఁజక్కఁబెట్టి।కొనిచనన్ శివసౌధంబుఁగనఁజొరనగు॥ ౬౭॥

సీ॥ పాశాంకుశములెయొప్పఁగశంఖచక్రములుగవరాభయదములగుకరములు।
తలగడఁగాల్కడఁదగుదిండ్లుగాఁబైఁటకొంగుపడగదారిగొడుగుపడక।
చెన్నుగాఁగుచయుగిశ్రీవత్సకౌస్తుభగతిగఁజామరలిడుకమలవాణి।
సిరిపుడమిగఁబాదసేవసేయఁగనిల్చియున్నయత్తనుమధ్యపన్నగేంద్ర।
శయనుఁడైనయనంతుఁడెయయికనఁబడుఁగందుఁడేబమ్మయోయనికనియతండు।
మేలుకనెమేలుకనెఁదత్త్వమొలిఁగనియె । నునుయెవిష్ణుండటంచువేదమననుగని॥ ౬౮॥

రత్నావళి, ద్వ్యావళి.

అంతంగ్రమముగసాంఖ్యజ్ఞానం - బభివర్థిల్లందనుమధ్యా।
కాంతునిబిల్వేశ్వరునెల్లప్పుడు - స్వాంతమునందుస్మరించుటచే।
నించించుకగనుదక్షేత్రంబుమ - హిమముహిమర్తువుతుదనొగిఁగా।
న్పించువసంతముకైవడిఁదోఁపఁగ - వివిధకుసుమఫలములవలెనే।
యెంతయువింతగనామ్నాయపురా - ణేతిహాసయామళగతముల్।
చింతామణులనఁగథలుంబ్రకృతో - చితములుపెక్కులవేయొదవన్।
వినఁబడునాదంబునకుందోఁడుగ - బిందువువిధుబింబంబువలెన్।
గనఁబడఁదనంతనెందేనంతటఁ - గలనేనిమదిందోఁచినదే।
యరయఁగనిజమగుచుండుటనపుడిటు - స్వానుభవంబెప్రమాణముగాఁ।
బరమకథాకుడ్యంబుగ్రంథా - వలీసుపద్యస్తంభంబున్।
నవఖండద్వారాన్వితముంధ్వని - నవ్యాచ్ఛాదనకలితంబున్।
శివమన్వక్షరకక్ష్యాషట్కము - శివరూపానువర్ణేష్టకమున్।
భాసురపదవేదీయుక్తంబున్ - వాక్యానుసోపానాంచితమున్।
శ్రీసముదారాలంకారరస - స్ఫీతముఁజిత్రవిచిత్రంబున్।
పుణ్యవితానమునక్షరసాంఖ్యాను - పుష్టవిశిష్టసువిష్టరమున్।
గణ్యాగణ్యగుణాత్మకతోరణ - కమనీయమురసికేద్యంబున్।
దారకకలశముదారధ్వజమును - ధర్మాద్యర్థపదార్థమహో।
దారముబిల్వారణ్యచరిత్రా - కారముఁబ్రాసాదవరంబున్।

---

రత్నావళి, ద్వ్యావళి॥ రత్నావళియర్థమువేర్వేఱయి - రంజిలఁగంద్వ్యావళియననా॥

యత్నముతోడన్నిర్మించెహరిహ - రాద్వైతముదెల్లముగాఁగన్।
రత్నాయనుఁడర్పించెనుభక్తిం - బ్రహ్మంబునకున్నృసింహునకున్॥ ౬౯॥

రత్నావళి.

కలదైవమునెడఁగూడదుపేక్షయుఁ - గొల్వకయుండుటగీడగువై।
ఖరినేసత్యముఁగాంచనశక్యము - గావుననక్షరసాంఖ్యంబున్।
బోలువుగ్రశీతనుమధ్యమదయచేఁ - బొందుటమేలనిబోధించున్।
విలసిలురత్నాయనచరితంబిది - పెంచునుబుద్ధులకుద్ధవమున్॥ ౭౦॥

అమృతవాహిని॥ ఈరత్నాయనసర్గంబు । నేరేనిచదువన్వినన్।
గూరంగలరభీష్టంబు । ల్వారుమింతురుసాంఖ్యులై॥ ౭౧॥

ఇది, రత్నాయనసర్గము.

---

## రత్నేశ సర్గము.

శా॥ ఓంకారంబఖిలంబుబ్రహ్మమనుచాయోగీట్టురత్నాయనుం।
డోంకారార్థమెయాశివోఽహమనుచున్సోత్సాహుఁడైకాంచితా।
నోంకారంబుఁదదర్థమున్మదిమహోద్యోగంబునన్నిల్పికొం।
చోంకారంబుగనయ్యెరత్నమదిగాయొప్పొందెరత్నేశుఁడై॥ ౧॥

మ॥ నవసంఖ్యల్ప్రణవాంశముల్ప్రణవమోనల్పొందువ్యుత్పత్తిమై।
నవసంఖ్యావళిచేఁబ్రకృష్టమగుటన్రత్నంబవేరత్నముల్।
శివముల్సంఖ్యలుగాఁడఁదొమ్మిదియునోలిన్నల్వదైదాటచే।
శివమోంకారమదేశివోఽహమనియెంచెంగాంచెసంఖ్యార్థమున్॥ ౨॥

మ॥ మనువర్ణంబులునల్వదేనుశివముల్మానంగబుక్కల్లక్షుళల్।
గననాద్యంతిమవర్ణముల్గలయఁగాఁగాదేయహమ్మంచుఁగా।
వుననాసత్యమువర్ణతత్త్వముపారింబొల్చున్శివోఽహమ్మటం।
చునురత్నాయనుఁడాత్మనారసికడున్శోభిల్లెరత్నేశుఁడై॥ ౩॥

మ॥ శివమావేదముతాశివోఽహమనివీక్షింపించుస్వీయాఖ్యగీ।
తవచించున్నగుణంబువేదమనినిస్త్రైగుణ్యతంగాంచుమం।
చువచించుంగదబ్రహ్మసూత్రముశివస్ఫూర్తింపదోంకారమున్।
శివభక్తుండుశివోఽహమంచతఁడుకాంచెన్మించెరత్నేశుఁడై॥ ౪॥

ఉ॥ వాఁగులువంకలుంగలసివాఁకలుగానయివార్ధిఁగూడునా।
లాగుననన్నిధర్మములిలన్శివధర్మముఁదెల్పియాశివున్।
బాగుగఁజేరుఁజేర్చుఁదముఁబట్టినవారిననిశ్చయంబుగా।
నాగమమోంశివోఽహమనునంచతఁడెంచెఁగ్రహించెఁదత్త్వమున్॥ ౫॥

చ॥ యమనియమంబులేటికిషడంగమెయోగముగన్షడర్ణమం।
త్రముస్ఫురియించుమూలమయిదానఁబ్రధానమవున్శివాభిధా।
నమదిశివోఽహమంచనఁగనంగనుగావునయోగమన్ననిం।
పమరుశివోఽహమంచువెలయంగ్రహియించెనతండుతత్త్వమున్॥ ౬॥

పృథ్వి॥ శివోఽహమనఁగానగున్ - శివతరంబుసత్యంబుగా।
నవుంగలయనున్నయ - ట్లవిపదంబులున్రెండుగం।
ప్రవర్తిలఁగఁగూడఁగా - వఱలుదారకంబంచుఁద।
ద్భవప్రవణుఁడెప్పుడున్ - శివశివోఽహమంచుండెడున్॥ ౭॥

పృథ్వి॥ శివాయనమ ఓమనన్ - శివమెయౌనుప్రాసాదమం।
చువాఁడుదలఁచుంజపిం - చునుభజించురత్నేశ్వరున్।
దవన్శివతరాయచోం - నమయనన్శివోఽహమ్మటం।
చువానిగ్రహించియెం - చునుస్మరించురత్నేశుఁడై॥ ౮॥

కం॥ శివపదమేయరయంగన్ । శివోఽహమనియర్థమిచ్చుశివునింజేయున్।
శివశివశివపదమునకెన । శివపదమేయవునవునుకొశివుఁడతఁడొకఁడే॥ ౯॥

కం॥ రత్నమునవార్థకముతో । ద్రత్నముమూలంబగుంద్రిదళమగుటనిటన్।
రత్నముబిల్వంబోంకృతి । రత్నముబిల్వేశ్వరుండెరత్నేశ్వరుఁడా॥ ౧౦॥

గురు రత్నావళి॥ రత్నమనంగనరుండొకరుండిటు - రత్నదాసుఁడనఁబరఁగెన్।
బదపడి - రత్నగుప్తుఁడనఁదనరెన్।
రత్నవర్మయననైయటుపిమ్మట - రత్నశర్మయనఁగఁదగెన్।
సాంఖ్య - ప్రజ్ఞానంబునుగనుటన్।
రత్నమనంగనుప్రాసాదముదా - రకమనియర్థమెఱింగెన్।
గనిత - ద్రత్నాయనములఁజనియెన్।
రత్నాయనుఁడనిపేరందెనుమఱి - రత్నేశ్వరుఁడేయయ్యెన్।
వింతయె - రత్నమురత్నమెయయ్యెన్॥ ౧౧॥

మహా గురు రత్నావళి॥ రత్నేశుఁడుబిల్వేశుఁడెయౌటను - రత్నములౌదురుతద్భక్తుల్।
నర - రత్నములౌదురుశ్రీయుక్తుల్।
రత్నాయనకృతమగుటనుసాంఖ్యము - రత్నాయనమదిగనుటనరుల్।
నవ - రత్నాయననవరత్నేశుల్।

---

గురు రత్నావళి॥ తల్లఘురత్నావళిపదముపయిం - దనరిననాలుగుమాత్రల్।
యతితోఁ - దార్కొనద్వాదశమాత్రల్।
చెల్లెడుగురురత్నావళిపద్యము - చెల్లెడుద్వ్యేకావళులన్।
వలసినఁ - జేయఁగనానెటులేనిన్॥

మహా గురు రత్నావళి॥ రత్నావళిపాదముపైనిరుమా - త్రలుయతిముఖముగమనుమాత్రల్।
దన - రనుక్రమముగఁజెప్పినసెప్పన్।
యత్నమునమహాగురురత్నావళి - యనుపద్యముద్వ్యావళిగానే।
నే - కావళిగానేనియుఁదగెడున్॥

రత్నముప్రాసాదముదారకమా - రత్నములంగనిరంజిలుఁడీ।
నర - రత్నములుగమీరలుగండీ।
రత్నమనంబ్రణవంబునుబ్రహ్మము - రత్నమనన్నరుఁజాటఁగనన్।
నర - రత్నముబ్రహ్మంబౌనుగదా॥ ౧౨॥

రత్నావళి॥ ప్రాసాదముసర్వాధారంబుం - బ్రాప్యముసర్వఫలప్రదమం।
ఛాసన్మంత్రస్రజమునకొలికిగ - నవుఁదారకమంచదిగాంచన్।
వాసిగబిల్వేశ్వరుఁగొలువన్వలెఁ - బ్రబ్బెడుజీవన్ముక్తియునం।
చీసముచితరత్నేశ్వరకృతివచి - యించుందత్త్వముశివమంచున్॥ ౧౩॥

అమృత వాహిని॥ ఈరత్నేశ్వరసర్గంబు। నేరేనింజదువన్విన్।
గూరంగలరభీష్టంబు। ల్గారేరత్నేశులారయన్॥ ౧౪॥

ఇది, రత్నేశ్వర సర్గము.

## గద్యము.

ఇది, శ్రీతనుమధ్యాంబాకరంబిత శ్రీబిల్వనాథమహాదేవశిష్య తిష్యోపజ్ఞాక్షరసాంఖ్యాచార్య
పర్యవితకవిత్వ తత్త్వవిత్ప్రకాండ శ్రీమత్కొండ వేంకటరత్నశర్మ
వినిర్మితంబై,
కవిమణినామంబునం బరఁగు
శ్రీబిల్వేశ్వరీయంబను పద్యకావ్యరత్నంబునందు
షష్ఠంబగు నభేదేశబింబమునం ద్వితీయభాగము రత్నేశభాగము.

శ్రీబిల్వేశ్వరాయనమః.

# బిల్వేశ్వరీయము.

## షష్ఠబింబము, అభేదేశబింబము.

తృతీయభాగము, నవార్ధ్వభాగము.

కల్యాణ రసజ్ఞ పర్వము.

---

శ్రీవృత్తము ॥ కల్యాణేశా॥ ౧॥

కం॥ అనిసూతుఁడుమునులకుని । ట్లనెఁగల్యాణంబుప్రణవమందలిప్రభువుల్।
వినుతులుకల్యాణేశులు । వనజభవసరోజనాభభవులవుదురనన్॥ ౨॥

కం॥ వారలకల్యాణకథ । ల్గారిమితోఁదెలుపుమనుచుఁగోరిననాతం।
డీరీతిఁజెప్పెనెప్పగ । సౌరసరిత్తుంగభంగసంగలహరినాన్॥ 3॥

### శతరూపా శతానంద కల్యాణము.

వెండి॥ అజుఁడాదినొకశక్తినాత్మజగంగనెనదిముత్తెఱంగులనలరెనొగిని - ఆదిశక్తి।
గాయత్రియనఁగనుగనుపట్టెఁదొల్దొల్త సావిత్రియననంతసొరుమీఱె - సన్నుతాంగి।
మఱిసరస్వతినాఁగమహితయయ్యెఁదదాత్మభవయాటఁబుత్రినాఁబ్రథనుగనియె-వాణిగదా।
ఆవేదమూర్తియర్ధాంగమాటసువర్ణరాశిగై వేయకప్రభనుదనరె - రత్నభూష।
అంతటహిరణ్యగర్భుఁడకాంతఁగాంచెఁ । గామవికృతిఁబ్రవక్షీణక్రమముఁజెలువు।
దానినలుమొగములఁజూచితానునల్వ । యయ్యెనదిమింటికేగఁబంచాస్యుఁడయ్యె॥ ౪॥

చ॥ పలుకువెలందిఁజూచివిధిపల్కెనుజిల్కలకొల్కికల్కరో।
పలుకువెలందిపొందుగఁబ్రపంచమునేస్సృజియింతుఁదండ్రినై।
వలనలరంగడుంగురుతభానిలుతల్లిగనెల్లవారికిం।
గలిమిగురుత్వముంగలుగఁగాదనకొందుటగాదెనీతినాన్॥ ౫॥

ఉ॥ కూఁతురునీకువాణియిటుగూడదటంచువసిష్ఠముఖ్యులున్।
బ్రాఁతిగవిన్నవింపఁగమరాళతురంగుఁడుపొందుపొందుమీ।
రీతఱిసృష్టికార్యమునకీకడనుండకుఁడంచుఁబంచితాఁ।
గూఁతురుపెండ్లికూఁతురనికూడఁగవేఁడఁగనామెవేమఱున్॥ ౬॥

మ॥ శతరూపంబులఁదాల్చిచిక్కకజుచేసత్యాదిలోకంబులన్।
జతురత్వంబునసంచరించుటమహాశ్చర్యంబునంబ్రహ్మయో।
శతరూపాయనిశారదంబిలిచెనాశ్యామాశిరోరత్నము।
కృతనన్దాశతరూపనాఁబరఁగెనిక్కంబెక్కడందాఁగునే॥ ౭॥

మ॥ పలురూపుల్ సృజియించుస్రష్టయటులేఖానిల్లనన్గాంచెదుం।
బలురూపుల్గను లేలయభ్రతను నేవాదింతునంచెంచియో।
పలుకన్వాక్కులు పెక్కువైఖరులఁదావాగ్వాదినీఖ్యాతమై।
యలరెన్వాక్సతియప్పుడున్నలువ నెయ్యంబొప్ప వెన్నంటఁగన్॥ ౮॥

తే-గీ॥ అమ్మహాకాళికింబుత్రియయ్యెనుగ్ర । ననుజగానుస్వరార్ణభాషాఖ్యయయ్యె।
బాలగానయ్యెబిల్వేశుబ్రోలనీవ । నాఁగవాగ్వాదినియెగుప్తనామగఁదగ॥ ౯॥

కం॥ నీవాయనెఁదెనుఁగునవిధి । నీవాయనెన అవముననునివయనెఁబ్రకృతిన్।
నీవా శైవలినింగని । శైవాజ్ఞన్నిలిచెఁగంజశైలమునందున్॥ ౧౦॥

పంచచామరము॥ శివాజ్ఞ లేకయెవ్వఁడేని - చేరఁదాఁకశక్తుఁడే।
నివానదిన్మునంగదాని - నీరుద్రావనేవడిన్।
నవార్థ కావ్యాయుండునల్వ - నల్వఅన్నిజాఖ్యమా।
నవిన్వసించెనీవనంట - కంచుఁబర్వతుండనన్॥ ౧౧॥

" స్వపుత్రియంచునెంచ కాష్ఠ - శ్శారదన్వరించెఁగా।
యపారమోహమొందిబ్రహ్మ - యంతవాఁడునయ్యయో।
త్రపాన్వితుండునానెకామి - దర్పకారియోర్చునే।
కృపంగ్రహించునే మొయంచుఁ - గేరినారదుండనన్॥ ౧౨॥

చ॥ అనఁగఁబితామహుండుగడునాగ్రహముగ్రముగాఁగవారిఁగ।
న్గెనియధికప్రసంగమునుగొబ్బుననిల్పఁడుక్రుద్ధువచ్చిపి।
ల్లను వెస వెక్కిరించునటులంగనుపట్టెడుమీరలొక్కగోఁ।
తినివరియించిస్రుక్కెదరుధీయఅఁగ్రోఁతిగఁగొండముచ్చుగన్॥ ౧౩॥

కం॥ వైరాగ్యముజ్ఞానముసమ । ఘూరెదుమీకంతభక్తిగుదిరెదుఁగానన్।
వారకశివభక్తులరై । చేరెదరుశివాంఘ్రిననుచుఁజేసెవిధివిధిన్॥ ౧౪॥

ఉ॥ అంతవిరించిపంచెఁదనయంచనుదచ్ఛతరూపపంచకున్।
జింతిలియామెయెంతయునుశ్రీపతిబిల్వపతిన్భజింపుమం।
చంతటఁగంతువైరిహరిహంసగడుంగడువేఁడెవేఁడగా।
నంతకఘాతియచ్యుతుఁడునక్కటికమ్మునఁదెమ్ముపొమ్మనెన్॥ ౧౫॥

కం॥ అంతనుహంసంబెంతయు । సంతసమునమెచ్చితెచ్చిసమకూర్చెనువా।
క్కాంతాకాంతుఁజతుర్ముఖుఁ । బంతంబుననేకపంచవదనులనడుమన్॥ ౧౬॥

కం॥ ఏకచతుఃపంచాస్యులు । ప్రాకటముగమొగములనెశివాయయనుచొగిన్।
లోకులకుఁదెలిపిరార్యా । నీకంబోంనమయనుచుఁగనెందద్యుక్తిన్॥ ౧౭॥

కం॥ పంచాస్యునిపంచాస్యము । లెంచన్విషమాంకములవియేన్నమసంఖ్య।
ల్గాంచఁగనాల్గజుమొగములు । కాంచనచేలాననంబొకఁడెబిందువగున్॥ ౧౮॥

కం॥ నవసంఖ్యలుప్రణవాంశము । లవినవమముప్రణవమదిమహాబిందువుతోఁ।
దవునొంకృతిబుక్కెడలఁగ । నవమాంకుఁడజుండెయాననంబొగడొందెన్॥ ౧౯॥

కం॥ శతమనస్థానికసంఙ్ । హితమగుటన్మాడుమూర్తులెనయుటమొదటన్।
శతధృతియుశతానందుఁడు । శతరూపనుబరసుగూడఁజాలెన్లీలన్॥ ౨౦॥

కవిరాజవిరాజిత వృత్తము.

హరిహరులాశతరూపకుబ్రహ్మకు - నాదటఁబెండ్లినిఁజేయఁగఁడం।
గిరిసరిదుత్తమకుంజలరాశికిఁ - గేరుచుసంగమమంబుదముల్।
బరువడిఁజేసెడుభంగినెసంగఁగ - బ్రహ్మయుఁదచ్ఛతరూపపర।
స్వరమువరించిరినిర్భయులైబుధ - వర్గమువూనినదేహితహా॥ ౨౧॥

ప్రమితాక్షరా వృత్తము.

శతపత్రనామకము - సారసము । న్నుతబిల్వమున్నవుట - నోయటనే।
శతరూపకుంజలజ - జాతునకున్ । హితమొప్పఁజేండిలిమ - హింజరిగెన్॥ ౨౨॥

భుజంగప్రయాత వృత్తము.

వసిష్ఠాదులుందద్వి - వాహంబునేయం । గసుత్రామముఖ్యుల్ద - గంగూడిరాడెన్।
రసస్ఫూర్తిగానస్థు - రంభాదిసార । ప్రసిద్ధాంగనాఘంబు - ప్రహ్లాదమయ్యెన్॥ ౨౩॥

ద్రుతవిలంబిత వృత్తము.

ద్రుహిణుఁడున్శత - రూపనుదోడనే । సహనమేదివె - సంగవియంగన।
మ్మహిళసిగ్గున - ప్రుగ్గినఁదమ్మిమొ । గ్గహహవారికి - నాలయమయ్యెఁగా॥ ౨౪॥

కం॥ శతరూపతోడశతధృతి । శతాబ్దములుగూడియుండెస్వాయంభవుఁడున్।
వితతయశుఁడాదిమనువుజ । నితుఁడయ్యెన్వారికఖిలనేతగనయ్యెన్॥ ౨౫॥

బంగారము.

శతధృతివురుషుండుశతరూపప్రకృతితద్భవమనువవుఁజతుర్దశభువనము-తనువగుఁగా।
శతధృతియాత్మశతరూపమాయత్రిగుణరూపమనువనఁగొఱలుజీవ-కోటిమేటి।
శతధృతిబిందువుశతరూపనాదంబుమనువుచతుర్దశాజ్వినుతమూర్తి-తనరుఁగదా।
శతధృతిప్రణవంబుశతరూపవర్ణాళిమనువుపంచాక్షరమంత్రమాది-మనువవుఁగా।
అలస్వాయంభువంకాధ్వచేనవుఁబ్రణవము+స్వాభిఖ్యచేన్।
అక్షరాధ్వస్వాయంభవుఁడవుఁబ్రణవమె+యాత్మజుఁడా।
స్వాఖ్యచేమఱిప్రణవంబునక్షరాళి+నలరించును।
అల్లస్వాయంభవుండెమన్వాద్యతఁదగుఁ+బ్రాంచితుఁడా॥ ౨౬॥

మంగళమణి. జాతి.

శతరూపకుశతధృతికిని - జతగుదిరెనుగా।
స్తుతియించినవినుతించిన - శుభములానరుఁగా।
కృతులారసుకృతులారసు - కృతిసుకృతదహా।
నతులంబిదిమంగళకృతి - యరయుఁడిశివహా॥ ౨౭॥

ఇది, శతరూపా శతానంద కల్యాణము.

## శ్రీమతీ దామోదర కల్యాణము.

శా॥ ఉత్సాహాఢ్యుఁడు సాహసాధికుఁడు ధైర్యోదగ్రుఁడుం బుద్ధిసం।
పత్సర్వస్వుఁడు శక్తియుక్తుఁడు ప్రతాపస్ఫీతుఁడా చక్రినా।
సత్సంస్తుత్యుఁడు షడ్గుణుండు షడృతుస్ఫారాబ్దసూర్యాభుఁడై।
తత్సద్వంశజుఁ డంబరీషుఁ డనఁగన్ ధాత్రీశుఁ డొండుండుఁగా॥ ౧॥

కం॥ ఆయంబరీషపృథివీ। నాయకున కుఁగూఁతు రొకతె నలువగుఁ గనఁగన్।
దోయధికి శ్రీవలెన్సుగు। ణాయన సౌందర్యనిలయయయు శ్రీమతి నాన్॥ ౨॥

తే-గీ॥ పర్వతుఁడు నారదుం డను పరమమునులు। కోరి రాజును జేరుచకోరములన।
వచ్చి రారాజుఁ జూడంగ మచ్చికలర। నైరి సత్కృతులతిహర్షమందిరంత॥ ౩॥

ఆ-వె॥ దివ్యోకంబమందు దివియ చందంబున। మొగిలునందు మెఱుపు పగిది దేవ।
బృందమందు నమృతమిడెడు సుందరియనఁ। దండ్రియొద్ద మెలఁగు దానిఁ గాంచి॥ ౪॥

కం॥ నారదుఁ డరుదందుచుద్య। త్కారణమొనరించు నిద్దివనితయె వతెనీ।
సారతర రాజ్యలక్ష్మియె। యో రాజేంద్రా యనె విని యుర్వీశుండున్॥ ౫॥

కం॥ ఇది నా గాదిలికూఁతురు। పొదలెడుఁ గన్నియ గఁదగు విభుం డెవఁ డెందుం।
గుదిరెడు నో యెఱిఁగింపం। గఁదగు దిరీ రేయ నెందగన్వినిమునియున్॥ ౬॥

తే-గీ॥ రాజరాజ నేఁ దెల్పెద రమ్మనుచవు। డంబరీషునిఁ గొనుచు నేకాంతమైన।
చోటికిం జని నీకన్నె సుందరాంగి। నాకునిమ్మనె నెమ్మిని నారదుండు॥ ౭॥

ఆ-వె॥ అల్లె పర్వతుండు నడిగె ను దనకిమ్ము। టంచు మించి యాకెయంద మెంతో।
మును లెవారమర్త్యమునులు మోహితులైరి। యల్పసారులు నరులనఁగ నెంత॥ ౮॥

కం॥ ఓలమున నుంచకు విదల। నోలగమున నలరఁ జేఁతయొప్పనె చూపే।
యాలీలమహావస్థల। మూలముగ దయనిన్నపుండు మునులకిటులనేన్॥ ౯॥

తే-గీ॥ ఇర్వురొక్కర్తు వరియింప నెటుల నువవు। మీయిరువురందు నెవనిని మెలఁత వలచు।
నాతఁడి నాఁతికయ్యెడు నాథుఁ డనుచు। వినయమునఁ బల్కె మైకొని మునులిరువురు॥

ఆ-వె॥ రేపువత్తు మనుచున్న పునివీడ్కొనిచని। రంత నారదుఁడు రహస్యముగను।
వాసుదేవుఁ గాంచి వైకుంఠమందును। మ్రొక్కి విన్నవించె ముదమెలర్ప॥ ౧౧॥

కం॥ వినలవరదుండ వనుచును। విని చెదనీమనుమఁడగద వెలయింపుమునా।
మనవిని వినువానరముఖు। నిని బర్వతుఁ జేయుమయ్య యనిపుణత మెఱయన్॥ ౧౨॥

కం॥ నా రాజీవాక్షుండుం। గారణమేమని యడుగుడుఁ గలహాశనుఁడో।
శ్రీరమణాయా శ్రీమతి। సారమతి నన్నె వలవఁజనుఁగతమదె నాన్॥ ౧౩॥

---

మంగళ మణి॥ మంగళమణిజాతియవును - మాత్రలిరువదే।
సంగుగఁబడు మూడవదే - యతియవుఁదుదగా।
మంగళమణివృత్తమవుస - మగణముగమహా।
మంగళమణిరుద్రద్వయ - మాత్రలనహాహా॥

కం॥ వనమాలినవ్వియటులౌ । ననిపంచెనునారదమునినటుపిమ్మటన।
మ్మునిపర్వతుండుహరినిం । గనుంగొనియెఱింగిభక్తకాంక్షితవరదా॥ ౧౪॥

కం॥ గోలాంగూలాస్యుంగాఁ । గ్రాలఁగనారదునిఁజేయుకరుణనునాకై।
యాలలనవలచునన్నన । నాలీలాలోలుఁడట్లెయాననిపనిచెన్॥ ౧౫॥

తే-గీ॥ పర్వతుంగెల్చితినటంచుఁబ్రబ్బనుబ్బ । నారదుఁడయోధ్యకరిగెనునలిమురియుచు।
నారదుంగెల్చితినటంచుఁగూరిహాళిఁ । బర్వతుఁడుగుల్కుచచటికిఁబనివిసెవడి॥ ౧౬॥

ఉ॥ వారలురాఁగభూవిభుఁడువందనముఖ్యములైనసత్క్రియల్।
వారకచేసివారిముఖవైభవముంగనిభ్రాంతచిత్తుఁడై।
నేరకపల్కెనేమియునునెమ్మినినమ్మదిరాత్మశ్రీమతిన్।
బేరిమిఁదెచ్చినిల్పియటబిడ్డరోవీరినిఁగాంచువీరిలోన్॥ ౧౭॥

చ॥ ఎవనివరింతువానిమెడనీపువుదండనువేయుమమ్మయం।
చువిహితరీతిఁజెప్పెనలజోటియుబోటులతోడఁగూడిక।
ర్మ్మపుననుగొండముచ్చుమొగముంగ్గలనారదుఁగ్రోఁతిమూతితోఁ।
దవునలపర్వతుంగనివెతంబడెడొంకెవడంకెఁగొంకునన్॥ ౧౮॥

ఆ-వె॥ పులులఁగన్నలేఁడివలెనయ్యొమొదటను । బిదపఁజంద్రరుచినివెలయుకుముది।
నిగనెసంగెనపుదునివ్వెఱశ్రీమతి । ఱెప్పవాల్పకట్టెయొప్పచుండె॥ ౧౯॥

ఆ-వె॥ తండ్రికూఁతుఁజూచితగునమ్మనామాట । పాటిగాఁగగొనమిభావమేమి।
వేయుమెవనిమెడనెవిరిసరియీమును । లందునెకరికనఁగనతివవెఱచి॥ ౨౦॥

కం॥ నాయనయేమనిచెప్పుదు । నేయఁగడఁగమాల్యమటుతనీమునులిరువుర్।
నాయత్తులకగపడరీ । గేయులనడుమనునెవండొకేరుఁగొనసరిన్॥ ౨౧॥

కం॥ అనవుడునేమేమీయెటు । లనువొంచెదువాఁడువానియాకృతిమాకున్।
వినిపింపుమనఁగజనకుని । కనెనందఱువిస్మయంబునందనదియహా॥ ౨౨॥

సీ॥ మొగిలుజిగిన్మించినిగనిగమనుమేనునెఱచందురునిఁబోలునెమ్మొగమ్ము।
వింట్లఁగేరెడుబొమల్విరిదమ్మిరేఁకులవితముననదరెడువెడఁదకనులు।
వీణియబిరడనావెలయుఁజక్కనిముక్కుదొండపండనఁగనుదోఁచుఁబెదవి।
యిప్పమొగ్గలజగ్గనెసకొల్పుబుగ్గలుగనమజ్జీపండనగడ్డముదగుఁ।
జెవులుశ్రీకారములనఁగఁజెలఁగుచుండు । నూఁగుమీసలునవయావనాగమంబుఁ।
జూపుమెడవలముటియనసొబగుమీఱు । వానికేమనివర్ణింపవచ్చునాకు॥ ౨౩॥

చ॥ కలితగిరీంద్రశృంగములకైవడిఁగ్రాలెడుఁజాలమూఁపులున్।
విలసితహస్తిహస్తములవిభ్రమమున్వెలయించుబాహువుల్।
సులలితమేరుసానువనఁజూడఁగనొప్పువిశాలవక్షమొ।
ప్పలరువళిత్రయోదరముదంచితమోహరిమధ్యమారయన్॥ ౨౪॥

ఉ॥ ఊరువులన్నఁజెన్నలరుచున్నవిగన్నననంటికంబము।
ల్గారుచిరంబులౌఁగమలకమ్రములౌఁగరముల్సరద్రుమో।

చారనుపల్లవంబులుపదంబులురిక్కలుగోళ్లుమన్మథా।
కారమనంగరాదుకనఁగామునితండ్రియనందగుంజుమీ॥ ౨౫॥

మ॥ ఉదితాదిత్యసమానసన్మకుటుఁడుంగోపాంగసాంగత్యసం।
పదుదీర్ణాఖిలరత్నభూషణుఁడుశంపాసామ్యకౌశేయుఁడై।
పదునాల్గేఁడులయీడువాఁడుగనుగన్పట్టున్ననుగ్రమ్మటం।
చద్మటారంగుడికేలుసాచుఁజిఱునవ్వొప్పంగనెక్కండిటన్॥ ౨౬

కం॥ అనుచుభయసంభ్రమంబులు । పెనఁగొనఁగాననఁటిచెట్టువితమునవడఁకం।
గనుఁగాంచికూతుఁదండ్రియుఁ । కనుజేయంగలవెదియనఁగనునారదుఁడున్॥ ౨౭॥

ఆ-వె॥ సంశయించికన్యచక్కఁగాఁజూడుము । వానికెన్నిచేతులౌనుదెలుపు।
నిక్కముగననంగనక్కల్కిరెండుచే । తులనెనంతపర్వతుండుదలరి॥ ౨౮॥

ఆ-వె॥ అతివవానియక్కనందేమియుండెడుఁ । జేతులందునేమిచెలఁగుఁజెపుమ।
యనఁగనింతిపల్కెనక్కనఁబువుదండ । చేతులందువిల్లుఁజిలుకుననుచు॥ ౨౯॥

ఉ॥ నాపుడునమ్మునుల్దమమనమ్మునఁజింతిలియెంతయేనయో।
యీవడిమాకునడ్డపడెనెవ్వనిమాయయొయంచునెంచిమా।
యావియుఁదస్కరుండుహరియానటులౌటనెమమ్మునెమ్మినే।
యీవితమొప్పఁజేసెఁగరమేవగఁగ్రోఁతిగఁగొండముచ్చుగన్॥ ౩౦॥

కం॥ అటువంటిమాయలాఁడఁట । యటమటమునమెట్టిరూపునందఁడుమఱిదా।
నెటువంటిపనికిఁగడఁగడు । కటకటకపటులనునమ్మఁగనుదగవగునే॥ ౩౧॥

కం॥ అనితలపోయమునీంద్రులఁ । గనిరాజేంద్రుండుమ్రొక్కిఘనులారామీ।
రౌనరింతురేలయీరీ । తినిమతివిభ్రాంతిఁబ్రకృతిఁదేజరిలుఁడనెన్॥ ౩౨॥

కం॥ వారలులికిపలికిరియో । భూరమణామేముమాయఁబొనరింపమునీ।
వీరీతిమాయవన్నితి । వారయనెకొమమ్ముఁగామినతిశీఘ్రముగాన్॥ ౩౩॥

కం॥ మాయిరువురలోనెకనిని । దోయజదళనేత్రవలచుదాసఁగఱనఁగా।
నాయెడనేమమ్మాయని । నాయనయనెశ్రీమతియుఘనంబగుభక్తిన్॥ ౩౪॥

## శ్రీమతీకృతేష్ట దేవతా స్తుతి.

కం॥ శ్రీమాతాశ్రీమతినీ । నామమిడిరినాజనకులునాకున్జోకన్।
నీమహితకృపనుగలుగుట । నోముకొనుమునీదుపేరయోపాకుండన్॥ ౩౫॥

కం॥ తపసులుదనుఁగాఱించుట । నుపమెఱుఁగకనన్నువీరికొప్పించెనుభూ।
మిపతిజనకుండుగొఱియం । గృపయెడలివృకంబులకిడురీతింగూఁతున్॥ ౩౬॥

కం॥ నుతులుగదాయెటులున్న । న్మతిమంతులుసురమునులనిమైకొందునసం।
జతురుండుధనుర్బాణా । న్వితుఁడితఁడెతఁడోహరిణిగవేఁడుననుఁగొనన్ ౩౭॥

కం॥ మతికెటునేయనుదోఁపదు । గతియేదోమాతనీవెకాన్పింపుముమా।
మతిపీవందురభిజ్ఞులు । గతినీవేకాకయొరులుగలరేయరయన్॥ ౩౮॥

కం॥ ధ్యేయవు జగముల కెల్లం । గేయవు సృష్టిస్థితిలయకృత్యంబులు నీ।
వేయవు జగదంబవు నీ । వేయవు దువు సాక్షీ నీదు విభుఁ డభవుండా॥ ౩౯॥

కం॥ జయవిజయ సర్వమంగళ । జయవిజయశుభంబు లిడెదు జనులకు నంచున్।
బ్రియమున ననుఁ బొగడెద రా । శ్రేయభూతవటంచు నిన్ను సంసేవింతున్॥ ౪౦॥

కం॥ యత్నింతు నేను కౌస్తుభ । రత్నాకుం బెండ్లియాడ రభసమున ననా।
యత్నము దప్పెను దైవము । యత్నం బెట్లుండు నో యడగు నీయదియే॥ ౪౧॥

కం॥ అనియిట్లు సప్తపద్యా । దిని ష్టదేవతఁ దలంచి ధృతిఁ గాంచెను గాం।
చెను దత్సరమునిమధ్యము । నను నాకులనదు మఁబూవనం దగు వానిన్॥ ౪౨॥

సీ॥ అతసీకుసుమదేహు నాజానుఘనబాహు శరదిందువదను సజ్జలజనయను।
సముపాత్తవరవేషు సకలసన్మణిభూషు జగదేకరక్షు విశాలవక్షు।
శయసక్తశరచాపు సరసనిజాస్త్రి సరూపు సౌదామనీవాసుఁ జారుహాసు।
శృంగారరసమూర్తికృతమోహవిస్ఫూర్తి సౌందర్యమణి ని సద్గుణజని।
ధీరలలితుని సర్వసుధీమహితుని నల్లపురుషోత్తముని రమావల్లభుఁ బొడ।
గాంచి హర్షించి శ్రీమతి గాన నెయల । బాలికయు మాలిక నువనమాలికి నిడె॥ ౪౩॥

కవిరాజవిరాజిత వృత్తము.

జయజయయంచును దేవత లెంతయు - సంతసమందుచుఁ బూలజడిన్।
నయముగఁ జేసిరి వాద్యము లెల్లవి - నంబడెఁ బెల్లుగ దేవగతిన్।
బ్రియమలరారఁగ గంధవహుండు మధ - రిత్రిని వీచెను గంధవహుం।
డయియల శ్రీమతి విష్ణువరింపఁగ - నయ్యమయయ్యెన దృశ్యయటన్॥ ౪౪॥

మందాక్రాంతా వృత్తము.

హాహాకారంబులుగలిగెన - య్యజ్ఞునంగూఁడు రానీ।
వాహా యెందేగితె వెయనియ - య్యంబరీషుందు నేడ్చెన్।
దేహం బైనం గనఁ బడదిదే - దేవలామాయయోయం।
చూహింపంగం దెలియక జనుల్ - వ్యూహముగ్గాడిరంతన్॥ ౪౫॥

సీ॥ భూపతిసుత దొద్దవోయెనందరుఁ జూడ నన్యులగలియెంతయ నెదువారు।
కనఁబడ్డఁగద దొంగఁగొనివానికి నిశిక్షనదరింపఁ జనునని యనెదువారు।
వేయంచుల దివాలు వెలయఁగా యదియేలయదఁగి యుండె మనని యనెదువారు।
చక్రేతరులనైనఁ జక్రంబు చెండాదునా చక్రిఁ జేయు నేమనెదువారు।
శాపనులు శాపములని డఁదగ రెయనెదు । వారు వశపడ్డ కన్నె వోవలన నఱఁగను।
మానుబైనారు పీకేమి పూనికిగల । వార నెడు వారునై రెల్ల ప్రజలదలున॥ ౪౬॥

సీ॥ జగదేకసుందరి సద్గుణమణిఖని నాదిగర్భేశ్వరి నాత్మజాత।
శ్రీమతి నీయక శ్రీపతికి నిగ్రోఁతికొండ ముచ్చుల మోములుండు మునుల।
కెట్లీయమన సాగ్నినీస్ర పునకటంచుఁ గొందఱాడిరి మరికొంద ఱేమి।
నేయంగవచ్చును శ్రీపతి దావచ్చియడుగు నేమఱి యెవ్వఁడర్హుఁ డుండు।

నీమునీశులుదమయంతఁ దామువచ్చి । యడుగనిచ్చెదననెదోసమగునెన్నృపతి।
కనిరిగొండఱుగాఁగలదయ్యోఁ గాదె । యనిరి శ్రీహరిపనియని యందఱనిరి॥ ౪౭॥

కం॥ తనభక్తుఁ డంబరీషుఁడ । తనిధనమగుకన్యనుహరితనధనమనుచున్।
గొనెనుచితంబెకదాయని । జనులనుకొని రెల్లఁ బెల్లుసమ్మదమొదవన్॥ ౪౮॥

కం॥ తనుఁ గోరిమున్నపన్నగ । ఘనతపముం జేసివానిఁ గాంచినయకాఱం।
చనగాత్రిశ్రీమతిన్హరి । తననెలవుననిల్పెఁ గొల్పెఁ దన్విందన్వన్॥ ౪౯॥

ఉ॥ ఆఋషులిర్వురార్తులయి యక్కటచేతికిఁ జిక్కినట్టిబం।
గారముజీవగఱ్ఱవితగాఁ బఱివోయెను బ్రాప్తిలేకమా।
కారతనంబువోవుటదియట్టులెయేపఁగఁ బైఁగనీతిర।
స్కారమునవ్వుబాటొదవెఁ గాయనిపోయిరివెన్నవీటికిన్॥ ౫౦॥

కం॥ అవుడటవైకుంఠంబున । విపులానందంబునొందువిష్ణుఁడుగనిత।
త్తపసులరాకను శ్రీమతి । నిపుణతఁ గనుమఱుఁగుగాఁగ నెగడువడిననె ౫౧॥

ఉత్సాహ॥ అనఁగనగవునిగుడనపుడె - యమరలీనయయ్యెనా।
వనితనాథునాత్మయందుఁ - బాలయందునీరనం।
గనఁగనెవరితరముకపట - కలనగల్గువారినం।
చునటుమోసపోయిమునులు - శోకమెచ్చివచ్చిరా॥ ౫౨॥

ఆ-వె॥ వారిలోనముందునారదుఁ డెరఁగి శ్రీ । హరికినిట్టులనియెనహహనాకుఁ।
బర్వతునకుమేలుఁ బచరించితివిచాలఁ । గన్యనీవుగొన్నకారణమున॥ ౫౩।

తే-గీ॥ ఏనిఁగరుణింపనెంతునువానిధనముఁ । గొందుననుటయెకదనీకుఁ గొఱలుఁ బ్రతిన।
యద్దిమాయెడఁ జూపితివద్దిరయ్య । తగునెయనికినుకనుమదిఁ దాఁకనాడ॥ ౫౪॥

తే-గీ॥ శ్రీమతినిదాఁచెఁ గావున శ్రీలఁ గూడ । దాచునోయన శ్రీపతిదాను జెవుల।
మూసికొనుచునుబాపురేమునులఁటయిటు । పలుకుదురెయేరొకామర్బలులుగాక॥

కం॥ నానారదుఁడిటులనెనో । శ్రీనాథా నీవెకావెచేసితివిటునా।
కాననముగొండముచ్చుది । యానారింగోరికాకయనహరియహహా॥ ౫౬॥

కం॥ కోరిననీకుంబోలె । న్నేరచియించితిఁ బ్రియమ్ము నెమ్మినతనికిన్।
ధీరునికిఁ బర్వతునికి । న్నేరంబెపరోపకారనిపుణతనాకున్॥ ౫౭॥

తే-గీ॥ కోరవేమునననునీవెనారదుండ । పర్వతునివానరాననుఁ బరఁగఁ జేయఁ।
బర్వతుఁడుగోరెనినుఁ జేయఁబదపడివడిఁ । గొండముచ్చుమొగంబుగాఁ గొఱలుఁ డీరు॥

తే-గీ॥ అనఁగనారదుండునాపర్వతుండును । మొగములెత్తకుండఁ బొగులుచుండ।
మునివరేణ్యులారననునేమిదూఱంగఁ । గలదుపలుకుఁడనినఁ గలహభుజుఁడు॥ ౫౯॥

కం॥ హాయిద్దఱనడుమనవుడు । మాయావిధనుర్ధరుండుమఱియెవఁడుండెన్।
ధోయజముఖియగపడదుగ । దాయదియేమాయెనెందుఁ దానుండుననన్॥ ౬౦॥

తే-గీ॥ మంత్రతంత్రక్రియాసిద్ధిమహితులైన । వారలెందఱోయుందురువారిలోన ।
వాఁడెవండొకొవానినేవలచెనేమొ । యద్ది స్త్రీచిత్తమెఱుఁగంగనవునెవరికి॥ ౬౧॥

ఉ॥ నేనెపుడుంజతుర్భుజుఁడనిత్యముగాఁగనుజక్రపాణినై ।
జ్ఞానగువాఁడశ్రీయొయనిశమ్మునుబాయకయుండునాయెద ।
న్నేనెటుశ్రీమతింగొనఁగనేర్తునువాఁడనఁగాద్విబాహుఁడం ।
ద్రానతచాపహస్తుఁడఁటయాలినిఁగోరినవాఁడెవండొకో॥ ౬౨॥

ఆ-వె॥ పుట్టమీఁదఁజీమగుట్టినంబాముపై । నిందమోపుచందమొందెనందు ।
నెవఁడొదానిఁగొనఁగనీవుహరించితం । చెంచినన్నుదూఱుటిదియుచితమె॥ ౬౩॥

మాలినీ॥ అనియనహరిసందే - హంబుడిందంగవారల్ ।
మనమలరఁగభక్తి - న్నన్ననంగోరినీయం ।
దెనయదెదియుదోసం - బెన్ననాకేనియందే ।
కనఁబడుననిపీఠ్యో - ల్గాంచిరేతెంచిరంతన్॥ ౬౪॥

కం॥ నారదపర్వతులిరువురు । నార్తాత్ముంజూచిమమ్మునరుఁడెంచనిక ।
న్యారత్నమునెరుగనకుమా । యారతినెసఁగితివిగాననందుముఫలమున్॥ ౬౫॥

ఆ-వె॥ కాలకూటమువలెఁగలుగునెక్కౘతమంబు । ముంచుకొనుననిన్నుమునిఁగిదాన ।
నాత్మవేదితయఱనడలుముకర్మాను । గుణముఫలముపోనెపుడునువనుంద॥ ౬౬॥

కం॥ అనిమునులుశాపమిచ్చిరి । మునికోపానలవిధూనుమోఁజనఁదమముం ।
జనియించెహరిరుడగ్నిం । జనియించెంజ్వాలయనఁగఁజక్రమునపుడే॥ ౬౭॥

సీ॥ తాపింఛవనరాజిధర్మమూనెఁదమంబు దావాగ్నియయ్యెసుదర్శనంబు ।
ఘనఘనాఘనయూధగరిమఁగాంచెఁదమస్సు హరిచక్రమయ్యెనయ్యరియదెకద ।
కొండలపిండననిండెఁదమోరాశి చక్రముదంభోళిసంఘమయ్యె ।
దుర్దినాభ్రోద్ధతిఁదోతెంచెనుదమస్సు చండమారుతమయ్యెఁజక్రమపుడు ।
కడిమిగాంధాంధకారంబుగాఁదమంబ । హోసహస్రారమయ్యెసహస్రధాము ।
బింబమిఁకవేయునేటికాపృథుతమంబు । తమముగావేయిమొనలవాల్దఱుమఁజొఁగె॥

కం॥ అత్తమమాసాత్వికజన । సత్తముఁడగునంబరీషజనపతినిందా ।
హత్తకచంద్రాదిత్యుల । మొత్తనుఱుకురాహువువలెమునులనుగవిసెన్॥ ౬౯॥

శా॥ చక్రంబంతటశాంతిఁబొందకమహాశార్దూలవిక్రీడిత ।
ప్రక్రాంతంబయితత్తమోమునులనెవ్వాంజేసిభ్రమింగంగడున్ ।
విక్రాంతిన్వెనువెంటనంటెమునుఁగన్భీతిన్మహాంభోధిలో ।
నక్రప్రక్రియఁజూపెమింటఁజనశ్యేనత్వాప్తిఁబోల్చెంబొరిన్॥ ౭౦॥

మ॥ మునులయ్యోయయయోయయోయయొయయోమొఱ్ఱోయటంచంతట ।
న్మనదిక్పాలపురాళిఁదూఱియునునిర్మర్యాదమైయానుద ।
ర్శనమత్యుద్ధతితీక్ష్ణతీక్ష్ణరుచిదుర్ధర్షంబయైవెన్కొనం ।
గనుజక్రార్దితులైతపించుచుమహాకంపంబునంబాఱుచున్॥ ౭౧॥

మాలిని॥ శరణుశరణు దేవా-సర్వసద్భక్తరక్షా । గురుతరకరుణాబ్ధీ-ఘోరతాపాపహారా।
హరిహరి మమునీవే-యారయంగావలెన్ శ్రీ। వరయరికృతభీతిన్-బాపవే చక్రపాణీ॥

ఆ-వె॥ అనుచనన్యశరణులయి ప్రాణభీతితోఁ । దాపమోర్వలేక తన్నెనమ్మి।
వచ్చియేడ్చి పడ్డ వగ్గఁదపసులను । గనిముకుందుఁడధికకరుణనిగుడ॥ ౭౩॥

కం॥ ఆఁగక ఱోలుచు రోఁజుచుఁ । జాఁగిలఁబడి లేవలేక సంస్మృతియెడలం।
గాఁగ్రిశవములుగఁదగిన । జోగులఁగయి నిమిరి లేపెఁ జాని పెంబ్రకృతిన్॥ ౭౪॥

కం॥ వారిం జెంజక్రంబున్ । ఘోరంబుఁ దమంబునంత గోవిందుఁడు నా।
వారలు వీరలు భక్తులు । నారదుఁడును బర్వతుండు నాభాగజుఁడున్॥ ౭౫॥

కం॥ కావున వీరలకిపుడేఁ । గావించెద మేలటంచుఁ గనుఁగొని తమమున్।
నీవెవరిం బాధింపకు । నీవశమైయుండువాఁడ నేమానవతన్॥ ౭౬॥

కం॥ శ్రీమతికి స్వయంవరమున । నేమాడ్కింగనఁబడితిన దేరూపున నే।
భూమిం జనింతు దశరథ । రాముఁడనఁగ నంబరీషరాజకులమునన్॥ ౭౭॥

ప్రభాతవృత్తము.

అనఁగఁదమంబది-యస్తమించెఁ జక్రం । బెననెఁ బ్రశాంతిని-నిందిరేశుఁడంతన్।
మునివరులార ప్ర-మోదమొందుఁడీనా । ననిరిటు నారదుఁ-డల్ల పర్వతుండున్॥ ౭౮॥

చ॥ మునులెట రాచకూఁతురెట మోహముఁ జెందుటయేడ దానికై।
చన వెడలంగ వంచనను జల్పుటయేడ వలీముఖత్వముం।
గనుటన నెట్టిదింతి యెడ గల్గిన నీపయి నిందమోపుటే।
మినృపతి కేల శాపమిడ మించితమమ్మది మమ్మెక్రమ్మఁగన్॥ ౭౯॥

తే-గీ॥ వ్రతముచెడ్డను సుఖములవడియె నేని । గొంతమేలనఁ జనునదిగొఱలదయ్యె।
మీఁదిమిక్కిలి చక్రంబు బాదయొదవె । యిందునీదయ బ్రదికితిమిదియె పెండ్లి॥ ౮౦॥

ఆ-వె॥ బుద్ధివచ్చె మాకుఁ బోమిఁక నీదారిఁ । బెండ్లిమాకు వలదు వేఁడ మెపుడుఁ।
ద్వత్పదాబ్జభక్తి దయనేయుమీమాకు । నిత్యముగను దాన నెగడుదుమిఁక॥ ౮౧॥

కం॥ తమమాత్మీయులమమునా । క్షమాధిపుం బొందనీక క్షమనీవే పాం।
దిమ నైదవఁట శ్రీరామా । సముఁడెవఁడవు నీకు భక్తసమవనశక్తిన్॥ ౮౨॥

కం॥ లోకారిఁ గాలకూటము । వీఁకం ద్రావితివఁటమును విషకంతునితో।
నీకాలమున నుదమముం । బోకార్చుటయెంత నీకు బుధనుతచరితా॥ ౮౩॥

తే-గీ॥ కామజనకుఁడవయ్యును గామరిపుఁడ । వీవయైతివి మాయెడ నెన్నఁటికిఁకఁ।
గామముం గల్గనీయకు కల్గెనేని । నీపదధ్యానమున నిల్పునిగుడనడఁపు॥ ౮౪॥

ఆ-వె॥ లోకగురువవగుట మాకీతెఱంగునం । గలుగఁజేసితీవు జ్ఞానమమరెఁ।
బోయివత్తుమీశ పాసఁగంగ నెలవిమ్ము । మమ్ము నేలుకొమ్ము మంగళమగు॥ ౮౫॥

తోటకము॥ అని మ్రొక్కుచు వీడ్కొని-యార్యులు వా । రనువొందఁగఁ బోయిరి-యంతట నా।
వనజాక్షుని శ్రీమతి-వల్లభనీ । ఘనమాయదురత్యయ-కాయనియెన్॥ ౮౬॥

కం॥ శ్రీమతినీవేమాయవు । నీమరులునఁగాదెయైతి నేమాయిగనో।
రామామాయామనుజుఁడు । రాముఁడనఁగనగుమననిపరఁగహరియనియెన్॥ ౮౭॥

ఉ॥ శ్రీమతివక్క శ్రీపతివరించితి నేనినునీవునన్ననిం।
పామహనీయభోగములనందెదమింపటఁదల్లిదండ్రి నే।
నేమిగనైతినోయనిమహింగడునుల్లముదల్లడిల్లఁగా।
నేమయిరోకనుంగొనఁగనిప్పడెనన్గని పొమ్మి నెమ్మి నాన్॥ ౮౮॥

మ॥ కరిరాజున్మనుగాచినట్టిఘనుఁడక్కల్యాణిసంప్రార్థనన్।
నరరాజున్మనుపన్బయల్వెడలెనైనన్ శ్రీమతీయుక్తుఁడై।
వరపంచాయుధుఁడై విహంగహయుఁడై భాసిల్లెసోల్లాసుఁడై।
హరిపంచాస్త్రిగురుండితంజనిజనుల్ హర్షఁబునంగాంచఁగన్॥ ౮౯॥

ఉత్సాహ॥ వచ్చిప్రోలనిల్వఁగాంచి - పచ్చవిలుతుతండ్రిని।
న్మచ్చికలరవెన్నుకురువు - నంజెలంగుశ్రీమతిన్।
సచ్చరిత్రుఁడంబరీష - జనవిభుండుసంతసం।
బచ్చెరియముహెచ్చమెచ్చి - యధికభక్తియుక్తుఁడై॥ ౯౦॥

అమృత వాహిని॥ ఓన్నమశ్శ్రీమతీశాయ । యన్నమంత్రంబుతోనినున్।
సన్నుతింతుముమాప్రాణ । మున్నిశ్రీమతిఁజూపుటన్॥ ౯౧॥

కం॥ తనయయిదినాకునీకు । న్వనితగనగుకురయఁగమహితవహునామహితగా।
మనమున నెంతుహరీవే । డ్కనుగావలె శ్రీమతికిటఁగల్యాణమనెన్॥ ౯౨॥

కం॥ కానిమ్మంచును శ్రీపతి । మానిని శ్రీమతినిఁబంచెమాతాపితలన్।
గానంగనిఁకనుమనకున్ । జానగుఁబెండ్లియననగుచుసతిపతియాజ్ఞన్॥ ౯౩।

ఉ॥ మ్రొక్కెనుదల్లిదండ్రులకుమోదముమీఱఁగవారుగూరిమిం।
గ్రక్కునఁగౌఁగిలించుకొనిగాదిలిబిడ్డరొవచ్చితమ్మమా।
యిక్కడునీవె శ్రీవగుటనేర్పడె శ్రీమతియన్న పేరునీ।
కిక్కడికేగుదెంచితివెయింతికిఁబుట్టినయింటఁబ్రేమగా॥ ౯౪॥

కం॥ నీసౌందర్యంబునకున్ । నీసద్గుణములకుఁదగఁగనీకొదవెమగం।
డో సుతమహిళోత్తమవీ । వోసర్వోత్తముఁడలపురుషోత్తముఁడుగదా॥ ౯౫॥

ఆ-వె॥ మీకుఁబెండ్లి సేయ మేము వేఁడుదుమన । ముదితచిఱునగవున మోమువాంచె।
నంబరీషుఁడంతయవ్వసిష్ఠునితోడ । మంతనంబు నేసెమహిమదనర॥ ౯౬॥

ఆ-వె॥ పురమలంకరించినరసురమునులను । గూర్చుకొంచుహరినిఁగోరెరాజు।
శ్రీమతికినిదగినచెలువునవరుఁడవు । గమ్మటంచునెమ్మిగడలుకొనఁగ॥ ౯౭॥

కం॥ మొదటనెటువంటిరూపున । ముదితకు శ్రీమతికగపడెఁబురుషోత్తముఁడిం।
పొదవనటువంటిరూపునఁ । బొదలెనపుడు పెండ్లికొడుకుపోలికికనువై॥ ౯౮॥

కం॥ కన్యను శ్రీమతినొసఁగెన్ । మాన్యుండయ్యంబరీషమహిపతిహరికిన్।
ధన్యుఁడితఁడుబలికంటెన్ । ధన్యుఁడితండబ్ధికంటెఁదగుననవిబుధుల్॥ ౯౯॥

మంగళమహాశ్రీ వృత్తము.

పాడిరటఁదుంబురుఁడు - పావనియుశ్యామలయు - వాణియును రాణదనరంగా।
నాడిరొగినుర్వశియు - నాదటనురంభశివుఁ - డంతటనుభృంగియునెసంగన్।
గూడిరమరుల్మునులు - గుంపులుగమానవుల - కోటులననెంతపువువానల్।
పోఁడిగను బెండ్లియది - భూదివులుమెచ్చఁగను - బొల్పెసఁగెమంగళమహాశ్రీ॥ ౧౦౦॥

ఉత్సాహజాతి॥ ఏమెపేరుదనకుఁగల్గె - నేపెదనమప్రార్థనన్।
గామజనకుఁదనకుమగనిఁ - గాఁగఁగూర్చెఁగూర్మిచే।
నామెనామెనాథుఁగొల్చె - నంతశ్రీమతిపతితో।
శ్రీమతిఁదనుమధ్యనుశివ - శివునిబిల్వనాథునిన్॥ ౧౦౧॥

ప్రకృతి జాతి॥ శ్రీమతియే - సీతయనం। గామహిజా - ఖ్యాతిఁగనెన్।
రామునికిని - రాణియునై। శ్రీమించెను - శ్రీయెయనన్॥ ౧౦౨॥

పురుష జాతి॥ నారాయణుఁడే - నల్వొందన్। శ్రీరాముఁడనన్ - క్షితిపతియై।
వీరతసీతం - బెండ్లాడెన్। గౌరవమెంతో - కనిమనియెన్॥ ౧౦౩॥

అశ్వగతి వృత్తము. [రుమా।

అంతటఁబర్వతనారదు-లంతయునారసిశ్రీ। కాంతుఁడుమాయలవాఁడని-కాంచుటఁగాంచి
కాంతునిబిల్వవనేశ్వరుఁ-గంజగిరీంద్రముపై। నెంతయుభక్తిభజించిరి-యేచిరశైవులుగాన్॥

ప్రకృతి వృత్తము॥ ప్రణుతింతున్ - బ్రకృతీశ్రీ। తనుమధ్యా - తలినిన్నున్।
జనయిత్రీ - జగదంబా। కనికావం - గదెనన్నున్॥ ౧౦౪॥

పురుష వృత్తము॥ ఆదిమపురుషా - యాత్మేశా। శ్రీద్రుమమహితా - శ్రీ
ఆదుముతనుమా - ధ్యాధీశా। వేదముఖనుతా - బిల్వేశా॥ ౧౦౫॥

శ్రీ వృత్తము.

రామహారామాయణమూలంబిది - ప్రాకటంబయనాటన్।
క్షేమమున్ యోగంబునుగూర్చుందనుఁ - జేరువారికెప్డున్।
దామహిన్ స్వర్గంబునుమోక్షంబును - దద్దయిచ్చుఁగానన్।
శ్రీమతీదామోదరకల్యాణము - శ్రీకరంబుగానా॥ ౧౦౬॥

మహా మంగళమణి జాతి.

శ్రీమతియనశ్రీమతియవు - శ్రీమతికినిఁకంద।
ద్దామోదరుఁడవుదామో - దరునకుఁదత్పతికిన్।
వేమఱునరెమంగళముని - విశ్రుతగురుభక్తిన్।
గామితములుసమకొనుఁద - త్కల్యాణమునెన్నన్॥ ౧౦౭॥

ఇది, శ్రీమతీదామోదర కల్యాణము.

## బిల్వేశ్వర కల్యాణము.

ఉ॥ మందరపర్వతంబుననుమామహిళామణినీలకంఠుఁడిం।
పొందవిహారముంజలుపుచుండిరిమున్నపుడీశుకన్నులన్।
సుందరివెన్కనుండితమిచొప్పడనొప్పగమూసెనవ్వివె।
గ్గాంధమిఁజీఁకటుల్గదిరెనెక్కటమిక్కటమైజగంబులన్॥ ౧॥

ఉ॥ ఆయిరులెల్లఁగూడుకొనియయ్యెమహాసురుఁడంధకుండనన్।
జేయుచునుండెనయ్యదనజిత్వరుఁడాకనకాక్షరాక్షసుం।
డోయనఁగందపంబుఁదనకొప్పఁగసంతతిచొప్పడంగవా।
న్నాయకుఁడిచ్చెవానికినినందనుఁగానలయంధకుందగన్॥

చ॥ పదపడియంధకుండుగడువాఁడిగఁజేసితపస్సుతత్ఫలం।
బొదవఁగబ్రహ్మవిష్ణుపురుహూతముఖాఖిలలేఖులన్మహా।
మదమునఁజేసెదేవతలమానులమానులఁగాసెనర్చనా।
యదయునికన్నమైరినరులాగుడిబ్రిమింగఁగలింగముండునే॥ ౩॥

శా॥ అంహస్సంహతివోలెగొంతునవిసంబాలక్షితంబంటహా।
నింహాఖ్యుండఁటకాలకాలుఁడఁటగానిల్లంజగంబుల్మహా।
సంహారంబొనరించునంతుతుదనేనైరింతునేయాహరున్।
రంహస్స్ఫూర్తినిసంహరింతుననియారాత్రించరుండుద్ధతిన్॥ ౪॥

చ॥ చనిచనికాంచెశంకరులఁజంద్రకచందనఫుల్లమల్లికా।
ర్జునవరటామరాళములచొప్పననొప్పెడువాఁడిభోగులన్।
యనఁగనుగోవృషంబులననశ్వములాకరులోయనంగసా।
రనదిసుధాబ్ధియోయనఁగఁగ్రాలెడువారినిశేందురోచులన్॥ ౫॥

ఉ॥ కాంచియుమంగ్రహించుటకుఁగ్రక్కనరక్కసుఁడుక్కుమీఱితాఁ।
బొంచెనుమించెఁబట్టుకొనఁబోఁగనెభోగివిభూషణుండుసా।
లాంచితుఁడైతమోనిరసనాచ్యుతుఁడోయనవచ్చిచొచ్చియ।
చ్చంచలచిత్తునింబొడిచిచయ్యనదయ్యఁగఁజేసెనీసునన్॥ ౬॥

ఉ॥ అంతఁదదంధకాసురునియంగమునుండిస్రవించినట్టినె।
త్రంతయుబొట్టుబొట్టునకునంధకుఁడొక్కరుఁడొక్కరుండుగా।
నంతటఁబర్వెనంధకమయంబుగనుర్వియొసంగెవాంద్రనుం।
గంతుకొనంగఁజేయమఱికల్గిరియంధకులట్టెనెట్టనన్॥ ౭॥

ఉ॥ అంతకతుల్యులయ్యసురులందఱునంధకులట్టెముట్టినం।
బంతముమీఱవారలనుబల్విడిబల్మినిద్రుంచికాంచియా।
వింతనిదింతఁదీఱదనిపేరిమినేరిమివన్నెమిన్నగా।
నంతకవైరితద్రుధిరమానసృజించెనుమాతృకౌఘమున్॥ ౮॥

### శైవ మాతృకా సీసమాలిక.

బ్రాహ్మి మాహేశ్వరి వైష్ణవి కౌమారి వారాహి చాముండ వాసవియును।
వైనాయకియు మఱి వాయవ్య వారుణి సౌపర్ణి సౌరియు సౌమ్య యామ్య।
శివదూతియును జలచ్ఛిఖ పిచ్ఛిలయు బల యతిబల జయ విజయయు జయంతి।
యపరాజితయు వజ్రహస్తయుఁ గాళి మహాకాళియుఁ గరాళి యదితి యదితి।
నారసింహియు శతానంద భగానంద మాలినియును భగమాలినియును।
సుభగ దుర్భగ రక్త సురభియు సుఖమండి కకపాలి రాక్షసి కర్ణమోటి।
నందినియును మాతృనంద సునందయు శకుని బిడాలి పిశాచికదిని।
శంకరి రేవతి చంద్రలాంగలి మారి మృత్యువు లూకి దంష్ట్రిణి త్రిజటయు।
ఘోటఘటోదరి కుక్కుటకరభ భుసుండియు ధూమ్రయు సురభిరక్త।
వైతాళియున్మన బడబ గర్దభి కేకరియు లేలిహానయుఁ బ్రేతయాన।
లంబ లంబోదరి లంబస్తనియు లంబకర్ణ లంబాక్షి వికర్ణ విముఖి।
లంబనాసికయును లంబోష్ఠి లంబమేఖల లంబస్ఫట విశిఖయు విలంబ।
స్వాహయు స్వధయు వషట్కారి ధృతి జ్యేష్ఠ వినతయు సరమయు దనువు సిద్ధి।
మోహినియును బాలమోహినియును జంద్రసేన మనోరమ మేనకయును।
రంభ జ్యోత్స్నముఖి రమణి సులోచన వరవాణి రోచన వరకుమారి।
శ్యామ సుందరియును గామరూపయుఁ జిత్రరూపయును విచిత్రరూపయునుమ।
మాతంగియును హరత్పాతకయును గపర్దినియు మంగళ్యయు వినత శుభయు।
సామాన్యయును సమాసవ సంగమయునుత్కటయు స్ఖలంతియును రక్తయు విరక్త।
యబలవంచనయు మాయయు నదర్శనయును ధృష్టశాలిని మత్త దీర్ఘకేశి।
యంబిక సహానికుటుంబిక బహుపుత్రి రుచిరయు నరుచిర సుచిరయచిర।
కరకర్ణియేకాక్షి ఘననాదముక్తి కరక్తకంపన మహారభ సరభస।
క్రౌంచియుఁ గాలయుఁ గాలజిహ్వయుఁ గుంభకర్ణయు లుక్కాముఖి కద్రుముఖియు।
మాంసమదోద్ధత మత్త మహాసురి బాహుశాలిని మహావదన కునఖి।
పింగళాక్షియు మహాభీతి వకంపిని పరికంపినియును నిర్భయ యభయద।
ప్రాణదలాంగలి భైరవియును మహాభైరవి క్రోధని ఘోరరూప।
తామసి భీమ మహాముఖియును మహానాస మహానాద నందినియును।
రుద్రేశి హుంకారి రుద్రసటయు మహాదేవి మహాజిహ్వ దీర్ఘజిహ్వ।
జ్వాలాముఖియుఁ జలజ్జ్వాల విద్యుజ్జిహ్వ పిండజిహ్వయు మహాభీమ రౌద్రి।
యనఁగ నింకిట్టి పేళ్ల చేనడరునట్టి । మాతృకావర్గములు పెక్కు మహి జనించె।
శివమయంబు జగంబని చెప్ప నేల । శక్తిమయమె జగంబనఁ జనియెనవ్వు॥　　౯॥

చ॥ అవిహరునాజ్ఞనొందియపుడంధకరక్తమునంతయున్మహో।
త్సవముగఁ ద్రావి త్రావి కడుఁ దన్విని బొందుటఁ దుందిలంబులై।
వివశత లేవలేకలకు వ్రేఁగుగఁ బండెను వెండియంధక।
ప్రవితతియే చితన్బుదువ వారిధి దీవినిఁ బోలె నీశుఁడున్॥　　౧౦॥

సీ॥ ఏవాని కేఁకలాశావారణంబుల గుండెలఁ బగలించి గండెసంగు।
నెవ్వాని కనులు వహ్నిజ్వాలలుమియుచు దనుజౌఘతమము నుగిని మెసంగు।
నెవ్వాని కోఱలహీంద్రదంష్ట్రిలువోలె బ్రహ్మాండముల కెల్ల భయముఁగొలుపు।
నెవని గోళ్లు దితిజేంద్రకుధ్రమునకు దంభోళులై మహోద్ధతినిఁ దెలుపుఁ।
దీవ్రరోషదవానలోద్దీపనోగ్ర । కేసరసటావిచాలనభాసురుండు।
ఖండనజయేందిరాఢ్యుండు భక్తనిధియ । తండు నరహరి మదరులఁ జెండుఁగాత॥ ౧౧॥

కం॥ అనుచుం ధ్యానించెద । త్క్షణమున నేన్నృహరియొక్క ఘనశక్తి స్సృజిం।
చెనదియ వుశుష్కరేవతి । పనివడి యంధకుల నల్లబాగుగఁ ద్రాగెన్॥ ౧౨॥

తే-గీ॥ వింతగదయది నెత్తురెంతెంత ద్రావు । నంతకంతకుఁ జిక్కెడు నాఁకటఁగడు।
గావున నుశుష్కరేవతీఖ్యాతి దాని । కొప్పె నన్వర్థకాఖ్యగా నొప్పెసంగు॥ ౧౩॥

ఉ॥ అప్పుడు శూలి యంధకుల నందఱఁ ద్రుంచె మదేభ మేఘునన్।
దొప్పఱఁ దూఱి పెంజెఱకు తోఁటలఁ గీటడఁగించు పోలికం।
జెప్పఁగ నేల చుట్టుగల చెట్టుల నెల్లన్మృగాల నెట్టియం।
దొప్పెడు మూలసాలమున హూపడఁ గొట్టెడునట్టు లేర్పడన్॥ ౧౪॥

చ॥ శివుఁడఁట యంతకాంతకుఁడు చెప్పెడిదేమిఁక నప్పులాశిచే।
నువితతబాధ నొందెదివి సూర్యుఁడు రాహువుచేతఁ బోలెనా।
హవమున నెట్టకేని హరుఁ డంధకు శూలముచేతఁ గ్రుచ్చియె।
త్తైవెలయు కంపనెత్తుక్రియ ధీరుని కేదియసాధ్యమారయన్॥ ౧౫॥

ఆ-వె॥ అప్పుడంధకుండు హరుని నుతించెను । వీరభద్రుఁడనఁగ వెలయుదీవె।
నీదుసేవ నేసి నెగడువాఁడనటన్న । మెచ్చి గాణపత్యమిచ్చెను దగ॥ ౧౬॥

తే-గీ॥ ఎదిరియెదురుగఁ బోరంగ మదము డంచె । భక్తి నేసిన దయ గాణపత్యమిచ్చె।
నంధకారాతి యంధకహర్షదుండు । భీముఁడన శంభుఁడన నొప్పుఁ బేర్లు తనికె॥ ౧౭॥

ఉ॥ ఆఁకొని మాతృకాగణము లంతఁ బురాంతకుఁ జేరి పేరిమిన్।
శ్రీకరశంకరా మము సృజించితి వంధకరక్తమాన మే।
మోకృతకృత్యతం బొరసి మ్రొక్కెద మక్కఱ నీకు నీకడన్।
లోకములం గ్రసింతుము త్రిలోచన మాకి వుడానతీవెనాన్॥ ౧౮॥

చ॥ శివుఁడనె సంభ్రమంబున ననుఁ జేయకుఁ డప్పని నెప్పుడేని మీ।
రవుట ను మాతృకల్ప్రజల నాదట మోద మెలర్పఁ బ్రోవఁగాఁ।
దవుదురు దల్లులెందయిన దారకుల న్వధియింతురే మహో।
త్సవులుగ వారి నారయుటె ధర్మము గాయన నవ్వియవ్వడిన్॥ ౧౯॥

కం॥ అబలలు విద్యాధనముల । సబలలయినఁ బురుషుల నిలసరకుగొనక స్వే।
చ్ఛఁ బరంగు దురితులన నా । సబలలు మాతృకలు చనిరి శర్వునుఱకహా॥ ౨౦॥

సీ॥ వృక్షముల్వ్రకలించి భక్షించె నందుండు పక్షులమాటేల పలుకవలయుఁ।
గొండలపిండును బిండిపిండిగఁ దినె నెమ్మృగపశువ్రజముల నెన్నవలెనె।

పట్టణంబులఁబట్టియట్టిట్టెత్రిమింగెనుమనుజసురాసురుల్మనుదురెయట।
నాఁపోవఁద్రావెమహాబ్ధులనదనదీవాపులజలచరవ్రాతమున్నె।
యిట్టులామాతృకావర్గమేచివిశ్వ। ముననెస్వాహాయటంచటుగనుటవిశ్వ।
పతియుహాహాయనెన్విశ్వపదమెమిగిలె। స్త్రీలుపురుషులమీఱంగఁజెడదెకొంప॥౨౧॥

పంచపాది చంపకమాల.

సమధికమాతృకోద్ధతినిసైఁపఁగనోపకయాపురారిశ్రీ।
రమణునిసంస్మరించెనుశరారుశరాధికఘోరసన్నఖున్।
స్వమహితశూలదంష్ట్రిజ్వలనాయితజిహ్వఘనాఘనస్వనున్।
భ్రమితతటిత్సటాచ్ఛటునిరస్తతముస్స్మృతిమాత్రసత్క్రియున్।
ద్యుమణిసుధాకరాగ్నినయనున్నరసింహుమహోగ్రరంహునిన్॥ ౨౨॥

పంచచామరవృత్తము॥ స్మరించినంతనేస్మరారి - సమ్ముఖమ్మునన్మహా।
దరమ్మునంగరమ్ములందు - ధారముల్ధరారులుం।
బరంగసూర్యకోటికాంతి - భాసిలంగిరీటము।
న్సరత్నమేరువాచుదోఁచె - నారసింహుఁడయ్యెడన్॥ ౨౩॥

శా॥ జ్వాలామాలికలేసలాకలుగనొప్పంబంగరుంబంజరం।
బాలక్షింపఁదగెన్నృసింహుఁడుమహాహర్యక్షమైనాఁగనం।
దాలోకించినృపంచవక్త్రినతనిన్హర్షించిపంచాననుం।
డీలీలన్నుతియించెసాంజలియునైయెంతేనిసద్భక్తితోన్॥ ౨౪॥

అమృత వాహిని॥ ఓన్నమశ్శ్రీనృసింహాయ। యన్నమంత్రంబుతోనినున్।
సన్నుతించుచునున్నాను। నన్నునేలవెశ్రీశ్వరా॥ ౨౫॥

ద్వాత్రింశత్సహస్రకోటి గ్రంథస్తుతి.

సహస్రశీర్ష వినుత సహస్రచరణాంచిత।
సహస్రాక్ష సహస్రాభ సహస్రకరభీకర॥ ౨౬॥
సహస్రకరసాహస్ర సహస్రాభవిభాకర।
సహస్రచంద్రప్రతిమ సహస్రగ్రహవిక్రమ॥ ౨౭॥
సహస్రవాయువేగోగ్ర సహస్రాగ్నిసమప్రభ।
సహస్రరుద్రతేజస్క సహస్రబ్రహ్మసంస్తుత॥ ౨౮॥
సహస్రపత్రపత్రాక్ష సహస్రాత్మస్వరూపక।
సహస్రలోకసంరక్ష సహస్రాశ్రితరక్షక॥ ౨౯॥
సహస్రపరమక్రోధ సహస్రారశయాంచిత।
సహస్రారసహస్రార సహస్రనఖరోజ్జ్వల॥ ౩౦॥
సహస్రాశనిసంకాశ సహస్రగురుదంష్ట్రిక।
సహస్రాంశుసహస్రాంశు సహస్రవరకేసర॥ ౩౧॥

సహస్రశ్మ్యేదరచిత సహస్రహరివిక్రమ।
సహస్రాస్త్రమహోగ్రాస సహస్రాయుధభక్షక॥ ౩౨॥
సహస్రమృత్యుమథన సహస్రాఖ్యాకృతీడిత।
సహస్రార్థనృసింహాహ్వా సహస్రాత్మన్నమోస్తుతే॥ ౩౩॥

తే-గీ॥ అనుచుశాలిద్వాత్రింశత్సహస్రకోటి । గ్రంథమునృసింహసంస్తుతిగానొనర్చె।
నోన్నమశ్శ్రీనృసింహాయయన్నమంత్ర । మొనరసర్వార్థదంబాప్తజనులకెయగు॥

కం॥ అనిసన్నుతింపఁబనియే । మనియడిగెనునృహరియిట్టులనెమ్మృడుఁడేనా।
ఘనుఁడైనయంధకాసురుఁ । దునుమస్పృజించితినిజెప్పదునెమాతృకలన్॥ ౩౫॥

కం॥ ఆమాతృకలెంతేని । న్నామాటస్సరసఁగొనకనలిరేఁగిమహా।
భీమంబుగఁదినెదరుప్రజ । నేమనితిన్విన్నవింపనీకృపచేతన్॥ ౩౬॥

తే-గీ॥ విసవుఁజెప్పైననెట్లోతాఁబెంచినజుక । ననుచితంబనిలోకోక్తియునికిఁజేసి।
వారినేనేమియునుజేయవలఁతిఁగాను । నానృహరిమాతృకాసృష్టికహానెమఱియు॥

తే-గీ॥ ప్రణవవాచకమునుమఱిప్రణవవాచ్య । మునగుశ్రీమన్నృసింహుఁడాప్రణవమాత్ర।
లననస్పృజియించెమాతృకలసునలువురఁ।బరయుఁబశ్యంతిమధ్యమవైఖరియన॥ ౩౮॥

కం॥ వాగీశ్వరిభువనేశ్వరి । బాగుగభగమాలినియనఁబరఁగఁగనుమహా।
భాగయగుశుష్కరేవతి । నాఁగనుమాతృకలువారునలువురయిరొగిన్॥ ౩౯॥

బంగారము.

వాగీశ్వరియెజిహ్వావలననుగలిగెనువాక్ప్రపంచంబెల్లవశ్యముగను - బ్రాహ్మిగదా।
మాయయేహృదియందుమఱిపుట్టెస్వవశమైవిశ్వమెల్లనుదనవిభవముగను - విశ్వేశ్వరి।
భగమాలినియొగుహ్యభాగంబువలననుబ్రభవించెశక్తివైభవమువెలయఁ - బ్రబలగదా।
శుష్కరేవతిగడుశోభిల్లఁబాడమెనస్థులవల్లనసృగబ్ధికలయగన్తి - వలెబలిమిన్।
వీరలష్టాపదలనంగవిలసిలనెకొ+పెంపలరన్
సర్వమాతృకిరీటాప్తిఁబర్వనెకొ+శ్లాఘ్యలుగాఁ।
దనరనెగిఁజెఱియెనమంద్రఁదదనుచరుల - వినుతముగా।
మాతృకారత్నములహరిమఱిసృజించె - మైవలనన్॥ ౪౦॥

వైష్ణవ మాతృకా స్వర్ణమాలిక.

తనరెఫంటాకర్ణిత్రైలోక్యమోహినిసతిసర్వసత్వవశంకరియును - శ్లాఘ్యలుగా।
చక్రహృదయకామచారిణిశంఖినియునులేఖినియులోకవినుతలుమఱి - ఘనలుగదా।
కాలసంకర్షణిఖ్యాతయీూమెనమంద్రువాగీశికనుచరల్వంద్యలెందు - వరచరితల్।
సంకర్షణియునుస్వస్థయుబీజకర్ణియునుపచారితయునుమహోత్సవదలు-ఊరీకృతల్।
కల్యాణిమధుదంష్ట్రికమలహస్తయుమఱియుత్పలహస్తమహోద్ధవదలు-ఉరరీకృతల్।
వీరనిమిదిగురువినుతలుమాయానుగలుమహామహలుసకలఫలదలు - కాంక్షితలే।
అజితసూక్ష్మహృదయయువలవృద్ధావేశయశ్మదంశనయుమహామహిమలు-హర్షదలే।

క్రమతన్నృసింహభైరవబిల్వాయనుగరుత్మద్ధృదయజయయయుదారమతులు-తనుమధ్యయే।
భగమాలినికిననువర్తినులెనమంద్రుపీరలులోకైకవిదితయశలు - విశ్రుతలే।
క్రమముగాఁగాంచనాకర్షణిసంభటయుత్తరమాలికయుత్తములుగ - నెప్పెదరా।
జ్వాలాముఖియనుభీషణికయుభయదలుగామధేనుపుబాలికయునుఖదలు+గణనీయలు।
పద్మకరయుననువారలీయెనమంద్రురేవతికనుగతద్దేవనుతలు+భావితలే।
పుట్టిరీముప్పదిరువురుభువననుతలు - పొనరెదరా।
మంత్రరాజాక్షరములనమహితతములు - మాన్యలుగా।
సందియంబేలనరసింహజాతలెకద - సంస్తుతలే।
విత్తొకటియైనఁజెళ్లెలవేఱుమొలచు - వేడుకగా॥ ౪౧॥

తే-గీ॥ మంత్రరాజస్వరూపుఁడామనుజసింహు । నంగమందుజనించినయట్టివీరు।
ముప్పదార్వురుమాతృకల్భువనసృష్టి । రక్షణక్షయదక్షులురహి వెలసిరి॥ ౪౨॥

కం॥ ప్రళయజ్వలనజాలల । వలెఁబ్రళయాదిత్యులవలెవైష్ణవమాతల్।
వెలుఁగొందిరికననిలువఁగ । వలనుపడమిశైవమాతృవర్గముపాకెన్॥ ౪౩॥

మ॥ మహిమన్వైష్ణవమాతృకల్దఱిమిరామారాంతకృన్మాతలన్।
మహిఁగొల్లల్పసులంబలెంభటులనింబ్రత్యర్థులంబోలెనిం।
కహరుల్హస్తులనాఁగమింటననడేగల్పావురాలన్వలెన్।
బృహదబ్దంబులఁజండవాతములనన్జీఁకట్లనాభానువుల్॥ ౪౪॥

ఆ-వె॥ అట్లుపఱచిపఱచియాశైవమాతృకా । వర్గమలనిన్నృహరిపదమెశరణ।
మంచుఁజేరెనారయాఁరామభద్రుని । శరణుసొచ్చువాయసంబనంగ॥ ౪౫॥

కం॥ రక్షింపుమురక్షింపుము । పేక్షింపకుమమ్ము దేవనృహరీత్వన్మా।
త్రీక్షితలమగుటఁదప్తల । మక్షయముగమనుపుమనిరియలశివమాతల్॥ ౪౬॥

కం॥ అనవుడున్నృసింహుఁడనియెను । వినుఁడీమాతృకలుప్రజలఁబెంతురెటుసురల్।
మనుజులటుమీరలింకం । జనులనుగాపాడవలయుఁజనవునవెపుడున్॥ ౪౭॥

కం॥ మనుజులతోదివిజులతోఁ । బనుపడియొద్దికగశివునిభజియింపుఁడుశూ।
లినతులజోలికిఁబోకుఁడు । ననునెంచినవారినేరినలఁపకుఁడీరల్॥ ౪౮॥

కం॥ మిముఁగొలుచువారికారో । గ్యముఁబుష్టినిఁదుష్టిసర్వకామితములనిం।
డమరఁగనొప్పరికింపక । తముఁగొల్చెడువారిఁబ్రోవధర్మమ్ముగదా॥ ౪౯॥

కం॥ మదుదీరితమగునెదియది । గదిరిననుచ్చాటనాదికముతజ్జనులన్।
గదుమకపదరకయణఁకువ । గుదురఁగనందుండునట్లుగుఁడునాయాజ్ఞన్॥ ౫౦॥

కం॥ రుద్రుఁడుమఱియొకమూర్తిన్ । రౌద్రిన్సృజియించిమీకొనరఁగనొసంగున్।
భద్రదయగునదిమఱినిరు । పద్రవమీకేలికగనుభావింపుఁడీకన్॥ ౫౧॥

కం॥ మిముఁదఱిమిననామాతృగ । ణమిదివిశాలాక్షముండునాతోడనెమీ।
రమరన్నాతోఁబూజలఁ । బ్రమదంబునఁగొనుఁడునరులవలనఘనముగన్॥ ౫౨॥

కం॥ ఏరైనఁ గొలిచిరేని । న్వేరుగమిమువారికిడుఁడభీష్టములెల్లన్।
నేరంజిల్లుదునిజచర । ణారాధననతఫలదమనంగురుభంగిన్॥ ౫౩॥

కం॥ ఏవారుశుష్కరేవతి । సేవింతురువారుసుతులఁ జెందెదరవనిన్।
శ్రీవిభవముఁగందురుమఱి । భావించిననేదిస్మైనఁబడయుదురువడిన్॥ ౫౪॥

మంజుభాషిణి॥ అనిపల్కి శ్రీనృహరి - యంతమాతృకా।
గణసంయుతుండునయి - కాంచెమానసం।
బనసొప్పనాత్మగృహమద్ధిక్షేత్రమే।
జనవంద్యమయ్యెఁగృతశౌచమన్ ప్రథన్॥ ౫౫॥

కం॥ శివసూత్రమునంబ్రణవం । బవుటన్నష్టమముదానికవుసమముయుతిన్।
దవఁగక్షకారంబదెకద । సువినుతమున్నృసింహబీజసువిదితమరయన్॥ ౫౬॥

కం॥ హరుఁడంతనాత్మమూర్తి । న్బరువడిఁగల్పించెనర్ధనారీశ్వరరూ।
పరుచిరముగనొసఁగెనుద । త్పరిపాలకుఁడుగనుమాతృవర్గంబునకున్॥ ౫౭॥

కం॥ మాతృకలేడుగురేడ్గురు । ఖ్యాతలుగుణనమునసాదిహాంతార్ణములే।
మాతృకలక్కరములెకద । ఖ్యాతిగఁబ్రత్యాహృతినినహమ్మనశివుఁడా॥ ౫౮॥

తే-గీ॥ ఏడుగురుమాతృకలగుటనొసఁగసోయ । నఁగనహమ్మనిశివుఁడటనెగడుటనిట।
సోఽహమనితోఁచుఁగదయుక్తియర్థముగను। బ్రణవమైననృసింహుఁడుపరఁగుకుటెట॥

ఆ-వె॥ తండ్రియొజ్జచేతఁదనబిడ్డలకువిద్దెఁ । గఱపురీతిమాతృకలకునృహరి।
చేతహితముఁదెలియఁజేసెఁజేసెనుశ్రీనృ । సింహుఁగాఁగనానృసింహుశివుఁడు॥ ౬౦॥

## విశ్వేశ్వర కల్యాణము. ద్వితీయాంశము.

చ॥ గరళగళుండుశుభ్రరుచిగార్శ్యముఁగాంచెనువిమ్మటన్నితే।
తరమగుపక్షమందుఁదగుతామరసారితెఱంగునంగడుం।
గిరిజమనంబునన్వగచెనీలగళుండిటులేలచిక్కనం।
చరసియెఱుంగనేరకనిజాప్తసఖింజయఁగాంచియిట్లనెన్॥ ౬౧॥

ఉ॥ అక్కరొశంభుఁడుండునెటులారసితేయననామెయమ్మరో।
దక్కఁగఁగొంటివర్థమునుదత్తనువీవెఱుంగవంటనే।
నెక్కడిదానఁద్వద్విభునియింగితముంగ్రహియింపఁగాంచఁగం।
జిక్కుచునున్నవాఁడతనిచిత్తమతండెఱుంగునావుడున్॥ ౬౨॥

చ॥ విజయియనంగనొక్కసఖివేడుకఁబల్కెఁజెలీసగంబెనీ।
కుజయమునాథుమైసగముఁగొంటఁగపర్దమెకొంటగంగకున్।
విజయముఁగాంచఁబూర్ణముగవేఁడెదుచేడియయెందుఁగల్గెనో।
గజిబిజిలేకయారయఁగఁగానఁగనానదెకారణంబనన్॥ ౬౩॥

ఉ॥ ఆయొకయూహఁగల్గని పుడద్రిజనిన్ననె మొన్న నోకదా।
గేయుఁడువిశ్వకర్మ విలిఖించిన వైష్ణవమాతృకాళినీ।
నాయకుఁడీక్షణక్షణమనంగనుచుండెఁగుబేరుతోడనే।
మోయతిగూఢభాషయనువొందఁగనైలబిలాయనెంజెలీ॥ ౬౪॥

చ॥ అతఁడొకబిల్వమాలికమహాముదమందఁగఁదెచ్చియిచ్చినన్।
బతియిదిదాల్పనంతటిదిభాగ్యము నాకెటులబ్బునంచనన్।
వెతఁబడకిద్దిసాజమనివేఱుగఁజూడకుబిల్వమాల్య మే।
హితవుగఁదాల్పుమంచునిడియెంగళమందతడిందుమౌళికిన్॥ ౬౫॥

మ॥ కనుఁగొంతేనరసింహునంచడిగెవేడ్కంగిబ్బరాతాతఁడేఁ।
గనశక్తుండనెకానఁగుందెదననెన్గన్గొందునెట్లంచుఁగుం।
దెననన్ శూలియుశైలరాజతనయాయేమందునీతోననన్।
వినవమ్మాయిటులమ్యెనంచుజయనావృత్తాంతమూహించుచున్॥ ౬౬॥

మ॥ పలికెందద్విజయాభిధానశివపృథ్భావంబుదెల్లంబుగాఁ।
దెలిసెంబిల్వయనంగశ్రీనృహరిపుత్రీబృందమందోర్తుచు।
క్కలపిండందుసుధాంశుబింబమువలెంగ్రాలుందదాసక్తిచే।
నెలదాల్పిట్లుకృశించునంచుఁదలఁతున్నీవింకనూహింపుమీ॥ ౬౭॥

మ॥ అనఁగానింతదురంతచింతఁగననేలాయీశుఁడేనేగిత।
జ్జనకున్ శ్రీనరసింహునేయడిగియచ్చంద్రాననంబిల్వఁదె।
త్తునునాకాంతునికిత్తుఁబెండ్లియొనరింతుంభర్తకుంబ్రీతిఁజే।
యనిదానేసతిసాధ్విచేయుటనెకామైరీడ్యలిల్లాంద్రోగిన్॥ ౬౮॥

## పాతివ్రత్య పంచరత్నములు.

సీ॥ ఒకయింతిమేల్బంతియొగిబుషిపత్నిసరూపయైపతిఁబొందిప్రోచెబ్రదుక।
నొకయన్నుమిన్నయమోహభోగంబునకమరెభర్త్రాజ్ఞచేనణఁచికొనుక।
నొకనాఁతితలకట్టునిఁకమిండజంగమాపంచాస్యుపాలయ్యెఁబతిహితముగ।
నొకచానగన్నాకువెకలియామగనినివహించుకొనివేశ్యవసతికిఁజనె।
బొలఁతితలమానికంబొకపూవుబోఁడి । చిచ్చుఁజొచ్చెనుబెనిమిటిమెచ్చనేక।
సుతువధించెనుధవుతోడనతిథిబలికి । బోటిబొట్లోర్తువీరలుపుణ్యతములు॥ ౬౯॥

తే-గీ॥ ఎక్కడెక్కడివోకతలేలపలుక । నెల్లెడనుసాగుమానంబుహితమగుటను।
ప్రాణనాయకుఁడనఁగనుభర్తయెతగు । సత్పతివ్రతయగునట్టిజాయకెందు॥ ౭౦॥

సీ॥ ముమ్మూర్తులనుదనముద్దుబిడ్డలఁజేసికొనియెఁగాయొకతల్లికోర్కిదీఱ।
ముప్పదిమూడుకోట్లొప్పఁగానెగడినవేల్పులనొకయమ్మవినఁగనెఁగద।
మహితుసాక్షాద్విష్ణుమౌనీంద్రుఁగపిలునినొకయంబప్రసవించియొనరదెనుతి।
రామకృష్ణాదులరహిఁగన్నజననులాజనువునభర్త్రైకశరణలెకద।

వలయు నే కొల్వ నన్యదేవతలను సతి । భర్తయే దేవ దేవుఁడా భార్య కెందు।
సాధులకు నేఁడు గడ పతి సత్యముగను । బుణ్యసతుల చరిత్రంబు పొసఁగు నిట్లు॥ ౨౦॥

సీ॥ స్వీయధనం బెల్ల విభుని దేయగు ననిభావించు నదె పతివ్రత నిజముగ।
ధవు బంధుమిత్రులఁ దన బంధు హితులని తలఁచు నదే సతి తథ్యముగను।
స్వశరీరమును నాధవశమని మనమున సతమెంచు నదె సాధ్వి సత్యముగను।
ప్రాణము నొగతుల్ స్వకములు పతివను నెనరు దెగరితయా నిక్కముగను।
వేయు నేల బహిర్దృష్టి వేఱుగాక । సూక్ష్మదృష్టిని నైక్యంబె చొప్పడుటను।
సర్వవిధముల భర్తను సరణ మొప్పఁ । జంద్రచంద్రికవలె నుండు సతి సతియగు॥ ౨౧॥

కం॥ తన పతికిఁ బ్రియము హితమున్ । దనరించు నెదది యె త్రికరణములను బెండ్లా।
మన నాలన నిల్లాలనఁ । గను జను సహధర్మిణియనఁ గను సుఖకీర్తుల్॥ ౨౩॥

కం॥ అనియుమ సమయోచితిఁ జే । రను బాతివ్రత్యపంచరత్నములను దె।
ల్పెను గొనిన వీనిఁ జానలు । మనెద్ధరమున్నైదువలుగ మఱిగరితలుగాన్॥ ౨౪॥

మ॥ చనియెం బర్వతరాజపుత్రి పతియాజ్ఞం బొంది సింహాశ్వ గాఁ।
గన్నృహర్యక్షునిఁ గన్యబిల్వనదు గంగార్యంబు సిద్ధింపఁ జే।
య్యన నాఁ దద్విజయంజయం గొని త్రిశక్త్యైక్యంబనం బూనికన్।
దనులోకుల్ శివదూతియే యనమహోత్సాహంబు రెట్టింపఁ గన్॥ ౨౫॥

చ॥ చనికని విష్ణుమందిరముఁ జయ్యన నయ్యుమ డిగ్గి సింగముం।
గనుఁగొనె నాయనాయనుచుఁ గ్రౌర్యము మాని నృసింహుఁ డెంతయుం।
గనికర మొప్ప శాంతుఁడయి కాంచె నుభక్తి నమస్కరించినం।
తనె శివలేవవమ్మ యనె నందనిఁ గన్నఁ బ్రశాంతి గల్గఁగా॥ ౨౬॥

ఉ॥ శ్రీసతి సర్వమంగళకుఁ జేసెఁ బ్రణామము లేచి వచ్చి యా।
ర్యాసతియల్లె శ్రీసతికి నమ్రము నొందె నృసింహుఁ డేమిదా।
నా సరసీరుహాక్షుమును నాకగు దీవన నగ్రజుండవి।
ష్టోసదయుందు తండ్రివవు దొప్పదె శ్రీకిట నేను మ్రొక్కఁగన్॥ ౨౭॥

ఉ॥ నావుడు సారసింహుఁడు ఘనంబగు ప్రేమమున న్నగాత్మజా।
యేవిధమైన నేమఁట మదీడ్యవు నీవవు దమ్మ నీకు నీ।
దేవునకుం గుమార్షులకు దేవి సుఖంబె కదా తలంతురే।
యేవడి నైన నమ్మనఁ గని మ్ముగ నమ్మల పట్టి యిట్లనెన్॥ ౨౮॥

శా॥ మీ కారుణ్యము సర్వమంగళ గనన్మించంగఁ గావించె నా।
శ్రీకంఠుం బురవైరి శంకరునిఁ గాఁ జేసెం గజాస్యున్సుభ।
ద్రాకారుం బొనరించె శ్రీముఖునిఁ గానాగ్నేయు సత్కందు న్సురా।
నీకి న్యంచితుఁ గా నొనర్చె జగము న్నిర్మించె మీదానిఁ గాన్॥ ౨౯॥

కం॥ సిరిమఱవదరిద్రులునర । హరినినుమఱవంగనాత్మహానిగలుగువా।
రరయకయుందురెమీరలు । శరణముమీరెకదసర్వజగములకెందున్॥ ౮౦॥

సీ॥ అభివందనంబుగ్రయభివాదనముపీరయోమహావిష్ణూప్రణామమయ్య।
జ్వలదాత్మకానమస్కారంబుసర్వతోముఖవందనమునృసింహుఁడజోహారు।
శరణుభీషణనమస్కారణంబుభద్రుండమృత్యుమృత్యూనమస్కృతియిదెకొను।
మహితనామాకృతిమణిమణిడ్యానీకుజోహారుదండంబుజోతనతివి। [లను।
నతియుఁబ్రణతిగేల్మోడ్పుసునతియుమ్రొక్కు । మ్రొక్కితినిమ్రొక్కుచున్నానుమ్రొక్కఁగ
ఓన్నమశ్శ్రీనృసింహాయయన్నమనువె । చాలుఁగదభక్తిముక్తులఁజాలనిడఁగ॥ ౮౧॥

వెండి॥ ఓమనియౌన్నత్వమొప్పఁగఁబరికింపనగపడునింహతసోఽహమనఁగ।
నరశబ్దమపునాత్మపరముగావుననుదద్వాచకమపుప్రణవమునెతెలుపు।
మఱిఁగననరసింహపదమునకునునృసింహపదంబునకుభేదమగపడదిఁక।
సిద్ధంబెకదవృత్తిసింహాదిపదములుశ్రేష్ఠార్థకములంటచెలఁగుటయిట।
వాసిగనునరసింహుఁడావరపురుషుఁడె - ముఖ్యముగా।
సత్యముగనిల్చుయోగంబుసరణినతఁడె - శ్లాఘ్యముగా।
యత్నమునఁజూడనిజమునువ్యక్తమగును - హర్షదమా।
సాంఖ్యమునఁగాదెతెల్లమాసత్యమరయ - సన్నుతమా॥ ౮౨॥

బంగారము.

ఓంకారమేప్రణవాంకమాటసుదొమ్మిదిటనాద్యనజునునిఁదెలిపెదీవు - తేజరిల్లన్।
నరసింహనీవొందినవరూపములయోగముననక్షరక్రమమునను విష్ణుఁ - గనఁబఱుతు।
మఱియుఁదద్యోగాప్తిమానకపరికింపనంశక్రమతశివునగపఱుతువు - హర్షముగా।
శివుఁడువిష్ణుఁడుబ్రహ్మసిద్ధంబుగానాత్మయోమహామన్మియంచుందువొకఁడ - వొప్పగదా।
వానుదేవుఁడనఁగవాముదేవుఁడనంగ - బ్రహ్మయనన్।
నుమపదైకభేదమమరునంతనెవస్తు - వుమఱివేఱె।
యత్నమునను జూడనైక్యంబెపొసఁగుఁగా - యైననిటన్।
వ్యావహారికత్వమందుటనేనిన్ను - నభినుతింతు॥ ౮౩॥

పంచచామరము॥ నృసింహనిన్నునెన్ననేగు - నెల్లపాపముల్వడిన్।
నృసింహనిన్నునెన్నఁగల్గు - నెల్లపుణ్యముల్వడిన్।
నృసింహనిన్నునెన్నలక్ష్మి - యేయెసంగఁబొందెదున్।
నృసింహనిన్నునెన్నముక్తి - యేకరస్థయయ్యెడున్॥ ౮౪॥

చక్రబంధము.

శా॥ సర్వాబిమ్బితకన్దిభూనఖచయాప్రత్నస్వరూరీతిశా।
సర్వాత్వేద్యనువిశ్రుతాముఖహరీసత్కృత్యగేయప్రథా।
సర్వైశ్వర్యధురన్ధరామఖభుగీశాతిప్రియామద్వశా।
శార్వశ్రీపరమాసమానుసదయాశాన్తారథాఇచ్ఛద్ధశా॥ ౮౫॥

రత్నావళి॥ కొమ్మున నీడ్వఁగవలదోడనుదటి - గొండను మోవఁగవలదుధరన్।
గొమ్మున నెత్తఁగవలవదువాఁడివి - గోళ్లను జెండఁగవలదసురున్।
గ్రమ్మఁగవల్దుజగత్త్రియమద్దుల - క్షత్రాసురసూతవధలువ।
ల్దిమ్మెయి వేదవినిందలు మ్లేచ్ఛుల - హననమ్మేలుముమమ్ముహరీ॥ ౮౬॥

మాలిని॥ అనియుమవినుతింపన్ -హర్షముంగాంచిశ్రీశుం।డనెనిదినుతిభక్తేష్టార్థమేదైననిచ్చున్।
వెనుకడుగిడకేదే-న్వేఁడుమీవన్ననెన్నం।జనవునశివవేఁడెంజంద్రచూడార్థమూర్తిన్॥

శా॥ గంగామౌళినటన్నపెన్నెపమునంగావింపఁడున్స్నానము।
చ్ఛాంగుండన్భసితంబదేలయనురుద్రాక్షస్రజంబుల్ధరిం।
పంగన్భారమటంచుఁదాల్పఁడుమహావ్యాఘ్రాజినంబొల్లఁడే।
ప్పుంగూర్చుండుఁబరుండులేచునడచున్భూతేశుఁడెన్నన్నినున్॥ ౮౮॥

చ॥ పనివడిమంత్రరాజమునుభక్తినినెల్లప్పుడుంజపించునం।
దొనరెడునట్టిమాతృకలనొప్పగముప్పదిరెంటిఁజొప్పడం।
గనుఁగొనుముఖ్యమాతృకలఁగాంచునునాల్గిటినెంచుసప్తసం।
ఖ్యనుగనినుంద్వదీయుశితికంఠునిఁజేయవెబిల్వనాథుఁగన్॥ ౮౯॥

చ॥ దయఁగనువిష్ణునామనవిదాఁపఁగనేటికిఁజల్లనమ్మఁబో।
యియటనుముంతదాఁపఁగనునేమిప్రయోజనమీశ్వరుండుబి।
ల్వయనెడిమాతృకామణికివశ్యుఁడెయయ్యెనుసంగుబిల్వనా।
దయితునికొనునాకనుజదానికినేనువిధేయనాదునాన్॥ ౯౦॥

కం॥ బిల్వప్రియుఁడీశుఁడగుట। బిల్వనుగోరుటదగుమఱిబిల్వయనీశున్।
నల్వపుగుణసంధియనె। న్నల్వజనకుఁడలరఁగరమనైపుణ్యమునన్॥ ౯౧॥

కం॥ కానిమ్మనెనరహరిసిరి। దానిమ్మనెనిమ్మనెశివదద్దయునెమ్మిం।
బూనెంబిల్వాంబఫలం। బేనాఁటికొయనికొనెమదిశ్రీశుఁడిపుడనెన్॥ ౯౨॥

కం॥ భగమునబిల్వంబగుటం। భగమాలినిబిల్వమాలఁబరఁగునదగుటన్।
దగుననియెనురేవతియో। తగుఁదగుననెసోమరక్తిదారకుఁదగుఁగా॥ ౯౩।

కం॥ మాతృకలందఱుసరియని। రాతతసంతోషమునసుహరిముఖులుసురల్।
ప్రీతినెనసిబాగనిరజుఁ। డాతఱిమేలనియెహర్షమత్యంతముగాన్॥ ౯౪॥

కం॥ జయయునువిజయయునత్తఱి। నయభయయములెసంగభాజనములిడిరిహరి।
ద్రయుఁగుంకుమమునుసుమఫల। చయమునువస్త్రాభరణనిచయమునునిండన్॥ ౯౫॥

ఆ-వె॥ మఱియునెన్నిగలవుమంగళద్రవ్యము। లన్నినిండియుండెనందువాని।
సర్వమంగళాంబజనకకైకొనుమని। శ్రీనృసింహదేవుచెంతనునిచి॥ ౯౬॥

తే-గీ॥ మ్రొక్కియుమునిల్చెనరసింహుమ్రోలరాము। నెదురశబరియనంగనుమదినరయఁగ।
రాముఁడేనరసింహుఁడుమామహిళయె। శబరియనితోఁపకున్నెనిస్సంశయముగ॥ ౯౭॥

కం॥ అందుండినృహరియొకపం | డందుకొనియెనిందిరవువునప్పుడుజయదా|
నెందుండుఁబెండ్లికూఁతుర | నందండ్రియుమాతృకలుదనరఁదోడ్తేరన్॥ ౯౯॥

సీ॥ కనఁగోరువారలుగన్నులుమిఱుమిట్లుగొననిదిమెఱుపులకుప్పయొయనఁ|
గాంచనెంచినవారుకాంచనరాశియోయుద్యదాదిత్యసముజ్జ్వలయనఁ|
జూడవేఁడినవారుసుందరశరదిందుబృందమోసౌందర్యకందమొయనఁ|
దిలకింపఁదలఁచువారలురతనాలప్రోవోపూవువామియోయొప్పెడునన|
జాళువావెలివల్వయుజానుమీఱ | మానికపుసొమ్ములెనివాళులైనెగడఁగఁ|
గ్రొత్తనునుసిగ్గుముసుఁగుగాఁగొఱలఁబెండ్లిఁ | బిల్వవచ్చెనెయనఁగనుబిల్వవచ్చె॥

తే-గీ॥ వచ్చినిలుచుండనృహరిబిల్వావెరంగు | మమ్మయీసర్వమంగళయక్కనీకు|
నన్నఁదిన్నగనరుదెంచియార్యకెరఁగె | లీలశంకరియునుగౌఁగిలించుకొనియె॥ ౧౦౦॥

ఆ-వె॥ ఆర్యయానపర్ణయవుబిల్వయొసపర్ణ | యోగమెననెనిప్పుడొప్పఁజూడఁ|
జిగురుపెట్టినట్టిశ్రీఫలంబనఁదోఁచు | నంచుబల్కెనుజయయంచితముగ॥ ౧౦౧॥

ఆ-వె॥ ఆకురాలుతఱిగనగునుమశిశిరధ | రాత్మజాతయెకదయానుబిల్వ|
చిగురుతఱిగఁగనకచేలునిసుతగదా | యనుచువిజయవలికెనవునవునన॥ ౧౦౨॥

ఉ॥ అంతటశ్రీనృసింహుఁడునగాధిపపుత్రికినెంతయేనియున్|
సంతసమొప్పఁజేసిబహుసత్కృతులన్జగదేకమాతవీ|
వింతినిబిల్వఁబ్రోచుపనియింగనునీదెయనంగగౌరిశ్రీ|
కాంతుఁడమమ్మునందఱనుగాచుటనీపనియంచనెందగన్॥ ౧౦౩॥

శా॥ ఎన్నండానెకొపెండ్లియెక్కడనొకోయీవానతీవేయనన్|
వెన్నుండయ్యుమఁగాంచియిప్పుడెయిటన్వేనేయనానావుడున్|
జెన్నాఁగాదెశుభస్యశీఘ్రమనఁగాఁజేయందగుంగార్యమే|
నన్నాతెచ్చెదనిష్టపెండ్లికొడుకున్హర్షంబుతోశ్రీపతీ॥ ౧౦౪॥

స్వాగత॥ అంచుఁబార్వతిర - మాచ్యుతులన్వీ | డ్కొంచునెక్కెహరి - గొబ్బుననాత్మ|
ప్రాంచితాలయము - వాకిటడిగ్గెం | గాంచెబిల్వపతి - కన్గొనుమంచున్॥ ౧౦౫॥

కం॥ శివుడంతయునెఱిఁగియునో | శివాయటంగార్యసిద్ధిచేకూరెనెనా|
భవునకుభవానియంతయు | సవిస్తరముగాఁగఁజెప్పఁజనవుననంతన్॥ ౧౦౬॥

కం॥ శివదూతివైతివపుటన్ | శివదూతియనంగఁబేరునెలఁగెడునీకో|
శివరాయోశివరానన్ | శివుశివుఁజేసితివనిశివశివుఁడెదఁజేర్చెన్॥ ౧౦౭॥

కం॥ శివదూతీయనిశివుఁడన | శివుఁడుశివుఁడుదూతిదూతిశివదూతిననెన్|
శివతత్పురుషసదాదృతి | శివుఁడుప్రకృతికంటెవికృతినెలఁగులలియనెన్॥ ౧౦౮॥

కం॥ ప్రకృతిన్ననన్నిబిల్వన్ | వికృతియనిగ్రహించితివాకొబిల్వేశయనన్|
ప్రకృతియనసంస్కృతంబని | వికృతియనఁగనాంధ్రమయనివినవెయుమయనెన్॥

ఆ-వె॥ ఇట్టులుల్లసిల్లనీశ్వరీశ్వరులట । కల్లనల్లనజయయరుగుదెంచెఁ।
గాంచివిజయయేగుదెంచిశివయెబిల్వ । శివుఁడెబిల్వనాథుఁడవునుకొయనె॥ ౧౧౦॥

అశ్వగతి॥ అప్పుడెతెప్పునగౌరిప్ర - యాణముసేయుదమా।
యిప్పుడనంగమహేశ్వరుఁ - డేటికిజాగనియెన్।
జెప్పఁగనందఱుఁగ్రందుగఁ - జేరిరిపెండ్లికనన్।
మెప్పుగవాహినులంబుధి - మేలుగనందుక్రియన్॥ ౧౧౧॥

## బిల్వేశ్వర కల్యాణము. తృతీయాంశము.

కం॥ మంగళమంకగతిన్లిపి । సంగతిఁగల్యాణముగనుసమకొనుఁబ్రణవం।
బంగుగనని తెలుపునన్ । మంగళగణపతిప్రయాణమహితుఁడు వెడలెన్॥ ౧౧౨॥

శా॥ నాదబ్రహ్మనిదానను స్వరమునన్మాన్యంబునాకేకినా।
హ్లాదంబొప్పఁగనెక్కినిక్కఁగను కాలబ్రహ్మవిజ్ఞానస।
మ్మోదాంచచ్చరణాయుధంబుధ్వజమైపొల్పొందమాసర్తుసా।
మోదంచత్కరవక్త్రుఁడై గుహుఁడు సూర్యుండాననన్వెల్వడెన్॥ ౧౧౩॥

సీ॥ ఆద్యమోంకృతియొండెయందునాదముబిందువుండునాఁదలఁగొమ్ములుండ రెండు।
ప్రణవమాత్రలూ వేదభాగంబులో నాల్గుపదములుగౌరిజెలుప్రకృతిఁదెలుపఁ।
బంచాంగమేప్రణవంబౌటమఱియొక కాలాకోయనఁదోఁకగ్రాలుచుండ।
సానువృత్తిస్వరమానితంబగుఅంకె దేవానుగతియయాజీవునికన।
దేవుఁడాద్యుఁడాద్వితీయుండుజీవుండు । పశువుజీవుఁడౌనుబశుపతియవు।
దేవుఁడతఁడెశివుఁడుతెలియుఁడీయనిమెడ।గంటతోడఁజాటుఘనవృషభము॥ ౧౧౪॥

కం॥ ఆనందినెక్కిశివుఁడుమ । హానందముతోడవెడలెనైవరుఁడువధూ।
మాణిక్యంబుంబిల్వ । స్థానుగఁబెండ్లాడన్నృహరిమందిరమునకున్॥ ౧౧౫॥

వెండి.

కట్టినపులితోలుపట్టుపుట్టంబుగానెనుఁగుతోలట్టెకానిపింప - జానగుఁగా।
రతనాలపడగలరంగారుచిల్వలుమానికమ్ములసొమ్ములైనెగడఁగ - మానగుఁగా।
మిన్నేటవాటమౌపెన్నెఱిజడముడిమగరాలబొమిడికముగనెసంగ - సొగసగుఁగా।
గ్రొన్నెలయందుపైఁజెన్నగుకలికితురాయిగా వెలుఁగుచుఁగ్రాలఁజాల - రాజిలుఁగా।
బూదిపూఁతలుగంధపుఁబూఁతలుగను । బుఱియపేరులువెలిదమ్మిపూసరులుగఁ।
జేతిపుఱెచెండుసొసలికన్ చెందిరముగఁ । బెండ్లికొడుకయ్యెనప్పుడాబేసికంటి॥ ౧౧౬॥

బంగారము.

తనయపర్ణాఖ్యనేతన్విసమస్తస్వరాదిమాతృరమాతననుచుఁదెలుపు - నభినుతింతు।
తనదుకాశీనామముననెయేకాంతహల్యాత్రిదానని తెల్పుముదమునఁదగఁ - బొరిభజింతు।
తనయుమాభిఖ్యనేతరుణిప్రణవరూపతానయౌటనుజాటుమానితముగఁ - బూనియెంతు।
తనుమధ్యమాహ్వయమునఁద్రిశక్త్యాత్మికతానంచుఁబ్రకటించుఁదల్లియెవతె - తగఁగ్రహింతు।

సర్వమంగళములభక్తసమితికినిడఁ - జాలుదునన్|
సర్వమంగళజగదేకజననిగౌరి - శంకరియనా|
హంసగజగతి గెల్చుటననహరిపయి - నహహాయన|
నెక్కి వెల్వడెఁబార్వతిదక్కనృహరి - మ్రొక్కెదను|| ౧౧౭||

కం|| శివసేవాఫలమిదుమని | శివసేవకులెల్ల నెవని సేవింతురొయా|
శివభక్తాగ్రణిసవినయుఁ | డవుగృహపతిభంగి వెనుకనడఁకువనడచెన్|| ౧౧౮||

కం|| ప్రాసాదానుగమాశ్రుతి | రాశియనుచుఁదెలుపననధరాదేవులుచం|
డీశానుగులై చాఁగిరి | శ్రీశుఁడువిష్ణుండొ శివుఁడొ యెఱుఁగనగునన్|| ౧౧౯||

ఆ-వె|| ఆదినగజకొడుకునటుపిమ్మటన్మహా | సేనుఁడావెనుకనుశివుఁడునుదరు|
వాతవామశివయుఁబదపడియమిచండుఁ | డెంచనుండుఁడరయుఁడంచునాడె||౧౨౦||

ఆ-వె|| గణములనుసరించెగణపతినెట్లట్లె | దేవసేనపతినిదేవసేన|
లూపఁగాదెకరులుయోధపతులవెంట | నంటుచుంటయనుచునాడెనాడె|| ౧౨౧||

ఆ-వె|| అరుగుచుందురెందునాయాయిదేవతా | భక్తులందునందభవునిబామ|
దేవుఁజేసినమరుదేవేరులనిమమ్ము | రసికులరనెదరనిపొసఁగఁబాడె|| ౧౨౨||

తే-గీ|| రంభయూర్వశిహేమయురంజిలంగఁ | బాడఁగానాడఁగావారిప్రౌఢిఁగాంచి|
బిల్వపెండ్లికిఁజనునిట్టివేళకుఁదగు | ననేఁదిలోత్తమభృంగియాననుచునాడె|| ౧౨౩||

ఆ-వె|| వృషభవాహనుండువిహగవాహనుఁడును | గూడిరచటనురలుఁగోట్లకొలఁది|
నొకటివెండికొండయొక్కటిబంగారు | కొండగూడెఁబ్రజలుగూడరెయట|| ౧౨౪||

శా|| గంగామౌళిన్నృసింహుపాదములకుంగావించెజోహారుసా|
ష్టాంగంబై చెలువొందయోగవిభుఁడై యష్టాంగుఁడైయుంటనా|
గంగాదేవినిఁగన్యబిల్వఁదనకుంగాంక్షింపుమంచంచునాఁ|
గంగల్యాణమునీకుఁగావుతమనెంగల్యాణచేలుండనన్|| ౧౨౫||

ఉ|| మాతృకలందఱందముగమాన్యనుగన్యనుబిల్వఁజెల్వసం|
భూతినిసర్వభూషణవిభూషితఁజేసివెసంబొసంగసం|
ప్రీతినిఁగొల్పినిల్పిరటశ్రీసహితుండయిశ్రీనృసింహుఁడ|
ఖ్యాతునిజాత్మనానొసఁగెగొబ్బుననుబ్బునఁజంద్రమౌళికిన్|| ౧౨౬||

కం|| కట్టెన్మంగళసూత్రముఁ | బట్టొనరన్మాడుముళ్లపడబిల్వకునీ|
క్కిట్టులగుతెతగుననిశివుఁ | డట్టెసకలవాద్యఘోషమడరెనొకటిగాన్| ౧౨౭||

మ|| తలఁబ్రాల్వోసెనుబిల్వశంకరుపయిందారాస్తకోటీరనీ|
కలరుంగాయనునట్లుబిల్వపయినీకొవృష్టిగాయిష్టమం|
చెలమిన్భావమునొందెనోయనభవుండిట్లొటయేమబ్బరం|
బలరుల్సేసలువానగాఁగురిసిరయ్యాదిత్యులున్వారిపైన్|| ౧౨౮||

కం॥ బిల్వనటు పెండ్లియాడుట । బిల్వేశుండీశుఁడయ్యె బిల్వయె శ్రీనా।
నల్వవుటం బిల్వేశుఁడు । చెల్వుగ శ్రీశుండనంగ క్షితిఁ బేర్వడసెన్॥ ౧౨౯॥

ఉత్సాహము॥ గడియలో నెయిష్టసిద్ధి - గలుగుటనిటనతులకీ।
పుడమిదాలుపెండుఁబొగడుఁ - బొందెదుఘటికాద్రినా।
విడకయుందెయుండుభక్త - వితతిఁబ్రోవశ్రీహరీ।
యడుగకున్ననిచ్చువాఁడ - వడుగవరములీయవే॥ ౧౩౦॥

మంజుభాషిణి॥ అని గౌరిపల్కఁ-హరి-యట్లయౌనని । న్వనిలక్ష్మియోగిరిజ-నీవరంబుమే।
లనెఁబుట్టినింటసతి-కాశయుండదే । యనెబిల్వశంకరుఁడు-సౌననెంజనన్॥

కం॥ తనువుఘటికాచలంబం । దొనరెడుజీవుండుదేవుఁడొక్కఁడగుటయే।
ఘనయోగంబదెయోంకృతి । గనఁబఱచునృసింహుఁడిందుఘనయోగిగనై॥

కం॥ ఘనబిల్వేశ్వరకల్యా । ణనుతాఖ్యముమంగళవదనంబనుచునెగిం।
గనిభాగత్రయపద్యము । లనుఁదన్మధ్యారవమిదియనిబుధుఁడుదగన్॥ ౧౩౩॥

మంగళమణి వృత్తము॥ భృంగకచకుబిల్వకునుమ - హేశ్వరసతికిన్।
భృంగసరుచికంఠనికల - బిల్వకపతికిన్।
మంగళమనిమంగళమని - మంగళమనరే।
మంగళమగునెల్లరకును - మాన్యతఁగనరే॥ ౧౩౪॥

మహామంగళమణి వృత్తము॥ అవుఁగల్యాణంబోమని - యంతనమోయనఁగన్।
శివమంత్రంబాపిమ్మటఁ - జెల్లుశివాయయనన్
జవిఁగొల్పున్నాభగాస్తిర - సజ్ఞతనల్లైకనన్।
దవుఁగల్యాణాభిఖ్యము - పంబిడుపర్వమిదా॥ ౧౩౫॥

ఇది, కల్యాణరసజ్ఞపర్వము.

## మహిమ నిధిజ్ఞ పర్వము.

కం॥ అలరత్నశర్మగౌతము । నెలమింగనిబిల్వవనిమహిమమెట్టిదటం।
చొలసీయడుగనతఁడిట్లనెఁ । గలదొకయితిహాసమద్ధిఘనమెటులన్నన్॥ ౧॥

## స్కాందాగస్త్య సంవాదము.

సీ॥ అజకలశంబుననవతరించెనెవండుబ్రహ్మశిరోంచితప్రాభవుఁడవు।
వాతాపినిమెసంగెవార్ధిఁద్రావెనెవండుదైత్యారిరామచంద్రస్తుతుఁడవుఁ।
గోరివైదర్భినిఁగూడితానెవ్వండుభూభృత్సుతేశ్వరభూషితుఁడగు।
స్వాజ్ఞాదమితమహాహార్యుఁడైయెవ్వండువజ్రిముఖ్యాదిత్యవందితుఁడగు।
నెవఁడుహుంకృతిచేనహంకృతియుతుహరి । పదునిహరిపదుఁజేనెదుష్పథునినహుషు।
వాఁడగస్త్యుండువచ్చెవైవస్వతునిన । డంపనాఁగస్వశక్తితోఁడంగడంగి॥ ౨॥

శా॥ కాంచెందన్మునిసింహుఁడెట్టయెదుటంగల్యాణశైలోన్నతి।
న్గాంచన్నైరకస్పర్థవర్ధిలినవిన్ధ్యంబిద్దివేఱొండొకో।
యంచాలెంచఁగఁగంజశైలమునుభూజాకారకింజల్కముం।
బ్రాంచత్తీర్థమరందమున్విబుధభృంగాఢ్యంబురాయంచనాన్॥ ౩॥

ఉ॥ కాంచితదద్రినెత్తమునఁగ్రాలెడుమేలగుచిత్ప్రకాశనా।
మాంచితతీర్థరాజమునసబ్జసరోవరమందుఁగ్రుంకిశ్రీ।
మించఁగదానిచెంగటనెమింటినిగెంపెడువహ్నిశృంగముం।
దెంచనశక్యమైవెలయునీడితలింగములన్భజించుచున్॥ ౪॥

చ॥ కనెఁదనభంగిదక్షిణముఖంబుగమున్నగవచ్చిగంగర।
మ్మనితనుఁబిల్చునాఁదనరునట్టిత్వమేహానదీమతల్లినీ।
వనుమతిక్షీరవాహినినిబన్నుగఁదద్యుగయోగమొప్పటం।
జనునిదివారణాసిగనెసంగుఁబ్రయాగమటంచుశ్రీవనిన్॥ ౫॥

చ॥ గొనకొని కాంచిబిల్వవనిగొబ్బననుబ్బునఁజేరియేకవ।
ల్లినిఁగొలిచెంద్వమేహానదిలీలమునింగెనుగౌరితీర్థముం।
దునుభజియించెయోగనిరతున్హరిఁదుష్టిగణేశుబిల్వనా।
థునిఁదనుమధ్యఁగానకటధూర్జటినందనుస్కందుఁబొందుగన్॥ ౬॥

మ॥ చనికాంచెంఘటసంభవుండెదుటశశ్వద్బిల్వకాటవ్యటు।
త్తనుమధ్యారథబిల్వనాథవిలసద్దర్పోగ్రపంచాస్యభీ।
తనమన్నిశ్చలదిగ్గజావళియనన్దైవారుచున్నట్టియొ।
క్కనగాళిన్ఘనషణ్ముఖాదృతముశ్రీక్ష్మాజంబువల్ల్యాఖ్యమున్॥

ఉ॥ కాంచియతండుహర్షమునగాంచుచుస్వాంగనతోమునింగిభా।
వించికుమారతీర్థములవిశ్రుతభక్తినిఁగ్రిందమీఁదఁద।
త్ప్రాంచితతీర్థయుగ్మమునసారసియుత్పలముల్మహోత్పలా।
ల్గాంచుగుహావిలీనుగుహుఁగోరికలీరికలెత్తనత్తఱిన్॥ ౮॥

మాలిని॥ కనుఁగొనివుపుదండ - ల్గానకాగానుంచిమ్రొక్కెన్।
మునికలశజుఁడాస్థ - న్మోదుప్పేలొప్పమాళి।
ద్దనరఁగవినుతించె - న్బద్మినీపార్శ్వశోభున్।
ఘనుద్విదళజపాభున్ - జ్ఞానసారుంగుమారున్॥ ౯॥

## బిల్వారణ్య క్షేత్ర ప్రశంస.

తే-గీ॥ గుహుఁడునీకేమికావలెఁగోరుమనుడుఁ। గుంభసంభవుఁడడిగెనుగొమరుసామి।
మహితబిల్వాటవీక్షేత్రమహిమమనుచు। దేవసేనావిభుండిట్లుతెలియఁబలికె॥ ౧౦॥

శా॥ ఓనేయెన్నఁగనాకుశక్యమదిబిల్వారణ్యమాహాత్మ్యమీ।
శానుండొక్కతఱిన్మదంబకుఁగడున్సంతుష్టుఁడైచెప్పఁగా।

నేనెక్కింతయు వింటినర్థుని కెవిన్కిం జేయనానర్థికిన్।
దానంబుం బొనరించినట్లుటులఁగాదా భోగికిం బాలెయా॥ ౧౧॥

మ॥ అలచింతామణియొక్కమానికమె మేర్వద్రీంద్రముంగొండయే।
యలమందారమునొక్కభ్రమానెకననాహావైనతేయుండునుం।
బులుఁగేయావాకొకామధేనువును రాముండొక్కఁడేఁ శివుం।
ఙలబిల్వేశుఁడునొక్కవేల్పెయిదిబిల్వారణ్యమున్ క్షేత్రమే॥ ౧౨॥

శా॥ క్షేత్రంబుల్పరసోఽహమంచుమఱియోంకృత్యాఖ్యహ్రీంకారమున్।
సూత్రించున్విబుధాళికిద్దియనసంసూచించుఁబ్రాసాదమున్।
ధాత్రిం దారకముంద్రిపత్రములక్షేత్రస్వామిశ్రీవృక్షమా।
క్షేత్రాణాంపతయేనమోయనుటిటన్సిద్ధించుశ్రీక్షేత్రమా॥ ౧౩॥

సీ॥ పురుహూతదిశఁగంజధరమకారంబుగంబరఁగుబ్రహ్మపదమైప్రథితముగను।
బుణ్యజనాశనొప్పనుమగౌరీసరస్సనుకారముగనారాయణుఁడుగఁ।
బావనదిక్కునభాసిల్లుశరభవగుహమకారముశివగోప్యముగద।
యేతత్త్రిధామసమేతమాబిల్వవనంబోంకృతియవుబ్రహ్మంబుగాదె।
యలరుఁగదబిల్వనాథాలయంబువల్లి। మలయుఁగంజాద్రితన్ముఖ్యమాతృకలను।
బిల్వకముబిల్వమననిద్ధివిశ్వనుతము। క్షేత్రరత్నంబుసర్వార్థసిద్ధిదంబు॥ ౧౪॥

సీ॥ నదిమధ్యమగనీవనమయంచుఁదెలిపెడుఁజాఁగిమొక్కుటఁజూపుచందమొందఁ।
బ్రవహించుటనుశరభవగుహాగిరిశివమూలబిల్వేశ్వరముఖ్యమవుశి।
వబలభేదంబాటవైష్ణవస్థలమవ్యక్తమాబిల్వేశపదమువాగఁ।
గంజాద్రియయవునీక్రమమొప్పచుంటచేనానోంనమశ్శివాయయనుటయిట।
నింతెకాకశివోఽహమంచెదస్ఫురించు। బిల్వవృక్షంబులనుగన్నబిల్వపతికి।
బ్రహ్మవిష్ణ్వాదిదివిజులుభక్తులైరి। యేరికేశ్రీవనముగాఁడభీష్టమరయ॥ ౧౫॥

శా॥ ఈక్షోణిన్మనుబిల్వమైగిరిజశ్రీయేయాటనీశుండుశ్రీ।
వృక్షంబైనిరికేలలింగముగనైశ్రీశుండుగాఁగానమో।
వృక్షేభ్యోయనెనాదివేదమిటనేవీక్షింపనాలక్ష్యమా।
వృక్షాణాంపతయేనమోయనుటయున్బిల్వేశలక్ష్యంబెయా॥ ౧౬॥

## కంజాద్రి ప్రశంస.

సీ॥ విష్ణుపదాభిఖ్యవెలసినస్వర్థనాఁగడలికడల్లనాకసముఁదాఁకఁ।
దనశబ్దగుణకతాఘునతనుదెలుపునాఁజదలుసముద్రఘోషమునుగ్రమింగ।
సర్వభూతంబులుసలిలమయములెనాభువనముల్గ్రసియింపభువనములను।
మిట్టపల్లంబనిమిన్నుమన్ననియెన్నరాకగాఢాంధకారమ్ముగ్రమ్మ।
నట్టిప్రళయావసరముననద్భుతముగ। నుద్భవించెనుజ్యోతిర్మయోజ్జ్వలంబు।
కోటిసూర్యప్రకాశమొక్కొటియెలింగ। మమ్మహాబ్ధినెసంగెఁగంజాద్రియనఁగ॥

సీ॥ తద్గుణేశాంగజాతతచేతబ్రహ్మ కంజప్రభవుండనసన్నుతిఁగనెఁ।
దద్వామపార్శ్వభూతతచేతవిష్ణువుకంజాక్షుఁడనఁగఁబ్రఖ్యాతిఁగాంచె।
మధ్యమత్వముచేతమహితమౌలింగంబుతనుమధ్యమేశాఖ్యఁదానుబొందె।
బ్రహ్మవిష్ణువులనుపత్రములైలెంకులవెలయబిల్వేశ్వరాభిఖ్యఁబడసెఁ।
గంజలింగమదేయగుఁగంజధరము । కంజలోచనకంజజుల్గారెసాక్షు।
లెడఁమకుడిప్రక్కలంగ్రాలునృహరికంజ।భవులుఘటికాద్రికాంచికాభవను లెవుడు॥

సీ॥ కంజంబనశిరంబుకంజుండనంబ్రహ్మగావునసత్యమౌఁగంజనగము।
కంజముమూర్ధన్యఘననాదమౌదానిఁగాన్పించునదిగానఁగంజనగము।
కంజనాసరసిజకమలశ్రీదానినిగలిగించునదియౌటఁగంజనగము।
కంజమ్మమృతజమ్ముగదబిల్వమాశ్రీలుగలుగుటశ్రీగిరిగంజనగము।
దేనివలననుసుఖమబ్బుదానిఁగంజ । మనఁజనునుబూనిశంభుపదానువృత్తి।
సందియంబేలయదెకాదెశంభుమూర్తి । గానభూధరవరమగుఁగంజనగము॥ ౧౯॥

సీ॥ కంజుండయినబ్రహ్మగనుటశారదనటఁగంజాద్రియనఁగనుఖ్యాతిఁగాంచుఁ।
గంజాక్షుఁడగుహరిగనుటనందిందిరఁగంజాచలమనంగఘనతఁగాంచుఁ।
గంజధరుఁడుశూలిగనుటశ్రీతనుమధ్యఁగంజశైలమనంగఁగనెడునాఖ్యఁ।
గంజంబుబ్రహ్మంబుగనునహంకృతియౌటఁగంజభూభృత్తనఁగనునభిఖ్య।
నగ్నిసోముఁడుగంజాహ్వయమునుగనుట । విశ్వముతదాత్మకంబయి వెలయుటనది।
కంజమగుటవిశ్వాఖ్యలఁగాంచునౌర । కంజపనకంధరంబదికంజధరము॥ ౨౦॥

సీ॥ కలశసింధువునందుఁగలిగినయమృతంబుహరిమోహినిగనయియదరియిడఁగఁ।
ద్రావితవ్వలమునదైత్యులఁబోరిగొనిజయలక్ష్మిఁబొందిస్వశక్తివిజయ।
మందితిమనుచునుబృందారకులునిక్కబ్రహ్మంబుయక్షరూపంబునొంది।
తృణమాత్రముననగ్నిఁబ్రుషదశ్వునోడించియింద్రునికగపడకేగెనంత।
బుద్ధియైయుమతనుమధ్యబోధసేయ । నాపురందరుఁడాదిగనమరులెల్ల।
నల్లకంజాద్రిలింగాళినాశ్రయించి । రౌరకేనోపనిషదర్థమలవడునట॥ ౨౧॥

సీ॥ పర్వతనారదుల్పరమేష్ఠికొడుకు సనత్కుమారుండందుముత్కరముగఁ।
దపముసల్పెవరందుఁదాపసుల్గుహలందు వేనవేలుందురువిదితుఁడైన।
దుర్వాసుఁడందునద్భుతముగఁదనయోగశక్తిచేనొకప్రోలుసంఘటించెఁ।
గూటముల్బొరుజులై పాటిల్లెడునుజిత్రప్రాకారకాసారంబుగ్రాలునడుమ।
దుర్గమదికంజదైత్యుఁడనర్గళముగఁ । గొనియెనందిశివాజ్ఞనద్దనుజుఁదునిమె।
ముక్తికల్యాణమటనయ్యెముదమొసంగు । స్వనతులకభీష్టములఁగంజశైలమౌళి॥ ౨౨॥

సీ॥ స్వాభిఖ్యసంకలనాప్తినష్టమవిషమాంకయుక్తింగ్రమంబమరఁదెలుపు।
యాజుషంబైనమహావాక్యమునునహంబ్రహ్మాస్మియనికంజపర్వతంబు।
మరితస్యయజురేవశిరయనునర్థంబుఁబ్రకటింపనేశిరోఽర్థకముఁగంజ।
పదమూనెననిబుధుల్భావింపబిల్వకంబునకుశిరస్థానముగనెసంగి।

పేరఁబడు నెనిమిది మహావిద్యల నత । తతికిఁ దోఁపఁగఁ జేయుచుఁ దనరుచుండు,
నారకంజాద్రిగురునిఁగా నాత్మఁ దలఁప । వలదె తత్త్వైకజిజ్ఞాసువుల కెపుడును॥ ౨౩॥

సీ॥ జపముఁ గంజగిరి నేచలుపందగున భేదసిద్ధిఁ జొప్పడుట ప్రసిద్ధమగుటఁ,
దపముఁ గంజశిఖరిఁ దనరింపఁదగుఁ బతితద్రూపమున భక్తతతిఁ దనుపుట,
ధ్యానంబుఁ గంజభూధ్రమునందె కావింపఁదగు యుక్తి చే ముఖ్యధర్మమవుట,
శివపూజఁ గంజాద్రిఁ జేయందగు శివోఽహమను తారకము యోగమున నొనరుటఁ,
గాంక్షఁ జేసిన జయలక్ష్మిఁ గంజశైల । మాశ్రయింపవలయుఁ గంజమునఁగ జయము,
గానగును బిల్వనాథుండె కంజనాథుఁ । డాత్మఁ బరమహంసోదయమాచరించు॥ ౨౪॥

సీ॥ పశ్చిమాభిముఖమై పరఁగు స్వయంవ్యక్తలింగము సద్యోభవాంగముగద,
కంజాద్రిగాన సంఖ్యావంతులం జేయు నతులను హితముగ నతులమహిమ,
వలఁగొన్న నంభోజభవుఁడు సృష్టీశుఁడారోహింప ద్విజధవారోహణుండు,
శ్రీనాథుఁడాపయిఁ జిత్ప్రకాశంబున స్నానంబు నేసి యాసవిధమున స్వ,
యంభులింగౌఘమునకు మహార్హపూజ । నేసినన్ సర్వమంగళోల్లాసుఁడైన,
బిల్వనాథుండె యానరుండిల్వలారి । యట్టి కంజాద్రి కెనయె యేయద్రియైన॥ ౨౫॥

## బిల్వవన ప్రశంస.

సీ॥ కంజంబగుటఁ జేసి కాంచె లింగము కంజమని యమృతోద్భవంబనియుఁ బేర్మి,
నకకంజమే యద్రియగుటఁ గంజాద్రియ నమృతోద్భవాద్రి లింగాద్రియనగు,
వెలసియుండుటనందు బిల్వవృక్షములు గంజంబులు నమృతోద్భవంబులయ్యె,
బిల్వమయంబయి పెంపెనయుటఁ గంజగిరి బిల్వగిరియనఁ బరఁగెనవ్వ,
నంబు బిల్వవనంబయ్యె నదియు బిల్వ । పత్రికాఖ్య నెసంగెను పార్వతియుమ,
విశ్వనాథుఁడు శివుఁడయ్యె బిల్వనాథుఁ । డల్లక్షేత్రము బిల్వకంబనఁగ నెగడె॥ ౨౬॥

సీ॥ క్రమతస్థూలంబు సూక్ష్మంబు కారణమనఁ దనువుము త్తెఱఁగులఁ దనరుచుండుఁ,
గాన మేనే బిల్వమౌను సోమాదిత్యవహ్నిత్రయంబు బిల్వంబె యవును,
జీవాత్మ పరమాత్మ సిద్ధాంతరాత్మయనాత్మ బిల్వంబుగా నెసంగు,
వాచ్యవాచకయోగభావంబు బిల్వంబు కరణత్రయము బిల్వమరయఁ బ్రణవ,
మగును బిల్వంబు మాత్రాత్రయైక్యకలన । సర్వమును బిల్వమౌఁగాన సర్వభావ,
ములను బిల్వంబులనుగొని పూజనేయ । వలయు బిల్వేశ్వరుండగు బ్రహ్మమునకు॥ ౨౭॥

సీ॥ శివులె యాదిగద యీభువనంబులకు నెల్లఁ దల్లిదండ్రులు వారె తనరనిచట,
మారేడుచెట్లుగా మహి స్వయంవ్యక్తులై ప్రభవించిరదియె కారణముగాఁగ,
బిల్వవృక్షంబాది వెలసెనిందగుటనే బిల్వకక్షేత్రంబు విశ్రుతమిది,
పదపడి యెల్లెడఁ బొదలె లక్ష్మీవృక్షములు దద్దళముల నాదలధరింతు,
రెల్ల వేల్పులుగావున నెలమిఁ దెలియ । బిల్వనాథాంశములె యెల్లవేల్పులుగద,
బిల్వకాటవి యంశముల్ విశ్వమునను । గావె క్షేత్రంబులెల్లను ఘనమిదెయగు॥ ౨౮॥

సీ॥ సత్యలోకముసరస్వతిమందిరమజాలయంబదికంజాలయంబిదియగు।
వైకుంఠమిందిరాలోకమదౌవిష్ణుపదమిది శ్రీఫలావాసమగును।
కైలాసమద్రిజాగారమునందికేశారక్షితమదితదవితమిదవు।
వాసవాదిదిగీశవాసముల్ శ్రీకముల్ శ్రీపదమిదెయవు శ్రీపతిహిత।
మఖిలదేవతలతిభక్తినమితతపముఁ । జేసిరిటఁజేయుచున్నారుచేయఁగలరు।
బిల్వవృక్షాకృతులఁగానబిల్వవనము । బిల్వకంబిదియుత్తమమిల్వలారి॥ ౨౯॥

సీ॥ బిల్వంబుద్రిదళమైవెలయుటఁదెలుపునైతినిద్రిసంధ్యంబునుద్రేతద్రయియు।
ననిత్రిపాద్గాయత్రివ్యాహృతిత్రయముమాత్రాత్రయోంకృతినయితనరుదాన।
ననిమహావాక్యత్రయంబుద్రిపదయుక్తమగుటఁదద్గురుతచేనర్హమనని।
యిన్నాఱుప్రజ్ఞానమన్ననాఁదత్సంఖ్యద్రిపదయోగంబునదివ్యమంత్ర।
వరముదోంనమశ్శివాయయనంబ్రహ్మ । మగునటంచుబిల్వకాటవియిట।
నాద్యమైనఋఙ్మహావాక్యమునకర్థ । మెనరదెలుపుఁద్రిదళవినుతమగుచు॥ ౩౦॥

సీ॥ వఱలుబిల్వేశ్వరప్రాకారవాయవ్యదిశనుమహాబలధృతిదలిర్ప।
బిల్వాద్రియనునెకపెనుగుట్టకనుపట్టుబిల్వాటవీమూలవిలసితమదె।
బిల్వవృక్షములందువెలసెనిన్నాఱాదినూటనయేఁబదియాఱునూటనల్వ।
దైదునూటిర్వదియాఱెనబదియుకండంతటనలువదియైదుపదియుఁ।
తొమ్మిదామైదుమూఁడయితోఁచుఁదుదకు । నెకటియైయంతఁబెరిగెడునెగినయిడుగ।
నేఁబదిగనూటనల్వదైదాఁబదపడి । యెనబదొక్కటినల్వదియేకశివముగ॥ ౩౧॥

సీ॥ వ్యంజనస్వరయోగవర్ణత్రయాత్మకమువుటచేసర్వమంత్రవితతిజపి।
యించినఫలముసిద్ధించునుబిందుసమాసమాంకత్రయప్రాంచితమయి।
యెసఁగుటనుచితసంఖ్యేడితసర్వకార్యాచరణనుగల్గునఖిలసత్ఫ।
లంబులజ్బెడునగ్గలంబుగబిల్వాద్రిబిల్వవనంబునబిల్వమోల।
బిల్వనాథునిపజ్జనుబేర్మిఁజేయ । సత్క్రియలుమమ్మడిగనగుశతగుణముగ।
సిద్ధులెల్లనుసిద్ధించుసిద్ధమిదియ । శ్రీవనంబవునన్యంబుశ్రీవనంబె॥ ౩౨॥

## సీవానదీ ప్రశంస.

సీ॥ చంద్రగిరింబుట్టిజానెందుటనెకంజభూభృత్సమాదృతిఁబొందదయ్యె।
శ్రీవనంబునఁబాఱుశ్రీపర్ణనాఁగానశంకరనారాయణాంకమొందె।
శ్రీఫలోదయయనాటశ్రీవాహినియయని పేరందెమఱితిరువెళ్లమనఁగ।
బిల్వనాథేశ్వరప్రియగావుననెబిల్వపత్రికాఖ్యనుగాంచెఁబార్వతియన।
ధాత్రిశ్రీవనిమంగళసూత్రమనఁగఁ । గ్రాలుఁబాలేటిఁబ్రాబోటిఁగానెనర్చుఁ।
దనదుయోగంబునంజేసితత్వమైక్య । మెఱుకపఱుచునయారెయాయేఱగస్త్య॥ ౩౩॥

సీ॥ ఆదిఁద్వమేహినానాబిల్వపతిచేతనాహూతయనితదర్థాప్తియొదవ।
నఱవలునీవాయటంచుఁబేర్కొనెదరీనీవాఖ్యమాతృభాషావిదితము।
పరఁగువాగ్వాదినీపదజాదిమాంతిమవ్యత్యస్తవర్ణాహ్వయయవునీవ।
మంత్రస్థతత్సమమాతృకలట్లుగానివయవువాగ్వాదినీస్వరూప।

కావుననవాధ్వమునువర్ణకలనఁదెలుపు । వాక్షరముసంఖ్యనీవశివాహ్వయంబు।
శివపదంబెశివోఽహమంచవుఁద్వమేహి । యనశివోహమనియెకాదెయరయఁగఁదగు॥

సీ॥ తటినిత్వమేహిపదంబునఁదెల్పెఁదత్త్వమసియనంగనుదనరుసూక్తి।
వెరవారఁగాసామవేదమహావాక్యమునుదత్తుగాయత్రియనఁగఁదాను।
పాశవిమోచనప్రాప్తికైయాసరస్వతిగాదెయాసరస్వతిగనయ్యెఁ।
పశుపాశమోచనిపరఁగెదునియ్యదిపశుపతులనుజేయుఁబశువులనిల।
బ్రదికియుండంగనేస్నానవరఫలమునఁ । చనదుపేళ్లశివోఽహమున్తారకంబు।
బోధనేయునీనీవనుబాగడఁదరమె । శ్రీశులనుజేయుఁగోరిననెల్లవారి॥ ౩౫॥

సీ॥ గంగభంగినిశ్రితులింగంబుఁజేయదుగానిశివోఽహమజ్ఞానిఁజేయు।
విష్ణుపదివగిదిస్వీయుఁజక్రినిఁజేయదైనశ్రీపతిఁగాఁగనలరఁజేయు।
బ్రహ్మకమండలుభవగాదుగానితావాణియైనిజభక్తుబ్రహ్మఁజేయు।
మాయానుయోగంబుమరుగదుగానిజీవన్ముక్తుఁగాఁగనుస్వనతుఁజేయు।
నెగడఁగద్వమేహిశ్రీవాహినియిదిసేవ । యగునుశంకరనారాయణైక్యయోగ
దేశికనవాఖ్యదీనికిదీటెమాట । నెక్కపాలవునాగంగనిక్కముగను॥ ౩౬॥

## ఏకవల్లీప్రశంస.

సీ॥ ఉమమున్నుకంజాద్రిఁదెమలించెఁదనతమఃకోశంబపయ్యెనుగౌశికియనఁ।
గాళికాకృతినుండఁగాళికయనఁబడెఁగంజుఁడాబ్రహ్మచేగౌరవముగ।
నీబిల్వకాటవికేలికస్థానిగానిలుపంబడియెనదినిఖిలవినుత।
యేకవల్లియనంగనెసఁగెదుహరినేత్రనిర్గతనిమిషాంబనృహరికీక।
సోద్భవశివాంబవాణ్యంబయుగ్రమూర్తి । శివులబిల్వంబులనుజేసెఁజేసెవాణి।
నీవఁగాబిల్వవనినుండునిరుపమబల । కొలువవలయునుపచ్ఛక్తిఁదొలుదొలుతను॥ ౩౭॥

సీ॥ క్షయకాలగాంధాంధకారస్వరూపిణియెన్నంగనీవదియేకవల్లి।
నిఖిలలోచనముద్రనిద్రాస్వరూపిణివీక్షింపనీదద్దియేకవల్లి।
దర్పయుగ్దుర్జనదౌర్భాగ్యదాయినియెలమిఁజేరఁగనీయదేకవల్లి।
చాంచల్యవత్సంపదంచితమోహినిహితమతినిల్పనీదేకవల్లి।
యెవరినింబిల్వవననిధినిద్ధమహిమఁ । గావలిగనుండునదిబిల్వకంబనఁబడు।
బిల్వకాననమునఁగాళిబిల్వకాన । నాకృతిగబిల్వకయనంగనేకవల్లి॥ ౩౮॥

సీ॥ ఏకవల్లియనంగనేకబిల్వగబిల్వికగనుబిల్వాంబికగాఁగననగు।
నేకావళియనంగనేవవోఁగాళినానెఱుఁగందగుంబిల్వకేశ్వరియని।
యనఁగనాకాళికయాగికాఖ్యాంచితమైబిల్వకంబుననలరుచుండు।
నమయాటనమయందునగుటఁగృష్ణయుఁగృష్ణపక్షమునందదాఖ్యాక్షరాంక।
తిథులఁబూజింపఁబడఁదగుఁదివుటనెప్ప।డేనిక్షేత్రాధిదేవతదానగుటను।
దొల్దొలుతఁబూజఁగొనియెడుఁదొడఁగిమున్న।తన్నుఁబూజింపకున్నఁదత్ఫలముఁగొనెడు॥

సీ॥ తానలక్ష్మియెయాఁటఁదనుఁగొల్వకున్నసుదాలఁగనీయదలక్ష్మి వెలయఁజేయుఁ।
దనుఁగొల్వఁగానలక్ష్మినిఁబాపుశ్రీతనుమధ్యసుశ్రీనాథుమహితభక్తిఁ।
గొలువంగఁబనుచుసత్ఫలములనెన్నేనిఁబడయంగఁజేసెడుఁబరమకరుణఁ।
దనత్రిమూర్త్యంబికాత్వముఁదనుమధ్యమాద్యంతాక్షరవిపర్యయమునఁదెలుపు।
నేకవల్లాఖ్యఁబంచదశీకలనము । దోఁపసొనరించునమయాటఁజూపుఁగుహువుఁ।
గంజముగనుసినీవాలిగానునీవఁ । గాననకాళియవుబిల్వకాననాద్య॥ ౪౦॥

సీ॥ తనుమనఁబ్రణవమౌటనొతనుఁగొల్చినవారికివాణియైవైదుషినిడు।
నగుటనధీలక్ష్మి దగఁగస్వాధీనులశ్రీసమగ్రులఁజేయుశ్రీయయిమఱి।
యమనానలక్ష్మి దానగుటజ్యేష్ఠనుగూర్చుఁగొల్వనివారికిగోరమారఁ।
దనుమధ్యమయటంచుమునువెనుకలఁగనమాతగానగుసాంఖ్యమాతగాఁగఁ।
దనపదముఁబట్టిమార్గదాయినిగనగును । బిల్వకాభిఖ్యఁబూనుటఁబేర్మి నేర్మి।
బిల్వకంబురహస్యంబు వెలయఁదెలుపు । హితతతికిఁగల్పవల్లియాయేకవల్లి॥ ౪౧॥

సీ॥ కోలపురస్థయైకొఱలుమహాలక్ష్మికంజభూభృత్పీఠగరిమనిల్వఁ।
గాశ్మీరమునఁజాలఁగ్రాలుమహాసరస్వతినీవయైతనుసుతగఁగొల్వ।
బ్రహ్మవిష్ణీశులుపరఁగబిల్వంబయితనుఁబూజసేయుటకొనరఁజెల్వ।
ముగఁదానుబిల్వాంబకగఁదనరుటనుజ్జయినిఁబాసిదక్షిణాననగబిల్వ।
కాననమ్ము ననమ్మహాకాళియాది । శక్తియేయేకవల్లినాసన్నుతిఁగను।
చున్నదెన్నఁబరాశక్తియుల్లమలరఁ । గొలువలేములఱుంగల్ములలవడుఁగడు॥ ౪౨॥

సీ॥ పరుఁడవుబిల్వేశుపార్శ్వంబుననుగాశితనుమధ్యమయనంగనైనయునేది।
పరునిబిల్వేశుఁదద్ధ్వనియోగతనుమధ్యపురుషునిఁజూపెడుపాలఁతియేది।
పరుశక్తియోగాప్తిఁబరువడిఁగాన్పించిసాంఖ్యాంబయవుపరాశక్తియేది।
కుహువుఁబురంబుగామహిసినీవాలిని నదిసొనర్చినజగన్మాతయేది।
యదిమహాశక్తియేకవల్లిదగునచట । బిల్వకేశ్వరినయ్యంబఁగొల్వవలయుఁ।
గొల్చిననెసిద్ధులలవడుఁగొల్వకున్న । నిలుగులగునిరుసెడలినఁజెడదెబండి॥ ౪౩॥

## గౌరీతీర్థ ప్రశంస.

సీ॥ గౌరిమిమాయయన్ఘనమైనయామ్నాయసూక్తికిలక్ష్యంబుచొప్పడంగ।
గౌరితీర్థంబొండుగావించెనదియెగౌరితీర్థమనఁబొల్చుశ్రీవనమున।
నందెస్నానముసేసియాఫలంబునగౌరిశివయోగసిద్ధినిఁజెందెనందు।
గౌరితీర్థాకృతిగానుంటనద్దిగౌరితీర్థమనఁగనుఖ్యాతినిఁగను।
దానిగట్టునబిల్వంబయైనెగడెను । గౌరియాక్రిందశివుఁడులింగముగఁగలిగి।
బిల్వనాథుఁడనంబడువిశ్రుతముగ । గౌరితీర్థంబునకునెనగలదెయెందు॥ ౪౪॥

సీ॥ గౌరిసలిలములఁగలిగించెననియెనారములందునబ్జాక్షుఁడమరెఁగాన।
నారాయణుఁడనంగనామంబువహియించెనన్వర్థముగనాతఁడల్లగౌరి।
నారాయణియనంగనల్వొందెగౌరియేతీర్థాకృతియటంచుఁదెలిసెఁగాదె।
యతీర్థముననాతఁడవగాహనముసేసితత్ఫలంబునయోగతత్పరుఁడయి।

యోగనారాయణుండన నొప్పు యోగ । సిద్ధిఁ బొందుట శివయోగసిద్ధుఁ డగుట।
నయ్యెను గ శివనారాయణాఖ్యుఁ డలరఁ ను । గౌరితీర్థంబ నసము సుపుఁ గాదె మహిమ॥౪౫॥

సీ॥ కంజాద్రిఁ గల చిత్రకాశకాసారంబు శ్రీతీర్థమనఁ గంప్రియముఁ గద।
నీవాపగ యది వాణీతీర్థమనఁ బరికింపఁగాను వాగ్వాదినిగ।
యిద్ది గౌరీతీర్థమెసఁగెడు గౌరినారాయణాఖ్యమే నుతీర్థంబుఁ గద।
గౌరియన వాణియనఁ నీయన లక్ష్మియు గౌరియుఁ దానొటఘనతయు గద।
యగుట శక్తిత్రయాత్మకమగును బిల్వ । తీర్థమియ్యది తీర్థత్రయార్థకంబు।
గౌరితీర్థంబు గుప్తంబు గను నెసమరి । ముమ్మొగమ్ముఁ బఱచు నమ్మూర్ధగంగ॥ ౪౬॥

## యోగ నారాయణ ప్రశంస.

సీ॥ వైకుంఠమున నుశ్రీవల్లభుఁడల్ల దుర్వాసు చేరనొసంగఁబడిన బిల్వ।
మాలిక బిల్వేశమస్తకన్యస్తంబు గరియించకయె పూర్ణధారవయినిడె।
నలిగి యమ్ముని శాపమొలయింపఁ బ్యాపగఁ బెందిరుఁ డయి గోవిందుఁ డరుగు దెంచి।
బిల్వనాథేశ్వరుఁ బ్రియమందఁ బూజించె లక్ష్మి పడెఁ గరల క్షీరమగు।
బిల్వవృక్షంబు పత్రాళి బిల్వనాథ । కరుణ లక్ష్మి గుఁడయ్యెను గికఁ గన తఁడు।
యోగనారాయణుండన నొప్పె నైక్య । ను పెంగనౌ శివనారాయణుం డనంగ॥ ౪౭॥

సీ॥ ప్రాసాదమంత్రవర్ణముల సంఖ్యలఁ గూడ నిరువదినిష్టుఁడు నరుఁడు నార
మాసంఘమయిన మైవానిమీఁ దెఱవాఁడు నారాయణుం డగు తన్మంత్రగురువు।
ఖండత్రితయమయి క్రాలుట నమ్ముసువాను బిల్వము దానన నల్ల బిల్వ।
నాథునిఁ బూజించిన ల్యావ్పఁ బడి నాల్గులోకంబులకు వారి నైకనైనొగి।
విశ్వనారాయణుండన విశ్వగురుత। యోగనారాయణుండన యోగగురుత।
వెండియు నుశివనారాయణుండనుట శివోఽహమని తెల్పు నారాయణోఽహమనఁగ॥

సీ॥ సత్యం బెఱుఁగఁ గోర సత్యనారాయణు నాశ్రయింపవలయు నార్తు గాఁగ।
యోగం బెఱుఁగఁ గోర యోగనారాయణుఁ బరుఁగని యెన్నంగవలయు మున్న।
శివతత్త్వ మెఱుఁగంగఁ జింతగల్గిన శివనారాయణుఁ భజించి యుండవలయు।
నత్తారకము శివోఽహమ్మని శ్రీతత్త్వ మెఱుఁగఁ గోరిన ఁ బ్రకృతి శుఁ ద్రైన।
శ్రీశనారాయణునిఁ గొల్వ సిద్ధులబ్బు । నగుట శంకరనారాయణాంక నతనిఁ।
గొలుతు రెల్ల సురల్ముసుల్గొలువకఁ దఁడి । రజ్జుఁ బట దానఁ దిరువలము కొన జీముఁజి॥

సీ॥ బిల్వంబు లింగంబు బిల్వేశుఁ డామూర్తి బిల్వహస్త యొకద బిల్వలక్ష్మి।
యాలక్ష్మిపతి విష్ణువవును బిల్వేశుండు బిల్వపురంబె యావిష్ణుపురము।
ఆవిష్ణుగుడి యిప్పుడయ్యెను శివుగుడి పురి శ్రీపతి దిరుద్రభూమిగఁ ద గె।
నాథుఁడు లేనిద నాథయగుట వింతె శివవిష్ణుభేదంబు సిద్ధమైన।
క్షేత్రపాలకుఁడతఁడని శ్రీపతినల । యోగనారాయణుని బిల్వనాఁగఁ దనరు।
శ్రీని నెలకొల్పనింకఁ బురీముఖముగ । శ్రీపురియ నంగవర్ధిల్లు శ్రీవనపురి॥ ౫౦॥

సీ॥ అంధకుఁడనియెడునసురునిఁబాశుపతంబునంబశుపతిదళితుఁజేసి।
తద్రుధిరంబునదానవుల్పెక్కండ్రుదురంధకుల్వాఁడమిననలయసృక్కుఁ।
బానంబొనర్పంగబ్రాహ్మ్యాదిమాతృకాగణమునుసృజియించికడఁగివారు।
కృతకృత్యలై మఱికేరిప్రజాభక్షణోద్వృత్తలైనఁదానూర్వ్వలేక।
తనుస్మరించిననరసింహతనువుఁదాల్చి । యోగనారాయణుఁడుశివయోగమహిమ।
శుష్కరేవతిఁబుట్టించిచొక్కఁజేసె । నల్లనల్లనయదెయేకవల్లియయ్యె॥ ౫౧॥

సీ॥ మఱిశైవశక్తులమఱియణంపఁగబిల్వమొదలైనవైష్ణవముఖ్యశక్తు।
లనుముప్పదేవురఁదనతనువునజనియింపించియొనరించెనిష్టసిద్ధి।
ఘటికలోనటులౌటఘటికాద్రినాఁగనాస్థానంబుత్రైలోక్యమాననీయ।
మైయెసంగెడుయోగనారాయణుండందునృహరితఁగృత్యంబునెలమిఁజేఁత।
యోగనరసింహరూపుఁడైయొప్పనిప్ప । డల్లవైష్ణవశక్తులయందునెల్ల।
నగుటవరబిల్వతనుమధ్యయనఁగనెగడె । నామరూపంబులనుభేదమేమినిజము॥ ౫౨॥

సీ॥ బిల్వయేపిమ్మటబిల్వపత్రికయనబిల్వదళాంబనాఁబేరువడసెఁ।
దత్పురుషుండౌటఁదత్పురుషుండనబిల్వేశుఁడనఁగనువెలసెశివుఁడు।
తద్దర్శనార్థియైతగబిల్వవనమునకేఁటేఁటవచ్చుఁబార్వేఁటనెపము।
చేతనానరసింహుఁడీతండుబిల్వేశుఁడాఘటికాద్రికినరుగునల్లె।
కంజుఁడలవింజమననాఁగఁగంజములవి । కనుమలకెఁగానియిపుడునక్కంజగిరికి।
బిల్వనాథపురంబగ్నివిదిశనీవ । చెంతనరసింగపురమునుజెలఁగుచుండు॥ ౫౩॥

సీ॥ పంచాననత్వంబుపరఁగుగాయిరువురకెంచంగభేదమదెట్టుగలుగు।
నుగ్రాభిధానంబునెుప్పఁగాయిర్వురకెంచంగభేదమదెట్టులగును।
మృత్యుమృత్యుసమాఖ్యమించుఁగాయిద్దఱకెంచంగభేదమదెట్లుగనగుఁ।
ద్ర్యక్షత్వముపినాకహస్తమానిద్దఱికెంచంగభేదమదెటులననగు।
నర్జునరుచియురజనీముఖార్చనీయ । తయునుశ్రీశతయునుబొరిఁదగునిరువురి।
కరయశ్రీబిల్వనాథనృహరిపదులకు । భేదమెటుగల్గుహరిహరాభేదమయగు॥ ౫౪॥

## తుష్టి గణేశ ప్రశంస.

సీ॥ తుష్టినాఁబ్రణవంబుఁదొండంబునన్నోహమనుటఁగుంభద్వయంబుననుదెలుపుఁ।
దుష్టినావ్యాహృతుల్తుష్టిగాయత్రియాదోశ్చతుష్టయముచేఁదోఁపఁజూపుఁ।
దుష్టినానాద్యక్షరేష్టంబుశైవషడ్వర్ణమంత్రంబదిస్పష్టమెకద।
తుష్టినాష్ట్యక్షరస్తుతిఁగనుబిల్వంబుబిల్వాంబికయుమఱిబిల్వపతియుఁ।
దుష్టినిడుభక్తులకునెల్లనిష్టసిద్ధి । నగుటగణపతియందొప్పనాద్యుఁడగుచుఁ।
దుష్టిగణపతియనఁగనాస్తుత్యునిత్యుఁ। దుష్టిగణపతిఁగొలుతుముతొలుదొలుతను॥ ౫౫॥

సీ॥ ఉత్తమాంగాభరణోత్తమరత్నంబుగువలయానందంబుఁగుదురుపఱుప।
వివిధరత్నాకల్పవిలసితాంగప్రభతాండవకుతుకంబుతండ్రికిడఁగ।
భగ్నదంతంబైనపార్శ్వంబుదనకొక్కతనయలేదనికుందుతల్లిఁదనుప।
వామాంకభాగంబువామాంకభాగంబెయానననికృతమతులరసికొనఁగ।

భద్రపీఠంబునవసించిభక్తులకును । సర్వసిద్ధులనొసఁగుచుజానుమీఱు।
తుష్టిగణనాథువిఘ్నేశుఁదుష్టికొలఁకుఁ । గొలుతుమేమెల్ల కార్యములఫలితములుగ॥

## తనుమధ్యా ప్రశంస.

సీ॥ తనుమధ్యయానసన్నవనడుమున్నదియన్నెయనియెన్నసామాన్యులసదుగవిని।
తనుమధ్యయనలలితయవునంచనియెంచికాంచికాంచినిశాక్తలెంచమించి।
తనుమధ్యయనఁగనుదగునిదిగాయత్రియనిమనమునద్విజులలరఁదెలిసి।
తనుమధ్యయనినసోంతత్సత్తనియుబ్రహ్మమును మాయయనిసాంఖ్యులెనయముదము।
నల్లతనుమధ్యమాస్థానమందునుదనుఁ । గనుఁగొనుచుయోగులానందఘనతనంద।
భక్తతనుమధ్యకలితచిచ్ఛక్తియగుచు । దేవితనుమధ్యమాతల్లి దేజరిల్లు॥ ౫౭॥

సీ॥ అన్నపూర్ణయెయగునైనఁబేరాఁకటసంయమిసలయించిశాపమీదు।
ప్రాణశక్తియెయైనస్వాధీనముగఁజేసియ న్యాశలనుహంసనరుగనీదు।
మానసాత్మికయవుమలయుఁగామ్యార్థియైకానికామాత్మీపొల్గఁగనీదు।
జ్ఞానప్రసూనాంబగానలరుంగానిమూకాంబనాఁబేరుమెనయనీదు।
నెగడునానందవల్లి నానిత్యసత్య । యనఁగఁదానయిపంచకోశాకృతియును।
బంచకోశాంతరస్థితపంచవదన । మహిళయాఁదనుమధ్యమమాతమహిత॥ ౫౮॥

సీ॥ శ్రీసూక్తమునషష్ఠిబుక్కునఁదపసానుదంతుమాయాయనియెంతురుగద।
తత్పదముఖవర్ణతతినెగిఁగూర్చినఁదనుమాయయనియవుఁదన్మయాక్ష।
రంబులాద్యంతంబులంబొల్చుమధ్యశబ్దముగానమయలమధ్యంబునందు।
నమరింపఁగనుధకారముతనుమధ్యనారూపంబుసిద్ధించురూఢిగాను।
గావుననెతనుమధ్యయాఘనమనువున । కయ్యెదేవతగానుపాస్యయవుభాగ్య।
శాలులకలక్ష్మిలనుమాన్చుసరగలక్ష్మి । లెల్లనిమఁదనుమధ్యమాతల్లి బిల్వ॥ ౫౯॥

సీ॥ సాధ్యమిక్లేటికిసౌభాగ్యలక్ష్మ్యపనిషదుక్తగుంశలినిదనుమధ్య।
బాలార్కకోటిప్రభయనిసిద్ధముగదాయిడపింగళలురెంటినడుమనుంటఁ।
దత్సుషుమ్నయెయవుఁదనుమధ్యజాజ్వల్యమానజ్వలనమూర్తిమహితచంద్ర।
సూర్యమధ్యగతటిజ్జ్యోతిర్మయాత్మికగౌరియీయర్థంబుకడఁకఁదెలుపు।
క్షీరనీరాపగలమధ్యసీమనుండు । గౌరితీర్థంబుతత్త్రియిగాంచుబిల్వ।
శోభఁగంజగౌరీసరస్సులనడుమను । నీవపరమహంసోదయనిష్ఠనెరపు॥ ౬౦॥

సీ॥ తపమొనరింపుముదగనుతియింపుమునసంబొనర్పుముమహితముగను।
ధ్యానింపుమనుచుభక్తాగ్రగణ్యునికినిజాహ్వయవర్ణాళినలరఁదెలుపుఁ।
దనుమధ్యదనకుఁబూజనుజేయబిల్వపత్రంబులవేఱుదేరకయయుండ।
బిల్వకంబుననిందుబిల్వపత్రికయయ్యెశ్రీయయిశ్రీపతిఁజేసెనీశు।
నారతనుమధ్యతనపేరనాద్యవర్ణ । మునసుద్విజుఁజేయురెండిటమొనసియోగి।
మూటబ్రహ్మచ్యుతేశవిన్ముఖ్యునిఁగను. । నాల్గిటనునాత్మవిదునిఁగనతుహితముగ॥ ౬౧॥

సీ॥ తనుమధ్యచతురర్ణధర్మార్థకామమోక్షములనిచ్చెదననుఁగాంక్ష నేయ।
మఱిచతుర్భుజయయిమహనీయయవుఁజతుర్భుజుఁడుగానగపడుఁబురుషశక్తి।
యైహికాముష్మికప్రాప్యాఖిలసుఖంబులమరింతుననువరదాభయకర।
యగుచందుచేస్వాహ్వాయంబునుస్వాహ్వాయంబుననుసాంఖ్యరహస్యమునుదెలిపెడుఁ।
గామమునుగ్రోధమునుభక్తగణము నేప । కుండఁబాశాంకుశములఁదాసూనియుండు।
నిలిచియుండెడుఁగాపాడనిఖిలలోక । మాతపరదైవతంబేదిమాతకంటె॥ ౬౨॥

సీ॥ తనుమధ్యప్రాసాదమునుదెల్పుగాయత్రిఁబంచదశిన్యాని నెంచ నేల।
తనుమధ్యవేదమాతయయవునూరక వేదంబులనువల్లెవేయ నేల।
తనుమధ్యయనఁగనుపనిషత్తుతనుమధ్యఁదలఁప మేలుపనిషత్పార మేల।
తనుమధ్యచతురర్ణదామహావాక్యపరయవుమహావాక్యచయము దేల।
తెలుపుఁదనుమధ్యసోఽహమన్పలుకుఁబరయ । కాననజపాజపంబింకఁబూన నేల।
యోంకృతినిహ్రీంకృతిందెల్పునెప్పఁబేర । వెన్నదొరకంగనేతిని వెదక నేల॥ ౬౩॥

సీ॥ తనువనఁబ్రణవమాఁదనుమధ్యతచ్ఛక్తిప్రకృతిహ్రీంకృతియనఁబ్రస్తుతిఁగనుఁ।
దనువనఁగాఁజతుర్దశజగత్పరిచయమాఁదనుమధ్యమాయనాఁబ్రణుతిఁబడయుఁ।
దనువశేషార్థజాతంబుదద్వాచకతతితనుమధ్యతన్నుతగనుదగుఁ।
దనువుబిల్వకమవుఁదనుమధ్యచిచ్ఛక్తిబిల్వపత్రికయనవినుతిఁగాంచుఁ।
ద్రిగుణరూపత్రిశక్త్యాకృతియునగుటను । ద్రిదళయైబిల్వనాఁగను దేజరిల్లు।
బిల్వకక్షేత్రసారంబువిశ్వసార । పూరతనుమధ్యమామాతయఖిలమాత॥ ౬౪॥

సీ॥ అజ్ఞుండువిజ్ఞుఁడౌనధనుండుసధనుఁడౌనబలుండుప్రబలుఁడౌననినుఁడినుఁడు।
క్షీణుండుపూర్ణుండకృతినుకృతియునగుణియుసుగుణుండగునీచుఁడుచ్చుఁ।
డఘదూషితుండుమహాపుణ్యభూషితుఁడగురోగిభోగియనర్హుఁడర్హుఁ।
డనపత్యుఁడయ్యెడుఁబ్రాంఛితసంతానుఁడప్రసిద్ధుండగుసుప్రసిద్ధుఁ।
డన్నిటనువ్యర్థుఁడగువాఁడుసార్థకుండు । నంత్యుఁడగువాఁడుదానగునాద్యుఁడౌర।
యెవఁడుతనుమధ్యసద్భక్తినెలమిఁగొలుచు । వాఁడుశ్రీశుండెయగునింకఁబలుక నేల॥

## బిల్వేశ్వర ప్రశంస.

సీ॥ కొండనెక్కఁగలేనికొండికలకుముసల్లకుఁదెవులులసల్లవార।
లకునబలలకుసుకరంబుగా నేవసిద్ధింపననఁగంజశిఖరినుండి।
వచ్చిపుణ్యజనాశస్వపదోపపదసరోవరతీరమునబిల్వధరణిజమయి।
పత్రిరాలఁగఁబూజఁబచరించుటనుబిల్వపత్రికయను పేరఁబరఁగుగౌరి।
కగపడెందార్తలింగమైయభవుఁడల్ల । బిల్వపత్రికఁదనుమధ్య వెలయఁజేసి।
కూడియుండెడుఁదత్కథగొఱలఁగనిల । బిల్వనాథుండనునభిఖ్యఁబెంపువడసె॥ ౬౬

సీ॥ శ్రీశైలఁబ్రభవించెశ్రీలింగమూర్తినాబిల్వాంబెశ్రీయాటబిల్వనాథుఁ।
డయ్యెనుశ్రీనాథుఁడనఁగనుబాగడొందెశివవిష్ణుభేదంబుఁదవఁదెలిపెడు।
విష్ణుండుబ్రహ్మయభేదంబుగానైక్యమొందుటదనయందుఁబొందుపడఁగ।
మూర్తిత్రయైక్యంబుమొనయుట నెఱిఁగించుఁద్రిదళబిల్వాకృతిఁదేజరిల్లి।

బిల్వనాథుఁడనంబడు బిల్వవనిని । వెలయుటం బిల్వవనపతి బిల్వపతియు।
నృహరినుత బిల్వకీశుఁడై యెసఁగుటనిట । నయ్యె బిల్వేశ్వరుండన నభవుఁడవుర॥ ౬౭॥

సీ॥ సనకాదులకతండు సాక్షాత్కరించెను దాండవ మొనరించె దయదలిర్పఁ।
బదునాల్గుమాఱులు వాయించె ఢక్కను శివసూత్రములు గాఁగఁ జెలఁగ ధ్వనులు।
శివములు వర్ణములిద్ధంబగుట నోంనమశ్శివాయయనఁ దన్మంత్రమాదిఁ।
దగు నక్షరావళికగును దత్సారంబు శివమె శివోఽహమంచవును గాదె।
యవ్విసల్వాదిమూఁడంచు నలరుకతన । నక్షరములయ్యె బిల్వంబులవి మహత్త్రిత।
నక్షరేశుండు బిల్వేశుఁడయ్యెను శివ । తత్త్వమతని నెకొలిచి చెందఁగవలయును॥ ౬౮॥

సీ॥ ప్రళయకాలముదీఱ బ్రహ్మ జగత్సృష్టికిని సాధనము వేఁడుకొననితండు।
ప్రాసాదమంత్రవరంబు పదేశించె దాన సృజించె నాతండు జగముఁ।
దన్మంత్రము త్రిఖండధర్మంబగుటఁ జేసి బిల్వంబనంబడె బిల్వనాథుఁ।
డను ప్రసిద్ధినిఁ గాంచె నభవుఁడీశ్వరుఁడిట మంత్రదేవైక్యంబు మదినెఱుంగఁ।
దారకంబును గాంచఁగఁ దనరు సిద్ధి । బ్రహ్మగురుఁడైన యా పరబ్రహ్మ మెగురు।
వెల్లరకు నగు నగుటచే శ్రీశు బిల్వ । నాథు సేవింపవలయు ఘనము గుభక్తి॥ ౬౯॥

సీ॥ మాత్రాత్రయోంకృతి గాత్రుఁడౌట శివుండు బిల్వనాథుండని వినుతుఁడైనఁ।
బ్రణవతృతీయమాత్రాజ్ఞేయుఁడగుటచే మధ్యమేశుఁడనంగ మహితుఁడగును।
వాగ్రమాంచితయయి వఱలుట గౌరియా మధ్యమ తను మధ్యమయనఁగఁ దగుఁ।
దను మధ్యతత్పరార్థకయగు గాయత్రి తత్పూరుషుం డౌటఁ దత్పురుషుఁడు।
కాననే యాతఁడీ బిల్వకాననమునఁ । బ్రాహ్మ్యఖుండుగనుండెడు బ్రహ్మగురుఁడు।
యాజుషంబు మహావాక్యమనుభవమున। నగునిటు లెయానఁగ శివోఽహమ్మనుచును॥

సీ॥ జ్ఞానంబు జ్ఞేయంబు జ్ఞాతయునైక్యము గాన గునను నర్థకలన మెఱుక।
పఱుచు బిల్వంబు త్రిపత్రకలితమునై తద్విశేషార్థ ప్రదాత బిల్వ।
నాథుఁడు ముక్తిని నతులకునిడు వేఁడ నాయురారోగ్యభోగాతిశయము।
సంతానమును బహుసంపదలను స్వర్గసుఖము లెన్నెనియుఁ జూఱయిడెడు।
శ్రీకరంబునఁ బుట్టుట శ్రీకరుఁడన। నతఁడెతగి యెడు శ్రీబిల్వమాటఁ జేసి।
బిల్వనాథుండె శ్రీనాథుఁడిల్వలారి । కొల్వవలయుఁ దదీశ్వరుఁ గోర్కులలర॥ ౭౧॥

సీ॥ సంచరత్కైలాసశైలమనందగు నందిపై నిండు ప్రభండనరుచు।
మాతల్లి జగదేకమాత నుదను మధ్యసంక పీఠంబునం బొంకపఱిచి।
వలగొనియా మెను వరదహస్తంబొప్పదక్షిణమభయహస్తము దలిర్ప।
మృగడమరుగములు మీఁది చేతులఁ దగఁ జంద్రాంకమన గొంతు చాయ జగము।
నరయఁగల్గిన బిరుదాంకమనఁగ మెఱయఁ । బుష్పపద్మహస్తులక్షులై పొలుపెసంగ।
గంగ జడముడిఁ బూదండగా శశిమణి । యుండ మాతండ్రి బిల్వేశుఁడుండు నచట॥ ౭౨॥

సీ॥ కంజాచలమె బిల్వకంబున మూలలింగంబనఁ దవ భిముఖంబుగఁ దగుఁ।
దనతండు నామంబె తత్త్వార్థకంబుగా యోగగుణంబుల నోమహామని।
తెలువుఁగంజున హంకృతిని రాక్షసునిఁ ద్రుంచె జీవుని శివుఁ జేయు చెల్వు దోఁప।
దనుఁగను వానికిఁ దానభిముఖుఁడుగఁ దనరి శివోఽహమాత్తత్త్వమిడెడు।

నంది ప్రాఙ్ముఖుఁడై యుండు నయ మెలర్ప । గోముఖవ్యాఘ్రము సరి పుల్గోముఖుఁడయి।
మోడ్పు కేలొప్ప బిల్వేశు ముదితుఁ జేయు । సుమను దనుమధ్యఁ జేసిన యోగి భృంగి॥

సీ॥ దక్షిణదిశనుండు దక్షిణామూర్తి శాంతరసాకృతి గురుత్వంబు వెలయఁ।
బ్రాచేతసాశను బరఁగు శృంగారరసాధీశ్వరుఁడు విష్ణుఁ డచ్యుతుండు।
ధనదాశ మహిషమర్దని యుండు సుభయానకరసాధి దేవత కరణి ధరణి।
సోమసూత్రాభిముఖ్యామోదుఁడై యుండు జహ్నుండ నక్షైవజనుఁడు చండుఁ।
డంత భైరవ వీరభద్రాదులుంద్రు । సుందరాది మహాభక్తబృందముండుఁ।
గముల జేంద్రాది దేవతాగణములుండు । మునిమనుజసంఘములు నుండు ముజ్జగములు॥

సీ॥ కంజశైలము నీవఁగన బిల్వనాథుండు తనుమధ్యయును సుపదములను మఱి।
నారాయణుండను నాహ్వయంబును వ్రాసి తత్తదక్షరసంఖ్యఁ దనరఁ గూడి।
యంకాక్షరక్రమములవడ వేర్వేఱ సంకలితము నేయ సరగఁ దోఁచు।
నోంనమోయని మఱియొగిని శివాయయంచౌర బిల్వకరహస్యంబిదియట।
బిల్వనాథ సాంధ్యవిహితనీరాజన । దీపతత్త్వమునను దెల్లమగును।
దన్మయంబయనుచుఁ దనుమధ్య దనపేరఁ । దెలుపు దీపతత్త్వమెలమి వినుము॥ ౭౫॥

సీ॥ ఒక్కటిమూఁడైదు నెుగి యిరువదియేడు నూటయెన్మిదియొండు నూటఁ గూడ।
నూటనల్వదియైదు పాటిల్లు నా సంఖ్యనగు శివాయయనంగ నంతనైదు।
పూర్ణకుంభము పంచముఖము దీపములిట్లు మెునయ సోంనమయని యొనరుఁ గాదె।
పరికింప నూటయేఁబదియాఱు దివియలంచును దెల్పుఁ దనుమధ్య తనదుపేరఁ।
దనరు వర్ణాంకములయమ ల్తనలు పదిగ । మున్ను దెల్పు శివాయనా సోన్నమయని।
యంతథా సోమనిశివో౽హమనితవర్థ । మునటగు ప్తార్థమిది సాంఖ్యమున నుదెలియు॥

సీ॥ అంకముల్ బిందుసమాసములు మూఁడు దెగఁ బౌటనవియయ్యెఁ ద్రిదళములగు।
బిల్వంబులందు చేవిలసిల్లు సంఖ్యలు బిల్వంబులనఁగను విదితములుగ।
బిల్వపదంబున వెలయు హల్లులు గూడఁ బదియవి యంకముల్పది శివాయ।
యనఁబదిపదిగూడ నగు సోంనమోయని కానఁ బ్రాసాదం బెయౌను బిల్వ।
మంతె కాకతారకము శివో౽హమనుట । త్ర్యక్షరంబౌట బిల్వమానదియుఁ గూడ।
నట్టి బిల్వంబులకు నాథుఁడౌట శివుఁడు । బిల్వనాథుండనియిట సువిశ్రుతుఁడగు॥ ౭౭॥

## బిల్వేశ్వర రహస్య ప్రశంస.

సీ॥ కంజాద్రియను బిల్వకాననమును బహిర్విలసితంబులగు స్తవిధము నువిను।
మగును శబ్దబ్రహ్మమదె వాక్కు చతురాత్మకమది వాచతురర్థకమెకదకన।
వైఖరి బాహ్యమావర్ణాత్మకము పరపశ్యంతి మధ్యమ పరఁగు గుహానె।
బిల్వాకృతిని సూక్ష్మవృత్తిఁ దదీశుండు బిల్వేశుఁ డిందుండుఁ బ్రియమున గుహ।
నట్టి బిల్వను బిల్వేశు నరసికన్న । బ్రాహ్మణులు సుమనీషులువారెయంచుఁ।
బలుకఁ జత్వారి వాక్కనిపరఁగు బుక్కు । చూడుమనిచూపెగుహ్యుఁడగస్త్యునికిగుహను॥

సీ॥ తాదియాంతాభిఖ్యయాటచేఁదనుమధ్యగుహాయదెహ్రీంకృతిగొఱలుఁబ్రకృతి।
యందాత్రిపదిశక్తియవుబిల్వబిల్వేశుఁడందుండుజీవదేవైక్యభావ।
మహితుఁడుగనయమాత్మాబ్రహ్మయనునథర్వణమహావాక్యలక్షణములక్ష్య।
మిదియనిబిల్వనాథేశ్వరలింగముంగుహఁగలశజునికిగుహుఁడుసూపె।
బిల్వకక్షేత్రమునగోప్యవిషయమిదని । యెఱిఁగిగురుగుహువినుతించెనెలమిఁగలశ।
భవుఁడుబ్రహ్మవిద్బ్రహ్మైవభవతియనుట। పరఁగసర్వజ్ఞుఁగనుటసర్వజ్ఞుఁడయ్యె॥ ౭౯॥

సీ॥ కంజాచలమువంటిక్ష్మాధరమునుబిల్వవనమునుబోలినవనమునుమఱి।
సరవిగౌరీతీర్థసమమగుతీర్థంబునీవానదీతుల్యనిమ్నగయును।
లీలమైనేకవల్లీసదృక్ఛక్తియుయోగనారాయణునుద్దియోగి।
నందికేశ్వరుదీటుగందగుప్రమథుండుతనుమధ్యకెనయైనతల్లిబిల్వ।
పతికిజతతండ్రితుష్టిసవతగువేల్పు । సోఽహమనుస్కాందుక్రియగురుఁడల్లవల్లి।
మలకుఁదులయైనసిద్ధాశ్రమంబుగుప్త । లింగసదృశంబులింగమనంగనున్న॥ ౮౦॥

సీ॥ స్వరసప్తకార్థకసన్నాదకంజాద్రిదారకాలింగమకారమయవు।
పల్లిమలంగలపాతాళగుహగుహాహాటకేశ్వరలింగమాహాకార।
మాబిల్వవనమందునత్తనుమధ్యమేశ్వరలింగమోంకృతిసురుతఁగాంచు।
బిల్వకక్షేత్రోక్తవిశ్రుతలింగత్రయంబుదర్శించిననబ్బుముక్తి।
యంచునెంచియగస్త్యుఁడయ్యభవుమూల । బిల్వనాథునిసేవించివెండిబిల్వ
వనికరుగుదెంచికంజాద్రికినిజనిశివుఁ । జేరిశ్రీతనుమధ్యేశుశ్రీలఁజెందె॥ ౮౧॥

సీ॥ అఖిలసుక్షేత్రౌఘమందుఁజల్పినపుణ్యమాబిల్వకంబుననగుఁద్రిగుణము।
లాఁతితీర్థావళిలభియించుసత్కర్మమానీవనాల్గంతలవుఁబరఁగను।
బరదేవతాళిసేవాసత్ఫలంబవుఁదనుమధ్యమాక్షరజనితసంఖ్యఁ।
బూర్వోక్తసుకృతసంభూతసౌఖ్యంబవుబిల్వేశసంస్మృతిబిల్వనాథు।
సేవసేయఁగసర్వార్థసిద్ధులబ్బు । టబ్బురమెకానఁదాత్త్వికులరసియల్ల।
బిల్వకంబునధర్మాభివృద్ధియవుట । ధర్మములనాచరింతురుధన్యతములు॥ ౮౨॥

సీ॥ వాచంయముండొకఁడాచోనిరగముగనాకులఁదినుటఁబర్ణాదుఁడయ్యె।
మునియొకండటశిలలనునిరద్రిగఁదినియమరించెనతఁడెశిలాదుఁడయ్యె।
ఋషియొకండాకదద్విషదంతమునుగోరియవసంబుఁదినుటదూర్వాసుఁడయ్యెఁ।
దాపసుండొకఁడటఁదనరించిశాండిల్యవనమునుశాండిల్యుఁడనఁగనయ్యె।
నందివుడునరనారాయణాత్మములయి । యున్నపెనురావిచెట్లపండ్లన్నిదినుట।
నమలమతియత్తపసిపిప్పలాదుఁడయ్యె । శ్రీఫలాసక్తులేకదక్షితిజనములు॥ ౮౩॥

సీ॥ తనుమధ్యలెందఱోతనరుచుండెదరెందుబిల్వేశులెందఱోవెలయుచుంద్రు।
వాక్పతులెందఱోవఱలుచుండెదరెందుశ్రీపతులెందఱోచెలఁగుచుంద్రు।
వాసవులెందఱోభాసిల్లుచుందురుధనపతులెందఱోపొనరుచుంద్రు।
సర్వజ్ఞులెందఱోసంయములెందఱోసజ్జనులెందఱోజగతినుంద్రు।

తన్మహాక్షేత్ర సేవ సంతానమాయు । వధిక సంపదభోగంబు నర్థసంచ।
యంబు జ్ఞానంబు యోగంబు నమలచరిత । మలరు ననుటకు వేయు సాక్షులు వలయునె॥

సీ॥ పండ్లిగిలించుచుఁ బకపకన వ్వెడువార రయరు పూషు పండ్లకతను।
నాలిక పొడుగుగాఁ గేలిఁ బ్రేలెడువార లెఱుఁగ రగ్గివినాల్క లెనసిన గతి।
సుడలాడఁగాఁ గులుక్కుచడ రెడువారలు దలఁప రాశశిదిన్న తన్నులపొడఁ।
దలఁ ద్రిప్పచ సదుగాఁ దలఁ చేడువారలు దెలియరా తలచెడు నలువ క్రందు।
నల్లక్షేత్రంబునం దుండునట్టి విబుధ । తండమును దన్నుతవితతిఁ దత్కృతకృతి।
తతినిదూఱెడువారి దుర్గతులకుఁ గరి । లేవడియుఁ దెవు లెగ్గ వుఁ జావుతమము॥ ౮౫॥

సీ॥ దోషిచెడుతెకాక దోషికావ్తులు మజితన్ని వాసముఁ జెడు నెన్నెదవిను।
శ్రీబిల్వపురియందె శివదూషకుండంఘ్రిజుండొక భూపతి గండుమీఱి।
యొకమ్లేచ్ఛనృపకన్యఁ దెక తేరఁగాఁ బట్టి రమియించె రంభను రావణుఁడన।
నది గాక తనయింటఁ బదిలంబుగా నుంచుకొనియె నంతట దాని జనకుఁ డేచి।
యిడియఁ గొట్టించి కోటను గుడినిఁ గూల్చి । పుర్రము నెల్లను గాల్చి యద్దురితమతిని।
సపరివారుఁ గఁ జేల్చి తాసము నెఁదోన । నడవి నేర్చిన కార్చిచ్చువడువు ననట॥ ౮౬॥

సీ॥ అగ్నిమూర్తియె కాన నాగ్నేయమభిషేక మొనరించె క్షేత్రేశుఁ డొప్పఁగాదె।
వారిమూర్తియె కాన వారుణస్నానంబు సేసె నీవాపగఁ జెలఁగుఁగాదె।
యసమంజసజనాళి మసనముపై గంగ పాఱుటఁ దెల్పు నీవఁదగుఁగాదె।
స్వీయభక్తులకిడ శ్రీఫలంబుల శ్రీఫలాకృతి నలరెడున మరుఁగాదె।
పురుషుఁడచలుఁడు దానంటభువికిఁ దెలుపఁ । గంజభూధరరూపుఁడై కానిపించు।
ప్రకృతిఁ దనుమధ్యఁ గాన్పించు వాహినిగను । బరఁగు బిల్వేశుఁడే స్వయంవ్యక్తమూర్తి॥

సీ॥ శ్రీదుండు పేర్మి వర్షించిన బంగారు గుండ్లనన్మారెడు పండ్లు చెట్ల।
నుండు నాపండ్ల నేయలవడ్డపొన్నెంతొ పాతాళగుహలలోఁ బదిలపఱుపఁ।
బడెనం ద్రుపొన్న నాఁ బడు నూరుగుహలూరు దిరువలమనఁ గనూళ్లి రవవునట।
శ్రీవాహినియనంగఁ జెన్నొందు నదినీవ కాంచనాచలమంద్రు కంజమలను।
వల్లిమల వెళ్లిమలయందు రెల్లవారు । గావున నెతిర్వలంబునఁ గావలిగను।
దనరు నయ్యేకవల్లి శాసనములుండు । శ్రీవనంబనన దెయొప్పు శ్రీనిధిగను॥ ౮౮॥

సీ॥ తాండవరాయముదలియు గోపాలరావును సుబ్బరామయ్యయు నెుగి సుబ్బ।
రావును జెంగల్వరాయ నెట్టియు నుగంగాధరరావును గ్రమముగ శర।
వణముదలియుఁ దొల్లి వసుధాధరాచార్యుఁ డల్ల భాస్కరరాయఁ డంతసీవు।
సేవించి సర్వార్థసిద్ధులఁ జెందితిరల్ల బిల్వకమున నల్లెధన్య।
తములుకీర్తితనువుల మరసములవుచు । వెలయుచుందురె పుడు నలఁతియైనఁ।
దత్కృతంబు ధర్మముత్కృష్టఫలదమా । శుక్తి స్వాతివృష్టి చొప్పెలర్ప॥ ౮౯॥

సీ॥ ఇహపరసుఖముల నెలమిఁ గోరునతండు వినవలయును దీనివిమలభక్తి।
విన్నపిమ్మట గుణమున్నదియని మెచ్చి బిల్వాటవికి వెస వెడలవలయు।

వెడలితత్క్రియమెల్ల విశదంబుగ నెఱింగి సేవింపవలయుఁదక్షేత్రరత్న।
మునుసదా దాని నెమ్మనమున ధ్యానింపవలెఁదనుమధ్యబిల్వపతినతఁడు।
వాంఛితార్థంబులంబొందుభక్తిచేతఁ। గర్మమును గర్మమున నుబ్రజ్ఞానమంచు।
నలరుఁబ్రాసాదతారకములటుగాన। దానిచేత జీవన్ముక్తుఁడా నిజముగ॥ ౯౦॥

ఇది, మహిమనిధిజ్ఞ పర్వము.

## యాత్రాభిజ్ఞ పర్వము.

కం॥ గౌతమముని బిల్వార। ణ్యాతతమహిమంబుఁదెలుపనతిచిత్రముగా।
నాతండు రత్నశర్మయ। నాతిందోడ్కొనుచు బిల్వనాథుఁగనఁజనెన్॥ ౧॥

స్రగ్ధర॥ ఎక్కెంగంజాద్రిమీఁదన్ - హితమతినతఁడ - య్యంతితో నిల్చిపల్కెన్।
జిక్కెన్నా మానసంబీ - శిఖరిసరసినీ - చిత్రకాశంబునందున్।
దక్కెన్ స్వాభావికంబౌ - ధనము విబుధవం - ద్యంబు లింగౌఘమిందే।
నిక్కొండందంబాయఁజాలెన్ - హృదయమలరునా - కిందెయుండంగనంచున్॥ ౨॥

మహాస్రగ్ధర॥ చెలువొప్పంగన్మునింగెం - జెలువయునలరం - జిత్రకాశాహ్వయంబౌ।
కొలనంబూజించెనచ్చోఁ - గొఱలెడుసుమనః - కోటిలింగంబులంగో।
ర్కులుసాఫల్యంబుఁజెందం - గుహలనరసెఁబ్రేమో - త్కుల్యాన్వర్చెన్మునీశా।
వశికిందారాన్వితుండై - పరఁగెనచటఁబ్రో - ద్భాసితేందుండనంగన్॥ ౩॥

శా॥ కంటేబిల్వకమిద్ధితద్దయును వేడ్కంజూడ్కికిం జేయుఁగ్రా।
ల్గంటీభానిలెడుం ద్రికోణముగనిక్కంజాద్రిప్రాగ్దిక్కునం।
దుంటంబుణ్యజనాళిబిల్వవనమందుంటన్మరుత్కాష్ఠమే।
ల్గంటన్వల్లినగంబు నీవనదుమంగ్రాలుంగడుం గాంచుమీ॥ ౪॥

మ॥ శివనారాయణపాదసేవఁగడువాసింగాంచు నీనీవదా।
నవలంబించి ప్రతీచివిస్తృతముగానై బిల్వనాథాలయ।
ప్రవరంబుంబటిఁబెట్టియీఱయుటనీవాసింధువౌహాంసియీ।
శివక్షేత్రంబగు శుద్ధబిల్వకమెవీక్షింపంగరాఁజాఁజుమీ॥ ౫॥

మ॥ కనవేయీనదినీవనానలరు శ్రీకాంతారమార్గంబునం।
జనెడుందానభిసారికాకృతినినిచ్ఛల్గాడనాత్మేశుఁగం।
థినిఁబాలేఱదిదోడునూపననుచున్నీవానదిందాటిపీ।
టనుజొచ్చెంగనెనేకవల్లిని శ్రితేష్టంబిల్వకాధీశ్వరిన్॥ ౬॥

## ఏకవల్లీ స్తుతి.

శా॥ కేదారంబున మార్గదాయినియనం గ్రీడించుటం దెల్పనే।
కేదారంబున మార్గదాయిని వెమ్మై క్రీడింతు బిల్వాటవిన్।
గేదారంబులలాటమందుమతిమై క్రీడింతు సాంఖ్యార్థదా।
కేదారాంబికమేకవల్లినిసుభక్తింగొల్తు నెల్లప్పుడున్॥ ౭॥

ఉ॥ లాలితభక్తినిన్ను నుపెలర్వఁగఁగొల్వమి నెన్నియేనయో।
చాలుగసంకటంబులను జన్మములందితిఁజాలుఁజాలునీ।
వేలవెయింకనైనజనులెత్తకయుండఁగసాంఖ్యబోధచేఁ।
గాలగళాంబవాగ్జననిగాదిలితల్లి సుతుంద్యజించునే॥ ౮॥

కం॥ శివవాక్యపుశివుఁడర్థము । శివులకుజననివఁటనిన్ను సేవింపఁగదా।
శివసిద్ధిపరాశక్తీ । శివాంబనినునెంతునాత్మశివసిద్ధులకున్॥ ౯॥

మేఘవిలసిత॥ కాళీక్రొమ్మెక్కుదఁ - గమలజవినుతా । నాళీకేక్షణ - నయనవిగళితా।
వ్యాళేశాంచిత - పరశివమహితా । పాలింపంగదె - భగవతిసుహితా॥ ౧౦॥

ఉపేంద్రవజ్ర॥ లయంబునుంబొందన - లక్ష్మ్యలెల్లన్ । రయంబుగంజేయవె - రాజమౌళీ।
దయన్మముంబ్రోవవె - తల్లిమాతా । యియంబనీబిడ్డల - మేకవల్లీ॥ ౧౧॥

అపరాజిత॥ మునుకొనిలుటనీకు-క్రొమ్మెక్కుదమక్కటన్।వినుతపుగదవమ్మ-బిల్వకనాయికా।
వినుమనవినిమాది-బిల్వకయాత్రమా।కొనరఁగవరమీవె-యోయపరాజితా॥

ప్రభాత॥ అనివినుతించుచు - నందితత్ప్రసాదం । బునుకులునాఁడుశి - వుండెమేలుకొల్పన్।
బనివడిపూనిని - వానదిన్మునింగెం । గనియెనుజానుగ - జ్ఞానమంతనెంతే॥ ౧౩॥

మ॥ అలరంబిమ్ముటఁజేసెస్నానమునుమధ్యాహ్నంబునంబుణ్యవా।
రిలసద్వారిజసూత్పలంబయినగౌరీతీర్థరాజంబునం।
బలుపుంబొందుటనాఁగఁబస్తుపడెసంభావించెశ్రాద్ధంబునిం।
బలరంగంభజియించెమారుతినివీరాగ్రేసరున్ శ్రీకరున్॥ ౧౪॥

## హనుమన్నుతి.

సీ॥ వాయుజుండవటంచువాదింత్రుద్వైతులతండష్టమూర్త్యన్యతముఁడుగాఁడె।
హనుమదాహ్వాయమునగుఁబ్రణవముతదర్థముమహాగుణనాప్తిఁదారకమును।
భీమమధ్వాఖ్యలవిష్ణుశివైక్యమత్తారకంబౌనుగుప్తంబుదాన।
నద్వైతమనధికారానర్హమనియొక్కద్వైతమతముఁదెల్పితాతతముగ।
నెడమకయిమాయగావంచియడఁచియెత్తి । తత్సదోమనికుడికేలుదగఁదెలిపెదు।
ద్వైతగృహభిత్తిరంధ్రకృద్ద్వారదేశ । యరయుమమ్మద్వితీయబిల్వాంజనేయ॥ ౧౫॥

ద్రుతవిలంబిత॥ అనినుతించెను - హర్షముమీఱఁగాఁ । జనిపదంపడి - శాంకరయోగినిన్।
వనజనాభునిఁ - బద్మదళాక్షునిన్ । ఘనసుభక్తినిఁ - గాంచెనుశ్రీపతిన్॥ ౧౬॥

## యోగ నారాయణ స్తుతి.

### పద్మనాభ వృత్తము.

మానాయకాపద్మనాభానతుల్గొమ్ము - మమ్మేలుమాయోగనారాయణుండా।
మీనంబవై యోడనీడ్వంగవల్దయ్య - మీఁదన్మలందాల్పవల్దయ్యతామే।
లైనేలనెత్తంగవల్దయ్యపెన్బంది - వైదైత్యునింద్రుంపవల్దయ్యమోసం।
బూనంగజైత్రిరామాకృతుల్వ్వాన - నోవల్దుసన్నిందలున్ మ్లేచ్ఛహత్యల్॥ ౧౭॥

లక్ష్మీ వృత్తము.

లిసచకుచశ్రీయుతపక్షప్రక - లితజగదభిమతరక్షా।
ప్రకటితయోగీశ్వరపక్షాసుర - పరతతినుతనళినాక్షా।
సుకృతజలక్ష్మీపనదక్షాశ్రిత - సులభసకలరిపుశిక్షా।
యకుటిలభక్తావనదీక్షామము - నరయవెకరుణసువీక్షా॥ ౧౮॥

శతపత్ర వృత్తము.

కామరిపుసామగను - గ్రాలెఁదనుమధ్యయనఁ - గాంచితితపర్థతనువున్।
నేమమునఁబూరుషత - నేమితనుమధ్యమును - నెమ్మిఁగనుఁగొంటిమిపుడో
స్వామిపురుషోత్తముని - వారిభవనాభునిను - బాగుగనుగంటిమహాహా।
మామహితనీవెతను - మధ్యవుగఁదోఁచెమన - మస్కృతులునీకవుహరీ॥ ౧౯॥

కం॥ అనివనమాలికిమాలిక । గనర్పణమునేసివినుతిఁగానికగాఁగన్।
బ్రణతులొనరించియాతఁడు । గనియెంభద్రేభముఖునిగణపతినిరతిన్॥ ౨౦॥

తుష్టి గణపతి స్తుతి.

మంగళ మహాశ్రీ వృత్తము.

మంగళమునీకగుసు - మాతనయజోతలివె - మానుపవెవిఘ్నములనెల్లన్।
మంగళముమాకొసఁగు - మాసకలసిద్ధులను - మాన్యతమసిద్ధిగదనీకీ।
యంగనత్వదంకగత - మైయలరుసాంధ్యరుచి - యందునెలవంకవలెమాయా।
సంగతముబ్రహ్మమన - జానపుదునిన్నెగడఁ - జాలుదుమెతుష్టిగణనాథా॥ ౨౧॥

కం॥ అనుచువినుతించియాతఁడు । తనుమధ్యంబిల్వనాథతనుమధ్యంగాం।
చెనుబిల్వదళాంబకమా । తనుబిల్వదళాంబికన్నుతంబ్రణవాంబన్॥ ౨౨॥

తనుమధ్యా స్తుతి.

తనుమధ్యా వృత్తము.

శ్రీమాతనతుల్గా । న్మామావివరాంగీ । ప్రేమంబునదేవీ । శ్రీమత్తనుమధ్యా॥ ౨౩॥

భూనుత వృత్తము.

తత్పదార్థవయిభానిలు-దానవుగాయు । ష్మత్పదైకవచనార్థవు-మాయనియంచున్।
సత్పథంబుననుబల్కెద-సత్కృపనన్నుం । జిత్పరుంబలుకవేయటు-శ్రీతనుమధ్యా॥

కుసుమవిచిత్ర వృత్తము.

నుతిసలుపంగ - న్గుశలుఁడనేవా । కృతియనుతింపం - జతురయుఁగాదే।
నతిశయమూఢుం - డనఁబడుచున్నీ । స్తుతినొనరింతున్ - శ్రుతిఁదనుమధ్యా॥

తనుమధ్యమా వృత్తము.

మహాకాళివీవాద - మామానవతియాది - మాతామసీ।
మహాలక్ష్మివీవాదు - మాబిందుమతిమాది - మారాజసీ।

మహావాణివీవాడు - మాజ్ఞానదయవాది - మాసాక్షి
మహాశక్తివీవాడు - మమ్మేలుతనుమధ్య - మా ౨౬॥

తన్వీ వృత్తము.

ధ్యేయవు గాయత్రివివరవుమవా - గ్దేవివి నాలుగుతెఱఁగులనుంట।
న్నీయభిధానంబిది శ్రుతిసమవ - ర్ణితమైతెలువునుదనుమధ్యా।
గేయవుషడ్బీజవవుటనుభవ - త్కీర్తితనామముముఖమెఱిఁగించున్!
శ్రీయనబిల్వాఖ్యఁదనరెదునత - శ్రీకరిశంకరిశివతనుమధ్యా॥ ౨౭॥

కం॥ జగదంబికతనుమధ్యా। యగపఱుచుఁద్వదాఖ్యప్రణవమాద్యము చేతన్।
దగనమయనిమధ్యనుమా। ల్యగమున నుశివాయయనుచు నొగి ధ్యాంత్యము చేన్॥ ౨౮॥

కం॥ యత్నముధనముత్వదాఖ్యా। రత్నము తారకముఁదెలువురహానిగుణితమున్।
ప్రత్నముత్వన్మాంతావ్వాయ। రత్నముసత్యముగ శ్రీకరముతనుమధ్యా॥ ౨౯॥

కం॥ శ్రీతనుమధ్యేజయయను। రీతింబద్యములు ముఖ్యవృత్తిందెలుపం।
బ్రీతినుతించి ప్రసాదముఁ। జేతోముదముగ గ్రహించి శ్రీశివుఁగాంచెన్॥ 3౦॥

బిల్వనాథ స్తుతి.

మణిమాలా వృత్తము.

శ్రీశాతనుమధ్యా - ధీశాజగదీశా। శ్రీశార్చితపాదా - శ్రీష్టార్థదసత్యా।
ధీశాంచితవాణీ - దివ్యస్తుతిపాత్రా। యాశాంశుకదుర్వా - సోఽభిష్టుతతుష్టా॥ 3౧॥

నవనందినీ వృత్తము.

నినుఁగొల్చుటంగమల-నిక్కముగ శ్రీనాఁ। గనెసంగె వెన్నుఁడును-గాంచెరమ శ్రీశుం।
డననెప్పవాణినుతి-నందెవిధివాగీ। శనుతుంచు నయ్యెనతుఁ-జెల్పెదటొ శ్రీశా॥ 3౨॥

మణిదీప్తి వృత్తము.

శ్రీమద్బిల్వవనేశ్వరశంభూ - శ్రీకరశ్రీకరసంభూతా।
నీమాహాత్మ్యముశక్తులెయెన్న - న్నీరజనాభసరోభూజుల్।
గామింగాదెనుపీఠమునీకై - కాంచిరిగౌరవమొక్కింతే।
నేమేమారసిస్తోత్రమునేయ - న్నేర్తుము శ్రీతనుమధ్యేశా॥ 33॥

శిఖరిణీ వృత్తము.

అభివ్యక్తింబంచాస్యుఁడవయిరహ - స్యంబునుగనన్।
శుభాంగాషడ్వక్త్రుండవయితగుటం - జూపనెశివా।
విభూమాలాధారాభిముఖతదగం - బిల్వపతినాఁ।
గభూజాకారంబుంబడసితనుచుం - గాంచెదశివా॥ 3౪॥

### వామదేవ వృత్తము.

వామదేవుఁడేయగుఁగన - వాసుదేవుఁడంచునీ।
భూమిఁదెల్పెడున్ శసలకుఁ - బోలెనూకభేదమున్।
సోమమౌళియజ్యుగళము - చూపుఁగాకభేదమున్।
శ్రీమదీశయోంకృతియయి - చెప్పదేయభేదమున్॥ ౩౫॥

### యశస్వి వృత్తము.

ప్రాసాదాక్షర - పరిమితముగఁగ్రమ - పద్ధతినంకములాఱుంచన్।
భాసిల్లంగనఁ - బడుఁబరుఁడునువరు - వాతనుమూటనుబిల్వేశుం।
దాసత్యంబుగ - నతఁడవుఁగదయెన - యందనుమధ్యయయోగంబున్।
వాసింగన్పడుఁ - బదపడితుదఁగను - పట్టెడుఁదారకమోశ్రీశా॥ ౩౬॥

మ॥ అనిపద్యావ్యాయముఖ్యవర్ణములబిల్వాధీశుభూషించి శాం।
చెనునారాయణశంకరాత్మకునిఁగాశ్రీబిల్వనాథున్మహా।
త్మునిఁజండీశ్వరునందికేశ్వరునిసంతోషంబుతోనంతనె।
య్యననావల్లిమలంగుపఱంగుహనుగుప్తాత్మంగనన్ శ్రీశ్వరున్॥ ౩౭॥

తే-గీ॥ పరయఁబశ్యంతిమధ్యమపరఁగుగుహను । బిల్వమిత్రయిదీనికివిభుఁడవపుట।
నీవుబిల్వేశుఁడనగుహనెగడెదేను । నిన్నుఁగనిబ్రాహ్మణుఁడనుమనీషిఁగానె ౩౮॥

మ॥ అనుచున్వేడ్కొనిరత్నశర్ముఁడొగిబిల్వాధీశుగారీసర।
స్సునసేవించిభజించికంజగిరినింజొచ్చెన్ రహిన్వొండియున్।
ఘనమాబిల్వవనంబుఁగూఁడెనయుపక్షుస్యందనంబౌనన్।
గనెఁబ్రాసాదముఁదారకంబుశివయోగంబుందపస్సిద్ధుఁడై॥ ౩౯॥

### బంగారము.

మున్నేకవల్లియేముదమునగపడితానుమహాకాళిదాసుఁజేసెఁ - దల్లిగదా।
బిల్వేశుఁడేయటుపిమ్మటదివ్యపక్షైరమిడిజ్ఞానంబుతెరువుఁజూపె - గురుఁడుగదా।
స్వీయనీరాజనస్ఫీతదీపనుసంఖ్యబోధించెఁబ్రాసాదమునుమునుకొని - ముఖ్యముగా।
తారకంబుస్ఫురింపఁదాఁజేసెనద్వైతినారత్నశర్మరత్నాయనునిగఁ - నద్భుతంబు।
పుత్రఫలమిచ్చెదనుమధ్యపుణ్యలభ్య - పూన్చెలక్ష్మి।
సాంఖ్యగురుఁడయ్యెబిల్వేశచరితఁజెప్పె - సన్నుతుఁడా।
నెలమిరత్నాయనుండురత్నేశుఁడయ్యె - శ్రీశకృతిన్।
శ్రీఫలారణ్యయాత్రయేశ్రీలనిడదు - శ్రీకరమా॥ ౪౦॥

ఇది యాత్రాభిజ్ఞ పర్వము.

## రహస్యరత్న పర్వము.

సీ॥ బదరీవనమునందుబాదరాయణుఁడనఁబూర్ణవిదుండనుభూసురముని।
పరఁగునోంకృతియందువ్యాహృతిసందోహముదిలీనమైయుండునట్లతనికి।

భద్రదంతియనంగభాసిల్లునంగనయయోన్యాంకృతికిని గాయత్రికరణి।
సానందుఁడను యోగియాదంపతులకు జనించె సోఽహమ్మన నెగడె నతఁడు।
వ్యాహృతివ్రాతసప్తరత్నాకరభవ । మైనరత్నంబు ప్రాసాదమనియు సుబర।
సారమేయవుఁబరమహంసంబనియును । బ్రణవఖనిరత్నమవును దారకమనిక నె॥ ౧॥

సీ॥ శివజటాజూటనిస్సృతసుమనోనదిహంస నాస్నానంబు నాచరించి।
కృత్తివాసుఁడు దాల్చు నుత్తమాంబరములోయన వల్కలంబుల నవధరించి।
కామారిగాత్రనిర్గళితభూత్యుద్ధూళనంబగ్గని గుఱున సంగ్రహించి।
భద్రరుద్రకటాక్షభాసితుఁడన భూరిరుద్రాక్షభూషణరుచి భజించి।
సూర్యు వెనుకొని వెలుఁగునంశుప్రలనంగ । వెంటనంటిన మునులన వెలయ జడలు।
శివపదామృతవర్షమేఘవరమనఁగ । వచ్చె సానందయోగితపస్విసభకు॥ ౨॥

సీ॥ వచ్చిన సానందువరమునులందఱుగనుఁగొని శివుఁడెట్లుగనఁబడెనని।
సంభ్రమంబున లేచి సముచితకృత్యముల్ బాగుగా నొనరించి స్వాగతంబు।
నడిగి మేమేమి సేయందగునదియన ధర్మప్రసంగుఁడత్తపసీనతఁడు।
కనిభవదభిధానమునకనుగుణమైనవృత్తమెఱింగింపువినెదననియె।
నంతధర్మప్రసంగుండు హర్షమంది । లోకవృత్తం బెఱింగింతుఁ బ్రాకటముగఁ।
బుణ్యపాపక్రియలవానఁబొనరుఫలము । లనుగడున్ సంగ్రహంబుగాననియ నెనిటు॥ 3

సీ॥ ఆనందమే బ్రహ్మమౌను దానినిబ్రాణులకు సమకొల్పుట సుకృతమౌను।
దుఃఖమే కలి దానిఁ దొడరించుట నదేహులకు దుష్కృతంబిది ప్రకటముగను।
గాయవాఙ్మనములఁ గావించు నెరులకు మేలొ కీడొ దాని పాలు నరుఁడు।
గావలనైదునన్నైకనునిందునందునుదత్ఫలంబులనవిదప్ప వెందు।
మఱియు శాస్త్రోక్తకృత్యముల్ మరగిచేఁత । లగ్గచేయమియెటు లేనియెగ్గశాస్త్రి।
నిందితాచారదుష్కృత్యనిరసనంబు । బాగునింద్యాచరణము గు నొగరయఁగ॥ ౪॥

సీ॥ ఆయురారోగ్యవిద్యాధనస్త్రీసుతసౌఖ్యముల్ సత్పుణ్యసత్ఫలములు।
స్వల్పాయురాధిదుర్వ్యాధిదారిద్ర్యాదిదుఃఖముల్ దుర్దోషదుష్ఫలములు।
కీర్తిమూలంబు లౌ గీర్వాణలోకముల్ గుప్తసత్క్రియలైనఁ గూర్చువాని।
నపకీర్తిమూలంబులవు నరకంబులు గుప్తదుష్క్రియలైనఁ గూర్చువాని।
నంతనైనఁ గర్మలంతంబుఁ జెందక । స్వానుగుణముగాఁగనందఁ జేయు।
జన్మములను మఱియు జనులకు నిదిధర్మ । శాస్త్రసరణియంచు సంయమియనె॥ ౫॥

సీ॥ అనవిని సానందుఁడనియె నమ్మునులతో నిదియేమి సిద్ధాంతమింపెమీకు।
శంకరుండఁట జగజ్జనకుండు సుతులవు జనులలోఁ గొందఱు స్వర్గపదముఁ।
గొందఱు నిరయంబు నొందించుటన నెట్టి న్యాయమౌ ధర్మమేయగును కర్త।
యన్న దారుకవనినున్న మునులకథ విన మెతద్ధర్మ మేవిధమునన జె।
దక్షధర్మంబ నెట్లయ్యె ధర్మరాజు । మృత్యుపతిమున్న గాఁడె తామ్రుతుఁడ తఁడును।
బాపములఁ బాపి ప్రజలఁ గాపాడలేఁడె। హరుఁడు మృడుఁడంచు సానందుఁడ నెడునపుడు॥

వచ్చెనొక్కవిమానవరముశివాజ్ఞచేసానందుఁడదిగనిహర్షమంది।
ధర్మప్రసంగాదితాపసులనుదనతోడరండనివేగఁదోడుకొనుచు।
దానిపైనెక్కియాధర్మపురికిఁబోయితత్పూజితుండయిధర్మరాజ।
మఱచితేనీవుసమస్తముశివమయమనిమహిశివతనువనియునందు।
జనులుశివజులనియుఁజర్చింపకేటికి । నారకులనెనర్చినావనఁగను।
జముఁడువల్కెనుల్కెశైవాగ్రణీశివ । విముఖులనెతమస్స్వెసమెసఁగెడు॥ ౭॥

సీ॥ అనివిన్నవించిననాతనిఁదోడ్కొనిసానందుఁడానిరయగులఁజూడఁ।
జనియెస్వల్పచికిత్సకునిచేతఁదీఱనిరోగంబులంగలరోగులనుమ।
హావైద్యుఁడరయఁగనరిగెడువడువునఁబోయికన్గొనెవారిభూరిఘోర।
దుఃఖభాగులస్వీయదోషంబులంగడునుగ్గడించుచుబాధలగ్గలముగ।
ననుభవించుచేడ్చునమితసంఖ్యాకులఁ । గాంచికనికరంబుగడలుకొనఁగఁ।
దారకముస్మరించితత్త్వంబునూహించి । పలికెనొంనమశ్శివాయయనుచు॥ ౮॥

సీ॥ సంతతధర్మప్రసంగాదిమునులునుదారస్వరంబుగఁదన్మనువును।
ఘోషింపమేఘనిర్ఘోషంబుగనుదదారవమువీనులసోఁకునవసరమున।
వలనుండివిడివడ్డపులుఁగులపోలికనారకులెల్లరునాకమునకు।
నెక్కటనెగసిరిగ్రక్కుననిప్పంటనాకాశబాణంబులన్నియొకట।
మింటినంటివెలుఁగుమెలపునశివరూపు । లైరివ్యోమయానయానులైరి।
వారినెల్లనతఁడువైళంబుగనుశివుఁ । జేర్చెసార్థకముగఁజెందెస్వాఖ్య॥ ౯॥

సీ॥ అఖిలాఘతూలౌఘశిఖిమహాదుఃఖదావాగ్నిసద్వృష్టితమోఽభిధాన।
కాలాభ్రవిధ్వంసకప్రచండప్రభంజనముప్రపంచైకసస్యభూమి।
సకలవిద్యాజగత్సంచారఖతలంబుసర్వసన్మంత్రోడుచంద్రబింబ।
మాశ్రితాజ్ఞాతోదితాదిత్యమండలంబజ్ఞానతిమిరమహాప్రదీప।
మైహికాముష్మికఫలప్రదామరద్రు । మంబుభవరోగపరమౌషధంబునభవ।
భవముభవరూపమభవరూపదమురత్న । మవునుబ్రాసాదమంత్రంబవందునతఁడు॥ ౧౦॥

శా॥ ఆరత్నాయనుఁడైతపోఽన్వితుఁడుసాంఖ్యాచార్యవర్యుండుబి।
ల్వారణ్యంబుమహత్త్వమాత్మఁదనకున్ స్వాపర్ణమందుంబలెన్।
సారాంశంబుస్ఫురింపఁజెప్పెఁగృతిఁబ్రాసాదాక్షరోద్భూతమున్।
శ్రీరత్నాయనమౌనిరత్నమనఁగీర్తింగాంచెరత్నేశతన్॥ ౧౧॥

చ॥ కులమునువంశమాశ్రమముగుంభినియున్నతమెట్టిదైననే।
నరుఁడుగడున్ శివస్మృతినవారతముంజలువుంజపించుఁడ।
ద్వరమనువున్ శివోఽహమనిభావననేయుశివుండతండయా।
స్థిరమనియుంజనన్వలెనెచెప్పఁగరత్నమురత్నమేకదా॥ ౧౨॥

తే-గీ॥ రత్నమనవార్థకంబౌటరత్నమనఁగఁ । బ్రణవమాఁగదప్రాసాదవర్ణసంఖ్య।
లెనయనిరువదియాసంఖ్యఁదనరురత్న । మగుటఁబ్రాసాదమునురత్నమగునుగాదె॥

కం॥ అప్పుఁగద బ్రణవము రత్నం । బప్పుడె బ్రణవార్థము శివోఽహమనుటయు రత్నం।
బవధానమునఁ బృథక్పద । భవసంఖ్యల యోగమున నవక తారకముల్॥ ౧౪॥

కం॥ సోఽహమనుట కర్థము పురి । వోఽహమ్మని శసల భేదమందుట చేతన్।
మోహం బేల వలోపం । బూహింపఁగ నగు నిలోప మోంకృతికతనన్॥ ౧౫॥

కం॥ కావున ను సోఽహమనుటయు । భావింపఁగ రత్నమగు సుబ్రహ్మోహమనన్।
భావితమగుఁ బ్రణవము ర । త్నా వే ద్యము బ్రహ్మము శివము పురత్నంబే॥ ౧౬॥

సీ॥ రత్నంబనాప్తమైయత్నంబు భక్తి నెతనికయ్యెడు సురత్న దానుఁడతఁడు।
రత్నంబు గుప్తమై రాజిల్ల దెతనికి రత్న గుప్తుఁడనంగఁ బ్రథితుఁడతఁడు।
రత్నంబు వర్మమై రాజిల్లు నెతనికి రత్న వర్మయనంగ రమ్యుఁడతఁడు।
రత్నంబు శర్మమై ప్రచురమౌ నెతనికి రత్న శర్మయనంగఁ బ్రబలునతఁడు।
రత్నమయనం బెతనికగు బ్రహ్మముగనఁ । జాలు రత్నాయనుఁడనంగఁ జాలునతఁడు।
రత్నమౌ బ్రహ్మమీశ్వరు రహిఁగను నెతఁ । డెలమి నిల బ్రహ్మమౌను రత్నేశుఁడతఁడు॥ ౧౭॥

ఆ-వె॥ వరుస దాస గుప్త వర్మ శర్మాదివ । ర్ణాంక యోగమున సదంచితముగ।
నవుని రువది నరుఁడు దవు రత్నమనఁగ ర । త్నంబు నాత్మఁగనని నరుఁడు నరుఁడె॥ ౧౮॥

ఆ-వె॥ వరుసఁ జూడ గుప్త వర్మ శర్మాయన । దాస ముఖ్య వర్ణ ధర్మ కలనఁ।
బొలుచుఁగాదె సాంఖ్యమున నుబిల్వేశోఽహ । మనుచ భేదభావ మొనరు నిటనె॥ ౧౯॥

కం॥ బిల్వేశుఁడా రత్నేశుం । గొల్వని నరులకెటు ముక్తి గొనకొనఁ గలుగున్।
దెల్విగలుగువారలు త । ద్బిల్వేశ్వరు రత్న పతిని నుతింపన వలయున్॥ ౨౦॥

ఇది, రహస్య రత్న పర్వము.

---

## నవాధ్వ రత్న పర్వము.

సీ॥ ప్రజ్ఞానమనఁగను బ్రాసాదమగుఁ గూడ ద్విశతిషడక్షరి దేజరిల్లు।
నహమస్మి యనఁగ నారాయణాష్టాక్షర మంత్రమౌ నహమనమాన్యముగద।
తత్త్వమసీయనంగఁ దగు సామతత్త్వంబు తచ్ఛివవిష్ణ్వైక్య ధర్మమునిడు।
మహినెన్నఁగ నయమాత్మా యన జీవ దేవాభేదమోంకృతియౌను బ్రహ్మ।
మేమియరిదియభేదేశ మేయదియది । యవు మహావాక్యమదె శివోఽహమ్మనియవు।
వేదమే శివమంటయద్ది పేరఁదెలుపుఁ । గద శివోఽమ్మనిఁకఁ బలుకంగనేల॥ ౧॥

కం॥ జీవుండు తపోఽన్వితుఁడై । దేవుండగు నట్లగుటయె తెలియన భేదం।
బేవాఁడు దెలియుఁ దెలుపుం । జూవె యభేదేశుఁడతఁడు చూపట్టునిటన్॥ ౨॥

కం॥ కనుఁగొన శంకర నారా । యణాజ కల్యాణమాదిన గును నవాధ్వం।
బను భాగమిదియొసంగెడు । స్వనతులకుం బంచపర్వ పరిచయ ఫలమున్॥ ౩॥

తే-గీ॥ అనియనంగథఁ బట్టి రత్నాయనవురి । బింబమైన సుబ్రణవార్థ విధమునఁ బొరిఁ।
బరఁగుచుంటన భేదేశ పద్యసంఖ్య । నిదియభేదేశ బింబమైయెసఁగెడుఁ గడు॥ ౪

కం॥ బిల్వారణ్యచరిత్రము । బిల్వేశ్వరపద్యసంఖ్యనిలనిల్లుటచే।
బిల్వేశ్వరీయమననిది । చెల్వుఁగావ్యమరిక్రిక నేర్పంబవుతన్ ॥ ౯॥

సీ॥ బిల్వేశ్వరుఁడనంగవిశ్వంబుప్రణవంబుబిల్వేశ్వరీయంబు వెలయునట్టి।
యైనసబిందుకంబైపదునాల్గొటనారెంటకూడికనైదుగల్గు।
నగుశివాయయటంచునామూటకూడికఁబదిపదిసంఖ్యలుపాడుపనేఁబ।
దైదోంనమయనంగనానుబ్రాసాదంబుషట్వర్ణకంబదిసమకొనునిది।
భాగషట్కంబుబిల్వేశభాగమైదు । నూర్లడెబ్బదిమూడింటనూలుకొనెదు।
మొగినిబ్రాసాదమంత్రంబుమూడునెకటి । గలయబిల్వేశ్వరుండుసాక్షాత్కరించు॥ ౬॥

కం॥ మహిమంబ్రాసాదాక్షర । విహితమగుటషడ్గ్రిహాష్టబింబంబగుటన్।
మహితకృతియిద్దిసప్తమ । గ్రహబాధంబొందనీదుగలిగించునిరుల్॥ ౭॥

ఉ॥ ఐనగ్రహార్థమిద్దియటువొటనెబోధననేయుఁదారము।
బూనికదారకంబునను పుణ్యులకెల్లనుగొల్లగానుర।
త్నానననంప్రభూతముమహాకృతిరత్నమగున్ననాత్మక।
శ్రీనరసింహుఁగూడెదును జేయునుస్వీయుల శ్రీనృసింహులన్ ॥ ౮॥

భుజంగప్రయాత వృత్తము.

నవార్థంబనంబిల్వ-నాథీయమంచు । నవార్థంబనన్రత్న-నాథీయమంచున్।
నవాంశంబులంగల్గి-నల్వొందదీనిన్ । శివో ఽహమ్మటంచున్నృ-సింహుండుగాంచున్ ॥

శా॥ ఆదింబొల్చునృసింహబీజమదిక్రౌమంచక్షరంబందుచే।
నాదిక్షాంతములైనవక్షరములాయ్యంబుట్టెసంఖ్యాళిము।
న్నాదేవుండునవాత్మకుండనుచుసాక్ష్యంబిచ్చునోంకారనై।
తాఁదెల్పంగనఁదారకంబునిజభక్తశ్రేణికింబ్రీతుఁడై॥ ౧౦॥

చ॥ అతనినవాకృతుల్దెలియనానవరత్నములంచునందుచే।
నతఁడునృసింహుఁడేయవుమహానవరత్నమనూత్నరత్నమున్।
గృతినవరత్నమిద్దినవకీర్తితభాగమురత్నసంభవం।
బతిరసమాతఁడేరనికుఁడంచెదుఁబొందుగఁదక్షుఁడక్షయా॥ ౧౧॥

సీ॥ ఆయురర్థులకరోగాయువునొసఁగుసంతానార్థులకునుసత్సంతతినిడు।
ధర్మార్థులకునిచ్చుధర్మాభివృద్ధినినర్థార్థులకుఁజేర్చునర్థవృద్ధిఁ।
గామార్థులకుఁదార్చుఁగామసమృద్ధినిమోక్షార్థులకుఁగూర్చుమోక్షలక్ష్మి।
విజయార్థులంజేయువిజయులఁగాగనుసర్వార్థులనొనర్చుసర్వసిద్ధు।
లనిదిబిల్వేశ్వరీయాఖ్యలలితసుకృతి । శ్రీకరత్నాయనర్షినిర్మితవిధిహిత।
దానుబిల్వేశతనుమధ్యగానశ్రీనృ । సింహతనుమధ్యగావునశ్రితతతులను॥ ౧౨॥

ఇంద్రవజ్ర॥ బిల్వేశ్వరీయమ్మన-వేధయుబ్బున్ । బిల్వేశ్వరీయమ్మన-విష్ణువుబ్బున్।
బిల్వేశ్వరీయమ్మన-భీముడుబ్బున్ । బిల్వేశ్వరీయమ్మన-విశ్వముబ్బున్ ॥౧౩॥

### పుష్పితాగ్రా వృత్తము.

అనుచితులొగి సూతుఁ-డల్లరత్నా । యనవురిసచ్చరితంబు-హర్ష మొప్పం।
గనుమునులకుఁ జెప్పెఁ-గాంచిరాస । ద్విసుతులు సూతునితోడ-బిల్వనాథున్॥ ౧౪॥

### శంభునటన వృత్తము.

నృసింహాసురసింహకృతి - నీయదిదిదీనిఁగొను - నీవనుచుశంభునటనం।
బెసంగెఁగవిరత్ననిధి - నీయదిజనించెఁగన - నిందిరగదాయిదనుచున్।
బొసంగఁదనుమధ్యతను - వున్మఱియుమత్తనువుఁ - బొల్చెఁగదశ్రీగననుచు।
న్నెసంగుకవిరత్నమున - కొప్పఁగనభీష్టముల - నొలిశ్రితపాళికనుచున్॥ ౧౫॥

కం॥ ఓంకృతిబిల్వేశ్వరుఁడగు । నోంకృతిబిల్వేశ్వరీయ మొగిఁబ్రాసాదం।
బోంకృతితత్సంహితయిది । యోంకృతిఁగొనుమయ్యదీని నోంకృతిసదయా॥ ౧౬॥

### ప్రియకాంతా శ్వృత్తము.

కవిమణిబిల్వేశ్వరకృతిఁ - గాంచంగదెదీనిన్।
బ్రవిమలనీకొఁబ్రియతమ - పద్మాప్రియకాంతా।
యవయనుభక్తుంజయయను - హర్షంబవుమాకున్।
శివమనుకంపోద్ధృతనర - సింహానరసింహా॥ ౧౭॥

### పుష్పమాలికా బంధ స్రగ్ధరా వృత్తము.

శ్రీనాదీనావనాప్తా - కృతనతవితతి - శ్రీశతాశక్తిశక్తా।
మీనానూనాఘనాత్మా - మృగమృగపగతి - స్మేరఘోరప్రరణా।
హానాహీనాఘనాంచ - త్ప్రిదయదపదహా - ప్రాయగేయప్రయత్నా।
శ్రీనిత్యానిత్యనిష్ఠా - శ్రితనుతవితత - శ్రీకరాకప్రకల్పా॥ ౧౮॥

### తారక వృత్తము.

తరణీందుహుతవహాంబక - తారకబిలసింహా।
శరణాగతభరణాశ్రిత - శంకరసురసింహా।
హరిణాలఘుకరణాఘటి - కాచలనరసింహా।
కరుణాకరకృతిరత్నముఁ - గైకొనుమునృసింహా॥ ౧౯॥

### బిల్వ బంధము.

శ్లోకము॥ ఓంనమశ్శ్రీనృసింహాయ - హరీకృత్యానయేదృశి।
యద్రత్నభరణేదేవా । హార్యస్తత్త్వంవిభోజయ॥ ౨౦॥

## గద్యము.

ఇది, శ్రీతనుమధ్యాంబాకరంబిత శ్రీబిల్వనాథమహాదేవశిష్య ఆష్యాపజ్ఞాక్షరసాంఖ్యాచార్య

పర్యవితకవిత్వ తత్త్వవిత్ప్రకాండ శ్రీమత్కొక్కొండ వేంకటరత్నశర్మ

వినిర్మితంబై,

కవిమణినామంబునం బరఁగు

శ్రీబిల్వేశ్వరీయంబను పద్యకావ్యరత్నంబు,

షష్ఠంబగు రత్నాయనపురీబింబ నామకాంభేదేశబింబమునం

దృతీయంబగు నవాధ్వభాగమునందలి నవాధ్వరత్నపర్వముతోఁడం గూడ

సర్వంబును సమాప్తము.

శ్రీనృసింహాయ నమః.

# బిల్వేశ్వరీయానుబంధము.

## సంస్కృతము.

## శ్రీనృసింహ గీత రత్నమాలికా.

---

శ్లో॥ మణిగీతైః పద్యయుతై। ర్బిల్వాహ్వాయతోఽత్రకిం త్రిభిశ్లోకైః।
బిల్వేశ్వరీయ మనుసృ। త్యాస్తేఽభేదేశమేవ తనుమధ్యా॥

శ్లో॥ అభేదేశశబ్దో మహావాక్యమేవ। ప్రకారాంతరాద్య త్ప్రాప్తం తదత్ర।
సపద్యాని గీతాని రత్నోదితాని। ప్రభో సంశృణు శ్రీపతే నారసింహ॥

శ్లో॥ ఈశశ్రీశే తీదం। గీతం ఘటికాద్రినాథ శృణు నృహరే।
శ్రీమన్ బిహాగురాగే। ణాన్విత మపి చాదితాళేన॥

ప్రథమా కృతిః - బిహాగు రాగః - ఆది తాళః.

ఈశా శ్రీశా। ఈడే త్వాం జగ - దీశా శ్రీశా॥ ఈడే త్వాం జగదీశా॥ శ్రీ॥
భో శృణు ఘటికా - ద్రీశ నృసింహ మ। మేశా శ్రీశా॥ ఈడే॥

౧. భక్తింమే-త్వయిపరమే।భుక్తింముక్తిం-భోదేహీహమ।హేశా శ్రీశా॥
౨. నవమూర్తే ప్ర-ణవమూర్తే। నవరసరసిక-నవమరసప్రణ। తేశా శ్రీశా॥
౩. కవిమణినా-గదితమిదం।నవగీతమణి-హ్యవధారయపర। మేశా శ్రీశా॥

---

శ్లో॥ నరరూపో హరిరూపో। నరహర్యైక్యాకృతి ర్భవానేవ।
గీతమిదం శృణు నృహరే। కల్యాణీరాగ చాపుతాళయుతం॥

ద్వితీయా కృతిః - కల్యాణీ రాగః - చాపు తాళః.

నరరూప హరిరూప - నరహర్యైక్యసురూప॥ నర॥
శరణం భవ మమ ఘటికా - శైలేశ సర్వేశ॥ నర॥

౧. హంసాబ్జానలరుచి స - హస్రారాబ్జ సుకాయ।
హంసాబ్జానలరూప - త్ర్యంబక త్ర్యంబకగేయ॥ నర॥

౨. పాపారణ్యైకదావ - పావననామసుభావ।
దీపితనరముని దేవ - దేహి హితం మమ దేవ॥ నర॥

౩. కవిరత్నోదితగీత - నవరత్నాంచితహార।
నవరూపాహ్వాయ శ్రీమన్ - నరసింహ సముదార॥నర॥

---

శ్లో॥ ఓంకృతినుతేతి గీతం । సంశ్శృణు ఘటికాద్రి నరసింహ।
కాంభోజీరాగేణచ । గీయతయే వాదితాళేన॥

తృతీయా కృతిః - కాంభోజీ రాగః - ఆది తాళః.

ఓంకృతినుత నతిరిహ భవతే॥ శ్రీనృహరే పర॥ మోంకృతినుత॥
శంకరు శంకర శంకరసన్నుత-శంఖచక్రధర సంకటహార పర॥ మోం॥

౧. అజముఖసురవరమకుటమణికషణ - హరిసురుచిరపదనఖవితతే।
అజరపరిపువపురగవిదళనలస - దశనిఖరకరజనఖరనికర విజ॥ మోం॥

౨. ఉదయతిథిస్తేయోగాత్ర్వాసా-దోదయ ముద్బోధయతి విభో। [త్రోం॥
సదయాఖ్యాతేప్రాసాదసమా-జయతి నృసింహ గురో హనుమన్మహి॥

౩. మంజులకవిమణినామకృతీశ్వర - మాధవ సాధుమనోవసతే।
కంజనయన కవిమణి మనిశం స-ద్రంజక రంజయ కుంజరవర వర॥ దోం॥

---

శ్లో॥ శ్రీనారసింహ జయజయ । జయజయ ఘటికాద్రినారసింహేతి।
గీతం గీయతయిహ శృణు । కానడరాగేణ చాపుతాళేన॥

చతుర్థీ కృతిః - కానడా రాగః - చాపు తాళః.

జయజయ శ్రీనారంసిహ। దేవ। జయజయ ఘటికా-చలనారసింహ॥ జ॥
౧. మీనాదికల్క్యంత - నానావతార । జ్ఞానశ్రీసముదార-దీనమందార॥ జ॥
౨. సత్యజ్ఞానానంద-సముచితాకార। ప్రీత్యైన మామవ-విశ్వైకసార॥ జ॥
౩. కవిమణినామక - కావ్యాధినాథ। కవిమణిశోభిత - కవిమణినాథ॥ జయ॥

---

శ్లో॥ నరసింహ మేహృది శ్రీ। శేతిచ గీతం ప్రగీయతేఽత్ర శృణు।
శరణాగతభరణవిభో । బేగడరాగేణ చాదితాళేన॥

పంచమీ కృతిః - బేగడ రాగః - ఆది తాళః.

నరసింహ మే-హృది - శ్రీశా । స్థిరమాస్వ దేవ - ఘటికాద్రివాస॥ నర॥
శరణాగత - భరణావ మాం । కరుణామయ - వరుణాలయేశ॥ నర॥
౧. దనుజేశ దేహ - ధరదారణేన । జనితార్తిఖేదో - యదసీశ తేన॥ నర॥
౨. ఘనయోగవహన - కలనేన తేన । ననుఖిన్నతా - మనువిందసీన॥ నర॥
౩. ప్రణతార్థదాన-బహుగర్జనేన । జనితశ్రమోఽసి-జయరత్నకేన॥ నర॥

---

శ్లో॥ నృసింహ భగవన్ దేవ । శృణు గీత మిదం తవ।
కమాసురాగసంయుక్త । మాదితాళాంచితం హితం॥

షష్ఠీ కృతిః - కమాసు రాగః - ఆది తాళః.

నరసింహ భగవన్-నరసఖ శౌరే।నారాయణమా-మవద్దైత్యారే॥నర॥
హరేఽవనృహరే-హర్షితసూరే॥ (అయిప్రహ్లాదవి-భోఽపహృతారే)॥

౧. నిస్తులదయయా-తవభక్తం మాం । నిశ్చలచిత్తం-కురు సువిభో।
ప్రస్తుతభక్తిం-త్వయి దిశ మే త్వం। ప్రజ్ఞానం బ్ర-హ్మాసి విభో॥ నర॥

౨. సర్వజ్ఞస్త్వం-త్వద్దాసోఽహం । జానే నకిమపి-యుక్తం కిం।
సర్వేశ్వర మే-కోవా దోషో । జనక స్మర తే-నిం దేహ న కిం॥ నర॥

3. కవిమణినా త్వం-కాంక్షిత ఈశా ।,కవిమణినామకృ-తీశ్వర భో।
కవిమణి మవ శ్రీ-కర పాలక మపి । కరుణాకర హే-విశ్వవిభో॥

---

శ్లో॥ శౌరే నరహరే స్వామీ । త్వేతద్గీతం శృణు ప్రభో।
శహనా రాగ సంయుక్తం। తాళరూపకసంయుతమ్॥

సప్తమీ కృతిః - శహనా రాగః - రూపక తాళః.

నరహరే శౌరే-స్వామి మురారే ॥ శ్రీ ॥ హే ॥ త్వా ॥ నరహరే॥
పరమేశ్వర కృపయా తవ-భక్తం మా మవ సదయా॥ నరహరే॥

౧. సురవైరివిదళన - శోభితనఖముఖరానన।
వరకేసరనికరభర - వాతోద్ధూతాభ్రచర।
అరిదరకరవరబాహ - గిరిశాచలసమదేహ।
పరివీక్షణభూతహరే - ప్రహ్లాదేడిత నృహరే॥ నరహరే॥

౨. జయరవముఖరితభువనా - శాంతస్వాంతోల్లసనా।
భయవారణనామధరా - పద్మాలింగనచతురా।
అయిచరణనతామరచయ - హర్షదసత్ప్రచయాశయ।
ప్రియ మిహ కురు మమ శరణ - శ్రీఘటికాచలశరణ॥ నరహరే॥

3. ధ్రువముఖవిరచితసేవా - ధ్రువపదదానసుభావా।
దివి భువి సుతలే వాసు - దేవస్త్వం భాస్యాసు।
భవ వరదో భవ సుహృదే - భక్తవ్రాతోరుముదే।
కవిమణినామకృతిధవ - కవిమణినామానమవ॥ నరహరే॥

శ్లో॥ శ్రీహరే జయ విభో నృసింహ స । ద్గీత మేతదిహ సంశృణు ప్రభో।
శంకరాభరణరాగసంయుతం । స్వైకతాళకలితం రసాన్వితం॥

అష్టమీ కృతిః - శంకరాభరణ రాగః - ఏక తాళః.

శ్రీహరే విభో-జయ శ్రీనృసింహ భో। పాహి భక్తబృంద మనిశ-మేహి సత్ప్రభో॥
౧. మంగళాకృతే-మంగళాని తే । అంగ సంతు మంగళఘటి-కాద్రి దేవతే॥
౨. యేపఠంతి తే-ఽభీష్టసత్కృతిం । తేఽపిసర్వమంగళానిప్రాప్నుయుస్సతిం॥
౩. కవిమణిశ్రియం-కలయసీడ్యసే। కవిమణించకృతిమణింస-మవవిరాజసే॥శ్రీ॥

---

శ్లో॥ మంగళం భవతు మంగళాకృతే । తే హరే సపది కౌస్తుభో యథా।
గీతమేవ సురటాఖ్యరాగయు । క్తాదితాళలలితం శృణు ప్రభో॥

నవమీ కృతిః - మంగళకృతిః - సురట రాగః - ఆది తాళః.

మంగళం భవతు తే - మహిత మంగళాకృతే॥ మంగళం॥
అంగ యోగనారసింహ - హర్షద ఘటికాద్రిపతే॥ మంగళం॥
అఖిలలోకనాథ ప్ర - హ్లాదహిత నతాదృతే।
నిఖిలపూరుషార్థదాన - నిరత హే రమాపతే॥ మంగళం॥
ఉగ్ర శక్తి శమన కల్పి - తోగ్ర శక్తి సంతతే।
నిగ్రహానుగ్రహైక - నిపుణ బిల్వేశధృతే॥ మంగళం॥
మాధవ ధవ కవిమణినా - సుకృతినుత నవాకృతే।
మాధవ మాధవ భవ భవ - మానిత పరమోంకృతే॥ మంగళం॥

---

శ్లో॥ జయత్వయం రమాపతి ర్నృసింహ ఈడిత శ్శ్రితైః।
జయత్వియం సదా నృసింహ గీతరత్నమాలికా।
జయత్విదంచ బిల్వనాథసచ్చరిత్ర మంచితం।
జయత్వసౌ ప్రసాంఖ్యవి త్సుకావ్యకృ త్కవిర్మణిః॥

ఇతి శ్రీనృసింహ గీత రత్నమాలికా.

---

ఇది, బిల్వేశ్వరీయానుబంధము-శ్రీనృసింహ గీత రత్నమాలిక, సమాప్తము.

# సంస్కరణము.

| పుటసంఖ్య. | పద్యసంఖ్య. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౪ | ౩౨ | నేవుసూవు | నేవుసూవు |
| ౬ | ౪౭ | సద్యస్సంభవత్వబు | సద్యస్సంభవత్వంబు |
| ౧౨ | ౧౧౦ | సమత్కంతుసైరి | సముత్కంతుసైరి |
| ౧౫ | ౧౪౬ | బిల్వనాథ | బిల్వనాథ |
| ౧౬ | ౧౫౭ | కలి | కవి |
| ౨౨ | ౨౩౪ | అగు | అగుఁ |
| ౨౯ | ౨౯౯ | బాణుండువలఁతియే | బాణుఁడున్వలఁతియే |
| ౩౧ | ౩౨౫ | అల్లలణ్యాత్ర | అల్లహల్యాత్ర |
| ౫౬ | ౨౧౬ | లాఱుఁటనిట | లాఱుటులిట |
| ౬౩ | ౨౯౩ | బిల్వంబనంగ | బింబంబనంగ |
| ౬౬ | ౩౧౯ | ఆమహాకాళి | అమమహాకాళి |
| | ౩౨౪ | యదరాంగ | యధరాంగ |
| ౧౧౫ | ౫౮ | ముల్నల్వా | ములన్నల్వా |
| ౧౧౮ | ౯౫ | బుద్దుబిడ్డ | ముద్దుబిడ్డ |
| ౧౨౪ | ౮౭ | కాయావరోహెూహణ | కాయావరోహణ |
| ౧౨౫ | ౧౩౦ | నిశ్చయముగ | నిశ్చయముగ |
| ౧౨౬ | ౧౪౭ | జలదాదమముణ్ | జలదాగమముణ్ |
| | | వదాన్యుఁడె | వదాన్యుఁడె |
| ౧౩౩ | ౨౧౧ | ఫలంబు వెడలునె | ఫలంబు లెడలునె |
| ౧౪౩ | ౬౮ | మెఱువు | మెఱవు |
| ౧౫౧ | ౧౪౧ | ప్య పేత | వ్య పేత |
| ౧౫౬ | ౧౯౯ | మండుచుండ | మండుచుండు |
| ౧౫౯ | ౨౩౬ | శశ్వజ్జోత్స్న | శశ్వజ్జ్యోత్స్న |
| ౧౬౫ | ౩౦౧ | మ్లానితుఁ | మ్లానిగుఁ |
| ౧౭౧ | ౩౬౨ | ముఱిలె | మురలె |
| ౧౭౨ | ౩౭౪ | నాకారరాహిత్యఁగా | నాప్తాంగరాహిత్యఁగా |
| ౧౭౩ | ౩౮౨ | శ్రీమంతుండ | శ్రీమంతుఁడ |
| ౧౭౪ | ౩౯౧ | దేజరిల్లె | తేజరిల్లె |
| | ౩౯౪ | రంజలఁజేసె | రంజిలఁజేసె |
| ౧౭౫ | ౪౦౨ | మాక్తికర్షితో | మాక్తికర్షితో |
| | ౪౦౪ | దారకార్థదుఁడు | దారకార్థదుఁడు |
| ౧౭౬ | ౪౧౮ | మనివర్యుని | మునివర్యుని |
| ,, | ౪౨౦ | డెంతయు | డెంతయుణ్ |
| ౧౭౮ | ౪౩౫ | దుస్గిమా | దుస్గఖమా |
| ౧౭౯ | ౪౫౦ | న్మథించిన | న్మథించిన |
| ౧౮౨ | ౪౮౩ | యభిలషింరితుచ్చుం | యభిలషింతురిచ్చుం |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౮౩ | ౪౯౫ | చేతఁజిక్క | చేతఁజిక్కి |
| ౧౮౪ | ౫౦౦ | అనఁగను | అనఁగను |
| ౭౯౩ | ౫౯౨ | జుణిగి | జుణిఁగి |
| ౧౯౫ | ౬౧౩ | నిచ్చటికి | నిచ్చలిటు |
| | | నిర్జతత్వ | నిర్జరత్వ |
| ౧౯౮ | ౭ | తుందయ్యె | తుందయ్యె |
| ౨౦౦ | ౭ | బెళుకు | బెళుకు |
| ౨౦౧ | ౨౯ | డెల్లవార | డెల్లవాఱ |
| ౨౦౮ | ౧౨ | ౧ప్రీతిన్నతిం | ప్రీతిన్నతిం |
| ౨౦౯ | ౨౬ | మూఁగగ | మూఁగగ |
| ౨౧౧ | ౩౯ | విధుకరీట | విధుకిరీట |
| ౨౧౫ | ౩౨ | నను | ననుఁ |
| ౨౧౯ | ౯ | నగ్రహారికులకు | నాగ్రహారికులకు |
| ౨౨౨ | ౮ | వగవునే / మందాక్రాతం | వగవునే / మందాక్రాంతం |
| | ౧౩ | సేవింపవలెన్ | సేవింపవలెన్ |
| ౨౨౩ | ౨౩ | హస్తమునబలు | హస్తమునఁబలు |
| ౨౩౧ | ౨౩ | రచియంచిన | రచియించిన |
| ౨౩౨ | ౪౬ | హారంబెసఁగం | హర్షంబెసఁగం |
| ౨౭౪ | ౩౫ | యుండకన్ గా | యుండంగా |
| ౨౮౩ | ౨౪ | యననింద్యవా | యనన్నింద్యవా |
| ౨౯౨ | ౫౮ | విస్తరింతు | విస్తరింతున్ |
| ౩౦౮ | ౮౯ | హర్షఁబునం | హర్షంబునం |
| ౩౧౫ | ౪౩ | జ్వాలనజాలల | జ్వాలనజ్వాలల |
| ౩౧౬ | ౬౩ | విజయియనంగ | విజయయనంగ |
| ౩౧౭ | ౭౧ | సాధులకు | సాధ్వులకు |
| ౩౧౯ | ౮౧ | నమస్కారణంబు | నమస్కరణంబు |
| ౩౨౩ | ౧౨౮ | యేమబ్బురం | యేమబ్బురం |
| ౩౨౭ | ౨౨ | ల్గుహులందు | ల్గుహలందు |
| ౩౪౮ | ౯ | బిల్వనాథీయమంచు | బిల్వనాథీయమంచున్ |
| | ౧౩ | భీముడు | భీముఁడు |

అనుబంధమునందు - చతుర్థీకృతిలో,

| తప్పు. | ఒప్పు. |
|---|---|
| శ్రీనారంసిహ | శ్రీనారసింహ |